ప్రశస్తాకరము ! భావసుధాకరము !! పరిమళకుసుమాకరము !!!

# వర్ణనరత్నాకరము.

విజ్ఞప్తి.

ఇందు నన్నయభట్టు మొదలు కేంద్రకూరి వీరేశలింగము పంతులుగారి వఱకుఁ గల కవిరాజుల ప్రబంధ ర[illegible] స్త వర్ణనాంశములయందును, మఱియు నీతి శృంగార భక్తి వైరాగ్యాదిసందర్భముల యందునుఁగల పద్యరత్నంబులు వేలకొలఁది యేర్చి కూర్చి ప్రతి వర్ణన పద్యములు నాశ్వాసాదిక సంఖ్యతోఁ గవికాలక్రమముగా ముద్రింపఁ బడినవి.

ఈ గ్రంథ మొకటి చదివినచోఁ బ్రపంచములోని ప్రబంధములన్నియుఁ జదివినట్లే యగును. మఱియు నందఱి కవుల కవితావాదుల పోకడలును దెలిసికొనుటకీ గ్రంథముకన్న సులభసాధన మీయాంధ్ర ప్రపంచమున మఱియొకటి లేదు.

ఈ గ్రంథమును గూర్చి యాంధ్రపత్రికాధిపతులగు మహారాజశ్రీ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, జయంతి రామయ్య పంతులుగారు, వేదము వేంకటరాయ శాస్త్రిగారు, వావిలికొలను సుబ్బారావుగారు, కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు, మానవల్లి రామకృష్ణకవిగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, పురాణపండ మల్లయ్య శాస్త్రిగారు, కూచి నరసింహము పంతులుగారు, పేరి వేర శాస్త్రిగారు, మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు, ఆచంట సాంఖ్యాయన శర్మగారు, వేంకట పార్వతీశ్వర కవులు, [illegible] రమణ కవులు, చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారు, [illegible]శ్రీ ప్రెగడ భుజంగరావు బహద్దరుగారు, వేంకటాద్రి అప్పారావు బహద్దరుగారు, చెలికాని లచ్చారావుగారు, కేతవరపు వేంకటశాస్త్రిగారు, తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు, నడకుదుటి వీరరాజు పంతులుగారు, ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారు, మున్నగు ప్రముఖు లనేకవిధముల సదభిప్రాయము లిచ్చియున్నారు.

ఈ గ్రంథము కల్పవృక్షము వంటి దనియు, సమస్త జనులకు నిది కరము సాహాయ్యకరమనియు, నిందలి పద్యములు రత్నఘటులవలెఁ బ్రకాశించుచు మనోహరముగ నున్నవనియు, దీని వలన వాఙ్మయ చరిత్రము నాంధ్రకవిత్వాభివృద్ధియుఁ దెలిసికొనవచ్చుననియు, నీగ్రంథమొకటి చదివినచో ముద్రితాముద్రిత మహాప్రబంధములయందలి కవుల భావంబుల గ్రహించు భాగ్య మలవడు ననియు, నీ గ్రంథమును గలిగియున్నవారందఱును మహాకవుల సాంగత్య లాభమును బొందఁ గల రనియు, నీ మహా గ్రంథ మెవ్వని యొద్ద నుండునో యతఁడు సకలాంధ్రకవులమధ్యమునఁ గూర్చుండి వారితో ముచ్చటించినట్లే యానందపారావారమునఁ దేలుచుండుననియు, నిది మిత్రునివలెఁ గాలక్షేపముఁ జేయించు ననియు, గురునిఁబోలి నానందమార్గమును జూపు ననియు, బ్రహ్మధ్యానమునుఁ బోలె సర్వవిషయముల మఱపించి తన్మయత్వ మొందింపఁ జేయు ననియు, నిది ప్రతిగృహమునకు భూషణమ్మును, ప్రతి పుస్తకభాండాగారమునకు నలంకారము నై యాంధ్రుల కన్నుల నద్దుకొనఁదగినదియై విలసిల్లఁ గల దనియు, దీనివలన నాంధ్రలోకము ధన్య మగు చున్నదనియు, దీని విలువ యింత యని చెప్ప నెవ్వరికిని శక్యము కాదనియు, వెయ్యేల! ఈగ్రంథమువలన లోకము తరియింపఁ జాలు ననియు, మఱియు నిట్లనేకవిధములఁ గవిరాజులును రాజులును పండితులును, విమర్శకులును, మిక్కిలి కొనియాడి యున్నారు.
ప్రతులు మాత్రమే ముద్రింపఁ బడుచున్నవి కావునఁ ద్వరపడవలయును.

ఫలితము.

1000 రూపాయలు సెలవు జేసినను యిన్ని సద్గ్రంథములు సంపాదించి చదువఁ జాలరు. కావున నీ వర్ణనరత్నాకరమును బొందిన వా రెల్లరును వేయి రూపాయలకు మించిన ఫలితముఁ బొందఁ గలరని ఘంటాపథముగఁ జెప్పవచ్చును. వెల రు 3-8-0 లు మాత్రమే

☞ దాసరి లక్ష్మణస్వామి.

పిఠాపురము, తూర్పుగోదావరిజిల్లా.

# అంకితము.



శ్రీమదభినవభోజుండు • మామకప్రి
భుండు పీఠపురీంద్రుండు • పుణ్యతముండు
నయిన వేంకటసూర్యరా • యాధిపతికి
నంకిత మొనర్తు నీకృతి • నధికభక్తి.



నే దీనపోషకు • నిఁ దలంచి శతకంబు
చెలఁగి తొల్దొల్త ర • చించినాఁడఁ
దాల్మి బుధులు మెచ్చఁ • దనరు విజయవిలా
సమ్ము నాటకముగా • సల్పినాఁడ
సర్వవర్ణనములు • సమకూర్చి వర్ణన
రత్నాకరమునాఁగ • వ్రాసినాఁడ
రిపుహంతృ భర్తృహ • రిప్రబోధంబు నం
చితరూపకమ్ముగాఁ • జేసినాఁడ
లలితభక్తి కీర్త • నల నొప్పు కృతులు సూ
క్ష్మగతిఁ గూర్చినాఁడ • స్వామియగు ప్రి
యుత పిఠాపురీశు • నతిభక్తిఁ గొల్చువాఁ
డను, సుకవిహితుఁడ, సుజనసఖుఁడ.



# వర్ణనరత్నాకరము



దాసరి లక్ష్మణస్వామి,

పిఠాపురము, (తూర్పుగోదావరిజిల్లా.)

1927.



# వర్ణనరత్నాకరము

ఈగ్రంథముద్రణమునకై సాహాయ్య మొనరించి శాశ్వతకీర్తిని
సంపాదించిన భాషాభిమానుల పవిత్రనామములు.

## ప్రధానరాజపోషకులు



మహారాజరాజశ్రీ శ్రీ

చెలికానిధర్మారావుగారు.

( చిన్ననాయనగారు. )

ఎర్నగూడెము, గారీపట్నము వగైరా ఎస్టేట్ల

జమీందారువారు,

పిఠాపురము.

# రాజపోషకులు.



మహారాజరాజశ్రీ శ్రీ దామెర సీతారామస్వామిగారు, పిఠాపురము.

శ్రీ చెలికాని చినజగన్నాధరావుగారు
శ్రీ చెలికాని ధర్మారావుగారు, బార్. ఎట్. లా.
శ్రీ చెలికాని సూర్యారావుగారు
} ఎర్నగూడెము గౌరీపట్నము వగైరా యెస్టేట్ల జమీందారులు, చిత్రాడ.

శ్రీ రాజా కోటగిరి వేంకటకృష్ణారావుబహద్దరుగారు, కుమారజమీందారు, గంపలగూడెము.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరుగారు, జమీందారు, ఉయ్యూరు.

శ్రీ రాజా సూరానేని వేంకటనారాయణరావు బహద్దరుగారు, జమీందారు, మైలవరము.

శ్రీ రాజా మల్రాజు వేంకటనరసింహారావు బహద్దరుగారు, జమీందారు, నర్సరావుపేట.

శ్రీ మంతు రాజా అంకినేడుప్రసాద్ బహద్దరు దొరగారు. B. A. జమీందారు, చల్లపల్లి.

శ్రీ రాజా వెల్లంకి వేంకటకృష్ణారావుబహద్దరుగారు జమీందారు ప్రాటుకూరు.

శ్రీ సూరానేని వేంకటరామ అప్పారావుబహద్దరుగారు జమీందారు ఉల్లిపాలెము.

శ్రీ రావు తిరుపతిరాయనింగారు
శ్రీ రావు వేంకటరావుగారు
} కంచనపల్లిప్రొప్రైటర్సు, తిమ్మాపురము.

# రాజపోషకులు.

—⁂—

శ్రీ పిఠాపురము ఎస్టేటు దివాను శ్రీ కా. వేంకటసుబ్బారావు నాయుడు
గారు.

శ్రీ పిఠాపురము ఎస్టేటు పెర్సనల్ అసిస్టెంటు దివాను చిల్లరిగె జోగ
య్యపంతులుగారు.

శ్రీ పిఠాపురము ఎస్టేటు తాణేదారు, & తాలూకాబోర్డుప్రెసిడెంటు,
పిళ్ళారిశెట్టి రంగబ్రహ్మారావు రాయుడుగారు.

శ్రీ పిఠాపురము ఎస్టేటు యింజనీయరు కె. కృష్ణస్వామిఅయ్యరుగారు.

శ్రీ ద్రోణంరాజు రామమూర్తిగారు Assistant Superintendent
Maharajah's Orphanage.

శ్రీ రావు సూర్యారావుగారు Commissioner Hindu Religious
Endowments Board, Madras

శ్రీ ఇనుగంటి వెంకటమూర్తిగారు చిత్రాడ.

శ్రీ [illegible] రావుగారు. గోరస.

శ్రీ రావు రామారావుగారు ఈనాందార్లు కొండెవరం.

శ్రీ గజరావు చిన్నారావుగారు ఈనాందార్లు కొండెవరము.

శ్రీ యినుగంటి అచ్చయ్యగారు ఈనాందార్లు పిఠాపురం.

శ్రీ చెలికాని రమణయ్యమ్మగారు ,,

శ్రీ చెలికాని సీతయ్యమ్మగారు కాట్రావులపల్లి

శ్రీ రాజా అల్లూరి చినసూర్యనారాయణ రావుగారు, ప్రొప్రయిటరు,
చించినాడ.

శ్రీ రాజా వత్సవాయ వేంకట జగన్నాథ రంగపతిబహద్దరుగారు
పెద్దాపురము.

శ్రీ రాజా దాట్ల వేంకట సూర్యనారాయణజగపతిరాజ బహద్దరుగారు.
తుని.

శ్రీ రాజా వత్సవాయి రాయజగపతిరాజబహద్దరుగారు, రాజమండ్రి,

# రాజపోషకులు.

శ్రీ పంతం వెంకయ్యగారు }
శ్రీ పంతం సుబ్బయ్యగారు } ల్యాండ్‌లార్డ్సు, గెద్దనాపల్లి.
శ్రీ పంతం వెంకట్రావుగారు }

శ్రీమత్తికాంబిరంగాచార్యులుగారు, M. A. B. L. Prof of Mathematics Maharajah's Vizianagaram.

శ్రీ పసుమర్తి వీరభద్రస్వామిగారు B. A. విజయనగరము.

శ్రీ వి. రామకృష్ణగారు I. C. S. దివాను జయపురము.

శ్రీ తంపా వెంకయ్యగారు పిఠాపురము.

శ్రీ చందనాల వీరాస్వామిగారు ఈనాందార్లు పిఠాపురము.

శ్రీ చక్రవర్తుల పద్మరాజుగారు గ్రామమునసబు పిఠాపురము.

శ్రీ రాజా దాట్ల వేంకట అనంత విజయరామ రాజుగారు, }
శ్రీ రాజా దాట్ల వేంకటఅప్పలరాజుగారు, } శ్రీ వేంకటరామరాజుగారి పుత్రులు, ధర్మవరము.

శ్రీ రాజా దాట్ల వేంకటకృష్ణంరాజుగారు, విజయనగరము.

శ్రీ దారా త్రిపురసుందరిలింగముగారు, ప్రొప్రైటరు బొద్దాంపాలెంపా.

శ్రీ తాడి బుల్లిగంగిరెడ్డిగారు యూనియన్‌బోర్డుప్రెసిడెంటు గొల్లలమామిడాడ.

శ్రీ మండ తమ్మయ్యరెడ్డిగారు ఈనాందార్లు గొల్లలమామిడాడ.

శ్రీ దాట్ల వేంకటసుబ్బరాజుగారు ల్యాండ్‌లార్డు వీరవరము.

శ్రీ ఠాకురుపండా వేంకటరమణమూర్తిగారు విశాఖపట్టణము.

శ్రీ తీమాళ్ళ శంకరయ్యగారు ,,

శ్రీ బ్రహ్మాండం వేంకట లక్ష్మీనారాయణరావుగారు శ్రోత్రియందారు బాపట్ల.

శ్రీ కలగాని సూర్యనారాయణగారు పిఠాపురము.

శ్రీ ముప్పిడి వెంకన్నగారు ,,

# ప్రధానపోషకులు.



శ్రీ విక్రమ దేవవర్మగారు, విశాఖపట్టణము.

శ్రీ ప్రభల లక్ష్మీనరసింహముపంతులుగారు, B. A. B. L. హైకోర్టు వకీలు.

శ్రీ భూపతిరాజు వేంకటపతిరాజుగారు, C. I. E. హైకోర్టువకీలు.

శ్రీ బొడ్డు వేంకటేశముదొరగారు, విజయనగరము.

శ్రీ చేవ్రాతి సుబ్బారావుగారు, B. A L. T. విజయనగరము.

శ్రీ వరదా కామేశ్వరరావునాయఁడుగారు, జమీందార్ of పూండి.

శ్రీ గొట్టుముక్కల సీతారామరాజుగారు, ఈనాందార్లు, ప్రత్తిపాడు.

శ్రీ కొక్కొండ రామశేషగిరిరావుగారు, ,, కీర్లంపూడి.

శ్రీ తోట సూర్యారావుగారు, పెద్దాపురం తాలూకాబోర్డు వైస్‌ప్రెసిడెంటు, వీరవరము.

శ్రీ తోట పద్మనాభంగారు, ల్యాండ్‌లార్డ్ వీరవరము.

శ్రీ పిఠాపురము ఎస్టేటు యెలక్ట్రిషన్ & మోటారు సూపరింటెండెంటు ఈయుణ్ణి వెంకట నరసింహాచార్యులుగారు.

శ్రీ పిఠాపురము ఎస్టేటు ఓవర్సీయరు నాయని పెరుమాళ్లు నాయఁడుగారు.

శ్రీ కోలంక వీరవరమువగైరా ఎస్టేట్లుదివాను ఆకొండి వెంకటరత్నము పంతులుగారు, పిఠాపురము.

శ్రీ రెడ్డెం అప్పారావుగారు, శెత్తసదారు & పిఠాపురము యూనియన్ బోర్డు మెంబరు.

శ్రీ బొంగు జగన్నాథముగారు, పిఠాపురము.

శ్రీ రేపాక వెంకట్రాజు & సన్సు జనరల్‌మర్చెంట్సు పిఠాపురము.

శ్రీ బాదం సూర్యమ్ముగారు, జనరల్ మర్చెంట్సు, పిఠాపురము.

## ప్రధానపోషకులు.

శ్రీ ఇనుగంటి వేంకటభుజంగరావుగారు, బొబ్బిలి.
శ్రీ పసుపులేటి సుబ్బారావుగారు, నేటివ్‌డాక్టరు, పిఠాపురము.
శ్రీ అంగర వీరరాజుగారు, ఈనాందార్లు, ,,
శ్రీ సాగిరాజు గోపాలరాజుగారు, గ్రామమునసబు, రాయవరము.
శ్రీ ఓలేటి రామిరెడ్డిగారు, గ్రామమునసబు, నరసింగపురము.
శ్రీ అరవ రామస్వామిగారు, గ్రామమునసబు, భోగాపురము.
శ్రీ చోడిశెట్టి వెంకట్రాజుగారు, గ్రామమునసబు, తిమ్మాపురము.
శ్రీ వత్సవాయ వేంకటసూరపరాజుగారు, ఈనాందార్లు, దొంతమూరు.
శ్రీ బండారు సముద్రముగారు, ఈనాందార్లు, చిత్రాడ.
శ్రీ చప్పటి కోటిలింగముగారు, యూనియన్‌బోర్డు చైర్మన్ తుని.

---

## పోషకులు.

శ్రీ నడకుదుటి సీతారామయ్యగారు, ల్యాండ్‌లార్డ్, పిఠాపురము.
,, ఆర్. దక్షిణామూర్తినాయఁడుగారు, పోస్టుమాస్టరు, పిఠాపురము.
,, తణికెళ్ళ వెంకయ్యగారు, మేనేజరు & హెడ్‌మాస్టరు రామా ఎలిమెంటరీస్కూలు, పిఠాపురము.
,, S. T. నరసింహాచార్యులుగారు, B. A. L. T. Proffessor of Sanskrit, *Maharajah's College.* విజయనగరము.
,, ఇయ్యాణి వేంకటవీరరాఘవాచార్యులుగారు, B. A క్లాసు ,,
,, భాగవతుల వేంకటరామానుజగోపాలాచార్యులుగారు, ,,
,, పుప్పావారి జగన్నాథశర్మగారు ప్రొప్రైటరు, గంధర్వమహాల్ ,,
,, ఆర్. సంజీవరావు & సన్సు, విజయనగరము.

## పోషకులు.

,, సూరంపల్లి రెడ్డిశేషగిరిగారు, ల్యాండ్‌లార్డ్, విజయనగరము.
,, పోచిరాజు రాజేశ్వరరావుగారు, M. B. B. S. బరహాంపురము.
,, శ్రీ రాజా పూసపాటి వేంకటసీతారామరాజుగారు, జొన్నవలస.
,, శ్రీ రాజా వత్సవాయ రామకృష్ణరాజుగారు, పిఠాపురము.
,, శ్రీ రాజా దంతులూరి పెదనారాయణజగపతిరాజుగారు, ల్యాండ్ హోల్డర్, విజయనగరము.
,, శ్రీ దంతులూరి సూర్యనారాయణజగపతిరాజుగారు, ఆనందపురము.
,, డి. వి. జగన్నాథరావుగారు, ఈనాందార్లు, పాత్రేరు.
,, చందనాల లక్ష్మయ్యగారు. పిఠాపురము.
,, దండా చంద్రరాజుగారు. బెంచికోర్టుమెంబరు, పిఠాపురము.
,, తోండంగి [illegible] [illegible] పిఠాపురము.
,, నాయబ్ సయ్యద్ హుస్సేన్ సాహెబుగారు, బెంచికోర్టుమెంబరు, పిఠాపురము.
,, బాదం సుబ్బారావుగారు, షరాఫ్, పిఠాపురము.
,, పాతర్లగడ్డ కూటన్నగారు } క్లాత్ మర్చెంట్సు, పిఠాపురము.
,, జల్లు సత్యనారాయణగారు }
,, పట్నాల కన్నయ్యగారు, గోల్డుస్మిత్, పిఠాపురము.
,, అంబరపు అప్పారావుగారు, ,, ,,
,, [illegible] [illegible] మూర్తిగారు, గోల్డుస్మిత్, పిఠాపురము.
,, [illegible] పుగారు, ఈనాందార్లు, పిఠాపురము.
,, [illegible] య్యగారు, ,, ,,
,, [illegible] గారు, ,, ,,
,, [illegible] నారాయణస్వామిగారు, గ్రామమునసబు, పొన్నాడ.
,, పిల్లా సూరయ్యగారు, గ్రామమునసబు, కందరాడ.
,, దొడ్డి పద్మనాభుడుగారు, గ్రామమునసబు, కొండెవరము.

# సహాయులు.

శ్రీ రాజానల్లపరాజు మీర్జాఅచ్యుతరామరాజు బహద్దరుగారు, అల్ ఇండియా మహారాజా క్షత్రియసంఘసభ్యులు, తుని.
,, దంతులూరి బుచ్చిభాస్కరరాజుగారు, మొఖాసాదార్లు, తుని.
,, వత్సవాయ వేంకటసుబ్బరాజుగారు, ఈనాందార్లు, వేలంక.
,, మామిళ్లపల్లి సూర్యసుబ్రహ్మణ్యముగారు, వేలంక
,, యామిజాల నారాయణమూర్తిగారు, కరణము, నాగులాపల్లి.
,, మంచికంటి సున్నారావుగారు, ఈనాందార్లు, గోకివాడ.
,, రావు అచ్చయ్యగారు, ఈనాందార్లు, కొవ్వాడ.
,, సాగిరాజు సుబ్బరాజుగారు, ఈనాందార్లు, రాపర్తి.
,, బొమ్మిడి రుద్రయ్యగారు, కొండెవరము.
,, దుర్భ వేంకటలక్ష్మీనృసింహముగారు, పిఠాపురము.
,, మనకపల్లి క్షామరాజుగారు, పిఠాపురము.
,, మనకపల్లి వెంకటాద్రిజుగారు, ,,
,, బొల్లు సత్యముగారు, పిఠాపురము.
,, కుమునూరి వీరన్నగారు, పిఠాపురము.
,, అప్పికొండ సూర్యారావుగారు, పిఠాపురము.
,, అనపర్తి సుబ్బారావుగారు, అద్దములవర్తకులు, పిఠాపురము.
,, సామోజు వీరాచార్యులుగారు, గోల్డుస్మిత్, పిఠాపురము.
,, ముంతా సోమలింగముగారు, పిఠాపురము.
,, అనపోతు నూకరాజుగారు, పిఠాపురము.
,, పెదగాడి కూటన్నగారు, నేటీవుడాక్టరు, పిఠాపురము.
,, బావిశెట్టి రామమూర్తిగారు, కొండెవరము.
,, సయ్యద్ హానన్ & సన్సు Perfumers & Optician Specialists, పిఠాపురము.

సహాయులు.

,, చెలికాని చెల్లారావుగారు, విశాఖపట్టణము.
,, బుద్ధవరపు చిననారాయణమూర్తిగారు, B A.B.L. హైకోర్టువకీలు
,, చెలికాని అన్నారావుగారు, బొబ్బిలి.
,, రావు వేంకటశోభనాద్రిసూర్యారావుగారు, ,,
,, రావు గోపాలరావుగారు, ,,
,, రావు వెంకయ్యగారు, ,,
,, రావు నారాయణస్వామిగారు, ,,
,, సూకురు రామదాసుపంతులుగారు, B. A. L. T. Headmaster Maharajah's College, విజయనగరము.
,, గుండాల రామావతారముగారు, పైర్ మన్, విజయనగరము.
,, మొసలికంటి హనుమంతరావుగారు, B. A. L. T. విజయనగరము.
,, చోదిమెళ్ల జోగిరాజుగారు, B. A. విజయనగరము.
,, దాసరి శ్రీరాములుగారు, బ్యాంకర్, విజయనగరము.
,, మోటమఱ్ఱి సీతారామయ్యగారు, విజయనగరము.
,, దామెర వేంకటరాజగోపాలసూర్యనారాయణస్వామిగారు, పాత్రేరు
,, వైశ్యరాజు సూరయ్యరాజుగారు, బరహంపురము.
,, దూళల వెంకటపేలయ్యగారు, ఈనాందార్లు, చిల్లంగి.
,, దాడి నారాయణస్వామిగారు, ఈనాందార్లు, కిర్లంపూడి.
,, తోట వెంకటాచలంగారి పుత్త్రిలు సుబ్బారావుగారు, వీరవరం.
,, తోట వరహాలయ్యగారు, పెద్దాపురంతాలూకాబోర్డు ప్రెసిడెంటు
,, దిట్టి సూర్యారావుగారు, ల్యాండ్ లార్డ్, రామకృష్ణాపురము.
,, కట్టా భూమిరెడ్డిగారు, ల్యాండ్ లార్డ్, గొల్లలమామిడాడ.
,, ద్వారంపూడి సుబ్బిరెడ్డిగారు, జనరల్ మర్చెంట్సు, గొల్లలమామిడాడ

# చందాదారులు.



శ్రీ బచ్చు రంగమ్మన్నారుగారు, సాల్టుసబ్ యిన స్పెక్టరు, పిఠాపురము.

,, చక్రవర్తుల తాతాచార్యులుగారు, మునిసిపల్ కౌన్సిలర్, విజయనగరం.

,, కానుకుర్తి లక్ష్మీనరసింగరావుగారు } ల్యాండ్ హోల్డర్సు, విజయనగరము.

,, కానుకుర్తి వేంకటనరసింగరావుగారు }

,, తాడి రామమూర్తిగారు, జనరల్ మర్చెంట్సు, ,,

,, తాడూరి జోగారావుగారు, ,,

,, ద్రోణంరాజు సత్యన్నారాయణగారు, [illegible]

,, దారా వీరభద్ర[illegible]

,, పూసపాటి [illegible]

,, నిట్టల అప్ప[illegible], [illegible]

,, టి. వి. శ్రీని[illegible], [illegible]ము.

,, విన్నకోట జ[illegible]గారు, ,,

,, రామకూరు సీతాపతిరావుగారు } ల్యాండ్ హోల్డర్సు, బొబ్బిలి.

,, రామకూరు వెంకటరమణయ్యపంతులుగారు }

,, సాకా చిన్నస్వామిశెట్టిగారు, జనరల్ మర్చెంట్సు, బరహంపురం.

,, బ్రహ్మపురాంధ్రభాషాభివర్ధనీసమాజమువారు ,,

,, అధికార్ల సూర్యనారాయణరావుగారు, B. A. B. L. వకీలు పార్వతీపురము.

,, గిడుగు సీతాపతిరావుపంతులుగారు, B. A. L. T. లెక్చరర్, పర్లాకిమిడి.

,, పూడిపెద్ది శ్రీరామమూర్తిగారు, హెడ్ మాస్టరు, V. G. S, స్కూలు, కిర్లంపూడి.

# చందాదారులు.

శ్రీ నారాయణ విశ్వనాథంగారి వెంకటరమణయ్యగారు, విజయనగరం.

,, పెమ్మరాజు రాజగోపాలరావుగారు, రివిన్యూయినస్పెక్టర్, పిఠాపురంఎస్టేటు.

,, బొలనాగుల లచ్చన్నగారు, జనరల్ మర్చెంటు, పిఠాపురము.

,, కొత్త మాణిక్యాలుగారు, ఈనాందార్లు, ,,

,, పేరం రామస్వామిగారు, ,,

,, గుంటుముక్కల సుబ్బారావుగారు, ,,

,, బొహారా వేంకటాద్రినాయుడుగారు, కరణం, కొండెవరం.

,, భాగవతుల నరసింగరావుగారు, విశాఖపట్టణము.

,, స్థానాపతి సత్యనారాయణశాస్త్రిగారు, ,,

,, వృద్ధుల భోలకామేశ్వరశర్మగారు, కిర్లంపూడి ఎస్టేటుమేనేజరు, బొబ్బిలి.

,, చిన్ని అళ్వారుగారు, పేలస్‌డాక్టర్, ,,

,, V. B. జగన్నాథరావుగారు, సబ్‌రిజిష్ట్రారు, ,,

,, దేవరాజు వేంకటకృష్ణారావుగారు, Proprietor Vegujukka PrintingWorks. బరహాంపురం.

,, భాగవతుల నృసింహాశర్మగారు, Proprietor Vegujukka Grandhamala బరహాంపురం.

,, ఇందుపూరి నరసింహముసెట్టిగారు, ,,

,, మద్దూరి శ్రీరామమూర్తిగారు, కాకినాడ.

,, కొత్త అప్పన్నగారు, వ్యవసాయదార్లు, చిల్లంగి.

,, కొమ్ముల కొండయ్యగారు, ఈనాందార్లు, ప్రత్తిపాడు.

,, కుంచే తమ్మన్నగారు, గ్రామమునసబు, వేలంక.

,, జొక్కా అప్పలరాజుగారు, } కొండ్రకోట.

,, జొక్కా కృష్ణయ్యగారు, }

# చందాదారులు.



శ్రీ దాట్ల వేంకటఅప్పలరాజుగారు, ఓవర్సీయరు, పెద్దాపురం.

,, దాట్ల వేంకటజోగజగన్నాథరాజుగారు, ధర్మవరము.

,, ఎల్లపు వీరరాజుగారు, కిర్లంపూడి.

,, లింగం వెంకటాచలపతిరావుగారు, కరణం, ధర్మవరము.

,, తంత్రివహి జోగిరాజుగారు, కరణము } పెదపూడి.

,, కాకర రామచంద్రరావుగారు, గ్రామమునసబు }

,, పోకల అబ్బాయిగారు, రాజుపాలెము.

,, వంగా వీరరాఘవరెడ్డిగారు, గ్రామమునసబు, చిక్కవోలు.

,, కొత్త సదానందమూర్తిగారు, చిక్కవోలు.

,, కత్తా అచ్చయ్యగారు, రాజమండ్రి.

,, దేవులపల్లి లక్ష్మీపతిశాస్త్రిగారు, తుని.

,, దేవులపల్లి వెంకయ్యగారు, వకీలు పత్తిపాడు.

,, అవ్వారు బాలయ్యపిచ్చయ్యగార్లు, జరీబట్టలవర్తకులు, పుల్లంపేట.

,, R. సీతారామచంద్రరావుగారు, M. A. L. T హెడ్మాస్టరు సంస్థానం హైస్కూలు బొబ్బిలి.

,, బుఱ్ఱా బాలకృష్ణశాస్త్రిగారు, Secretary Telugu branch High School, బొబ్బిలి.

,, M. V. నరసింహశాస్త్రిగారు, Lecturer Chemists College, Vizianagaram.

,, నరవ పల్లయ్యగారు, గోల్డుస్మిత్ పిఠాపురము.

,, వులిమిరి గుంపస్వామిగారు, బొబ్బిలి.

,, కావ్యకంఠ గొర్తిసూర్యనారాయణశాస్త్రిగారు, విజయనగరము.

,, కొల్లాపద్మనాభరావుగారు, B. A. విజయనగరము.

,, వసుమర్తి శ్రీనివాసరావుగారు, తులసీరామాయణాదిగ్రంథకర్తలు, విజయనగరము.

# విజ్ఞప్తి.

" ఇదంకవిభ్యః పూర్వేభ్యో । నమోవాకం ప్రశాస్మహే
వందేమహిచతాంవాణీం । అమృతామాత్మనః కలాం "
(భవభూతి)

విసువొకింతయుఁ జెందక ♦ విమలమతులు
మామకీనమైన మహాశ్ర ♦ మంబుఁ దెలిసి
సావధానమతిని గ్రంథ ♦ సారమెఱిఁగి
ప్రీతినాదరింపుఁ డిదియె ♦ విన్నపంబు.

పీఠికాపురసంస్థాన ♦ విశ్రుతులును
అస్మదీయగురూత్తము ♦ లార్యవరులు
నయిన వేంకటరామకృ ♦ ష్ణాఖ్యకవులు
సరసవిద్యాప్రసక్తిన ♦ న్సాదరమునఁ
జూచి యొకదినంబున నిట్లు ♦ సూచనంబుఁ
జేసి " నీవు విద్యాభిలా ♦ షివయియుంట
మే మొకఁడు మహాకార్యంబు ♦ మెప్పఁగలుగఁ
జెప్పుచున్నార మాలింపు ♦ మొప్పమీఱఁ
బూర్వకవివర్యుల ప్రబంధ ♦ ములను గల్గు
వర్ణనాంశములంగల ♦ పద్యరత్న
నివహము న్సముకూర్చి ♦ కవితపేరఁ

గ్రాలుచున్న మీనాపత్రికా ♦ రాజమందు
నెమ్మిమీఱ ముద్రింతురే ♦ నీ గవులకును
సర్వజనసుగ్రాహ్య కుపయోగ ♦ సరణినొప్పు
గ్రంథమగుఁగాన శీఘ్రము ♦ కార్యమునకు
యత్నమొనరింపుఁడంచు మ ♦ మ్మార్యజనులు
ప్రోత్సహించుచున్నారు ♦ పొసఁగనట్లు
సల్ప నియ్యెడల నవకా ♦ శంబులేదు
గాన నీవది సమకూర్తు ♦ వేని యాంధ్ర
భాషనుండు గ్రంథమ్ముల ♦ భావమెల్లఁ
గనఁగనగుఁ గీర్తి వడయుదు" ♦ వనుచుఁ బల్కఁ
జిత్తమని నే గురులయాజ్ఞ ♦ శిరమునందుఁ
దాల్చి యాంధ్రభాషఁగల గ్రం ♦ థమ్ములెల్లఁ
గ్రమమునను సేకరించుచుఁ ♦ గాలమెల్లఁ
దద్విషయమందె కడపుచుఁ ♦ దాల్మితోడ
ముఖ్యవర్ణనముల నేర్చి ♦ ముఖ్యులైన
పండితులకుఁ జూపుచు నభి ♦ ప్రాయములను
గొనుచునుండ మామకభాగ్య ♦ మున హితుఁడు వి
మర్శకుండు తేవప్పెరు ♦ మాళ్లయబుధుఁ
డంత నాకూర్పుగ్రంథంబు ♦ నరసిచూచి
హర్షమున "నాంధ్రవాఙ్మయ ♦ మందు నిట్టి
గ్రంథ మొక్కఁ డుండఁదగును ♦ గాదె" యనుచుఁ
గొంతసవరించుచుండ నా ♦ కోవిదుండు
దైవవిధి నక్కటా కాల ♦ ధర్మమొందెఁ
-బిదపఁ -బరిశోధకుఁడు లేమి ♦ మదినిఁ గుందు

చుంచు నాయదృష్టమున మా ♦ యూరి సూర్య
రాయ నూత్నవిఘంటువు ♦ వ్రాయుచున్న
పండితారాధ్యుఁడైన శ్రీ ♦ పాదవంశ్య
లక్ష్మీపతిశాస్త్రి సన్ను లా ♦ లనముఁ జేసి
యస్మదీయవృత్తాంతంబు ♦ నంతయు విని
పూర్వసంకల్పితంబగు ♦ పుస్తకంబు
సాంతముగఁ బరిశీలించి ♦ సంతసించి
శేషభాగము సవరించి ♦ శీఘ్రముగను
దమయశఃప్రాయ మిటు ద్యోత ♦ కమగుకీర్తిఁ
బరమకృపతోడఁ బీఠిక ♦ వ్రాసి యొసఁగె
నస్మద్ధితునకు వందనం ♦ బాచరింతుఁ
దలఁపున ఘటించి ప్రణుతింతు ♦ ధన్యు సాధు
మతినిఁ గీర్తిశేషునిఁ బెదు ♦ మాళ్లయబుధు
నస్మదీయపురోవృద్ధి ♦ నాత్మ నభిల
షించి సదుపదేశంబుఁ గా ♦ వించినట్టి
గురులు రామకృష్ణకవుల ♦ కును ముదమున
సర్వదా కృతజ్ఞుఁడనౌదు ♦ నుర్వియందు
గ్రంథపరిశోధనంబునఁ ♦ గరుణతోడ
నాదినుండియు నాకు స ♦ హాయపడిన
ప్రథితపన్నాలసత్కులా ♦ బ్ధసుధాంశుఁ
డాంధ్రగీర్వాణనిగమ వి ♦ ద్యాప్రవీణుఁ
డైన మల్లికార్జునశాస్త్రి ♦ కధికభక్తి
సతతమున్ శతాధికనమ ♦ స్కృతులొనర్తు
నడిగెనంతనె యాంధ్రభా ♦ షాభిమాన

గడిన ముద్రితములైన ◆ గ్రంథములను
సద్దయామతినొసంగిన ◆ సజ్జనులకు
నంజలియొనర్తు నీగ్రంథ ◆ మందు వర్ణ
సాదికవ్యత్యయము గన ◆ నయ్యెనేని
గూర్మి క్షమియింప విబుధుల ◆ గోరుదు-

ఇట్లు లను

విధేయుండ

నాసరి ◆ లక్ష్మణరావు.

శ్రీః

# పీఠిక.

ఓంకారవాచ్యమును జగత్కారణకారణమును సర్వవ్యాపకము నగుబ్రహ్మ మానందమయము. ఆనందప్రాప్తికై ప్రాణికోటి [illegible] యు మహాప్రయత్నములు గావించుచున్నది. ఆ [illegible] మున భిన్నభిన్నరూపముగ ననుభవింపఁబడుచున్న [illegible] నిత్యమై విలసిల్లునది బ్రహ్మానందము తరువాత గణింపఁదగినది కావ్యానందము.

కవిబ్రహ్మలు ప్రకృతిపదార్థములయందలి యపారసౌందర్యము [illegible] జూచి వాని భావవిలాసాదుల భావనాప్రపంచమున భావించి తన్మయత్వరూపమైనయానంద మనుభవించి తదానందమూలమగు కల్పనావిశేషముల రసము తొలఁకకుండఁగ ఛందోబద్ధంబులఁ గావించి లోకమున కనుగ్రహించిరి. లోకమున ధన్యతనొందెడు భాగ్యముగలవారు గురుకటాక్షమునను స్వబుద్ధివిశేషమునను మహాకవిప్రసాదితమగు నపరబ్రహ్మానందమైన కావ్యానంద మనుభవించుచున్నారు. కావుననే కావ్యప్రకాశికాకారులు కావ్యోపయోగములఁ దెల్పుచు నైహికాముష్మికఫలములు కొన్ని దెలిపి తుదకు "కావ్యం...సద్యఃపరనిర్వృతయే" (కావ్యము తత్కాలమున సర్వప్రపంచవిస్మృతిఁ గలిగించుమహానందమున కు హేతువు) అనిరి.

నాగరకతగలదేశములలోఁ దలిదండ్రులుగాని పోషకులుగాని బాలుర విద్యాభ్యాసములఁ గావించి మహాకావ్యములఁ బఠింపఁజేసు

లోకజ్ఞాన మలవఱుచుటయేగాక మహానందపాత్రులఁ గావించి జన్మాంతరములకైనఁ దీర్పరానియంతటి కృతజ్ఞతకుఁ బాత్రులగుట సర్వ లోకవిదితము.

భాషాంతరాక్షరాభ్యాసమాత్రవ్యర్థీకృతవిద్యాభ్యాసకాలులును కఠినసేవాసమాసాదితకతిపయరూపికాపరిపోషితపోష్యవర్గులును ఉభయ భాషాదూరులును నగుజను లానందదూరులగుట ఆశ్చర్యావహము కాదు. అయినను దురధిగమంబులైన సంస్కృతకావ్యారణ్యంబులఁ జొర నావశ్యకతలేకుండఁగ గీర్వాణవాఙ్మయారణ్యసంపాదితప్రశస్తవస్తువులు తాత్కాలికనాగరకతాలతావేష్టితంబులుగావించి యాంధ్రప్రబంధముల వెలువఱిచిన మహాకవులు వందనీయులు. వారివారిభావములను నవీన భావములను స్వీయపదబద్ధములఁగావించి క్రొత్తక్రొత్తగ్రంథముల వెలువఱుచుట యాధునికకవులమార్గము. ప్రాచీనకవుల భావవిశేషముల మాఱురూపులఁ జూపుటకంటె నిజస్వరూపముననే స్వీయగ్రంథమధ్య భాగమునఁ జొనుపుట మనోజ్ఞమగునని యొకకథావస్తువును గల్పించు కొని పూర్వకవులపద్యములను సందర్భానుసారముగ తమగ్రంథమధ్య మునఁ జొనిపి కృతులనిర్మించుట యొకవిధమగుమార్గము. ఈరీతిఁగల ప్రబంధ మణిభూషణముఁ బ్రకటించిన మ. రా. శ్రీ మానవల్లి రామ కృష్ణకవిగారట్టివానిపేరు నిలువఁబెట్టిరి. ఉద్గ్రంథములనుండి కొన్ని విషయములఁగూర్చి పద్యరత్నములనెత్తి "పద్యరత్నావళి" మొదల గుపేరులతోఁ గొన్నిపుస్తకములు ప్రకటింపఁబడినవి. అట్టివానిలోఁ బ్రకృతలభ్యములగుగ్రంథములలో నెన్నఁదగినదగు "ప్రబంధకుసుమావళి" యనుపుస్తకమున నీతి, మైత్రి, ధర్మము మొదలగుపెక్కువిషయములను గుఱించియుఁ గొన్నివర్ణనములగుఱించియు ముప్పదిగ్రంథములనుండి కొన్నికొన్నిపద్యములు సంగ్రహింపఁబడియున్నవి.

ఆంధ్రసాహిత్యసరసకవితాధురీణులును శ్రీమదాంధ్రభోజవీతి కాపురాధీశపరిపోషితులును నగు మ. రా. శ్రీ దాసరి లక్ష్మణస్వామి గారు పెక్కండ్ర పెక్కండ్రినేల అంచటుమహాకవులయుద్గ్రంథములఁ జదివి మహాశ్రమమునకోర్చి సాంకర్యములేకుండ వర్ణనాంశములేర్చి యొక్కచోఁగూర్చి వర్ణనార్ణవము సమకూర్చినారు. కాని యామహార్ణవము పాఠకుల కపారముగానుండునని యందలిరత్నములేరి "రత్నాకర" నామమున నీగ్రంథముఁ బ్రకటించిరి.

వీరు శతాధికగ్రంథములనుండి మహాకవులరసపేటికలైన వర్ణనా విశిష్టములగుపద్యరత్నముల నిందు సమకూర్చి ప్రతివర్ణనమునందును మహాకవుల భిన్నభిన్నమార్గములను కన్నులఁగట్టిన ట్లొకచోటనే గనఁ బఱచిరి. వీరు గ్రంథవిస్తరభీతిచేఁ గొన్నియంశములలో సమానముగ నుండు భిన్నకవులపద్యములు విసర్జించిరి. మఱియుఁ బ్రకృతకాలంబున నశ్లీలముగ నెంచఁబడుభాగములుగూడ విసర్జింపఁబడినవి. ఇందుఁ గనఁ బడని క్రొత్తవర్ణన మాంధ్రప్రబంధములలోఁ గానఁబడదని చెప్పుట యతిశయోక్తి కాదు. సకలగ్రంథసారపూరితమగునీగ్రంథ మొకటి చ దివినచో ముద్రితాముద్రిత మహాప్రబంధములయందలి కవులభావంబు ల గ్రహింపఁగలుగుభాగ్య మలవడును. రసాధారములగు భిన్నభిన్న కవుల పద్యరాజముల తారతమ్య మెంచుకొనుచు మహానందతరంగం బుల నోలలాడుభాగ్య మనువుపఱచిన నీగ్రంథరాజము విద్వాంసులకే గాక విద్యార్థులకును గ్రంథకర్తలకేగాక గ్రంథకాలక్షేపముఁ జేయువా రలకును మిక్కిలి యుపయుక్తమగునని నొక్కి వక్కాణింపఁగలను. మిత్త్రునివలెఁ గాలక్షేపముఁ జేయించునదియు, గురునింబోలె నానంద మార్గమును జూపునదియు బ్రహ్మధ్యానమునుబోలె సర్వవిషయముల మఱపించి తన్మయత్వ మొందింపఁ జేయునదియు నగునీగ్రంథరత్నము

ప్రతిగృహమునకు భూషణమ్మును ప్రతిపుస్తకభాండాగారమునకు నలంకారమ్మునై యాంధ్రులకన్నుల నద్దుకొనఁదగినదియై విలసిల్లఁగలదని దృఢముగ వచింపఁగలను.

ముద్రితాముద్రితమహాప్రబంధముల సంపాదించి సవిమర్శముగాఁ జదివి సక్రమముగ సరసపద్యము లేర్చికూర్చిన యిట్టిగ్రంథరాజము వెలువఱుప భృత్యుని కవకాశముఁ గలిగించిన శ్రీమదాంధ్రభోజపీఠికాపురాధీశ్వరుని యౌదార్యాతిశయంబు సర్వజనప్రశంసార్హంబు.

ఇట్లు పండితవిధేయుఁడు,
శ్రీ పాద లక్ష్మీపతి శాస్త్రి,
పండితుఁడు, కార్యవ్యవస్థాపకుఁడు (మేనేజరు)
శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్యస్థానము,
పీఠికాపురము.

# ఆమోదము.

ఆంధ్ర మహాకవుల సుప్రసిద్ధకావ్యములయందు మనోహరములగు నానావిధవర్ణనములతో నొప్పు పద్యరాజములలో నుత్తమములయినవానిని సేకరించి "వర్ణనరత్నాకర" మనుపేరితో నొకగ్రంథము వెలువరింపఁదలఁచిన భాషాసేవకుఁడు దాసరి లక్ష్మణకవి యొకనాఁడు నాకడకు వచ్చి తగుసాహాయ్యము నొనర్పఁగోరఁగా, నాయా గ్రంథములలోని యచ్చటచ్చటి వర్ణనపద్యములు గొన్నిటి నప్పుడప్పుడు చెప్పి చూపుచు వచ్చితిని.

లెక్కకుమిక్కిలిన గ్రంథములలోని యసంఖ్యాకపద్యములన్నిటిని జదివినఁగాని యందు శ్రేష్ఠములయినవానిని నిర్ణయించుటయు సంగ్రహించుటయు సాధ్యము గాదు, మఱియు నట్టికార్యముకొలఁది యిడరాని విసుపును బుట్టించుననుటయు విద్వాంసులకెల్లరకు విశదమే. అయిన నిట్టి మహాశ్రమమున కోర్చి బహువిధవర్ణనములుగల పద్యరాజములను సంకలనముచేసిన యేతద్గ్రంథసంగ్రహకారుఁ డెంతయు స్తవనీయుఁడు.

ఏతాదృశగ్రంథనిర్మాణము లోకమునకుఁ గ్రొత్తది గాదు. "సుభాషితావళి, సుభాషితరత్నాకరము, సుభాషితరత్నభాండాగారము" మొదలగునవి గీర్వాణభాషయందును, "సకలనీతిసమ్మతము, ప్రబంధమణిభూషణము" మొదలగునవి యాంధ్రభాషయందును నితఃపూర్వము వెలయుచున్నవి.

అయినను కాలము గతించినకొలఁది భాషయు గ్రంథములును వృద్ధియగుటంజేసి గణితములగు ప్రబంధములలోని పలువితములగువర్ణనముల నేర్చికూర్చిన గ్రంథమునొకదానిని భాషాజిజ్ఞాసువులు గోరుచుందురనుట యత్యుక్తి కానేరదు. కావున నీయుద్గ్రంథము వెనుకటివానికన్న మిన్నయనియుఁ జెప్పక తప్పదు.

ఇట్టిగ్రంథములు, లోకోపకారకములనియు, భాషకావశ్యకములనియు, క్రీ. శ. 1430 ప్రాంతమునందుండిన "మడికిసింగనమహాకవి" తన "సకలనీతిసమ్మతము" న నీరీతి వ్రాసియున్నాఁడు :—

సీ. " ఆలోలకల్లోల ♦ మగుదుగ్ధసింధు(దచ్చి,
దేవామృతము వేట ♦ దెచ్చునగిదు
గంధకారుండు మున్ను ♦ గలవస్తువులు వేరం
గూర్చి సుగంధంబు ♦ గూడినట్లు
అడవిపువ్వులు తేనె ♦ లన్నియు మధుపాళి
యిట్టలంబుగ జున్ను ♦ వెట్టుభంగిం
దననేర్పు మెఱసి, వ ♦ ర్తకుండు ముత్తెములేరు
గూర్చి హారంబుతోం ♦ గ్రుచ్చుకరణి
తే. గీ. గృతులు మునుచెప్పినట్టి స ♦ త్కృతులు ద్రవివ
కాంచుకం చెను నొకచోటం ♦ గానంబడంగ
సకలనయశాస్త్రమతములు ♦ సంగ్రహించి
గ్రంథ మొనరింతు లోకోప ♦ కారముగను.

చ. మును కవులెల్లం జెప్పినవి ♦ మున్నొకని చర్వితచర్వణంబుగాం
బనివడి వ్రాయనేల కవి ♦ ప్రాజ్ఞులు చిత్తములందుం జూడుండా
ఘనుండగు పౌష్పికమాల కరి ♦ కమ్మని పువ్వులుగూర్చి దండగ
ట్టినక్రియ నీతిదామము ఘ ♦ టింపుదు మీరలు మెచ్చునట్లుగన్."

కావున నించుమించుగా నాధునిక ప్రసిద్ధాంధ్రపండితులెల్లరును నేతత్ప్రయత్నంబునకు సదభిప్రాయంబు లొసంగి యుత్సాహ మొనగూర్చియుండుటం జేసి యామోదమున నాంధ్రమహాజను లీశ్రమము సఫల మొనర్తురని నమ్ముచుం బరమేశ్వరు. డేతద్గ్రంథసంకలనకర్తకితోధికాభివృద్ధియుం జిరతరయశంబును గూర్చుంగాకయని మనఃపూర్వకముగం గోరి యామోదము దెల్పుచున్నాను.

ఇట్లు ఉభయభాషాభిమాని,
పన్నాల మల్లికార్జునశాస్త్రి,
పిఠాపురము.

శ్రీ

# వర్ణనరత్నాకరము.

## పండితాభిప్రాయములు.

1. శ్రీ పీఠికాపురసంస్థాన విద్వత్కవులు శతావధానులు రామకృష్ణకవులలోనొకరునగు బ్రహ్మశ్రీ ఓలేటి వేంకటరామశాస్త్రులుగారు,

క. నిర్ణిద్రదీక్షతో సం
పూర్ణముఁ గావించి లోక • మునకిచ్చిన నీ
వర్ణనరత్నాకర మా
కర్ణించితిఁ బరమకౌతు • కం బుప్పొంగన్.

గీ. చెప్పితిమి హేలగా నిట్లు • సేయుమనుచు
నదియె గురుపదముగ హృద • యముననిల్పి
శ్రమమునకు నోర్చి వర్ణన • క్రమములరసి
తుదకుఁ బూర్తి చేసితివి సం • తోషమయ్యె.

గీ. ప్రస్తుతిం గన్నయాంధ్రప్ర • బంధజాల
మెల్ల శోధించి వినువాక • యింతలేక
చానఁ గలవర్ణనమ్ములు • తత్తదుచిత
ఫణితి నేర్చి కూర్చుటపయి • పయినఁగలదె ?

గీ. ఆంధ్రకావ్యప్రపంచంబు • నందుఁ గల్గు
వర్ణనములెల్ల నరయంగ • వలయునన్న
నరయఁగావచ్చు నీదుర • త్నాకరమునఁ

గరతల సమర్పితామల ♦ కంబుపగిది.

గీ. తెలుఁగుబాసను బెంపునొం ♦ దింపఁజేయ
వలయు పనులెన్నొయున్నవి ♦ వానిలోన
నొకటి గావించి నీవు ధ ♦ న్యుండవైతి
సూక్ష్మబుద్ధివి దాసరి ♦ లక్ష్మణకవి.

---

2. శ్రీ పీఠికాపురసంస్థానపండితులు వ్యాఖ్యాతలు నగు
బ్రహ్మశ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిలుగారు.

మ. రా. శ్రీ దాసరి లక్ష్మణస్వామిగారు తెలుఁగుగ్రంథములన్నిటినుండి యేర్చి కూర్చిన 'వర్ణనరత్నాకరము' ను పొత్తమును నేనక్కడక్కడఁ జూచితిని. ఈపుస్తకమునకు బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిలుగారు వ్రాసినయుపోద్ఘాతము నామూలాగ్రముగ మిక్కిలియవధానముతో వింటిని. దీనివలన నీగ్రంథముయొక్క ప్రాశస్త్యము స్పష్టమగును. సంస్కృతభాషయందు మున్నిట్టికావ్యమును బద్యరత్నభాండాగారమనుదానిని జాలంగాలముక్రిందటనే జూచితిని. అప్పటినుండియు దెనుఁగున నిట్టికావ్యముండునేని యాంధ్రలోకమునకు మిక్కిలి యుపకరించునుగదాయని తలఁచుచుంటిని. చిరకాలమునకు నేనట్టికావ్యమును జూడఁగల్గినందులకు మిక్కిలి సంతసించుచున్నాను. ఈగ్రంథమును మిక్కిలి జాగ్రత్తగాఁ జూచినచో నించుమించుగా నాంధ్రగ్రంథముల రచియించిన మహాకవులందఱియాశయములు గ్రహింపవచ్చునని నా యభిప్రాయము. ఇందు శృంగారాదిరసములన్నియు ప్రసాదాదిగుణములన్నియు మొదలగు కావ్యలక్షణములెల్ల నుండఁబోలునని తలంచెదను. ఇన్నిమహాగ్రంథములను సంపాదించి చక్కఁగఁబరిశీలించి ప్రశస్యములగు వర్ణనములఁగూర్చి విభజించి వ్రాయుట మిక్కిలి శ్రమాకరమని నిస్సంశయముగాఁ దోఁచును. ఇట్లు మిక్కిలి శ్రమపడి యిట్టి

మధురతరగ్రంథము నాంధ్రలోకమునకుఁ గల్గఁజేసిన వీరు మిక్కిలి శ్లాఘ్యులని నాయభిప్రాయము.

---

3. మహారాజశ్రీ కూచి నరసింహముపంతులుగారు బి. ఏ.
రిటైర్డు హెడ్మాస్టరు పిఠాపురం హైస్కూలు.

దాసరి లక్ష్మణస్వామిగారు నాయొద్దకువచ్చి తనచే సంకలితమైన "వర్ణనరత్నాకరము" నకు బ్ర. శ్రీ. శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు ప్రౌఢముగావ్రాసిన యవతారికయు, వర్ణనాంశములపట్టికయుఁ జదివి వినిపించినారు. పుస్తకములోని కొన్నిపద్యములు నేఁజదివినాను, మిగుల మనోహరముగా నున్నవి. ఇది విశేషవివేచనాప్రయాస సాధ్యమైనపని. లేఖనముద్రణప్రమాదము లెంతమాత్రము లేకుండ నచ్చొత్తించినచో నీగ్రంథము సమస్తభోగపదార్థము లొక్కచో సమకూర్చిపెట్టినయాపణమువలె విద్యాభిలాషులగు పెద్దలకుఁ జిన్నలకుఁగూడ మిక్కిలి యుపయుక్తమై నాతిశ్రమముతో వారికిఁ జిత్రవిచిత్రభావభాషానందముల విందిడుననుటకు సందేహములేదు.

నిత్యభృత్యవర్గములోనుండు లక్ష్మణస్వామిగారి కింతభాషాభిరుచి గలుగుటకును, నిట్టిపద్యరత్నములు వివిధప్రబంధములనుండి యేర్చి కూర్చుటకును దగినయవకాశమునిచ్చిన శ్రీపీఠపురప్రభువుగారెంతయు స్తవనీయులు. తమపదవిలోనుండు నితరమహీపతులకు మార్గదర్శకులు.

---

4. ఢిల్లీసామ్రాజ్యశాసనసభాసభ్యులును ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకులును శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటుసంపాదకులును రిటైర్డుడిప్యూటికలెక్టరుగారును నగు మహారాజశ్రీ జయంతి రామయ్య పంతులుగారు, ముక్త్యేశ్వరము.

దాసరి లక్ష్మణస్వామిసంకలితమగు "వర్ణనరత్నాకర" మను గ్రంథ మచ్చటచ్చటఁ జూచినాఁడను. ఇందనేకములు రసవంతములగు పద్యములు గలవు. ఇంకను జేర్పఁదగినవికూడ ననేకములున్నవి. వీనినిఁ జేర్చి కవి కాలక్రమముగా ముద్రింపించినయెడల నాంధ్రకవిత్వము కాలక్రమమున నెట్లుమాఱినదో తెలిసికొనుట కవకాశము కలుగునని నాయభిప్రాయము. ఉద్యమము మంచిది.

N. B.—వీరియభిప్రాయానుసారముఁ గవికాలశతాబ్దులు చేర్పఁబడినవి.

---

5. సనాతనధర్మరత్నాకరమహామహోపాధ్యాయ సర్వతంత్రస్వతంత్ర, వేదవేదాంగశాస్త్రజాలమహోదధి, విద్యాదానవ్రతమహోదధి, పండితరాజ బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలుగారు,

చెన్నపట్టణము.

సరస్వతిలోకమున ఎన్నివిధముల విలసించునో కని ఎప్పటికప్పటి కాశ్చర్యానందము లనుభవింపవలయునేగాని అన్నివిధములును ఊహకు ఎవరికిని ముందుగా అందవు. అట్టివిశేషములలో శ్రీ దాసరి లక్ష్మణస్వామిగారి మహోద్యమమొక్కటి. వీరికిమున్ను వీరివలెనే బహుగ్రంథగతవిషయములను ఏకత్ర సంకలించి లోకులకొసంగినవారు సర్వవిషయములను సంపూర్ణముగా పరామర్శించినవారు గారు. వీరు అట్లు ఏకదేశమాత్రప్రదర్శనముచే తనియక ఈభాషయందు వర్ణనలు ఎన్నివిధముల నెలకొనియున్నవో అన్నిటికిని సమగ్రముగా సకలగ్రంథములనుండియు వాఙ్మయమును ఉద్ధరించి ఒక్కధర్మహట్టమున నిలిపినారు. ముద్రితాముద్రితములగు పరశ్శతగ్రంథములనుండియు వర్ణనలను కూర్చినారు. ఇన్నిగ్రంథముల యుపలబ్ధికి వీనియందు తాటియాకువ్రాతలలోఁగూడ నున్నవానినినయితము ఇంతబాల్యములోనే చదివి రసమెఱిఁగి సమకూర్చుట నాకు ఆశ్చర్యకరముగా నున్నది. ఈయుద్యమముయొక్క ప్రయోజనము కష్టమెఱుఁగనివారికి తెలియదు. ఇట్టిగ్రంథమొకటి

నాకు చిరకాలమునకు మున్ను దొరకియుండిన మదీయనైషధవ్యాఖ్యకు ఆముక్తమాల్యదావ్యాఖ్యకును మిక్కిలి సాయమయి యుండును. దీని యందు కవులకాలక్రమమునుగూడ పాటించినారు. అది కళమపేషణీ యము. దీనిని ఎంతయేని శ్రమపడి శుద్ధముగా ముద్రించిన గ్రంథ కోశములందును పండితులకేమి విద్యార్థులకేమి కవులకేమి ఎల్లవారికిని ఇది భాషాదేశతయొక్క పండిన పెరటికల్పకముగా నుండునని చెప్ప నక్కఱలేదు.

---

6. కల్పలతాధిపతులు సుప్రసిద్ధులు నగు మహారాజశ్రీ ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారు, విశాఖపట్టణము.

వివిధరత్నములకు వివిధప్రదేశము లుత్పత్తిస్థానములు. అవి యన్నియు లభించుచోటు రత్నాకరము. కావ్యశరీరమునకు వర్ణనము లు రత్నములు. ఆంధ్రసారస్వతమునఁగల ప్రబంధరాజము లనేకముల నుండి వివిధవర్ణనములను రత్నములను సంగ్రహించి వర్ణనరత్నాకరము న సులభసాధ్యములఁ గావించినగ్రంథకర్త యెంతయుఁ బ్రశంసనీయుఁ డు. సంగ్రహించిన రత్నములన్నియు నమూల్యములగుటచేత నీవర్ణన రత్నాకరమునకు విలువ యింతయనిచెప్ప నెవరితరము. కావలెనన్నంత నే రత్నాలరాసుల నందవడఁజేయు నీవర్ణనరత్నాకరము హస్తగతమగు టవలన నాంధ్రలోకము ధన్యమగుచున్నది. గ్రంథసంపాదకులగు శ్రీ యుతులు లక్ష్మణస్వామిగారిఋణము నాంధ్రు లెన్నటికిని దీర్పఁజాలరు.

---

7. శ్రీ విజయనగరంమహారాజావారి ఆంగ్లేయపాఠశాలా ప్రధాన సంస్కృతోపాధ్యాయులగు మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు.

శ్రీయుత దాసరి లక్ష్మణస్వామిగారిచే సంకలితమయిన వర్ణన రత్నాకరము న నేనచ్చటచ్చట జదివియున్నాను. ఇట్టిగ్రంథ మొకటి

లేదనుకొనరత నీయాంధ్రలోకమున కీగ్రంధకర్తగారు పూర్తిజేసినందుకు మిగుల సంతసిల్లుచున్నాను. ఈగ్రంథము కవనముజెప్పువారికి నితరాంధ్రపండితులకు మిక్కిలి యుపయోగకరమని తలంచుచున్నాను. గ్రంథసంకలన మత్యద్భుతముగా నున్నది. ఇది శీఘ్రముగా ముద్రితమయినచో లోకమునకు మహోపకారము జేయును.

---

8. జాతీయ సుప్రసిద్ధాంధ్రకవులు

మ. రా. శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు, కాకినాడ.

మనోజ్ఞచిత్రంబులనెల్ల నొక్కయద్దమునఁ బ్రతిబింబింపఁజేసినట్లు మధురరసంబులనెల్ల నొక్కరసాయనంబున సమ్మేళనంబుగావించునట్లు బహుముఖంబులఁ బ్రవహించుచున్న యాంధ్రకవితాసరస్వతుల కేకముఖంబుగావించిన యీ "వర్ణనరత్నాకరము" మహాత్ములగునాంధ్రమహాకవులనందఱ నొక్కచోఁ బ్రదర్శించు దివ్యజ్ఞానదీపమువలె నియ్యాంధ్రలోకమున వెలయఁజాలియున్నదని చెప్పుట యతిశయోక్తి కాదని భావించుచున్నాము.

అతిప్రయత్నమున నిట్టిసంఘటనముంగావించిన శ్రీ దాసరి లక్ష్మణస్వామిగా రాంధ్రులకృతజ్ఞత కెంతయుఁ బాత్రులై యున్నారు! చిన్నతనమునుండియు నిట్టి భాషావిషయికసత్కార్యములయందే పాటుపడుచున్న వీరికిఁ బరమేశ్వరుఁ డాయురారోగ్యభాగ్యములొసంగుఁగాక.

---

9. మ. రా. శ్రీ శేషాద్రిరమణకవులు, శతావధానులు,

నందిగామ, కృష్ణాజిల్లా.

శ్రీయుత దాసరి లక్ష్మణస్వామిగారుకూర్చిన వర్ణనరత్నాకరము పఠనార్హమనుటలో సంశయములేదు. మహాకవుల యమూల్యభావములు నున్వరూపమునొందునవకాశము వర్ణనావసరములయందె తటస్థిం.

చును. కాన ప్రబంధసముద్రములో వర్ణనపద్యములు రత్నములె. అట్టి రత్నముల నుద్ధరించి యాంధ్రభాషాసేవకులకు, బంచి యొసంగ సాహసించి కృతార్థులైన యీలక్ష్మణస్వామిగారు ఆంధ్రలోకమున శాశ్వత కీర్తిఁ గడించిరి.

ముద్రితాముద్రిత గ్రంథములనుండి వర్ణనాంశములయందుగల రసవత్తరములగుపద్యముల నేరి కవికాలాదికముల నిరూపించి సంకలితఁ బొనరించుటలో గ్రంథకర్తగారు మిగుల శ్రమపడి యాంధ్రమహాజన కృతజ్ఞతాపాత్రులైరి. భగవంతుఁ డీగ్రంథకర్తగారికిఁ జిరాయురారోగ్యములఁ బ్రసాదించి యుత్తమగ్రంథముల రచింప ననుగ్రహించుఁగాక.

---

10. అనేక నాటకాదిగ్రంథకర్తలు సుప్రసిద్ధవక్తలు నగు
మ. రా. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, రాజమండ్రి.

పీఠికాపురవాసులగు శ్రీ దాసరి లక్ష్మణస్వామిగారిచేత సమకూర్పఁబడిన "వర్ణనరత్నాకర" మనుగ్రంథమునఁ గొన్నిపద్యములు విని దానియేర్పాటునంతయు గ్రంథకర్తగారివలన నాకర్ణించి మిక్కిలి సంతసించితిని. అనేక నూతనాలంకారములతో విరాజిల్లుచున్న యాంధ్రసారస్వతమున కిట్టిమహాగ్రంథము లేకపోవుట గొప్పలోపము. అనేక ముద్రితాముద్రితగ్రంథములను పరిశోధించి చిరకాలము శ్రమపడి యాంధ్రవాఙ్మయమునంగల యాలోపముఁ దీర్చినందుకు లక్ష్మణస్వామిగారి కాంధ్రులు కృతజ్ఞులయి యుండవలెను. ఈమహాగ్రంథ మెవ్వని యొద్దనుండునో యాతఁడు సకలాంధ్రకవులమధ్యమున గూర్చుండి వారితో ముచ్చటించినట్లే యానందపారావారమున దేలుచుండును. సకల పుష్పలతాభిరతమైన యుద్యానవనమట్లు సర్వరత్నగ్రథితమైనహారమట్లు సకలవస్తుసంపూర్ణమైన యంగడియట్లు పాఠకుల కీగ్రంథము మహామోదప్రదమై యమూల్యమై మనోరథపూరకమై విరాజిల్లుఁగాక.

11. బ్రహ్మశ్రీ పేరి పేరయ్యశాస్త్రిలుగారు,
సంస్కృతోపాధ్యాయులు, మల్లాది సత్యలింగం
హైస్కూలు, కాకినాడ.

అనేక గ్రన్థసముద్ధృతపద్యపూరితంబగు నీ 'వర్ణనరత్నాకర'మను గ్రన్థము మాధుర్యాదిగుణములుగలిగి యనేక పుష్పసముద్ధృత మకరన్ద పూరితంబగు మధుకోశంబువోలె సర్వజనానన్దకమగుచున్నది.

---

12. మ.రా.శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరు జమీందారుగారు, అష్టావధానులు, ఏలూరు.

చ. ఒకనికి నారికేళములు ♦ నొక్కనికిం గదళీఫలంబు లిం
కొకనికిద్రాక్ష యిష్టమయి ♦ యుండుట నందఱికిన్ ఘనంపుటు
త్సుకతఘటించు వర్ణనల♦ తో ఫలతోయములో సుధార్ణవ
ప్రకటితకీర్తిసంపద వి ♦ రాజిలు నీకృతి రాజమెంతయున్.

మత్తేభవృత్తమాలిక.

ఘనుఁడౌ నన్నయభట్టసత్కవిలస♦ద్గానంబుతో నెఱ్ఱనా
ర్యనితాంతోన్నతవాక్యవీచికలతో ♦ రంజిల్లునామంత్రి తి
క్కనరమ్యాన్వయసద్గభీరరచనా ♦ కాండంబుతో నల్లపో
తనవక్త్రోదితపద్యరత్నములతో ♦ నాభాస్కరస్తవ్యపా
వనపాదంబులతోడ ధూర్జటిమహా ♦ భక్తిధ్వనివ్యాప్తితో
డను శ్రీనాథనవీనశయ్యను జొకా♦టంబై విరాజిల్లు పో
మునిరాకందగునుబ్బుతో విమలుఁడౌ ♦ మూర్తిప్రతిష్ఠుండు రా
మునియాశ్లేషవిశేషపోషణముతోఁ ♦ బొల్పొందు తిమ్మన్నదా
రిని బెద్దన్నవచఃప్రవాహములతో ♦ శ్రీరామలింగప్రధా
నినవీనామృతకల్పనేర్థజయుడిం ♦ డీరంబుతో వీరభ
ద్రమనిసత్త్వప్రభతోడ రుద్రనిమహా ♦ రూక్షప్రయోగంబుతో

డ నృసింహోజ్జ్వలదూరదర్శనపటి ♦ ష్ఠత్వంబుతో రంగనా
థనృపాలామలశబ్దశబ్దములతోఁ ♦ దమ్మయ్యపూర్ణార్థగుం
భనతో సూరనసత్పథప్రచురశో ♦ భాయుక్తసంచారతన్
వినుతింగాంచుచు లోకజాలమున వ్యా ♦ ప్తింగాంచి యీనవ్యవ
ర్ణనరత్నాకర మెల్లకాలము బుధా ♦ నందంబుఁ జేకూర్చెడున్.

మ. అలరత్నాకర మేమియిచ్చువలవే ♦ యన్ వల్లెవేయంగని
మ్మలరత్నాకర మిద్దియిచ్చు నమృతం ♦ బుం బద్యరత్నంబులం
బలుభంగంబులకాలయంబది ; విప ♦ ద్భంగంబుఁగావించు ను
జ్జ్వలరత్నాకరమిద్ది • దీనఁదరియిం ♦ పంజాలు లోకంబొగెన్.

13. శ్రీమదుయ్యూరుసంస్థానాధిపతులగు

శ్రీరాజా వేంకటాద్రిఅప్పారావుబహద్దరుగారు,

మహారాజశ్రీ దాసరి లక్ష్మణస్వామిగారి 'వర్ణనరత్నాకర' మును జూచితిని. ఈగ్రంథము పండితులకుఁ బామరులకుఁగూడ నుపయోగించునది. ఈకవిగారిగ్రంథము లిదివరకు కొన్ని జూచియుంటిని. ఈగ్రంథముమాత్రము బహుకష్టముతోఁ బరిశోధించిన శ్రద్ధయొక్క పర్యవసానము. మహాజను లీపుస్తకముఁ బరిశీలించునప్పుడు అనేకగ్రంథములనుండి సారముతీసి తమముందు చేటలెల్లముగాఁ బెట్టిన యేతద్గ్రంథనిర్మాత పరిశ్రమమును దలంతురుగాక.

---

14. ఆంధ్రపరిశోధకమహామండలీసంస్థాపకులు అముద్రితాంధ్రగ్రంథసర్వస్వాధికారులును నగు

మ.రా.శ్రీ కావ్యనిధి చెలికాని లచ్చారావుగారు,

చిత్రాడ.

దాసరి లక్ష్మణస్వామిచే వ్రాయఁబడిన 'వర్ణనరత్నాకరము' ను

గ్రంథమందుఁ బొందుపఱచిన వర్ణనల నక్కడక్కడ నే నడిగినవానిని గుఱించి చదువ వింటిని. ఇయ్యది నూతనగ్రంథకర్తలకు శబ్దరత్నాకరముబోలె సహకారియై తనరారుచున్నది. మఱియు నిందు సుప్రసిద్ధ పూర్వకవిప్రణీతంబులగు అమూల్యగ్రంథరాజంబులనుండి సముత్కృష్టవర్ణనాసమంజసములగు పద్యరత్నంబులు స్వీకరించుటంజేసి యమ్మహామహుల యమృతవచనంబు లొక్కయెడ విరాజిల్లుచు, గంటికద్దము గట్టినట్లు ‘ ఆంధ్రకవులచరిత్రము ’ బోలె నీపూజనీయులనెల్లర నొక్క సభామంటపము నలంకరింపఁజేసినట్లు ఎంతయు నొప్పారుచున్నది. ఇయ్యది పాఠశాలలయందును గ్రంథాలయంబులయందును ప్రవేశము గావించిన ఆంధ్రలోకమున కెంతయు నుపయోగకరముగా నుండును.

15. చాటుపద్యమణిమంజర్యాదిగ్రంథప్రకాశకులు ఉభయభాషాకవులు నగు మ. రా. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు,

చెన్నపురి.

అయ్యా సంస్కృతమునఁ బద్యరత్నభాండాగారమువలె తెలుఁగున మీరుసంధానించుచున్న వర్ణనరత్నాకరము ప్రచారమునఁ గాంచఁగలదు. కవులకు, విమర్శకులకు, విద్యార్థులకు నిధికరము సాహాయ్యకరము. కవి కాలము, కావ్యాశ్వాసపద్య చేర్చుట యత్యావశ్యకమే. ఇది యెంతో పరిశ్రమచేసినఁగాని కానిపని. నిర్దుష్టముగా నీగ్రంథము ముద్రితమై శీఘ్రముగాఁ బయల్పడి మాబోంట్లకుపకరించుఁగాకయని కోరుచున్నాఁడను. అసామాన్యమయిన మీపరిశ్రమ నభినందించుచున్నాఁడను.

---

౧౬. ప్రబంధమణిభూషణాద్యనేకసద్గ్రంథసంపాదకులు విస్మృతకవిగ్రంథప్రకాశకులు విమర్శకాగ్రేసరులునగు

మ. రా. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు, M. A. చెన్నపట్టణము.

శ్రీమద్దాసరి లక్ష్మణస్వామిగారిచే రచింపఁబడిన వర్ణనరత్నాక

రము నచ్చుటచ్చుటఁ జూచినాఁడను. ఇందుదాహరింపఁబడిన పద్యములకు మూలగ్రంథముల నామములను విషయసూచికను దిలకింపఁగా పెక్కు బహుకాలము బహుగ్రంథములఁ జాలఁ బూనికతోఁ బరీక్షించి మంచి మంచిపరికరణములలోని యుత్కృష్టపద్యములనే యేఱియున్నారని తెలియుచున్నది. నేటికాలపుస్థితిననుసరించి బహుగ్రంథములు సాంతముగాఁజదివి నానాకవుల నానావిషయముల మనోభావముల వ్యక్తులెఱుంగఁ గాలనివారికి నిక్కముగా నీగ్రంథములు నిధిప్రాయములు. ఇందు దేశకాలస్థితులననుసరించి కవికాలనిర్ణయములును బద్యములు గ్రహింపఁబడిన పరికరణములును జూపఁబడియె. కాలనిర్ణయవిషయము చాల సందిగ్ధమై యప్పటికి సపరిష్కృతమైనను గొందఱకది రుచించుననుట నిశ్చయము. భాషయందు గ్రంథకర్తగారికిఁగల యాదరణమును నేతద్భాషాసేవయుఁ దప్పక యెల్లరు మెచ్చుకొనుదురని నమ్ముచున్నాను.

...   ...   ...   ...

...   ...   ...   ...

---

17. ఆంధ్రవాల్మీకిరామాయణాద్యనేక గ్రంథకర్తలగు
మ.రా.శ్రీ ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బారావు
పంతులుగారు, చెన్నపురి.

మదీయగ్రంథప్రకటనమున నాకిహపరలోకముల శాశ్వతస్థానంబు గలిగించి యభినవభోజుఁడని విఖ్యాతిగడించిన శ్రీ పిఠాపురమహారాజులవారి కాశ్రితుండను, నాకుఁ బరమమిత్రులునైన కొత్తపల్లి పద్మనాభశాస్త్రిలవారిచే సాహిత్యాన్నప్రాశముఁ గొన్నవాఁడనునైన దాసరి లక్ష్మణస్వామిచే గ్రథితంబైన వర్ణనరత్నాకరము కవితాకామినికిఁ గ్రొత్తయొంకువలు సంపాదింప సాహిత్యమకరాలయంబున దేవులాడువారికిని సాహిత్యరసాస్వాదనతత్పరులకు నుపకారకరంబగుట యీప్రయత్న మత్యంత శ్లాఘ్యము.

ఉదాహృతపద్యముల కాకరములు వ్రాయుట యత్యంతావశ్యకము.

కవిదేశకాలనిర్ణయము పెక్కురవిషయంబున బురదలోని కంబము. కవితాభాషాపరిణామక్రమజిజ్ఞాసువులకుఁగాక యితరుల కది యనావశ్యకము. కాలనిర్ణయమనుద్దిష్టము. కొందఱకాలమెఱుంగరాదు. ఆవిషయమున శ్రమించుట ప్రయాస మధికము.

ఆధునికకవు లాంధ్రీకరించిన సంస్కృతకావ్యనాటకరత్నములు కొన్నిగలవు. ఇందలివర్ణనలు పూర్వసంస్కృతకవులవే కావున నాధునికులకృతులని నిరసింపఁ గారణము కానరాదు. భాషారచనయాధునికము. విషయము పురాతనమే కావున నాంధ్రీకృతములైన ఋషికాళిదాసాది కవుల గ్రంథములనుండియు గ్రహించుటొప్పు.

వచనములందుఁ గొన్ని యుత్తమవర్ణనములు కానవచ్చుచున్నవి. వచనములనునెపమున వానినిమానక గ్రహింపఁదగును. వర్ణనచమత్కృతి గ్రాహ్యముకాని యది వచనంబున నున్ననేమి? ద్విపదనైననేమి?

ఈగ్రంథము కేవ లాత్యంతప్రయాసకృతమనుటనిస్సంశయము. దీనికై దీర్ఘకాలము శ్రమించి యముద్రితగ్రంథములను సేకరించి పఠించి పద్యరత్నములేఱిన వీరియోర్పు, నోపిక, సాహిత్యపటిమయు శ్లాఘ్యము. ఇది బాలకవులకేగాక ప్రౌఢకవులకును భావమార్గప్రదర్శనంబునను పరాచనలయందును మిక్కిలి తోడుపడఁగలదు. వినోదపఠనమునకును దగియున్నది గావున నిది సమస్తజనులకు నాదరణీయమగు.

**N.B.** — వీరియభిప్రాయానుసరణమేగాక మరికొన్ని విశేషవిషయములును 2 వ భాగమునందు వెలువరింపఁబడును.

---

18. ఆంధ్రపత్రికాధిపతులగు మ. రా. శ్రీ దేశబాంధవ
కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు, చెన్నపట్టణము.

మహారాజశ్రీ దాసరి లక్ష్మణకవిగా రాంధ్రలోకమునకు చితులు. వారు రచియించిన నాటకాదిగ్రంథములు వారిరచనా

సామర్థ్యమును తెలుపుచున్నవి. వారు చిరకాలమునుండియును చాల పరిశ్రమచేసి ఆంధ్రగ్రంథములను చదివి పరిశీలించి "వర్ణనరత్నాకరము" అనుగ్రంథమును సిద్ధముచేసిరి. ఆగ్రంథమునందు మహాకవులు రచియించిన కావ్యాదిగ్రంథములనుండి కాలానుక్రమణముగ వివిధ వర్ణనలను పరిశోధించి ప్రత్యేకశీర్షికలక్రిందను చేర్చిరి. ఈగ్రంథావలోకనమువలన నాంధ్రవాఙ్మయమంతయును మనోగోచరమయి సహజానందము గలుగఁగలదు. వీరేరితీసిన పద్యములన్నియును రత్నములవలె ప్రకాశించుచు మనోహరముగ నున్నవి. ఈగ్రంథము బహుగ్రంథముల సంపుటిగ నున్నది. గ్రంథమును కలిగియున్నవారందరును మహాకవుల సాంగత్యలాభమును బొందఁగలరు. ... ...

... ... ... ...

... ... ... ...

---

**19.** విజ్ఞానచంద్రికాగ్రంథమండలీప్రతిష్ఠాపకులు బహుగ్రంథనిర్మాతలు విజ్ఞానసర్వస్వసంపాదకులునగు

**మ.రా.శ్రీ కొమర్రాజు వెంకటలక్ష్మణరావుగారు, చెన్నపట్టణము.**

శ్రీయుత దాసరి లక్ష్మణకవిగారాంధ్రులయుపయోగార్థము ఆంధ్రవాఙ్మయమునంతను పరిశోధించి కూర్చుచున్న "వర్ణనరత్నాకరము" అనుగ్రంథమును చూచి చాల సంతసించితిని. ఇట్టిపని చేయుటకు నెంతయు సహృదయతయుఁ బాండిత్యమును ఓపికయుఁ గావలయును. ఇయ్యది కవిత్వముచెప్పఁదలఁచినవారికిఁ గల్పవృక్షమువంటిదనుటకు సందేహములేదు. వాఙ్మయచరిత్రయు, ఆంధ్రకవిత్వాభివృద్ధి యెట్లయినదియుఁ దెలిసికొనఁగోరువారికిని ఈగ్రంథము ఎక్కువగా నుపయోగించుననుటకు సందేహములేదు. ఇయ్యది శీఘ్రకాలములోనే ప్రకటింపఁబడునుగాక యని కోరుచున్నాను.

20. శ్రీ విజయనగరమహారాజావారి కళాశాలాపండితులు
శృంగారనైషధవ్యాఖ్యాతనని ద్యాగలు బహుగ్రంథరచయితలునగు
బ్రహ్మశ్రీ కేతవరపు వేంకటశాస్త్రిగారు.

శ్రీయుత దాసరి లక్ష్మణస్వామిగారు కూర్చిన వర్ణనరత్నాకరమను గ్రంథమును జదివితిని. ఆంధ్రప్రబంధములనెడి మహాగహనంబులం బరిభ్రమించి మిక్కిలిగ పరిశ్రమించి మనోభినివేశములవంటి యుత్తమవర్ణనములం బరిశీలించి యుక్తసూక్తిపద్యరత్నంబులను సంపాదించి యొకమాలగా గూర్చి యాంధ్రభాషామతల్లి కంఠసీమ నలంకరించి తదీయకాంతిసంతతులచే నాంధ్రభాషామతల్లికేకాక తత్పుత్రులగు నాంధ్రమహాజనులకుంగూడ వింతవన్నెగల్గించిన శ్రీలక్ష్మణస్వామిగారి పరిశ్రమకలాపంబు శ్లాఘనీయంబు. ఆంధ్రభాషాగ్రంథములం జదువ తీఱికలేనివారికి మనపూర్వకవుల యుత్తమవర్ణనామృతరససారమును రుచిచూపించినందుల కాంధ్రు లెంతయుం గృతజ్ఞత చూపవలయును. పెక్కుగ్రంథములసారము సులభముగా చవిచూచుట కింతకంటె సులభసాధనము మనయాంధ్రమున నిప్పటికి లేదు. ఈగ్రంథ మాంధ్రుల కు నాంధ్రభాషకును మిగుల నావశ్యకము.

---

21. ఆంధ్రగీర్వాణవిద్యాలయాధ్యక్షులగు
మ.రా.శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు,
గోదావరీతీరము కొవ్వూరు.

శ్రీయుత దాసరి లక్ష్మణస్వామిగారిచే సమకూర్పంబడిన వర్ణనరత్నాకరమను గ్రంథమును అందలి పకకమును గాంచితిని. గ్రంథమును చదువుటయే కష్టము. చదివినవానిలో సమానస్కంధములగు భాగములను స్మరించుట మఱికొంత కష్టము. వానినేర్చి కూర్చుట యింకను గష్టము. వీనినన్నిటిని ఆంధ్రవాఙ్మయమునంగల పూర్వగ్రంథముల

నెన్నిఁటినో పరిశోధించి అందముఁగల వర్ణనలను విడదీసి పోగులు ప్రోవులుగా నొక్కచోటఁ గనుబఱచిన లక్ష్మణస్వామిగారి ప్రయత్న మంతయు సంస్తవనీయము. మిగిలినవారిమాట యటుండ విమర్శకలోకమున కీగ్రంథమువలనఁగలుగులాభ మపారము. వీరి మహోద్యమమునకు ఆంధ్రలోకము కృతజ్ఞులు. ఇది శీఘ్రముగ వెలువడి నిర్దుష్టముగ నాంధ్రలోకము గాంచుభాగ్యము సమకూరుఁగాతయని పరమేశ్వరుని వేఁడుచున్నాను. ఇంకను ఆంధ్రవాఙ్మయమున కిట్టిమహోపకారము చేయ లక్ష్మణస్వామిగారి కాయురారోగ్యములు కలుఁగుఁగాక.

---

22. సుప్రసిద్ధవిమర్శకులు సకలజనమనోరంజనాదిమనోహర ప్రబంధసంధానచతురులు నగు

మ. రా. శ్రీ నడకుదుటి వీరరాజుపంతులుగారు, పిఠాపురము.

శ్రీయుత దాసరి లక్ష్మణకవివర్య సంకలితంబగు ‘వర్ణన రత్నాకర’ గ్రంథమును జాలవఱకుఁ బరీక్షించితిని. ఈయన దీనివిషయమునఁ గైకొనిన పరిశ్రమము మిగుల సంస్తవనీయము; ఆశ్చర్యదాయకము. అపారమైన యభిలాషముతోఁ, గడుంగడు శ్రద్ధతో నిట్టి సత్కార్యమునకుఁ బూనిన యిక్కవికి నాంధ్రులందఱును మిక్కిలియు నప్పుపడియుందురని చెప్పఁదగును. శర్కర, తైలము, పిష్టము—వీనిని వేఱుగ ననుభవించుటకంటె వాని నోపికమెయి నొకభక్ష్యముగ నొనరించి యుపయోగించుటవలన నతిశయమైనరుచి గొనవచ్చునట్లే, యాయాగ్రంథభాగములఁ నప్పుడప్పుడు చదువుటవలనఁ గలిగెడు నానందముకంటె నందందలి రసవస్తువర్ణనములనెల్ల నేర్చికూర్చిన యీగ్రంథరాజము తన్నుఁజదువు భాషాభిలాషికి—భాషాభిలాషి కేయననేల ?—విద్యార్థికి, కవికి, పండితునకు—అందఱకును గల్పించుచుంబోలె నతిశయానందముం గూర్చుననుట యతిశయోక్తి గానేరదు. ఈగ్రంథము

నందలి వర్ణనములలోని పద్యములన్నియు, నాయాగ్రంథములలోని వర్ణనములలో మేలైనవియే యగుటంజేసి పాఠకులకు నిసుమంతయు విసువు జనింపనేరదు. ఏతద్వర్ణనసంగ్రహాకార్యమునందు నీతఁడుచేసిన వ్యవసాయము మఱి యేయితరశాస్త్రాభ్యసనమునం దుపయోగించి యుండినను గొప్పపండితుఁడను పదవిం గైకొనియుండును. కాని య ప్పాండిత్యమును గడియించుటవలనఁ గలుగు నల్పకాలస్థాయియగు యశముకంటె నీసంకలితగ్రంథమువలనఁ బొడము సమజ్ఞయే యాచం ద్రార్కముగ నుండునని నిశ్చయముగఁ జెప్పవచ్చును.

ఈగ్రంథమువలన నాంధ్రలోకమున కింకొకగొప్పమేలుగలదు. అది యేదియన, ఏకవియైన, దేనింగూర్చియైన, నేదియే నొకపద్యమును రచియింపవలయునని తలంపుఁగొనుచో, నిందులేని క్రొత్తభావమున కై యాకవి యన్వేషించునట్లు చేయుచు, వినూత్నభావములుగలపద్య ము లాయాకవులచే రచియింపఁబడునట్లు చేయుచు, నాంధ్రభాషాదేవిని నవనవాలంకారకలితను జేయునట్లీగ్రంథ మొనర్పఁగలదని హృదయా నందపూర్వకముగఁ జెప్పుచున్నాను.

23. ఆంధ్రగీర్వాణభాషావిశారదులు కవిశల్లజులు నగు
మ. రా. శ్రీ శ్రీ విక్రమదేవవర్మగారు, విశాఖపట్టణము.

తే. గీ. ఆంధ్రసాహిత్యముకురమ్ము ♦ నాంధ్రకవిత
యనెడి పైఁడివన్నెలఁ గనుఁ♦గొనఁ గనమ్ము
గవులకును రసికులకును ♦ గల్పకమ్ముఁ
బ్రథితవర్ణరత్నాక♦రమ్ము సుమ్ము.

---

24. కవిభూషణ, కవిరాజ, శ్రీరాజావత్సవాయ
వేంకట నీలాద్రిరాజుగారు, తుని.

ఉ. వ్యాకరణం బలంకరణ ♦ వైభవముల్ రసభావపోషణ
స్వీకరణంబు వర్ణన వి♦శేషచమత్కరణం బనంగ నా
నాకవికావ్యలోకమున ♦ నాలుగుసారములందు నిందు సు
స్వీకృత మయ్యె వర్ణనవి♦శేషచమత్కరణం బశేషముల్.

25. అభినవపాండవీయ, హనుమత్పరాభవాది గ్రంథకర్తలును
శ్రీ గంపలగూడెపుఁ గుమారజమీందారుగారును నగు
శ్రీరాజా కోటగిరి వేంకటకృష్ణారావు బహద్దరుగారు,
గంపలగూడెము.

అధికశ్రమంజేసి శ్రీయుత దాసరిలక్ష్మణస్వామిగారు సమకూర్చుచున్న "వర్ణరత్నాకరము" యొక్క ప్రాశస్త్యము వర్ణనాతీతము.

ఈయుత్కృష్టగ్రంథరాజ మాంధ్రభాషాయోషామణికి నూత్న విభూషణము. విమర్శకులకీగ్రంథము కనుంగనుఁ దోఁప్పడఁగలదు. ఆంధ్రలోకము లక్ష్మణకవి కెంతయో కృతజ్ఞత జూపింపవలసి యున్నది. ఆంధ్రమహాశయు లీకవి కార్థికముగఁ గూడఁ దోడ్పడి గ్రంథముద్రణము సర్వసుపరిసమాప్తి నొనర్తురుగాక యని యాసించుచున్నాను.

26. ఆంధ్రభారతీతీర్థప్రధానులు మ. రా. శ్రీ బుఱ్ఱా శేషగిరిరావు గారు, M. A. విజయనగరము.

మహారాజశ్రీ దాసరి లక్ష్మణస్వామిగారు సమకూర్చి ప్రకటించుచున్న "వర్ణనరత్నాకరము" అనే తెలుగుగ్రంథములో కొన్ని భాగములు నాకు వినిపించి నాయభిప్రాయము కోరినారు. ఆంధ్రకావ్యమహోదధినుండి యేరిన జాతిరత్నము లీవర్ణనలు. ఇవి పలువిధములై ఆంధ్రకవితాచరిత్రపరిణామమును సూచించును. ఈవర్ణనలుగల యసలుకావ్యములు శృంగారప్రధానములగు ప్రబంధములు. ఈప్రబంధములు పాడినపాటనే పాడుచుండుటచేత నేమి మనుచరిత్ర, వసుచరిత్ర, కళాపూర్ణోదయములవంటివి మాత్రము ప్రచారములో నుంచి మిగిలినవాటిని "ప్రొయ్యినిడవలయు" నని కొందరు మహనీయు లందురు. గాని ఆంధ్రదేశమందలి దేవాలయకట్టడముల వలె ఈకావ్యములుకూడా ఏకపక్కిగా నున్నప్పటికిని సమాదరణీయములును, హృదయాకర్షకములును, అగు చిత్రకల్పనలతో భాషాశిల్ప నైపుణ్యమునందు ప్రత్యేకతను చూపుచున్నవి. ఈసంగతి యీకూర్పులో విశదము కాగలదు.

పలువురు పండితు లిదివరకే చెప్పియున్న ట్లీగ్రంథము కవులకు, విద్యార్థులకు విమర్శకులకు సాహిత్యపరులకును అత్యంతోపయోగకరము కాగలదు. ఈసంఘటనప్రయత్నము చాలాప్రశంసనీయము.

27. రావుసాహేబ్ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు B. A. పర్లాకిమిడి.

మీరు ప్రకటించు "వర్ణనరత్నాకరము" మొదటి రెండుభాగములు చూచినాను. ఇది సుభాషితరత్నభాండాగారమువలెనే అనేకవిధములుగా ఆంధ్రులకు ఉపయోగం కాగలదని నానమ్మకం.

ఇందులో అముద్రితగ్రంథములనుండికూడా పద్యము లెత్తి ప్రకటించినారు. తాళపత్రగ్రంథములు సులభముగా దొరకనివారికి

ఈపద్యములు చదవగానే ఆగ్రంథముల గురించి కొంతవరకు తెలుసుకొనుటకు అవకాశము కలుగుతుంది. ఆంధ్రసారస్వతములో ఉన్న వర్ణనరత్నము లన్నిటిని సంగ్రహించి ఆంధ్రులకు మీరందజేసినారు. ఈపని ఎంతకష్టమైనదో అనేక గ్రంథములు పరిశీలిస్తూఉన్న వారికి బోధపడుతుంది. మీపరిశ్రమలవల్ల ఆంధ్రుల కెంతో మేలు కలుగవచ్చునని నానమ్మకం.

---

28. శతావధానులును శ్రీతిరుపతివేంకటకవులలో నొకరునగు
బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, కడియము.

శ్రీయుత దాసరిలక్ష్మణస్వామిగారు తాము ప్రయత్నపూర్వకముగ బహుగ్రంథములనుండి సంగ్రహించి రచించి ముద్రింపించుచున్న "వర్ణనరత్నాకరగ్రంథము" నాకుఁ జూపిరి. స్థాలీపులాకన్యాయమునఁ జదివి చూచితిని. ఈపుస్తకము తెలుఁగుబాసలోఁ బాండిత్యము సంపాదించుకోఁగోరు భాషావిద్యార్థులకుఁ గవులకు, విమర్శకులకు సత్యంతోపకారకంబని యిదివఱకు నభిప్రాయము లొసఁగిన పండితుల యభిప్రాయముల యందలి సంగతులతో నేను గూడ నేకీభవించుచున్నాను.

---

29. మహోపన్యాసకులును, విమర్శకులు నగు బ్రహ్మశ్రీ
కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, కాకినాడ.

శ్రీయుత దాసరిలక్ష్మణస్వామిగారు విరచించిన "వర్ణనరత్నాకర" మహాగ్రంథరాజము నక్కడక్కడ వినియున్నాను. ఇది యాంధ్రసారస్వతమునకు నమూల్యాలంకారముగ నుండుననుటకు నేవిధమగు సందియము లేదు. ఇయ్యది కవులకు, విమర్శకులకు, చరిత్రప్రియులకు భాషాభిమానులకు మిగుల సాహాయ్యకారిగా నుండుటయే గాక పాఠకజనులకుఁ గూడ నానందదాయకమ్మును, వివేకప్రదమ్మును నై యలరారుచుండును. ఈయుద్గ్రంథమును విరచించుటకై గ్రంథకర్తగారు తీసికొనిన శ్రమ కడుంగడు శ్లాఘనీయము. సారస్వతవిషయములగు స

ర్వవిశేషములును గల యిట్టి యుద్గ్రంథము లిదివఱ కాంధ్రమున లేవు. నేటి కాకొఱంత తీరినదని చెప్పుట కెంతయు సంతసముగ నున్నది.

---

30. మ. రా. శ్రీ పప్పు మల్లికార్జునరావు గారు B. A. డిప్యూటీ తహశ్శీల్దారు, పిఠాపురం.

శ్రీయుత దాసరిలక్ష్మణస్వామిగారిచే సమకూర్పఁబడిన "వర్ణన రత్నాకరము"ను తిలకించినాఁడ. అయ్యది భాషాయోష కొక యమూల్యభూషణంబగుటకు సందియము లేదు. పూర్వకవు లందఱు సభ చేసియుండి యొక్కొక్క విషయము పోటాపోటిగ వర్ణించుచున్నట్లు చదువరుల కీగ్రంథరాజము చదువుపట్ల స్ఫురింపఁజేయును. ఇది క్రొత్త వారికి నాంధ్రగ్రంథములయెడ నభిరుచి జనింపఁ జేయుచుఁ గవులకును, వ్యాఖ్యాతలకును బరమప్రయోజనకారిగా నుండుననుట నిర్వివాదాంశము. ఇందలి వర్ణనలు కాలక్రమము ననుసరించియే యుదాహరింపఁ బడుటచేత మనపూర్వు లొక్కొక్కవిషయ మెట్లు పెంపు చేసి క్రమముగా వర్ణించిరో దెలిసికొనుట కవకాశము గలుగుచున్నది. ఇట్లు వ్రాయుట చాల దుస్సాధమగు విషయ మనుటలో భిన్నాభిప్రాయ ముండదు. ఎన్నియో రాత్రులు శ్రమపడి యెన్నియో గ్రంథములు పరిశీలించి హృద్యమగు వర్ణనలయందు సప్రీతి కలిగియుండి వాని నొక్కచోఁ బ్రకటింపఁ గలిగిన యీ గ్రంథకర్తగా రాంధ్రపాఠకలోకమునకు మహోపకారము గావించి వారి కృతజ్ఞతకు శాశ్వతముగాఁ బాత్రులై యున్నారు.

పూర్వగ్రంథాభిమానము సడలుచున్న యీకాలములో సారవంతములుకాని స్వతంత్రకల్పనాగ్రంథములకంటెఁ బాటుపడి రచించెడి యిట్టి గ్రంథములే భాషకు పెక్కుమడుంగు లుపకారము చేయునని నాయభిప్రాయము. ఇట్టి వింకను విరచించుటకు దేవుఁడీగ్రంథకర్త గారి కాయురారోగ్యైశ్వర్యాభివృద్ధు లొసంగుఁగాత.

శ్రీ పిఠాపురం హైస్కూలు పండితులు

బ్రహ్మశ్రీ పెద్ద్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

శ్రీయుతులగు దాసరి లక్ష్మణస్వామిగారిచేఁ గూర్పఁబడిన "వర్ణనరత్నాకరము"ను స్థాలీపులాకన్యాయముగాఁ జదివితిని. ఆంధ్ర మహాకవుల యల్లిక జిగిబిగువులు ముద్దుపల్కులు పదగుంభనములు నొక్కయెడఁ గూర్చిన వీరిపరిశ్రమ మతిశ్లాఘనీయము. వర్ణనరత్నాకరముఁ జదివినచో వర్ణనవిషయమునఁ జదువరుల కన్యగ్రంథపఠన మనవసరమనియు వర్ణనరత్నాకరముఁ జదువనిచో నన్యగ్రంథపఠనపరిశ్రమము వ్యర్థమనియుఁ దలఁతును. భవిష్యత్తున నీగ్రంథరాజ మాంధ్రవిశ్వవిద్యాలయపాఠ్యగ్రంథములలో నగ్రగణ్యమగుగాతమనియు లక్ష్మణస్వామిగారి కితోధికమగు పరిశోధనాశక్తి యలవడుఁగాక యనియు దేవదేవుని వేఁడుచున్నాను.

శ్రీ దాట్ల సీతారామరాజుగారు, జొన్నవలస.

ఉ ఎన్నిక కెక్కుపద్యము ల । నేకము గూరిచి వర్ణనాబ్ధి వి
ద్వన్నికరంబు గన్గొని సె । బా సనున ట్లొనరించి తెంతయే
ని న్నిను మెచ్చఁగా వలదె । నీబుణ మీఁగఁగలేరు పాఠకుల్
సన్నుతిఁ గాంచు నీయశ మ । జస్రము దాసరి లక్ష్మణాహ్వయా.

*   *   *   *   *   *

క. పురుషార్థంబులు నాలుగు
కరతలధాత్రియును బోలె । ఘటియిల్లును నీ
వరవర్ణనరత్నాకర
మురుతరభక్తిం బఠించు । యోగ్యుల కెల్లన్.

# కృతజ్ఞత.

---

నే నీవర్ణనరత్నాకరము సమకూర్చుట కుద్యమించి సుమారు పదునాల్గువత్సరములు కావచ్చినవి. పదునొకండవశతాబ్ది మొదలిరువదియవశతాబ్దివఱకుఁ గల కవీంద్రవిరచితము లగుముద్రితాముద్రిత ప్రబంధము లత్యంతప్రయత్నమున సంపాదించి యందలివర్ణనాంశము లంగల పద్యరత్నంబుల నా నేర్చుకొలందియును, కవితావిమర్శనానికషాయమాణులయిన సహాయసుధీమణుల మనీషావిశేషంబునను సంఘటించుచు నిప్పటి కొక్కదరిఁ జేర్చినాఁడను.

ఇందు నేకాభిప్రాయములతో నుండు పలువురకవుల పద్యములందు ప్రాయికముగా భావభేదంబు ననుసరించి వర్ణనాంతరములం గైకొంటిని. బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులుగారి యభిప్రాయము ననుసరించి కవికాలక్రమమును, మ. రా. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు సూచించిన విధముగ నాశ్వాసాదికసంఖ్యయును సాధ్యమయినంతవఱకు నిరూపించితిని. కవుల కాలనిర్ణయాదికము రావుబహద్దరు కందుకూరి వీరేశలింగముపంతులుగారి యాంధ్రకవులచరిత్రమునం దున్నంతవఱకుఁ దదనుసరణంబునను, తదితరకవుల కాల మితరాధారములవలనను గావించితిని. తక్కుంగల కొందఱకవుల కాలము దృఢముగ నిశ్చయింపఁదగిన యాధారములు లభింపలేదు. అలభ్యము లగు నథర్వణభారతము మున్నగు నయిదారుగ్రంథములయందలి పద్యములను శ్రీకందుకూరి వీరేశలింగముపంతులుగారి యాంధ్రకవులచరిత్రనుండియే గ్రహించితిని. కొందఱ యభిప్రాయానుసారము వర్తమానకవుల ప్రబంధములనుండికూడఁ గొన్నివర్ణనము లేర్చి కూర్పఁదలంచితిని. కాని ప్రాచీనకవిపుంగవులపద్యములే వేలకు మీఱియుండి యనేక

ములు తగ్గింపవలసివచ్చినందున నట్టిది మొదవ భాగముగా ననుసంధింప నెంచితిని. కొందఱ ప్రబోధంబుననుసరించి రసభేదంబులును బ్రకీర్ణ భాగంబునఁ గొన్నివిశేషంబులును నవకాశమునుబట్టి చేర్చితిని.

అనేక కవిబ్రహ్మలచే సృష్టింపఁబడిన మహాకావ్యప్రపంచమంత యు నవలోకించి నిర్వచించు టెంతటివారికిని సాధ్యము కాదు. కావున మందధీయుతుఁడనగు నాయం దేలోపము నుండదని వాకొనఁజాలను. ఏగ్రంథమందైన నుత్తమజాతిపద్యరత్నంబులు ప్రమాదవశమున నాకుఁ గోచరింపనివి కొన్ని మిగిలియుండవచ్చును. మఱియు నా కలభ్యము లగుపొత్తము లింక ననేకములు మిగిలియుండవనికూడ నేఁ జెప్ప సాహ సింపను. ఇంకను మాఱుమూలలనుండు గ్రంథముల సేకరింపఁ దలం పుగలిగియున్నను సుమారు నాలుగేండ్లకుఁ బూర్వమునుండియే నాహి తులును నభిప్రాయప్రదాతలును దీనిముద్రింపించుటకై పలుమఱు బ్రే రేపించుచుండుటంబట్టి యిప్పుడ యీగ్రంథ మాంధ్రలోకమునకు సమర్పింప సాహసించినందులకు మన్నించి లోపముల క్షమింప విబుధుల వేఁడికొనుచున్నాఁడను.

ఏప్రభూత్తముఁ డాంధ్రదేశంబున భాషామతల్లి కూఁతకట్టయై సర్వవిధంబుల శ్లాఘ్యతనొంది వర్ధమానుఁ డగుచున్నవాఁడో యా పీఠపురాధీశ్వరుని ప్రాపుఁ జేరియున్నవాఁడ నగుటం జేసి యేత న్మాత్రము భాషాసేవ యొనర్పఁగలిగినందులకు బ్రహ్మానంద మొందుచు శ్రీ మహారాజావారికిని మఱియు నీగ్రంథసంఘటనంబున ననేకవిధము లఁ దోడ్పడిన సహృదయులకందఱకును సాష్టాంగనమస్కారము లాచ రించుచుఁ గృతజ్ఞుఁడ నగుచున్నాఁడను

గ్రంథకర్త.



3, 4 భాగములు (600 పుటలు) ఫెదర్ వెయిట్

కాగితములపై

ముద్రింపఁబడుచున్నవి.

# గ్రంథాదిప్రణాళిక.

| గ్రంథములనామములు. | గ్రంథకర్తలనామములు. | శతాబ్ది |
|---|---|---|
| అచ్చతెలుఁగురామాయణము | కూచిమంచి తిమ్మకవి [ర్యులు | 17 |
| అచలాత్మజాపరిణయము | తిరుమలబుక్కపట్టణవేంకటాచా | 18 |
| అనిరుద్ధచరిత్రము | కనుపర్తి అబ్బయామాత్యుఁడు | 18 |
| అధ్యాత్మరామాయణము | కాణాద పెద్దనసోమయాజి | 17 |
| అప్పకవీయము | కాకునూరి అప్పకవి | 17 |
| అభాగ్యోపాఖ్యానము | కందుకూరి వీరేశలింగకవి | 20 |
| అష్టమహిషీకళ్యాణము | తాళ్లపాక తిరువేంగళనాథుఁడు | 16 |
| అహల్యాసంక్రందనీయము | సముఖ వేంకటకృష్ణప్పనాయఁ | 18 |
| ఆనందసుందరీచాతుర్యవిలాస | బసవరాజు నాగేంద్రకవి [ము | 18 |
| ఆముక్తమాల్యద [ము | కృష్ణదేవరాయలు | 15 |
| ఇందుమతీపరిణయము | కుమారధూర్జటి | 16 |
| ఇందుమతీపరిణయము | మతుకుమల్లి నృసింహకవి | 19 |
| ఉత్తరహరివంశము | నాచన సోమనాథుఁడు | 14 |
| ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము | తక్కెళ్ళపాటి లింగన | 18 |
| ఉత్తరరామాయణము | కంకంటి పాపరాజు | 18 |
| ఉద్భటారాధ్యచరిత్రము | తెనాలి రామకృష్ణకవి | 16 |
| ఉషాకళ్యాణము | కైప మాయనకవి | 18 |
| ఒడయనంబివిలాసము | అజ్జరపు పేరయకవి | 18 |
| ఓఘవతీపరిణయము | అక్కినేపల్లి నృసింహకవి | 18 |
| కకుత్స్థవిజయము | మట్లి అనంతభూపాలుఁడు | 16 |
| కళావిలాసము | నన్నెచోడదేవకవి | 12 |
| కళాపూర్ణోదయము | పింగళి సూరన్న | 16 |

| | | |
|---|---|---|
| కవికర్ణరసాయనము | సంకుసాల నృసింహకవి | 16 |
| కవిరాజమనోరంజనము | కనుపర్తి అబ్బయామాత్యుఁడు | 18 |
| కవిజనరంజనము | అడిదము సూరకవి | 18 |
| కవిచకోరచంద్రోదయము | అల్లమరాజు రామకృష్ణకవి | 19 |
| కవిజనచకోరచంద్రోదయము | నారపరాజు కాంతకవి | 19 |
| కార్తికమాహాత్మ్యము | కుందుర్తి వేంకటాచలకవి | 18 |
| కార్తికమాసమాహాత్మ్యము | మండపాక కామేశ్వరకవి | 19 |
| కాళహస్తిమాహాత్మ్యము | ధూర్జటికవి | 16 |
| కాళిందీపరిణయము | శొంఠి భద్రాద్రిరామకవి | 19 |
| కావ్యాలంకారచూడామణి | విన్నకోట పెద్దన్న | 14 |
| కాశీఖండము | శ్రీనాథకవి | 14 |
| కిరాతార్జునీయము | గోపాలునిసింగయ్య | 18 |
| కుచేలోపాఖ్యానము | గట్టుప్రభువు | 18 |
| కుబ్జాకృష్ణవిలాసము | అక్కినప్రగడ హరిదాసు | 18 |
| కుమారనృసింహము | కొక్కొండ వేంకటరత్నశర్మ | 19 |
| కుమారసంభవము | నన్నెచోడ దేవకవి [కుఁడు | 12 |
| కువలయాశ్వచరిత్రము | సవరము చిననారాయణనాయ | 16 |
| కృష్ణకల్యాణము | అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి | 19 |
| కృష్ణభూపాలీయము | చంద్రకవి | 19 |
| కృష్ణరాయవిజయము | కుమారధూర్జటి | 16 |
| కృష్ణజన్మఖండము | గోపీనాథ వేంకటకవి [ధాని | 19 |
| కృష్ణార్జునసంవాదము | వెలిచెరుకుల వేంకటరామప్ర | 19 |
| కృష్ణార్జునచరిత్రము | మంత్రిప్రెగడసూర్యప్రకాశకవి | 19 |
| కృష్ణామాహాత్మ్యము | తాతంభట్టుగురుమూర్తిశాస్త్రి | 19 |
| కృష్ణాభ్యుదయము | మండపాక పార్వతీశ్వరకవి | 19 |
| కేయూరబాహుచరిత్రము | మంచనకవి | 13 |
| కొక్కోకము | ఎఱ్ఱనకవి | 16 |
| కౌసల్యాపరిణయము | శ్రీపాద వేంకటాచలకవి | 19 |

| | | |
|---|---|---|
| క్రీడాభిరామము | వల్లభరాయకవి | 15 |
| గణోదయము | చిలకమఱ్ఱి నారాయణకవి | 19 |
| గయోపాఖ్యానము | రామనామాత్యుఁడు | 18 |
| గాధేయోపాఖ్యానము | అనంతనార్యుఁడు | 18 |
| గంగాగౌరీవిలాసము | వీరనార్యుఁడు | 17 |
| ఘటికాచలమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణకవి | 16 |
| చంద్రభానుచరిత్రము | తరిగొప్పుల మల్లనమంత్రి | 16 |
| చంద్రరేఖావిలాపము | కూచిమంచి జగ్గకవి | 16 |
| చంద్రదేవోపాఖ్యానము | ధూళిపాళ కృష్ణకవి | ... |
| చంద్రాంగదచరిత్రము | పైడిమఱ్ఱి వేంకటపతి | 17 |
| చంద్రికాపరిణయము | సురభిమాధవరాయప్రభువు | 18 |
| చంపూరామాయణము | ఋగ్వేదకవి వేంకటాచలకవి | 17 |
| చమత్కారమంజరి | సింహాద్రి వేంకటాచార్యుఁడు | 17 |
| చారుచర్య | మంత్రి యప్పన్న | 13 |
| చారుచంద్రోదయము | చెన్నమరాజు చెన్నమరాజు | 16 |
| చిత్రభారతము | చరిగొండ ధర్మన్న | 16 |
| చిత్రసీమ | కొండి భద్రాద్రిరామకవి | 19 |
| చెన్నపురీవిలాసము | మతుకుమల్లి నృసింహకవి | 19 |
| చెన్నబసవపురాణము | అత్తనూరి పాపయకవి | 18 |
| చౌడేశ్వరీవిలాసము | నన్నయభట్టు | 11 |
| జానకీరాఘవము | బేతపూడి కృష్ణయ్య | 18 |
| జాహ్నవీమాహాత్మ్యము | ఏనుఁగు లక్ష్మణకవి | 18 |
| జైమినిభారతము | పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి | 14 |
| తపతీసంవరణోపాఖ్యానము | అద్దంకి గంగాధరకవి | 16 |
| తారకబ్రహ్మరాజము | చింతగుంట రాఘామాధవకవి | 1[illegible] |
| తారాశశాంకవిజయము | శేషము వేంకట[illegible] | [illegible] |
| తాలాంకనందనీపరిణయము | మరింగంటి సింగరాచార్యులు | [illegible] |
| దశకుమారచరిత్రము | కేతనకవి | [illegible] |

| | | |
|---|---|---|
| దశరథరాజనందనచరిత్రము | మరింగంటి సింగరాచార్యులు | 17 |
| దశావతారచరిత్రము | ధరణిదేవుల నాగయామాత్యుఁ | 18 |
| ద్వాత్రింశత్సాలభంజికాకథలు | కోవలె గోపరాజు [డు | 17 |
| దిలీపచరిత్రము | కొటికలపూడి కృష్ణకవి | 18 |
| ద్రౌపదీపరిణయము | తిరుమలరాజ సూరపరాజకవి | 18 |
| ధనాభిరామము | నూతనకవి సూరన | 17 |
| ధరాత్మజాపరిణయము | క్రొత్తలంక మృత్యుంజయకవి | 19 |
| ధర్మఖండము | ఈదురుపల్లి భవానిశంకరుఁడు | 18 |
| ధర్మాంగదచరిత్రము | దాసరాజు | ... |
| ధీరజనమనోవిరాజితము | తెనాలి రామలింగకవి | 17 |
| నయనోల్లాసము | దేవులపల్లి వేంకటకృష్ణకవి | 19 |
| నరసభూపాలీయము | మూర్తికవి | 16 |
| నరసభూపాలరాజీయము | సోమశేఖరకవి | 19 |
| నలచరిత్రము | సిరిప్రగడధర్మయామాత్యుఁడు | 17 |
| నలచరిత్రము (ద్విపద) | చక్రపురి రాఘవాచారి | 17 |
| నాగరఖండము | తుర్కారాజకవి, అయ్యంకిబా | 16 |
| నాగ్నజితీపరిణయము | వల్లూరి నరసింహాకవి [లసరస్వతి | 18 |
| నాచికేతోపాఖ్యానము | మిక్కిలి మల్లికార్జునుఁడు | 17 |
| నారసింహపురాణము | హరిభట్టు | 17 |
| నాసికేతూపాఖ్యానము | దగ్గుపల్లి దుగ్గయ్య | 15 |
| నారాయణాచలమాహాత్మ్యము | అల్లమరాజు రంగధామకవి | 18 |
| నిరంకుశోపాఖ్యానము | కందుకూరి రుద్రకవి | 16 |
| నిర్వచనోత్తరరామాయణము | తిక్కన | 13 |
| నిర్వచనవిచిత్రరామాయణము | వేల్పూరి వేంకటకవి | 19 |
| నీతిసారము | ప్రతాపరుద్రకవి | 12 |
| నీతిశాస్త్రముక్తావళి | బద్దెనకవి | 11 |
| నీలకంఠలావిలాసము | తెలగాన. నీలకంఠకవి | |
| నీలకంఠలీవిలాసము | మహాభూరి పట్టియ్య | |

| | | |
|---|---|---|
| నీలాసుందరీపరిణయము | కూచిమంచి తిమ్మకవి | 17 |
| నృసింహపురాణము | ఎఱ్ఱాప్రెగడ | 13 |
| నృసింహవిలాసము | పైడిపాటి వేంకటనృసింహకవి | 17 |
| పంచతంత్రము | బైచరాజు వేంకటనాథుఁడు | 15 |
| పంచతంత్రము | దూబగుంట నారాయణకవి | 15 |
| పండితారాధ్యచరిత్రము | పాలకురికి సోమనాథుఁడు | 15 |
| పట్టాభిరామాయణము | ఘట్టు వేంకటరామకృష్ణకవి | 18 |
| పద్మపురాణము | మడికి సింగన్న | 15 |
| పద్మినీపరిణయము | ఉన్నవ యోగానందసూరి | ... |
| పరమయోగివిలాసము | తిమ్మనృపాలుఁడు | 16 |
| పర్వతపురాణము | శేషనాథార్యుఁడు | 18 |
| పలునాటివీరచరిత్రము | శ్రీనాథకవి | 14 |
| పాండురంగమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణకవి | 16 |
| పాంచాలీపరిణయము | కాకమాని మూర్తి కవి | 17 |
| పారిజాతాపహరణము | నంది తిమ్మన్న | 15 |
| పార్వతీపరిణయము | కోటి రఘునాథతొండమాన్ | 18 |
| ప్రద్యుమ్నచరిత్రము [విలాసము | పొన్నాడ పెద్దిరాజు | ... |
| ప్రబంధరాజవేంకటేశ్వరవిజయ | గణపవరపు వేంకటకవి | 17 |
| ప్రబంధరాజశిరోభూషణప్రకృష్టబలరామచరిత్రము | గుడారు వేంకటదాసకవి | 18 |
| ప్రబోధచంద్రోదయము | నందిమల్లయ్య, ఘంటసింగన్న | 15 |
| ప్రభావతీప్రద్యుమ్నము | పింగళి సూరన్న | 16 |
| ప్రభులింగలీల | పిడుపర్తి బసవప్ప | ... |
| ప్రభులింగలీల (ద్విపద) | పిడుపర్తి సోమనాథుఁడు | 16 |
| బలరామక్షేత్రమాహాత్మ్యము | మండపాక కామేశ్వరశర్మ | 19 |
| బసవపురాణము (ద్విపద) | పాలకురికి సోమనాథుఁడు | 12 |
| బసవపురాణము | పిడుపర్తి సోమనాథుఁడు | 16 |
| బహులాశ్వచరిత్రము | దామెరల వేంగళభూపాలుఁడు | 16 |

| | |
|---|---|
| బిల్వేశ్వరీయము | కొక్కొండ వేంకటరత్నశర్మ |
| బిల్హణీయము | చిత్రకవి సింగరార్యుఁడు |
| బృందావనవిహారము | దామరాజు లక్ష్మీనారాయణ |
| బ్రహ్మోత్తరఖండము | శ్రీధరమల్లె వేంకటరామకవి |
| భద్రాపరిణయము | అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి |
| భరతాభ్యుదయము | మాడభూషి వేంకటాచార్యుఁడు |
| భర్తృహరిసుభాషితము | ఏనుఁగు లక్ష్మణకవి |
| భర్తృహరిసుభాషితము | ఎలకూచి బాలసరస్వతి |
| భల్లాణచరిత్రము | పోచిరాజు వీరన్న |
| భాగవతము | బమ్మెర పోతనామాత్యుఁడు |
| భానుమతీపరిణయము | రెంటూరి రంగరాజు |
| భారతము | నన్నయభట్టాదులు |
| భారతము | అథర్వణాచార్యులు |
| భార్గవపురాణము | కాండూరి వేంకటదాసకవి |
| భీమేశ్వరపురాణము | శ్రీనాథకవి |
| భోజరాజీయము | అనంతామాత్యుఁడు |
| భోజసుతాపరిణయము | కోటీశ్వరకవి |
| మత్స్యపురాణము | హరిభట్టు |
| మదనసాయకవిలాసము | చదువుల సోమలింగయ్య |
| మనుచరిత్రము | అల్లసాని పెద్దన |
| మహేంద్రవిజయము | దేవులపల్లి సుబ్బరాయకవి |
| మార్కండేయపురాణము | మారన |
| మిత్రవిందాపరిణయము | కుందుర్తి వేంకటాచలకవి |
| మిత్రవిందాపరిణయము | రావుజనార్దనరంగారావుగారు |
| ముకుందవిలాసము | కాణాద పెద్దనసోమయాజి |
| మూర్తిత్రయోపాఖ్యానము | దంతులూరి బాపరాజు |
| మైరావణచరిత్రము | మాడయకవి |
| యతిరాజవిజయము | దేవులపల్లి సుబ్బరాయకవి |

| | | |
|---|---|---|
| యయాతిచరిత్రము | పొన్నికంటి తెలగనార్యుఁడు | 16 |
| యాజ్ఞవల్క్యచరిత్రము | గట్టుప్రభువు | 18 |
| యాదవరాఘవపాండవీయము | నెల్లూరి వీరరాఘవకవి | 18 |
| యామినీపూర్ణతిలకావిలాసము | చళ్ళపిళ్ళ నరసకవి | 18 |
| రంగరాయచరిత్రము పద) | దిట్టకవి నారాయణకవి | 18 |
| రంగనాథరామాయణము (ద్వి | రంగనాథుఁడు | 13 |
| రంగనాథరామాయణము ,, | కాచభూపతి, విఠ్ఠలరాజు | 13 |
| రంభానలకూబరవిలాసము | బండి వెంకటస్వామినాయనికవి | 19 |
| రఘురామచరిత్రము | కృష్ణగిరి కృష్ణకవి | 19 |
| రసికజనమనోభిరామము | కూచిమంచి తిమ్మకవి | 17 |
| రసికజనమనోరంజనము | కందుకూరి వీరేశలింగకవి | 20 |
| రాఘవపాండవీయము | పింగళి సూరన్న | 16 |
| రాఘవపాండవయాదవీయము | అయ్యగారి వీరభద్రకవి | 19 |
| రాజశేఖరచరిత్రము | మాదయగారి మల్లన | 16 |
| రాజవాహనవిజయము | కాకమాని మూర్తికవి | 17 |
| రాజశేఖరవిలాసము | కూచిమంచి తిమ్మకవి | 17 |
| రాధామాధవసంవాదము | వెలిదండ్ల వేంకటపతి | 18 |
| రాధాకృష్ణసంవాదము | మండపాక పార్వతీశ్వరకవి | 19 |
| రాధికాసాంత్వనము | ముద్దుపళని | 18 |
| రామచంద్రోపాఖ్యానము | వారణాసి వేంకటకవి | 19 |
| రామచంద్రోపాఖ్యానము | మిక్కిలి మల్లికార్జునుఁడు | 19 |
| రామవిలాసము | ఏనుఁగు లక్ష్మణకవి | 18 |
| రామరాయవిలాసము | దేవులపల్లి సుబ్బరాయకవి | 19 |
| రామాయణము | భాస్కరాదులు | 14 |
| రామాయణము | మొల్ల | 16 |
| రామాయణము | గోపీనాథ వేంకటకవి | 19 |
| రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రకవి | 16 |
| రామేశ్వరమాహాత్మ్యము | ఏనుఁగు లక్ష్మణకవి | 18 |

| | | |
|---|---|---|
| రావువంశముక్తావళి | దేవులపల్లి వేంకటకృష్ణకవి | 19 |
| రుక్మాంగదచరిత్రము | ప్రౌఢకవి మల్లనార్యుఁడు [డు | 14 |
| రుక్మిణీకళ్యాణము | జన్నాడ వేంకటరంగాచార్యుఁ | 19 |
| రుక్మిణీపరిణయము | కూచిమంచి తిమ్మకవి | 17 |
| రుక్మిణీపరిణయము | సత్యవోలు భగవత్కవి [రులు | 18 |
| రెడ్డిమతశాస్త్రము | అయ్యలరాజు, అయ్యలభాస్క | 18 |
| లంకావిజయము | పిండిప్రోలు లక్ష్మణకవి | 18 |
| లక్ష్మీవిలాసము | రాయసము వేంకటపతి | 16 |
| లక్ష్మీనారాయణపరిణయము | శివపల్లి సర్వోత్తమకవి | 18 |
| వరాహపురాణము | నందిమల్లయ్య, ఘంటసింగన్న | 15 |
| వరాహపురాణము | హరిభట్టు | 17 |
| వల్లీవల్లవోల్లాసము | మాడభూషినృసింహాచార్యుడు | 19 |
| వసుచరిత్రము | రామరాజభూషణుఁడు | 16 |
| వాల్మీకిచరిత్రము | రఘునాథభూపాలుఁడు | 17 |
| వాసవదత్తాపరిణయము | వక్కలంక వీరభద్రకవి | 18 |
| వాసవదత్తాపరిణయము | ఎఱ్ఱమిల్లి లక్ష్మీనారాయణ | 19 |
| విక్రమసేనము | చిమ్మపూడి యమరేశ్వరుఁడు | 13 |
| విక్రమార్కచరిత్రము | జక్కనకవి | 14 |
| విజయసేనము | తిక్కనసోమయాజి (?) | 13 |
| విజయవిలాసము | చేమకూర వేంకటకవి | 17 |
| విజయనందనవిలాసము | మంగళగిరి ఆనందకవి | 18 |
| విజ్ఞానేశ్వరము | కేతన | 13 |
| విజ్ఞానప్రదీపిక | చెన్నవీరయ | 19 |
| విప్రనారాయణచరిత్రము | చదలువాడ మల్లయకవి | 16 |
| విశ్వకర్మపురాణము | వీపూరి వేంకటాచార్యుఁడు | [illegible] |
| విశ్వగుణాదర్శనము | తిరుమలబుక్కపట్టనచినతాతా | 19 |
| విష్ణుపురాణము | వెన్నెలకంటిసూరన్న [చార్యుడు | 15 |
| విష్ణుమాయావిలాసము | రోసనూరి వేంకటపతి | 17 |

| | | |
|---|---|---|
| శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనకుశ చరిత్రము | ముచ్చు వేంకటకవి | 19 |
| శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధము | కందుకూరి వీరేశలింగకవి | 20 |
| శృంగారనైషధము | శ్రీనాథకవి | 14 |
| శృంగారరసమంజరి | గుడిపాటి కోదండకవి | 18 |
| శృంగారరసాలవాలము | వెణుతుర్ల వడ్డికవి | 18 |
| శేషధర్మములు | అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి | 19 |
| శ్రీరంగమహత్త్వము | భైరవకవి | 15 |
| శ్రీరంగమాహాత్మ్యము | కట్టా వరదరాజేంద్రకవి | 17 |
| శ్రీరంగమాహాత్మ్యము | నల్లాన నృసింహాచార్యుఁడు | 18 |
| శ్రీరామస్తవరాజము | ముమ్మిడి మల్లనామార్యుఁడు | ... |
| షట్చక్రవర్తిచరిత్రము | మల్లారెడ్డి | 16 |
| సంవరణచరిత్రము | తెనాలిరామకృష్ణకవి | 16 |
| సకలకథాసారసంగ్రహము | అయ్యలరాజు రామభద్రుఁడు | 16 |
| సత్యభామాపరిణయము | జిఱుమర్తి నరసింహకవి | 19 |
| సత్యభామాసాంత్వనము | కామేశ్వరకవి | 17 |
| సమీరకుమారవిజయము | పుష్పగిరి తిమ్మన్న | 18 |
| సర్పపురమాహాత్మ్యము | కూచిమంచి తిమ్మకవి | 17 |
| సర్వకామదాపరిణయము | శిష్టు కృష్ణమూర్తి | 18 |
| సానందోపాఖ్యానము | బాంధవకోటి శివరామకవి | 16 |
| సారంగధరచరిత్రము | చేమకూర వేంకటకవి | 17 |
| సారంగధరచరిత్రము (ద్విపద) | కూచిమంచి తిమ్మకవి | 17 |
| సారంగధరచరిత్రము (ద్విపద) | బాణాల శంభుదాసు | 18 |
| సావిత్రీపరిణయము | దంతుర్తి దత్తాత్రేయకవి | 19 |
| సింహాచలమాహాత్మ్యము | కూచిమంచి తిమ్మకవి | 17 |
| సీతారామాంజనేయసంవాదము | పరశురామపంతులగురుమూర్తి | 18 |
| సీమంతినీకళ్యాణము | పెనుమచ్చ సోమకవి | 17 |
| సుదక్షిణాపరిణయము | తెనాలి అన్నయకవి | 16 |

| | | |
|---|---|---|
| సునందాపరిణయము | చింతకుంట కోదండరామకవి | 18 |
| సుబ్రహ్మణ్యవిజయము | త్యాగరాజ మొదలి | 19 |
| సుభద్రాపరిణయము | కూచిమంచి జగ్గకవి | 17 |
| సుమనోమనోభిరంజనము | ఓగిరాల జగన్నాథకవి | 19 |
| సురాభాండేశ్వరము | గట్టుప్రభువు | 18 |
| సూర్యతనయాపరిణయము | తక్కెళ్ళపాటి లింగన | 18 |
| సోమదేవరాజీయము | కూచిమంచి జగ్గకవి | 17 |
| సౌగంధికప్రసూనసంగ్రహము | అప్పప్పకవి | 19 |
| హంసవింశతి | అయ్యలరాజు నారాయణామా(త్యుఁడు | 18 |
| హరవిలాసము | శ్రీనాథకవి | 14 |
| హరివంశము | ఎఱ్ఱాప్రెగడ | 13 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | శంకరకవి | 16 |
| హరిశ్చంద్రోపాఖ్యానము (ద్విపద) | గౌరన | 15 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము | రామరాజభూషణుఁడు | 16 |

N. B—ఈగ్రంథములలోని పద్యములే గాక మఱియు ననేకగ్రంథములలోని పద్యములు గూడఁ జేర్పఁబడుచున్నవి.

# వర్ణనానుక్రమణిక.





## విన్నపము.

ఈగ్రంథముద్రణంబునఁ బ్రమాదవశమునఁ గలిగినస్ఖాలిత్యంబుల సవరించికొని, చదువఁ జదువరులు ప్రార్థితులు.

గ్రంథకర్త.



పరమేశ్వరాయనమః.

# వర్ణనరత్నాకరము.

## పురవర్ణనము.

ఉరుతరహర్మ్యమాలికల ◆ నొప్పుగిరివ్రజ మన్పురంబుఁ గాం
చిరి నవసౌరభప్రసవ ◆ చిత్రవనావళి గల్గుదాని నె
వ్వరికి దురాసదంబు లగు ◆ వజ్రమయోన్నతవప్రచారుగో
పురములదాని నయ్యలకఁ ◆ బోలెడుదాని మహార్థసంపదన్. 1

భారతము సభాపర్వము, ఆశ్వాసము 1 పద్యము 172.

సీ. మెఱుఁగులఁ గన్నులు ◆ మిఱుమిట్లు వోయెడు, నమలచింతామణి ◆ హర్మ్యములను
ఝళఝళ వెలిఁగెడు ◆ తరలప్రభాస్వర్ణ, వేదికుట్టిమతల ◆ వీథికలను
దేదీప్యమానమై ◆ తేజరిల్లెడుసిద్ధ, ఘుటికాదినవవప్ర ◆ గోపురముల
భాభాసితానూన ◆ పరమౌషధీలతా, చారుతరానేక ◆ తోరణములఁ

*గీ. జితవివర్ణాతిశయరత్న ◆ చిత్రితాంగ, రంగవల్లీ(క)బహుసురం ◆ గాంగణములఁ
గలిగి విశ్వంబునకుఁదన ◆ వెలుఁగువెలుఁగు, సేయు తేజోమయంబగు ◆ శివపురంబు.

కుమారసంభవము ఆ. 7 పద్య. 987

సీ. రాజమండలపూర్ణ ◆ రాజమండలవీథి, రత్నగర్భాపుల ◆ రత్నగర్భ
గంధర్వగంధర్వ ◆ గంధర్వనగరంబు, నాగపున్నాగపు ◆ న్నాగవనము
మార్గణమార్గణ ◆ మార్గణపీఠము, త్తుంగభుజంగభు ◆ జంగభూమి
కాంతకాంతారాతి ◆ కాంతకుంతస్థలి, వీరకుమారకు ◆ మారసరసి

---

* “జితవివర్ణాతిశయనూత్న ◆ రత్నచిత్రి, తాంగరంగవల్లీసురాం ◆ గాంగణము లఁ, గలిగి...” అని వ్రాఁతప్రతి.

ఆ.వె. యనఁగ(*బొగడు కెక్కు◆నలకాపురంబు దే, వేంద్రుపురి సుధాశ◆నేంద్రుపురము
గేహినేయములలిత◆శోణాంశుమణిబద్ధ, గోపురంబు హస్తి◆నాపురంబు. 3

ఆంధ్రభారతము.

సీ. పరిపు లోఁతును గల◆పరిఖతోఁ బొడవును, ఘనమును నగుకోట◆గలిగి పొగిన
వాకిళ్లు బలుపుఁగా◆వలి నొప్ప రమ్యగృహాశ్రితములు గోమ◆రారు వీథు
లందంబు లగు మేటి◆యంగళ్లు నెల్లవ, స్తువులును శోభిల్ల◆సుజనబహుళ
మైధాన్యములును సమృ◆ద్ధాజిరసదివ్య, ములును నానాయంత్ర◆ములును బహువి
ఆ.వె. ధాయుధములు బిరుదు◆లగుయోధులును బండి, పులు శిలాసనులును◆మాత్యముఖ్య
పరిజనములు నెఱయఁ◆బరమోత్సవంబులు, మెఱయఁ బురము చెలువు◆మిగుల నలరు.

భారతము శాంతిపర్వము, ఆశ్వా. 2 పద్య 383.

సీ. అఖిలభోగములకు◆నాస్పదం బగుట భో, గీంద్రుపట్టనమున◆కీడ యనియు
ధనసమృద్ధుల కెల్లఁ◆దల్లియి ల్లగుటఁ గు, బేరునివీటికిఁ◆బెద్ద యనియు
వైభవంబులకు సా◆వాసంబగుట నమ, రాధీశుపురమున◆కధిక మనియు
నిర్మలస్ఫూర్తికి◆నెల వగుటను భార, తీశ్వరుపోలికి◆నెక్కు డనియు
ఆ.వె. వినుతిసేయఁ జాలి◆వివిధోత్సవంబుల, నతిశయిల్లి సజ్జ◆నాభిరామ
మై కరంబు వొలుచు◆నన్నగరంబు వి, స్ఫురితసకలవస్తు◆పూర్ణ మగుచు. 5

నిర్వచనోత్తరరామాయణము, ఆ 1 పద్య 46.

సీ. ఎందుల పరిఖ భో◆గీంద్రబృందమునకు, భానురకేళి◆వాస మయ్యె
నెందుల కోట ది◆గేంద్రసర్వములకు, సముచితవిశ్రమ◆స్థాన మయ్యె
నెందుల సౌధంబు◆లిందిరాదేవికి, నెసకంపుఁబొల్పైన◆యిండ్లు లయ్యె
నెందుల జనుల స◆త్ప్రవర్తనములు, పరుల కుత్సుకకృత్య◆భంగు లయ్యె
ఆ. నట్టికుసుమపురము◆నందు విశ్వంభరా, భారధౌరణపరి◆ణతోరుభుజుఁడు
రాజవంశజుండు◆రాజహంసుం డన్న, రాజు గలఁడు గిరిరా◆జనిభుఁడు. 6

దశకుమారచరిత్రము, ఆ 2 పద్య 3.

సీ. జనపాలనుతసింహ◆చక్రవాలంబు సా, మంతనిర్మలలక్ష్మి◆మండనంబు
రాజత్తురంగత◆రంగపయోనిధి, భద్రేభమేఘన◆భస్స్థలంబు
భూదేవదేవజాం◆బూనదాచలము వ, దాన్యకల్పకదేవ◆తాపురంబు
బహుళకళాకర్పూర◆భాసికరండంబు, సుజనముక్తాఫల◆శుక్తిచయము

(2) * "అనఁ బొగడ్త కెక్కు" అని పాఠాంతరము.

తే. చతురకాంతాపరిరూనవ♦సంతివేళ, రసికవిటజనమధుకరా♦రామలక్ష్మి
మధురకవిరాజవహంస♦మానసంబు, నాఁగ ధనదపురంబు వ♦ర్ణనలఁ దనరు. 7
కేయూరబాహుచరిత్రము, ఆ 1 పద్య 16.

సీ. కనకంపుఁ బెనుఁగోట♦ కనుపీథిఁ గడవంగ, మణిగోపురములు స♦మగ్రములుగ
బంధురప్రాసాద♦పంక్తులు నుత్తుంగ,హర్మ్యరేఖలు మనో♦హారత నలర
రాజమార్గం బతి♦రామంబుగాఁ బణ్య,పదము లుజ్జ్వలశిల్ప♦భంగి నమర
నమరసద్మములుఁ జైత్యంబులు సభలును, బరిపలు నపూర్వరంపు♦రచన మెఱయఁ
తే. గోపురాట్టాలకంబులు ♦ దోరములుగఁ, గూపదీర్ఘికాసరసులు ♦ గొమరుమిగుల
సృతకపర్వతోద్యానంబు♦లతులములుగఁ,బరగుపురమునిర్మించె న♦చ్చెరువుగాఁగ.
హరిసంశము, ఉత్తరభాగము. ఆ 2 పద్య 16.

సీ. దిగ్గజోపమమద♦ద్విపదాననిర్ఘోష, సుక్తినాయితభూమి ♦ దోహలంబు
హరితురంగోపమ ♦ హరిఖురక్షుణ్ణహేమ, కుట్టిమోత్థితరేణు ♦ గుహితంబు
జితమనోజవహయో♦ర్జితమణిస్యందన, విస్తారితాదిక్య♦విపులరథము
వనోర్వివిభవాప♦హాసిమహాయోధ, శరభపంచానన ♦ సంకులంబు
తే. సురవధూపమయోషిత్సు♦శోభితంబుఁ, గనకమందిరధృతమేరు♦గౌరవంబు
నిష్ప్రగోత్తను మెంతయు♦నొప్పు ననుచుఁ, జూచి సంతస మందిరి♦చూచ్చు లలర.
భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 2515.

సీ. గంభీరపరిఖ నా♦గస్త్రీల కశ్రాంత, కేళివిహారదీ♦ర్ఘిక యనంగ
నుత్తాలసాల మ♦న్యులకుబ్బి దివిఁ బ్రాఁకఁ, జేసినదీర్ఘని♦శ్రేణి యనఁగఁ
బ్రజ చాతుర్వర్ణ్య♦సంఘ మర్థులపాలి, రాజితకల్పకా♦రామ మనఁగఁ
బ్రాంతనుస్థిత మైన ♦ భవజూటవాహిని, భుక్తిముక్తిప్రద♦స్ఫూర్తి యనఁగ
తే. నెప్పుడును నొప్పు రాజమ♦హేంద్రపురము,ధరణిఁ గల్పించె నేరాజు♦దనదు పేర
నట్టిరాజమహేంద్రుని♦యనుఁగుమనుమ, డెసఁగుఁ జాళుక్యవిశ్వన♦రేశ్వరుండు.
కావ్యాలంకారచూడామణి, ఉల్లాస 3 పద్య 94.

సీ. పరిత్యగ్రరచనాతి ♦ భాసురప్రాసాద, నిర్జితగోత్రావ♦నీధరంబు
ప్రాకారశిఖరాగ్ర♦బంధురమణిగణ, ద్విగుణితతారకా♦విభ్రమంబు
పరిఖాజలాంతర♦ప్రతిబింబితద్రుమ, స్మారితపాతాళ♦భూరుహంబు
సుమపుష్పసౌరభా♦వర్జితమధుపమా,న్వీకృతాశావార♦ణేంద్రగండ
తే. మప్రసన్నమహాజనీయపలీ♦లాతిశయము,లాసినీజననేత్రవి♦లాసజనిత

కుసుమశరబాణ*నైహస్త్య♦మనన్యశాస్త్ర, నిశ్చితాలక ముజ్జయి♦నీపురంబు. 11

అమరేశ్వరుని విక్రమసేనము.

గీ. పరిఖ గుడివోలెఁ దనచుట్టుఁ♦దిరిగియుండఁ, బరుల కేరికి గ్రహణగో♦చరముగాక
నిషధరాధీశభాషిత♦విషమభాష్య, ఫక్కికయుఁబోలె నొప్పె న♦ప్పట్టనంబు. 12

శృంగారనైషధము, ఆ 2 పద్య 38.

సీ. శ్రీకలితానూన♦చిత్రరేఖాయుక్తి, గొమ్మలందును గోట♦కొమ్మలందు
నవరసపదయుక్తి ♦ నానార్థ¶గరిమలు, రాజులందును గవి♦రాజులందు
గవిలోకసంతోష♦కరజీవనస్థితి, సరసులందును గేళి♦సరసులందు
నవనవశ్రీ సుమ♦నఃప్రవాళవిభూతి, మావులందును నెల♦మావులందు
గీ. గలిగి సముదగ్రసౌధాగ్ర♦తలసమగ్ర, శాతకుంభమహాకుంభ♦జాతగుంభి
తోరురత్నవినూత్నశృం♦గార మగుచు, సిరుల నొప్పారు విక్రమ♦సింహపురము.

విక్రమార్కచరిత్రము, ఆ 7 పద్య 133.

సీ. పద్మరాగోపల♦ప్రాకారరుచిజాల, గండూషితవ్యోమ♦మండలంబు
పాతాళజలఝరీ♦పర్యాప్తకల్లోల, సుకుమారపరిఖోప♦శోభితంబు
శక్రనీలశిలావి♦శాలగోపురరోచి, రసమయజనితమి♦థ్యాతమంబు
కనకగోపానసీ♦ఖచితముక్తాఫల, రాజీవిలగ్నతా♦రాగణంబు
గీ. రాజసదనాగ్రదేశవి♦రాజమాన, తోరణాలీనమణిగణద్యుతివితాన
విభవలక్ష్మీవిలంబిత ♦ విలసదింద్ర, చాపరుచిచాపలము హస్తి♦నాపురంబు. 14

శకుంతలాపరిణయము (పి. పిన వీ.), ఆ 1 పద్య 69.

ఉ. సాంకవగంధిచాతకవి♦శాలహితక్రియవృష్టిధార ని
స్సారదరిద్రభారతరు♦షండనకారకుఠారధార సం
సారకృశానుతప్తజన♦శైత్యకరామృతధార గాక యా
ధార దలంప నన్యవసు♦ధారమణీశపురోపమానమే. 15

భోజరాజీయము, ఆ 2 పద్య 45.

సీ. వేదశాస్త్రపురాణ♦విద్యావిజృంభిత, కలితధాత్రీసుర ♦ కలకలంబు
గజహయారోహణ♦కౌశలసంచార, మహితరాజకుమార♦మండలంబు
♦వజ్రముక్తాఫల♦వస్త్రసువర్ణాది, సకలవిక్రయవైశ్య♦సంకులంబు
నానాయుధాభ్యాస♦నైపుణ్యధౌరేయ, విశ్రుతసచ్ఛూద్ర♦విభ్రమంబు
గీ. కల్పితానల్పదేవతా♦గారభూమి, రత్నకీలితఘనసౌధ♦రాజితంబు

---

* "నైపుణ్యము" అని పాఠాంతరము. ¶ (గరిమలు ?)

నగుచునమరేంద్రునగరంబు♦నగుచుధాత్రిఁ, బొలుచుఁబాటలీపుత్త్రిమ♦న్పురవరంబు.
పంచతంత్రిము (దూ. నా.), ఆ 1 ప 48.

సీ. వనజగర్భకటాహ♦వర్తిష్ణువరణంబు, బలిబహూకృత పుణ్య♦సలిలఖేయ
మరుణాంశుకలశభా♦సురరత్నసౌధంబు, కుధరభిద్గృహచుంబి ♦ గోపురంబు
ధనధనాక్రీడ స♦ద్దాత్ర్యనిష్కుటకంబు, బ్రహ్మనిష్ఠద్విజ♦ప్రాంజలంబు
భార్గవశౌర్యవై♦భవయుతక్షత్త్రింబు, పౌలస్త్యనిభవణి♦గ్వానురంబు
గీ. పద్మనాయకశుభవిభా♦భర్త్స్యమాన, విద్వ దావాసమండలీ♦విహరమాణ
భూరిసంతాపతిమిరంబు♦ పొగడనెగడుఁ, బూర్ణగరిమంబు పాటలీ♦పురవరంబు.
పంచతంత్రము బై. వేం. ఆ 1.

సీ. ఏవీటినతుల పా♦లిండ్లపైఁ గంబూర, నవహారములచిప్ప♦కవుఁచు మాచ్చు
మలయజం బేవీటఁ ♦ దొలిచెక్కుడులిచి మే, డలకిడ్డ మిగులుభూ♦ములకు డిగ్గఁ
గలఁచు నేవీటిసిం♦హళగజంబులగాలి, చైత్రివేళనుద్దీ♦శాగజంబుఁ
దాల్తు రేవీటిప్రా♦క్తనభూపనిర్మాల్య, మరకతంబులు వెలి♦ధరణిపతులు
గీ. కపివరనియుక్త గిరిసవృ♦గ్గహననిలయ, గాత్రిగాహితకనక ము♦క్తాకవాట
గోపురావేదితోచ్ఛతా♦క్షోభ్యవప్ర, దనరు దక్షిణమధుర సాం♦ద్రద్రుమమధుర.
ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 3.

మ. వరుణాద్వీపవతీతటాంచలమునన్ ♦ వప్రస్థలీచుంబితాం
బరమై సౌధసుధాప్రభాధవళిత♦ప్రాలేయ రుక్మండలీ
హరిణంబై యరుణాస్పదం బనఁగ నా♦ర్యావర్త దేశంబునం
బుర మొప్పు న్మహికంఠహార తరళ♦స్ఫూర్తి న్విడంబించుచున్. 19
మనుచరిత్రిము, ఆ 1 పద్య 49.

సీ. సౌధచర ద్వధూ♦జన దర్పణీభవ, ద్దివ్యలోకస్రవం♦తీజలంబు
రజతవప్రస్థాణు ♦ గజచర్మశాటిభ, వత్పరిఖావారి ♦ వలయితంబు
శాతమన్యవశిలా♦స్థగితకాంచీదామ, భానురోపవనాళి♦పరివృతంబు
పౌరప్రతాప వి♦భ్రాంతికృ త్కుట్టిమ, స్థలశోణమణిరుచి♦స్థపుటితంబు
గీ. బహువిధామోదమోదిత♦భసలకలభ, వినరవిస్మరఝుంకార♦వేణునినద
సరసగాయక గానప్రి♦సంగసౌఖ్య, కరణకర మగు నావంచి♦కాఖ్యపురము. 20
రాజశేఖరచరిత్రము, ఆ 1 పద్య 44.

సీ. కమలాకరములొటఁ ♦ గమలాకరములొట, జలజాప్తవిస్ఫూర్తి ♦ తెలియఁబడక
రాజమండలమొట ♦ రాజమండలపటాఁ, గునలయపిప్రియస్ఫూర్తి ♦ వివరపడక

మాణిక్యచయకూట ♦ మాణిక్యచయకూటఁ, గ్రొత్తడాలు వెలుఁగు ♦ నుఱుతుపడక
యమరదీర్ఘిక లౌట ♦ నమరదీర్ఘిక కౌట, ఘనసువర్ణాబ్జత ♦ గానఁబడక
గీ. గోపురము లౌట మణిమయ ♦ గోపురంబు, లౌట గురుసమున్నతి మెయిఁ ♦ దేటపడక
ద్వాపరంబున విలసిల్లు ♦ ద్వాపరంబు, గరిమఁ దనరారు మాణిక్య ♦ పురవరంబు.
నిరంకుశోపాఖ్యానము, ఆ 1 పద్య 43.

సీ. జాతరూపమనోజ్ఞ ♦ జాతరూపం బైన, కోటచే వలయాద్రి ♦ నోటుపఱచి
మధుసుధారసపూర ♦ మధురనీరం బైన, పరిఖచే వారాశి ♦ భంగపఱచి
నవరత్నచితాభ్రి ♦ నవయత్నకము లైన, యిండ్లచేఁ గనకాద్రి ♦ యేపుగఱచి
కాంతనిర్మలచంద్ర ♦ కాంతబద్ధము లైన, పట్టిమంగుల ఖ్యాతిఁ ♦ గొంచెపఱచి
గీ. కమలగర్భుండు దనసృష్టి ♦ గాని భువన, కోశగర్వంబు నణఁగింపఁ ♦ గోరి దీని
వేడ్కఁ నిర్మించె ననఁ బొల్చు ♦ విమతహృదయ, ఘట్టనం బైన సాకేత ♦ పట్టనంబు.
కవికర్ణరసాయనము, ఆ 1 పద్య 103.

సీ. శ్రీరమారమణవి ♦ హారహారిగృహంబు, బహుశోభనాన్విత ♦ ప్రత్యహంబు
సతతపౌరజనాచ ♦ రితవిస్తృతిమహంబు, దుర్వారచతురంగ ♦ ధూర్వహంబు
శ్రీసుహారసుమగంధ ♦ సహితగంధవహంబు, దీపితారాతిగ ♦ ర్వాపహంబు
నాయికానాయకో ♦ న్నతరహఃకలహంబు, సర్వవస్తువ్రాత ♦ సంగ్రహంబు
గీ. మహిని రహిమీరు నౌర మ ♦ హానదీత, రంగసంఘుసుమంఘుమా ♦ రవవిధూత
జాహ్నవీనిమ్నగాసుధా ♦ సాగరంబు, విజయనగరంబు సుజనసం ♦ విత్కరంబు. 23
కృష్ణరాయవిజయము, ఆ 1 పద్య 43.

సీ. అతులితశ్రీమనో ♦ హరనాగమై సర్వ, మంగళాన్వితమహా ♦ మహిమ నెనసి
నానితవాక్ప్రతు ♦ రాననస్థితిఁ జెంది, విబుధాధినాథస ♦ ద్విఖ్యాతి నెనసి
ధర్మపాలనశు ♦ భోదయకీర్తిఁ జెల్వొంది, భువనైకవైభవ ♦ స్ఫురణ నలరి
ధనదాత్తనవనిధా ♦ నవదానగతి మించి, పరిజలపున్నాగసం ♦ పద వహించి
గీ. జగతి వైకుంఠకైలాస ♦ సత్యలోక, దిగ్వరపురాధిరాజమం ♦ దిరనిభప్రి
భావభాసిత మగుచుసం ♦ పదలఁ బొదలు, నఖిలవిద్యాకరం బయో ♦ ధ్యాపురంబు.
ఇందుమతీపరిణయము, (కుమా. ధూర్జ.) ఆ 1 పద్య 141.

సీ. శ్రీభావిశేషమి ♦ శ్రీభావిభవనంబు, సారసకలితకా ♦ సారసమితి
ప్రాకారవజ్రదీ ♦ ప్రాకారహర్మ్యంబు, కుంజరంజితభద్ర ♦ కుంజరంబు
రమణీయతావాస ♦ రమణీయుతవిలాసి, కాంచనసౌధాద్రి ♦ కాంచనంబు
రాజహంసకులీన ♦ రాజహంసకులంబు, బంధురసప్తాశ్వహస్తి ♦ బంధురంబు

గీ. కల్పకానల్పశోభనా♦కల్పకంబు, గోపురద్వారచుంబిత♦గోపురంబు
సింధుజన్మాశ్వదేశీయ♦సింధుజంబు, గజపురం బొప్పు జితసుర♦గజపురంబు. 25

తపతీసంవరణోపాఖ్యానము, ఆ 1 పద్య 43.

సీ. ఆరసి యమరలో♦కాలోకమున కెక్కె, జగతి గాఁగల పేరు♦ గగనభాగ
మాదంతులు సలాన♦శాలాననముం గొన్నఁ, గుమ్మరించునేమొ ద♦క్కుల్మజరమ్మ
లామాప్రలా♦కిలంతి దాఁటులు దాఁటు, సరివీథి గనునేమొ♦తెరణివాయము
లాకీస సలులు సా♦హాసప్రసాములఁ బూయఁ, జైపూఁత యగునేమొ ♦ బలపరాగ
గీ. మాఁచకోరాక్షిలకటాక్ష♦మంగునేమొ, సాంగముగఁ జూడ సామ్రాజ్య♦మంగభవ్రన
కాపురము కాణయాచిగ్గై♦యమరునేమొ, కాఁపురము సేయు వీరశృం♦గారములకు.

కకుత్స్థవిజయము, ఆ 1 పద్య 123

సీ. వరసుమనోభవ్య♦తరుల కావాల మ, స్త్యలఘుకిలాపాలి ♦ కలరు ఘరణి
సరిలేని తెలిముత్తె♦సరుల కొటారు క, ళ్యాణపరంపర♦లతో లుపేవి
సురుచిరమణుల కా♦కరసీమ గ్రుతిహిత, ఘాషిపస్విజకోటి♦పట్టుఁ గొమ్మ
సరసుల కారామ ♦ సరణి శ్రీరంగగే, హ్రక్రోడవాసిని ♦ కాటపట్టు
గీ. వెలయు నావరణాంబుసం♦వీతహాట, కాండమోహావపరిఖావృ♦తాంగ్రిమవజ్రి
దంతురగ్రాంతగంగాని♦రంతరాగ్రి, భూరివరణం బధిష్ఠాన♦పురవరంబు. 27

వసుచరిత్రము, ఆ 1 పద్య 94.

సీ. శూలశయాభీల♦శూలదుర్వారంబు, భూరిమాయుగతి ప్ర♦భూషితంబు
రాజితనానాద్రి♦రాజిపరికరంబు, నవతరసాతినం♦దద్విజంబు
ఘననాట్యభూతాళి♦కారవనాచాల, మధిక రత్నాశ్వదీ♦ప్తాజిరంబు
షాడ్రిజ్యధూమనిరంత♦రచితానలవితాన, మనవధికార్తిస్వ♦రాశిపూర్ణ
గీ. మలఘుభూతియగణ్యపు♦ణ్యాజనపాళి, కాసమనసం బయోధ్య వై♦ర్యాసమాన
మంత్రికృత్యాస్పద మనూన♦మానసాబ్జ, గుంభితాశ్చర్యఁ జైకనుం♦గొనుచువచ్చి.

హరిశ్చంద్రనళోపాఖ్యానము, ఆ 5 పద్య 6.

సీ. ధాత్రీమహాదేవి ♦ తాల్చినమున్నీటి, మొలనూలిరత్నంపు♦మొగ పనంగ
జలధి చేరిటిపాప♦తలచుట్టు గలధరి, త్రీమూర్తిశివుచిత్రి♦తిలక మనఁగ
నపరదిక్సతి కట్టి♦నట్టిసాగరమను, పుట్టంపుఁదుది ప్రాంత♦మొగడ యనఁగ
వరుణగోపురబహి♦ర్ద్వార్తితోరణమగ్న్య, గుంభితనవపుష్ప♦గుచ్ఛ మనఁగ
గీ. విపులమణిమయాగ్రహర్మ్య♦విసరవిసర, చోపశోభిత మగుద్వార♦కాపురంబు

దవులఁగాన్పించెఁ బసఁజూడ♦ దైవవిభుఁడు, వేయికన్నులుఁజాలక♦ వెఱఁగుపడఁగ.

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 1 పద్య 54.

చ. అగణితకేళినప్పురము ♦ నందు విరాజిలుచుండు నెంతయున్
మృగమదలేపపంకముల ♦ మేలిమికోటలు పుష్పదోఁటలున్
నిగనిగమన్విటంకములు ♦ నీలపుమేడలు పైడిగోడలుం
బగడపుబంచుపొంకములఁ ♦ బచ్చలతిన్నెలు వింతవన్నెలున్. 30

కళాపూర్ణోదయము, ఆ 1 పద్య 114.

సీ. శ్రీకరోదయ వధూ♦లోకాననప్రభా, నాటితబహుచంద్ర♦నాటనంబు
సమ్మర్దగళితభూ♦షారత్నమంజరీ, యోజితరథ్యాప్రస♦పూజనంబు
కైలాసశైలసం♦కాశసౌధనివేశ, కౌముదీకవచిత♦గగనతలము
విస్తీర్ణవిపణివీ♦న్యస్తవస్తువ్రజ, ప్రకటితానల్పగ♦ర్వాభజతము
గీ. విపులపవమానతాండవ♦వేపమాన, లాంఛనధ్వజపట్టప♦ల్లవలలామ
మాళిరచితకళాకృత్య♦హేళిహయము, దీపితం బగుశ్రీకాశి♦కాపురంబు. 31

పాండురంగమాహాత్మ్యము, ఆ 1 పద్య 103.

సీ. శ్రీకరానేకర♦త్నాకరప్రాకార, గోపురప్రాసాద♦దీపితంబు
సౌధాగ్రసంచర♦జ్జలజముఖీముఖ, మణిదర్పణీకృతచంద్ర♦మండలంబు
కనకనికేతనా♦కలితకేతనపటా, పల్లవాంకితదిశా♦పతిపురంబు
ప్రతిమందిరాళింద♦భాగముక్తాఫల, రంగవల్లీవిభా♦రాజితంబు
గీ. నీలమణిరాగకీలితో♦న్మీలదభ్ర, చుంబిహర్మ్యకదంబనీ♦లాంబుదభ్ర
మభ్రదాలోకనర్తితా♦మరవనాహి, భుగ్వితానంబు కాంచికా♦పురవరంబు. 32

ఘటికాచలమాహాత్మ్యము, ఆ 2 పద్య 161.

సీ. మదనాగయూథస♦మగ్రదేశము గాని, కుటిలవర్తనశేష♦కులము గాదు
ఆహవోర్వీజయ♦హరినివాసము గాని, కీశసముత్కరాం♦కితము గాదు
సుందరస్యందన♦మందిరం బగుఁ గాని, సంతతమంజులా♦శ్రమము గాదు
మోహనగణికాస♦మూహగేయము గాని, యూథికానికరసం♦యుతము గాదు
గీ. సరససత్పుణ్యజననివా♦సమ్ము గాని, కఠిననిర్దయదైత్యసం♦ఘమ్ము గాదు
కాదు కావని కొనియాడఁ♦గలిగినట్టి, పురవరాగ్రమ్ము సాకేత♦పురవరమ్ము. 33

మొల్లరామాయణము, బాల పద్య 2.

చ. కల దొకపట్టనంబు మహి♦కాకరభూళినివాసభాసి పే
ర్చలువిభుకాంతసౌధరుచి♦జాలనగస్థగితాఖిలాశమై

జలరుహామిత్రవంశనృప♦చంద్రయశోలతికాలవాలముం
బలెఁ బృథువప్రజసాలము స♦ఘం బొరయంగ నయోధ్య నా మహిన్.[1] 34

సుదక్షిణాపరిణయము, ఆ 1 పద్య 63.

సీ. తనఁ గోటఁ డాచిన ♦ మగమానికంబుల, తెలిరంగు లెపుడు వె♦న్నెలలు గాయ
మేడలపై నాడు మెలఁతలుఁ దెఱగంటి, కొమ్మలు నేప్రొద్దుఁ ♦ గూడి తిరుగఁ
జలువచాను లగడ్త ♦ వలినీటిపైఁ దేలి, యొరిమతో ననయంబు ♦ నోల లాడ
మేలిమిబంగారు♦ మేలిపచ్చలడాలు, మిసిమి మింటికి నెల్లఁ ♦ బసిమి యొసఁగఁ
గీ. జవల రాసినకొమ్మల♦చాలుకతన, మీఁద రాకాకయల ప్రొద్దు♦ మెఱుఁగు జేఱు
గవనులనె రాకపోకలు♦గా మెలంగఁ, దనరుఁ బాడమిఁ బ్రతిష్ఠాన♦మనఁగ వీడు.

యయాతిచరిత్రము, ఆ 1.

సీ. గోపుర గోపుర ♦ గోపురప్రతిమంబు, కల్పద్రు కల్పద్రు ♦ గౌరవంబు
మానవ మానవ ♦ మానవాధిశయంబు, మణిజాల మణిజాల ♦ మంజిమంబు
సారంగ సారంగ ♦ సారంగ నయనంబు, సుమనోజ్ఞ సుమనోజ్ఞ ♦ శోభితంబు
బహుధామ బహుధామ ♦ బహుధామ చిత్రంబు, ఘనసార ఘనసార♦గంధిలంబు
గీ. భవ్య కాసార కాసార ♦ బంధురంబు, జవన సైంధవ సైంధవ ♦ సంకులంబు
బహుళ కేతన కేతన♦ఘస్మలంబు, నై విజృంభించె సిరి నయో♦ధ్యాపురంబు.

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 1 పద్య 15.

సీ. రమణీయ తేజోవి♦రాజులు రాజులు, పటుపరాక్రమ సము♦ద్భటులు భటులు
నిజబలాధరిత ది♦గ్గజములు గజములు, హరిణవేగజితార్క♦ హరులు హరులు
వివిధక్రతుప్రీత ♦ విబుధులు విబుధులు, కవితాభినుత మరు♦త్కవులు కవులు
రతిరాజ కంతహా♦రమణులు రమణులు, వరధర్మ వర్తకుల్ ♦ వర్తకులును
గీ. గలిగి కైవల్యఫలదాయ♦కక్షితిం దగి, భూమిరుహావల్లి యైన య♦ప్పురమతల్లి
విలయమున నశ్వరము గాక ♦ వెలయ నరసి, శాశ్వతంబుగ నేలు న♦ధీశ్వరుండు.

వైజయంతీవిలాసము ఆ 1 పద్య 48.

సీ. ఆకాశవాహినీ ♦ నీకాశపర్యంత, భూచరయానదీ♦భాసురంబు
పవనభుగ్భామినీ ♦ పాథోవిహార యో, గ్యానేక పరిఖాజి ♦ తార్ణవంబు
సౌధ శృంగన్యస్త ♦ జలజరాగప్రభా, పాటలీకృత దిఙ్న♦ఘస్మలంబు
నికట లీలారామ ♦ వికచనానావిధ, ప్రసవ సౌరభ్య వి♦భ్రాజితంబు
గీ. కరముఁ గొనియాడఁ దగు నహం♦కారవైరి, ధారుణీధరజలధి స♦మీరణంబ

ప్రబల విభవాకరము వీర♦భటనికాయ, కేసరిక్షోణిభరము సా♦కేతపురము.

హరిశ్చంద్రోపాఖ్యానము, శంకర. ఆ 1 పద్య 84.

సీ. మదపుశేసుంగులీల ♦ మానంతులఁ దనర్చి, తమ్మినైశికిఁ బెక్కు♦పరిమళముఁ బొగి
కనకాద్రికరణిఁ గాం♦చనకూటములమించి, మహిజమ్ముమాడ్కిఁ గో♦మ్ములఁ జెలంగి
కమలాకరముగతిఁ ♦ గలువపడంబుల మీఱి, దివిరీతి విబుధాళిఁ ♦ దేజరిల్లి
పలుకుఁగప్రపుఁజాయ ♦ చలువతావులమించి,ననుఁగుఁదొల్కరిమాడ్కి ♦ఘనులనలరి
గీ. గాంగగాంగేయజలజాత ♦ భృంగభావ, జీవమణిసౌధపాళి కే♦ళీవిలోల
లోల మృగశాబలోచనా♦లోచనపఙ్క్తి, భాళి యగుద్వారకాపుర♦పాళి మెఱయు.

భానుమతీపరిణయము, ఆ 1 పద్య 4.

క. ఆవీడు దనకు వేలుపు, దావీడు ధరాపురాళిఁ ♦ దలఁతురె యనుచుం
దావీడు భోగవతిని ను, ధావీడున్నతయశఃప్ర♦తాపోజ్జ్వలమై. 40

బహులాశ్వచరిత్రము ఆ 1 పద్య 78.

సీ. వినుత సపక్ష మే♦రునగాయమాన శే, తన సమాకలిత ర♦క్షపరిజంబు
ప్రబల నిర్జరసాను♦భాను శైలోపమ, ధారాళ దానవే♦దండకులము
పవమాన మానస ♦ జవజగీషునిరర్గ, ళోన్నతతురంగ స♦ముత్కరంబు
పరవాహినీశ ని♦ర్భరనీరసారణ్య, విలయాగ్నిసంకాశ ♦ బలచయంబు
గీ. మహిత గంభీర పరిమాయ♦స(హ్య)?..., కన్యకాభయఃవాహినీ ♦ ధన్యతరము
కేళికా దీర్ఘికాయితా ♦ వేలపుణ్య, పుష్కరిణి రంగధామంబుఁ ♦బొగడఁదరమె.

శ్రీరంగమాహాత్మ్యము, క. వ. ఆ 6.

శా. చంద్రప్రస్థర సౌధఖేలనపర♦శ్యామా కుచద్వంద్వ ని
స్తంద్రప్రత్యహలిప్తగంధకలనా ♦ సంతోషితద్యోధునీ
సాంద్రప్రస్ఫుటహాటకాంబురుహ చం♦చచ్చంచరీకోత్కరం
బింద్రప్రస్థపురంబు భాసిలు రమా♦ హేలాకళావాసమై. 42

విజయవిలాసము, ఆ 1 పద్య 66

సీ. శ్రీకరంబు రమావ♦శీకరంబు శుభప్రి, యాకరం బనఁగఁ బెం♦పొదవుచుండి
సుందరంబు సువర్ణ♦మందిరంబు శుభాద్రి, కందరం బనఁగఁ బ్ర♦ఖ్యాతిఁ గాంచి
పావనంబు మహార్థ♦భావనంబు జనాళి, జీవనం బనఁగఁ బ్ర♦సిద్ధి మించి
భాసురంబు విశిష్ట ♦ భూసురంబు హృతాబ్ధి, నీసరం బనఁగ ప♦న్నియ ఘటించి
గీ. వీఁక నతిలోక హృతపాక విభవ పాక, నైక నృపలోక స[illegible]క ♦ సౌ[illegible]

శాకలిత నాకసమసంప♦దాకరంబు, గైకయపురంబు తనరు భో♦గైకశ్రరము. 43

ముకుంద విలాసము, ఆ 2 పద్య 41.

ఉ. ఆపురమందుఁ గెంపులగి♦యండపుఁగోట పయోధికన్యపం
బ్రాపయి తన్మిపోలికను ♦ భాసిలెఁ గొమ్మలు జేకలట్లు చా
లై పరగెం దదంతర గ♦భీన్నపమాక్తికలీల నద్దివి
షీపృథుశీకరమ్ము లెసఁ♦గెన్ హరి సేసలు చల్లు కైవడిన్. 44

సత్యభామా సాంత్వనము. ఆ 1.

జవజితపవనసై ♦ జయకేతురంగిక, మిందుపాణింధమ♦ హేమవరణ
మభ్రంలిహోద్భ్రమ♦విభ్రమసౌధంబు, వరలోలుపనృపాల ♦ భాసితంబు
నాగేశయప్రియా♦భోగగేహము కోర, కత్తారకోద్యాన ♦ కలితశాఖ
శుకరీకృతాధికా ♦ మరపురీసఖ్యంబు, † పరిమరిమృజమనః ♦ పండితంబు
పటుపళీఘుటాసముత్కట ♦ కటకటాహ, జటిల మడుఘుకృపటీ♦విటపటుల్వ
నటదహార్యదవార్య శుం♦డాలజాల, మోదనంబగు నప్పుట ♦ భేదనంబు. 45

చంద్రాంగదచరిత్రము ఆ 1 పద్య 2.

సీ. సింధురచితపాన ♦ బంధురాభ్రవితాన, సింధురకటదాన ♦ గంధలీన
మారవపపమాన ♦ సారపజ్జవమాన, గౌరవహయమాన ♦ సారమాన
మసమానశరమాన ♦ లసమానతేజోన, లసమాన ధరణీన♦రసనిధాన
మమరనాథవిమాన ♦ సమరజయనిధాన, సమరథాత్యుత్థాన ♦ కమనయాన
గీ. మమిత గోస్పృష్ఠి ఘనగోపు♦రాగ్రభాగ, నిరతరమణీయ హీరమ♦ణీకదంబ
విశదకాంతవినిర్మిత ♦ దశదిశాంత, ఘట్టనము వేంకటాచల♦పట్టనంబు. 46

సీ. రసరసాధికసంత ♦ మసమసారగరిహో, యసమసాధూన్నతి ♦ హార్మ్యకంబు
ధరిధరార్చకమహీ♦సురనురాజకవైశ్య, వరవరావరవర్ణ ♦ గురుతరంబు
మదమదావళిబలా♦స్పదపదాత్యాజికో, విదవిదాశ్వాళితాంగ ♦ విలసితంబు
నవనవామోద సూ♦నవనవాప్త్యుత్థకై, రవరవాన్విత బంభ♦రవప్రజంబు
గీ. వెలయుఁ బారావతారావ ♦ కలితలలిత, భావసంభవ కేళికా♦ప్రౌఢమూఢ
వార వారణయానాంఘ్రి ♦ వనజరణిత. వితతమణినూపురంబు తి♦ర్పతిపురంబు.

పద్మిబంధరాజవేంకటేశ్వర విజయవిలాసము. ఆ 1 పద్య 1—606.

సీ. పాదగయాక్షేత్రి ♦ పరమపవిత్రంబు, పురుహూతికాంబకుఁ ♦ బుట్టినిల్లు
యేలానదీజలా♦వృతతటాకానీక, మఖిలశక్తులకు వి♦హారభూమి

(పరిమర ?)

తోరణంపులపణ ప్రా♦కారోన్నతీరంబు, నిర్మల నాళికా ♦ సరసీసీమ
కంతివహాంపు పదేశ ♦ గురుతరస్థానంబు, విలసిత భీమమం♦డలతలంబు
గీ. సేతు కాశీ ప్రయాగాద్య♦శేషదివ్య, తీర్థరాజంబులందుఁ బ్ర♦తిష్ఠఁగాంచి
సకల దోషాపనోదక ♦ శక్తినలరు, పుణ్యసారంబు పీఠికా♦పురవరంబు. 48

రుక్మిణీపరిణయము. కూచి. తి. ఆ 1 పద్య 28.

ద్విపద. అవనిపై భోగమో♦హాకరంబగుచు, దివిజేంద్రునగరి నెం♦తేనగఁజాలి
కొత్తడంబులవంబు ♦ కోటలలంబు, కత్తలానులకోపు ♦ గజములయేపు
కేతనంబులసంచు ♦ గీములమించు, నాతిమిన్నలసౌరు ♦ నగరులతీరు
పసిఁడి మేడలచెల్వు ♦ పరిఖలనల్వు, కుసుమవాటులసొంపు ♦ కొలఁకులపెంపు
చప్పరంబులవిప్పు ♦ జగిలెలయొప్పు, కప్పురంబులతావి ♦ గాణాలఠీవి
యాపణంబులపేర్మి ♦ యనుగులకూర్మి, గోపురంబులయంగు ♦ గోడలరంగు
పుడమివేల్పులపెల్లు ♦ బొజుఁగులత్రుళ్లు, పడకటిళ్ళహొరంగు ♦ పనులమెఱుంగు
రాచమొత్తముటెక్కు ♦ రాణువయుక్కు, గోచయంబులదిండు ♦ కోమట్లమెండు
రంగవల్లులగచ్చు రసికులహెచ్చు, రంగస్థలులపట్టు ♦ రచ్చలమట్టు
మణికదంబముకల్మి ♦ మాన్యులబల్మి, గణికలపోఁడి లెం♦కలనెఱవాఁడి
వనములసొంపు దే♦వళములమంపు, పెనువజీరులనేటు ♦ ప్రెగడలనీటు
కాపుగేస్తులబోజు ♦ గడిలెలతేజు, ధూపవాసనమేలు ♦ తోడవులవీలు
గలిగి లోకాతీత ♦ గరిమఁ జెన్నొంది, తిలకింప గౌతమీ♦తీరదేశమున
సేతు కాశీ ముఖ♦క్షేత్రంబులట్లు, భూతలఖ్యాతిచేఁ ♦ బొదలుచుఁ గోటి
లింగతీర్థస్నాన ♦ లీలలఁ బెంపొ, సంగి మార్కండేయ ♦ శంభుపదాబ్జ
పూజావిధప్రాప్తి ♦ పొసఁగ నెసంగు, రాజమహేంద్రపు♦రంబను వీడు. 49

సారంగధరచరిత్ర. కూ. తి. ఆ 1.

మ. శశికాంతోపలజాలనిర్మిత, మహా♦సౌధాగ్రభాగోల్లస
ద్విశదాబ్జారిముఖీ జనాంచితముఖా ♦ విర్భూతమందస్మితా
తిశయప్రస్ఫుటకౌముదీముదిత ప్ర♦ద్దేశానిశోద్యచ్ఛకో
రకకుంతావళియై తనర్చుఁ జెల్వా ♦ రం దత్పురం బెంతయున్. 50

రాజశేఖరవిలాసము ఆ 1 పద్య 41.

సీ. వెలలేని ఫలుఁదకొ ప్ర♦స్నెలకాలమాడుపుల్, బట్టంపుఁ దరఁగ మొ♦త్తములుగాఁగ
రంగుబంగరుపుమె♦ఱుంగుటరుంగులు, నిద్దంపుటిసుకతి♦న్నియలుగాఁగ
గుఱుకాఁ బాయపురాచ ♦ తలిరాకుఁబోఁడులు, పగడంపుఁదినజొం♦పములుగాఁగ

మేటిపల్లొమ్మల ♦ మేకపురాతుటుములు, బలితంపు బఱవు గు♦బ్బలులుగాఁగ
గీ. వన్నియలుమీఱిచెలువారు♦వారువములుకొమరుఁదళుకొత్తుబలుమాని♦కములుగాఁగ
బొంకముగ నెల్లసిరులకుఁ ♦ డెంకియగుచుఁ, జాలమున్నిటిపగిదినా♦ప్రోలుదనరు.
నీలాసుందరీపరిణయము ఆ 1 పద్య 27

సీ. పెనురాచముంగిళ్లఁ ♦ బెంపుడుతోఁటల, మావులు మావులు ♦ ప్రోవుమీఱ
నాడెంపుఁ గోటల ♦ నాగవాసమ్ములఁ, గొమ్మలుఁ గొమ్మలు ♦ గొనబుఁజూప
గరితలజొమ్ముల ♦ గడితంపుగోవలఁ, బట్లును బల్లునుఁ ♦ బసఁబొసంగ
దొడ్డిపట్టులదొడ్డ ♦ దొరసానులయొడళ్ల, సొమ్ములు సొమ్ములు ♦ సొంపునెఱప
గీ. సంగడులఁ జేలఁ దప్పయు ♦ రంగెసంగి, ముత్తెసరులును బరువంపు ♦ ముత్తెసరులు
వఱలఁ దరలనిసిరులఁ బ♦ల్మ్రఱను మెఱసి, వీడలరు వేల్పురాసెల♦వీడుగాఁగ. 52
అచ్చతెలుఁగురామాయణము బాల. పద్య 32

సీ. ప్రాకారములడంబు ♦ పరిఖలచెలువంబు, వనములపెంపు జ♦వ్వనులసొంపు
బావులతీవి క♦ప్రపుధూపములతావి, జగిలెలరంగు ర♦చ్చలహొరంగు
గణికలయొప్పు బం♦గరుమాడువులవిప్పు, గోపురంబులమించు ♦ కోట్లసంచు
తేరులతీరు ము♦త్తెపుఁబందిరులసౌరు, నగరులకల్మి యే♦నుఁగులబల్మి
గీ. కత్తలానులయేపు షే♦ల్కాట్లకోపు, మదురుగోడలమెఱపు వా♦ల్మగలయొఱపు
తలుపుగమిపీలు నిలువుట♦ద్దములమేలు, దనరవెలుఁగొందునాప్రోలు♦ధరణియందు.
రసికజనమనోభిరామము ఆ 1 పద్య 36.

మ. వెలయున్ సర్వపురాధిరాజములలో ♦ విఖ్యాతమై యొక్కప్రోల్
బలభిత్పత్త్నవినూత్నకాంచనకన♦త్ప్రాసాదకేళీకళా
కలనాకౌశలకామినీముకురశం♦కాకారిరాకానిశో
త్పలినీబాంధవమండలం బవని నిం♦ద్రప్రస్థనామంబునన్. 54
సుభద్రాపరిణయము ఆ 1 పద్య 27.

సీ. జలధరాధికనత♦చ్ఛాయలఁ దనరిన, గంధగంధిలదంతి ♦ ఘటలచేత
ననిలచిత్తాతీత ♦ ఘనరయక్రియలచేఁ, జాలరంజిలిన తే♦జీలచేత
రణధాత్రినంగజా ♦ రాతియే తెంచిన, గెలిఁజేసెడి యుక్కు♦డీలచేత
కనకాద్రిశృంగరే♦ఖలనీసడించిన, దండినిండిన యర♦దాలచేత
గీ. గణనకెక్కు ధరాసుర ♦ క్షత్రియార్య, చరణజాఖిల ధనధాన్య ♦ శాలిశేయ
చందనాగలోకటక రా♦జ్యోప్రహకాంజ, రాజసంస్థాని సాకేత ♦ రాజధాని. 55
శశాంకరాజనందనచరిత్రము ఆ 1 పద్య 42

సీ. శ్రీకరపాత్రిసాద ♦ జితదేవసాలంబు, రత్నశృంగోచ్ఛల♦త్ప్రాకారంబు
ధ్వజపటపల్లవో♦ద్ధతదివ్యమేఘంబు, రథగతిచలితాహి♦రాట్ఫణంబు
కరిపుష్కరహృతాభ్రి ♦ గంగాసరోజంబు, సప్తివల్గితపత♦త్స్వర్గణంబు
ప్రత్యట్టహాస ని♦ర్భగ్నాబ్జజాండంబు, గృహవినిర్జితమేరు ♦ మహీధరంబు
గీ. భూపురంధ్రిమణీరత్న ♦ నూపురంబు, సతతనైపుణ్యకబళితా ♦ శాపురంబు
ధర్మకామార్థములకును ♦ దాఁపురంబు, తేజరిలుచుండు నెప్డవం♦తీపురంబు. 56

మిత్రవిందాపరిణయము. కుం. వెం. ఆ1 పద్య 4.

మ ఘనజాంబూనదరత్నసౌధవిచర♦త్కాంతాకచాబద్ధ నూ
తనసూనవ్రజవాసనాగత సుధాం ♦ ధస్సింధుకల్లోలినీ
వనజాతాంతరసంభ్రమన్మధుకర ♦ వ్రాతస్వనోదగ్రతం
జినబల్లాపుర మొప్పు నెప్పుడు రమా♦సీమంతినీవాసమై. 57

ఉ. కోటల మేల్పసిండిజిగి♦గోడల మేడల జాతికెంపు జా
నీ టలరారు వాకిటల ♦ నీటికొలంకులఁ గమ్మతావిపూఁ
దోఁటల భూరివైభవము♦తో నమరావతిఁ గ్రిణిసేయు న
వ్వీటికి సాటిఁజెప్పఁగ భు♦వింగలవే నగరంబు లెన్నఁగన్. 58

వేదాంతరసాయనము. ఆ 1 పద్య 12-16.

మ. పలసత్సాలవిశాలకేతనపటా♦విర్భూతవాతాహతో
చ్చలితాంభోధరగర్భనిర్గళిత చం♦చచ్చంచలాశేముషీ
కలనాకర్మదభర్మహర్మ్యవిచర♦త్కాంతానితాంతప్రభా
కలితంబై యిలనొప్పు ద్వారవతినాఁ♦గాఁ బట్టనం బెంతయున్. 59

భోజసుతాపరిణయము. ఆ 1 పద్య 55.

సీ. పత్త్యస్థలము లెల్లఁ ♦ బద్మాకరములు ప, ద్మాకరవతులు మ♦హావనంబు
లావనంబులు వినో♦దాగంబు లావినో, దాగముల్ గోపురా♦గ్రాంచితములు
గోపురాగ్రింబులు ♦ గురుసభావళులు స, భావళుల్ దైవాల♦యములు చూడ
దైవాలయంబులు ♦ ధామస్థితుల్మతి, ధామస్థితుల్గడు ♦ ధర్మ్యలరయ
గీ. ధర్మ్యలతిభద్రికరులు త♦త్భద్రికరులు, యూథముల నెన్నఁగాఁ బ్రమ♦దోత్కరంబు
లచటఁ బ్రమదోత్కరములు ప్ర♦భాసమాన, లనఁబ్రభాసమానంబగు ♦నప్పురంబు.
సీ. ప్రాకారమమరేంద్ర ♦ లోకాంతమన్నచో, హర్మ్యజాలోన్నతు ♦ లడుగనేల
ధామంబు లెల్ల ర♦త్నమయంబులన్నచో, నాడలి సొమ్ముల వింత ♦ లడుగనేల
పత్రివీథియు నంగం♦ధసనిక్తమన్నచో, నంగనాంగనల మే ♦ లడుగనేల

త్యాగంబు లర్థిక♦త్యధికంబు లన్నచో, నైశ్వర్య విభవంబు ♦ లడుగ నేల
గీ. శుకపికాదులు సరసవ♦చోవిలాస, కృతపురాణపఠనసంగ మో♦దితజనాళు
లన్నచో విద్వదధికార ♦ మడుగ నేల, జగదలంకారమైన య♦న్నగరమునను. 61

కవిరాజమనోరంజనము ఆ 1

సీ. చారుముక్తామయ ♦ సౌధశోభావళి, క్షితనభశ్చరదబ్జ ♦ హితహయంబు
పౌరందరగ్రావ ♦ బద్ధతోరణవిభా, శ్యామితామరధునీ ♦ సారసంబు
పృథుశోణమణిరమ్య ♦ కృతకాద్రిభా నిరం, తరసాంధ్యరాగితాం♦బరతలంబు
మరకతస్థాపిత ♦ వరసాలలోలప్ర, భాపలాశీకృత ♦ భవ్రిజంబు
గీ. రంగదుత్తుంగ గోపుర ♦ రజత సింహ, దర్శనాగతభీపున♦ర్ధావదంబ
రాశుగానీరపానస్పృ♦హాగతేంద్ర, భద్రగజమొప్పు సాకేత♦పట్టణంబు. 62

సమీరకుమారవిజయము ఆ 1 పద్య 43

చ. స్థిరసుమనోవితానముల♦చే సనిమేషవిలోలలోచనో
త్కరములచే ననర్ఘమణి♦కామయకూటచయంబుచే సిరిం
గరిము పొసంగు వీటి నవ♦కాంచనసౌధపరంపరల్ మరు
ద్గిరివరవైఖరిం బోలుచు ♦ దివ్యపథం బధరీకృతంబుగాన్. 63

చంద్రికాపరిణయము ఆ 1 పద్య 98.

సీ. సత్కళాపూర్ణ రా♦జప్రకాశం బయ్యు, రాజిల్లఁ బద్మాభి♦రామ మగుచు
వీరకంఠీరవ ♦ విభవభూషిత మయ్యు, రహిఁ బూను మత్తసా♦రంగగతుల
నఘదైన్యహారి సూ♦ర్యాలోకనంబయ్యు, హరినీలఘనతమ♦స్స్ఫురణఁ దాల్చు
భువనాద్భుతోదార ♦ భూరివత్సంబయ్యుఁ, గోకిలవాణుల ♦ కొమరు నెరపు
గీ. జవన హరిరథ సముచిత♦చరితమయ్యు, భోగి సౌఖ్య నివాసమై ♦ పొగడుగాంచుఁ
బలుకుచెలువకు నలువకుఁ♦బలుక నలవి, గానిసిరిఁబూని యా రాజ♦ధాని వెలయు.

రామవిలాసము. ఆ 1.

సీ. రంభోర్వశీముఖ్య♦రమణీవిలాసంబు, లంగనారత్నంబు♦లందుఁ గూర్చి
ఘనవైజయంత వి♦ఖ్యాతసౌభాగ్యంబు, పారిసాదపంక్తులఁ ♦ బదిల పఱిచి
కమనీయ సురదీర్ఘి♦కా కభీరత్వంబు, పరిఖాపయోరాశిఁ ♦ దిరముఁ జేసి
దివిషద్ద్రుమాణిక్య♦నుదానవినోద, శైలి రాజులయందు ♦ సంగ్రహించి
గీ. పద్మభవుఁ డమరావతీ♦పట్టణంబు, సారము హరించి యమ్మహీ♦దారపురము
కౌశల్యం బొప్ప నిర్మించెఁ♦గాక యున్నఁ, గలదె తాదృక్ప్రసిద్ధశృం♦గారలక్ష్మి

రాజేశ్వరమాహాత్మ్యము. ఆ 5 పద్య 7.

సీ. ప్రాకారరత్నశా♦ఖాకాంతు లుడువీథిఁ, గంకణగ్రహణ నై♦ఖరులు పూన
సౌధాగ్ర నిహిత కాం♦చనకుంభరుచిమిన్న, వాకతమ్ములకుఁ బై♦వన్నె యొసఁగఁ
జలదురుధ్వజపటా♦నిలమునందనఖేల, పమరదంపతుల కా♦హ్లాదమొసఁగ
గోపురాగ్రస్థ వ♦జ్రోపలచ్ఛవు లభ్ర, కరిమేనికాంతులు ♦ గలసి మెలఁగ
గీ. చైత్రరథ సన్నిభారామ ♦ సరస కుసుమ, సమితి సౌలభ్యలహరిని♦ర్జరమహీజ
చరదళులబిందునకుఁబిల్వఁ♦బరఁగుపుష్ప, పురమునేత్రోత్సవముఁజేసె♦భూమిపతికి.
దిలీపచరిత్రము. ఆ 2 పద్య 233.

సీ. హరిబింబరమా ప్రి♦హారకేళిశాంతి, హరికేతనమనో♦హారి రథము
గంధనాగ ధుతాభ్ర♦గంధవతీజాత, గంధప్రసూన స♦గంధపథము
వాహనైకగతిప్ర♦వాహపాంసులగంధ, వాహ ధూసరితాంబు♦వాహఘటము
వీరరసోన్నిద్ర♦వీరభద్రహసద్గ, వీరమాహవమహో♦వీరభటము
గీ ధర్మ పరధర్మ సాధర్మ్య♦ధర్మ విశ్వ, కర్మ నిర్మిత శర్మద♦వర్మ హర్మ్య
నిర్మలాభోర్మి దృశిధాతు♦ కర్మి విద్య, తాభ్రమధ్యాపురం బయో♦ధ్యాపురంబు.
దశావతారచరిత్రము. ఆ 7 పద్య 3.

సీ. మంజుల మాణిక్య♦పుంజరంజిత ఘన, ప్రాకార చుంచితా♦భ్రస్థలంబు
చంద్రకాంతోపల♦సౌధపాండురకళా, మేడిత ప్రాలేయ♦ఘృణికరంబు
రత్నకుడ్యావళీ♦రమ్యాంశుసందోహ, బహుళీకృతార్క ప్ర♦భాచయంబు
గంభీరపరిఖా ప్ర♦తాంభశ్ఛటా తమో, లోకీకృతాధర♦లోకవితతి
గీ. యామికాహతిజాత ది♦శాధినాథ, పురభయంకర భేరికా♦భూరిధంధ
ణంధణధణధ్వనిప్రతి♦నాదదాయి, గోపురంబొప్పు నుజ్జయి♦నీపురంబు. 68
హంసవింశతి. ఆ 1 పద్య 40.

సీ. ఋభుసరితోర్మికా♦ఘృణిసంశయాపాది, జలజరాగచ్ఛవి♦చ్ఛన్నసౌధ
మవితబర్హిసవిద్యు♦దభ్ర విభ్రమద సు, భ్రూయుక్త నీలశి♦రోగృహౌఘ
మైందవ మృగతృణ♦బృందసందేహ కృ, ద్గారుడాశ్మపరిఖా♦గారచయము
సౌరాగ మధుపాబ్జ♦శంకాకృదురు నీల, జలఖేయమధురసా♦కలితవరణ
గీ. మనుదినచకోరనికరస♦మగ్రచంద్ర, చంద్రికాభ్రాంతికారి వి♦శాలహీర
మణి గభస్తిపరిభ్రాజ♦మానగోపు, రం బధిష్ఠానపుటభేద♦నంబు దనరు. 70
శకుంతలాపరిణయము. పె. నా. ఆ 1 పద్య 69.

సీ. సౌధాగ్రతలకేళి♦జాగ్రన్మృగేక్షణా, స్ఫుటదృశ్యమానేంద్ర♦పురవరంబు
జగతీవిదృతోరు♦జగవర్గనిర్గమ, ద్వారాయితేస్వచ్ఛ♦నాకఖేయ

ముక్తినీకాంతమ♦స్థాంతీభవత్ప్రింత, సంతతోదాత్త కా♦సారసార
మిందిరానుతభవ్య♦మందురానీక ర,మ్యామోదకారణా♦రామసీమ
గీ. యందమగు మేరుమందరా♦హార్యమధ్య,తల మహీమండలమున నా♦స్థామభీమ
మేదురోద్భటభటసింహ♦నాదచకిత,దిగ్గజమసంబు పద్మావ♦తీపురంబు. శుకస. ఆ1.
మ. కల దుర్వీన్ బలగర్వితాహితకచ♦గ్రాహాగ్రహోద్యద్భుజా
ర్గళ రాజద్విజరాజగోత్రశిఖర♦ద్రాజన్య సౌజన్యపు
ష్కలసద్వస్తుసమస్తహస్తినగరా♦ఖ్యప్రఖ్యరాజన్యతీ
తిలకం బంగకళింగవంగముఖ ది♦గ్దేశాధిపాశాస్యమై. 73
శకుంతలాపరిణయము, (కృష్ణకవి.) ఆ 1 పద్య 105.
సీ. శ్రీకంఠ వైకుంఠ♦నేతావికుంఠ వం,దారుమందిరము బం♦దారుపురము
నిరతోత్సవైశ్వర్య♦నికరాభిభూత బృం,దారకపురము బం♦దారుపురము
సంతతాయాత యా♦చకజనవాంఛిత మం,దారభూజము బం♦దారుపురము
సకలవర్ణాశ్రమా♦చారసంపత్తమం,దారతిభరము బం♦దారుపురము
గీ. శిల్పి నర్తక వర్తక ♦ చిత్రకార, సూత్రకారాది వివిధవి♦చిత్రకృత్య
దాన ధర్మ పరప్రజో♦త్కరచకోర, కారవిందారికరము బం♦దారుపురము. 73
భల్లాణచరిత్రము, ఆ 1 పద్య 100.
సీ. పద్మాకరముకీర్తిఁ ♦ బ్రిపదాళులఁ జెలంగి, వసరాశి కరణి వా♦హినులఁ బెనఁగి
హారావళిపగిది నా♦యకరత్నములమీఱి, పుష్పమంజరిభాతి♦భూతి వెలసి
విష్ణుచక్రములీల ♦ విశిఖావళుల మించి, దివిమాడ్కి విబుధసం♦స్థితుల నలరి
కలభంబురీతి పు♦ష్కరసంపదలఁ గుల్కి, కులగిరిగతి దుర్గ♦ములఁ దనర్చి
గీ. తరుణ రాజీవమణిగణ♦స్థగిత హేమ,కుంభసంభరితాగ్ర వి♦శ్వంభరాది
నాథసౌధనిధాన ర♦థ్యాదివసతిఁ, దనరి చెలువొందు నాప్రోలు♦ ధరణియందు,
యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 1.
సీ. సకలకళాపూర్ణ♦చక్రిమ్మనకు ధాత్రి, భువనత్రయాబ్జకుఁ ♦ బుట్టినిల్లు
భాసురనిగమాళి♦పాలికి దొరసాని, పరమసౌభాగ్యంపుఁ♦బట్టుఁగొమ్మ
నిఖిలప్రపంచస♦న్నిధికి నిధానంబు, మానసంపదలకు ♦ మందసంబు
పావనక్షేత్రక♦ల్పకలతాలవాలంబు, మహిమాతిశయముల ♦ మనుకుఁదల్లి
గీ. మహితగుణవిశ్వకర్మని♦ర్మాణధర్మ,సూత్రకౌశలమునకుఁ దొ♦లూచాలనంగ
వరధరణియందు సకలదై♦వతవితాన,ఘట్టనము వేంకటాచల♦పట్టనంబు. 73
వేంకటేశ్వరవిలాసము, ఆ 1 పద్య 1,

సీ. బంగారుకోటల ♦ రంగుపూఁదోఁటలఁ, బూచినపూఁపు తీం♦పులు ఘటించు
నూటిమేడలయందు ♦ నాటచేడియలందు, వెలిచప్పు టెంపలయున్ ♦ పింతగుల్కు
నుజ్జ్వలగేహములందు ♦ గజదేహములయందు, దానధారాపాని♦జాని మీఱు
ఖలుమండపంబుల ♦ లలితకావ్యంబుల, బహువర్ణాచ్ఛవి♦భ్రిమము మెఱయు
గీ. ధీరులందును రణరంగ♦వీరులందు, ధర్మగుణశక్తిమహిమంబు ♦ దనరియుండు
నహహ యీరాజధానియం♦దనుసాగనులు, వర్ణనలుసేయఁజిత్రి మి♦వ్వానుధలోన.
సీ. పద్మరాగారుణ♦ప్రితిభచేఁ జెలువొంది, ఘనచంద్రిమండల♦కాంతి మించి
వరమంగళప్రాప్తి ♦ నిరవొంది సద్బుధ,స్థితిఁ గాంచి గురుకళా♦సిద్ధి మించి
సుకవీశ్వరాసక్తిఁ ♦ జూపట్టి ఘనగతి, నీలాసితద్యుతిఁ ♦ జాల మీఱి
శిఖివిరాజగను సుధీ♦హితమస్థితి వహించి, కర్బురకేతు స♦త్కాంతి నూని
గీ. గగనమండలగతిఁ జెలం♦గఁగ ననూన, గరిమ విలసిల్లు ధనధాన్య♦కలితలలిత
వైభవంబుల మించియు ♦ వసుధ వసుధ,రాజపురమున నలరు నా♦రాజధాని. 77
కవిచకోరచంద్రోదయము, ఆ 1.

సీ. శ్రీలీల రత్నాక♦రాలయోన్నతిఁ గాంచి, హరితెఱంగున లక్ష్మి ♦ కాస్పదమయి
వాణిరీతి సువర్ణ♦వైఖరి నింపొంది, శతధృతిగతి సర♦స్వతి నెసంగి
కాళికైవడి రాజ♦హాళిసంగతి గల్గి, హరునిచందమున నా♦ర్యాప్తి నొంది
కైలాసమట్లు దు♦ర్గవిలాసమున మించి, వైకుంఠమట్లు ము♦క్తాకరమయి
గీ. సత్యపదమట్లు పరమహం♦సప్రిచార, చారుతరమయి బ్రహ్మంబు♦సరణిఁ బరఁగు
రూపమై మీఱు నిత్యేంది♦రాపదాబ్జ,పట్టనంబు వేంకటగిరి♦పట్టనంబు. 78
రాధాకృష్ణసంవాదము, ఆ 1 పద్య 149.

గీ. కలిత సదాజహంసమం♦డలము గాన, రమ్యపుష్కరకమలాక♦రప్రపంబు
మఱియుఁ గాదేని గురుకవి♦మకరమిథున,పరిస్ఫృతముగాఁగనేల ప♦త్పురవరంబు.
ఇందుమతీపరిణయము, నృసిం. ఆ 1 పద్య 14.

సీ. గారుత్మతపస్ప్రర్ధి♦కలు సైకతములుగా, సౌధముల్ గర్భస్థ♦శైలములుగ
శశికాంతకృతచతు♦ష్పథములు ద్వీపులుగాఁ, గరిఘటల్ మకరసం♦ఘాతములుగ
నుత్తాలసాలంబు ♦ లుల్లోలతతులుగాఁ, దళపతాకములు మ♦త్స్యములు గాఁగ
నఖిలాంగనాజనం ♦ బప్సరోగణముగాఁ, బురలక్ష్మి కల్మిపూఁ♦బోఁడి గాఁగ
గీ. సతతమంగళతూర్యని♦స్వనము లెల్ల, ఘనతరంగరవంబులై ♦ కడలు కొనఁగ
క్షీరవారాశియో యనఁ ♦ జెలువు మిగిలి, హరికి శుభకరమైయొప్పు♦నప్పురంబు.
భద్రాపరిణయము, ఆ 1 పద్య 100.

మ. చతురంబై చతురశ్రిమండలసమ♦స్థానస్థితంబై మహా
ద్భుతశోభాస్పదమై యభూతచరమై ♦ పొల్పారి కోశద్వయా
యతవిస్తారము నొప్పురిన్ సపరిఖా♦హస్యూర్ధ్వ రాజించు నం
చితపార్శ్వద్వయ సాంద్ర సౌధ నివహా♦శ్రీవీథికాశ్రేణికల్. 81

మ. వరవప్రావృతమై యుపస్థిత నుద♦న్వత్సేయదుర్ధర్ష దు
స్తరమై తూర్పున దక్షిణంబున సము♦ద్యద్యంత్రముద్దస్త దు
ర్గరమాదుర్గమమై ప్రతీచిని మహా♦గాధాబ్ధిశాఖాప్రవా
హాయాఘ్యం బయి యొప్పు నప్పుర మ♦భేద్యంబై యజేయస్థితిన్. 82

చెన్నపురీవిలాసము, ప్రథమ స్వ.

సీ. కమలాప్తబింబంబుఁ ♦ గలశంబుగాఁ జేసి, కొనఁజాలు పడగలఁ ♦ బసరు రథము
లటు కరంబులు సాఁచి♦యమరఘనీసరో,జములఁ ద్రుంపఁగఁజాలు♦సామజములు
హరితేరిబాబాల ♦ కర్థపులాయిత,క్రమముఁ జెప్పగఁ జాలు ♦ ఘనహయములు
పిడికిటిపోటుల ♦ బిరుదుకొండల నైనఁ, బిండిచేయఁగ నోపు ♦ వీరభటులు
గీ. కనకరౌప్యవినిర్మిత♦గగనచుంబి, మేరు కైలాస సన్నిభా♦గారములను
నందనోపమోద్యానవ♦నములు గలిగి, పొలుచు వేంకటగిరినామ♦పురవరంబు. 83

గోపీనాథరామాయణము, పీఠిక. పద్య 55.

గీ. భవ్యగుణరత్నబహుసుధా♦భవనరాజ,మండలోదయసదనంత♦మహితభోగ
లసితపురుషోత్తమశ్రీవి♦లాసలలిత,మగుచు విలసిల్లె నప్పుర ♦ మబ్ధికరణి. 84

వల్లభీపల్లవోల్లాసము, ఆ 1 పద్య. 53.

సీ. చదలేటిదరిఁగల ♦ జాజుచిన్కలనాను, గడునెత్తుగురుఁజులు♦గల్గుగోట
లలరు నత్తెలిచెట్టు ♦ నలరులఁ గేరెడు, ననలీను చెట్లను ♦ దనరుదోఁట
లలచందురునిజింక♦కెల గడ్డియను నాన, లీడు చందుకొడుకుదా♦కెనఁగ నగరు
లెన్నిక దలయింప్ల♦హొన్నగిండులఁద్రాలు,తోగ పాయుదపనాలఁ♦బోఁచుతొగరు
గీ. లొనర జెండాలకోకల♦నుట్టుగాలి, నచ్చరలకొండు నలయిక ♦ లిచ్చు నదఁచి
సిరుల నెలకొన్న సేస్తుల♦చేఁజెలంగి, చక్కఁదనరు నయోధ్యనా♦నొక్కయూరు

శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనకుశచరిత్రము, ఆ 1 పద్య 4.

సీ. ప్రాకారములు నదీ♦ప్రాకారములు బహి,ర్గోపురంబు లతీల♦గోపురములు
కాసారములు సూర్మి♦కాసారములు సౌధ,జాలకంబులు రత్న♦జాలకములు
చతురంగములు మహో♦చ్చతురంగములు రాజ్ఞి,కేతనంబులు బద్ధ♦కేతనంబు
లారామములు సత్ఫ♦లారామములు తత్స,భాజనములు ధర్మ♦భాజనములు.

గీ. జగతి నలసప్తనగరరా♦జగతి మిగుల, నెన్నిపురము లొప్పు నన్నిటి♦నెన్నితనరు
భావనాతీతదివ్యప్ర♦భావనాళి, నాపురంబు జయేందిర♦కాపురంబు. 86

రామరాయవిలాసము, ఆ 1 పద్య 80.

ఉ. శ్రీమహితేందుకాంతమణి♦చిత్రిత నిర్మలహర్మ్యరాజి శో
భామిళితాఖిలాంబుజభ♦వాండము గావున వార్ధికన్యకున్
నేమపుసద్మమైన సిత♦నీరజమో యన విశ్వకర్మ తాఁ
గాను మెలర్పఁ జేసెఁ దగఁ♦ గన్నుల కింపగు ద్వారకాపురిన్. 87

కాళిందీపరిణయము, ఆ 1 పద్య 52.

సీ. నారికేళులసోదు ♦ నారికేళులరీతి, సరసజన్మఫలాప్తి ♦ సంఘటించుఁ
గమలాకరంబులు ♦ కమలాకరములట్లఁ, బటుసారసముల శో♦భలవహించు
రాజమార్గంబులు ♦ రాజమార్గంబుల,భంగి సద్రత్నసం♦పదలఁ జెలఁగు
వాహినీవరములు ♦ వాహినీవరముల,గతి సింధుకాండసం♦గతిని మించు
గీ. రాజు లారామలాలిత♦సీమలవలె, నిత్యసుమనఃప్రమోదత ♦ నెరయ మెఱయు
నహహ తత్పురి వర్ణింప ♦ నలవియగునె, ధారకైనను గోకర్ణ♦నేతకైన. 88

నరసభూపాలీయము, ఆ 1.

సీ. మగతాల జిగితూల ♦ నగఁజాలువగఁ గ్రాలు, తెలిడాలుగల మేలు♦తిన్నెలమరఁ
జెనుగట్టులను రట్టు♦లను బెట్టునునుగుట్టుఁ, గొని తిట్టఁగనుపట్టు ♦ కోట లదర
నలరమ్ము చెలువమ్ము♦లలిఁ గ్రమ్మి వెలిగ్రుమ్ము, మురిపెమ్ము నెఱవమ్ము♦ముగుద లఱర
నెనలేని గొనబూని ♦ పెనుకోనలను చేసె,తెర లానువొరలేని ♦ తేఁటు లొలయ
గీ. నెచటఁ గనుఁగొన్న నేనుంగు♦లేపుచూప, నెల్లవోటుల గుఱ్ఱంబు♦లెసక మెసఁగ
ముజ్జగంబులఁగల ప్రోళ్ల♦ముదువు నవ్వ, యలరుచుండు నింద్రప్రస్థ♦మనెడు వీడు.

రసికజనమనోరంజనము, ఆ 1 పద్య 29.

# సౌధవర్ణనము.

౨౩



చ. అలఘుతరంబులై తుహిన♦హారిసుధారుచి నిందురోచిరా
కులశశికాంతవేదిపృ♦థుకుంజగళజ్జలనిర్ఝరంబులన్
విలసితజాహ్నవీవిమల♦వీచివిలోల లసత్పతాకలం
బొలుపగుఁ దత్పురీభవన♦ముల్ హిమశైలముఁబోలి యున్నతిన్. 90

భారతము, ఆది. ఆ 8 పద్య 72.

ఉ. సోరణగండ్ల రాఁ గొదమ ♦ చుక్కలు పట్టి సతుల్ కవాటముల్
చేరుప మౌక్తికంబు లని ♦ చిల్లులు వుత్తురు దమ్ముటించుఁజొ
ల్పారు వితానహారముల ♦ యందొకహారత ద్రేలి పొద్దువోఁ
గా రతి డస్సి గాడ్పులకుఁ♦గాఁ దెఱవ న్గను విచ్చుమేడలన్. 91

ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 13.

సీ. పాండురప్రభఁ గ్రిందు♦పడిన చీఁకటివోలె, జిగినొప్పు నీలంపు ♦ జగతి మెఱసి
యౌన్నత్యమున మిన్నింగి♦నట్టినింగులుగ్రక్కు, కరణి ధూపము గవా♦క్షముల వెడల
ధారుణీపతి సుగం♦ధద్రవ్యములు దాఁచు, నరల పేటికవోలె ♦ బరిమళముల
నెలవులై చెలువారు♦నిలుప్రల విలసిల్లి, కొణిగఁబారావత ♦ కులము వదరఁ
గీ. బసిఁడినీటలిఖించిన ♦ ప్రతిమలమర, నీఁగవాలిననందండ♦మొలుఁగులొసఁగు
నట్టి సకినలమంచము♦లాదిగాఁగ, మెఱయు పరికరములనొప్పు♦మేడమీఁదఁ. 92

మనుచరిత్రము, ఆ 6 పద్య 3.

క. పురి రాకొమరులగీత్యం, బరవాహిని భుజగపురికి ♦ జలువిడిఁ జని యం
బిరవుకొన నెడముచాలమి, మరలినవరి బుగ్గలన న♦మ్మరు సౌధంబుల్. 93

పాండురంగమాహాత్మ్యము, ఆ 1 పద్య 107.

మ. శ్రీవణోదంచితశబ్దవిస్ఫురణమై ♦ శయ్యావిశేషాలఘా
లవినోదాస్పదమై సముజ్జ్వలతరా[illegible]మై చిత్రబం
ధవితానస్ఫుటమై సువర్ణరుచియు[illegible]క్షించు స
[illegible]ంబును బోలి చూపఁదగు రంగత్కోటిసౌధంబులన్. 94

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 5 పద్య 97.

ఉ. పున్నమ రేలఁ దత్పురము ♦ పొంతనె పో శిఖరాళిఁ దాకి వి
చ్ఛిన్నగతిన్ సుధారసము ♦ చింది పయిం దిగువాఱ నంతనుం
డి వెన్నెల సన్నగిల్లు నది ♦ నిక్కము గాదని రేని యా పదా
ర్వన్నెపసిండిమేడలకు ♦ రాఁ బని యే మిల సౌధనామముల్. 95

విజయవిలాసము, ఆ 1 పద్య 72.

శా. ఛానల్ మించులు గాఁగఁ జిత్రిజరుచుల్ ♦ చక్రాయుధశ్రీలుగా
నానారత్ననిబద్ధభూమితల మం♦తర్వాకిపూరంబుగా
నానందధ్వనితంబు గర్జితముగా ♦ నభ్రంకషాగ్రంబులై
శ్రీనిండారెడు వీటిమేడలు ఘన♦శ్రేణిన్ విడంబింపవే. 96

రామవిలాసము, ఆ 1.

సీ. శశికాంతమణిగణ♦స్థగితభూములతోడ, నీలపురాల తి♦న్నియలతోడ
నిలువుటద్దములం బ♦న్నినకుడ్యములతోడఁ, బటికపు గుంద్రకం♦బములతోడ
వన్నెలీనెడు జాళు♦వామూలములతోడఁ, గలధౌతమయవిటం♦కములతోడఁ
దీరైనకెంపుల♦చూరుమొగ్గలతోడ, మరకతంబులగుజ్జు♦పరుపుతోడఁ
గీ. తగడుమెఱుఁగులద్వారబం♦ధములతోడఁ, బచ్చిపగడపుఁదలుపుల♦బారుతోడఁ
గళలలరు వ్రాఁతపనుల మే♦ల్కట్లతోడఁ, జూడఁదగు నంతరంబుల ♦ మేడలోన.

వాసవదత్తాపరిణయము, వక్క. వీ. ఆ 1 పద్య 179.

ఉ. మేడలఁ బువ్వుఁబోఁడులు స♦మేలముతోడ విపంచిగీతముల్
పాడఁగ గోత్రవైరివిని♦పంబినవేడుక నింద్రనీలముల్
పాడినిబంపెనాఁగ మధు♦పంబులు వేలుపుటేటినుండి యా
గోడల చూరుపట్టైలను ♦ గూర్చినతమ్ముల వ్రాలవచ్చెడున్. 98

కవిజనచకోరచంద్రోదయము, ఆ 1 పద్య 57.

క. ఆనగరి సౌధయూథము, లా నగరిపు నగరిదెంత♦యనినగు రుచిరం
బైన గురుత్వమున సుధా, శీనగు రుచికలిమిఁ గ్రిందు♦సేయుచు నెపుడున్. 99

రామరాయవిలాసము, ఆ 1 పద్య 63.

ఉ. చక్కని రాచకన్నియలు ♦ సౌధములన్ శ్రవణామృతంబుగా
మక్కువఁ బాడుచున్ లయ స♦మానగతిం బదఁ జెండుఁ గొట్టుచోఁ
జుక్కల ఱేఁడు మైమఱచి ♦ చూచుచు నిల్వఁగ సప్పరంబు సం
దక్కొట చెంత తాఁ బడి ♦ యారెని మేనికిఁ గందు గల్గఁగా. 100

శంతనూపాఖ్యానము, ఆ 1 పద్య 27.

గీ. భాగ్యరాజ్యాధిపతుల సం◆బంధమునను, ఊరసౌధంబులను రాజ◆యోగమొప్పె
భాగ్యరాజ్యాధిపతులసం◆బంధమునను, రాజయోగంబొనర్చుఁ జి◆త్రంబెపుడమి.
సావిత్రీపరిణయము, ఆ 1 పద్య 105.

చ. కువలయపత్రిలోచనలఁ◆గూడి సుఖించుచుఁ గేళికారస
ప్రవణనిజాంతరంగులు ప◆రంగులు నిల్వఁగ సప్తభూమికా
భవనము లొప్పు భూరిబిల◆వారచరత్సురసిద్ధసంప(త్తి?)
నివహములైన తారధర◆ణీధరమందరశైలముల్బలెన్. 102
చెన్నపురీవిలాసము, ప్రథమ స్వ.

ఉ. చొక్కపుఁబైడిమేడలను ◆ సొంపగు పచ్చలచూరుపట్టెలం
జెక్కినకప్పుజాలపని ◆ చిత్తరుప్రాఁతలపారువంబులన్
ప్రక్కనటంచుఁ బట్టుకొన ◆ దగ్గఱమ్రాఁకుల నుండుడేగపాల్
నిక్కుచు నంటద న్వేగయ ◆ నేరక క్రమ్మఱివచ్చు నిచ్చలున్. 103
రసికజనమనోరంజనము, ఆ 1 పద్య 31.

---

# పరిఖావర్ణనము.

మ. పరిఖం దత్పురకామినీజనము లం◆భఃకేళి సల్పంగఁ ద
ద్గురువక్షోరుహలిప్తసంకుమద క◆స్తూరీమిళచ్చందనా
గురు పంకంబుల సౌరభంబులఁజూపి ◆ కుంభీనసావాస ని
ర్జరకల్లోలినికందు భోగవతినాఁ◆జన్ సంజ్ఞ గల్గె న్దగన్. 104
ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 6.

చ. తనమణులన్నియున్ మ్రుసు ము◆దంబలరార నురల్వారించి రం
చును బరికించి మేరుగిరి◆చుట్టును జుట్టక యాక్రమించెనో
వననిధి కాంచముల్మెఱయ◆వచ్చి యనం గననొప్పు నప్పురిం
గనకపుఁగోటచుట్టును బొ◆గడ్తకునెక్కి యగడ్తచక్కఁగన్. 105
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 1 పద్య 25.

ఉ. లోకము లన్నియుం దనకు ◆ లోనుగ నుండఁగ దన్ను లోనుగా
గైకొనెఁ బక్రివాళి మని◆పావక సన్నిధిఁ దాఁ దపంబు ర

త్నాకరమాన నత్తరి త♦జాపరజాన్వృతిఁ జేసి నిత్సెనో
కాక యొజుఁగు మ్ర నవఁగాఁ ♦ డగు నట్టి యగడ్త రూపమై. 106

అనిరుద్ధచరిత్రము, ఆ 1 పద్య 54.

మ. పరిపక్వస్ఫురదశ్వఘోరఖురభి♦న్నారామభూనారికే
ళరసారుట్ఫలనిర్గళద్విమల నీ♦రస్ఫారధారాధరాం
తర వర్తిష్ణుతఁ దోయపూర్తిఁ గని దా♦నన్ మబ్బుధారాధరా
ళ్యు రహింపన్ జలరాశిపర్యాప్తమయి ఖే♦యనూర్తిఁ గొల్చెం బురిన్. 107

ఉత్తరరామాయణము, ఆ 1 పద్య 55.

క. పురిపరిఖయొప్పుసహితా, మరసాక్షీజలవిహా♦మంగళమహిమా
కరరుచిపరిపూర్ణాంభ, స్సరోలలామంబనంగ ♦ సత్కవి హితమై. 108

కౌసల్యాపరిణయము, ఆ 1.

ఉ. శైవలనీలముం గమల♦శాలియునైన యగడ్తనీరు ప
ద్మాకరపాళిఁ బ్రాంతతోడి కర♦కంచుగ నొప్పుచుఁ గోట శాటిలా
గై వఱలంగ హర్మ్యకన♦కాంశునికాయము పేరఁ దత్పుర
శ్రీవిలసిల్లు నభ్రచర♦సింధువు పూళికి మల్లెదండగన్. 109

కళాపూర్ణోదయము, ఆ 1 పద్య 112.

క. నరవరమణిహర్మ్యవిభా, కరబంధురకనకవరణ♦కైతవజాగ్ర
త్పరిధియుతమధ్యతలమై, పరిఖాపుష్కరము తేట♦పడు నవ్వీటన్. 110

చంద్రభానుచరిత్రము, ఆ 1 పద్య 61.

సీ. మారుతోద్ధూతవి♦స్మయ తరంగంబులు, మిన్నేటితోడుత ♦ మేల మాడఁ
గమలనీలోత్పల♦కైరవకల్హార, పుష్పవాసనలుర్వి ♦ బుగులు కొనఁగ
మహాదద్భుతగ్రాహ♦మత్స్యకచ్ఛపములు, సంతత విశ్రాంతి ♦ సంచరింప
బకచక్రవాక ష♦ట్పదమరాళంబుల, నాదంబు చెవుల కా♦నంద మొసఁగఁ
గీ. బంత మొప్పఁగ బడబాగ్ని♦బాధఁబట్టి, యుదధి యందుండి తావచ్చి♦యున్నదనఁగఁ
బరఁపు నిడుపును లోఁతును ♦ బరగఁగలిగి, పరిఖయొప్పును సాకేత♦పురమునందు,

మైరావణచరిత్రము, ఆ 1 పద్య 42.

చ. తనపయి నొక్క పర్వతము ♦ దాపయి యుండఁగ లోన నుండున
వ్వననిధికెంత గొప్పయని ♦ వారక యున్నతమైన కోటచు
[illegible]

ఘోన సవిలాశయంబగుచు ♦ ఘాసిలు చుండును ఖేయమప్పురిన్. 112

రుక్మిణీకళ్యాణము, జ. వేం. ఆ 1 పద్య 50.

క. నూత్నముగఁ బరిఖ యొప్పెఁ బ్ర, యత్నముగా నచట తటయు♦గాబద్ధమహా
రత్నాకరఘనసంపద, రత్నాకరి మన గభీర♦రచితాంతరమై. 113

ముకుందవిలాసము, ఆ 1 పద్య 100.

చ. సురుచిరమాధురీజలము♦ చొప్పడెనేని పరిస్ఫుల్లహల్లకాం
బురుహ సితోత్పలప్రభవ♦పుష్పమరందరసానులుబ్ధ బం
భరములు కల్గెనేని, తన♦భంగగుణంబు లడంచెనేని, యా
శరనిధి తత్పురీపరిఖ♦సాటియొనర్పఁగ వచ్చునెన్నఁగన్. 114

పద్మినీపరిణయము, ఆ 1 పద్య 61.

చ. అతులమహాగభీరపరి♦ఖాంబువిహార భుజంగమాంగనా
ప్రతతి మహోఘణద్యుతులు♦పల్కులు నారసి పుష్పలావికల్
మతినరుణోత్పలాబ్జకుసు♦మభ్రమ డాసి తదీయ భీకరా
కృతి పరికించి తత్తటిలి♦త్రిమ్మరుచుండుదు రప్పురంబునన్. 115

రామచంద్రోపాఖ్యానము, వా. వేం. ఆ 1 పద్య 54.

గీ. నల్లగలువలు దొగలు కెం♦దామరలును, నీలమణిశుక్తివిద్రుమ♦లీలఁదనర
శీకరంబులు మౌక్తిక♦శ్రీవహింపఁ, బరగు రత్నాకరముఁబోలెఁ♦బురము పరిఖ,

హరిశ్చంద్రోపాఖ్యానము, శం. క. ఆ 1 పద్య 89.

ఉ. ఆనగరంబువప్రమున♦కావృతియైన యగడ్త తీరు సం
భోనిధిసౌరు నేర్పుబుపఁ♦బొంకముగామిఁ బ్రజల్ భ్రమింపగా,
నానలినోద్భవుండు సహ♦జాంబునిధిన్ జలనీలికామిషన్,
బూనిచి ముద్రవేయఁగ స♦ముద్రమునాఁజను వార్ధి యిప్పుడున్. 117

భోజసుతాపరిణయము, ఆ 1 పద్య 58.

క. పడమటియది సాగరమని, యొడు తప్పొలమాటఁడక్క♦ నేతత్పురి న
ల్గడలందుఁ బరిఖలెవ్వియొ, జడనిధియెవ్వోడియొ♦ లెలియశక్య మెఱిజనన్. 118

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 1 పద్య 65.



చెనుచు మదమున ననలమ్ము ♦ గొనుచు మనుచుఁ, బుప్పలావికలుం దురగ ♦ ప్పురమునందు.

రుక్మిణీపరిణయము కూచి. తి. ఆ 1 పద్య 54.

సీ. సరసిజంబులు సారె ♦ సారెకు నెనయించి
యంబుజంబులు ప్రియం ♦ బలరఁ జేర్చి
చంపకమాలికల్ ♦ సొంపెసంగ నమర్చి
విచికిలస్తబకముల్ ♦ విస్తరించి
యుత్పలమాలిక ♦ లొప్పుగాఁ బొసఁగించి
కడు సుకేసరము ల ♦ క్కజుఁ బెనంచి
లలినెలయు సుజా ♦ తులు నాడెముగ నిల్పి
మఱియుఁ బేరగు నన ♦ మంజరులును
గీ. గరము మెఱయించి సుకవుల ♦ కరణిఁ బెక్కు, చందములనీటుఁ జూపుచు ♦ సరసులగు ప్ర
బంధలీలల నలరింతు ♦ పటువిలాస, భాజనము లందు పుష్పలా ♦ వీజనములు 311

రసికజనమనోభిరామము ఆ 1 పద్య 49.

చ, ఎనసినతమ్మిమొగ్గలవి ♦ యేగతివిచ్చెను విచ్చు టబ్బ్రిమా
యినకరసంగతంబయిన ♦ నీతొవలో యవి రాజవీక్షణం
బునమను లంకెలంచుఁ బురిఁ ♦ బువ్వులు పిల్చెను బుప్పలావికా
జనతతి పల్లవోక్తుల త ♦ సంబు లెఱింగి చమత్కృతుల్ దగన్. 312

మిత్రవిందాపరిణయము కుం. వేం. ఆ 1 పద్య 24

చ. కలువలతేమి నీవిపుడు ♦ కన్గొనినంతనె తెప్పతెప్పలా
నలినములెన్నిరావు లల ♦ నామణి నీవిటు మోముఁ ద్రిప్పినన్
వలసినసంపెఁగల్ గలుగ ♦ నా మతి నీ మెయిచాయ డాయ నం
చెలమి విటాళిపల్క విర ♦ సిస్తును నప్పురి పుష్పలావికల్. 313

తారాశశాంకవిజయము ఆ 2 పద్య 29

సీ. నెత్తమ్మి జూచెద ♦ నీవింత వదలించు, నీవింత వదలక ♦ నేవిధంబు
నీకులుఁ జెండ్లేవి ♦ పైకమ్ముఁ దప్పించు, పైకమ్ముదప్పునే ♦ చేకొనంగ
నెంతనీకైదండ ♦ నిచ్చెదవటె మేలు, కైదండ యిత్తురే ♦ కరము దలక
భావింపు చియేమొ ♦ బంధుజీవంబేది, యూబంధుజీవనం ♦ బెందుగలుగు
గీ. ననుచు వీథుల సరస న ♦ ర్మానుకూల, వచనరచనల మెలఁగుచు ♦ వఱలు విటుల

కనుగుణంబుగఁ బలుకుచు ♦ ననుదినంబు, వెలయుదురుపేటఁ బుష్పలా♦వికలు ప్రీతి.

ఓష్ఠాణీయము ఆ 1 పద్య 39

సీ. పలువరుసలకుంద♦ములఁ జూడఁ బ్రియమయ్యె, వెలయింపుపొంపున♦బలుకఁగదవె
వగఁజూపు నల్లక♦ల్వలవినోదము తానె, వలపులముంచె న♦వ్వారిగాఁగ
మేలుచేఁ దమ్మిక్రొ♦మ్మిన్నలుగులెక్కఁడు, కూరిచి దయసేయు ♦ పేరుగాఁగఁ
బెంపొందెనాసనం♦పెఁగ నిగన్నిగలచే, ముద్దియ వేఁడెవ ♦ మొగి నొసంగు
గీ. మనుచు ననుచుముదంబున♦నంటిపల్కు, జాణల వచశ్చమత్కృతి♦ సరణిఁ దెలిసి
తెలివిఁజిలుకనవ్వు లొలయంగ♦నలరి యలరు, లమ్మునురుబుష్పలావిక♦లప్పురమున.

అనిరుద్ధచరిత్రము ఆ 1 పద్య 68

సీ. వెలకుఁజూపవుపొన్న♦విరియంత గోప్యమా, యదియపెంటులలోన♦నయ్యెఁజుమ్ము
కప్పుకోనేల బం♦గారమా పువుబంతు, లవి సువర్ణలతో య♦దములు సుమ్ము
మూసిపెట్టెదు మల్లె♦మొగ్గలింత బ్బ్రమా, యవి సుధారాశిచే♦నపవి సుమ్ము
దాఁచుకొంటివి యరు♦దా? నల్లగలువ పే, రది యగాధసరోవ♦హనము సుమ్ము
గీ. టంచు ముసిముసినగవు ల♦న్యోన్యవచన, మంజులవ్యంగ్యచాతురీ♦వ్యంజకములు
గా విటులకమ్ముదురు విరుల్ ♦కాముకైక, జీవికలు పుష్పలావికల్ ♦ సెలఁగిపురిని.

కవిరాజమనోరంజనము ఆ 1

సీ. జాలకమాలికా♦జాలంబులెత్తుట, నుదుటు ముత్యపుఁ బేరు ♦ లొసఁగు మనుట
సరసబంధూక గు♦చ్ఛముఁ జూపి కప్పుట, నలపొన్నగుంకఁగా♦నలదు మనుట
దళముగాఁ గెందమ్మి ♦ దళములుగూర్చుట, నీమీఁదననురక్తి ♦ నెగడె ననుట
చికిలిసంపెఁగ ననల్ ♦ సెలిమిచేనిచ్చుట, గుఱుతుచంపకలతా ♦ కుంజ మనుట
గీ. తెలుపకయ తెల్పికడుసేర్పు♦ జేటపడఁగ, నలరుబోంకులఁ జెలఁగించి♦యఖిలకమన
పాళి తమ దండకై యాస♦పడఁగఁ జేసి, విరులు విల్తురు కుసుమలా♦వికలు వీట.

చంద్రికాపరిణయము ఆ 1 పద్య 105.

సీ. పాల్లికాగ్రింబుపై ♦ మొల్లమొగ్గలఁ జేర్చి, పల్లవోష్ఠము దంత ♦ పంక్తిఁ జూచి
పంకేరుహముల ను♦త్పలములజతలుంచి, మొగమును గనుదోయి ♦ సొగనుఁ జూచి
కనకకోరకము చెం♦గట మల్లెవిరియుంచి, నాసయుఁ బద్మ్భవ♦ణంబుఁ జూచి
చిగురుటాకులచెంత ♦ మొగలిరేకులుగూర్చి, కరతలంబులు నఖా♦గ్రములుఁ జూచి
గీ. పిరులుగొనవచ్చియువజను♦ల్మరుని బారిఁ, జనుటఁగని జాణతనమునఁ♦ గొనుఁడు పూల
బంతులని వేలు వక్షము♦పై ఘటించి, విలువఁ దెమ్మందురు పుష్పలా♦వికలు పురిని.

వాసవదత్తాపరిణయము వక్క. వీ. ఆ 1 పద్య 165.

ఉ. మా ముఖనేత్రబాహుకుచ♦మంజిమ లిట్టివియంచుఁ బేర్మితోఁ
గాముకకోటికిం దెలుపు♦కైవడిఁ దమ్ములు నల్లఁగల్వలున్
గోమలపుష్పదామములు ♦ గుచ్ఛము లంగటఁ బెట్టి యమ్ముదు
ర్వేమఱుఁ బుష్పలావికలు ♦ వీటను నర్మవచఃప్రవీణతన్. కవిజనరం. ఆ1 పద్య 15.

ఉ. వాడనిపూలచెండ్లు గొన♦వచ్చితి నెచ్చెలి నీదుపజ్జకున్
వాడనిపూలచెండ్లకెన♦వచ్చిన పొమ్ము సువర్ణశైలమే
వేడుక నంతకెక్కుడగు♦విత్తము నిత్తు మటంచుఁ బల్కు మా
ఱాడక క్రొన్ననల్ విటుల♦కమ్ముదు రప్పురిఁ బుష్పలావికల్. రామవిలా. ఆ 1.

సీ. పొగడవిరుల్ లేవె ♦ మృగరాజమధ్యమ, విటరాజ చెంగల్వ ♦ విరులు గావె
జాతులేమైనను ♦ సంతరించి తెకొమ్మ, నేర్పుకోవలసిన ♦ నీటుకాఁడ
వగలాఁడి యిచట సు♦వర్ణముల్ గల్గునే, కలయిండ్లఁ గలుగును ♦ జెలువరాయ
తమ్ములఁ జూపవే ♦ తరుణీశిరోమణి, యాడఁగాఁ జనిరి రే♦పాడి రమ్మ
గీ. వలయు పున్నాగతతులేవె♦ వన్నెలాఁడి, యేల యడిగెద వీయూర♦నేమి కొదవ
యని విటుల జాణతనముల ♦నపహసించి, పువ్వులమ్ముదురవ్వీటఁ♦బువ్వుఁబోండ్లు.
ఉత్తరరామాయణము ఆ 1 పద్య 72.

చ. కరకలితారుణద్యుతులు ♦ గ్రమ్మిన పాండుసరోరుహోత్కరం
బరుణసరోరుహంబులని ♦ యంచఁ జపాంగవిలోకనోత్కరం
బౌరసిన తెల్లగల్వలసి♦తోత్పలపాళియటంచు డాయున
ప్పురి విటకోటి నవ్వుదురు♦వో చతురోక్తులఁ బుష్పలావికల్. 323
శకుంతలాపరిణయము, పె. నా. ఆ 1 పద్య 90.

సీ. కొనఁగోరెదను నాటి ♦ కుసుమమియ్యవె బోటి, యౌవనంబునను గో♦రంటలేదు
కొమ్మ పల్లవపాళి ♦ నమ్మవేలనెకాంచ, నమ్మ లోసంగక ♦ నమ్మరాదు
మదతి యిచ్చనుగుత్తు♦లొడవు మీానివి నీ, కిచ్చెద నెపుడైన ♦ నిపుడు నిలువు
బాల నీసరస ర♦సాలసత్త్వము గంటి, మావిహారములందు ♦ మనను గలదె
గీ. యనుచుఁ దమతమ తమిఁ దెల్పి♦కొనుచు వచ్చు, విటుల నిటులలితోక్తి సం♦క్షుటసపటము
నాదరించుచుఁ గులుకుటొ♦య్యారములను, పొలఁతులమ్ముదు రంగళ్ళఁ♦బుష్పలచట.
అచలాత్మజాపరిణయము, ఆ 1.

ఉ. అంగన నీవు పువ్వుగటు ♦ లాపెవె యౌ మగవారు లేరె లే
కంగడిఁ జేరినావె వఖు ♦ లా వెలఁబం గొను మోవి తేనె బం
తిం గనకుంప దాఁతురఁటె ♦ తేరకు చూపు దుబా ఔటుఁడ కొ

న్నలఁగడి మారు బేరములె ♦ యంచు వచింతురు పుష్పలావికల్. 325

రాధామాధవసంవాదము, ఆ 2.

సీ. ఆలిశుచంబు లే ♦ నంటి చూడఁగ నౌనె, కొనగోరు మాటి పై♦కొనకు జాణ
పెదవింతమొగ్గజూ♦పినఁ గొందు వగలాడి, నునుపంట నొక్కకు ♦ ననుపుకాఁడ
సొబగొందునీదండ♦జోడుగావలె బాల, పైకమ్ముఁ జూపి చే♦పట్టు దిట్ట
నెలదింపు నీపొందు ♦ గలువ నెమ్మదివచ్చు, నీ విమ్ముఁ జేర మ♦న్నించుదాన
గీ. ననుచుననిచిన నెరజాణ♦తనపువచన,రచన లలరించి మోహంపు♦రుచుల నించి
మంచివిరులంచు వలపుల♦మచ్చుఁగొలిపి, విలువఁగొందురు పుష్పలా♦వికలు పురిని.

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 1.

సీ. వెలయ నీసరులేవి♦చెలియా నీవిపు డిమ్ము, వేశేయిఁ గనుయిందు(?)♦గోరఁదగునె
కొనఁగోరెదను బట్టు♦కొననిమ్మననుబంతి, చనుబంతు లంటిచూ♦చినను గందు
ముద్దియ లేతమ్మి♦మొగ్గ లానఁగనీవె, పలుగెంపు లిడి గొను ♦ వలసి తేని
కన్నిమల్లియలతో♦వెన్న నెన్నఁడుగల్గు, దండ నుండినఁ గల్గి♦యుండు నెపుడు
గీ. ననుచుమృదువాక్యరచనల♦ననుచు వేడ్క,నలరియలరమ్మపనులనె♦య్యములఁజూపి
సరసవిటులకు నెరిఁబూవు♦సరము లిడుచుఁ, బుష్పలావిక లుందురా♦ప్పురమునందు.

కవిచకోరచంద్రోదయము, ఆ 1.

గీ. లలితఘనపుష్పగుచ్ఛవి♦లాస లగుచు, భువనమోహనకాంతిచేఁ ♦ బొలుపు మీఱి
సత్పథస్థిత లగుచుఁ జం♦చలలరీతి, వెలయుచుందురు పుష్పలా♦వికలు పురిని. 328

మిత్రవిందాపరిణయము, (రావు. జ. రం.) ఆ 1.

చ. వలపుల నిచ్చు కుందముల♦వంకను బొంకపు మంకెనన్ రసో
జ్జ్వల మగు హేమమాలికల ♦ చక్కని జొక్కపుఁ బూవుబంతు లే
వలయునటంచుఁ బల్లవులు ♦ వల్కఁ బ్రివాళమణుల్ నుచంద్రరే
ఖల నిడికొం డటంచు సుమ♦కాండము విల్తురు పుష్పలావికల్. 329

సుమనోమనోభిరంజనము, ఉల్లాస 1 పద్య 71.

ఉ. కాముఁడు తత్పురిన్ బహుళ♦కాముకరూ[illegible]ములం జరింపఁ ద
ద్భామినియుం బహుత్వమును ♦ దాలిచి [illegible]తనికై తదీయసం
గ్రామసహాయతన్ శరప♦రంపర లిచ్చు[illegible]న్విటాళికిం
దామరసాదులైన విరి♦తండము లిత్తురు [illegible]ష్పలావికల్. 330

కృష్ణకల్యాణము, ఆ 1.

# శాలిపాలికలు.

సీ. శ్రీలు దారాట నా◆శ్రితపద్మకర్ణికా,కృతిఁ జెవు లక్కమలక◆ర్ణికల మెఱయ
నతనుసారథ్యకృ◆త్ప్రతిరేఖ మంచపై, నదలించు రొదఁ జిల్క ◆ పదువు పర్వఁ
దొగలమొగ్గల వైవ ◆ దూర మేగమిఁ గొట్టు,చప్పట్లఁ జన్నులు ◆ జడలు గడల
వెడత్రోవ మును చెప్పి◆వడినవ్వఁదిరుగున,ధ్వగులకోలఁది యప◆త్రపయు మరల
గీ. నధరరదనప్రసాదంబు◆నడుగ నోరు, దెఱచెనో యన వ్రీలి ము◆త్తెములు తోఁచు
చెఱకుజంఘులఁ బోలమి◆శిరనువాంచు, రాజనముఁ గాచు గోపికా◆రాజిపాలిచె.

ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 164.

సీ. బలుగుత్తు లేపాటి ◆ ఫలియించెనో భామ, చెప్పినఁ గనరావు ◆ చేలచాటు
బంగారుతీఁగెలో ◆ యంగన తెల్పవే, తళుకులు గనవచ్చుఁ◆ దారసిలిన
కలికి మహాదేవి ◆ కాటుక లేపాటి, తెల్లనివస్త్రముల్ ◆ నల్ల నౌను
బొలఁతి మహారాజ◆భోగముల్ గనరావు, లోపలి కరుదేరఁ ◆ జూపు గలుగు
గీ. ననుచు నప్పురిపొలముల ◆ ననుదినంబు, లీల లెసఁగంగ శాలిపా◆లికలు పాంథ
వరులతో నిట్లు వాక్యోప◆వాక్యములను, బలుకుచుందురు నర్మభా◆వము లెసంగ.

భార్గవపురాణము, ఆ 1.

సీ. బలుముత్తెసరులసొం◆పులు చూపుమన నవి, కంచెలమీఁదుగాఁ ◆ గానరాదె
రాజభోగింబు లే◆యోజనుండునో యన, వరులచాటునఁ జూడ ◆ వాట మగునె
నూఁగారుఁ గన్న వి◆నోద మయ్యెను చెలి,గంటె వేమఱుఁ జెప్పఁ◆గా వరంబె
అరయఁగ నువుచూపు◆మనిన నవ్వుచును చామలలోనఁ జూపుట ◆కలవి యగునె
గీ. యనుచుఁబాంధజనాళితో◆డను తమదు చతురవచనములుబల్కుచుఁ◆బరఁగుచుందు
రఖిలజనఘనమానసా◆హ్లాదగరిమ, పొలముకాపరిబోటు ల◆ప్పురవరమున. 333

కౌసల్యాపరిణయము, అ 1.

సీ. కలికిరో! నీయారు◆గంటినదే కాదు, వాడెను జనుమల◆వనజనయన
పథికేంద్ర! బుతు వేఁగి◆పరికింప నెలదప్పె, నటుగాన వాఁడెఁ బ◆యస్సు తేక
పికవాణి! యెదఁ బండు◆టకుఁ గాల మెయ్యది, మాకెఱిఁగింపుము◆ప్రాకటముగ
యీనినపిమ్మట◆యెదఁ బండుటకుఁ గాల, మనియెఱుఁగవె రసి◆కాగ్రగణ్య
గీ. యనుచుఁబాంధజనులతోడ◆ననుదినంబు, హేతుగర్భోక్తు లాడుచు◆నెదలఁ గరఁగ
మధురగానంబుచే యువ◆మనముఁగొనుచు, శాలిపాలికలుందు రా◆ప్రోలియందు.

నాచికేతూపాఖ్యానము, (నిక్కి.. మ్క్రి.) అ 2.

చ. సారిదిని బిట్టలం పఱుము♦చొప్పనఁ గేకలు వేసి తమ్ముఁ బ
ల్కులు గను చేఁగు సాతులను ♦ మాటికిఁ బిల్చుచుఁ జూపెఁ గొమ్మల
స్నేరయురతిన్ ఫలంబులను ♦ సేతురె యందుటకంచుఁ బల్కుచుం
దుర చిఱునవ్వు మోములకుఁ ♦ దోరముఁ గూర్పఁగ శాలిపాలికల్. 335

కవిజనచకోరచంద్రోదయము, ఆ 1 పద్య 73.

సీ. అక్కలసక్థిన్నతి ♦ నలరారుచున్నవి, బలుగుత్తులా యవి ♦ జలజపాణి
సరసుఁడ వౌదుర ♦ నెరజాణ వెఱుఁగవే, గౌరికుంకుమరేఖఁ ♦ గప్పకొనియె
గౌరికుంకుమములోఁ♦గాంచినఁ గనరాదె, నెటిరత్నసరులందు♦నిండి యుండె
రత్నసరంబుల ♦ రహిలోనఁ గనరాద, బలరామభోగంబు♦నెలవు చెపుమ
గీ. సామి బంగారుతీఁగెల♦ చాలులఁ గపె, నిశలఁ దోఁటలమాటున♦ నెమ్మిఁ జెలఁగు
ననుచు సరసోక్తు లాడుదు♦రనుదినంబు, రసికవిటశాలిపాలికా♦రమణు లచట.

నరసభూపాలరాజీయము, బాల-ఆ 1.

సీ. ఉవిదరో యెటులుండె♦నూరుదెల్పుమటన్న, ననఁటితోఁటకుదగ్గ♦అనుచుఁబలుకు
మార్గంబుఁజూపవే♦మదిరాక్షిరో యన, రెండుకొంపలదండ♦నుండు ననును
నడబావిఁ జూపవే♦నలినాక్షిరో యన, సోపానములచెంత♦జరుగు మనును
లలన కొమ్మలచెంత♦నిలిచిపోయెద మన్న, నిచ్చఁదీఱఁగ నుండ♦వచ్చు ననును
గీ. ఇటుల రసగర్భనిర్భర♦చటులవాక్య,గరిమఁ బాంథులమనములఁ♦గరఁగఁజేయఁ
జాలి యుద్యానసీమల♦నేలుచుండు, శాలిపాలిక లవ్వీటఁ♦జాలఁగలరు. 337

కాళిందీపరిణయము, ఆ 1 పద్య 66.

# హాలికులు.

మ. బలిచూడామణి తండ్రి వియ్యముఁ దలం♦పన్ లచ్చిఁగన్నయ్య ని
ర్మల తోఁబుట్టినవాలుఁగంటి యన స♦ర్వజ్ఞావతంసంబు ని
శ్చలదానైకధురంధరుండు బుధర♦క్షాదక్షుఁ డెల్లుండు ధ
న్యులు గాకే పురి హాలిక♦ప్రవరు లెం♦దున్ ధాన్యపాత్రప్రియుల్. 338

చ. అల విబుధాలయామహినిల♦యంబుల నెప్పుడుఁ దోఁపఁబుట్టువుల్
దలకొని యుండఁగా గరిసె♦లన్ గణజంబుల నెత్తరాదు చే
నిలిచినకుప్పకావలికి ♦ నిల్పుదు రప్పురిఁ గొంగుబత్తెపుం
గొలువున కీయకొల్పి హలి♦కుల్ బికిరంబు బొసంగువేలుపున్. 339

చంద్రాంగదచరిత్రము, ఆ 1 పద్య 24-25.

# సస్యవర్ణనము.

ఉ. అలవికి మీఱఁ బండి పురి ♦ హాలికసస్యలు సైచికొల్చి తి
ప్పలతుద ధాన్యము ల్కొలనఁ ♦ బర్వ్వవిభాసనుపహతిఁ జొప్పి క్రో
వలఁ జెదరు న్వసుంధర స♦వగ్రహదోషహతాద్విరామమును
దెలుపఁగఁజాలి సారెనలు ♦ దిక్కుల రాలు నుదువ్రిజం బనన్. 340

చంద్రభానుచరిత్రము, ఆ 1 పద్య 73.

ఉ. కనుఁగొనవయ్యెఁ బండి యొఱ♦గంబడి యుండెడు రాజనంబు చ
య్యన హాలికు ల్క్రమముం గనిన♦యట్టిమహీమహిళ స్మృదష్టమై
ఖననముఁ జేయఁజూచెదరు♦గా యని యాంతరకైరవాళిసం
జనితమరందబాష్పములు ♦ జాఱఁగ మూర్ఛిలి వ్రాలుకై వడిన్. 341

చంద్రాంగదచరిత్రము, ఆ 1 పద్య 39.

మ. నగరాధీశుని సద్గుణంబులకు సొం♦నందించి దేవేంద్రుఁ డ
న్నగరీరత్నముచుట్టునుం గురియు స్వ♦ర్ణాగారిపచూర్ణంబు నాఁ
డగు సంవత్సరయనాఙ్గారికటుకే♦దారంబులం బండి సొ
మ్మగనై యొన్నులఁబ్రేఁగిసన్ ఘనతిప్రేమా♦యన్ క్రాలి సస్యావళుల్. 342

ఉత్తరరామాయణము, ఆ 1 పద్య 74.

# సాలభంజికలు.

సీ. బందీకృతాస్యరా♦ట్ఛ్వవసలక్ష్మీప్రపంచ,పరలు నిష్ఠురాప్రు ♦ ల్వాఅపుకరణిఁ
బుంజీకృతస్నేహ♦భూరిమోహనశక్తు, లనురాగకళికలఁ ♦ బెనఁచుకరణి
సంగీకృతాంగజై♦తాధిదేవత లాత్మ,సుమచోరుమచ్ఛంబు♦చూపుకరణిఁ
బహికటీకృతానంత♦రతిమూర్తులు లతాంత,శరశాస్త్రసంచిక♦ల్నాఁచుకరణి
గీ. యంత్రపాంచాలికలు గొన్ని♦యగురుధూప,వితతి వెదలింపఁ గొన్ని దీ♦వియలు దాల్పఁ
గొన్ని విరివీవనలు వీవఁ♦గొన్ని పసిఁడి,తఘుకుఁదెలనాకులొసఁగ సం♦తసము లెసఁగ.

వసుచరిత్రము, ఆ 6 పద్య 73.

చ. పురపరణావతంసమున ♦ భోగ్యతరాకృతివజ్రకల్పకే
సరులసమూహము న్నిజగ♦జంబు గనుంగొని నేలక్రింద డాఁ
గ రయమ వాసవాజ్ఞఁ జని ♦ కయ్యములో సుర లోటువొంది బ
వ్మెరపడి నిల్చె నా సొబగు♦మీఱి వెలుంగును సాలభంజికల్. 344

కవిజనచకోరచంద్రోదయము, ఆ 1 పద్య 54.

# ఏనుఁగులు.

ఉ. చారుబలాకమాలికల♦చాడ్పున వంపెసు లొప్ప గట్టిపె
స్ఫారరవంబులట్లుగ వ♦ఘంటికతం బటుబృంహితంబు లా
సారముమాడ్కి దానజల♦సంతతి గ్రమ్మఁగఁ గాలమేఘమా
లారుచిరంబులై మెఱచు♦లద్విపసంఘము లొప్పె నప్పురిన్. 345

నిర్వచనోత్తరరామాయణము, ఆ 1 పద్య 53.

చ. తరళితపంక్తికాంతి సము♦దంచితబృంహితనీలదేహము
ల్పరగఁ దటిల్లతాస్తనిత♦భాసురవారిధరంబులో యనన్
బొరిఁబొరి నేనుఁగు ల్దిరిగి ♦ పుష్కరశీకరదానధార ల
ప్పురమునఁ జెల్లుగాఁ గురియ ♦ భూతలమంతయుఁ బంకిలంబుగన్. 346

భాస్కరరామాయణము, బాల- పద్య 24.

సీ. ఉపరిస్థజనవాక్♦సూక్తికిఁ జెవిఁదార్చి, యమ్ముగంబై బయ ♦ ల్చిమ్మి చిమ్మి
గవనివె న్నొక్కయు మి♦న్నవియ వట్టించుచుఁ,త్రిఖురబంధపుదాంట్లఁ♦దఱిమితఱిమి
చలువచే ద్వారవే♦దులెత్తంగి నిల్చి త,జ్జనజిఘృక్షుకుఁ గేలు ♦ సాఁచి సాఁచి
డిండిమంబుల కుబ్బి♦గండూల్పదానమే,ఱులుగ దద్వాహులజాల♦ఱువ్వి ఱువ్వి
గీ. వేణుకాహూతులకు వీడు♦వెడలి వెడలి, పరపథగజధ్వనికిఁ బోక ♦ తిరిగి తిరిగి
దృక్పుటలు వైరులకుఁ బంపు♦కృత్యలనవ,శానుగతిఁ జేరు వెలిఁ గరు♦లగ్గలికల.

ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 24.

మ. అరగంటం గనుఁగొంట మంచగతిఁ బూ♦ర్ణాహంకృతిం బ్రార్థనా
కరభుక్తిస్థితి ముక్తలోకభయశం♦కావృత్తి నున్మత్తన
వ్యరతి న్నత్త్వసమగ్రత న్మృదితప♦ద్మాభ్యున్నతి న్గంధమం
థరదంతావళకోటి యొప్పు నవధూ♦తప్రక్రియన్ దత్పురిన్. 348

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 1 పద్య 25.

మ. వరుసన్ బృంహితహేషగర్జ లెసఁగన్ ♦ వర్షాంబుధారాగతిన్
వరగండద్వితయీగళత్ప్రఘుర్ఘురీ♦వారంబు లుప్పొంగ న
ప్పురమందున్ గజబృందముల్ దనరు నం♦భోధిస్థలోత్థాద్రింతసం
చరదద్రీంద్రములో యనంగ నవరా♦జన్నీలమేఘోన్నతిన్. 349

కృష్ణరాయవిజయము, ఆ 1.

చ. పరబలభంగచంగము ల♦భంగురతుంగమతంగజంబు ల
ప్పురిఁ బరికీర్ణకర్ణపుట♦పూరితభూరితరానిలాహతి
న్విరియఁగఁదోల మేఘములు ♦ నింగిఁ దొఱంగి తదంఘ్రిమూలముల్
శరణము నందఁబోలు నని♦శంబు పదంబు మదంబు పేరిటన్. 350

వసుచరిత్రము, ఆ 1 పద్య 101.

ఉ. ఘనమహిమ న్మహాప్రతిభఁ ♦ గాంచి లసత్కటకప్రభూతి యిం
పొనరఁగ దాల్చి పుష్కరస♦ముత్కటఘర్షణలీల మించి పై
నెనయు రజోగుణంబున న♦నేకపరాజము లప్పురంబులో
ననిశముఁ జూడనొప్పు నడ♦యాడుచునుండెడి కొండలో యనన్. 351

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 1 పద్య 20.

ఉ. చుట్టునుగట్టియుండు నొక♦చో నెడ మించుక లేకయుండఁ ద
త్పట్టనబాహ్యభూముల మ♦దావళమండల మేమిచెప్ప ని
ట్టట్టుదెమల్పరా కరిఘ♦టాంకరమ్మై దివి తోడరాయుచున్

బెట్టనికోటగాదె గజ♦బృంధము లెందును రాజధానికిన్. 352

విజయవిలాసము, ఆ 1 పద్య 74.

మ. పరిఖావారిధి మేరమీఱి తము ముం♦పన్ ధారుణిన్ దాల్చు దు
స్తరమంచున్ రవి మధ్యవర్తియగు నా ♦ సర్వంసహాభర్తకున్
హరికొప్పింపఁగవచ్చు దిగ్గజములో ♦ నాభానుపాణింధమో
పరిభాగస్థపరాగముల్వేలయఁ గ♦న్పట్టున్పురీనాగముల్. 353

చంద్రాంగదచరిత్రము, ఆ 1 పద్య 28.

సీ. శేషెత్తి నగదంతి ♦ నాలంబునకుఁబిల్చు, పగిదితుండంబులు ♦ పైకిసాఁచు
కలశభవాచాంత ♦ జలధినించఁగఁ జాలు, నివెయన్నగతి వమ♦థువులఁజల్లు
నొంటినెత్తఁగరావె ♦ యుర్వినాగాధిప, త్రియధృతినను మాడ్కిఁ♦దాల్చుమట్టి
పుడమియెల్లను నాలు♦గడుగుల నడుగునం, చనుగతి ముందఱి ♦ కడుగు లిడును
గీ. కీలుమేలును మదభరో♦ద్వేలధార, లోలిఁగురియంగ సెలయేర్లఁ ♦జాల మెఱయు
శైలముల లీల నాలాన♦జాలబద్ధ, లైన మత్తేభఘటలొప్పు ♦ నప్పురమున. 354

తారాశశాంకవిజయము, ఆ 2 పద్య 23.

మ. పటుదంతప్రచురప్రభాప్రకటశం♦పాజాలముల్ ఘీంకృతా
ర్భటగర్జారవముల్ సమగ్రమదధా♦రాసారవర్షంబు లు
త్కటధాటిన్నటియింప భూవిహరణో♦ద్యత్ప్రావృషేణ్యాంబుభృ
త్పటిమన్ దత్పుటభేదనద్విరదయూ♦థంబొప్పు సక్రోధమై. 355

అనిరుద్ధచరిత్రము, ఆ 1 పద్య 69.

మ. జగతీధ్రంబులు దేవపాపగతసం♦చారంబులై నిశ్చలం
బగువృత్తిం దపమాచరించి తతఘం♦టారావనిర్భీకయా
నగుణోదగ్రత విగ్రహాంతరము లె♦న్నం దాల్చుటం గల్గెనో
నగసంబంధగతాదివృష్టియనఁగా ♦ నాగంబు లొప్పుం బురిన్. 356

కవిరాజమనోరంజనము, ఆ 1,

చ. ప్రతిగజశంకనభ్రనిక♦రమ్ముకు రదమ్ములఁ గ్రమ్మ దిక్కరి
ప్రతతుల మార్కొనంబిలుచు ♦ భంగిని బృంహితముల్ ఘటించు న
భ్రతటినిఁ బద్మముల్ పెనఁచి ♦ పట్టి పెకల్చుటకుం బలెన్ సము
న్నతకరముల్ నిగుడ్చు నగ♦రమ్మున కప్పురి మత్తవేనుఁగుల్. 357

ఉత్తరరామాయణము, ఆ 1 పద్య 67.

మ. వరసౌభాగ్యచయంబు గన్గొని మహా♦నాళాది వీక్షేపణన్

ఘీరతుండంబుపిదుర్చు ఫూత్కారములం ◆ దేదీప్యమా వాతపే
గరయంబుస్థితిఁ జాకి మింటఁ జననా◆యభ్రింబులం గాంచియుం
ద్విపదానీకము గాదటంచు మదిలోఁ ◆ దెల్పొందు నాయేనుఁగుల్. 358

ధర్మాంగదచరిత్రము, ఆ 1.

గీ. తప్పఁదయును వేలుపుల ఱేని ◆ దాడికోడి, గుంపులనుగూడి పఱతెంచి◆కోర్కు లలరఁ
గడలిఁ దాఁగవచ్చిన కొండ◆గమి యనంగఁ, గదిసితిరుగు నేనుంగు ల◆గడ్తయందు.

రసికజనమనోరంజనము, ఆ 1 పద్య 34.

---

# గుఱ్ఱములు.

గీ. మనముశిల్పిరయె తనకు పి◆న్ననువు మెఱసి, గాలినశ్వరూపంబులు◆గాఁ దరించెఁ
గాక యీజవసత్త్వముల్ ◆ గలవె ఘోట, కముల కెందునాఁ బరిఁదురం◆గములులుచు.

నిర్వచనోత్తరరామాయణము, ఆ 1 పద్య 54.

శా. హూనిఁ క్రోధవిధూతపత్త్రిములహా ◆ హూతో సపత్నీ ప్రదా
కానింటంచును నేకరాడ్రుచి మొ◆ల్కల్ప్రక్రియన్ శాస్త్రతూ
ణానల్పాహిసకల్పకాండతతులం ◆ దాఱన్సురింబోల్చు నా
జానేయంబులు షేనహోసమిడి సైన్ ◆ జామోరిల్లార్చుచున్. 361

ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 26.

సీ. కట్టెడిఁజెలియలి ◆ కట్టెయొకట్టెగా, ఓగువప్రమైఁ బేరెంబు ◆ వెట్టకుండ
లంఘనలాఘవో◆ల్లసనంబు మైమొక్క, లించి వాష్ఫ్టీలు చౌక◆ళింపకుండ
బిట్టుదిగంతముల్ ◆ ముట్టఁజూపినవిధి, పవమానుగడ తెగఁ◆బాఱకుండ
భరతాభినయముల ◆ నిరపేక్షగా లోక, దృష్టులుదనియ న◆ర్తింపకుండ
గీ. రయముచేఁ జిత్తగతులఁ గే◆ల్చియును జతుల, మతులలోనన వర్తింప◆మాకువలసె
వనుచునిగ్గునఁ దలవంచు◆కొనినపిటుఁలో, యనఁగఁ దగియుష్పఁబరినుత్త◆మాశ్వతతులు.

కవికర్ణరసాయనము, ఆ 1 పద్య 14.

మ. జగతీజానికృతాపరోక్ష మఖిలా♦శాలంఘనస్వాక్రాంతమున్
గగనోడ్డీనగతంబహీనబలదు♦ర్గర్వాపహాప్రౌఢియున్
దిగధీశస్తవనీయసంతతలస♦ద్విఖ్యాతిఁ జెన్నొందఁగా
ఖగరాజస్థితిఁ బోల్చుఁ దత్పురమునన్ ♦ సంఖ్యాణసంఘంబొగిన్. 363

ఇందుమతీపరిణయము, కుమారధూ. ఆ 1 పద్య 151.

శా. ఛత్రీచ్ఛాయాఁ బరిభ్రమించు ననిల♦స్కంధత్వరాసంగతిన్
జైత్రిత్వంబునఁ బొంది దేవమణిభా♦స్వద్భోగసద్భావనై
చిత్రిన్ వర్తిలి సాధులన్ మనిచి మిం♦చెం బంచకళ్యాణులై
ధాత్రీమండలిఁ బట్టభద్రములగతిం ♦ దత్పట్టణాశ్వీనముల్. 364

తపతీసంవరణోపాఖ్యానము, ఆ 1

మహాస్రగ్ధర. ఖరభూభృత్ప్రాప్తికట్టిం♦బడు రవిహయులం♦బ్రౌఢిఁ బాటింపనెందున్
సరిగాఁ దద్దిక్ప్రవృత్తుల్సైఁ♦చక రవిహరియై♦చాయకున్ రానడంచున్
జరణోద్యద్ధూళిఁ దద్వా♦సతఁడగు హరియున్♦సప్తిగాఁ బాదధారా
స్ఫురణం జేవింతయుంచుం ♦ బురిహయులునగుం♦బ్రాక్షధారాసమృక్షిన్.

వసుచరిత్రము, ఆ 1 పద్య 102

సీ. అడుగంటఁద్రొక్కిన♦యహితపరితాపకీ, లములునాఁబసిఁడిలా♦ళములు మెఱయ
జవభీతనిజమృగ ♦ సంరక్షణమునఁ బాద, మొందినశశియన ♦ నంచె సెలఁగ
మహనీయగళ దేవ ♦ మణిపార్శ్వఘటితము, క్తాపాళియనగవ్వ♦దండ దనర
ఘనతార్క్ష్యతాదర్ప ♦ కవికాహినిర్మోక, ఖండంబులన ఫేన ♦ కణిక లొలుకఁ
గీ. బట్టుపల్లంబుఁ గేడెంబుఁ ♦ బట్టియంబుఁ, దరకసంబును సింగిణి♦సిరిమితేఱటు
జిగిదొలఁకులేవపాలాసి♦మొగసరియును, బూనిసాహిణి యొకకత్తి♦లానిఁదెచ్చె.

చంద్రభానుచరిత్రము, ఆ 2 పద్య 16.

ఉ. వేడుకనప్పురీహయుల ♦ వేగముఁ గన్గొని తేజి గాడ్పుతోఁ
గూడి చన న్వలె న్మనము ♦ కూడఁగనోపక యోడినట్లిపా
రోడనివారి మోచు టని ♦ యొద్దికఁ బందెము వైచి కూడలే
కోడెనుగాక మోయఁగ బ్రి♦యోజన మే మనిలుం గురంగముల్. 367

విజయవిలాసము, ఆ 1 పద్య 73.

శా. హారారీతిసమీరపంచకము పా♦తశ్రేణికం బట్టఁగా
నారాచంబులనోడి పార్శ్వముల సం♦టంగొల్వఁగా నాత్మవే
గాహాఢ్యం గనుఁగొన దేవవాణివా♦స్యత్కంతభూపాస్యలం

కారంబుల్ బిరుదుల్ ధరించి బురిలోఁ♦ గస్పట్టు ఘోట్టాణముల్. 3(

ముకుందవిలాసము, ఆ 1 పద్య 120.

మ. అకటా తమ్మ్రుల కాలివేగమున డా♦యన్ లేని పక్షీంద్రుఁడు డ్రికా
లికిలోనౌమిడినాగుకూనలకు జా♦లింబొందుగాలి న్గకా
పికలై వచ్చు మనోజభల్లములకు♦న్భీతిల్లు చిత్తంబుసా
టికి రానేరవె హేషపేరఁబురఘో♦టీఘోటకవ్రాతముల్. 369

చంద్రాంగదచరిత్రము, ఆ 1 పద్య 29.

ఉ. అందలికత్తలానిగమి♦నందఁగ గాడుపుత్త్రువాలు వే
పందెము వైచి పర్వులిడుపట్టున ♦ నోడియకాదె లేళ్లుబల్
గొందలమంది పూరిఁదిను♦కొంచును రిత్తయ జంకిచూచుచున్
బందతనంబుమీఱఁ గడుఁ ♦ బాఱఁదొడంగెను నాఁటనుండియున్. 370

అచ్చతెనుగురామాయణము, ఆ 1.

సీ. కసవుమోవరిగాలి ♦ గఱుతియే మూకంచు, నగినట్లు వదనఫే♦నములు రాల్చు
ధర సరి లేదు పా♦తాళమందేనియుఁ, గందమన్గతి ఖురా♦గ్రమునఁ ద్రవ్వు
ఇనరథాశ్వములట్లు ♦ మునుఁగుదు మేపూడ్తు, మబ్బులన్గతి రేఁచు ♦ నంఘ్రిరజము
తముఁగూడివచ్చుచి♦త్తమ్మ్రులనల్కఁజే, నదలించుకరణి న ♦ ల్లార్చు శిరము
గీ. లురము లందంబు పలు కంద ♦ముదుటికన్ను, లరిదివెన్నులు తగనంద♦మైరయెసంగ
సింధు కాంభోజ శక పార♦సీకధట్ట, బాహ్లికారట్టఘోటక ♦ పంక్తులచట. 371

తారాశశాంకవిజయము, ఆ 2 పద్య 25.

చ. అరివిజయప్రతాపఘన♦యాన మహీభృదుపాశ్రియంబులం
బరగినవౌటఁ గైటభవి♦భంజనజంభమదాపహారకుం
జరరిపువిక్రమాసుగుణ♦సారతఁ జొప్పడు నప్పుడీహరుల్
హరులనునామధేయములు ♦ సార్థకమై యనువొందునట్లుగన్. 372

కవిరాజమనోరంజనము, ఆ 1.

సీ. సతతమానసగతి♦స్తుతవైభవముఁ గాంచెఁ, బ్రకటింప రాజమ♦రాళ మేమొ
దేవమణిప్రభా♦దీపితంబై యొప్పెఁ, దర్కింప నభ్రమా♦తంగ మేమొ
జవసమాహృతతీవ్ర♦పవనమై యలరారె, దర్వీకరకులావ♦తంస మేమొ
తేజోనిధిత్వసం♦స్థితిఁ బ్రకాశముఁ గాంచె, డంబైనతీవ్రాంశు♦బింబ మేమొ
గీ. యనఁగఁ దనరుమనోజవం♦బనుతురంగమంబుపై నెక్కి - పుగువతో♦ననుజవిభుఁడు

తత్పురమ్మున నుండుట♦తగదటంచు, విక్రమక్రమశక్తిని♦వెడలె నపుడు. 373

వాసవదత్తాపరిణయము, (వక్క. వీర.) ఆ 4 పద్య 17.

క. వీటిపటుఘోటకనిరా,ఘాటత్వర కోడి పూరిఁ♦గఱచు హరిణముల్
మాటికిని దదారోహకుఁ, దాటం బవమానుఁ డోడు♦ టబ్బుర మగునే. 374

కవిజనరంజనము, ఆ 1 పద్య 8.

సీ. రవగాలునకు సాటి♦రాక గాడ్పుపటాణి, పొదలుసిగ్గునఁబోయి♦పొదలఁజొచ్చె
జోడనల కొకింత♦జోడు గానేరక, వేల్పురాయని తేజి♦ వెల్ల నయ్యెఁ
బలునిబ్బరమునకుఁ♦ బ్రతి గాక గరుడి య,నామధేయునివాహ♦నం బనఁ దగె
జుట్టుఁబర్వులకు నిం♦చుకయు నీ డొంచలే, కినుహయల్ పిచ్చుకుం♦టునకగపడె
గీ. నింకనీవాహముల కెద్ది♦యెన యటంచు, జనులు వొగడ మనోవేగ♦మెనసి ధార
లొలసి లోకప్రసిద్ధుల♦నూని మేటి,సాహిణులశిక్ష నలరు న♦చ్చటిహయములు.

ఉత్తరరామాయణము, ఆ 1 పద్య 68.

సీ. జాబిల్లిచిన్నంపు♦బాబాహుమారంపు,సరదారుని యుదార♦తరజవంబు
శతకోటిధరువీటి♦కతిధాటిఁ జని సుధా, ఘుమ్ముఁ దెచ్చిన మేటి♦ఘనజవంబు
వలిజక్కవల కించు♦విలుకానియలసంచు, దెలుపు వేల్పుతురంగ♦ములజవంబు
బవరంబుభువివింటి♦దవిలించి విడువనం,టి యరాతిఁ ద్రుంచుక♦ట్టియజవంబు
గీ. నెంచకనె సంచరించుచు♦నింద్రహయము, పుట్టినట్టితలం బెల్ల♦ భూరిధూళిఁ
దార్చునో నాఖురమ్ముల♦ధరణిఁ ద్రవ్వి,కొనుచు విలసిల్లు నప్పురి♦ఘోటకములు.

అచలాత్మజాపరిణయము, ఆ 1.

క. వీటను గల గుఱ్ఱంబుల, గాటపువడి కోడి గడ్డి♦ కఱచెను లేడుల్
మాటికి వడఁకుచు గాలియుఁ, బోటరితన ముడిగి యొక్క♦మూలం బడియెన్.

రసికజనమనోరంజనము, ఆ 1 పద్య 35.

## వీ ర భ టు లు.

ఉ. కులగిరులెత్తనైన వడిఁ♦గుంభినిఁ గ్రుంగఁగఁ ద్రొక్కనైన వా
ర్ధులఁ గలఁచంగ నైన జము♦నుప్పులుమూలఁగఁ దోలనైన వి

గ్వలయామదేభకుంభములు ♦ వ్రక్కలుసేయఁగ నైసఁ జాలు నో
గ్బలముల గెల్తురాజిఁ బరి♦పంథుల నందుల వీరసద్భటుల్. 378

భాస్కరరామాయణము, బాల. పద్య 32.

క. ప్రతివర్షంబును ధరను, ద్ధతిఁ బడియెడు పిడుగులెల్లఁ ♦ దగఁ గూర్చి నరా
కృతులుగ నొనఁగూర్చెనొకో, శతధృతియనవీటసుభట ♦ సంఘము వోలుచున్.

కవికర్ణరసాయనము, ఆ 1 పద్య 12.

సీ. వేసికొండలుపట్టి ♦ పిండిపిండిగఁ గొట్టి, జలధిలో వెదచల్లఁ ♦ గలబలంబు
యమకింకరులనైన ♦ గమకంబునణఁగించి, క్రిమ్మరింపఁగశక్తి♦గలబలంబు
నెదిరించు కరినైన ♦ బెదరించు హరినైన, గండడంపఁగఁజాలు ♦ గుండెదిటము
అలమహాబలునైన ♦ నండజాధిపునైనఁ, బరిహసింపఁగఁజాలు ♦ పటుజవంబు
గీ. బళిబళీయనితమదొరల్ ♦ ప్రస్తుతింప, బిరుదుపంతంబులాడుచు ♦ భీకరగతిఁ
జటులతరశౌర్యులై భుజ♦సారదళిత, పరభటుల్ భటు లుందు ర♦ప్పట్టనమున.

ఇందుమతీపరిణయము, కుమా. ధూ. ఆ 1 పద్య 152.

సీ. జల్లులతోడి పెం♦న్బల్లెంబు లెగవైచి, పట్టుచుఁబేరముల్ ♦పాఱువారు
మెఱుఁగులుచూడ్కుల♦మిఱుమిట్లు గొలుపంగఁ, జేకత్తారులబయల్ ♦చిమ్మువారు
*బెడిదంపుటరిగెలు ♦ బిఱబిఱఁద్రిప్పుచు, వడిఁబిల్లుమిరములు ♦ వైచువారు
తెగనిండఁదిగిచి న♦ల్దెసలకు బొల్టికో, లలు జూపి పల్లటీల్ ♦ దాఁటువారు
గీ. నొండొరులకభిముఖమైన ♦ నుబ్బువారుఁ, గడలుచాఁపుచు వేడుక♦ కయ్యమునను
జెలఁగి తమదొరలకు నింపు♦సలుపువారు, నగుచువీరభటుల్ మించి♦రతిశయమున.

(*చూ. శ. ర. అరిగ) కళాపూర్ణోదయము, ఆ 8 పద్య 41.

సీ. ధర్మగుణస్ఫూర్తిఁ ♦ దనరారుచున్న ప్ర, చేతులై యుండియు ♦ జిష్ణులగుచుఁ
బరదానరూఢి నెం♦ప్పటి సుప్రతీకులై, మహిమమించియు నప్ర♦మత్తులగుచుఁ
బురుషోత్తమసమాఖ్యఁ ♦ బొసఁగినుదర్శనో, ద్యుక్తులై యుండియు♦త్యుగ్రులగుచుఁ
దేజంబుగల కుల♦దీపకులైయుండి, చెలువంపు వర్ధిత ♦ స్నేహులగుచు [తు
గీ. మాధవసహాయసంపత్తి♦మలయుచున్న,యాసమశరులయ్యుబలభ♦ద్రులగుచుఁబొలు
రతులసాహసవిగ్రహో♦దగ్రశక్ర, విక్రమోద్భటు లప్పురీ ♦ వీరభటులు. 382

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 1 పద్య 23.

ఉ. గాళికు లాపురీభటశి♦ఖామణు లెక్కటి యుక్కుతున్క లా
భీలతరాశసుల్ చిదిమి♦వెట్టినబంటులు వైరికెల్ల బే
తాళుఁడు వచ్చి వగ్గలిన ♦ దప్పిక గాఁ దొక నెత్రు దీయఁగాఁ

జాలుదు రేమిచెప్ప మఱి ♦ సాదన నేటును సాహసమ్మునన్. 383

విజయవిలాసము, ఆ 1 పద్య 75.

ఉ. బాహుబలోద్ధతుల్ సమర♦భాగనట ద్రిపుచాతురంగిక
వ్యూహవిభేదనక్రమ స♦ముజ్జ్వల విక్రమవిస్ఫురన్మహో
సాహసికుల్ ధనుఃపరిముఖ ♦ సాధనధారణకౌశలుల్ సము
త్సాహరసాకృతుల్ సుభట♦సంఘము లప్పురమం దసంఖ్యముల్. 384

అనిరుద్ధచరిత్రము, ఆ 1 పద్య 72.

క. వాసవవాసవదీప్త న, వాసిని వాసినిజయించు ♦ నయ్యాయుధముల్
కేసరికేసరివత్తురు, భాసుర భాసురవు లచటి ♦ భటు లుద్వృత్తిన్. 385

కవిరాజమనోరంజనము, ఆ 1.

చ. గిరినికరమ్ములైనఁ బిడి♦కిళ్ళనె వ్రియ్యలొనర్తు రుగ్రకే
సరిసటలైనఁ జేకొని వె♦సం బెకలింపుదు రత్యయాభ్రవి
స్ఫురదశనివ్రజంబయిన♦చో నలుచేతన తట్టివైతు రో
పరు హరుఁడైనఁ బోరులకుఁ ♦ డాసిన యప్పుడు వీరు లప్పురిన్. 386

ఉత్తరరామాయణము, ఆ 1 పద్య 70.

ఉ. భల్లవివేల్లనంబు కర ♦ పల్లవపాళిని మల్లివల్లరీ
వేల్లనతుల్యమై యనులఁ♦ బెల్లుగ నెల్లెడ నుల్లసిల్లుచున్
క్షుల్లకభూమివల్లభుల ♦ కోటలకున్ శతకోటికోటిరై
యుల్లసిలన్ సమీకపటు♦లొప్పుదు రప్పురి నుద్భటుల్ భటుల్. 387

అచలాత్మజాపరిణయము, ఆ 1.

గీ. శూలములు కేలఁగీలించి ♦ కాలునైన, నోలిఁ గూలంగఁ జేసెదు ♦ లీలగలిగి
భూతిపనరార సర్వజ్ఞ ♦ మూర్తు లగుచు, నుగ్రభటులనఁదగుదురం♦దుగ్రభటులు.

కవిచకోరచంద్రోదయము, ఆ 1.

చ. పటిమఁబురోపకంఠతట♦వాటికల స్వడిబాష్పదీటి యు
ద్భటసుభటచ్ఛటాపటల♦ధాటులు రేపును మాపు బాహుసం
ఘటితములౌ తుపాకుల చ♦కచ్చకలొప్పఁ గవాతుసేయ ని
ష్కుటకుటజప్రతిధ్వనిగ♦ఘూర్ణిలు షైర్ల ఫెళ్ ఫెళ్ధ్వనుల్. 389

చ. కుదురుగ నందు నందుఁ బురిఁ♦గుప్తికి నిల్పఁగ వీరరౌద్రిసం
పదల నెసంగు పోలిసుల ♦ బంటులొగింబడునిద్దరల్పపుం(?)
గుదియలుపూని లాగులును ♦ గుత్తపుఁగంచుకముల్ ధరించువా

రదయతఁ గాలకింకర భ♦యంకరవృత్తిఁ జరింతు రెంతయున్. 390

చెన్నపురీవిలాసము, పరిభవసర్గ.

క. చటులతరశస్త్రవిద్యన్, బటువగుపిడు గుక్కతునియ♦లకుఁగూరిచి య
చ్చటవిధి నవలుగఁ జేసిన, యటులుందురు బలసమగ్రు♦లగు వీరభటుల్. 391

కృష్ణకల్యాణము, అ 1.

చ. పిడుగులతునక లన్నగరి ♦ వీరభటచ్ఛట లట్లుకానిచో
బెడిదముగా నిజేఁదుశర♦వృష్టికిమున్నగ శత్రుగోత్రముల్
పొడిపొడిగాఁ గడు న్వడి గు♦భుల్లుభులంచును గర్జితధ్వనుల్
గడలుకొనం బయింబడి జ♦గద్భయదార్భటి నేపుఁజూపునే. 392

రామరాయవిలాసము, ఆ 1 పద్య 78.

---

# వేశ్యలు.

---

సీ. చూపులకట్టు పూఁ♦మాపులచేపట్టు, నబలలచూడ్కుల ♦ యాయుధములు
తాయంబునకుఁ గండుఁ ♦ గోయిలఁ గూయించు, బాలలపలుకులు♦మూలమంత్రి
మెదిరికిఁ దేఁటుల ♦ నెడయాటలాడించు, నబలలయలకల ♦ యాప్తబలము
ననరణలకుఁ జంద్రుఁ ♦ జాలించుమగువల, మొగములనేనకుఁ ♦ దగిన మొగము
గీ. భావభవునకు నటుగాక ♦బలమె బలము, గాఁగఁ దిరిగెనె పెళ్లిచే♦గాసిఁబడఁడె
యనఁగ సౌందర్యసంపద ♦ లభినవముగ, వఱలుదురు తత్పురంబున♦ వారసతులు.

విక్రమసేనము.

సీ. శుకమంజులాలాప ♦ శుభకరస్థితిమించి, పల్లవసందోహ ♦ భాతిఁ దనరి
కలకంఠకూజిత ♦ విలసనంబులనొంది, రంభానురేఖల ♦ రమణ మెఱసి
హరిచందనస్ఫూర్తి ♦ ననిశంబుఁ దనరారి, పుష్పసౌరభములఁ ♦ బొలుపు మిగిలి
సరసాలీమాలికా ♦ సంసక్తివిలసిల్లి, విషమబాణాసన ♦ వృత్తిఁ జెంది
గీ. లలిత మాకందవైభవం♦బులఁ దనర్చి, యతిమనోహరాకారత ♦ నతిశయిల్లి
యుద్యానవాటిక ♦ లుల్లసిల్లు, వారవనితలు నాపుర♦వరము నందు. 394

విక్రమార్కచరిత్రము, ఆ 1 పద్య 88.

సీ. ముడివిప్పనడుగుఁద♦మ్మికలపైనెవాఁ(ఱ)లుపె, న్నెఱులు దేంట్లగుటసం♦దియముగలదె
కన నెంతవానిలోఁ ♦ గొనుట నాదగ్యంబు, నెమ్మొగంబగుట సం♦దియము గలదె
ఇటిగొను మింటిపై♦మెఱయుటఁ జక్రిద్వి, తయిచన్నులగుట సం♦దియముగలదె
పొలుసుదొర్లఁగఁజూచు ♦ కలికిచూపులమీలు, జెలిగన్నులగుట సం♦దియముగలదె
గీ. పొలసినసె తావి బుగులుకొ♦నలరుఁదీగ, తిన్నని శరీరమగుట సం♦దియముగలదె
యనఁగఁ జెలువొంది సురతవై♦యాత్యనిధులు, పణ్యయువతులు పొలుతుర♦ప్పట్ట
నమున. 395

ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 30.

సీ. మొలకచీకటి జల♦జలరాల్పఁగా రాదె, నెఱులు మించినవీరి ♦ కురులయందు
కెరలించి యమృతంబు ♦ గిలకొట్టఁగారాదె, ముద్దుమాపెడివీరి ♦ మోవులందు
పచ్చబంగారుకు♦ప్పలుసేయఁగారాదె, గబ్బిమీఱినవీరి ♦ గుబ్బలందు
పండువెన్నెలతేటఁ ♦ బరిఢవింపఁగ రాదె, నగవుగుల్కెడివీరి ♦ మొగములందు
గీ. నార కరవాఁడిచూపుల ♦ యాఘుళంబు, బాపురే భూరికటితటీ ♦ భార మహిమ
చాగు మదమందగమనల ♦ క్షణములనఁగ, నేరుపులమింతు రప్పురి♦వారసతులు.

పాండురంగమాహాత్మ్యము, ఆ 1 పద్య 117.

క. కాదంబరి స్వాదించియు, మోదంబునఁ గౌముదీస♦ముస్మేషము సం
పాదించియుఁ దబ్బిబ్బగ, వాదింతురు రేలు వార♦వనితలు వీటన్. 397

కువలయాశ్వచరిత్రము, ఆ 1 పద్య 87.

సీ. తొడనిగ్గులకురంభ ♦ తొట్టోడఁ దలవంప, శశిరేఖ నొసలికి ♦ సగముగాఁగ
దరహాసమునకుఁ జం♦ద్రికళ వెల్వెలఁబాఱ, నెమ్మోమునకుఁ గలా♦నిధి కృశింప
మునుతిలోత్తమమించు♦ముక్కుతేటకువాడ, హేమ మెచ్చుగ నెమ్మె♦యికిఁగరంగఁ
దతబాహులకసంగ ♦ లతిక కొండలువ్రాక, నరిదిచూపులకింత ♦ హరిణి బెదర
గీ. ఫలముఁ గొని పల్లవావళిఁ ♦ బాసిపోక, యలఁతిగాక పలుకఁబాఱ♦కెలమి పడక
పడకవన్నియదఱుగిక ♦ పచ్చఁదనము, వీగక వలం దగులకుంద్రు ♦ వేశ్యలచట.

బహులాశ్వచరిత్రము, ఆ 1 పద్య 88.

సీ. పలుకులు మత్తకో♦కిలసైఖరుల గొల్పఁ, గురులు చామరముల♦సరణిఁ దెల్పఁ
తనువుకొత్రిత్తావు లు♦త్పలమాలికల నీనఁ, జెవులు మంగళమహా♦శ్రీలఁ బూనఁ
జంపకమ్మ్రల సునా♦సలతీరుఁ దలపించ, గమనముల్ వనమయూ♦రములనించఁ
దరలభావములు నే♦త్రంబులఁ గనిపించ, నాస్యంబు లంబురు♦హముల మించ
గీ. హృద్యసూక్తిప్రవీణత ♦ నెసఁగి రౌచి, చపుచసపడిసిలసపలం♦కృతులు మీఱ

వర్ణనాకారమైన కా♦వ్యంబువోలె, నగరి వెలయాండ్రపిండు మ♦న్మథునిదండు.
నలచరిత్రము, ఆ 1 పద్య 196.

గీ. సాటిగాఁజూచి మెచ్చర♦చ్చరలఁ దలిరుఁ, బ్రాయమున నాటపాటల♦గాయకమున
నలరు జారవయోవృష♦భాళి వల్లె, త్రాటిదాఁటులు పురి వెల♦బోటు లరయ.
వేదాంతరసాయనము, ఆ 1 పద్య 21.

గీ. పల్లవానందరూఢిచేఁ ♦ బరిఢవిల్లి, పరభృతాంచితలీలచేఁ ♦ బ్రౌఢిఁ గాంచి
మధురకలకంఠమహిమచే ♦ మహిని మీఱె, నలఘుకరమైనపురవార♦యౌవతంబు.
ఒడయనంబివిలాసము, ఆ 1 పద్య 23.

సీ. రంజితాధరసుధా♦రససమేతంబులై, ముఖచంద్రబింబముల్♦ముద్దు గులుక
నవతంసకుసుమతా♦రావళీయుతములై, కచభారతమసముల్♦గరిమఁ జూపఁ
గమనీయమణిమారి♦కాఝురాంచితములై, కుచకుంభశైలముల్♦కొమరు మిగులఁ
గంకణేంద్రోపలాం♦కమిళిండచణములై, పాణిపద్మంబులు♦పరిఢవిల్లఁ
గీ. గలిత మోహనరూపరే♦ఖావిలాస, విభ్రమంబులు జగమెల్ల♦వినుతిసేయ
నతులగతి వారశృంగార♦వతులు వేన, వేలు విహరింతు రెపుడు న♦వ్వీటియందు.
అనిరుద్ధచరిత్రము, ఆ 1 పద్య 67.

శా. ఆవీటంగల వారకామినులు రం♦భాద్యప్సరఃకన్యకా
ప్రావీణ్యంబులు మెచ్చ రెన్నఁడును ని♦ద్రాహారవీటీలస
ద్భ్రూవిక్షేప సుఖంబులేదనెడు సం♦తోషంబునంజేసి రా
జీవాస్త్రప్రసవాశుగంబులగతిన్♦ జెన్నొందితారుండుటన్. 403
పద్మినీపరిణయము, ఆ 1 పద్య 65.

సీ. లోకమోహనకళల్♦ చేకొనియుండంగ, నతను బాణములంట ♦ యబ్బురంబె
మహనీయలీలల♦మానసంబలరింప, నంచబోద లనంగ♦ననువుపడదె
గగనమధ్యమనోజ్ఞ♦గతులు శోభిల్లుటఁ, జుక్కలంచు వచింప♦నూటిపడదె
వలపులుగొలుపు చె♦ల్వములు రాజిల్లుటఁ, బుష్పమంజరులని♦పోల్పఁ దగదె
గీ. వీరినన నూరు విలసన♦విజితరంభ, లంచితేక్షావధీరిత♦హరిణలగుచు
నచ్చరలమీఱఁజాలు నొ♦య్యారములను, వెలవెలందుక లుండు ర♦వ్వీటియందు.
కవిజనరంజనము, ఆ 1 పద్య 14.

శా. భవ్యార్థాగమమంత్రతంత్రవిధులన్♦భావంబుదీపింపఁగా
స్తవ్యశ్రీకరహోమయాగమహిత♦చ్ఛందస్స్ఫురద్వృత్తితో
నవ్యాజోన్నతలైన పద్వాఃహిత♦వ్యాపారము ల్మీఱు ప.

స్తన్య శ్వారసతుల్ పురిం బోలుచు రెం◆చన్ యక్షపత్న్యల్ బ్లాబెన్. 405.

అచలాత్మజాపరిణయము, ఆ 1.

చ. ఘలుఘలుఘల్లుఘల్లుఘలు◆ఘల్లని ఘంటలచేతఁ గాళ్లపై
గొలుసులమందపున్నడలు◆కులుకు నహంకరణంబు లొప్పచూ
పులవిడివాటు శారజపు◆బూనిక లానికలున్ మదోద్ధతుల్
దొలుకఁగ గంధసింధురము◆లో యనఁ బొల్తురు వారకామినుల్. 406.

రాధామాధవసంవాదము, ఆ 2.

మ. అతులాకారశ్రియావృత్తులఁ స్తిమితశం◆కాశ్వేత లంచత్పదాం
కిత లభ్యంతరభావగోపన లనే◆కీభూతబంధాద్యలం
కృత లక్షీణకళాప్రవీణ లతిచి◆త్రీభూతవర్ణాభిశో
భిత లై కావ్యవధూవిధంబుగ ణికా◆బృందంబు లొందుం బురిన్. 407.

చిత్రబింబాపరిణయము, రావు. జ. రం. ఆ 1.

సీ. భమ నఖంబున కోడి◆ఁ గనుఖనై నిర్వికా, రత వాదిగా మధ్య◆గతికి నోడి
వినతమై ముఖకలా◆న్వితమయి గతికోడి, కలతఁ గరమూని◆వెలఁడి తొడల
సిరికోడి కరభహ◆ప్రకృతమై కువృత్తిఁ జే, నడుము మిన్నంటి ......
శాతముఖంబయి◆సారసాయతలోచ, నావయవద్యుతి◆కవల నోడి
గీ. విపుల శుచివృత్తి దుర్వర్ణ◆వికృతి విడిచి, యాశుగతినంతమునవిగ్ర◆హంబుఁ దాల్చి
వెఁడియవిపించుకొనియు న◆వ్వేలవెలంది, కుప్పియనరానిగర్వ్యోఁబో◆యుక్తిలేక.

రాధాకృష్ణసంవాదము.

సీ. పెదవి మెదల్చిరా◆మృదులపల్లవరాగ, సాంద్రమాధుర్యని◆ష్యంద మొలుకఁ
గేలుమలంచిరా◆కిసలయాంబుజకోశ, లీలాభినయసమా◆లేఖ లలరఁ
గన్నులల్లార్చిరా◆కమలకాండాళికో, త్పలవివిధానుభా◆వములు గురియఁ
గాలుగదల్చిరా◆కలహంసకాకల్ప, కమనీయలాస్యమై◆ఖరులు వఱలు
గీ. మేను మెలగించి రామ గు◆ణానుబంధ, తతమనోజ్ఞోజ్జ్వలాంగహా◆రములు వెలయు
సిరులనిరవొందుతత్పురీ◆నరమునందు, చెలఁగువెలయాండ్రు స్మరజయ◆శ్రీలుగారె

ఇందుమతీపరిణయము, మతు. నృసిం. ఆ 1 పద్య 19.

చ. పొగరుమిటారి......◆భూధరపంక్తివసించి కన్బొమల్
జిగిఁదగు కార్ముకంబులుగఁ◆జేసి మనోహరమైన యాల్గు నా
ల్గగతి నొనర్చి చంచల వి◆లోకనబాణము లందమర్చి కెం

జిగురుకటారి వాఁడిఁగని ♦ చేవ గలంతురు వారకామినుల్. 410

నిర్వచనవిచిత్రరామాయణము, ఆ 1.

సీ. అమితరసప్రౌఢి ♦ నలరెడు నరముల,
నెనయుంటవలనఁ బ ♦ త్త్రిణులనంగ
లలితబంధవిశేష ♦ ముల మహాభోగులఁ
దనుపుటవలన భో ♦ గిను లనంగ
ఘనతరాగముల మెం ♦ పెనసి పల్లవలాభ
గరిమఁ దాల్చుటఁ గల ♦ కంఠులనఁగఁ
జిత్తజ్ఞులు వినుతింపఁ ♦ దగు వెల లందుచు
మనుటచే సురుచిం ♦ తామణు లనంగఁ
గీ. త్రివళితటమంజులాస్యాభి ♦ భ్రమసమృద్ధు
లలరఁ బ్రీతిభరతరహాస్య ♦ ములను వలఁతు
లగుచు రంభాదులను గెల్చు ♦ పొగను నఁ బూరి
వజలకుం దుహు వారమఁ ♦ దదులు ఛలిర.

భద్రాపరిణయము, ఆ 1 పద్య 144.

# అభిసారికలు.

సీ. శంపాలతికఁ జెంపె ♦ సంగు నెమ్మేనులఁ, గస్తూరిమాళ్లకో ♦ కలు చెలంగ
కంగుబంగరుబొంగ ♦ రాలఁ గేర్......, రహివిహారిదగు కప్పు ♦ రైక లలర
దగ సుందరముఁ జెం ♦ దగ నొందఁ జేయుగ, శస్త్రి నిందప్రస ♦ లరులు గాలి
వడ నైనఁ బ్రియుల గా ♦ ఢాలింగనము లొప్ప, సెదలగుంపుల మృగ ♦ మదము సెనఁగ
గీ. శ్యామసుందరపితతి సెం ♦ చంగ నైన, విరులు తులువున మఁ జిమిత ♦ స్వగము దోఁప
నేను పుఁ గాంద్రహితమ్ముఁ గ ♦ నంగఁ జనిరి, ప్రకటముతులై నిశాభిసా ♦ రికలు గుంపు.

సత్యభామాపరిణయము, ఆ 3 పద్య 64.

ఉ. నల్లనిచీరఁగట్టి కడు ♦ నల్లనికాటుక కంటఁబెట్టి ధ
మ్మిల్లముఁ జక్కఁబెట్టి మది ♦ మెప్పగుకస్తురి బొట్టుఁబెట్టి రా
జిల్లెడు నల్లఁగల్వగమి ♦ చేతనుబట్టి మనోజ్ఞజారిణీ
పల్లవపాణులుం జనిరి ♦ పల్లవకోటి నివాసభూమికిన్. 416

కుబ్జాకృష్ణవిలాసము, ఆ 3.

---

## విటులు.

సీ. అతివినోదముగాఁగ ♦ దూతుల మెచ్చించు నీ,
పచ్చలకడియాల ♦ పద్మగంధి
చక్కెరమోవి విచ్చి ♦ చవులఁ దేలించు నీ
ముత్యాలకమ్మల ♦ ముద్దులాఁడి
తృణముగా లోఁజేయు ♦ నెంతటివాని నీ
నీలాలముంగఱ ♦ నీలవేణి
వెలలేనిపొందిక ♦ విడివడ మెఱయు నీ
కెంపులబొగడల ♦ కీరవాణి
గీ. యనుచుఁ దమలోన నెఱజాణ ♦ తనము మీఱ, వారకాంతామణులమేలు ♦ వార్తలెల్లఁ
దెలుపుచును వెన్నెలబయళ్లఁ ♦ గలసి నగుచు, విటులు విహరింతురప్పురీ ♦ వీథులందు.

విజయవిలాసము, ఆ 1 పద్య 81.

ఉ. వాటపు కూసముల్విడిచి ♦ వాటుగఁ దోఁటలఁ దాము నిచ్చ వ
ల్గాటులు సేయఁగోరి తగు ♦ లాటపు బోటుల రాక గాంచుచున్
చాటులు నిక్కిచూచుచు ♦ పాంథులమిక్కిడి గాఁగ నుల్కుచున్
జాటులఁ బొంచియుండిరి భు ♦ జంగులపోల్కి భుజంగవర్గముల్. 417

మ. సొగసుల్గుల్కెడు తెల్లపట్టువలువల్ ♦ సొంపొప్పఁగాఁగట్టి బల్
మగరాల్చెక్కినసొమ్ముఁబెట్టి సిగలన్ ♦ మందారమాలావళుల్
మిగులంజుట్టి విలాసవైఖరిఁదగన్ ♦ మేల్పొంకపుబెత్తంబుఁ జెం

పుగఁ జేపట్టి భుజంగులేగిరి కిటీ♦పుంజంబులం గూడఁగాన్. 418

కుబ్జాకృష్ణవిలాసము, ఆ 3.

సీ. సారసదళనేత్రి ♦ చంపకమాలికల్, గూర్చియిచ్చెదఁ బసిఁడి ♦ గోర్కి దీఱ
సమదేభగామిని ♦ సరసిజంబుల నీదు, పేరునఁ గూర్చెదఁ ♦ బెంపు దనర
నుత్పలమాలికల్ ♦ హాయలు మీఱ రచించి, యిచ్చెద నీకు నో♦యింపులాఁడి
మంజుభాషిణి మణి♦మాలాదులను నీకు, నొసగెద నొగిఁ జేర్చి ♦ పసదలీర్ప
గీ. యనుచు నతినర్మగర్భవా♦క్యముల నాడి, జారులగు కోవిదులు రేయి♦జాగరించి
తంబిసులఁగూడి వేకువ♦దంబు మీఱ, మునుఁగులిడిపోవుచుందురు♦ సొసఁగి ఁబురిని.

కవిజనచకోరచంద్రోదయము, ఆ 1 పద్య 70.

---

# వనవర్ణనము.

మాలిని. ఏచి తనర్చి తలిర్చిన క్రొన్నుల ♦ నిమ్మగు తావుల జొంపములన్
బూచిన మంచి యశోకములన్ మఱి♦పొన్నలఁ బొన్నల గేదఁగులన్
గాచి పెడంగుగఁ బండిన యా సహ♦కారముల న్గదళీతతులన్
జూచుచు వీనుల కింపెసఁగన్ విను♦చున్ శుకకోకిలసుస్వరముల్. 420

భారతము ఆది ఆ 4 పద్య 19.

సీ. చంచులఁజిగురాకుఁ ♦ జించి చూడుచునలి, నెలుఁగించుగండుఁగో♦యిలలసొంపు
నలరఁ దేనియఁ గ్రోలి♦ మొలయు సోలంబున, మఱియు తేఁటులనును♦ మ్రోఁతయింపుఁ
దనిపండ్లరసమాని ♦ తమలోనఁ జెలఁగుచుఁ, బలికెడు రాచిల్క ♦ పదువుగాంగు
గొలఁకుల కొలఁకులఁ ♦ గూడి క్రీడించుచుం, డెడు నంచతండంబు ♦ నడ పెడంగుఁ
గీ. దరఁగఁ దేలుచుఁ బూఁదీవ♦దగులఁబడుచు, వచ్చుచిఱుగాలిసోఁకును♦ మెచ్చి మెచ్చి
తగిలి కొనియాడుచును విన♦తయును గద్రు,వయును మున్నిటిచేరువ♦వనమునందు.

భారతము అను. ఆ 1 పద్య 181.

సీ. ఎనసి యొండొంటితో ♦ ననఁగి పెనంగెడు, నవలతాతరు మిథు♦నముల సొబగు
సహకారపల్లవా♦స్వాదనక్రీడలు, సలుపు కోకిలదంప♦తుల పెడంగు
పొలయూలుకలను దె♦ల్పులునటించుచుఁ బ్రగాలు, విటకులటాసుల ♦ విలసనంబు

సరసదాడిమఫలా♦స్వాదనలీలలఁ, గరమొప్పు శుకవధూ♦వరులచెన్ను
గీ. హంసవరటామనోజ్ఞవి♦హారవిభ్ర, మములఁ గొమరారు కమలషం♦డములభాతి
నర్థిఁ జూచుచు హలధరుం♦డల్లనల్ల, నేఁగి యొక్కెడ నొకపాద♦పంక్తి లోన. 422
మార్కండేయపురాణము, ఆ 1 పద్య 180.

చ. దలముగ నెల్లప్రొద్దును ల♦తానివహంబుల రాలు పుప్పొడుల్
పులినతలంబులై చెలువుఁ ♦ బూనఁగ మీఁదటఁ దేలు కేతకీ
దళముల మొత్త మోడల వి♦ధంబునఁ జేలఁగఁ బాఱుఁ జెన్నలై
ఫలరసవాహినుల్ పురియు♦పాంతవనంబులఁ గొన్నిచోటులన్. 423
కేయూరబాహుచరిత్రము, ఆ 1 పద్య 60.

సీ. సరసపుష్పపరాగ♦సైకతంబులుదీర్చి, తేనియకాలువల్ ♦ తెరలిపాఱ
రమ్యమయూరాద సం♦భ్రమలీలఁ గల్పించి, ఘన తమాలాంబుద♦కాంతిపసర
లతికావిలాసినీ♦లాస్యంబు ఘటియించి, చతురమారుతనట♦స్వామివోలెయఁ
జారుపల్లవరాగ♦సంధ్యామహిమఁ జూపి, విమలకోరకతార♦కములు మెఱయ
గీ. సతతవిహారణదంపతి♦చారుదేహ, రత్నభూషారుచిస్తోమ♦రమ్య మగుచుఁ
బొలుచు నారామసమితిత♦త్పురమునందుఁ, గల్పకావలిభువిమీఁదఁ♦గలిగెననఁగ.
విక్రమార్కచరిత్రము, ఆ 1 పద్య 89.

సీ. మదషట్పదంబుల♦మధుపానభూములు, రాజకీరంబుల♦రచ్చపట్లు
పుంస్కోకిలంబుల♦భోజనశాలలు, మలయానిలంబులు♦మలయు నెడలు
నవమయూరంబుల♦నాట్యరంగంబులు, మకరకేతనుసభా♦మండపములు
విటవిటీజనముల♦విరులచప్పరములు, మధులక్ష్మినై పథ్య♦మందిరములు
గీ. అలవసంతునిలీలావి♦హారసీమ, లిట్టిలంబగువలపుల♦పుట్టినిండ్లు
చిరపరిశ్రాంతపథికసం♦జీవనములు, పావనము లప్పురంబున♦బాహ్యవనులు. 425
శ్రీరంగమహాత్మ్యము, భైర. క. ఆ 4 పద్య 1013.

సీ. ఉరగపూత్కారధూ♦మోగ్రగంధముఁ బాసి, పొలయుఁ బోయీ తావి♦మలయపవనుఁ
దనలాక్షు పెడబొబ్బ♦నలమిన తలదిమ్ముఁ, బాయుఁ బోయీ తేంట్ల♦పాటమరుఁడు
ఘర్మసామీప్యసం♦కలితదాహస్ఫూర్తి, నాఁగుఁ బో యీనీడ♦నల్లమధుఁడు
గరళసౌదర్యాత్త♦కర సుధాకటుకత్వ, ముడుపుఁ బో యీ తేనె♦నోషధీశుఁ
గీ. దనరఁగఁ జంపక కురువక♦పనస తినిశ, నిచుల వంజులదాడిమీ♦విచికిలామ్ర
పాటలీ పూగ కేసర♦ప్రముఖతరుల, సొబగుమీఱు నుద్యానంబుఁ♦జొచ్చియిచట.
మనుచరిత్రము, ఆ 3 పద్య 73.

లయగ్రాహి.

ఈయిలఁగలద్రుమము♦లీయెడసకూడెసని, పాయకనుతింపనను♦వైయిరులు గ్రిమ్మరన్
రాయకులకర్ణతతు♦లేయములు గానశలు, మ్రోయుచు గుళుచ్ఛముల♦చాయల నటింపం
గాయజుని వాజులకు♦దాయముల నంపెగిన, యాయతర సాలముల♦తోయముల గ్రాలన్
శ్రీయొదలియసూటకు♦పాయమయి చెన్నలరు, నాయుపవనంబు జగ♦నాయకుఁడు
సొచ్చెన్. 427

బసవపురాణము, పి. సో. ఆ 4 పద్య 224.

సీ. విరహిరక్తముతోడి♦మరునిబల్లెము లన, నెల్లెడ విలసిల్లు♦పల్లవములు
బాంధమేదస్స్నేహ♦భరితకామాస్త్రాళి, నా నొప్పు సరస ప్రసూనములును
భావజుమిడివింటఁ♦బాఱు నీలపు గుండ్ల, భంగిఁ జరించు పు♦ష్పంధయములుఁ
జేతోజబలసము♦ద్ధూతధూళియనంగ, రాజిల్లు సుమనఃప♦రాగములును
గీ. ససమసాయకజయబిరు♦దావళీని, పాఠవరవందిజనఘనా♦ర్భటి యనంగఁ
గడు విజృంభించు శుకపిక♦కలకలములు, నెలఁతకును గుండెదిగులుజ♦నింపఁజేసె.

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 3 పద్య 35.

ల య భా తి.

అళికులము నీలముల♦చెలువము వహింపనవ, దళములు హరిన్మణుల♦పొలుపునఁ దలిర్పం
దలిరుగమి కెంపులుగఁ♦బలుఁదెఱఁగు క్రొవ్విరుల, విలసనము ముత్తియపు♦గుళికలకుఁ దక్కం
గలమణులకుం బసిఁడి♦తళుకులకు నీడగుచు, వెలయఁగఁ బరాగములు♦లలితపువితానం
బులుగ గృహముఖ్యముల♦చెలువుప్రతిబింబములఁ, బలెఁ బురమునన్ దెసలఁ♦బొలుచు
ను వనంబుల్. 429

కళాపూర్ణోదయము, ఆ 1 పద్య 115.

ద్వి ప ద.

నఘుచు కందములకం♦దములకుందముల, ఘనలవంగముల లుం♦గములఁ దుంగములఁ
దరులఁ గేళీశైల♦దరుల నిర్ఝరుల, సరసకుంజములఁ గం♦జముల పుంజముల
లలితసాలములఁ గో♦లములను మాధ, వులను మావులను రా♦వులను దావులను
గాలి భృంగాళితోఁ♦గ్రాలి నూనాళి, ధూళిమైఁ బోలి మ♦ధూళిమైఁ దేలి
మించి యెంతయు సంభ్ర♦మించి రమించి, పంచబాణుని వెన్న♦బలమై చలింపఁ
గమ్మవిల్తుఁడు దాడి♦గదలంగ నెగయు, దుమ్ములలోయనఁ బువ్వు♦దుమ్ములు నెఱయ
జడవిల్తు కత్తుల♦విరహిరక్తములు, వడియు జాడఁ జిగుళ్ళ♦వడిఁ దేనె లురుల
[illegible]పాదపృష్టి కే♦నగు విందుప్రింటి, నరణిఁ బికశ్రేణి♦చదలఁ జూపట్ట
శాలమ్మౌఘుతచల♦త్పక్షరంభాభ, మాలోలభోగభో♦గాళి గేళింప

గగనంబునొరయుశా♦ఖల మొగడుత్తు, లగణింప వాతల♦నణకింపచుండఁ
గనకపునదిపిల్ల♦కాలువలనఁగ, ఘనచూతరసములు♦తక్కుటములై నిగుడ
సతులమోవులఁ గ్రోలు♦సరసులు బోలె, లతలబింబములు చి♦లుకలుగ్రోలు చుండఁ
దరులక్ష్మిహాలికక్షు♦తములిచ్చె ననఁగఁ, గరకఁబీజములు శా♦ఖల నొప్ప నొప్పు
సందీప్తసవనంబు♦సకలయోగీంద్ర, బృందైకభవనంబు♦బృందావనంబు. 430

అష్టమహిషీకళ్యాణము. ఆ 1.

ఉ. వాడినదేహవల్లులును♦వక్రిములైన నఖవ్రణంబులున్
గూడిన పత్రిజాలములు♦కుల్కెడి ఘర్మమరందబిందువుల్
వీడినకేశభృంగములు♦వింతలుగా విలసిల్లుచుండఁగాఁ
జూడఁదగెన్ రతాంతసతి♦చొప్పున నవ్వని యప్పు డొప్పుగన్. 431

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 8 పద్య 29.

సీ. అనిమిషాధీశునం♦దనవనంబునుఁబోలె, మందారకల్పద్రు♦మహితమగుచు
బాణవైరికుమారు♦తూణీరమునుఁబోలె, నవపుష్పకాండస♦నాథమగుచు
వనజనాభునిసుద♦ర్శనచక్రమునుఁబోలె, దివ్యబృందావనో♦ద్దీప్త మగుచు
గగనగంగాతరం♦గ ప్రవాహమువోలె, నవిరళామృతఫలో♦దారమగుచుఁ
గీ. బౌధదివ్యవధూముఖా♦బ్జమునుఁ బోలె, జారుతరకీరమధువాక్ప్ర♦చార మగుచు
నలరు నవ్విప్రనారాయ♦ణార్యపుష్ప, వాటి సంకల్పభవపట♦వాస మేటి. 432

నైజయంతీవిలాసము, ఆ 2 పద్య 3.

సీ. తరుణచందనలతా♦తనుసౌరభముతోడఁ, బద్మినీజాతివై♦భవముతోడ
సందీప్తకుంజరా♦శన మధ్యమముతోడ, నవమంజుకుచపాట♦నంబుతోడ
మన్మథబాణ ని♦ర్మలరూపగతితోడఁ, బున్నాగకలనాభి♦పూర్తి తోడ
దుర్వారకాంచన♦ద్యుతివిశేషముతోడఁ, బటుదంతకోరక♦పంక్తితోడఁ
గీ. దనరి తరుణియుఁబోలె ని♦స్తంద్రసాంద్ర, చంద్రకాంతాలవాలవి♦శాలలీల
బాల సురసాల సరససాల♦సాల వకుళ, తాల హింతాల ముద్యాన♦జాలమలరు.

భానుమతీపరిణయము, ఆ 1 పద్య 18.

శా. ఆమోదాన్వితపల్లవైకగణికా♦శ్యామాంకముం బ్రిస్ఫుర
ద్ధామోద్యద్దళముం బ్రఫుల్లకుసుమవిం♦దప్రోజ్జ్వలత్సాలజా
ల్మామేయోన్నతమున్ శుకప్రియపదశా♦ఖాంచద్ద్విజంబున్ వర
శ్రీమంతంబుగ శౌరివనము వ్యాప్తిచెన్ పట్టనక్రియనన్. 434

ముకుందవిలాసము, ఆ 1 పద్య 272.

సీ. కలకంఠసముదాయ◆ములకుభోజనశాల, జగహజారంబు వ◆సంతమునకు
సజ్జాలయము సూతి◆కాయుధాగారంబు, గరిడి మందసమీర◆కాండమునకు
నళిపోతసమితికి◆నాపానసదనంబు, సంకేతభవనంబు◆శైత్యమునకు
శుకముఖద్విజరాజు◆లకుధర్మసత్త్రము, నృత్యగేహము బర్హి◆నికరమునకు
గీ. మానినీజాతసంజాత◆మానమాన, దానకలనాధురీణ వ◆చోనిదాన
శారికానూనవివిధచే◆ష్టావితాన, జీవనం బనఁదగుఁ దత్ప్ర◆దీవనంబు. **435**

చంద్రాంగదచరిత్రము, ఆ **1** పద్య **37.**

సీ. రమణీయతరపత్త్ర◆రథవిహారములంది, ఘనమత్తసారంగ◆గతుల నలరి
పటుగంధవద్ధరి◆వలనాప్తిఁజెలువొంది, మొనమించుదళముల◆వినుతిఁ గాంచి
శ్రీవిలసిల్లు నా◆నావర్ణములమీఱి, కదళికాచలనవై◆ఖరులఁ దనరి
యురుతరసాలశి◆ఖరములమిన్నంది, పల్లవామోదసం◆పదలఁ బొదలి
గీ. ప్రబలు మల్లులయుద్ధతిఁ◆బరిఢవిల్లి, చంద్రకాంతస్థలీవిలా◆సముల నమరి
చారుమహిళాభిశోభియై◆చంద్రవదన, యావనముఁ గంటె పట్టన◆శ్రీవహించె.

మిత్రవిందాపరిణయము, కుం. వెం. ఆ **2** పద్య **85.**

సీ. సురసాలసంతతి◆సురసాలసంతతి, గతి ఖగాళికి ఫలో◆న్నతి యొసంగు
మహితకాంచనములు◆మహితకాంచనముల, పోలిక నామోద◆ములుఘటించుఁ
గలితపున్నాగముల్◆కలితపున్నాగము, లట్ల కొమ్మలతోడ◆నమరియుండు
రంభాదినటనము◆రంభాదినటనము, కరణి మరుత్ప్రసం◆గములఁబొదలుఁ
గీ. బనసలెంతయు బనసల◆భాతి ద్విజుల, కును బదక్రమసంయుక్తిఁ◆గొమరుమీఱు
నగము లున్నతినగముల◆పగిది వనుల, నలరుచుండు పవిత్రంబు◆లగుచుఁబురిని.

బిల్హణీయము, ఆ 1 పద్య 27.

సీ. చెలువంపుఁ జిగురుటా◆కులుపాదములుగాఁగ, నవకంపురంభ లూ◆రువులుగాఁగ
సూనవాసనలు నె◆మ్మేనితావులుగాఁగ, నొఱపైన లతలు బా◆హువులుగాఁగ
గజనిమ్మపండ్లుచొ◆క్కపుఁగుచంబులుగాఁగఁ, గలకంఠరుతులువా◆క్యములుగాఁగఁ
దులలేనిమల్లెమొ◆గ్గలుదంతములు గాఁగ, సుమిళిందమాలికల్◆చూపు గాఁగఁ
ఆ. బల్లవితతమాల◆పాదపచ్ఛాయలు, సరసమైన వేణి◆భరము గాఁగ
నెన్నఁ దగియె నప్పు◆డిందుబింబానన, యౌవనంబుఁబోలి◆యవ్వనంబు. **438**

అనిరుద్ధచరిత్రము, ఆ 2 పద్య **45.**

మ. నవసూనాంచితశాఖలాయెడనెడన్◆రత్నాంకసానుప్రభం
[illegible]పులంబై గుమిఁగూడుకోయిలలు చెం◆త న్మేఘజృంభణంబుగాఁ

బ్రోవఁగం బ్రాఁకు లతాంగు లచ్చరలఁగా♦భాసిల్లెడున్ గంటె యా
చివురుంజొంపపుమావి మేరుగిరినాఁ♦జెన్నొందుఁ జంద్రానసా. 439

ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము, ఆ 3 పద్య 18.

సీ. బాలాంబుజతమాల♦మాలాభినవజాల, జాలామృతోల్లోల♦షట్పదౌఘ
రాగాదిపరిమాగ♦మాగాంతసుపరాగ, రాగావరణభాగ♦రాళిపవన
కేళీగృహస్మారి♦మాలిస్థితిపికాలి, కాలీనరవలోళి♦తాధ్వగాత్మ
రాజీవశరవాజి♦వాజీననిరతాజి, తాజీజనకరాజ♦తామ్రఫలిక

గీ. భవ్యబుతుకాంతకాంతతా♦త్పర్యసృష్ట, ఘనవిషమబాణ బాణసం♦ఘాత కలిత
తిలక మధుగంధ గంధసం♦చులుకితాళి, కనదచిరధామధామ యి♦వ్వనికఁ గంటె.

చంద్రికాపరిణయము, ఆ 4 పద్య 53.

క. పలపులపాణింధమములు, మలయానిలముల విహార♦మందిరములు పూ
విలుతుని యాయుధశాలలు, చలువలజ్యోత్స్నస్థలము ల♦చటిపూఁదోఁటల్. 441

కవిజనరంజనము, ఆ 1 పద్య 17.

సీ. బాలాళినివహంబు ♦ బాలాళిభంగిని, లతలపైనిలిచియా ♦ లతులు సేయ
కోయిలజవ్వనుల్ ♦ గూడి కుహూకార, కాహళధ్వనులు చో♦క్కముగఁ బూన
రాయంచలేమలు ♦ రహి నిల్వఁబొగడంగ, రాచిల్కజవరాలు ♦ రాగ మునఁగ
మలయానిలుండును ♦ మందమారుతమును, నలతాళకునిరీతి ♦ నాటఁ జూప

గీ. సంభ్రమంబున మంజరీ ♦ స్తనము లొరయ, వైభవంబునఁగరపల్ల♦వములుసాఁచి
తరులతాంగవితతులు న♦ర్తనలు సలుప, నంతకంతకు వనలక్ష్మి ♦ యతిశయిల్లె.

పర్వతపురాణము, ఆ 4.

సీ. గురుతరోజ్జ్వలపుష్ప ♦ గుచ్ఛవక్షోరుహ, కోమలవల్లికా ♦ భూమనోజ్ఞ
కుందకోరకదంత ♦ బృందబింబాధర, శోభితి శాఖాభు♦జాభిరామ
ఫుల్లసముల్లస♦త్పుష్పసంహతిహాస, చంపకకుసుమాతి ♦ చారు హాస
శుకపికకలనాద ♦ సురుచిరషట్పాద, చయవేణి కిసలయ ♦ చారుపాణి

గీ. కదళికాసక్థికమనీయ ♦ కనకకలిత, వేదికాజఘనానూన ♦ విలసమాన
యనఁగఁ దనరెడు వనలక్ష్మి♦కెనగలాదె, మాధవునిపొందుగలదిందు♦మనకుఁజూడ.

ఉషాకళ్యాణము, ఆ 4 పద్య 111.

సీ. కలమాబ్జబిసదళ ♦ కాంతిసమ్మిశ్రిత, వరపిశంగారుణ ♦ హరిత రుచులు
నెరయఁగాఁగిలిగిన ♦ చరదింద్రచాప ఖం, డాభంబులైనతో♦యములుగాంచి
యేడాకుటనఁటుః♦నెగయూపుప్పొడి జాలు, పైఁటబోలెనుసారె♦మాటుకొనుచుఁ

గాటుకల్దీర్చిన ♦ కన్నులల్లాడ్చెడు, గతిసెల్లగెంపెనుల్ ♦ గడలుచుండ
గీ. వెలయుకుసుమంబులనునవ్వ♦లొలుకుచుండ, గురుకుచంబులగతిఁబువ్వ♦గుత్తులమర
నలరు కచలీలఁబుష్పంధ♦యములుదనర, వనితలనుబోలువనపంక్తు♦ లొనరఁజూచి.

కిరాతార్జునీయము, ఆ 2 పద్య 18.

సీ. మోహనాకార స♦న్ముఖవిలాసములొప్పఁ, గాంచనద్యుతులు న♦ల్గడలఁ బర్వ
పల్లవాలంకార ♦ పత్త్రరేఖలు దేర, జిల్గుకంచెలఠీవి ♦ చిందులాడ
వెలలేని మురిపెంపు ♦ వలపులు నిండార, మన్మథసహకార ♦ మహిమ మెఱయ
జిలిబిలిముద్దుచి♦ల్కలపల్కు లలరింపఁ, గలకంఠు లెలమిని ♦ గలసి మెలఁగ
గీ. నిగనిగల్గలపండ్లు వ♦న్నియలుగులుక, తమిని సరసాళు లమిత గీ♦తములు పాడ
నలరు పురలక్ష్మితోడ సె♦చ్చెలులనంగఁ, బొల్చె నెల్లెడనుద్యాన♦భూములందు.

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 1.

ఉ. కందములెందమై తగు సు♦గంధములంగనుపట్టి సుందరీ
బృందవినోదమై దళస♦మృద్ధిఁ దనర్చి మయూరసేవ్యమై
సుందరచంపకాది పరి♦శోభితమై ఘనమత్తకోకిలా
నందకరాప్తి నాంధ్రికవ♦నమ్ములు మొల్కవనమ్ము లప్పురిన్. 446

వేంకటేశ్వరవిలాసము, ఆ 1 పద్య 17.

గీ. ఒనరె శాండిల్య ధౌరేయ♦యుక్తమగుచు, భవ్యకలితజటావాహ♦సేవ్యమగుచు
శారదామోదవిలసన్ని♦శాంత మగుచు. వనము జీవనజాసనా♦వాస మట్లు. 447

ఓఘవతీపరిణయము, ఆ 3 పద్య 150.

సీ. ఘనతరశ్యామాము♦ఖవికాసములుగానఁ, బల్లవరాగ సం♦పత్పదములు
మధురసామోదస♦మ్మదకరంబులుగాన, మధుపగుణోన్మేష ♦ మండితములు
సకలాధికద్విజా♦స్పదశాఖములుగాన, బహులాగమౌఘవి♦భాస్వరములు
ఫలవద్వితానసం♦బంధంబులగుఁగాన, వరసుమనోలోక ♦ వైభవములు
గీ. మఱియు సజ్జాతివిలసన♦మంజులంబు, లతనుసహకారములు మహా♦మృతఘనంబు
లధికరంభావినోదంబు♦లగుచు నలరు, నప్పురోపవనాంతుబు♦లభినుతింప. 448

ఇందుమతీపరిణయము, మ. నృ. ఆ 1 పద్య 14.

సీ. ఒప్పెడిపుష్పాడి♦తిప్ప పీఠముగాఁగ, నలరుఁజేనియలు పా♦ద్యములుగాఁగ
సుమపరాగములు ధూ♦పములుగా సుమనోవ్రజములుపూజాపదా♦ర్థములుగాఁగ
గొందలిరులుదీప♦సందోహములుగాఁగ, భ్రమరనాదములు మం♦త్రములుగాఁగ
గిలకంఠరములు♦కలగానములుగాఁగ, డీవియల్ సొగను జం♦దెపుటుగాఁగ

గీ. జిగురుజొంపముకెంబట్టు♦చేలగాఁగ, ఫలము లుపహారములుగాఁగ♦నెలకొలిపి వ
నేందిర యొసంగు నీకు స♦మందభక్తి, గన్నులారంగ మాధవ♦గనుఁడియిచట. 449
సుమనోమనోభిరంజనము, ఉల్లాస 2 పద్య 41

మ. సురసాంచద్ఘనపుష్పపూరితములై♦సొంపొంది పృష్ఠాంపజో
త్కరసంచారపటుత్వముల్ గలిగి రం♦గద్భృంగసంగీతముల్
పరగన్ సారససౌరభానిలసదా♦ఘంగాగమంబుల్ వగన్ 450
బురి నుద్యానములున్ సరోవరములుం♦బొల్చున్ సమత్వంబునన్.
భద్రాద్రిపరిణయము, ఆ 1 పద్య 116.

శా. కామోత్సాహముఁగూర్చు సౌరభములు♦న్నాంతంబులౌపత్త్రిముల్
స్వామల్ మెచ్చఁగజాలు జాతితిలక♦స్వారస్యముల్ ధీరలో
కామోదప్రదపుష్పముల్ శుకమనోజ్ఞాలాపము ల్గల్గి యా
రామారత్నములట్టు లెన్నఁ దగి యా♦రామంబు లొప్పుం బురిన్. 451
భరతాభ్యుదయము, ఆ 1 పద్య 54.

# వనవిహారము—పుష్పాపచయము.

సీ. మావిలేమొలకల♦మవ్వంపుఁదీవలఁ, జెన్నొందఁ బెండ్లిండ్లు♦నేసి చేసి
పలుదెఱంగుల క్రొవ్వి♦రుల నేర్పవాటించి, తొడవులు గావించి♦తొడివి తొడివి
పతులను బ్రియులుగా♦భావించి పొదరిండ్ల, నిక్కలుగాఁజేసి♦యేఁగి యేఁగి
చెట్టుపల్ నెఱయని♦చిలుకబోదలఁ బట్టి, తెచ్చి బిడ్డలుగఁ బ♦న్నిచ్చి యిచ్చి
గీ. పొదివి పుష్పాళ్లనల్లియుఁ♦బువ్వుదేని, యలఁ బదంపడి తడిపియు♦నలివసంత
మాడి యాడి యుద్యాన వి♦హారలీల, నలిపి రంభోరుహాసన♦లెలమి మిగుల. 452
నిర్వచనోత్తరరామాయణము, ఆ 8 పద్య 35.

సీ. మానినీగండూష♦మధువులఁబూచిన, పొగడను సొబగొప్పఁ♦బొగడిపొగడి
నారీపదాహతి♦ననిచినకంకేలి, పరువంబునగ్గించి♦పలికి పలికి
లలనావలోకనం♦బులఁబుష్పితంబగు, తిలకంబుపైఁజూడ్కి♦త్రిప్పి త్రిప్పి
వనితోపగూహనం♦బునఁ జేర్చు సురపొన్న, మేలిపుణ్యమునకు♦మెచ్చి మెచ్చి

గీ. మన్మథారామములపొంత ♦ మలసిమలసి, శుకపికాళివిహారంబు ♦ సూచిచూచి
సతులుఁ దాను జరించు వ ♦ సంతవేళఁ, బ్రమదవనమున విశ్వభూ ♦ పాలవరుఁడు.

కావ్యాలంకారచూడామణి, ఉల్లాస. 3 పద్య 116.

సీ. కిసలయంబులతోడఁ ♦ గెంగేలుదడవెట్టి, విరులపై నఖకాంతి ♦ విజ్జిరాల్చి
లేఁదీగలకుఁ దనూ ♦ లీలఁ గానుకయిచ్చి, గుత్తులుఁ జాలిండ్లు ♦ గొలిచి చూచి
చలిగాలినిశ్వాస ♦ సౌరభంబులనాఁగి, యళిపంక్తిఁ గురులతో ♦ నలుకఁదీర్చి
పుప్పొళ్లు నెలగంద ♦ ములువియ్యమందించి, పూఁదేనెఁ జెమటల ♦ బుజ్జగించి
గీ. తొడలునఁటికంబంబులు ♦ మెడలుఁబోక, బోదెలునెలుంగులును బర ♦ పుష్టరుతులు
మాటలునుగీరభాషలు ♦ మక్కళించి, చిగురుఁబోఁడులు వనకేళి ♦ చేయఁజేయ. 454

ఉత్తరహరివంశము, ఆ 5 పద్య 50.

మ. సహకారాధిపుఁ గౌఁగిలించుకొని వా ♦ సంతీలతాకాంతసా
రహరిద్రారసగౌరకేసరములన్ ♦ రంజిల్లు మాధ్వీకవా
ర్లహరీస్వేదము చూపఁబట్టపగలే ♦ లాయింతటన్ సిగ్గులే
పహాహో యంచుఁ దొలంగి నవ్వెఁ జెలిమా ♦ ళైముద్దరాలయ్యెడన్. 455

మ. ఒకరామాతిలకంబు రత్నరుచితో ♦ నొప్పారు మందారకో
రకముం గర్ణవతంసత న్నిలుపుచున్ ♦ రాఁగా లతాసక్తచూ
చుకచేలాంచలయై పెలంగి విడుమం ♦ చుం గేలు సాఁచె స్వసా
యకమూర్విం బెగగొన్న మన్మథుని ప్ర ♦ త్యాలీఢపాదంబునాన్. 456

,, ,, ,, ఆ 4 పద్య 52,;53.

సీ. సుదతి మొల్లలుదెచ్చి ♦ సూడిదెయిచ్చినఁ, బలుతెఱంగులనవ్వఁ ♦ బాడి యగునె
కొమ్మసంపఁగిమొగ్గ ♦ గొమ్మరమ్మనిపిల్చి, న్యాయంబె యిదినాకు ♦ నాసఁ జూపఁ
బూఁబోఁడి యిపుడునా ♦ పూబంతులింక నీ, పాలింటివనుచు డా ♦ పంగ డగునె
కనులమొక్కటి నేను ♦ గాన్కగానిచ్చినఁ, గనుసన్నఁ గేరిణింపఁ ♦ జనునె సకియ
గీ. యనుచు విభ్రమోల మేలంబు ♦ లాడుకొనుచు, నంగసౌందర్యసంసూచ ♦ సాభిరామ
చాటువాచాచమత్క్రియా ♦ సరణి మీఱ, గిల్లి రప్పుడు సతులు రా ♦ గిల్లి విరులు.

రామాభ్యుదయము, ఆ 1 పద్య 188.

సీ. అలరులకెత్తుచో ♦ నఱచేతికెంజాయ, లాదవికోయిలల నో ♦ రూరఁ జేయ
నునుమేను లలసి భ్రమా ♦ నులమీఁదనొఱఁగుటల్, తీవలు వ్రాఁకిన ♦ తెఱఁగుఁ దెలుపఁ
జెలికత్తియలలీలఁ ♦ బిలుచునున్నలుకులు, మదకీరములముద్దు ♦ మాటలార్ప
బుగబుగపలచునూ ♦ ర్పులతావులెసఁగి క్రొ, న్ననలకు వింతవా ♦ సనలొసంగ

గీ. నిక్కి కొనగొమ్మలందుఁ బో ♦ నీవిజాజి, యలువడియెఁ బున్నాగకు ♦ సుమలసాంగ
లంగలతలకు నరవిరు ♦ లై చెలంగ, సతులు పుష్పాపచయకేళి ♦ సలిపి రక్తి. 458

కవికర్ణరసాయనము, ఆ 4 పద్య 21.

సీ. కుసుమవాసనలెల్లఁ ♦ గొల్లలాడితిమింకఁ, బఱచుటా మనిరెంత ♦ పర్వులిడునొ
చివురుజొంపములెల్లఁ ♦ జిదిమివైచితిమింకఁ, బగఱకోయిలలెంత ♦ యొగసిపడునొ
ఫలపరంపరలెల్ల ♦ నులిచివైచితిమింకఁ, గొడమచిల్కలవెంత ♦ వడఁకొనునొ
కమ్మఁదేనియలెల్లఁ ♦ గుమ్మరించితిమింకఁ, గట్టిల్కనపులెంత ♦ చుట్టుకొనునొ
గీ. యెఱుఁగరాదింతులారయీ ♦ తెఱవనిచట, మసలఁగానీకతో తెండు ♦ మనముగొనిన
కుసుమకిసలయఫలనవ ♦ ప్రసవరసము, లసమశరునకు నర్పింత ♦ మనుచు వెడలి.

వసుచరిత్రము, ఆ 3 పద్య 151.

సీ. అరపీడుకొప్పుల ♦ విరులవాసనకుఁ దో, రపుటూర్పుఁదావులు ♦ ప్రాపు గాఁగ
నడలమందతఁ జెంచు ♦ బడలికలకుఁ జిఱుం, దుల వ్రేఁగుచనువ్రేఁగు ♦ తోడు [illegible]
జెమటచిత్తడిఁ గ్రొత్త ♦ చెలువుగాంచిన వపుల్, మొలనూళ్లకాంతికి ♦ బలిమిఁ [illegible]
బయ్యెద లాడింపఁ ♦ బరిభవించు కంకణ, నాదమందెలమ్రోఁత ♦ ప్రోపు సేయ
గీ. మిగులరొదగాఁ గికాకిక ♦ నగుచు రతుల, యాయములు సోఁకనెద్దియే ♦ నాడుకొనుచు
సందడింపుచుఁ బుష్పాప ♦ చయము సలిపి, యంతఁ గడఁగిరి డోలావి ♦ హారములకు.

కళాపూర్ణోదయము, ఆ 1 పద్య 145.

ఉ. పుష్పాడి చల్లుతీవల క ♦ పూర్వగతిం గరమూలదీధితుల్
కప్పెమొసంగుచున్ వలపు ♦ కానుక సేయుచునున్న పూవుబల్
గుప్పకు నూర్పుసౌరభలు ♦ గూర్చుచు నేర్పున సంచరించిరా
కప్పురగంధులెందుఁ బగుఁ ♦ గా యితరేతరబంధుకృత్యముల్. 461

సుదక్షిణాపరిణయము, ఆ 3 పద్య 63.

సీ. బొట్టుగు లేమావిఁ ♦ బొదలించెనొక్కర్తు, చూచియుఁ జేనంటి ♦ సొబగుమీఱ
బొన్నఁ బేరింకణమును ♦ బూయించె నొక్కర్తు, చిఱునవ్వునునఁ బాట ♦ దుఱఁగలింపఁ
బొగడను గంకేళిఁ ♦ దగవిరుల్ గలిగించె, నెమ్మిఁ గల్లుమిసి త ♦ న్వియునొకర్తు
కొసరివాఁ డిలిఁగొంచ ♦ గోఁగునునవిపించె, మూర్కొనిమాటాడి ♦ ముదిత యోర్తు
గీ. కోరివిఁ బూవులునిండించెఁ ♦ గొమ్మయోర్తు, కదిసి కూరిమితో డుతఁ ♦ గౌఁగిలించి
చనుపకంబునఁ గొన్నిన్నల్ ♦ దనియనించె, ముదిత యొక్కతె తనముద్దు ♦ మోము జూపి.

యయాతిచరిత్రము, ఆ 4.

సీ. అల భారతీదేవి ♦ నగుదు నే నని నలు, వలరు విరింతల ♦ చూపెఁ ♦ జెలువ యొకతె

యల రమాలలన నే♦నని హరిసన్నిధిఁ, జేరి వర్తించె మి♦టారి యొకతె
యల గట్టుపట్టి నే♦నని నవ్వుచును శివా, లింగనం బొనరించె ♦ లేమ యొకతె
యల వహ్నికాంత నే♦నని బర్హిసంగతి, నలరి వినోదించె ♦ నతిప యొకతె
గీ. యల మృగాక్షిని, నేనని♦యతిముదమున, మన్మథాలోకనము చేసె♦మగువయొకతె
యల యరుంధతి నే నని♦ కేలనిమౌని, గదిసి వేడుక రంజిల్లె ♦ ముదితయొకతె.
నలచరిత్రము, సి. ధ. ఆ 3 పద్య 227.

చ. గురుకుచలెల్లఁ జూడ నొక ♦ కోమలి సంపెఁగఁ జూడఁ జూపులన్
నెరసిన నల్లనయ్యెఁ జెలి ♦ నివ్వెఱయై కన హాసచంద్రికం
గరముగఁ దెల్లనయ్యె నది♦గాంచి యిదేమియటంచుఁ బట్టెఁ ద
త్కరరుచి నెఱ్ఱనయ్యె నది ♦ గారడియంచుఁ దలంచి రంపఱున్. 464
,, ,, ఆ 3 పద్య 240.

సీ. కలవు లే వనఁజాలు ♦ గొందీవలు చలింప, వల్లీమతల్లికల్ ♦ వంచి వంచి
సమపీనకుచగుళు♦చ్ఛములు కంపముఁజెందఁ, గొ్రవ్విరిగుత్తులు ♦ గోసి కోసి
లలితాంఘ్రిపల్లవాం♦ఘ్రులుదొ్రటుపాటొందఁ, జిగురుటాకులబారుఁ♦జిదిమిచిదిమి
భుజమూలరుచిహేమ♦రజముబయల్ వ్రాఁక, వలపుఁబుప్పొడులెల్ల♦దులిచిదులిచి
గీ. బాహునాళాధరోష్ఠబిం♦బకరకిసల, వదనజలజంబులకుమూఁగు ♦ వరమరాళ
శుకపికశిలీముఖాళికి ♦జుణిఁగి జుణిఁగి, సఖులు పుష్పాపచయకేళి♦సలుపునపుడు.
చంద్రాంగదచరిత్రము, ఆ 4 పద్య 199.

గీ. కురులు జడయల్లి మందార♦కుసుమ మునిచి, కప్పురపుబూదిమైఁబూసి♦గొప్పమల్లె
విరిసరుల్దాల్చి తా మహే♦శ్వరుఁడనంచు, దానినదలించెనొకమత్త♦దంతియాన.
రసికజనమనోభిరామము, ఆ 4 పద్య 62.

సీ. పొన్నగున్నలనీడఁ♦గన్నెమావులజాడ, మురియుచు డాఁగిలి♦మూఁత లాడు
వృక్షపుంజంబుల♦వివిధకుంజంబుల, నలరుఁ దీవియల ను♦య్యాలలూఁగుఁ
బుప్పొడులపెరంట్లఁ♦గప్పురంపుటనంట్ల, నొప్పుగా వెన్నెల♦కుప్పలాడుఁ
బొదరింటిపట్టులఁ♦జదరంపునట్టులఁ, బంతుగాగోరింట♦బంతులాడు
గీ. వెదకిపువ్వులఁజిదుముఁదు♦మ్మెదలఁగదుము, ఫలరసంబులఁబీల్చుఁజి♦ల్కలనుబిల్చు
సిరులునలుదిక్కులనుదీడి♦చెలులఁగూడి, బాలికుప్పొంగి చంద్రిమ♦తీలతాంగి. 467
ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము, ఆ 3 పద్య 15.

సీ. అలరుతావులఁగూడు♦నలరుతావులఁజూడు, కొరకమ్ములయాన♦కొరకమ్మ
చాలమేలగుపొన్న♦చాలుమోగిలగనున్న, మావికొమ్మలపండ్లు♦మావి కొమ్మ

బాలబిల్వములఁ జూడ♦బాలబిల్వములు పోలె, రేఁగుమానులకేదు♦రేఁగుమాను
పచ్చపూఁతలమించు♦పచ్చపూఁతలనించు, చేఁతకొమ్మలఁ జూడ♦చేఁతకొమ్మ
గీ. లారఁ జదసులపైఁ గోర్కు♦లారఁ గదలి, నారికేళీవనాళిఁ జె♦న్నారి కేళి
కింపుదులకింపుననితమ♦కింపు మెఱయ, నాడి రతిపలు మరుఁడు వె♦న్నాడికొనఁగ.

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 3.

సీ. చిగురుటాకులఁ గేలఁ♦జిదిమితి మదిఁగాన, గండుఁగోయిలలెంత♦గసలునొక్కొ
ఫలసమూహములు సం♦దులువాపితిమి గావఁ, గీరముల్ కృశించెంత♦గినియునొక్కొ
తేనెవాఁకలు గల్లఁ♦ద్రెవ్వఁ జితిమిగాన, భృంగంబులెంత కో♦పించునొక్కొ
తొడలువొంగఁగవిరుల్♦గెడపితిమదిగాన, మరుఁడుకక్కసమెంత♦నెరపునొక్కొ
గీ. చూడబలవద్విరోధంబు♦గూడదెందుఁ, బూలవృక్షులఁ గడుభక్తిఁ♦బుష్పశరుని
సపరివారంబుగాఁ బూజ♦సలుప వలయు, నన నొకకోలంతునకు వారు♦చనిరిదసరి.

ఓషువతీపరిణయము, ఆ 3 పద్య 172.

సీ. చరియించునొకకేళి♦నురురావమున భావ, మవలీలఁ గొనుతేంట్ల♦నరసికొనుచుఁ
గురియించు నొకచోట♦నుగవాటమునవాటు, మునదీటుకోనలఁ♦బుష్పవృష్టి
స్మరియించు నొకయోర♦వరసౌరనదితీర, మున మును గాంచిన♦భోగములను
ధరియించు నొకవంకఁ♦దమిఁబొంకమగువంక, దరిచిరిగొమ్మకై♦దండయొసఁగ
గీ. నొక్కచో నిల్చునొకయిక్క♦నెక్కి చూచు
నొకట సచివుని కేల్వట్టు♦నొక్క చెంత
నుచితసల్లాపములుసల్పు♦నొక్క దరిని
బూవుఁదేనియలానునా♦భూవిభుండు. 470

శంతనూపాఖ్యానము, ఆ 2 పద్య 29.

సీ. సాంద్రమానీలతా♦సౌకర్య మెల్లను
జూచితివే మె యో♦సుందరాంగి
పుష్పసమృద్ధిచేఁ♦బొదలెడియిండ్లపైఁ
గాంక్షించియున్నావె♦కంబుకంఠి
సహకారభూరుహ♦చారుఫలములి
చ్చటను నపేక్షించు♦చంచలాక్షి
శాఖోన్నతవిశాల♦సాలవృక్షశ్రేణి
నిర్మితంబులు నివే♦నీలవేణి
గీ. ప్రవీణతలచిత్రవేదికా♦సనములును, గదళికాపూరకర్పూర♦గంధములును

... ... ... తలఁచితివో లేదో యీవేళఁ బలిరుబోటి.

ఉ. జానకిఁగూడి రాముఁ డల జాహ్నవి కుండు సమృద్ధిఁ జెంది యు
ద్యానముఁ జేరి పాదపవితానతలంబుల మల్లికాలతా
సూనవిశేషముల్గనుచు సొక్కుచుఁ గోరకగుచ్ఛపంక్తిసం
ధానములైన చంపకవితానములం బరితృప్తిఁ గాంచుచున్. 473

పట్టాభిరామాయణము, ఆ 2.

సీ. ఒకకుందరదన చంపకమును వీక్షించి, మునుముక్కు నసెకోపమును వహించె
నొకపద్మనేత్రి వేడుకకుందములు దాచి, పటపటపటనని పండ్లు గొఱికె
నొకరాజనిభముఖి వికసితాంబుజములఁ, గనుఁగొని విముఖ కాలు ద్రివ్వె
నొకమత్తగజయాన యుత్పల్లనుమశాఖ, పాళిని దిలకించి భార సాఁచెఁ
గీ. సరసభాషిణి యొక్కతె చక్కనైన, తములపాకులతీన మొత్తంబుఁ జూచి
విడని రోషంబుచే నొల్లు విలువసాగె, సహజవైరంబుఁ బూని యచ్చటఁ గరంబు.

కవిజనచకోరచంద్రోదయము, ఆ 3.

సీ. వడిఁ జొన్నవిరిఁ గోసి ముడిఁ బెట్టెనొక్కతె, పొక్కిలితో సరిపోల్చు కరణి
సెపఁగోసి సంపంగివిరి నిమురొక్కతె నేర్చు, ముక్కుతోడను సరిపోల్చు కరణి
చిగురుజొంపము ద్రుంచి చేతఁ దాల్చె నొకర్తు, పాణిఁ గేలితో సరిపోల్చు కరణి
మొగలిరేకులు గోట ముట్టి గిల్లె నొకర్తు, మొగిగోళ్లతో సరిపోల్చు కరణి
గీ. దొండపండును గొఱికె వాతెఱ యొకర్తు, పాసఁగఁగె మ్మోవితో సరిపోల్చు కరణి
తీవె మెయినంటఁ జేయెత్తి తిగిచె నొకతె, పూని నెమ్మేనితో సరిపోల్చు కరణి. 475

రసికజనమనోరంజనము, ఆ 3 పద్య 26.

---

# మలయమారుతము.



సీ. ఘనసారకస్తూరికాగంధము లనన్య, గంధబంధంబులు గలిపి కలిపి
కుసుమితవల్లికాలసితవీథులఁ జొచ్చి, గని సరోగృహముల మునిఁగి మునిఁగి
సమధికామోద్యాంగ సంగీతములతోన, కన్నె తీగల కాట కలిపి కలిపి
కుముదకుట్మలకుటీకోరకంబులు దూఱి, యలిదంపతుల నిద్రఁ దెలిపి తెలిపి
ఆ. మారుకెన్నముద్దు నవ్వు గ్రాంతికన్మ గట్టి, వానిపోలె విప్రవరుఁడు పోలె

నట్టువోలెఁ దాను♦వచ్చినచెలివోలె, మలయుచుండు మంద♦మారుతంబు. 476

విజయసేనము.

ఉ. గందపుఁగొండనెత్తముల ♦ కందువ నేలకితీవయిండ్లలోఁ
గండలిరాకఁబాన్పుల సు♦ఖించి నితాంతరతిశ్రమంబులన్
జెందినచెంచుగుబ్బెతల ♦ చెక్కులఁ జిమ్ము జవాదివాసనల్
విందులు సేయుచు న్మెలఁగె ♦ వేమఱుఁ గోమల గంధవాహముల్. 477

శ్రీరంగమాహాత్మ్యము, భైర. క. ఆ 2 పద్య 258.

చ. సురనదిఁదోఁగినీరజర♦జోభసితంబు ధరించి రాలుక్రొ
వ్విరులశివార్చనల్ సలిపి♦వెంబడివచ్చు మధువ్రతాళి ఝుం
కరణము చేతఁబాడి లతి♦కాభుజముల్ కదలంగనాడెడున్
బరిసరపుష్పితోపవన♦బంధురమంధరగంధవాహముల్. 478

ప్రబోధచంద్రోదయము, ఆ 4 పద్య 43.

సీ. విరహాదింతాగ్ని యి♦వ్విధిఁ గెరల్పుదునన్న, పగిదిఁ బద్మపరాగ♦మెగయఁ గొట్టి
కాముని పడవాలు ♦ గానఁ బౌజులు సేయు, గతిమధుపంబులఁ ♦ గదలఁ దోలి
తీవెలేమలచేత ♦ నీవిధిఁగలయంపి, చల్లించుక్రియఁ దేనె ♦ సడలనుడిసి
తనపగ సాధింపఁ ♦ గని మెచ్చి బుజ్జగిం, చినరీతి శిఖులపిం♦ఛములు నిమిరి
గీ. తెరువునడచినదాహంబు ♦ దీర గిరిఝ, రాంబువులుగ్రోలు కరణిర♦తాంతతాంత
పనిలలకుచాగ్రముల ఘర్మ♦వారిపూర, మడఁగ విహరింపఁ దొడఁగె మం♦దానిలంబు.

వరాహపురాణము, నంది. మ. ఆ 3 పద్య 75.

సీ. మదగంధ తారత♦మ్యము యామ్యకరికిఁ ద, త్కరులకుం గనబలెఁ♦గటములొఱసి
సురతశ్రమజమాటఁ ♦ జూపోపకయెబలెఁ, గామినీమృదుగండ ♦ ఘర్మ ముడిపి
పరిమళవాహేచ్ఛఁ ♦ బ్రాణమీఁబలెఁజించు, మృగనాభిచర్మభ♦స్త్రికలు దూఱి
యహితపన్నగభేదు♦లనిబలె గృహవిటం, కపుఁగలాఁపులనొయ్య♦ గఱులు నిమిరి
గీ. వీటిసామగ్రిఁగనుఁగొన ♦ వేగపడక, నడవఁ దనదిక్కు పుష్పదం♦తద్విపంబు
నెక్కెనో యనజడగతి ♦ నెపుడుఁబోలయు, నందుఁజందనశిఖరిమం♦ధానిలుండు.

ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 29.

సీ. ప్రణయవాదములు దం♦పతులందు నుదయించి, రంజిల్లు మానాంకు♦రములు మేసి
సురతాంతవిశ్రాంత ♦ సుందరీజనముల, వక్షోజతటఘర్మ ♦ వారిఁ గ్రోలి
వనములు మధుగర్భ♦వతులుగాఁ బూమొగ్గ, మొదవులకామాన♦ములు హరించి
విషయానుషక్తకథా♦విముఖవిరక్తుల, పటుతరధైర్యస♦స్యములు గాల్చి

గీ. గంధలోభానుబంధిప్ర◆పంచయముల, ఝుంకృతులచే ఘణిల్లన ◆ నంకెలిడుచు
విషమశరుపేరజన్నియ◆విడిచి రనఁగఁ, గ్రొవ్వి చరియించు నవ్వీటఁ◆గోడెగాడ్పు.

కవికర్ణరసాయనము, ఆ 1 పద్య 25.

ఉ. చెన్నగునన్నదీపులిన ◆ సీమల దాఁగిలి మూఁతలాడుచున్
వెన్నెలరేలు కప్పురపు ◆ విప్పటనంటులనీడ నీఁగు రా
కన్నెలరోయు నన్నులకుఁ ◆ గన్నులు మూయుఁ దదీయవాసనల్
[illegible]గాంచి కప్రపు చ◆మారము రేఁచు సమీరడింభముల్. 482

వసుచరిత్రము, ఆ 1 పద్య 112.

చ. [illegible]నొయ్యనరు◆దెంచి నిశాంతరతాంతతాంతలా
చెలువలకెంపుగా మెలఁగి◆చెక్కులఁ గూరిన చూర్ణకుంతలా
వళి సరళంబుగా జడిసి◆వాడిన సెజ్జలమీఁది ప్రావిరుల్
దొలఁగఁ బ్రభాతవాయువులు◆దోఁచుఁ బురిం బరిచారికాకృతిన్. 483

పాండురంగమాహాత్మ్యము, ఆ 1 పద్య 119.

ఉ. బింకపుగబ్బిగుబ్బెతల◆బిత్తరిచూపులు మేనితావులున్
గొంకక గాంచి లీల మెలఁ◆గున్ మలయానిలుఁ డవ్వనిన్ నిరా
తంక మరందసారణుల◆దాఁటుచుఁ దన్నెద మీఁటి చన్నయా
జింకపడావు మావిచటఁ◆జిక్కఁడు గాయని చూచు కైవడిన్. 484

లక్ష్మీవిలాసము, ఆ 3 పద్య 57.

ఉ. సోరణగండ్లకన్నముల◆చొప్పల నొయ్యనఁ దూఱి తావిచొ
క్కారసి చల్లి తత్పురిని◆యామినులన్ సురతాంతతాంతకాం
తారుచిరాంగఘర్మకణ◆నవ్యవిచిత్రమణుల్ హరించుచుం
జోరులకైవడి న్మెలఁగుఁ◆జోద్యముగా మలయానిలౌఘముల్. 485

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 1 పద్య 31.

సీ. గంధసారమహీజ◆ బంధురోరగరాజ, భుక్తముక్తంబులై◆పొడలి పొడలి
భూసారజలపూర◆కాసారకముదార, విందబృందంబులై◆విడిచి విడిచి
కోమలమాకంద◆కుసుమగుచ్ఛమరంద, కణగణంబులసొంపు◆గమిచి కమిచి
భామినీసురతాంత◆భవఘర్మజలతాంత, గండమండలముల◆గదిసి కదిసి
గీ. చిన్నివెన్నెలతేఁగొనల్ ◆చిదిమి చిదిమి, పరువుమరువంపుతావుల◆బలసి బలసి
మునులతనువు పులకింపుగా◆ మొనసి మొనసి, మందమందానిలము వీచె◆ మలసి మలసి.

వరాహపురాణము, హరిభట్టు.

మ. వలపుంగొజ్జఁగినీటి శీతలహరి♦వార్చిందుప్రల్ చిమ్ముచుం
గలయం గప్పురపుం దుమారము మెయిన్ ♦ గాటంబుగా గప్పుచుం
బలవద్దర్పక బాణపంక్తులకుఁ బ్రియన్ ♦ పైపై విరుల్గుప్పుచుం
జెలఁగెన్ మందసమీరణుండు దితిజ ♦ శ్రేప్రహాగ్రిభాగంబునన్. 487

సింహశైలమాహాత్మ్యము, ఆ 2.

సీ. లలితచందనలేప ♦ కలితసుందరవక్ష, సోపానములజంగఁ♦జాఁపి యెక్కి
ఘనతారహారసు♦స్తనభారగిరినితం, బములపై జీరుకు ♦ బండ లాడు
ననమానవీటికా ♦ రసమానితాధరా, మృతదీర్ఘికలను జే♦యీఁత లీఁదు
హేలారచితపుష్ప ♦ మాలానిచితకేశ, భృంగమల్లవులతోఁ ♦ బెనఁగు లాడు
గీ. సురతనాట్యకళాంకురి♦కరణకామ, కమలజాతాతపసరిత్ప్రి ♦ గాఢకేళి
భవపరిశ్రమలాలస ♦ పౌరయువతి, జాలపనుపీమల సమీర ♦ బాలకుండు. 488

కవిరాజమనోరంజనము, ఆ 1.

సీ. సవిధోపవనమంజు♦లవిశాలసాలంబు, లుత్కటలీలతో ♦ నొరసి యొరసి
సంపుల్లకమలకా♦సారనీరంబుల, లాలితక్రీడలన్ ♦ దేలి తేలి
వల్లీమతల్లికా ♦ స్వచ్ఛగుచ్ఛములొయ్య, నొయ్యన రజముల ♦ నూఁచి యూఁచి
విపణీవిన్యస్తార ♦ విందకుంబాదికా, మ్లానమాల్యంబులు ♦ మట్టి మట్టి
గీ. పరిణయకలహపరాఙ్ముఖ♦పరిమదహృదయ, కూలములు పెల్లగిల్లంగఁ♦ గ్రుమ్మిగ్రుమ్మి
మలయు నప్పురవీథుల ♦ మందమంద, గతుల మలయాచలానిల ♦ గంధగజము.

ద్రౌపదీపరిణయము.

చ. పురనికటాంచితోపవన ♦ పుష్పితసాలములం గదల్చుచున్
సరసులఁ దేలుచున్ సుమర♦జఃపటలంబులఁ జల్లులాడుచున్
సురచిరకుంజపుంజములఁ ♦ జొచ్చి నటించుచు మందగాములై
కరులవలెం జరించుఁ జలి♦గాడ్పులు పట్టపశృంఖలల్ దగన్. 490

కవిజనరంజనము, ఆ 1 పద్య 16.

సీ. తొలుతదక్షిణదిగ్వ♦ధూటికిజనియించి, రహిలతాసతుల గా♦రాము వడసి
కుసుమరసంపుటు♦గ్గులు ద్రాగి వర్ధిల్లి, తలిరాకుపాన్పుల ♦ నెలమి నుండి
తేఁటిబోటులజోల♦పాటలచేఁ జొక్కి, లీలఁ బూఁదీవయు♦య్యాల లూఁగి
మురిపెంపునడకల ♦ ముద్దులుమాపించి, యెల్లతావ్రల విల♦సిల్లి మెలఁగి
గీ. సరణిఁదనుఁగాఁగిలించుభూజ♦నులఁబొదలి, కొలఁకులనుఁదోఁగి క్రొవ్వార♦కోనలరసి

మల్లులఁ జెనంగి విరహుల♦మదమడంచి, మరునిజోడయి పవనకు♦మారుఁ డెసఁగె.
జాహ్నవీమాహాత్మ్యము, ఆ 2 పద్య 110.

గీ. చిలుకతేజీలపౌఁజులఁ ♦ జిగురుతిండి, పులుఁగుటేనుంగులను తేఁటి ♦ బోటుబంట్ల
బలము గాఁజేసిమరునకు♦నలువయిడిన, తేరులనఁబొల్చెమలయాద్రి♦మారుతములు.
రామవిలాసము, ఆ 1.

ద్విపద. కలయంపిచల్లిన ♦ గందంపునీటి, చలువనెత్తావు లె♦చ్చట హెచ్చియుండి
మలయజామోదంబు ♦ మచ్చికఁ దాల్చి, అలరునెత్తావుల ♦ నంగీకరించి
చల్లఁగాఁ గొలఁకులఁ ♦ జాడలువట్టి, మెల్లమెల్లనవచ్చి ♦ మీనలోచనల
యుల్లంబు జల్లన ♦ నొరయుచుఁబైఁట, లల్లనఁదొలఁగించి ♦ యలకలల్లార్చి
రొమ్ములతావులమట్టి ♦ యింపుఁ బుట్టించి, పల్లవులీలనా ♦ పట్టనంబందు
సల్లలితోత్సాహ ♦ సంపద మెరసి, మల్లడిఁగొనుచుండు ♦ మలయమారుతము.
పరిభులింగలీల, పిడు. బ. ఆ 1 గతి 3.

చ. అలసగతుల్ సుఖైకరతు ♦ లంగభవోద్ధరణపరిచారముల్
మలయజసౌరభంబులు సు♦మదరివగంధము దక్షిణాగతుల్
దొడరెడు పద్మినీపరిచి♦తుల్వితథభ్రమణంబు లొప్పఁగా
మలయసమీరణుండు పటు♦మాడ్కిఁ బురి న్విహరించు నిచ్చలున్. 494
భరతాభ్యుదయము, ఆ 1 పద్య 55.

# రాజవర్ణనము.

౬౦

సీ. తేజంబుగలఁడు సా♦ధించుశత్రులనాజ్ఞ, వెండినిండకుఁ జాల ♦ వెఱచుఁ గాని
యరి నొవ్వఁగొనఁడు త♦త్పరయు ధర్మరతుండు, భృత్యులంజెఱపఁడు♦సత్యవాది
కలకయుబ్బుటభీతి ♦ కలుషమేమఱుట మొ, క్కలము వెఱఁగుపాటు♦చలము లేదు
కామినీలోలుండు ♦ గాఁడు సేవకుచేఁత, మఱవఁడిచ్చినయీఁగి♦మగుడఁగొనఁడు
ఆ. క్రౌర్యలోభజాడ్య ♦ కపటవ్యసనముల, పొంతఁ బోవఁ డాయ♦మునువ్యయంబు
తెలుఁగు నాఁడునాఁటి ♦ కింద్రియవశ్యుండు, గాక సుజనవినుతి♦కలితుఁడయ్యె.
కేయూరబాహుచరిత్రము, ఆ 4 పద్య 200.

సీ. తపనీయదండైక ♦ ధవళాతపత్త్రితో, ద్దండ తేజఃకీర్తి ♦ మండలుండు
నిర్మలనిజకథా ♦ నిమిషకల్లోలినీ, క్షాళితాఖిలజగ♦త్కల్మషుండు
వితతనవద్వయ ♦ ద్వీపనానాజయ, శ్రీవధూటీసమా♦శ్లిష్టభుజుఁడు
నిఖిలవిద్యానటీ ♦ నృత్యరంగస్థలా, యతనాయమానజి♦హ్వాంచలుండు

గీ. పరిస్ఫురింపంగఁదగు సము♦ద్భటకఠోర, చటులసుగుణటంకృతియాఘన♦స్తనితఘోష
చాప నీరదభవశరా♦సారశమిత, జలవదహిత తేజోదవా♦నలుఁడు నలుఁడు. 496

శృంగారనైషధము, ఆ 1 పద్య 46.

సీ. శివునికైవడిమహా ♦ సేనానియాత్ముండు, బలభేదిపగిది స♦ద్వ్యయుఁ
డరవిందహితులీల ♦ నధిగతాభ్యుదయుండు, బుధునిక్రియనజహ♦త్సుమార్గుండు
గంగాప్రవాహంబు♦కరణిఁ బావనమూర్తి, భుజగాధిపునిభంగి ♦ భోగశాలి
యేనుంగుచందాన ♦ దానధారాశోభి, శౌరిలాగున శంఖ ♦ చక్రపాణి

గీ. కర్తయాశ్చర్యములకు నా♦కరము నీతి, కఖిలవిద్యాగమములకు ♦ నాస్పదంబు
బగఱకుత్పాతహేతువు ♦బంధుకోటి, కమరలోకద్రుమంబు హే♦మాంగదుండు.

గీ. ఆనృపాలుండు నీతివి♦ద్యానిరూఢిఁ, జారదృష్టియౌఁగాని వి♦చారదృష్టి
సమధికైశ్వర్యవైభవో♦జ్జ్వలతనాతఁ, డష్టమూర్తియౌఁగాని య♦నష్టమూర్తి. 498

శివరాత్రిమాహాత్మ్యము, ఆ 2 పద్య 13, 14.

సీ. తలపోయ బ్రహ్మవి♦ద్యానిష్ఠజనముల, కనయంబుఁ గింకరుం ♦ డైనవాఁడు
నఖిలశరీరగుఁ ♦ డాప్తసుహృజ్జన, తానందకరుఁడన ♦ నలరువాఁడు
సంసారఘనకర్మ ♦ సంగహీనులయందు, సంగసంప్రీతుఁడై ♦ జరగువాఁడు
దుర్మార్గ మనుజసం♦దోహంబునకు నుగ్ర, దండధరుండనఁ ♦ దనరువాఁడు

గీ. బ్రకృతిపురుష కావేశుఁడై♦పరగువాఁడు,భగవదవతారయుక్తుఁడై♦ నెగడువాఁడు
నగుచు వర్తించుసమ్మోద ♦ మతిశయిల్లఁ, జారుతరమూర్తి యీరాజ♦ చక్రవర్తి.

భాగవతము, స్కం 4 పద్య 458.

సీ. విశ్వసన్నుత శాశ్వ♦తైశ్వర్యపర్యాయ, కుటిలకుండలిరాజ ♦ కుండలుండు
దిగిభశుండాకాండ ♦ దీర్ఘబాహాదండ, మానితాఖిలమహీ ♦ మండలుండు
జనసన్నుతానన్య ♦ సామ్రాజ్యవైభవ, శ్లాఘాకలితపాక ♦ శాసనుండు
కులశిలోచ్చయసాను♦కోణస్థలన్యస్త, శస్త్రవిక్రమజయ ♦ శాసనుండు

గీ. భాసమానమనీషాంబు♦జాసనుండు, సకలదేశావనీపాల ♦ మకుట నూత్న
రత్నరాగరజ్యదంఘ్రినీ♦రజయుగుండు, శంబరారాతినిభుఁడు దు♦ష్యంతవిభుఁడు.

శకుంతలాపరిణయము, పీ. వీ. ఆ 1.

సీ. చర్చింప రెండవ♦చంద్రుండు మూఁడవ, యశ్విని నాలవ ♦ యగ్నిదేవుఁ
డైదవలోకపా♦లాఖ్యుఁ డాఱవపాండు, సంతాన మేడవ ♦ చక్రవర్తి
యెనిమిదవమహర్షి ♦ జనసత్తముఁడు తొమ్మి, దవ భోగిపతి పది♦యవవిరించి
పదునొకండవ చక్రి♦పాణి పండ్రెండవ, శూలి పదుమూఁడవ ♦సూర్యుఁ డనఁగఁ
ఆ. దనరుఁ గాంతిరూప♦మునఁ బ్రతాపమున స, త్యమున ధర్మచరిత ♦ నాజ్ఞ శుచిని
భూరిసత్త్వమునఁ బ్రి♦బుద్ధతఁగలిమిని, భూతిఁ దేజమునను ♦ భోజవిభుఁడు. 501

భోజరాజీయము, ఆ 7 పద్య 244.

సీ. ద్విద్వయోపాయాబ్ధి ♦ విద్వద్వతంసంబు, షాడ్గుణ్యచాతురీ ♦ చక్రవర్తి
క్రీడాచలీకృత ♦ శ్రీఖండగిరిరాజు, కనకాద్రిముద్రిక ♦ గ్రంథకర్త
యందూనిబద్ధాబ్ధి ♦ బృందవేదండాళి, వననిధిప్రాంతసా♦ధునికరఘువు
తామ్రపర్ణ్యమలపా♦థఃకేళిహంసంబు, లంకేశమైత్రీప్రి♦యంకరుండు
గీ. స్వస్తికృద్వ్యాసవసిష్ఠాత్య ♦ గస్త్యమఘువ, మకుటఘటనకళతకోటి ♦ మంత్రిభృత్య
భూతభూతాత్తభాంధవీ♦భూమికుండు, దత్పురంబేలుఁబాండ్యమ♦త్స్యధ్వజుండు.

సీ. పాటీరగిరివన♦వాటిఁ గ్రీడించియు, నహిభయం బెఱుఁగ దా♦వంతయైన
నత్యంతమితభాష ♦ నపికత్థనుండయ్యుఁ, బరులఁగేగడమున ♦ భంగపఱుచుఁ
జీర్తిఁ దాఁ దామ్రిపర్ణిఁ నాథుఁడయ్యును, సద్గోష్ఠిఁ జే నసం♦జనత మెలఁగు
మహనీయమహిమఁదా ♦ మధురాస్పదుండయ్యు, లావణ్యకలన నుల్లాస మొందు
గీ. విషధిలహరీభిదోత్సర ♦ త్స్పృషతజటిల, వలదురుక్రిమతిమినర♦వాలపతన
తులితపరబలకరికర♦ధ్సనలసమర్థ, బహుళముక్తావిముక్తాసి♦పాతుఁడతఁడు. 503

ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 30, 32.

మ. సుకృతుల్ దుష్టియు మంత్రిపాలవిజయా♦శోకుల్ జయంతార్థసా
ధక సిద్ధార్థసుమంత్రులాత్మసచివా♦ధ్యక్షుల్ నిజాంగంబుఁ బా
యక కొల్వందగి యష్టమూర్తియుతుఁడో ♦ నాశంభుఁడోనాఁగ న
వ్యకళాధుర్యుఁడు మించుఁ బంక్తిరథుఁడై♦శ్వర్యంబ వార్యంబుగన్. 504

రామాభ్యుదయము, ఆ 1 పద్య 155.

సీ. వక్రిభావమధిజ్య ♦ వరధన్వమునఁగాని, తననెమ్మనమ్మునఁ ♦ దగుల నీక
నిశితస్వభావంబు ♦ నిజఖడ్గమునఁగాని, తనవర్తనంబునఁ ♦ దగుల నీక
విశదభావముకీర్తి ♦ విలసనంబునఁగాని, తనమంతనంబునఁ ♦ దగుల నీక
దీర్ఘభావము శత్రు♦దీనత్వమునఁగాని, తనదుకోపంబునఁ ♦ దగుల నీక
గీ. యంబుధులు శేళకుళులు, కు♦లాచలములు, మేప, లచక్రిగిరి చుట్టు♦గోడ గాఁగ

నవనిఁ బాలించె శుద్ధాంత ♦ భవనమట్లు, కీర్తిలక్ష్మికళత్రుఁడు ♦ క్షితివరుండు. 505

కవికర్ణరసాయనము, ఆ 2 పద్య 57.

సీ. తనకీర్తిసంతాన♦మునకుఁ దారానాథ, నక్షత్రములు ప్రసూ♦నములుగాఁగ
తనప్రతాపధనంజ♦యునకు నీరజబంధు, కరములు విస్ఫులిం♦గములుగాఁగ
తనవినిర్మలబోధ ♦ ఘనసుధానదికిఁ, సజ్జనుల్ రాజహం♦సములుగాఁగ
తనబాహుజయరమా ♦ వనితకు బ్రహ్మాండ, భాండముల్ కాంచనా♦బ్జములుగాఁగ
గీ. వెలయు వలయాద్రిమధ్య మో♦క్షోణిభూమి, దానవేళాని తాంతహ♦స్తతలవిగళ
దంబు ముదితాబ్ధినిస్వన ♦ వ్యాజమహిత, వితతనుతిసాళి యల రఘు♦క్షితిపమౌళి.

ఇందుమతీపరిణయము, కుమారధూ. ఆ 1 పద్య 159.

ఉ. సారవిభూతి రెండవ వృ♦షధ్వజుఁ డాకృతిచేఁ దృతీయబ్రుం
దారకవైద్యుఁ డిద్ధశుచి♦తాగుణమందుఁ జతుర్థపావకుం
డారయ భూమిమోచుటకు ♦ నైదవదిక్పతి దానరేఖచే
నాఱవకల్పవృక్షమన ♦ నన్నరపాలుఁడు మించెఁ గీర్తులన్. 507

తపతీసంవరణోపాఖ్యానము, ఆ 1 పద్య 70.

సీ. గాంభీర్యభవకీర్తి ♦ కలశపాథోరాశి, వాచాలతాకీర్తి ♦ వాగ్వధూటి
భూమీభరణకీర్తి ♦ భోగిలోకస్వామి, సాహసార్జితకీర్తి ♦ శంకరుండు
సంగీతజనికీర్తి ♦ జలజాతభవసూతి, దాతృత్వకీర్తి సం♦తానశాఖి
ధైర్యధారాకీర్తి ♦ తారాచలేంద్రంబు, వదనప్రభాకీర్తి ♦ వనజవైరి
గీ. గాఁగ విహరించు నిఖిలభూ♦కాంతమౌళి, పటుహాభాంకారకారణ ♦ ప్రళయకాల
భైరవారావశంకాని ♦ బద్ధబాహు, విద్విషద్వీరుఁ డెల్లప్ప♦క్ష్మావరుండు. 508

కకుత్స్థవిజయము, పీఠికపద్య 94.

సీ. తనభవ్యధామంబు ♦ తనభవ్యధామంబు, కరణిమిత్రోన్మేష ♦ కరముగాఁగఁ
దనధర్మగుణములు ♦ దనధర్మగుణముల, ట్లకలంకశ్రుతిమార్గ ♦ గతుల నెసఁగఁ
దనమహోహవదీక్ష ♦ దనమహోహవదీక్ష, యగణితాశావనీ ♦ పకులఁ బెంపఁ
దనయంబకంబులు ♦ దనయంబకములట్లు, పక్షీంద్రవిముఖులఁ ♦ బరిఢవిల్లఁ
గీ. బరఁగుఁగరినాదిరిజపలుర♦క్షాదికమున, కూడకటె గూఢచరణది♦కోటికరటి
కుటిలతానహాభూశైళ్య♦ పటనభార్య, భుజబలవిహారి యార్వేటి ♦ బుక్కశౌరి.
సీ. ఏరాజు భూరితే♦జోమయాలోకంబు, లోకంబుతెమము ని♦రాకరించు
నేధన్యుబాహోధ♦రాధరాభోగంబు, భోగంబుసవరించు ♦ భూమిసతికి
నేపుణ్యునధిరూప ♦ దీపానుభావము, భావంబుఁ గరఁగించు ♦ భామినులకు

నేభవ్యశుభకీర్తి ♦ శోభావిహారంబు, హారంబు దశదిశా ♦ యావతమున
గీ. కతఁడు మతిమంతుఁ డతిశాంతుఁ ♦ డరికృతాంతుఁ, డనుపమస్వాంతుఁడాశ్రిత♦ వనవసంతు
డనఘుతరకందశోలి ♦ మహాపురీని, శాంతుఁడగు రామమేదినీ ♦ కాంతుఁడలరు.
వసుచరిత్రము, ఆ 1 పద్య 28, 30.

సీ. వైరిప్రతాపంబు ♦ వడిఁగట్టినట్టిచం, దాన నెవ్వానిశో♦ణధ్వజంబు
కమలసాయకుసోయ♦గము మూర్తిగైకొన్న, కరణి నెవ్వాని యా♦కారమహిమ
భుజభుజంగమనాథ ♦ భోగనారాయణ, చ్ఛాయ నెవ్వానికా♦ శ్రేయకంబు
అకలంకనళినగే♦హకు ద్వితీయగృహంబు, కైవడి నెవ్వాని ♦ కన్నుఁదోయి
గీ. బరఁగునాతండు నిఖిలభూ♦పాలజాల, నిరుపమాద్భుతరసహేతు ♦ నిజనిటాల
వర్ణితానూనసౌభాగ్య ♦ వర్ణశాలి, రమ్యగుణపాళి ఖండోజి ♦ రాజమౌళి. 511
ఘటికాచలమాహాత్మ్యము, పీఠిక పద్య 10.

సీ. ప్రౌఢిసదాదేశ ♦ పదవిభక్తులెఱింగి, సంధివిగ్రహముల ♦ సరణిఁ దెలిసి
వివిధాగమాంగముల్ ♦ వేడ్కఁ బరీక్షించి, పరరూపవినిపాత ♦ భంగు లరసి
యనురక్తిగుణవృద్ధు ♦ లలరంగఁబోషించి, ప్రకృతిప్రత్యయలీల ♦ బయలుపఱచి
ఘనసూత్రవృత్తులు ♦ గణకసంజ్ఞలు నేర్చి, యవ్యయభవ్యవా♦క్యములు పలికి [మ
గీ. ప్రకృతభావంబుపూర్వమా♦పమునుగాంచి, యుర్వియేలుచునుండున♦భ్యుదయమహి
మానవేంద్రులలోన న♦హీనరాజ, శబ్దవిస్ఫూర్తి నాహరి♦శ్చంద్రనృపతి. 512
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 1 పద్య 38.

సీ. ఏకముఖంబుగా ♦ నిలనాజ్ఞనిలుపుచుఁ, బ్రజలందునుభయక♦ర్మముల నరసి
శక్తిత్రయంబునఁ ♦ జాలఁ బ్రసిద్ధుఁడై, చతురుపాయంబులఁ ♦ జతురుఁ డగుచుఁ
బంచాంగయుతనయ ♦ ప్రాగల్భ్యమునమించి, షడ్గుణక్రమవిశే♦షములఁ దెలిసి
సప్తాంగరక్షావి♦చక్షణత్వముగల్గి, యష్టభోగసమృద్ధి ♦ నతిశయిల్లి
గీ. నవవిధంబైన హరిభక్తి ♦ నలవు మెఱసి, దశదిశలఁగీర్తి విస్ఫూర్తి ♦ దళముకొలిపి
యవనిచక్రంబుఁబాలించు ♦ నట్టినృపతి, కలిమి జనులకు నధికభా♦గ్యంబుగాదె.
పరమయోగివిలాసము, ఆ 3 పద్య 34.

సీ. కురియించునొకవేళ ♦ శరదమై యసవృష్టి, ధరణికనావృష్టిఁ ♦ బరిహరింపఁ
గాయు నెండలు భాను♦కరణి విల్వరివేళ, నీదుచేఁ బ్రజనొప్పి ♦ నెనయనీక
విసరుఁజల్లనిగాడ్పు ♦ లసమానపవమాన, శాబమై మందువే♦సవులయందు
పండింపుసస్యసం♦పదలోషధీశుఁడై, తృణలతాసంపదా ♦ మృతమునించి

గీ. చేరనీయఁడు రుజలందుఁ♦జెనకనీడు, మృత్యువును భూమిజనులఘా♦త్మికుఁడతండు
యోగిబలమునదివిజుల♦యాగడములు, సాఁగఁగానీయఁడొక్కొక్క♦సమయములను.
శ్రీరంగమాహాత్మ్యము, క. వ. ఆ 7.

చ. ద్రుపదుఁడురాజు తత్పురికిఁ♦దుండిలధృత్యధరీకృతామర
ద్రుపదుఁడు సమగ్రదుర్మద వి♦రోధిశిరోధిమణీఘృణీస్ఫుర
ద్విపదుఁడు చక్రవాళపరి♦వేష్టితభూభవనార్థిసైంధవ 515
ద్విపదుఁడు శాశ్వతాత్మశమ♦భిద్విపదుండు నృపాలమాత్రుఁడే.
పాంచాలీపరిణయము, ఆ 1.

గీ. అబ్జదానత, శుద్ధప♦క్షప్తి, విమల, మానసస్థితి, నడవడి♦మహితకీర్తి
పరిచయంబున నాత్మభూ♦భరణశక్తి, రాజహంసప్రభావంబు♦రమణఁగాంచు. 516
రాజవాహనవిజయము, ఆ 1 పద్య 66.

సీ. కువలయంబునకార్తిఁ♦గూర్పనియినుఁడు చ, క్రావళినొంచక♦యలరురాజు
గోత్రవైరముఁగూర్చు♦కొనని యింద్రుఁడు పుణ్య, జనులఁగాఁచింపని♦చక్రవర్తి
పక్షపాతములేక♦పఱఁగుచుండువిరాట్టు, పాడిదప్పని ప్రజా♦పరివృఢుండు
కుజనులపొందు చే♦కొననిధరాధిపుఁ, డుగ్రుఁడై ప్రజద్రింప♦కుండునీశుఁ
గీ. డౌరయితఁడనిబుధజను♦లభినుతింప, వఱలెఁ దేజఃకళావైభ♦వప్రభావ
జవవచస్స్ఫూర్తి ధృతిమహై♦శ్వర్యములను, విపులగుణపాళియమ్మహా♦నృపతిమౌళి.
రసికజనమనోభిరామము, ఆ 1 పద్య 56.

సీ. కువలయావనకళా♦కుశలుఁ డింతియకాని, వివరింపఁ జక్రవి♦ద్వేషిగాఁడు
సతతసన్మార్గసం♦చారి యింతియకాని, రూపింపదోషాక♦రుండుగాఁడు
బుధజనప్రియకరా♦భ్యుదయుఁ డింతియకాని, శోధింప గురువిప♦క్షుండుగాఁడు
వర్ణితపరిశుద్ధ♦వర్ణుఁడింతియకాని, గణుతింపమలినల♦క్షణుఁడుగాఁడు
గీ. భళిరయీతఁడురాజుగా♦కిలనొకండు, రాజగుటకెట్లుదగునని♦రహినినుకవి
రాజులును రాజులును బుధ♦రాజులెన్న, రాజిలెడుశివినాధర్మ♦రాజుదనరు. 518
సుభద్రాపరిణయము, ఆ 1 పద్య 46.

సీ. కర్ణునిత్యాగంబు♦గవ్వడిశౌర్యంబు, భీమునిబలిమి శ్రీ♦రాముకరుణ
చంద్రునిప్రభ హరి♦శ్చంద్రునిసత్యంబు, మేరువుధైర్యంబు♦శౌరిలీల
హరునిసర్వజ్ఞత♦మరునిసౌందర్యంబు, వనధిగాంభీర్యంబు♦వజ్రిఠీవి
భరతునిన్యాయంబు♦బలిమహోదారత, తరణితేజము ఫణి♦వరునిమేధ
గీ. తనకె కలుగంగ సకలవి♦ద్వన్నితాన, సంతతోద్గీయమానని♦స్తంద్రకీర్తి

యగుచు నగణితలీలల♦నలరె వంశ, పావనుండైన మాధవ♦దేవనృపుఁడు. 519

సోమదేవరాజీయము.

సీ. సకలభూతహితప్ర♦చారుఁడయ్యునికృత్త, మత్తారిరాజన్య♦మండలుండు
జనముఖస్తుతులీయ♦కొననివాఁడయ్యున, పారనిజాంకప్ర♦బంధనేత
యవిదితభావచే♦ష్టాన్వితుండయ్యును, విదితపరాకూత♦విక్రియుండు
తతగుణస్థితినను♦ద్ధతుఁడయ్యుఁ గ్రిజగదు, ద్ధతవిహారమహాప్ర♦తాపసూర్యుఁ
ఆ. డఖిలభువనభవన♦హారికీర్తిస్వచ్ఛ, నీతరంగఫేన♦భూతతారుఁ
డతఁడు రాజమాత్రుఁ♦డగునె ధీరోదాత్త, నాయకుండు బలిమి♦నాయకుండు.

మిత్రవిందాపరిణయము, కుం. వెం. ఆ 1 పద్య 32.

సీ. తనకీర్తిచంద్రికా♦తతినిండి కృష్ణప, క్షంబులు శుక్లప♦క్షములు సేయఁ
దనదురాజత్వమిం♦పున సార్వకాలంబు, నందును కువలయా♦నంద మొసఁగఁ
దనకరంబులు జడ♦త్వమూనను ధనకరశ్రీ, జానురాగంబులు♦నై వెలుంగఁ
దనవర్తనంబు మి♦త్రసమాగమంబున, సంపూర్ణకళలచేఁ♦బెంపు వడయఁ
గీ. దనవిలాసంబఖండసౌం♦దర్యమహిమ, నిష్కళంకస్వభావమై♦నివ్వటిలఁగ
జంద్రునకుఁ జంద్రుఁడనఁదగు♦సద్గుణముల, చేతననిరుద్ధుఁడు జగత్ప్ర♦సిద్ధుఁడయ్యె.

అనిరుద్ధచరిత్రము, ఆ 5 పద్య 105.

సీ. పటుభుజాస్తంభాగ్ర♦ఘటితవిశ్వంభరా, భరలాఘవితమహా♦ఫణిఫణుండు
నవకీర్తినర్తకీ♦నాట్యరంగావనీ, కృతచక్రవాళ ధా♦త్రీధరుండు
సంతతౌదార్య సి♦ద్ధాంతార్థపూర్వప, క్షీభవత్కల్పక♦ప్రాభవుండు
బిరుదాంకరచితగం♦భీరగీతప్రసం, గాశాపసంజీవ♦నాంతకుండు
గీ. నిశితనిరుపమనిజకర♦నీరజాత, నిహితనిస్త్రింశనిర్భిన్న♦నిష్ఠురారి
పలలసైవేద్యతృప్తకుం♦భత్ప్రతాప, ఘోరతరభైరవుండు పు♦రూరవుండు. 522

కవిరాజమనోరంజనము, ఆ 1.

సీ. పుణ్యజనప్రియ♦మునమించు నేరాజు, ప్రబలునేరాజవి♦పక్షగుప్తి
నైకసహస్రాక్ష్య♦వాప్తకుండేరాజు, సకలాశలేరాజు♦చక్కఁ బ్రోచు
బహువజ్రభూషల♦భాసిల్లునేరాజు, దనరు నేరాజు స♦త్కవిహితాత్ముఁ
బరదేవహరణచా♦తురినొప్పు నేరాజు, బలయుక్తి నేరాజు♦పరిఢవిల్లుఁ
గీ. జెలఁగు నేరాజు నిచ్చయు♦శృంఖలైక, లక్ష్మిలొప్పారఁ దనుఘను♦ల్భక్తిఁ గొలువ
నహహ యారాజు దనరు ది♦వ్యప్రభుత్వ, మానితగుణాంశపరిజితా♦మర్త్యరాజు.

చంద్రికాపరిణయము, ఆ 1 పద్య 116.

సీ. శతు్ౖరనుంచఁడుగదా ♦ క్షమలోన క్షమలోన, విడువనొల్లఁడుగదా ♦ వేలకైనఁ
బలికిబొంకఁడుగదా ♦ కలనైనఁ గలనైన, వెన్నుఁజూపఁడుగదా ♦ యెన్నఁడైన
మాయఁజేయఁడుగదా ♦ మదినైన మదినైనఁ, గోపముంచఁడుగదా ♦ కుమతులరసి
కొలుఁదప్పడుగదా ♦ కరమెత్తి కరమెత్తి, యీఁగిమానఁడుగదా ♦ యెట్టియెడల
గీ. నీ ధరాపాలుఁడని లోకు♦లెన్నుచుండ, బాల్యముననుండి కీర్తిచేఁ ♦ బ్రబలె నౌర
ఖ్యాతచరితుండురంగభూ♦కాంతసుతుఁడు, భావజనిభుండునీలాద్రి♦భూవిభుండు.
వాసవదత్తాపరిణయము, పక్క. వీ. ఆ 1 పద్య 86.

సీ. తనపృథుకీర్తి ము♦క్తాచ్ఛత్రిమునకు స్వ, ర్ణధరంబు కనకదం♦డంబుగాఁగఁ
దనప్రతాపసమగ్ర ♦ దావాగ్నిశిఖకు వ్యో, మంబు తదగ్రధూ♦మంబుగాఁగఁ
దననిరర్గళదాన ♦ ధారాంబులహరికిఁ గైలాసశిఖరి నై♦కతముగాఁగఁ
దనకటాక్షస్యంది ♦ ఘనకృపారసవృష్టి, కఖిలార్థికోటి స♦స్యంబుగాఁగ
గీ. మహిని జెలువొందె మత్తారి ♦ మండలేశ, మకుటమణిగణశరణాయ ♦ మానచరణ
నఖరపాళి నిజాశ్రిత ♦ నళినహేళి, చారుకీర్తి హరిశ్చంద్ర ♦ చక్రవర్తి. 525
కవిజనరంజనము, ఆ 1 పద్య 28.

సీ. బలశాతపరిపంథి ♦ బలశాసనుండన, స్ఫురణభీషణహేతి ♦ ధరుఁ డనంగఁ
ధర్మనిర్మాణార్థ ♦ దండధారియనంగఁ, బుణ్యజనాన్వయ ♦ పోషకుఁడన
బహువాహినీశ్వర ♦ పరిపాలకుండన, ఘనజగత్ప్రాణ వి♦ఖ్యాతి యనఁగ
రాజరాజాహ్వయా♦ర్థ సమన్వితుండనఁ, జారుసర్వజ్ఞతా ♦ శాలి యనఁగ
గీ. బ్రస్తుతికినెక్కె సకలది♦క్పాలకాంశ, జనిత శుభమూర్తి శేషాహి♦సదృశబాహు
దండ పరిరంభసంభృత ♦ ధరణీయువతి, సమ్మదస్ఫూర్తి దశరథ ♦ చక్రవర్తి.
రామవిలాసము, ఆ 1.

సీ. తనయాజిభావంబు ♦ గనుపించె సకలస, న్నుతసత్కళా ప్రవీ♦ణత వహించి
తనగభీరతనూపెఁ ♦ దటినీమనోహర, ప్రఖ్యాత సఖ్యసం♦పదలఁ జెలఁగి
తనప్రభావముఁజెల్పెఁ ♦ దపననందనగర్వ, నిర్గంధనక్రియా ♦ నిరతిఁ దనరి
తనతేజమెతిఁగించె ♦ ననిమిషేశ్వరవజ్ర, దుస్సాధ్యదైత్యపం♦క్తుల వధించి
గీ. రాజమాతుఁడె యష్టది♦గ్రాజవినుత, రాజితయశఃప్రతాపని♦ర్గళితరాజ
హేళి రిపురాజభయదాజి♦కేళి రాజ, రాజధనశాలి దశరథ ♦ రాజమౌళి. 527
ఉత్తరరామాయణము, ఆ 1 పద్య 76.

సీ. తనకలాపస్ఫూర్తి ♦ తనకలాపస్ఫూర్తి, కరణి దివ్యాంబకా♦కరముగాఁగఁ
జనసత్త్రిసంఘంబు ♦ దనసత్త్రిసంఘము, ట్లఖిలద్విజావృతం♦బై చెలంగఁ

దనదానవిభవంబు ♦ దనదానవిభవంబు, గతి సరసాళి స♦న్నుతిపహింపఁ
దనపురాకారంబు ♦ దనపురాకారంబు, పగిది బలోత్కృష్ట ♦ పటిమఁబూనఁ
గీ. దనదు దోర్దండమండితో♦ద్దండమండ, లాగ్రిఖండిత చండాహి♦తావనీశ
దళితమార్తాండమండలాం♦తరుఁ డమోఘు, సాయకుండాదిలీపభూ♦నాయకుండు.
దిలీపచరిత్రము, ఆ 1 పద్య 85.

సీ. కారుణ్యసుపరిభా♦కలిత విద్యావాప్తిఁ, గమలాక్షు గమలాప్త ♦ కమలభవుల
వరభోగసౌందర్య ♦ వాగ్విశేషంబుల, జిష్ణుజిష్ణుకుమార ♦ జిష్ణుగురుల
భూతిపరితాపసం♦పూర్ణవైభవముల, భర్గ భర్గాత్మజ ♦ భర్గసఖుల
ఘనబుద్ధిసత్కళా ♦ గాంభీర్యగుణములఁ, జంపరినందన చంద్రి ♦ చంద్రగురుల
గీ. సహసించునటంచు దిగంతరముల, సకలజనములు వినుతింప ♦ సమ్మదమున
రాష్ట్రిమేలుమనుండై సు♦సంక్షితముగఁ, జిత్రపర్వుండు పార్థిప♦ శ్రేష్ఠుఁడగుచు.
బ్రిహ్మోత్తరఖండము, ఆ 3.

సీ. మొలపట్టుకాసెలో♦పల పసిండిమొలాము, చికిలిగూర్చినబాకు♦ చెన్నుమెఱయఁ
దళతళలాడు కుం♦దనపుపోషక్కుహో, యల్మేనిచాయతో ♦ నంటి మెఱయఁ
బలుహారంగలర చెం♦గులు జాఱవిడిచి క, ట్టిన బురుసారుమా♦ల్తేవ మెఱయ
భానుకోటిపరిభా♦భాస దివ్యకిరీట, ముత్తమాంగంబున ♦ హత్తి మెఱయ
గీ. నింపు చిఱునవ్వు నూఁగు మీ♦సంపురేక, కౌముదీలక్షణంబుల♦కరణి వదన
రాజమండలమునఁగూడి ♦ రాజిలంగ, రాజమండలమునఁగూడి ♦ రాజవిభుఁడు.
శకుంతలాపరిణయము, ఘ. వేం. ఆ 1.

సీ. తనమహోవనత పరి♦త్యక్తమౌనట్లు నూ, తనమహోవనములు ♦ దనరఁ జేసి
తనరసాశయత ప్ర♦త్యక్షమౌనట్లు నూ, తనరసాశయములుఁ ♦ దనరఁ జేసి
తనసదావృత్తి పరి♦త్యక్తమౌనట్లు నూ, తనసదావృత్తులు ♦ దనరఁ జేసి
తనయశంబవనిఁ బరి♦త్యక్తమౌనట్లాత్మ, తనయశంబమితమై ♦ దనరఁజేసి
గీ. తనపరిజానురాగోన్నతి ♦ గనుపడంగఁ, దనపరిజానురాగోన్నతిఁ ♦ దనరఁ జేసి
తనకుసములధిపులులేని ♦ ఘనత గలిగి, తనరిన కుమారవిభు నెన్నఁ♦దర మెతరుణి.
రాధాకృష్ణసంవాదము, ఆ 4 పద్య 92.

సీ. పరిజలఁగన్నను గన్న♦ప్రజలకన్నను మిన్న, గాఁగావఁగాఁజూచు♦కారుణికుఁడు
వసుమతి నేర్పుమై ♦ వసుమతియగునట్లు, పరిపాలన మొనర్చు ♦ పార్థివుండు
బంధులఁ బేరిమాను ♦ బంధులఁగావించి, మన్ననఁ బచరించు ♦ మానఘనుఁడు
భటసమూహము సము♦ద్భటసముత్సాహమై, తనరఁ బోషించు పరి♦తాపశాలి

గీ. కలఁడె యీదృశసాద్గుణ్య ♦ గణ్యుఁడైన, నృపశిఖామణియంచు ప♦ల్కఁగ నెసఁగె
రావువేంకటనీలాద్రి♦రాయవిభుని, సూర్యరాయేంద్రుఁడలరె ని♦స్తులనిరూఢి.
రామరాయవిలాసము, ఆ 1 పద్య 83.

సీ. మన్యుశీలునిఁగాని ♦ మదిసమ్మహీపతి, యలుగనుపేక్షింపఁ ♦ దలఁపఁ డెపుడు
దానపాత్రునిపైన ♦ కాని తత్కోశప్రప, పాదపృష్టాలు చక్కి ♦ సాగ వెప్పుడు
పటులక్షదేశసం♦ప్రాప్తిగల్గియెకాని, శరము యాచకతతి ♦ మరల దెప్పుడు
ప్రత్యర్థిభామిను♦ల్బహుశోకమోదాశ్రు, లురులుకన్నులఁగాని ♦ యుండ రెప్పుడు
గీ. కలుగుఁగలుగ దనీతియా♦ఘునిప్రతతిమిఁ, దలఁపులోఁబరసత్వాప్తి♦నిలుపునిలుపఁ
డాత్మగోపాయనంబన్య♦నడుగుసడుగఁ, డతనువిభవుండు శంతను♦క్షితిధవుండు.
శంతనూపాఖ్యానము, ఆ 1 వద్య 33.

సీ. తనదుమన్మథవసం♦తసమానసౌందర్య, మతులితవాసంత♦ఋతువుఁ జేయఁ
దన శౌర్యతపనని♦స్తంద్రతైక్ష్ణ్యంబు, సతతంబునుంగ్రీష్మ♦ఋతువుఁ జేయఁ
దన దానవారిన♦దనదీప్రవాహముల్, వితతవార్షిక♦ఋతువుఁ జేయఁ
దనయశఃపరిశుభ్ర♦ఘనఘనపటలంబు, సతతంబునున్ శర♦దృతువుఁ జేయఁ
గీ. దనదుపరిపంథికర్మకో♦ద్భూతకంప, మతులితంబైన హేమంత♦ఋతువుఁ జేయఁ
దనదుశీతలహృదయవి♦స్తారమహిమ, తతసఖాళికి శిశిరర్తు♦ధాటిఁ జేయ. 534
సావిత్రీపరిణయము, ఆ 1 పద్య 129.

సీ. దానసమానవవనా♦వాసభూమీరుహ, సంతుష్టికృతికి ప♦సంతవేళ
యాచకజనచకో♦రాచితాశాపూర్తి, కారకరాకాని♦శారమణుఁడు
పండితజనసుర♦మండలీకృతసభా, మండనాయితమహా♦ఖండలుండు
పరిపంథితృణగణో♦పరిసముత్క్షేపణ, చణవర్షకాలజం♦ఝానిలంబు
గీ. జ్ఞానిజనతార్తివిపినద♦వానలంబు, కవిజనామరపోషణ♦కల్పకంబు
రసికజనహృద్యనవరసా♦లంబనంబు, రాజమాత్రుండె శ్రీరామ♦రాయవిభుడు.
వాసవదత్తాపరిణయము, య. ల.

ద్విపద. రతిరాజురూపున♦రమ్యభోగమున, సురరాజుకలిమిభా♦సురరాజరాజు
కురురాజుమానస♦ద్యుమ్నమున నీగి, ఘనసంగరాజని♦తనుఁ బ్రస్తుతింప
గరిమతో నారాజ♦కంఠీరవుండు, శాతహేతినికృత్త♦శత్రురాజన్య
జాతినిర్భిన్నభా♦స్వన్మండలుండు ... ... ... 536
ప్రభులింగలీల. పి. సో. గతి 3.



# రాజసభ.

—:o:—

సీ. త్రైలోక్యవిజయాభి♦ధంబైన సౌధంబు, చంద్రశాలాప్రదే♦శంబునందు
సచివసైన్యాధీశ♦సామంతనృపవర, సీమంతినీజన♦శ్రేణి గొలువ
శాస్త్రమీమాంసయు♦సాహిత్యగోష్ఠియు, విద్వత్కవీంద్రులు♦విస్తరింపఁ
గర్పూరకస్తూరి♦కాసంకుమదగంధ, సారసౌరభము ది♦క్పూరితముగ
గీ. నిజభుజావిక్రమంబున♦నిఖిలదిశలు, గెలిచి తను రాజ్యపీఠమె♦క్కించినట్టి
యన్నసోమేశ్వరునియంక♦మాశ్రయించి,నిండుకొలువుండెఁగన్నుల♦పండువుగను.

కాశీఖండము, పీఠిక. పద్య 10.

సీ. మొగిసలాములొనర్చి♦ముదముతో దవ్వుగ, భయముతో డవజీర్లు♦బాఱుదీఱ
సాష్టాంగముగ మ్రొక్కి♦సామంతనృపకోటి, కోటీరమణిఘృణి♦గ్రుమ్మరింప
మన్త్రులుబాంధవుల్♦మన్ననల్గలవార, లొకదండ సంతోష♦యుక్తినుండఁ
గానుకల్గొనివచ్చి♦గౌరవంబలరంగ, బాళింపుదొరగుంపు♦ప్రస్తుతింప
గీ. దండిభవభూతినిభులైన♦దండికవులు, సరసవిద్వత్కవుల్ దన♦సరసవెలయ
వనితలిరుగడఁబైఁడిపా♦వడలువీవఁ, బ్రమదమలరంగఁ బేరోల♦గమునసుండె. 538

కృష్ణరాయవిజయము, ఆ 1 పద్య 61.

సీ. చెవిదండఁజేరి ని♦ల్చినవ్రాయసమువారి, ముదలకమ్మలకొప్ప♦ములు లిఖించి
దిక్కులనుండి యే♦తెంచుమన్నీల మం, త్రులతోడ నుచితంపుఁ♦బలుకు పలికి
సమయోచితముగ హా♦స్యములొనర్చువిదూష,కులదిక్కుమొలకన♦వ్వొలుకఁజూచి
యవసరంబుల వార♦లవధారనుచుఁదెల్పఁ, బొడఁగనివారికిం♦పులు వెలార్చి
గీ. సత్కవీంద్రులురచియించి♦చదువుపద్య, సమితియం దొరపారలు♦చక్కదిద్ది
ప్రౌఢిఁగనిపింపఁజేయు భూ♦పాలుకొలువు, ప్రజలకవ్వేళఁగన్నుల♦పండువయ్యె.

కువలయాశ్వచరిత్రము, ఆ 2 పద్య 9.

సీ. వందిజనస్తుతి♦వ్యాహారములను బ్రా, సంగికుల్ సేయు ప్ర♦సంగములను
సచివశేఖరుల వా♦క్చాతుర్యములను బ్రా, బంధికుల్ జదువు ప్ర♦బంధములను
సాటిబాంధవులాడు♦సల్లాపములను బా, రాణికుల్ సెప్పు పు♦రాణకథల
గాయకగణసముద్గ♦తగానరసములఁ, బరిహాసకులవక్ర♦భాషణముల
గీ. వేదవేదాంతవిద్యావి♦నోదములను, మోదమును జెంది ఝల్లరీ♦నాదవిదిత
శోభనావసరంబయి♦భూవిభుండు, మరల సభ్యంతరంబున♦కరిగెనపుడు. 540

దిలీపచరిత్రము, ఆ 1 పద్య 152.

సీ. లెక్కింపనొకమిత్రుఁ♦డొక్కఁ జైవాతృకుం, డొక్క భూతనయుండు♦నొక్కఁ సౌమ్యుఁ
డొక గురుం డొకకవి♦యొక్కసూర్యాత్మజుం, డొక్క కేతువు గల్గి♦నిక్కనిక్క
మిన్నందె నుడులొక♦మెన్న నిట్టిదె కదా, తమముగ్రమ్మెడువారి♦క్రమ మటంచు
రోసి యసంఖ్యమి♦త్రులసంఖ్యజైవాతృ, కులసంఖ్యభూతన♦యులు నసంఖ్య
గీ. సౌమ్యులు నసంఖ్యగురులు న♦సంఖ్యకవుల, సంఖ్యసూర్యాత్మజాతుల♦సంఖ్యకేతు
వులును వెలయఁ దమోహర♦కలనఁగలిగి, డంబు మీ రెడు కొలువుకూ♦టంబుఁ జేరి.

రాధాకృష్ణసంవాదము, ఆ 2 పద్య 5.

సీ. కనకాచలోత్తుంగ♦ఘనమత్తమాతంగ, తతు లొక్కదెస బృంహి♦తములు సేయ
పాథోధిసుతరంగ♦పంక్తిఁ బోలుతురంగ, మములొక్కకడ హేషి♦తములొనర్ప
నతిమనోరథముల♦హరియించురథములొ, క్కెడ ఘుర్ఘురధ్వను♦లడలు కొలుప
చటులమైదిక్తటీ♦పటలము ల్వెటలగా, భటులొక్కయిక్కనా♦ర్భటులు సల్పఁ
గీ. బ్రకటసామంతధీమంత♦నికటరత్న, రుచిరసింహాసనస్థుఁడై♦కుచరఖచర
ప్రచురవిభవుండు వరబుభు♦ప్రభునిభుండు, వెలయు సభ నుండు దశరథ♦క్ష్మావిభుండు.

రఘురామచరిత్రము, ఆ 1 పద్య 51.

సీ. ఒకవంక నుతులధీ♦యుతభూసురానీక, మొగి వేదఘోషము♦లొనరఁ జేయ
నొకచాయ భుజవిక్ర♦మోద్ధూతరిపురాజ, బంధువ్రాజజన♦మొంది మెఱయ
నొకదారి వరభట♦నికరము ల్తనకీర్తి, సంతోషహృదయులై♦సాగి పొగడ
నొకచోట భరతశా♦స్త్రోక్తక్రమంబునఁ, జెలఁగి వేశ్యలు నాట్య♦ములనొనర్ప
గీ. రాజశేఖరుఁ డతులవి♦భ్రాజమాన, మౌక్తికాహారకాంచన♦మయ వినిర్మ
లాభరణజాలభూషితుం♦డరుగుదెంచి, యరిది కూర్చుండె రత్నసిం♦హాసనమున.

ధీరజనమనోవిరాజితము, ఆ 1 పద్య 31.

సీ. చెలువంబుగా నాడు♦వెలయాండ్రబంగారు, చిఱుగజ్జియల మ్రోఁత♦చెవులఁ దనుప
విరిబోఁడులిరుగ్రేవ♦వింజామరలు వేయ, వెడలు చల్లని గాలి♦విందుగొలుప
రహిమీఱఁ దాల్చిన♦రతనంపుఁబనిసొంపు, తొడవుల తళతళల్♦కడలనిండఁ
బగడాలకంబాల♦పజ్జముద్దినుసుల, కెంబట్టుపఱపులు♦డంబు నూపఁ
గీ. గొలువ నేతెంచు దొరలెల్ల♦గుములుగూడి, యదనొదవ దాఁకనందంద♦యొదిగియుండి
యడుగుదోయికి మ్రొక్కుచు♦నవల నిలువఁ, బసిఁడిగద్దియఁ గొలువుండు♦బలియుఁ
డతఁడు.544

శుద్ధాంధ్రోత్తరరామాయణము, ఆ 1 పద్య 12.

# ఆస్థానమండపము.

సీ. సంచితమణిమయ♦స్తంభాభిరామంబు, బహువిచిత్రవితాన♦భాసురంబు
ఘనసముత్తేజిత♦కనకవేదికమును, సామ్రపల్లవహేమ♦కమ్రకుంభ
ముపకంఠగతమద♦ద్విపసంకులంబును, పుణ్యాంగనాగేయ♦పూరితంబు
మంగళతూర్యాది♦సంగీతముఖరంబు, వందిమాగధజనా♦నందితంబు
ఆ. నైనమనోజ్ఞమైన♦యాస్థానమండపం, బమర నందు రత్న♦హైమతుంగ
భవ్యసింహాయుక్త♦భద్రపీఠంబున, నునిచెదానవేంద్రు♦నుత్సహించి. 545

భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 2270.

సీ. పగడంపుగుండ్రకం♦బములు మేలికడాని, దూలముల్ జాబిలి♦రాలమెట్లు
పులుఁగుఱాపచ్చబో♦దెలు తళ్కుమగమాని, కంపుగోడలుతమ్మి♦కెంపు వెడఁద
తలుపులు పటికంపు♦ద్వారబంధంబులు, తెఱగంటిరాచరా♦తిన్నియలును
వైడూర్యవలభిక♦ల్వాటంపు గోమేధి, కపుజలయంత్రముల్♦కడిఁదిముత్తి
గీ. యంపునేఁతలుపుష్యరా♦గంపుజాల, కములు రవికాంతమణివలీ♦కములు రజిత
ఫలకములుగల్గినాడెంపుఁ♦బనులబల్ హొ, రంగులననారతంబుఁజె♦లంగిమఱియు.
సీ. జాలవల్లికలుప♦చ్చలగద్దెపీఁటహొం, బట్టుతివాసీలు♦వట్టివేళ్ల
సురటీలు మేల్ పైఁడి♦కురిచీలునెత్తంపు, పలకనిద్దాజర♦బాజుజీబు
చందుఱాముత్యాల♦జాలీలుచికిలిక్రొ, మ్మించుటద్దములెన♦మించుతగటు
బాలీసురతనంపు♦కీలుబొమ్మలుచిటి, చాపలువెడఁదవిం♦జామరములు
గీ. తమ్మపడిగలు మంచిగం♦దంపుఁగోళ్ళ, చిఱుతముక్కాలిపీఁట రా♦చిలుకపంజ
రములు చిత్రింపుదివ్వెగం♦బములు గలిగి, జాఱుదులకించు కొల్వుహా♦జారమునను.

రసికజనమనోభిరామము, 1 పద్య 60, 61.

సీ. విఱజామరంబుల♦విసరుపూఁబోడుల, కంకణఝుణఝుణ♦త్కారరవము
మురువుగాసుతిగూడి♦మొరయించువైణిక, వల్లకీనిక్వణ♦క్వాణరవంబు
కడుసొంపుగానాడు♦కర్ణాటనాటకీ, కనకమంజీరఘల్♦ఘల్రవంబు
పరిణతపార్థివశిరః♦స్రగ్గంధలోలతఁ దిరుగుతుమ్మెదల ఝుం♦కరణరవము
గీ. మిళితమగుచుసుధారస♦గళితమగుచు, లలితమగుచు మనోరథ♦ఫలితమగుచు
నానినాదం బపూర్వమో♦హనవిలాస,మహిమఁజెన్నొందెదత్సభా♦మంటపమున.

కవిరాజమనోరంజనము, ఆ 1.

సీ, పగడంపుఁ బనులఁ బెం♦పగుగుండ్రగంబము, లచ్చంపుపచ్చరా♦గచ్చుమెట్లు
జేజేవజీరరా♦జిగికిటికీతనా, బీలతల్పులునెల♦రాలుగూర్చి
న హొరంగుద్వారబం♦ధములునై పొర్యము, ల్దాపినపసిఁడి దూ♦లములు పుష్య
రాగముల్చెక్కిన♦రాణించుజాళువా, తీనియ ల్మరకత♦దీప్తకుడ్య
గీ. జాలములు మానికములచేఁ♦జాలసలరు, జాలకములు గోమేధిక♦స్థగితసలిల
యంత్రములు చిత్తరువుఁబ్రాత♦లాదియైన,గడిఁదిసొంపగుపెంపులు♦గలిగిమఱియు.

శకుంతలాపరిణయము, ఘ. వేం.. ఆ 1.

సీ. మితిలేనిపతనముల్♦జతఁగూర్చినకడాని, సింగంపుఁబీఁటహొ♦రంగుతగటు
హొంబట్టుచందువా♦డంబుసూరతజాతి, ముత్యాలజాలీల♦ముద్దుగుల్కు
మొకమాలుబాలీసు♦మురువుతివాసీలు, దంతపుఁగురిచీలు♦తళుకుపనుల
నిద్దంపుజిగినిల్వు♦టద్దమువింజామ, రలు గుబ్బగొడుగు మేల్♦వలపుగులుకు
గీ. చిన్నిపన్నీటియత్తరు♦గిన్నియలును, బచ్చడెక్కులపులుఁగుల♦పంజరములు
గలిగిగరితంపునెరిసొంపు♦వెలయుజెంపు,మహిమచెలువొందునాస్థాన♦మండపమున.

" " " ఆ 1.

## రాచనగరు.

సీ. మానినీమంజుల ♦ మంజీరకరరవ, కేళీసరోహంస ♦ కీలితంబు
కామినీకాముక ♦ కలహప్రసాదన, పండితశారికా ♦ భాసురంబు
సరసకథాలాప ♦ సంగీతసాహిత్య, చతురశుకస్తోమ ♦ సంచితంబు
అంగనాగండూష ♦ హాలాలసద్గంధ, వకుళపుష్పావళీ ♦ ప్రకటితంబు
ఆ. విలసదగరుగంధ ♦ విస్ఫుటతరగంధ, మైన వివిధమంది♦రాంగణంబు
చూచి నెమ్మనమున ♦ సుడివడ నానంద, మంత కంత కుబ్బె ♦ నచ్యుతుండు.
సీ. గళితమదోదక ♦ గండస్థలీసంగి, మధుపఝుంకారాత్త ♦ మత్తగజము
హేషారవోద్ధతి ♦ ఘోషితనిస్సాణ, పటహభేరీధ్వాన ♦ బహుళహయము
పాకారచితరత్న ♦ బహువిధతరధామ, లిప్తసౌధసమూహ ♦ దీప్తతలము
ఫాలస్థలీకృత ♦ ప్రకటితాంజలిపుట, పరిచారికావళీ ♦ భాసురంబు
ఆ. ద్వారఖచితరత్న ♦ తోరణోపాంతావ, లంబిమౌక్తికోప ♦ లసితమైన
నగరి చొచ్చె శౌరి ♦ నానావిధానూన, వినుతిలసితహృద్య♦వేషుఁ డగుచు. 552

ఉత్తరహరివంశము, ఆ 6 పద్య 266, 269.

# కీర్తి.

శా. లాటీచందనచర్చ, చోళమహిళా ♦ లావణ్యసామగ్రి, క
ర్ణాటీగీతకలాసరస్వతి, కళిం♦గాంతఃపురీమల్లికా
వాటీమంజరి, గౌడవామనయనా ♦ వక్షోజహారాళియై
పాటింపందగు నీదుకీర్తి రథినీ ♦ పాలాగ్రణీ సాహిణీ. 553

భాస్కరరామాయణము, కిష్కిం. పద్య 826.

చ. స్థిరజయుఁడైన కోనన్ర♦దేవు యశోవనరాశి యా సుధా
కరునకు బొమ్మబంటి కలు♦కంఠుని కుత్తుకబంటి నాకరా
ట్సురదము చెక్కుబంటి ఫణి♦దేవుని కన్నులబంటి శారదాం
బురుహ విశాలనేత్రతల ♦ ముక్కలునై విహరించు మించుగన్. 554

కకుత్స్థవిజయము, పీఠిక పద్య 70.

సీ. చెక్కునొక్కఁ దెయంచు ♦ దిక్కరిగ్రామణి, యక్కుఁ జేరఁ దెయంచు ♦ రిక్కరాయఁ
డలుతనొందఁ దెయంచు ♦ హాలాహలాహారి, కంటికబ్బ దెయంచు ♦ దంటచిలువ
యంక మొందదెయంచు ♦ యదుకులశ్రేష్ఠుండు, మోముఁ జూడ దెయంచు ♦ మొదటిగిబ్బ
యడుగు దొరక్కదెయంచు ♦ నమృతంపుమున్నీరు, చాయనుండదెయంచు ♦ సౌరశాఖి
గీ. తనచెలిమి కాసపడనొచ్చె ♦ మునికివారిఁ, దెగడి యాత్మసవర్ణల ♦ బ్ధికిఁ జరాచ
రంబునఁ జరించుఁ దిరుమల ♦ రాయతనయ, ధీరవేంకటరాయ స ♦ త్కీర్తికన్య. 555

వసుచరిత్రము, పీఠిక పద్య 80.

సీ. అప్పుపాలైన శు♦భ్రాబ్జంబు రుచి యెంత, మాటమోచినయంచ ♦ తేట యెంత
నీళ్లుమోచిన భవా♦నీభర్తకలి మెంత, బిలము దూరిన శేషు ♦ బలిమి యెంత
తమ్ములతోఁ బోరు ♦ తారేశుకళ యెంత, తృణమైనశరపుంజ ♦ దీప్తి యెంత
పండ్లిగిలించు క♦ల్పకశాఖిదళ మెంత, విరిసినమల్లెల ♦ వీఁక యెంత
గీ. యనుచుఁ దనకీర్తి ధవళాబ్జ ♦ హంస మదన, మథనవరభోగివిధుశరా♦మర్త్యవిటపి
వికచ విచికిల మాలికా♦వితతిఁ దెగడ, వసుధఁ బాలించు నోబభూ♦వల్లభుండు.

నరసభూపాలీయము, ఆ 1 పద్య 67.

ఉ. వేడుక వీరసేనపృథి♦వీవరుకీర్తివధూలలామ యీ
రేడుజగంబులు న్మదికి ♦ నింపులొసంగెడు బొమ్మరిండ్లుగాఁ
దోడ నజాండభాండములు ♦ దొంతులుగా నిడి బాల్యపాయమం

చాడు నటన్నఁ బ్రోవఁదగు ♦ నత్తఁడె కద్దె కీర్తి యెంత సేయునో. 557

నలచరిత్రము, ఆ 1 పద్య 208.

సీ. అనిదిండి జడదారి♦చినుకుపూసలకోవ, ముచ్చాలుపెన్నెల♦చిత్తుగలవాఁడు
గిబ్బడాల్దొరగుండు♦కబ్బంబుపోరియాలు, లబ్బినుబ్బైతయాడ్డ♦బొబ్బ పెనకము
విన్నుకేళాకూళి♦వేల్పులబోనము, తడవ్రలవిడుపడు♦పుడుకుపోడుకు
తూఁడుమేపుడుపుల్లు♦దూర్పరాయనిజక్కి, మొల్లకొరివ్వేరియెత్తు♦జెల్లుపుచ్చు
కే. నురువులద్దంబుపాలుక♦ప్పురపుబూది, సంకు రిక్కలు ఘంచు నీ♦రింకుమెఱుగులు
దనయసంబునకెనగాక♦పెనుపుడింప, వెలసె నమ్మన్నుతాలుపు♦వేల్పుఁ దేఁడు.

అచ్చతెలుఁగు రామాయణము, యుద్ధ. పద్య 590.

సీ. కాశకాశాధిపా♦కాశధునీహార, నీహారకలశవా♦ర్నిధులఁ బెగడి
సోమసోమామర♦సామజతారకా, తారకాదంబబృం♦దముల నవ్వి
చంద్రచంద్రాతప♦చందనశారద, శారదాంభోదకై♦రవుల నెన్ని
గోపగోపారదేం♦దూపలసంతాన, సంతానఫేనవ♦జ్రములఁ గేరి
గీ. మీఱి తనకీర్తి జగముల♦మెఱయ నలరె, నిఖిలభూధరణోదగ్ర♦నిజభుజాగ్రి
జాగ్రదుగ్రమహామండ♦లాగ్రదళిత, దుష్టదుర్వైభుజుండు బు♦ద్ధప్రజుండు.

రసికజనమనోభిరామము, ఆ 1 పద్య 54.

చ. సురకరిచెక్కునొక్కి గజ♦సూదనుకంఠమునవ్వి రేవతీ
శ్వరుకటిరోసి రేవెలుఁగు♦వక్షముఁదొరిక్కి పయఃపయోధిలోఁ
గరముఁ గలంచి వాణిజడ♦గప్పి భుజంగమరాట్ఫణాపరం
పరలనటించి దాసఘను♦భానురకీర్తి చెలంగె దిక్కులన్. 560

వేదాంతరసాయనము, అవతా. పద్య 49.

సీ. కుందమ్ములసితార♦బిందమ్ముల మృణాళ, బృందమ్ములను పయః♦స్యందములను
రంగమ్ముల సుధాత♦రంగమ్ముల నభస్త, రంగమ్ముల సురసా♦రంగములను
హారమ్ముల శరద్వి♦హారమ్ములను గాంగ, పూరమ్ముల ఘనక♦ర్పూరములను
సూనమ్ములఁ గళావి♦తానమ్ముల నుడుపరి, తానమ్ముల సురసం♦తానములను
గీ. సొగసుమగరాలనిగరాల♦నిగనిగలను, మిగులనలరారు నెలరాల♦తగువగలను
దెగడి పొగడొందు నెల్లెడ♦జగతి నతని, పరమహిమవ్యాద్యశోభాప్రి♦భావగతుల.

అచలాత్మజాపరిణయము, ఆ 1.

సీ. త్రిదశాలయముఁ జొచ్చి♦తేరెఁద్రృణగ్రాహి, హరికరమంటె గో♦త్రారింతకారి
కారోపరముఁ బట్టెఁ♦గాత్యాయనీభర్త, క్ష్మాతలంబంటెఁ గం♦జాతసూతి

ఘనతారకంబుల♦కరముల్గాంచెఁగళంకి, కొలనునీటనుమునిఁగె♦కుముదకోటి
హరిశిరస్స్పర్శ ని♦ర్జరుఁడయ్యెఁ గరదుండు, పరిజనంబైనిలిచె♦స్వస్వరూపి
గీ. యనుచు నారలఁ దత్సమా♦ఖ్యలజయించి, రూపసంపదలకు మును♦ప్రాపుగొన్న
సారసంగ్రహవైభవో♦దారలీల, వెలసె మదనాభిరామ భూ♦విభునికీర్తి. 562
యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 1.

సీ. తారకాచలతార♦తారకాపంక్తుల, తారతమ్యముఁగట్టి♦తారసిల్లి
పారతరంగిణీ♦పూరామరాహార, వారిజవారముల్♦నిరసించి
హీరనీహార క♦ర్పూరడిండీరాద్రి, హారిపటీరము♦లవ్వలఁ దోలి
నారద శారద♦నారద పారద, క్షీరధరంబుల♦మీరఁ బల్కి
గీ. శారదైరావతములను♦మీఱిమీఱి, క్షీరవారాశిపూరము♦జేరిచేరి
సారెసారెకులయందున♦మీఱనంగ, మీఱె శ్రీరామరాణ్మణి♦చారుకీర్తి. 563
వాసవదత్తాపరిణయము, ఆ. ౪.

# రాజ్యపాలనము.

సీ. పాడిపంటలుపుష్ప♦ఫలసమృద్ధివహించె, నఖిలధేనువులుఁ జ♦న్నవిసిపిదికె
జగతీవధూటిరా♦జన్వతిగామిమించె, గతమయ్యె నెచటఁ ద♦స్కరభయంబు
కనరైరిపుత్రశో♦కముతల్లిదండ్రులు, బాలఁతులవైధవ్య♦ములుదొలంగెఁ
బ్రాణిజాతంబు ని♦రామయస్థితిఁబొల్చె, నెలమూఁడువానలు♦నిలిచికురిసెఁ
గీ. దేశతలవడఁబంగౌఢా♦తీర్థతలంబు, పొదలిధారణపోఁకకుఁ♦బుట్టెఁడయ్యె
నన్నివంకలదుర్భిక్ష♦మడఁగిపోయెఁ, బ్రస్తుతింపఁగఁదగురామ♦రాజ్యమునను.
జైమినిభారతము, ఆ ౮ పద్య 9.

సీ. వానలుసరవితో♦వర్షించె సస్యముల్, వేళ్ళఁగొల్చుగ విజ్ఞ♦వీఁగిపండె
నారోగ్యపుత్రపౌ♦త్రైశ్వర్యవంతులై, బ్రదికిరినూఱేండ్లుఁ♦బంచజనులు
పూవుఁబోఁడులుపతి♦దేవతలై రగ్ని, భయతస్కరవ్యాధి♦భయములడఁగె
ఫలపయఃకుసుమాది♦బహుపదార్థంబులు, రసగంధసామగ్రి♦నెసకమెసఁగె
గీ. సస్యపదప్రవృత్తరా♦హిత్యయుక్త, ధరఁబ్రజాసృష్టితావా♦తంసమాన్య

న్యాయపథమున స్వారోచి◆షాఖ్యమనుప్ర, కీలఁ బెంపొందఁ బాలించు◆కాలమునను.

మనుచరిత్రము, ఆ 6 పద్య 120.

సీ. ఆరాజువిమలవి◆ఖ్యాతిచంద్రికనిచ్చ, మహికెక్క జాబిజా◆కప్రసంగ
మాఘనుదానధా◆రాపూర్ణవర్షము, ర్వారెంబర్వ డిగియె ను◆వగ్రహార్తి
యాలోకహితుప్రతా◆పాతపం బవిరతో, దయరూఢిఁ దగ నింకె◆దస్యుపంక
మాసద్గుణాబ్ధి చం◆ద్రామృతం బెల్లచో, దయివాఱఁ జెరలెనా◆మయవిభూతి
గీ. యమ్మహాశైలదమనురా◆జ్యమునసిట్లు, ఫలములీనెడుచెట్లతోఁ◆బాలవెల్లి
కాన్పుపసితోనఖండభో◆గములతోడఁ, బ్రజలుగాంచిరిభూరివై◆భవసమృద్ధి. 566

వసుచరిత్రము, ఆ 6 పద్య 99.

సీ. ధర్మంబునాల్గు పా◆దంబులవర్తిల్లు, వాంఛించినప్పుడే◆వానకురియుఁ
దరువులేవేళను◆ద్ధతిమీఱ ఫలియించుఁ, బైరులు దున్నక◆పండుచుండు
దిరిపంబువిసరమే◆దెక్కనొదవదు, మొదవులుపిదుకక◆మున్నెపిదుకు
వ్యాధులునఘములు◆వలసలైదూరించుఁ, జింతింపఁగోర్కులు◆సిద్ధినొందు
గీ. రాజపరమేశ్వరుఁడుదైత్య◆రాజహరుఁడు, రాజసింహుండుదశరథ◆రాజసుతుఁడు
రాజసదృశకళాంగుండు◆రాఘవుండు, ఘనత రాజ్యంబుఁబాలించు◆కాలమునను.

శతకంఠరామాయణము, ఆ 1 పద్య 16.

సీ. మంత్రులమనసుఁబ◆ల్కులు దేవి తెలిసి దు, ర్గాధినాథులమర్మ◆మరసిచూచి
మన్నీలభేదముల్◆పన్నిపాయఁగఁ బెట్టి, సాన్నిధ్యులకుగట్టు◆సనువులీక
కొనుటమానుటనిల్వ◆మనుమాట వివరించి, పాఱుపత్తెమువారి◆తీరుతెలిసి
బలములసప్పటి◆ప్పటికి నీక్షింపుచు, గ్రాసక్రమములడు◆గక యొసఁగుచు
గీ. లోకవార్తలుమావల్ల◆లోనఁగొనుచు, ననుదినాయవ్యయంబులం◆గనుచుధర్మ
లీలఁజేస్పడ నీవు భూ◆పాలనంబు, సేయఁ బ్రజగొడవందునే◆క్షితివరేణ్య. 568

నలచరిత్రము, సి. ధ.

చ పరిజలకుమూఁడుపాళ్లొసఁగి◆భాగము తాఁగొని భూమిదేవతా
ప్రజమునకున్ సమస్తమున◆వారణాగానిడి పూర్వకాలభూ
భుజులగతిన్ జతుశ్చర◆పూరితధర్మ పథానువర్తియై
నిజభుజశక్తిచే నెలె ధర◆ణీపలయంబు జనుల్ సుఖింపగన్. 569

పద్మినీపరిణయము, ఆ 1 పద్య 81.

సీ. కలలోనఁగన్న జం◆గంబయ్యె రోగంబు, గొఱ్ఱాలిచూలయ్యెఁ◆గుటిలవృత్తి
శత్రుజన్యభయంబు◆శశవిషాణంబయ్యె, సలిలాక్షరంబయ్యె◆సస్యబాధ

ఆ. హావభావరూపలావణ్యసారముల్, త్రిభువనముల నేర్చి ♦ తెచ్చి నేర్పు
మూపఁ దలఁచి యాఁడు♦రూపజుఁ డొనరించె, నని నుతింప నొప్పు ♦ నగతనూజ

కుమారసంభవము, ఆ 3, పద్య 283, 317, 321.

శా. ఆలీలాస్యసదృఙ్మరీచిదివిజా♦హారప్రవాహోరుక
ల్లోలాళికముపోలెఁ జొల్పెసఁగ నా♦లోలాతిరమ్యాళిక
భ్రూరేఖాస్యాంచితమైనపార్వతి ముఖాం♦భోజంబు నేణాంకిత
ప్రాలేయద్యుతిమండలంబుపమిం♦పం బోయి శంకించెదన్. 576

కుమారసంభవము, ఆ 8 పద్య 10.

సీ. మదనవశీకార♦మంత్రదేవతసృష్టి, గోచరమూర్తియై♦కొనియె నొక్కొ
సితకరబింబని♦స్సృతసుధాధారని, తంబినీరూపంబుఁ♦దాల్చెనొక్కొ
విధికామినీచేష్ట♦విజ్ఞానపరసీమ, విధిగండవింపంగ♦వెలసె నొక్కొ
శృంగారనవరస♦శ్రీవిలాసోన్నతి, నుంపరాకారంబు♦నొందె నొక్కొ
ఆ. కాక యొకవధూటి♦కడుపునఁబుట్టిన, భామ కేల నిట్టి♦రామణీయ
కంబు గలుగుననుచుఁ♦గన్నియమైమహీ, పాలసుతుఁడుదృష్టి♦పఱపెనర్థి. 577

విజయసేనము, ఆ 2.

సీ. లక్ష్మీహస్తములకు♦లాంఛనం బబ్జంబు, హస్తంబ యబ్జమి♦యబ్జముఖికి
సిరి పురాతనుఁడైన ♦పురుషుని మును బొందెఁ, జెలువునిఁ బొందదీ♦చిగురుఁబోఁడి
జనులకు నిందిరా♦సతిపాదమూపదీ, పద్మాక్షి కన్నుల♦పండువయ్యె
నింతపాయఁబని♦యెఱుఁగము కమలకీ, నాతికి వెలజవ్వ♦నంబు మించెఁ
గీ. గాన వీలక్షణంబులు♦కమలనిలయ, లక్షణములకుఁ గడు నగ్గ♦లంబు లిట్టి
వనితకన్నుమనంబు నె♦వ్వానిఁదగిలె, నతఁడె కాఁడె మన్మథునకు♦ననుగలంబు.

దశకుమారచరిత్రము, ఆ 10 పద్య 28.

—♦ ద్విపద. ♦—

మెఱుఁగుఁదీఁగెలువోలు♦ మేనులువలఁపు, గిరికొన్నయలినీఁ♦కేశపాశములు
తగుకోందునుపమింపఁ♦దగు లలాటములుఁ, గరివంకబొమలును♦గ్రాలుకన్గవయు
సుధలొల్కుపల్కులు♦సుషుమదంతములు, మధురాధరంబులు♦మందహాసములు
చంద్రబింబముఁబోవు♦నరకుఁగాఁగొనక, ... ... ...
తమ్మినెత్తావుల♦తలఁగింపఁజాలు, కమ్మనియూర్పులు♦కంబుకంఠములుఁ
బసిఁడిమించులనొప్పు♦బాహుమూలములు, గిసలయంబులనవ్వు♦కెంగేలుగవయుఁ

... ... ... ... ... ... ...

రంగనాథరామాయణము, కా చ. పిత. ఉత్తర.

సీ. చైతన్య మొందిన ♦ చక్కని చిత్రింబు
చిఱునవ్వు మరగిన ♦ చిగురుబొమ్మ
నడుపాడ నేర్చిన ♦ నవకంపుననుఁదీగ
మూరిపెంబుఁ బూనిన ♦ విరులయొత్తు
వంకవాయఁగ బెట్టి ♦ వచ్చిన క్రొవ్వెన్నెల
పలుక నభ్యసించిన ♦ పసిఁడిప్రతిమ
నిలుకడ వడసిన ♦ తొలుకారు మెఱుఁగర్థిఁ
కైసేసి తోఁచిన ♦ కామునలుఁగు
గీ. నాఁగ నభిరామమగు నెల ♦ నాఁగ యొకతె
మానవాంగనాసదృశంబు ♦ గాని రూపు
సుహిమ గలయది నా సృష్టి ♦ మందిరమున
కేకతమ వచ్చియుండఁగ ♦ గనుగంటి.

కేయూరబాహుచరిత్రము, ఆ 4 పద్య 30.

ఉ. ఆ మదిరాక్షి రూపవిభ ♦ వాతిశయంబుల దృష్టి సోఁకినన్
సోముని నైన వేఱయొక ♦ సోముఁడు సామని నైన వేఱయొ
క్కామని కమ్మతెమ్మెరల ♦ నైనను వేఱొక కమ్మతెమ్మెరల్
కాముని నైన వేఱయొక ♦ కాముఁడు నేచుదు రేమి చెప్పుదున్. 581
మ. వనితారత్నము నాసికాపదభుజ ♦ ద్వంద్వశ్రీవోలంకృతుల్
వనజామోదపుటూర్పు లంచనడుపుల్ ♦ వాణిద్యుతుల్ శాతలో
చనసౌఖ్యంబులు దృష్టిదోషమున ర ♦ క్షిల్ నాకుఁ జూడంగఁ ద
ద్ఘనముక్తావళి యందియల్ వలయముల్ ♦ కల్యాణతాటంకముల్. 582

,, ,, ఆ 4 పద్య 130, 131.

చ. పదములు చారుపద్మములు ♦ భావురకంఠములొప్పు శంఖముల్
రదములు కుందముల్ కుచభ ♦ రంబులు నీలము లట్లు గాన స
మ్మదమునఁ గాంతలై నిధులు ♦ మానుగనున్న వియైన సాపురిన్
నుడతుల తుచ్ఛమధ్యములఁ ♦ జొచ్చిన లేములు వాయ వెన్నఁడున్. 583

భాస్కరరామాయణము, బాల. పద్య 34.

ఉ. పచ్చనిపృక్క వాటికల◆ పండుల భిక్ష భుజించి నిచ్చలున్
వచ్చి పఠింపఁబోలుఁ బ్రతి◆వాదముఁ గోయిల బ్రహ్మచారి పెం
పచ్చుపడంగ నీసరసి◆జాక్షి ముఖద్విజరాజునొద్ద నా
పిచ్చిలసత్ప్రసూనశర◆వేదరహస్యము లైనపల్కులన్.
గీ. నలువ సన్నంబుగా దీసి◆నడుము గసి, యౌవనమునకు నిచ్చె నా◆యంశ మెల్ల
నదియుపాదానముగఁ గదా◆యిదెసృజించె,నున్నతము లైనయీ శత్ప◆యోధరములు.

" " " ఆ 3 పద్య 177–191.

శా. హాచ్ఛేం చింతయు లేక హంసనడతోఁ◆ బోల్పొందు లేనవ్వుతో
నచ్చట్లాపినకుల్కుముంగరలతో◆ బాగైనకెమ్మోవితో
నచ్చంబైనమునుంగుఁ జెట్టిచెలితో◆ నామాటలే చెప్పుచున్
వచ్చెన్ బో............◆వామాక్షి తా నీళ్ళకున్. 583

సీతినాటకము, పద్య 40.

సీ. పల్లవవైభవా◆స్పదములు పదములు, కనకరంభాతిర◆స్కారు లూరు
లరుణపరిభావనో◆హములు కరములు, కంబుసౌందర్యమం◆గళము గళము
మహితభావాభావ◆మధ్యంబు మధ్యంబు, చక్షురుత్సవదాయి◆.........
పరిహాసితార్ధేందు◆పటలంబు నిటలంబు, జితమత్తమధుకర◆శ్రేణి వేణి
ఆ. భావజాశుగముల◆ప్రాపులు చూపులు, కుసుమశరుని వింటి◆కోమలు బొమలు
చిత్తతోషణములు◆ చెలువభాషణములు, జలజనయనముఖము◆ చంద్రసఖము. 590

భాగవతము, స్కం. 10 పూర్వ. పద్య 1711.

సీ. సాంద్రశరచ్చంద్ర◆చంద్రికాస్ఫూర్తిచే, రాజిల్లు పూర్ణిమా◆రజనివోలెఁ
బూర్ణేందుపైఁ బాక◆తీర్చిమై యులమీఁద, భాసిల్లుహరిణిడిం◆భంబువోలె
సులలితమేఘమం◆డలమును నెడఁబాసి, వసుధఁ గ్రుమ్మరు తటి◆ద్వల్లివోలెఁ
మాణిక్యరచిత స◆న్మహితచైతన్యంబు, వొందిన పుత్తడి◆బొమ్మవోలె
గీ. లలిత విభ్రమరుచికళా◆లక్షణములఁ, బొసఁగ రూపైన శృంగార◆రసమువోలె
నర్థిఁ జరియించుచున్న య◆బ్జాయతాక్షిఁ, బ్రకటసద్గుణభద్ర ను◆భద్రఁ జూచి.

" " " స్కం 10 ఉత్తర పద్య 1173.

ఉ. సోమునిఁ గోడు తెచ్చుకొని◆ సుక్కిక్క చిక్కులు తేంట్లు గొల్వఁగాఁ
గాముఁడు విల్లు నమ్ములు న◆ఖండతఁ బట్టినయట్లు దోఁచు నా
భామమ ఖాస్ట్రరేఖయును◆ బల్కును గొప్పును భ్రూ వపాంగమున్

గాముని సెప్ప చంపు బడి ♦ కన్గొనిపించె శశాంకశేఖరా. 592

వీరభద్రవిజయము. ఆ 3 పద్య 64.

గీ. ఒప్పు శేయేటి మాటలే ♦ కుండబ్రహ్మ, యంగకంబులు చేసెనం ♦ చాత్మ మెచ్చి
యవయవశ్రీలు గనుఁగొన ♦ నట్టి యిచ్చఁ, దరుణికన్నులు తలచుట్టు ♦ దిరిగి వచ్చు. 594

విక్రమార్కచరిత్రము, ఆ 6 పద్య 48.

సీ. బంగారుతలుపులఁ ♦ బాయంగఁ బట్టించి
లావణ్యవిత్తమే ♦ లావరియించె
లావణ్యవిత్తమే ♦ లావరియించును గాక
యతిమాత్రమే లాప ♦ యాసపడియె
నతిమాత్రమాయాస ♦ మనుభవించును గాక
విటజనంబులనేల ♦ వెడ్డు కొలిపె
విటజనంబులకారి ♦ వేరంబు సేయఁగా
నేల నిర్మింపఁడో ♦ యెనయు మగని

గీ. సొమ్ముపోక, మహాప్రయా ♦ సమ్ము రాక
ప్రజలబాధ నిరర్థకా ♦ రంభణంబు
లెలమి సిద్ధింప నేమిగాఁ ♦ దలఁచు నొక్కొ
సరసిజాసనుఁ డీతలో ♦ దరి సృజించి.

క్రీడాభిరామము, పద్య 287.

సీ. కమలమొక్కటి నల్ల ♦ కల్వలు రెంట భృం, గములు పెక్కింట శం ♦ ఖము నొకంట
బిసకాండములు రెంటఁ ♦ బసిఁడికుండలు రెంట, నొప్పారసృజియించె ♦ నొక్కనగము
ఘనరథాంగద్వంద్వ ♦ కంబునఁ గమనీయ, రంభామృదుస్తంభ ♦ రాజయుగ్మ
మున మన్మథశర ♦ గారద్వయంబునఁ, బల్లవయుగమునఁ ♦ బరఁగఁ జేసె.

ఆ. నొక్కనగము రెండు ♦ నొగిఁ బొందుపడఁ గూర్చి, పిడికిలించిపట్టి ♦ నడుముఁ జేసె
నజుఁడు నాఁగ నింతి ♦ యవయవోత్పాదన, లీలఁ దెల్పు నవ్వ ♦ నిత్రియంబు 598

భోజరాజీయము, ఆ 7 పద్య 148.

ద్విపద.

మఱి చూడ కమ్మ లుఁబా ♦ మానినీమణిని, పెరవుచ్చునద్దంబుఁ ♦ దెగడెడు మోము
జాతిఁ లప్పురంగ ♦ జడిపించు కురులు, లేఁతచందురుఁ బిసా ♦ రించు నెన్నుదురు

ముదిత కోరములతో ◆ మలయు నేత్రములు, గొదమతేళ్ళకు సిగ్గు ◆ గొలిపెడిచూపు
విరులవిండ్లకు నమ్ము ◆ వేసిన భ్రూమలు, సరసచంపకము మెం◆చ్చని నాసికంబుఁ
దెలిమొల్లమొగ్గలఁ◆దెగడు పల్వరుస, పులకండ మొలకెడుఁ◆బొమ్మించు మోవి
చీకటి విరియించుఁ◆చిఱునవ్వు పసిఁడి, రేకులతో నెది◆రించు చెక్కిళ్ళు

... ... ... ... ...

గెందామరల సేవ◆గించు పాదములు, సుందరి గాదిది సొబగు రాయంచ
యంచ గాదిది నడ◆పాలు క్రొమ్మించు, మించు గాదిది రాచ◆మెచ్చుల ప్రతిమ
ప్రతిమ గాదిది పచ్చ◆పగడంపు లతిక, లతిక గాదిది నవ◆లావణ్య సరసి
సరసి గాదిది పుష్ప◆చాపుని శరము, శరము గాదిది రతి◆సవరించు చిలుక
చిలుక గాదిది విక◆సించు చెంగల్వ, కలువ గాదిది చంద్ర◆కళవంటి చెలువ. 599

హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన. భాగ. 2.

చ. కనుఁగవఁ దన్నుఁ గెల్వఁగన్య◆గం బల నూమున కిందుఁ రేతు నే,
నని రుచిదక్కుఁ దత్ప్రతిమల్లా◆ఢ్యత లేమి నతండు గొంకఁ దా,
నిను పఁ జన న్మృగం దనదు◆నెత్తులఁ బొట్టిడుకొంటకాక వా,
సనక యన న్మృగం బమరుఁ◆జామకు ఫాలము పచ్చికస్తురిన్.
శా. నాసా చంపకత న్సుగంధ మదటన్◆రా భృంగముల్ గ్రోల సం,
త్రాసం బందియుఁ బల్కుచో నలము వ◆క్త్రాం బేల నా నేల యం,
దే సౌరభ్యము లేదు కుందములుగా ◆ వే దంతము ల్గాని నాఁ,
డాపక్తిన్ బ్రతిబింబ దంభమున నే◆లా వ్రాలఁ దజ్జాతికిన్.

ఆముక్తమాల్యద, ఆ 5 పద్య 12, 16.

చ. కలితసుధారసంబు తొలఁ◆కన్ సరసప్రియభాషణంబులన్
బలికిన శీతకాలమగుఁ ◆ బల్లవపాదము లెత్తి లీలమై
మెలఁగ వసంతకాలమగు ◆ మించుగ నుంగవఁ జాఱఁ జూచినన్
దలకొను కాఱుకాలమగుఁ ◆ దన్వివిలాసము చిత్ర మెన్నఁగన్. 608

రాజశేఖరచరిత్రము, ఆ 3 పద్య 72.

సీ. అవనిపై నుండుగా◆కనఁటికంబము లెట్లు, లనఁటికంబములపై ◆ నవని నిలచె
గగనంబు గిరులపైఁ ◆ గనుపట్టుగా కెట్లు, గగనంబుపైగిరు◆ల్గానవయ్యె
జలధరంబులమీఁద ◆ శశియుండుఁగాకెట్లు, శశిమీఁదనున్నది ◆ జలధరంబు
నాళంబుపైఁగాక ◆ నలినకోశం బెట్లు, నలినకోశంబుపై ◆ నాళమున్న
గీ. దనుమఁ జూపరులకు విస్మ◆యంబుఁ గొలుపు, ......................

లాననముగొప్పఁ జాభియు ♦ నారువలర, నలరెడుమణాంగి నవరోమాళి ♦ నాగముగుఱఁ

కవికర్ణరసాయనము, ఆ 3 పద్య 27.

సీ. కొమ్మవాతెఱతో గు♦ఱుముఱుఁగైకొనవచ్చుఁ, గఠినపద్రుమము చే♦కట్టఁ బడినఁ
గోమటియాధరంబు♦తో మొనప్పుచరించి, యాపచి బింబఫలంబు♦లవిసి పడినఁ
బ్రాగనేత్రి పెదవితో♦నాగనుఁబూడరి వడఁగె, కెంపునీరసముఁ బై♦క్కొంచి కొనయె
సతిమోవితో రస♦స్థితులుచూచి సుగంధ, ఫలకలబంధూకమూ♦రక యెఱఁగె

గీ. తాయము కడఁగలంకఁ నీ♦వంబుబింబ, ముకుబింబంబు మెఱయు కెం♦జిగురు సెంపు
బంధుజీవంబుఁ గాన♦బంధుజీవ, మాని యీ కుంపరింన ఱ♦దాంశుకంబు 612

ఉ. ఇంతిమొమాక్తమాధురికి♦ నిక్కెననం డెనపోలఁజాలకా
ద్యంతము నోడి మధ్యమగ♦ తాశ్రియునై శశాంక నెన్నిజ
స్వాంతరమున్ సహించియుఁ ద♦వంత నెఖండములయ్యెఁ గాని యా
వంతయుఁ బూనదెంతివోడి ♦ య యఖండతదీయ సంపదన్. 613

శా. నానాసూనవితానవాసనల నా♦నందించు సారంగమే
లా నన్నొల్లపటించు గంధఫలి బల్♦కాఁకం దపం బంది యో
షానాసాకృతిఁ బూని సర్వసుమన♦స్సౌభాగ్యసంవాసమై
పూనెం జేగ్రిక్షణమాలికామధుకరీ ♦ పుంజంబు లిర్వంకలన్. 614

చ. అనయము నీలకంధరము♦నభ్రిమునన్న సమూహ్యవారితో
నొనరియు నింతవేనలికి ♦ నోడియనిశ్చితరూపక్షయమై
చనియె మొగుల్ నగావళికి♦శర్దగుణంబులు నూపువారి నె
ట్టనఁబురివిచ్చువానిదరి♦డాయుఁజడాత్ముల కెక్క నిల్కుడల్. 615

వసు, ఆ 2 పద్య 32—50.

ఉ. సావరమాధురీస్పృహప♦సం బికమో శుకమో తదీయజి
హ్వావిలసత్స్వరవ్రతిమ♦పాసనఁ జేయుచు నగ్రిభూమి నిం
పావహిలంగ నేర్చి యుప♦హారముగానిడినట్టి పల్లవం
బో విమలంపుబింబఫల♦మోయన నాతెఱ యొప్పు నింతికిన్. 620

చ. నొకవ్రులు కిర్రిందుమీఁదఁ గి♦చూడక యీడని యాడుకొన్న హా
టకకదళీవిలాస మక♦టా విపరీతము గాక సాటియే
యకలుష రామణీయక స♦మంచితకోమలతద్వనూరుల
క్ష్మ్నకి సరిగావ యెంతతల♦క్రిందయినన్ గరిరాజహస్తముల్. 621

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 2 పద్య 74, 85.

చ. కమలజుఁ డీవధూటి యలి◆కం బటు చూఁచి మునిద్రుమప్రసూ
నమునొనరించి పోలదని◆నవ్వుచుఁ జెట్లనుగట్టి క్రొన్నెలం
గ్రమమునఁ జేసిన న్సవతు◆రామికిరోసి నవోఢురాజునుం
దమకముతోడ నాకసము◆నవ్వడిఁ బాఱఁగ వైచె సిగ్గునన్. 625

చిత్రభారతము, ఆ 3 పద్య 68.

సీ. కమలంబు నెమ్మోము◆గాకున్న వీక్షణ,భృంగపంక్తులు సారె◆పెనచు టెట్లు
ఘనఘనాఘనపాళి ◆ పెనుగొప్పు గాకున్న, శృంగారరసము వ◆ర్షించు టెట్లు
సౌదామినీలత ◆ మైసీవ గాకున్న, కనుఁగవ మిఱుమిట్లు ◆ గొనుట యెట్లు
సుధమీఁది మీఁగడ ◆ యధరంబు గాకున్న, కోరినయపుడు నో◆రూరు టెట్లు
గీ. గగన మతిసూక్ష్మమైనది◆కలికికౌను, గాకయుండినఁ జూచినఁ ◆ గానరాదె
యింతి చెలువంబు చెలియంగ◆మింతయనుచు, వర్ణనలు సేయ నలువకు◆వశముగాదు.

చారుచంద్రోదయము.

ద్విపద నీలంపురంగులో◆నికరంపుఁగప్పు, బాలేందులోపలి◆పస పట్టు నొసలు
వలరాజువింట్ల జి◆వాళము ల్బొమలు, కలువలలోని చొ◆క్కములు నేత్రములు
మెఱుఁగుకెంపులలోని◆మిసిమిపల్వరుస, చిఱుతవెన్నెలలోని◆చిక్కన నవ్వు
పసిఁడిసంపంగిలో◆పలితావి నాస, రసముల చిగురుసా◆రమ్ము కెమ్మోవి
శ్రీకారములలోని ◆ చెల్వులు వీను, లాకలజనమితి మో◆హనము నెమ్మోము
ఒసపరిసంకున◆యొనరు కంఠంబు, పసిఁడితీవల మేలు◆పట్టు బాహువులు.

... ... ... ... ... ...

అష్టమహిషీకళ్యాణము, ఆ 5.

ఆ. నాన కోలగాఁగ◆భాసిల్లు భ్రూవల్లి, విల్లుగాఁగఁ బొడిగి◆వేసినట్టి
మదమరాళయాన◆నుదురు కందర్పుని, యర్ధచంద్రబాణ◆మనఁగఁ దనరె. 631

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 6 పద్య 72.

క. తరుణీవిలాసంబెన్నం, దరమే పరమేష్ఠికైనఁ◆దలపఁగఁ◆నోహో
హరి మధ్యంబఁట బంధుర, కరి గమనంబఁట, విచిత్ర◆కరమిది గాదే. 632
ఉ. ఆనలినాక్షి చూడఁ దమి◆యై కనుపట్టె విభావరీకరుం
డాననబింబ మయ్యెఁ గురు◆లయ్యెను గంధు సుధాధరాధర
శ్రీనిగిడించె మున్ను తనుఁ◆జెందిన కెంపుఁ గృశత్వమెల్ల నా
హానను మయ్యె దానిదర◆హాసము వెన్నెల గాకయుండునే,

విప్రనారాయణచరిత్రము, ఆ 2 పద్య 39, 47.

సీ. చేఁ గొక్కెమెత్తి కు♦బేరువంతటివానిఁ, గాఁపుఁ జేసి గడించు♦కసిరువాటు
కలనైన బగకాంతఁ♦దలఁపనికాఁపును, గనువేసి విటునిఁజే♦సినగయాళి
యేఁచి వల్లమదోఁచి♦ గోఁచిఁ జేతికి నిచ్చి, చిఱుతసన్న్యాసిఁజే♦సినపిసాళి
యవలోకములఁ దేల్చి♦యల ద్వితీయవసిష్ఠు, శిష్టుని భ్రష్టుఁజే♦సినబజారి
గీ. బిగిపి కూర్చున్న కోమటి♦బిడ్డఁ జూచి, బొమలు ముడివెట్టి వలదన్న♦పుత్త్రిఁదిట్టి
తారసిలి రోసపుఁగడంకఁ♦దల వడంక, ననియె నప్పుడు పణ్యవృ♦ద్ధాగ్రగణ్య

బహులాశ్వచరిత్రము, ఆ 5.

క. వెలయాలితల్లికూతుం, గలఁచి విటుఁడు వచ్చెనేని♦ గలుషించినఁ దా
తలతోన మ్రింగు నది ని, ర్మలజల మగు మడుఁగులోని♦ మకరము నుమ్మీ.

ద్వాత్రింశత్సాలభంజికాకథలు, ఆ 4.

సీ. కుఱుచలై తెఱచుగా♦ నెఱసిన వెండ్రుక,లొప్ప మీఱఁగ దువ్వి♦కొప్పు ముడిచి
యిలఁ బాఁతచెప్పుల♦ట్టులఁ బోలి వ్రేలాడు, ........ఆవికచేఁ♦ గుదియఁబట్టి
తొడిగిన కుబుసంబు♦ వడుపున ముడుత లేర్పడియెడునొడలిపైఁ♦ బసపుఁ దాఁచి
యెలుఁగుతోలును మీఱి♦యెంతయు మాసిన, పెద్దపుట్టముచాలఁ♦ బ్రీతిఁ గట్టి
గీ. బొరుసునొసటను జంద్రింపు♦బొట్టు బెట్టి, యదుసుకన్నుల గజ్జలం♦బవరదిద్ది
బోసినోటను దములంబు♦పూనియిట్టుల,విటులఁబలుకూఱునగఁ జేయు♦వృద్ధవేశ్య.

రాజశేఖరవిలాసము, ఆ 3 పద్య 71.

ఆ. కల్లకల్ల లల్లి♦ బెల్లిమాటలబొల్లి, మెల్ల మెల్ల నిల్లు♦గుల్ల సేయు
తల్లి గల్గు లంజె♦యుల్లోలమతి చేర, వల్లవులకు సౌఖ్య♦మిల్ల జగతి.

చంద్రరేఖావిలాసము, ఆ 2.

సీ. తా నున్నకేళికం♦తటికి గణాచారి, పెక్కు నుద్దులు మ్రోయు♦పెద్దబేరి
పేరుకోఁదగినట్టి♦ యాహార శేనియుటంకు, పరులబుద్ధులకుఁ జొ♦ప్పడనిమంకు
కల్లలు పచరించి♦ గద్దించు టాటోటు, పూని యొక్కరికీయ♦లేనిజూటు
కలహంబె కూడుగా♦మెల్లఁగెడు గయ్యాళి,నిష్ఠురత్వము చూపు♦నెఱకరాళి
గీ. బేరజపుగట్టిజంత పా♦డూరిసంత, చలము సాధించు దిట్ట రో♦సాలపుట్టి
లోకముల కెల్ల నూచియ♦ల్లుండ్రిబూచి,యెంచఁగలయుచ్చమల్లియ♦య్యారితిత్తి.
గీ. దాని నుతియింపఁ దరమానె♦ తాటకావ,ధూటితల్లియు పూతన♦తోడఁబుట్టు
శూర్పణఖమేనగోడలౌ♦చూడలంకి,ణీతనూజయె యనఁగవ♦న్నెయకునెక్కె. 798

శుకసప్తతి, ఆ 3.

# పురుషవర్ణనము.

౬౩

సీ. కేకులన్నియు విచ్చి ♦ కేయెండజిగినిండి, కరమొప్పు తెల్లదా♦మరల కంటె
చలిలేని వెలిదీప్తి ♦ మెఱుఁగెక్కి నడిమింటఁ, జరియించు సంపూర్ణ♦చంద్రికం టె
మనుదీఁగజిగిఁదోఁగి ♦ నునుపారి నిగ్గారి, తనరు దిక్కరులహ♦స్తముల కంటె
నిగిడి చేరువలెల్ల ♦ నీలోత్పలద్యుతు, ల్పచరించు హరినీల ♦ రుచుల కంటె
ఆ. నితని కన్ను లొప్పు ♦ నీ రాజు మోమొప్పు, నితని కరములొప్పు ♦ నితని మేని
కాంతియొప్పు ననుచుఁ ♦ గడువేడ్క నన్నికా, చరిక నుఁగొనె రామ♦చంద్రుఁ దవిలి.

భాస్కరరామాయణము, అర. పద్య 136.

సీ. వదనశ్రీభూతలా♦వణ్యాంబుసంభూత, కమలంబులన వీని ♦ కన్ను లమరు
నిక్క మీనులతోడ ♦ నెక్కసక్కములాడు, కరణి నున్నవి వీని ♦ ఘనభుజములు
సంకల్పసంభవా♦స్థానపీఠికవోలె, వెడఁదయై కనుపట్టు ♦ వీని యురము
ప్రతిఘటించుచిగుళ్ల♦పై నెత్తివాతిన, రీతి నున్నవి వీని ♦ మృదుపదములు
గీ. నేరకేటికి యౌసలే దెచ్చి ♦ నీరజాక్షు, సానఁబట్టిన రాపాడి ♦ చల్లి మెచివి
వదనమధనిడి చేసెనో ♦ పద్మభవుఁడు, వీనిఁ గాకున్నఁ గలదె యీ ♦ మేనికాంతి.

మనుచరిత్రము, ఆ. 2 పద్య 36.

ఉ. తీరిచినట్లు లున్నవి వ♦దే కనుబొమ్మలు కన్ను లంటి మా
చేరలఁ గొల్వఁగానయిఁ ♦ జేతులయందము చెప్పఁగిప్పరా
దూరులు మల్చివేసినటు ♦ లున్నవి బాపురె బొమ్మలోని సిం
గారము చేయఁడే సొగసుఁ♦గావలె నీతని రూపరేఖలన్. 801

విజయవిలాసము ఆ 1 పద్య 131.

సీ. పిఱుఁదుభుజంబులవాఁడు ♦ మృగరాజమధ్యంబుఁ, బిడికిఁ బట్టఁ గొను నెన్నడుమువాఁడు
నాతివెండ్రుకలవాఁడు ♦ నీలంపుఁబికరంపు, మెఱుఁగుఁజామనచాయ ♦ మేనివాఁడు
గొప్పకన్నులవాఁడు ♦ కోదండగుణకిణాం, కములైన ముంజేతు ♦ లమరువాఁడు
బవిరిగడ్డమువాఁడు ♦ బన్నిదం బిడి డాఁగవచ్చువందపువెన్ను ♦ మచ్చవాఁడు
గీ. గరగరనివాఁడు నవ్వు మొ♦గంబువాఁడు, చూడఁగలవాఁడు మేలైన ♦ సొబగువాఁడు
వాఁడిమైనత్తి కోడుషున్ ♦ వలయు నాకు, నర్జునుండు పరాక్రమో♦పార్జితుండు. 802

ఆ 2 పద్య 164.

సీ. చక్కఁగా సోగయై ♦ ముక్కుకో పేరు పెట్టినరీతి సంపెంగ ♦ పెక్కు దెగడ
లచ్చియన్నకుఁ దమ్మ ♦ లకును వాదులు పెట్టి, కళకళ నగుమోము ♦ కళల నీన
కండెము ద్దిరిగి బల్ ♦ గొండలు జాపించి, నటువలె నెగుబుజా ♦ లతిశయిల్లఁ
గమ్మఁ దీసినలీలఁ ♦ గనుపట్టు నెమ్మేని, మిసమిసల్ కడు మిఱు ♦ మిట్లు గొనఁగ
గీ. నడుగుల పైడంగు నంచల ♦ నాసఁ గొల్పఁ, జెలఁగి యమ్మక్కరొక్కరొ ♦ చ్చెమ్మ లేక
నిలువు నీరున బండిన ♦ ట్లలరినాఁడు, వేయుఁగన్నులు వలయుఁ బో ♦ వీనిఁ జూడ.

సారంగధరచరిత్రము, (చే. వేం.) ఆ 2 పద్య 42.

సీ. హరినీలములతోడ ♦ సరినీటు పచరించు, కప్పుఁ దేఱెడు నునుఁ ♦ గొప్పచొప్పు
మీ జేరుపడి మంచి ♦ కో జేరువెట్టిన, మురువు చూపట్టెడు ♦ ముక్కుటెక్కు
పాలుగాఱుచుఁ జందు ♦ మేలుఁ గానఁగ నొప్పు, మోహనంబగు నగు ♦ మోముగోము
వాటమౌ రత్నక ♦ వాటమౌ నిది యనఁ, జాల శోభిలెడి వ ♦ క్షంబు దంబు
గీ. తళుకుబంగరుముప్పిరి ♦ తరఁటుఁబోలె, నున్నయది మేను చూడంగ ♦ ము న్నితండు
విటుఁడయి చరించి కొన్నాళ్ళ ♦ వెనుకఁ బసని, యయ్యెఁ గాకిట్టియందమెం ♦ దైనఁ గలదె.

వాల్మీకిచరిత్రము, ఆ 3.

ఉ. చేరలఁ గొల్వవచ్చు బయ ♦ చిప్పిలి గొప్పకు గొప్పకన్నులన్
మూరలఁ గొల్వవచ్చుఁ గడు ♦ ముచ్చట లిచ్చు నెడందవక్షమున్
బారలఁ గొల్వవచ్చుఁ గచ ♦ పాళి భళీ హరికిన్ సమీపపున్
మేరలఁ గొల్వవచ్చు నిఁక ♦ మే లితఁ డీగతిఁ బ్రీతిఁ జేసినన్. 805

ముకుందవిలాసము, ఆ 2 పద్య 211.

సీ. కిసలయారుణకాంతి ♦ బిసరుహంబులఁ గూర్చి, విరచించెనో వీని ♦ చరణయుగము
నీలంపుఁ జకచకల్ ♦ రోలంబములఁ గూర్చి, కల్పించెనో వీని ♦ కచభరంబు
క్రొత్తముత్తెపునిగ్గు ♦ పుత్తడిపైఁ గూర్చి, చేసెనో వీని వి ♦ లాసమూర్తి
తనమబంధుమృదుత్వ ♦ మొనరఁ గెంపునఁ గూర్చి, కావించెనో వీని ♦ కావిమోవి
గీ. యిట్లు సౌందర్యరససార ♦ మేర్చి కూర్చి, తనచమత్కారమునకు ని ♦ దర్శనముగ
వీని సృజియించెఁ గాఁబోలుఁ ♦ విశ్వగురుఁడు, గాకకల్గునె యిట్టి యా ♦ కారమహిమ.

కవిరాజమనోరంజనము, ఆ 5.

సీ. చిపురువాతెఱవాని ♦ చిందంబుచందంబు, నం దనరారు కం ♦ ధరమువాని
నగుమోమువానిఁ బ ♦ న్నగరాజయుగరాజ, దురుతరాజానుదో ♦ ర్యుగమువానిఁ
గొమరుప్రాయమువానిఁ ♦ గోమలశ్యామల, ఘనఘనాఘనకాంతి ♦ గలుగువాని
ఆలిమోపువాని వె ♦ న్నెల జేనిపలచేనిఁ, బలుమాఱుఁ దెగడు తూ ♦ పంబువానిఁ

ఆ. పసిఁడి చేల వాని♦భాగ్యేందిరామంది, రాయతాంబకప్వ♦యంబువాని
సన్నుతేంద్రచంద్రు ♦ నాహ్లాద మొదవంగఁ, జూచి రప్పు డచటి ♦ సుదతులెల్ల.
దిలీపచరిత్రము, ఆ 3 పద్య 157.

ఉ. మారుని గేరు వీని సుకు♦మారశరీరము నవ్యచంద్రికా
సారము తీరుహాసము సు♦సారససారము గౌర కన్నులిం
పారెడుగండుతుమ్మెదల ♦ బారులు నీల్కురుల్ గౌర వీనిసిం
గారము నీరజాసనుని♦కైన మరెం పలుకంగ శక్యమే. 808
మదనసాయకవిలాసము, ఆ 5.

ఉ. కామునిమేను గాలెఁ బలు♦గాకిజయంతుని రూపు గూలె నా
సోముని సత్కళాగరిమఁ ♦ జూడఁగఁ జూడఁ గృశింపఁజాలె నీ
భూమి జనించి యాక్షణమె ♦ పొల్చు వసంతునియాకు రాలె నో
హో మతిపీనిరీతిఁ జెలు♦వొందిరె వారని యెంతు రంగనల్. 809
హంసవింశతి, ఆ 5 పద్య 99.

సీ. చికిలిపిల్లిండిరా♦లకు నుప్పసికకప్పు, తొగజేని నగనొప్పు ♦ మొగముచొప్పు
తియ్యవిల్కానిఁ గ♦దియనొంప నెఱనింపు, జడమెకంబడలింపు♦నడుముసొంపు
చిందమంపముఁగోరు♦జీరకంఠముతీరు, తొవలనుమీఱుఁ గ♦నోయిసౌరు
ఏనికకేల్పస♦నెలయించుఁ దొడసంచు, కలికులనొంచుపా♦దముల మించు
ఆ. నార యీమనోహ♦రాకారరేఖయీ, కాయసౌకుమార్య♦మీయొయార
మెందు నైనఁ గలదె♦యితనితో రతికేళి, సెనయు సుదతిభాగ్య♦మెన్నఁదరమె.
సీ. అలనీలములమేలు♦గలడాలుజిలకించు, మెఱుఁగారు నునుసోగ♦నెఱులతీరు
దరముసుందరముపోఁ♦దరమనాదరమున, డంబారువీనిగ♦శంబుడంబు
సురశాఖివరశాఖ♦నిరవొంద నిరసించు, భవ్యమై దగుదీర్ఘ♦బాహుయుగళి
గొనబారుఘనమేరు♦వును గేరి హసియించు, ధరనెంచసిరిమించు♦ధైర్యమహిమ
గీ. యహహ యిటువంటి విశ్వంభ♦రాధినాథుఁ,గలసి మెలసి విడెంబిచ్చి♦కౌఁగిలించి
మాగుపనుల నలంచక♦మారు పనులఁ, దిరుగు నయ్యింతి మిగులఁ గ♦ల్లరియకాదె.
కవిచకోరచంద్రోదయము, ఆ 2.

గీ. ఆలితచికురాళు లధరపా♦ల్లకము పైని, వ్రాలునని భీతి నయ్యంత♦రాళమునను
నిశితశరకార్ముకంబుల♦నిలిపెననఁగ, నరయఁ గన్నులుఁగనుబొమ్మ♦లలరె హరికి.
గీ. తనరుమీసమ్ములను మీళిం♦డములు వమిని, గన్నుఁదమ్ములపై దుము♦కం దలంప

జేయుచు నాడుచుఁ ♦ జిఱునవ్వునవ్వుచు, నంతటఁ గడుపున ♦ హస్తయుగముఁ
గీ. బెట్టి ముణుకులమెల్లన ♦ యంగపుచును, బాలు నుస్సుచుఁ ద్రావుచు ♦ లీలఁ దప్ప
టడుగు లేసెడి కొడుకుము♦ద్దాడఁ గాను, బడసినటుగానిచో వెఱ్ఱి♦కొడుకుగాఁడె.

భాస్కరపురాణము, ఆ 3.

# యౌవనము.

సీ. తొలుతఁ దమ్మిమొగ్గలతోఁ ♦ దులఁదూఁగసెచనులు, లేరీతి నుండుఁ గా♦ మారవేళ
మునుపు తామరలకు ♦ మొనజూపు తెలికన్ను, లేవిధంబున నుండు♦ యౌవనమున
మొదలఁ జందురునందు♦ గొదవలెన్నెడు నాస్య, పద్మమేగతి నుండుఁ♦ బ్రాయమునను
మున్ను బంగారు పెం♦పుహసించు దేహమే, నైఖరినుండు మేల్ ♦ వయసునందు
గీ. నీవె తలపోసి చూచుకొ♦మ్మావివేక, శీలు నే వర్ణనము సేయఁ♦జాల వాని
మహిత సౌందర్య లీలల♦మన్మథుండు, యక్షరాజాత్మజుండు జ♦యంతుఁడంచు.

నిరంకుశోపాఖ్యానము, ఆ 2 పద్య 10.

సీ. తూఁటిబాల్యంబు వోఁ♦బోఁచి ప్రాయంబున, ట్టినకవాటంబుఁ బా♦టించె నురము
జయరమాలంబన ♦ శాఖలై బాహువు. లాజానుదైర్ఘ్యంబు ♦ నధిగమించె
వదనచంద్రునిఁ జొచ్చి ♦ బ్రిదికెడు చీఁకట్లు, గతినవశ్మశ్రురే♦ఖలు జనించె
నర్థిదైన్యములపై ♦ నడరు కెంపునుబోలె, నీక్షణాంచలములు ♦ నెఱ్ఱవోఁచె
ఆ. సుందరత్వమునకుఁ ♦ జోటిచ్చి దాసంకు, చించె నవఁగఁ గడుఁగృ♦శించె నడుము
జనవరాత్మజునకు ♦ సకలలోకోత్సవా, పాదియైన యౌవ♦నోదయమున. 819

కవికర్ణరసాయనము, ఆ 1 పద్య 58.

మ. తనుకల్పద్రుమకోరకోదయము కాం♦తావీక్షణజ్యోత్స్ననా
తన నానావిధవిభ్రమద్విరదగం♦ధపాలిధి హృద్యాభుజా
ధనురారోపితగంధితేతర విచి♦త్రక్రూరనారాచమ
య్యనవంశాధిపుఁ జెందె యౌవనభరం♦బెంతే విలాసంబునన్. 820

సుదక్షిణాపరిణయము, ఆ 2 పద్య 131.

సీ. ముఖచంద్రమండలం♦బునకు నూనూఁగుమీ, సపుఁజాలు సహజలాం♦ఛనము గాఁగ
సమరువక్షఃకవా♦టమునకు నేవళం, బులు కుందనపుఁదీగె ♦ మోడిగాఁగఁ
జెక్కుటద్దములకుఁ ♦ జెలువంబు మీఱిన, చిఱునవ్వు తేటకొ♦ంజికిలిగాఁగ
సికసమాకచరేల ♦ జెలువంబునకు నవ, తంసదీక్షితతటి♦వ్వల్లిగాఁగ

గీ. వల జయంతుని చందంబు♦వలుని సొబగుఁ, జందురుని మేలుఁగందర్పు♦చక్కఁదనము
దనకు సరిసేయఁదగిన సౌం♦దర్యమహిమ, నతఁడు జెలువారె నపయోధ♦నాగమమున.
అనిరుద్ధచరిత్రము, ఆ 1 పద్య 80.

# వార్ధకము.

సీ. నిర్మలం బనఁజాల ♦ నెరయుచిత్తం బన, నల్లనివెండ్రుకల్ ♦ దెల్ల నయ్యెఁ
దగుమోహపాశబం♦ధంబు జాఱినమాడ్కిఁ, బొదలినయంగముల్♦వదలి వ్రేలె
నింద్రియంబులకోర్కు♦లిఁక నొల్ల ననుభంగి, నుడుగక తలచాల♦వడఁకఁజొచ్చెఁ
దమకంబుప్రాయంబుఁ ♦ బగిలిపోయినమాడ్కి, లోచనంబులచూడ్కి♦నీచమయ్యె
ఆ. వగరుపుట్టెనంతఁ ♦ దెగలె దంతంబులు, నుక్కిసయును దగ్గుఁ ♦ బిక్కటిల్లె
శిరసు నొవ్వఁబొడఁగెఁ ♦ జెపరె మనంబంతఁ, గడిఁదియైన ముప్పు♦కాలమునకు.
భాగవతము, స్కం 6 పద్య 61.

సీ. అంగసంగతపూర్వ ♦ శృంగారకాంతిసా, మగ్రిపలాయన ♦ మంత్రవిద్య
కాంతాకటాక్షవీ♦క్షణశరవ్రాతంబు, కడకునొత్తెడుమూస ♦ కట్టుమందు
చిత్తసంభవునిఁగెం♦జిగురుఁగటారిపై, నాహంగనీని ప♦ట్రాంగిజోడు
తారుణ్యాభరమదో♦దయసమున్నతసత్వ, భద్రవేదండక ♦ పాకలంబు
గీ. మించు ముఖపంకజమునకు ♦ మంచువాన, యాత్మబోధప్రదీపంబు ♦నార్పుగాలి
యలఘు గౌరవకులశైల♦కులిశధార, రోఁతలకురోఁతముదిమియుఁ♦బాఁతుకొనియె.
సుదక్షిణాపరిణయము, ఆ 2 పద్య 38.

సీ. ఇంతకన్నను దుఃఖ♦మిఁక నొండులేదని, తెలుపుచందంబునఁ ♦ దల వడంకఁ
గనుఁగవఁ బొరలు గ♦ప్పెనొ లేదొ చూతము, నొప్పలిక నవలి క♦న్బొమలువ్రాల
యౌవనస్తంభహై♦న్యంబున దేహంబు, గుమిలిగుడారునా ♦ కుదియఁ బడఁగ
స్వచ్ఛవృత్తినిఁ దన♦ర్చంగ ముక్తములగు, భాతి నొక్కటద్విజ♦పంక్తు లురుల
గీ. ఘనజరాభూతహుంకృతి ♦ సెనయ దగ్గు, నొరలసద్వృత్తికర్ణవి♦స్ఫురణనొగుల
వృద్ధభావంబువచ్చిన♦వెనుక జనున, కేమి సౌఖ్యంబు గలదు దై♦త్యేంద్రచెపుమ.
దశావతారచరిత్రము, ఆ 2.

మెలనూలుపికిలించి♦వెలఁదివెన్నెలఁజొచ్చుఁ, బిఱుడియతేటిలో♦నలుకుకరణి
గీ.జడియదగ్గలకుఁగురియుపు♦ష్పాదులమునుఁగు, మావికడనిల్చువిరులనె♦త్తావిఁగ్రోలు
విషమసాయకునేఁపుల♦వినివిపివి, తనువుఁబోఱఁగంగఁదలఁచి యు♦ద్యానరుహాక్షి.
మనుచరిత్రము, ఆ 3 పద్య 31.

చ. చిలుక పురోహితుండు కుచుఁ♦ జెంగట నుండఁగ సిస్పెంజెకల్
వొలఁగఁగఁబోఁచి బంధుగతిఁ♦ దోరపుఁ గోర్కులు సందడింపఁగాఁ
దలఁపు లతాంగికన్న ముదు♦తానకనుంగవ దోయిలించి చూ
పులఁ దలఁబ్రాలు పోసె నృప♦పుత్త్రినిపై విరహాగ్నిసాక్షిగన్. 830
రాజశేఖరచరిత్రము, ఆ 3 పద్య 131.

చ. పులకకదంబముల్ నినిచె♦ ఫుల్లముఖాబ్జవిలాససంపదల్
దొలఁగె మరాళికాగతులు♦ మూకము లయ్యె శ్రమాంబుపూరముల్
వెలివిరియంగఁజొచ్చెఁ బురి♦విచ్చి నటింపఁగ నెమ్మి కోరికల్
బొలఁతుకయందు మన్మథుఁడు♦ పూర్ణముగా శరవృష్టిఁ జూపఁగన్. 831
కవికర్ణరసాయనము, ఆ 3 పద్య 39.

గీ. ముదిత కపురు శిలీముఖ♦మ్ములు శిలీము, ఖమ్ములయ్యెను ఖగములు♦ఖగములయ్యె
పరిమళమిళచ్ఛరమ్ములు♦ శరము లయ్యె, నాప విరహానలంబుపై♦ నగ్గలింప.
ఇందుమతీపరిణయము, కు. ధూ. ఆ 3 పద్య 22.

చ. ప్రిసవశరాఖ్యయోగి బహు♦భంగులభావనలిచ్చి మర్దనం
బెసఁగఁగ ధాతువేర్చి బలి♦యించి రసంబు నిశాంతమంతయు
న్వసువుగఁ జేయ మైమఱచి♦ నాతిగళన్మణిభూషలెన్న దా
స్తసఖులుచే పల్కినను♦ బల్కదు చూచియుఁ జూడ దెంతయున్. 833
ఉ. కొంచక యంబుధిం బడిన♦ కొండలపత్త్రములూడ్చదయ్యె నూ
అంచులకత్తి దానియుమ♦టంతయు నెంతని కంతుచేతినూ
అంచులకత్తి హత్తి జవ♦రాలికుచాద్రుల ముంచెఁ బత్త్రిరే
ఖాంచితవైభవంబెడల♦ సాతతబాష్పమహాపయోనిధిన్. 834
సీ. నిబిడదుస్సహదీర్ఘ♦ నిశ్వాసపవనంబు, పఱచు తేఁటులఁ బరా♦బరులు సేయ
నుజ్జ్వలావయవతా♦పజ్వాలికలవేఁడి, చివురుజొంపములపై♦ నవఘులింప
లలితాననేందుమం♦డలపాండురచ్ఛాయ, వనరుహావళివశా♦వళి యడంప
శ్రమజలాభివ్యక్త♦ సహజసాంకవమదా, మోదంబు చిలుకల♦ మూల కొత్త

ఆ. తెనఁగు భసలములను ◆ గెసలములను నీర, జాతములను గీర◆జాతములను
విగ్రహింపనీని ◆ విరహంబె తోడుగా, వెలఁది వెడలె విపిన ◆ వీథులకును. 835
వసుచరిత్రము, ఆ 3 పద్య 106, 107, 132.

సీ. తెలఁతముక్కారయందు ◆ నీలంబు గాదు నూ, తెలివనకొత్తు ము◆త్తియము గాని
యువిదసందిష్టబా◆హుపురులు గావు నూ, మితి చూడనిడిన యూ◆ర్మికలు గాని
సుదతిపాలిండ్లఁ గ◆స్తూరినల్లు గాదు నూ, కనుదోయికాటుక ◆ కప్పు గాని
రమణికర్ణికల వ◆జ్రపుదీప్తి గాదు నూ, పాంగెంపుఁదునుకల ◆ రంగు గాని
గీ. యూర్పువేఁడిమి గృశతవా◆ష్పవయమున, గండపాండిమఁదత్తత్ప్ర◆కారములను
గాఁచఁబడియెడు నోవిహం◆గమపురంధ్రి, యింక నీచేత నున్నదీ◆యింతి బ్రదుకు.
ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 3 పద్య 87.

మ. కలలన్ గూడినవేళ నెట్టిపాలయ◆ల్కాల్పుట్టెనో యేమి సి
వలనన్ వప్పుఘటిల్లెనో యెఱుఁగఁ ద◆త్స్వప్నాగమామర్షవి
హ్వాలితస్వాంతయ పోలె నిద్రనెఱయన్ ◆ వర్జించెఁ బద్మాక్షియ
త్తు లహోరాత్రములందుఁ బద్మకుముద◆న్యూస్ఫూర్తిన్ విడంబింపఁగన్. 837
,, ,, ఆ 4 పద్య 77.

ఉ. వీణియముట్టుటల్ మిగుల ◆ వింతలు పెంపుడుచిల్కబోదతో
రాణదలిర్పఁ బల్కుట గ◆రంబపురూప మపూర్వ మెంతయుం
బ్రాణసఖీరహస్యముల ◆ భ్రాంతియుఁ గ్రీడలు కానివాని యా
యేఃవిలోలలోచనకు ◆ హెచ్చిన మన్మథచేష్ట నయ్యెడన్. 838
కళాపూర్ణోదయము, ఆ 4 పద్య 58.

సీ. కలలోన నాత్మేశుఁ ◆ బలుమఱుఁబఱ్చించి, తద్ధ్యానమెపుడుఁ జి◆త్తమునఁ జేసి
యతనిసంప్రాప్తికి ◆ నభిలాష మొనరించి, తద్గుణావళులు కీ◆ర్తనము సలిపి
యతనిపై భక్తిప◆క్షతికి నిద్రిలఁజేంచి, తవలాభగతిఁ గృశ◆త్వము బొంది
యతఁడొక్కఁడే తక్క ◆ నితరంబు మఱెరోసి, తత్ప్రకాశావ్యాప్తిఁ◆ దప్పి యణంచి
గీ.యతనిఁగనుదాఁకసంతాప◆మతిశయిల్లఁ, దత్స్వరూపంబు గాఁగనెం◆తయును జూచి
యిష్టసాయుజ్యమునకు న◆నేకదశలు, గనె వియోగిని యనఁగఁ ద◆త్కంజవదన.
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 4 పద్య 74.

చ. తమువునవిండి కాలుకొను◆తాపము సోఁకు సహింపలేక జీ
వనమతిశైత్యకాంక్ష నిజ◆వాసము వెల్వడి కర్ణకూపకీ
అనసరసప్రఫుల్లకమ◆లద్వితయంబున విశ్రమింప వే

గ నటకు వచ్చెనో యనఁగఁ ♦ గన్నులఁ బ్రాణము నిల్చె లేమకున్. 840

చంద్రభానుచరిత్రము, ఆ 4 పద్య 54.

శా. ఆరామామణికంఠభాగమున సా♦హా మించు ముక్తామణీ
హారంబుల్ దొలుదొల్త నీలప్రసరా♦లై యొప్పె నాపిమ్మటన్
హీరాళంపు మెఱుంగుఁగెంపుసరులై ♦ యింపారె నత్తోడుతన్
హీరాంచత్సరులై తనర్చె విరహా♦గ్నిప్రౌఢిమోదగ్రతన్. 841

చంద్రాంగదచరిత్రము, ఆ 2 పద్య 147.

చ. వడకుచు నీవిటారికిని ♦ వైనము వోయెద సన్నమాత్రలో
నడుమున మేను చిక్కి వల♦యంబులు జాఱెను నీది యుంగరం
బడిగ యొసంగినంగరము♦నందు ధరించెదఁ గంకణంబుగాఁ
జెదరక యుమ్మటంచు వెల♦చేడియ దూసె విటుండు నిల్వఁగన్. 842

శృంగారరసమంజరి, గుచ్ఛ 2.

సీ. కొండ పైఁబడినట్లు ♦ కొంతసే పేమియు, ననలేక మిన్నుఁ గ♦న్గొనుచు నుండు
మిగులవెక్కసమైన ♦ మీనాంకుశిఖిపొగ, ల్వెలికిఁ దార్చినరీతి ♦ వెచ్చనూర్చు
విరహంపుఁబెనునీటి♦వెల్లువ కెదు రీఁది,నట్లుగాఁ జేతు లి♦ట్టట్టు వైచు
ధనముఁ గోల్పోయిన♦దారిగాఁ బుష్పాడి,మేనంట విరిపాన్పు♦మీఁదఁ బొరలుఁ
గీ. గోలఁకులనుజాఱు కన్నీరు♦గోటమీటుఁ,దొడరియడిగెడునిల్లాండ్ర♦తోడమాటుఁ
జింతనుజెమర్పఁ జెక్కిటఁ♦జెయ్యమర్చు, నలరువిలుకానిపటుధాటి♦నవ్వధూటి.

తారాశశాంకవిజయము, ఆ 4 పద్య 29.

చ. విరహమునం గృశించుచును ♦ వెన్నెలయెండల నెండి కంతుపూ
శరములవానలం దడిసి ♦ చందనశైలపుఁజల్లగాడ్పుని
బ్బరపువడన్ శ్రమంపడి త♦పం బొనరించుచునున్నదాన నో
నరవర నీకునై యిటుల ♦ నావల పేమని యింక దెల్పుదున్. 844

కవిరాజమనోరంజనము, ఆ 5.

శా. నీరేజాక్షికి హారమౌక్తికములన్ ♦ నీలంబులై తైలముల్
బ్రాఱంగాఁ బగడంబులై పిదప వ♦జ్రాకారము ల్పూని వి
స్ఫారస్వేదకణంబులం దడిసి సు♦వర్ణం బయ్యె నాదుర్గమ
స్మారస్ఫారశరాగ్నిహైమపటమ♦చ్ఛచ్ఛాయమై తోఁచినన్. 845

పరిబంధరాజ శిరోభూషణ ప్రకృష్టబలరామచరిత్రము, ఆ 8.

గీ. విరహపాండురతాజ్యోత్స్న♦ విలసనంబు,నతనుతాపాతపస్ఫూర్తి♦యలముకొనఁగ

చేయిపగలే యలివేణి ♦ యింక రాదు, ముదిత నేత్రాంబుజములఁ ♦ మోడ్పఁగాంచె.

కవిజనరంజనము, ఆ 2 పద్య 26.

చ. మునినికరాగ్నికీలములు ♦ మాటికి నక్కడ సంభ్రమమ్ము మీఱఁగన్
సరములు నారఁగి కన్గవను ♦ జాలుగఁ జిప్పిలి వెచ్చవెచ్చనై
దొరఁగె నిజాశ్రుపూరముగఁ ♦ దోఁగి ధరన్ జలమైననాయెడన్
జుఱజుఱ పోకఁగాఁ బొదలెఁ ♦ జొప్పడ నేనిఁక నేమి సేయుదున్. 847

కవిచకోరచంద్రోదయము, ఆ 3.

చ. తెలకొని మూర్ఛయొసఁగ పడము ♦ నిండెడఁ గాపపు మెండ గాయ ను
జ్జ్వలమతిఁ జాంపకంబనెడి ♦ చంద్రికనిండఁగ హారరత్నభా
వళిజిగిమాయ చేపవలు ♦ వారక తోఁపమి నింతి వీక్షణో
త్పలజలజంబులయ్యెడను ♦ బాయక పాఱ దరిమోడ్పమై మనెన్. 848

సుబ్రహ్మణ్యవిజయము, ఆ 5.

సీ. హృదయస్థితానంగుఁ ♦ డెడ నేయుములుకుల, మొనలు పైఁదోఁచెనా ♦ మొలచెఁబులక
లానంగశిఖికిఁదో ♦ డైవచ్చు కమ్మవి, వలు లన వలపుటూ ♦ ర్పులు జనించెఁ
దద్వాతనిహతిచే ♦ తవియోగజలధియు, ప్పొంగెనా ఘర్మాంబు ♦ పూర మొదవె
నానటివెల్లిపై ♦ నలుపుడిండీరకాంచు, తులు నాఁగ నెవ్వెనఁ ♦ దెలుపు వొడమెఁ
గీ. తెలుపునకుఁదోడు నీడమై ♦ నెలయు పోక, కలితపలాక్తికములు పెనుఁ ♦ గాకఁగ్రాఁగి
బాష్పధారలఁ గరఁగి ♦ పైఁ బైనిగ్రమ్మఁ, గొమ్మపాలిండ్లలదెవెండి ♦ కొండలటుల.

భద్రాపరిణయము, ఆ 3 పద్య 45.

ఉ. కుందనమున్ హసింపఁగల ♦ కోమలికోమలదేహవల్లిపైఁ
గందళితంబులయ్యె సిత ♦ కాంతులు సంతత మప్పుకుంకుమ నిం
పొందఁ మనంబులోన నిడి ♦ యున్న మనోభవుఁ డందు నాతనిన్
గ్రిందుగ జేయ పుష్పశర ♦ గాఢరుచుల్పయిఁదోఁచెనో యనన్. 850

శృంగారరసాలవాలము, ఆ 1.

సీ. శారదపూర్ణిమా ♦ చంద్రవరా బింబంబు, పంకేరుహంబుపైఁ ♦ బర్వళించె
హారిద్రరుచిసాంద్ర ♦ హాటకవల్లికి, బహుళ పాండిమము సం ♦ ప్రాప్తమయ్యెఁ
జారుశాణోల్లీఢ ♦ హీరదర్పణముల, రమణీయముక్తాఫ ♦ లములు వ్రేల్చెఁ
శైత్యసౌరభపూర్ణ ♦ జలజకోశావాప్తి, ననలమాలికలు వ్లా ♦ నంబు లయ్యె
గీ. నెట్టి యుత్పాతములఁ గంటి ♦ మిట్టివేళ, నెట్టులైనను నిఁక పట్టు ♦ పట్టి హాని
పట్టి హృద్గతమును గను ♦ పెట్టి తగిన, దిట్ట మొనరింతమని సఖుల్ ♦ చుట్టియపుడు.

శశిరేఖాపరిణయము, ఆ 2 పద్య 9.

సీ. మగువకు విరహమే ♦ మండువేసవిదోఁపఁ, గామాస్త్రశరకర ♦ కరములలరె
విడువక వెచలెడు ♦ వేఁడినిట్టూర్పులే, వడగాడ్పు లగుచు వీ ♦ వంగసాగె
తరగనిమధురసు ♦ ధాధార లూరెడు, నధరంపుఁగొలను శూ ♦ న్యతవహించె
మోహసంతాపస ♦ మూహంబులనియెడు, తరులు చిగిర్చి బం ♦ ధురములయ్యె
గీ. నందుసంప్రాప్తముగఁ దన ♦ యాశ లనెడు, శారికాపికభృంగమ ♦ యూరకీర
సముదయంబులు నిరతంబుఁ ♦ జాలఁబ్రబలి, మించువేడుకతో సంచ ♦ రించుచుండె.

సీ. అతివకుమోహ మే ♦ యతివృష్టికాలమై, పరగ నాశామేఘ ♦ పటలిఁ గ్రమ్మెఁ
బంచబాణునిపుష్ప ♦ బాణప్రవర్షంబు, లందంద కుచగిరు ♦ లందు గురిసె
విరహప్రవాహంబు ♦ విస్తారతరముగా, సాగి మానసమహా ♦ సరసి నిండెఁ
గడునిబ్బరంబను ♦ కట్టిగొబ్బునఁ దెగి, కొల్లగాఁ దాపంపు ♦ వెల్లివరద
గీ. మిక్కుటంబుగఁ బ్రవహించి ♦ మించె నందు, పటుతరములైనతనమనో ♦ భ్రాంతులనెడు
మకరకచ్ఛపమండూక ♦ మత్స్యముఖర, జలచరంబులు నిరతంబు ♦ సంచరించె. 853

కుబ్జాకృష్ణవిలాసము, ఆ 1.

సీ. తనుభూమి మునుఁడు గు ♦ ప్పినమోహబీజము, లొత్తిలకలెత్తెననంగఁ ♦ బులక లమరెఁ
బులకవైరునకుఁ బెం ♦ పుదలిర్పనలుఁగులఁ, బఱచు పెన్నీరన ♦ వఱలెఁ జెమట
చెమటనీట ఘనసార ♦ తము నానుటం బలెఁ, గలయఁ బాండిమ మల్లె ♦ గాత్రవల్లి
గాత్రవల్లినిటూర్పు ♦ గాడ్పు పెన్సోకులఁ, గదలెనాఁ గన్పట్టెఁ ♦ గంపకలన
గీ. కంపకలనాప్రకంపనా ♦ కంపనాతి, వేల బహులతరంగిత ♦ విరహదుఃఖ
జలధికడఁబొంగిపొరలెనా ♦ ఝుడితిబాష్ప, సలిలధారాఝరీఝళం ♦ ఝళలు సెలఁగె.

ఇందుమతీపరిణయము, నృసిం. ఆ 4 పద్య 18.

చ. చిలుకలు దాయలయ్యె నసు ♦ చిన్నెలు చూడ హాళిక్కియయ్యె నె
చ్చెలులసహింపుటయ్యెఁ గడుఁ ♦ జీఁదఱ కన్నొసనయ్యె నెల్లచో
నలజడిచూడనయ్యె నల ♦ యంచలఁదిట్టఁగనయ్యెఁ గొన్నినల్
తలనుగిడంగి తాలుచుట ♦ లాయరుదయ్యె నెలంతకయ్యెడన్. 855

శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధము, ఆ 1 పద్య 151.

సీ. పువ్వులుముడువదు ♦ పూబోఁడి యయ్యావి, తోపవిందునల్లుని ♦ తూపులనియొ
యద్దంబుఁజూడదు ♦ ముద్దియ దానఁ గన్పడుమోము మున్నీటి ♦ పాపయనియొ
కీరంబుఁ జేముట్టదు ♦ విరిబోఁడి యయ్యావి, క్రొవ్వాడుతుమ్మెద ♦ గుంపులనియొ
కొలఁకులపల్కులు విన ♦ దెలనాఁగ యవి యెల్లఁ, బల్కుమెత్తంబుల ♦ పల్కులనియొ

గీ. యంతకంతకు వలపంత♦వింతదోఁప, మరుఁడు పూములుల్కులఁ దరించి♦కరము నేఁప
నెడఁ గప్పడివయిఁ గోర్కు♦నేఁపుచూప, సన్నగాలియు నెమ్మేను♦చెన్నుమాప.
రసికజనమనోరంజనము, ఆ 2 పద్య 52.

# విరహి.

ఉ. లీలయెల్లఁ గానఁబల♦లేఁకగు రాకనుబోలె నొప్పఁ గెం
గేలు కపంబశాఖకుదిఁ♦గీల్కొనఁ జేసి వసంతవిభ్రమో
న్మీలితబాలవల్లికరియ♦మేలగు చూడ్కులఁ గించిపావక
జ్వాలయపోలెఁజిత్తము ని♦జంబెరయింపఁ బోడంగెఁ జూచితే. 857
భారతము, అర. ఆ 6 పద్య 148.

సీ. పొడనూపిన్నలైన♦వడిఁ బట్టి నమకట్టి, పరికించి కానక♦బమ్మరించు
మెలఁగినయట్లైనఁ♦బలికింపఁ దలఁచి ని, రూపించి లేమి న♦శ్రులువహించుఁ
గదిసినయట్లైనఁ♦గౌఁగిలింపఁ గడంగి, యారసి బొంకైన♦నలఁతనొందు
నొడఁబడ్డయట్లైన♦నదరి పైకొనఁ జూచి, చెన్నఁటి యగుటని♦శ్చేష్టఁ బొరయు
గీ. లలితవివిధవిహారంబు♦లకు లఁతాంగి, యెలసి పొలసినయట్లైన♦నెలమిఁ గలసి
యభిమతక్రీడ సలుపంగ♦నప్పళించి, వెదకి రిత్తైనయల్ గని♦విహ్వలించు. 858
భారతము, విరా. ఆ 2 పద్య 301.

ద్విపద. అస్తోకనిరుపాధి♦కావస్థలవిను, ఘాస్తమితేంద్రియుఁ♦డైయట్లుచూపు
వగపునిట్టూరుపు♦జ్వరము వెయ్యుటయు, నొగినిరాహారంబు♦నున్మత్తవృత్తి
మాన మూర్ఛలు లేమి♦మరణంబుఁగంగఁ, దానెన్నఁబడు నవ♦స్థలునూడఁబడియు.
పండితారాధ్యచరిత్ర, దీక్షాప్రకరణ.

క. ఏమెయి నడుగులు లేనిది, యేమలు కపర్కశాల♦యిదిగాదొకో యే
రాముఁడఁగానో రాముఁడు, రాముం బెడఁబాసి క్షణము ♦ బ్రతుకఁగఁగలఁడే.
శా. ఏమెట్టీయది మెట్టుగా దిద వనం♦బేరాకుమారుండనో
సౌమిత్రి విను నీవు రాముఁడవె వ♦త్సా నిక్క మేరాముఁడన్
భూమీశుండవు రామచంద్రుఁడవు హా♦భూమీజ చంద్రాననా
నేమేఁ యెక్కడ నున్నవాఁ డట చా♦వేయుల్ల మల్లాడెడిన్. 86

శా. శీతిగ్మాంశుఁడు నేపఁ♦జొచ్చె నను నే♦యేసాఁట సర్పోష్ణపం
క్తిం తండింబుఁడె యానొ లక్ష్మణుఁడ నే♦కేమౌదు నేఁ జెప్పుమా
నాతోఁబుట్టువు గావె నాథ మఱి యే♦నాథుండ నిక్కంబుగా
సీతానాథుఁడ నెందు వోయితివె యో♦సీతామనోవల్లభా. 862

చ. తపనుఁడు వేఁపఁ జొచ్చె ననుఁ♦దమ్ముఁడ వృక్షముక్రిందఁ జెట్టు నా
తపనుఁడు కాయి లేఁడు వసు♦ధావర చంద్రుఁడు గాని చంద్రునిన్
నృపసుత యెన్నె తెంగితివి ♦ నీవు మృగాంకము చూడ నున్కి హా
చపలమృగాక్షి చంద్రముఖి ♦ జానకి యెక్కడ నున్నదానవే. 863

సీ. తాళంబ కానవే♦తాళఫలస్తనిఁ, గుందంబ కానవే♦కుందరదనఁ
దిలకంబ కానవే ♦ తిలకరమ్యలలాటఁ, గమలంబ కానవే♦కమలవదన
హరిణంబ కానవే ♦ హరిణబాలేక్షణ, సింహంబ కానవే♦సింహమధ్యఁ
బికరాజ కానవే♦పికమంజులస్వనఁ, గీరంబ కానవే ♦ కీరవాణి
గీ. లలితకలభంబ కానవే♦కలభగమన, బంధుజీవమ కానవే ♦ బంధుజీవ
యైన జనకనందనసీత♦ననుచు రాముఁ, డచట నచట నీగతివాని ♦ నడిగి యడిగి.

సీ. అదె చలత్తన్వంగి♦యనుచు నల్లనఁ జేర, నది చూతలతయైన♦నట్ల నిలుచు
నదె మంజులాలాప ♦ యనుచు నల్లనఁ జేర, నది కోకిలంబైన♦నట్ల నిలుచు
నదె లోలలోచన♦యనుచు నల్లనఁ జేర, నది కురంగంబైన♦నట్ల నిలుచు
నదె నీలకుంతల♦యనుచు నల్లనఁ జేర, నది మయూరంబైన♦నట్ల నిలుచు
ఆ. నదె మహీజ నన్ను ♦ నచటికై చేసన్న, చేసె ననుచు నల్లఁ♦జేర నదియు
లలిత మలయపవన ♦ చలితపల్లవమైన, నట్ల నిలుచు రాముఁ♦డచట నచట. 865

భాస్కరరామాయణము, ఆర, పద్య 258, 260, 261, 262, 265, 275.

సీ. ఆసక్తి నాలేమ♦యావనవనములోఁ, నెన్నండు విహరింతు♦నేసరేఁగి
లీల నాకోమలి♦పాలిండ్లకస్తూరి, రొంపిలో నెన్నండు♦బ్రుంగుడౌదు
జేవ నాజవరాలి♦లావణ్యసరసిలోఁ, మునుఁగుదు నెన్నండు♦మునువుదీఱ
నీహ నామోహిని♦బాహుపాశంబులఁ, దగులక యెన్నండు♦దగులువడుదు
గీ. నంచుఁ జింతించు నున్నర♦టించుఁ బొదలు, మరులుకొని రణభోజన♦మానివచన
రచన మారణమంత్రిక్షు♦రపరిభూత, ఘోర విరహభూతమహావి♦కారమునను.

వరాహపురాణము, ఆ 1 పద్య 58.

సీ. సుదతికి నెదురుచూ♦చుచుఁ గ్రొవలత్న్యంబు, గోచరింపకయున్న♦వేచెమత్సుఁ
జీవు చిటుకుమన్నఁ ♦ జెలువమ్మటైలచప్పుడని చెవిఁ జెట్టి యుం♦డందపముఁకుఁ

గీ. నెప్పుడునటించునృపతియా♦నెలఁతఁదలఁచి,తలఁచినగమగుసాత్త్వికో♦దయదశాను
భావములఁ జెందు నున్మద♦ప్రసవబాణ,బాణమగ్నతఁగాంచుఁదా♦పమువహించు.

వసుచరిత్రము, ఆ 3 పద్య 80, 94.

సీ. వరపద్మమకరము♦ల్కానగతంబులు నీకు, సతి నీవి యింతచే ♦ సడలరాదె
బహుళతచ్ఛదరాశి ♦ భవదక్షియుగళంబు, నేత్రాంచలంబింత ♦ నెరపరాదె
యనఘదివ్యాహార♦ఖని నీమ కెమ్మోవి, లేమ ముద్దింత పా♦లింప రాదె
తావిగంబూరంపు♦దీవి నీమొగమొక్క, పలుకింత నాపైని ♦ జిలుక రాదె
గీ. చక్రవిజయంబొనర్చె నీ♦చన్నుదోయి, కంచుకం బేల యింకఁ జా♦లించరాదె
నిర్మలామూల్యగుణరత్న ♦ నిధికి నీకు, వనజముఖి తాల్పినమదియేల♦వదలరాదె.

వసుచరిత్రము, ఆ 6 పద్య 84.

సీ. తరుణికెంగేలంచుఁ♦దమిఁ బట్టి కటకటా, చిగురాకెయిది యంచుఁ♦జిన్నవోయి
పెలఁదిపాలిండ్లంచు♦వెసనంటి చెల్లబో, పూగుత్తులే యంచుఁ♦బొలుపుఁ దఱిగి
చెలువపయ్యెదయంచుఁ♦జేసాఁచియయ్యొపా, రాగోదయమెయంచు♦రహిఁదొఱంగి
రమణి వేనలి యంచు♦రతికాంక్ష నొడిసి హా, తేఁటిమొత్తమెయంచుఁ♦దెల్లబాఱి
గీ. యకట యనిమిత్తకృపఁ దాన♦యరుగుదెంచి, హితవు నెఱపెడి హంసితో♦హృద(యమిచ్చి
పలుకనికృతఘ్నునకునాకుఁ ♦ బ్రాప్తమగునె, యట్టియువతిపొందనుచుఁదా ♦ వా(త్మఁగుందు.

ప్రభావతీప్రద్యుమ్నము, అ 3పద్య 21.

శా. ఆవిప్రోత్తము వజ్రపంజరనిభం♦బై నిశ్చలంబైన స
ద్భావం బంగనసాహచర్యగుణసం♦పర్కంబునన్ లోహమై
గ్రావంబై దృఢదారువై తరుణవృ♦క్షంబై ఫలప్రాయమై
పూవై తన్మకరందమై కరఁగెఁబోఁ♦బోనీళ్లకుం జల్చనై. 874

వైజయంతీవిలాసము, ఆ 2 పద్య 139.

సీ. ఆహారమింపౌకు♦చాగ్రిమానకయున్న, నాహారమింపుగా♦దజ్జవదన
చెఱకుబా లొదవు వా♦తెఱయీనిచోఁగంతు,చెఱకుపాలౌదునే♦చిగురుఁబోణి
కళలుదేరెడు నెమ్మొ♦గమ్ము ముద్దిడకున్నఁ, గళలు దేరవు సుమీ ♦ కంబుకంఠి
వలకేలనిదురమున ♦ నలరింపకున్న న,వ్వలరే నిద్దురరాదు ♦ కలువకంటి
గీ. నేఁడు గాదుగదే ప్రేమ ♦ నీకు నాకు, నాటియున్నది మదిఁ జిన్న♦నాఁటినుండి
యిటుల నేకాంతసమయమే♦న్నఁటికిదొరకు,నేఁడదప్పించుకొనియెద♦వేలతాంగి.

విజయవిలాసము, ఆ 2 పద్య 194.

చ. ప్రతిఫలితాస్య శాంకుప్రసు ♦ భానుముఖం బని యెంచి నాయకుం
డతులితలీలమీఁదఁ బరి♦హాసముఁ జేసిన నింతయేనియున్
బ్రతివచనంబు లేమిఁ గని♦పైఁబడి పానముఁ జెందె నంచుఁ దా
నతి పులకాంకితం బయిన♦హస్తముచేఁ దడవుం బ్రియంబునన్. 879

శృంగారరసమంజరి, గుచ్ఛ.2.

సీ. కలికి నెమ్మోముజా♦బిలి రంగులొదవక, చెలువంపుఁ గనుదోవల్♦చెలఁగుటెట్లు
సకియనున్నెమ్మోవి♦చక్కెరల్ జుఱ్ఱక, పలుకాఁకఁ జెనుచప్పి ♦ వదలుటెట్లు
తెలనాఁగ బిగికవుం♦గిలిఁ జోడుఁ బోడుగక, యెదనంటు బలుతూఁపు♦లెడలుటెట్లు
కొమ్మసింగారంపుఁ♦గొలఁకున దేలక, బలువిరాలపువెట్టఁ♦బోలఁగుటెట్లు.
గీ. మెలఁతుకలమిన్న నిద్దంపు♦మేల్పసిండి, గలుగకుండిన మదిలోన♦గాటమగుచు
నిచ్చలును మోహచ్ఛికలఁ కని♦ప్పచ్చరంబు, విడుచు టెటులింకఁ బరికింపఁ♦బుడమివేల్ప.

నీలాసుందరీపరిణయము, ఆ 2 పద్య 36.

సీ. ఘనవేణి వేణిశృం♦గారమారసినంత, మోహాంధకారంబు ♦ ముమ్మరించె
హరిమధ్యమధ్యమై♦ఖరి స్మరించినయంతఁ, బికటుధైర్యము బట్ట♦బయటఁ బడియె
నతనాభినాభిసౌం♦దర్య మెంచిన యంతఁ, బలువివేకము నుడి♦బడఁ దొడంగె
మృగనేత్రినేత్రల♦క్ష్మి గణించినయంత, నెదలోన చాంచల్య♦మిరవుకొనియెఁ
గీ. బాటలాధర యధరంబు♦నీటుఁ దలఁచి, నంత ననురాగమంతయు♦నలవి మీఱె
నింతి మైనిగ్గు లపుడు వి♦శ్రాంతిహేతు, విపుడతిశ్రాంతిహేతువే♦నెటుల నైతు.

సీ. పొదలపై మెదలుతు♦మ్మెదలార మీఘాక, చెలికటాక్షము కింత♦కలుగుదాఁక
గములుగాఁ దెమలు కీ♦రములార మీజోక, హరిమధ్య చేరి మా♦ట్లాడుదాఁక
వగలచేఁ బొగలుసం♦పెఁగలార మీకాఁక, మృగనేత్రి యంగీక♦రించుదాఁక
విరులచే వఱలుతా♦మరలార మీవీఁక, శుకవాణి మొగమెత్తి♦చూచుదాఁక
గీ. నవమునవముగ మొలయు ప♦ల్లవములార, ప్రబలు మీరేఖ కాంత చే♦పట్టుదాఁక
తగదు చలమిఁక దైవమే♦దారి నైనఁ, దలఁపు లీడేర్పఁగా నేర్పఁ♦దరుణిఁ గూర్పు.

తారాశశాంకవిజయము, ఆ 4 పద్య 53,96.

ఉ. మరునిశరాళి కోర్వఁ దర♦మా దరమా మఱునాటి లాడ వీ
వరమిది నెంచమంచి తెలి♦వా తెలివా మురువార సెజ్జగా
విరులొనరింపఁ గోయఁగద♦వే పదవే పదవేగ లీల నీ
పరిగల మేడఁజూడ వని♦తా వనితా జనతా శిరోమణీ. 880

శకుంతలాపరిణయము, (ఫ, వేం.) ఆ 3.

సీ. కుంతలదేశంబు♦కొల్లలాడితి మింకఁ, గరముఁ గైకొను టెంత♦కాంతి మాకుఁ
గాంచిసీమవ్యాప్తి♦మించితి మింకొక, యూరుచేకొను టెంత♦యువిద మాకు
వత్సదేశావృత్తి ♦ వఱలితి మింకొక, యధరదేశం బెంత ♦ యతివ మాకు
నతనురాజ్యాభిషి♦క్తతఁ దనరితి మింక, రుచకాప్తిఁ గనుట యెం♦త చెలి మాకు
గీ. గురుపయోధరశైలముల్ ♦ గొంటి మింక నితంబములనాను టెంతయో♦తరుణి మాకు
ననుచు నర్మంబు లాడె న♦య్యబలనాన, నాన తొననకంజాత♦యయ్యె నపుడు.

సుమనోమనోభిరంజనము, ఉల్లా 5 పద్య 85.

ఉ. సాదుసుగంధమిష్ట మిదె ♦ చందనగంధికి నంచు సాంకవా
మోదకు మోదదం బనుచుఁ ♦ బూను జవాది సువాంగి వేణికిన్
ప్రోదియొనర్చువంచుఁ దగు ♦ పుష్పవలదండలు కంఠమందు స
త్యాదరలీలఁ దాల్చు జల♦జాక్షుఁడు రాగసమేతచిత్తుఁడై. 382

రుక్మిణీకల్యాణము, (జ. వేం.) ఆ 4.

సీ. తొలుదొల్తనధికచా♦పలవృత్తిఁ జెంజెను, సుదతి నీకనుదోయి ♦ జూచుతరిని
యాపిదపను సాకే♦కనురాగ మందెను, సుదతి నీకెమ్మోవిఁ♦జూచుతరిని
యావెన్క నల్గెను ♦ యటుచిక్కి వీడక, సుదతి నీపాలిండ్లు ♦ చూచుతరిని
యాపిమ్మ టట్టట్టు♦లయ్యెను యొయ్యన, సుదతి నీహారంబు ♦ జూచుతరిని
గీ. యావలను శూన్యమయ్యె మ♦ధ్యంబుఁ జూడ, నీరజాయతలోచన ♦ నెమ్మనంబు
యెటుల సైరింతు మోహంబు ♦ యేను నకట, దైవ మీగతిఁ జేసె ని♦ర్దయతచేత.
సీ. కోవెలలార మీ♦కూకల వెందాఁకఁ, బికకంఠ నన్నుఁగూడి ♦ పెనఁగుదాఁక
భ్రమరములార మీ♦రవము లింకెందాఁక, నళికచ నాతో మా♦ట్లాడుదాఁక
కీరములార మీ♦యారము లెందాఁక, శుకవాణి కరుణించి ♦ చూచుదాఁక
రాయంచలార మీ♦రాపు లింకెందాఁక, హంసయానతో గూడి ♦ యాడుదాఁక
గీ. పల్లవములార మీపదు♦పాటు లెల్లఁ, బల్లవాధర నన్నుఁజేరి ♦ పల్లవాస్త్ర
కేళియుల్లాసమునఁ గూడి ♦ కృతకశైల, చారుసౌధంబులను గ్రీడ ♦ సల్పుదాఁక.

*రంభానలకూబరవిలాసము, ఆ 4. *

సీ. హృదయవాసినియైన ♦ మదిరాక్షి లేనవ్వు, లభినవపాండిమం♦బలవరింప
స్వాంతసంగతయైన♦కాంత లేఁజూపులు, తనువునఁ జాంచల్య♦మనువు పఱుపఁ
జిత్తచారిణియైన ♦ మత్తకాశినిమోవి, కన్నులనెఱసంజఁ♦గదలుకొలుప
సంకల్పగతయైన♦పంకజాననకొను, తొనవం బంతకం♦తకునిగుప్ప

---

* మూలమున నున్నట్లు వ్రాయఁబడియె.

గీ. మానసావాసయైనభూ◆జానిపుత్త్రి, పిఱుఁదుకోర్కులకెంతయుఁ◆బెంపు నెఱపఁ
బలవరించుచు నాచంద్ర◆భానుఁ డప్పుడు, నిలువరింపఁగలేక క◆న్నియఁదలంచి.
చంద్రభానుచరిత్రము, ఆ 4 పద్య 109.

సీ. నెలఁతుక మోవి తే◆నియలానఁగాఁగోర, నేచవియును నాల్క◆కెక్కదయ్యెఁ
బడఁతుకమైతావి ◆ పసమెఱుంగఁగఁగోర, ముక్కునకే తావి ◆ సొక్కదయ్యెఁ
జిలుకలకొల్కి ను◆న్నులుకులు వినఁగోర, వీనులకే పాట ◆ వెలయదయ్యెఁ
గాత్రిరంటి నెఱసోయ◆గముఁ జూడఁగాఁగోర, నొండేదికన్నుల ◆ కొప్పదయ్యెఁ
గీ. పలిరుఁబోఁడి నెమ్మెయి మెత్త◆దనముఁగోర, నొడలికి నిజడదయ్యె వే◆యొకటిసోఁక
నేమి చెప్పుదుఁ గవ్వడి◆యింతినొక్క, దానిఁ దక్కంగ మఱియున్న◆వాని మఱచె.
రసికజనమనోరంజనము, ఆ 2 పద్య 28.

---

# కాసారము.

—:0:—

సీ. కమనీయకమలినీ◆కల్హారదళకేస, రాన్వితజలముల◆నర్ఘ్యవీథియుఁ
దరళతరంగహ◆స్తములఁ బాద్యంబును, నమదచక్రిసారస◆మధుపహంస
రతులఁ బ్రియోక్తులు◆సుచిరవాస్తీరని, వేశవచ్ఛాయల ◆ విశ్రమంబు
మందసంచారిత◆మారుతంబుల నురు, తాపనోదనమును ◆ దగిలి యెపుడు
ఆ. నాచరించుచును స◆మంచితాతిథ్యజన, సేవనమునఁ దనదు ◆ జీవనంబు
ఫలము నొంద నొప్పు ◆ పంపాసరోవరం, బెదురఁ గాంచి రన్న◆రేంద్రసుతులు.
భారతము, ఆర, ఆ 6 పద్య 364.

శా. కాంచెన్ శక్తిమహాగభీరముల స◆ద్గాఢస్వరోద్భాసిభృం
గాంచత్పంచలనంబు పక్షికలనా◆ద్యత్యంతసంతోషమున్
సంచారప్రియమీనకూర్మగరయుః◆క్సర్పాదిసద్వైశ్యమున్
పంచేషూన్నతబాణతూణముల స◆ద్వృంగంబుఁ గాసారమున్. 888
చాడేశ్వరీవిలాసము, ఆ 3.

మహాస్రగ్ధర. అరుణాంభోజాతవర్గం ◆ బతిలసితవిభా◆సాజ్జరాగావినీలాం
బురుహవ్రాతంబు నీలం◆బులు విమలనవాం◆భోజములో శంఖములో శి

సీ. తనసొమ్ములైయున్న♦ఘనతరపద్మరా, గపరిఘాపటలి న♦క్కడలఁ బర్వఁ
దనజీవనస్థితి ♦ మనియెడునని రాజ,హంసమండలము నె♦య్యమునఁ గొల్వఁ
దననిత్యమధురత్వ♦మునకుఁ దక్కినవారిఁ, జౌకసేయుచుఁ గవీ♦శ్వరులు పొగడఁ
దనకు నీడై సంత♦తంబును వికసించి, పుండరీకంబులు ♦ పండి మెఱయఁ
గీ. దన్నుఁ బాయని సిరిఁజూచి ♦ తలఁగ లేక, వేడ్కఁ బద్మదామాళులెల్లనే♦వింపుచుండ
సరసులకునెల్ల మేటియై ♦ సార్వభౌము, చందమున నుల్లసిల్లి యా♦సరసి మెఱసెఁ.

చిత్రభారతము, ఆ 3 పద్య 3.

మ. మాపీతకంకణావళుల♦తో వలమానమహోర్మికాంతిపా
లావటలంబుతో సమవ♦లంబితపుష్పపరిభ్రమంబుతోఁ
దైపువహించు లోకనద♦కాంతులు చెంతల గొంతరింపఁగా
నాపుటభేదసంప్రఁ గమ♦లాకరముల్ కమలాకరాకృతిన్. 903

లక్ష్మీవిలాసము, ఆ 3 పద్య 57.

చ. పొలుపు వహించె నాసరసి ♦ పుష్పాశులన్ మధుబిందుచంద్రికం
బుల నలతేంట్లఁ జెంగలువ ♦ పువ్వులఁ దమ్ములఁ జాలఁ జిత్రమై
యలరులవింటిజోదు మద♦మారఁగఁ దాఁ గొలువుండు రత్నకం
బళియునుబోలె నాచికచ ♦ పంకజనేత్రిలకింపొనర్చుచున్. 904

పరమయోగివిలాసము, ఆ 4 పద్య 102.

సీ. పుండరీకంబులు♦పొందుసేయుచునుండు, సతతంబుసారంగ♦సమితితోడ
శాశ్వతతుహినప♦క్షంబులఁ గ్రీడించు, నానందమునఁ జన♦నండజములు
లాలితపద్మజా♦లకరేణువులఁ గూడి, యలరుతావులఁ బొల్చు ♦ హరిచయంబు
శంబరమ్ములతోడ♦సన్మైత్రిఁ జరియించు, సంతోషమునకోక♦సముదయంబు
గీ. గలిగి యన్యోన్యవైరమొ♦క్కటను లేక, ప్రసవసంపదనురభిప్ర♦భావయుక్తి
మౌనివరునాశ్రమముఁబోలి ♦ కానుపించె, రుచిరతరలీల నట్టిస♦రోవరంబు. 905

నాగరఖండము, సంపుట 2 ఆ 5 పద్య 78.

ఉ. గాత్రము మోయలేని యువ♦కంబుల కోర్వకపడ్డమబ్బునాఁ
జైత్రిని పూవుఁదేనెకణ♦జంబున శీతఘృణిస్ఫురన్మణీ
ధాత్రి జనించు దైవతప♦థప్రతిబింబ మనంగ వచ్చు లో
కత్రియభర్తకిడ్డ జము♦కాణమనం గొలనొప్పె నెంతయున్. 906

బహులాశ్వచరిత్రము, ఆ 2 పద్య 52.

మ. కమలాక్షున్ స్ఫుటచక్రధారణమునన్ ♦ గాంభీర్యలీలాయతిన్
సముదస్తస్థిత్యాశ్రీలీముఖోచ్ఛ్రితజన♦స్తోమాహితాశ్వైకక
క్రమరూఢిన్ ఫణినాథాభినుతసా♦కల్యాణగాంభీరమున్
సమకీయంబగు శార్ఙ్గపాణికరణిన్ ♦ గాసారము వెల్గొందెన్. 908

విష్ణుమాయావిలాసము.

సీ. నిండు తామరల సోలు♦మెండు కుముద్వతీ, సిరులొప్ప నెలంత♦పదులుగాఁగ
మించు వెన్నెలసోయ♦మించునంచలమాయ, తీరైన పాఁకిటి ♦ చేయ గాఁగఁ
జననివల్లులుగప్ప♦పసిఁడిపమ్ములయొప్ప, సొంపైనజంగాయ ♦ సొమ్ము గాఁగ
నేఁపు మీఱఁగ బొంగు♦నెత్తురగల్వలరంగు, జిలుఁగుఁజందురుకావి♦వలువ గాఁగ
గీ. నొర కనుపట్టినపుడు కా♦సారలక్ష్మి, యతులితోత్సాహనవ్యావి♦హారకేళి
విందులై తన్నుఁగనఁగోరి♦వేడ్కవచ్చు, నుడుపులకు నాత్మవిభవంబుఁ♦జూపెననఁగ.
నలచరిత్రము, సి. ధ. ఆ 3 పద్య 244.

సీ. యక్షనాయకునిభాం♦డాగారమునుబోలె, మకరకచ్ఛపవర♦మహితమగుచుఁ
గమలామనోహరు♦కరతలంబునుబోలెఁ, బటుశంఖచక్రవి♦స్ఫార మగుచు
బృందారకాధీశు♦మందిరంబునుబోలె, ననిమిషామృతపరి♦వ్యాప్త మగుచుఁ
గామనీయకతార♦కాపథంబునుబోలె, ఘనరాజహంసపం♦కలిత మగుచు
గీ. భూరి దిఙ్మండలముఁబోలెఁ♦బుండరీక, కుముదసంసక్తమగుచు న♦క్షుద్రలీలఁ
జాల నొప్పారు సారకా♦సారమొకటి, గాంచి రప్పుడువ్వియచ్చర♦కమలముఖులు.
రసికజనమనోభిరామము, ఆ 4 పద్య 66.

మ. వనితారత్నములార చూడుఁ డదె యా♦స్త్రాక్రీసముద్భాసియై
ఘనవిస్ఫారవిహారమై భవసమ♦గ్రంపై మదుచ్చంక్రమా
యనమై యాశ్రితహంసమండలసము♦ద్యత్పాదసంక్రాంతమై
గనుపట్టె న్నగనాంతరాళమున ని♦క్కాసారమింపొందఁగన్. 909
మిత్రవిందాపరిణయము, కుం. వేం. ఆ 3 పద్య 4.

సీ. నాళీకనాళాళ♦నాళీకసమ్భారి, డోలీకృతోర్మిరిం♦ఖోళిసహిత
మంగీకృతాంభోజ♦భృంగీకృతాభంగ, సంగీతమాధురీ♦సంగతంబు
శీతానిలకిశోర♦ధూతాంబుజపరాగ, జాతావృతాష్టది♦గ్జాలకంబు
తీరామ్రకదళిఖ♦ర్జూరామలకముఖ్య, సారాగసుమవారి ♦ సౌరభంబు
గీ. చారుతరశీతలాంభఃప్ర♦పూరమధుర, తానిరాకృతసురగోను♦ధారసంబు
గాంచె శోకాఘకలకలా♦రవవికీర్ణ, మగు నొకానొక కాసార♦మరసి చెలులు.
విజయనందనవిలాసము, ఆ 2.

సీ. ఇందిందిరాలక♦బృందసంపదఁ జూపి, బెడిదవుతళుకుక♦న్నెఫుకుఁ జూపి
చక్రవాకస్తన♦సౌభాగ్యములు చూపి, యరుణోత్పలాధర♦స్ఫురణఁ జూపి
యతులమృణాలబా♦హావిలాసముఁ జూపి, సౌగంధికాంగవా♦సనలు చూపి
లీలాతరంగవ♦ళిప్రకాశతఁ జూపి, యరవిందచరణసుం♦దరతఁ జూపి
గీ. యింపుఁ బుట్టించుచున్నది♦హృదయమునకు, నిక్కొలఁకువింతచూచితి♦వేవయస్య.
కలితయౌవనరూపరే♦ఖావిలాస, విభ్రమోదారయౌ ప్రౌఢ♦వేశ్యవోలె. 911

కవిరాజమనోరంజనము, ఆ 5.

సీ. కాదంబ కాదంబ♦కాదంబరుచిరంబు, ధీవర ధీవరా♦ధిష్ఠితంబు
భ్రమర విభ్రమరవ♦భ్రమరవిద్యాంకంబు, గురుసత్వ గురుసత్వ♦పరివృతంబు
సారస సారస♦సారసద్వినుతంబు, చక్రాంగ చక్రాంగ♦సౌష్ఠవంబు
పానీయ పానీయ♦పానీయవిభవంబు, నవకోక నవకోక♦నదయుతంబు
గీ. రాజిలవ్రాతకచ్ఛప♦రాజిలంబు, సమకరద్వంద్వవీచికా♦సమకరంబు
మధురకైరవనిస్సర♦న్మధురసంబు, సారమతు లెంచ నచటికా♦సారవరము. 912

వాసవదత్తాపరిణయము, (వ. వీ.) ఆ 3 పద్య 10.

సీ. తృణబిందుకర్దమ ♦ ధీవరపాఠీన, సహితమై తాపసా♦శ్రమము వోలె
దారుణబకకంక♦ధార్తరాష్ట్రవ్యాప్తి, నభినుతవ్యాసకా♦వ్యంబు వోలె
చిరకాలయుతమహా♦జీవనస్థితియందు, వనమంత్రసిద్ధదే♦వతయు వోలె
కచ్ఛపమకరశం♦ఖస్థూలపద్మవి,స్ఫూర్తుల ధననాథు♦పురము వోలె
గీ. పుష్కరోత్ఫుల్లహల్లక♦పుండరీక, భరితమకరందవిభ్రమ♦భ్రమరనికర
గాయకోత్తమ బంహిష్ఠ♦గానఘోష, రూఢిసుఖదంబు పుణ్యాస♦రోవరంబు. 913

పర్వతపురాణము, ఆ 5.

గీ. భావభవకేతనాహ్వరా♦జీవజీవ, జీవనాలంకృతైకరా♦జీవజాల
జాలకామోదపూర్ణప్ర♦సాదసార, సారసాకర మచటికా♦సారచయము. 914

వేంకటేశ్వరవిలాసము, ఆ 1 పద్య 18.

క. సల్లలితకమలకైరవ, సాల్లకమకరందపరిమ♦ళాకీర్ణమిళ
త్కల్లోలమాలికాంచిత, ఫుల్లంబగు నొక్కసరసి ♦ పొలుపెసఁగంగన్. 915

మైరావణచరిత్రము, ఆ 2 పద్య 75.

క. కవిచక్రరాజహంసా, శ్యవనములై సర్వమంగ♦ళాన్వితములై
శివుని తెఱంగునఁ దగుకైరవధవళములగు సరోవ♦రము లవ్వీటన్. 916

మిత్రవిందాపరిణయము, (రా. జ. రం.) ఆ 1.

సీ. జిగిసాఁచుఁదీఁగెలు ♦ చిగురుపచ్చలు గాఁగ, నళినపాళికము లింద్ర♦నములు గాఁగ
ఫుల్లరక్తాంబుజం♦బులు పుష్పకలు గాఁగ, ఘనకేసరంబు ల♦క్షతలు గాఁగ
మధురసపూరంబు♦మధురాజ్యధారగా, మధుకరరాజి ధూ♦మంబు గాఁగఁ
దీరభూజములు బు♦త్విక్స్తవంబులు గాఁగఁ, పక్షిఘోషములు మం♦త్రములు గాఁగఁ
గీ. దమ్మిమొగ్గలు బలియూప♦దారువులుగ, మత్స్యకచ్ఛపాళి గావించు♦మానినీజ
నాతిమానాశ్వమేధమ♦హాధ్వరంబు, నెంచనుతలంపు నింపు న♦కొలనిసొంపు.

కృష్ణాభ్యుదయము, ఆ 1 పద్య 83.

సీ. విమలసన్మానసో♦పమతఁ బొంగావున, రాజహంసవిహార♦రమ్య మగుచు
వరపద్మముఖ్యప్ర♦స్ఫురితంబు గావున, మృదులహరిశ్రీము♦ఖేష్ట మగుచు
సువిధార్తరాష్ట్రాళి♦యుక్తంబు గావున, గురుదివిజాభంగి♦గరిమ మగుచు
వర్ణితకమలాధి♦వాసంబు గావున, ఘనశంఖచక్రసం♦కలిత మగుచు
గీ. నంబరమురీతి నలకాపు♦రంబుభాతి, నిభపురి తెఱంగు నచ్యుతా♦కృతిహొరంగు
వరుసనిరవొందు నొకసరో♦వరముఁ గాంచి, రంచితారామసీమన♦య్యబ్జముఖులు.

భద్రాపరిణయము, ఆ 3 పద్య 74.

ఉ. చారుసుగంధిపత్త్రివిల♦సత్కమలోత్పలకైరవాళియు
న్భూరిసువర్ణపత్త్రికవి♦భూషితచక్రిమరాళపంక్తియు
న్వారిరుహాంతరస్థమధు♦పానమదోత్కటభృంగరాజశ్రృం
గారసుధాభనారియును ♦ గల్గి చెలంగె సరస్సు లచ్చటన్. 919

కృష్ణజన్మఖండము, ఆ 2.

ద్విపద.

పగలురేయును బ్రహ్మ ♦ పంపించెననఁగఁ, దొగలుతోయజములం♦దువికాసమొందు
గమలాసవంబావి ♦ కడకుఁబోలేక, భ్రమపడ్డగతినందు♦భ్రమరముల్ దిరుగు
హంసపద్మములకు♦ననుబంధి యనఁగ, హంసలు గ్రీడించు♦నందు నేప్రొద్దు
నెలఁతల కుచముల ♦ నీటులుచూచి, జలదుర్గములసొచ్చె ♦ చక్రంబు లనఁగ
నోరంతప్రొద్దునం♦దుండుఁజక్కవలు, పారసనామంబు ♦ సహజంబుగాఁగ
లోలదుల్లోల♦కల్లోలడోలికలఁ, దేలుచు నందుండుఁ♦దివుటపెగ్గురులు. 920

ప్రభులింగలీల, పి. సో. ఆ 3.

గీ. పద్మినీయోగమతిమృదు♦భావయుతర, జోవలేపప్రికాశమ♦త్యంతమధుర
రసము లామోదములు గల్గి ♦ రసికు లెన్న, సరసులనఁ దగికన్పట్టు♦సరసులచట.

భరతాభ్యుదయము, ఆ 1.

# జలక్రీడ.

—:0:—

సీ. ఖచరాంగనల కుచ♦కాశ్మీరపంకంబు, వనజపరాగంబు ♦ నొనరిలినరి
సురకన్యకల కుచ♦సురదారుకుసుమముల్, రమణీయహేమాంబు♦జములుఁ బెనఁగ
నరకామినుల ముఖ♦పరిమళశ్వాసంబు, మెలుపారుకొలని తె♦మ్మెరలు నెనయ
నహినందనల కంఠ♦హారముల్ కరయంత్ర, గళితాంబుధారలఁ♦గలసి వెలుఁగఁ
గీ. విమలవిలాసముల్ జలదేవ♦తావిలాస, భాతితోఁ గూడి పరభాగ♦పదవిఁ గ్రాల
నట్టి జలకేళి సలుపుదు♦రఖిలభువన, వరనితంబినులాసరో♦వరము నందు. 922

కుమారసంభవము, ఆ 10 పద్య 38.

సీ. నునుఁగాంతిదొలఁకెడు♦ఘనకుచయుగళంబు, లదరంగఁ జిలుకుల♦నాడి యాడి
మెఱుఁగులు మాగెడు ♦ మృదుకరవల్లిక, లల్లాడఁ జల్లుపో♦రాడి యాడి
జిగి తొలంకెసఁగెడు ♦ మొగములు నిక్కుచు, నడఁగుచుండఁగ నీఁదు♦లాడి యాడి
మించెల్లదిక్కులు ♦ ముంచి చెల్లెడుమేను, లలసి క్రాలఁగ నోల♦లాడి యాడి
గీ. తేలి నిలుచుచుఁ గరములఁ♦దేలిచనుచు, మునిఁగిపోవుచు నొర్తొర్తు♦ముంచిపట్టి
లోఁతునకు నొయ్యఁ దిగుచుమ♦నీఁతలేని, యచట మిన్నకయీఁదుచు♦నాడి రర్థి.

నిర్వచనోత్తరరామాయణము, ఆ 8 పద్య 49.

సీ. కలయంగ నలఁదిన♦కస్తూరి పెల్లుగ, జలమున కెల్లను ♦ గలుగఁజేసి
కుచమండలంబుల ♦ కుంకుమచర్చల, నీరెల్ల జేవుర♦నీరు చేసి
తనులిప్త సురభిచం♦దనకర్దమంబున, వారి నెల్లఁ బునుఁగు♦వండు చేసి
మాలల నవపుష్ప♦మాలికావితతుల, వనమెల్లఁ దెట్టువ♦గొనఁగఁ జేసి
ఆ. యలకలలికవీథి ♦ నంటఁ గస్తవలఁగెం, పెలయఁ గామచిహ్న♦లెల్లఁ జెలయ
నెలరు నాతు లమరి ♦ జలకేళి గావించి, కొలను వెడలి రంతు ♦ లలసగతుల. 924

విక్రమసేనము.

ఉ. [illegible]లును పిచికాపసలు ♦ నారిరుహాంబులు వక్త్రపంక్తులున్
చెలువగు నాభులున్ నుడులుఁ ♦ జేతులు రక్తసరోరుహంబులున్
జలజలకంబులున్ మధుప♦జాలము నీవ్వడఁ దేలి సల్పి మిం
[illegible] ♦ [illegible] నృపాలసన్నిభన్. 925

[illegible]

సీ. అరుణారవిందముల్ ♦ లేక య్రోయిక్కనోకాని, చిగురుటాకుల నింత ♦ చేరరావు
పుండరీకంబులని చాల ♦ బుజ్జగించెనోకాని, మరుచక్రముల నింత ♦ మరఁగిరావు
చక్రవాకములని ♦ సవరించెనోకాని, కరికుంభముల నింత ♦ గదియ రావు
గండుమీలని చాల ♦ గౌరవించెనోకాని, పూర్ణచంద్రుల నింత ♦ పొంది రావు
గీ. తరఁగలాత్మీయధనముల ♦ దాయలైన, చరణములు నితంబములును ♦ జన్నుఁగవలుఁ
గన్నుఁగవలుఁ దోతేర శృం ♦ గారజలధి, తరఁగ లింతులు పైకొన్నఁ ♦ దలఁకినట్లు.
ఉత్తరహరివంశము, ఆ 5 పద్య 66.

సీ. ఒకరాజహంసంబు కోరఁ ♦ గకచంచుపుటి నొక్కి, పూఁబోఁడి వలిగుబ్బ ♦ వాడిచిపోయె
నొకజేజేసి వికస్వ ♦ రోల్లాసగతి నొక్కి, కలికికన్నులవెంట ♦ బెళుకుమనియె
నొకకచ్ఛపకిశోర ♦ మొకసి కెంపుల నొక్కి, తొయ్యలిమీఁగాలు ♦ ద్రొక్కిపోయె
నొకమిండతుమ్మెద ♦ యుఱికి యుక్కున నొక్కి, తరుణీధమ్మిల్లంబు ♦ తన్నిపోయెఁ
గీ. బోవుఁగాకేమి యీనుల ♦ పొంతఁబోక, యెడల మేమేమి పుట్టునో ♦ మఱియు ననక
విభులఁ బిలికొల్పుమన కాని ♦ వెడలరైరి, మెలఁత లాకొలన జలకేళి ♦ మీఁదిబాళి.
కకుత్స్థవిజయము, ఆ 2 పద్య 88.

శా. ఓలోలాంబక యోల యోల యన నో ♦ లో లంచు మేలంబునన్
లోలంబాలక యొత్తు ద్రుంకి ఓసవ ♦ ల్లీల్ దున్మి తూఁటాడి కెం
గేలం జిప్పి తటాలునన్ [illegible] ♦ క్షీకాంబునాథాంబుజా
క్షీలోకంబు జయించి వారిలయశో ♦ స్ఫూర్తిఁ జెచ్చెంచుకంబునన్. 928
వసుచరిత్రము, ఆ 3 పద్య 162.

లయగ్రాహి.

నెమ్మి సరసీరుహములం దగరదే ♦ లమ్ములఁ గుచమ్ములఁగ, చమ్ములను జూపిక్కనయ ♦ నమ్ములఁ బరాభూ
తమ్ములను బోలె విరి ♦ తమ్ములను రక్తజల, జమ్ములను గోకమిథు ♦ నమ్ములను శైవా
లమ్ములను భృంగనిచ ♦ యమ్ములను మీననిక, రమ్ములఁ గలంగఁ జల ♦ వమ్ములు భజింపం
గొమ్మలపుడెంతయును ♦ సమ్మదకుతూహలభ, రమ్ములనొనర్చిరిక ♦ రమ్ము జలకేళిన్.
కళాపూర్ణోదయము, ఆ 6 పద్య 230.

గీ. అక్షిసమతాభిలాషని ♦ జాపరాధ, మోర్చిని సహింపు మనుచుఁ గా ♦ ళ్ళోలు సతుల
కాళ్ళపైఁ బడి పెనఁగు నా ♦ గండుమీలు, తప్పు గలవారి కది విహి ♦ తంబుగాదె.
గీ. వనజనేత్రలజిలుఁగు పా ♦ పడలు నీటఁ, బడియ సర్వాంగములు గానఁ ♦ బడుచునుండె
నల్పగుణములు గలవారి ♦ నంటు నట్టి, పాపు పైటను బడకుండు ♦ వారె యెచట.
[illegible], ఆ [illegible] పద్య 100, 101.

గొరిమ్మకుచముల్ గానరాఁ♦గొమిరె తీఁగఁ బటో, కంబెల్లి గాగాంధ♦కారమయ్యెఁ
బిబుఁదులు గానరా♦బిసరుహానన తీఁగ, దీప్తి కాంతరమెల్ల ♦ దీపు లయ్యె
గీ. బాహువల్లు గానరాఁ బద్మ♦పాణి తీఁగ, సరని యెల్లమృణాళైక♦సదన మయ్యె
సంగములు గానరాఁ గాంచ♦నాంగి తీఁగ, సారసాకరమెల్ల బం♦గార మయ్యె.

ఉత్తరరామాయణము, ఆ 8 పద్య 82.

ఉ. అడుగుల నంటి యూరుస్థల♦కాని నితంబము లంటి నాభినిం
బుడికి వళుల్ స్పృశించి కుచ♦ముల్ పదిముట్టి శిరోవతంసము
న్బడఁతుల గూర్చి కాని జ♦లంబు పరంపరలక్ష్మి కావలిం
పదవ్వుదు నిల్చి కైకొనియెఁ♦బద్మ్రయతం బ్రితిబంధనైపుణిన్. 939

శకుంతలాపరిణయము, కృష్ణ. ఆ 2 పద్య 168.

ఉ. కలికి యొకర్తు నీట నొక♦కాలను నిల్చి తపంబుఁ జేసిన
ట్లలయుక నున్నఁ జూచి సఖి♦సాకి యొకర్తు పిలుంచి నేఁగి పై
జలములు నల్లి తమ్మిగమి ♦ చాటున డాఁగిల దాని మోముగాఁ
దలఁచి జలంబు నప్పై నొక♦తామరపైపయి నవ్వి రంపఁదున్. 940

క. బాలామణి యొక్కతె యొక, కేలను కచ్ఛోరమొక్క ♦ కేలను వస్త్ర
శ్రేలను జేపట్టుచు నిం, ద్యాలక్ష్మికి సాటి యగుచుఁ ♦ దద్దయు మెఱసెన్. 941

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 3.

సీ. స్తనకుంభములనీఁదఁ♦దలఁచి లేదప్పరమున, నుఱుపయొక్కతె మునుఁ♦మున్ను మునిఁగెఁ
బ్లవమానలలనోరు ♦ లలితమోచలనూఁపఁ, గొని దానితోడనేఁ ♦ మునిఁగె నొకతె
నిజబాహులతలపై♦నిలిపి వయస్యకుఁ, గరయుగ్మమున నీఁతఁ ♦ గఱపె నొకతె
పూఁదెప్పనీఁదెడు ♦ పొలఁతిని గెలిగింపఁ, గొలిపియొక్కతె తేప♦గెలుబుకొనియెఁ
గీ. బనఁటులఁగుచంబులనణంచి♦పట్టి యొకతె, యసఁటులొక్కతె కురువులఁ♦బెనచి పట్టి
బాహువుల నొత్తు తరఁగల♦పై కుఱుకుచు, నీఁదిరవ్వేళ సతిపేల♦మోద మొదవ.

శంబరూపాఖ్యానము, ఆ 2 పద్య 27.

ఆ. చేతులెత్తి చల్లి ♦ జెదిరిన బిందువుల్, కుచము లెల్ల ముంచి ♦ కొన్నిఁ గరులు
కుంభముల నడల్చి ♦ తోయకణంబులు, కుంభములును బోలె ♦ కొమరు మిగిలె.

విశ్వకర్మపురాణము, ఆ 4.

సీ. జలజంబులను జిమ్మ ♦ చెలిమోము జడిపించె, మదుఁడ నేననియొక్క♦సరసిజాక్షి
నిదిదాని వెదకించె ♦ నంగనామణి నేనే, యని సిగ్గుమునిఁగి♦బాసఁ ధరించి

తోయ్యలి యొత్తు కు♦త్తుకబంటి నుండి యే,శశినంచు భ్రమియించె♦నకియనోర్తు
చనియు శైవాలావృ♦తాంగియై యటఁ దేలి యేరాశలుపని దాని♦యేపణంచె
గీ. నుచిదలందఱు నీకేళి ♦ నొక్క నొక్క, విపులవేషంబులను జడి♦పించు చుదక
మున మునుంగుచు నటఁ దేలు♦చును సకేల, సలిలకేళి యొనర్చి ర♦త్యాహలీల. 944

నాచికేతూపాఖ్యానము, మిక్కి. మ. ఆ 2.

సీ. కప్పు కొప్పులనుండి♦కాఱుచుండెడు నీరు, చిఱుతమబ్బులవాన♦చినుకు లట్లు
గబ్బి గుబ్బలనుండి♦కాఱుచుండెడు నీరు, బలితంపు మలలపై♦న్వాఁక లట్లు
కమ్ర మోములనుండి♦కాఱుచుండెడు నీరు, సొగసుచందురుమంచు♦సోనయట్లు
కలికి కన్నులనుండి♦కాఱుచుండెడు నీరు, నెత్తమ్మిపూవుఁదే♦నియల యట్లు
గీ. వాతెఱల నుండి తొగజాఱు♦వాఱునీరు, పలుచనగు దొండపండుల♦పాల యట్లు
వింతవింతలఁ దనరెఁ గ♦న్విందు గాఁగ, లేమ లట నీటిలో మున్గి ♦ లేచు నపుడు.

రసికజనమనోరంజనము, ఆ 3 పద్య 36.

---

# మ ధు పా న ము.

చ. సురుచిరపానపాత్రమున ♦ సుందరి యొక్కతె కేల నిండుచుం
దురుఁడు ప్రకంపితాంగకము♦తోఁ దిలకించెఁ దదాననాంబుజ
స్ఫురితవికాసవైభవము♦సొంపు లడంకువ ద్రుచ్చలింపఁ జె
చ్చెరఁ జనుదెంచిపట్టువడి♦చేష్టడి భీతి వడంకు చాడ్పునన్. 946

నృసింహపురాణము, ఆ 3 పద్య 97.

గీ. తొట్రుకొనునడ్గులును వెడఁ♦ద్రొక్కుఁబల్కు, లుల్లములసిగ్గులుంగమి♦యునుఘటించి
జవ్వనులకును మఱల శై♦శవముఁ దెచ్చె, వారుణియు నెట్టిసిద్ధౌష♦ధీరసంబొ.
సీ. కోపంబులేక భ్రూ♦కుటిఘటియించుఁ బో,లింపంగ లక్ష్యంబు♦లేక చూచుఁ
బిలువకుండఁగఁ గైనఁ♦బలుకునోహోయని, బయలూఁతగొనఁజూచుఁ♦బాఱఁజూచుఁ
గారణం బొందులే♦కయు నవ్వు వికవికఁ, గాలిలెడు నీడపై♦సోలఁ జూచుఁ
జేరున నెచ్చెలిఁ ♦ బేరెల్గుగునఁ జీఱు, మనను లేకయుఁ బాడు♦మానిమాని

దాఁగినవయ్యెఁ గనుంగవ ♦ మందకుఁ గ్రిమ్మరి విశిశ్చాంత్వమున్
బూనుచు నిల్చె దివ్యమణి ♦ పుత్త్రిక కైవడి శౌరి ముందటన్. 1121

భద్రాపరిణయము, ఆ 4 పద్య 88, 89, 95.

గీ. చెలిమికత్తెలు ముందుకు, ♦ సిగ్గొకింత, వెనుకకును దోయఁ మెల్లన ♦ వెలఁది నడిచి
పడకయిలు చేరుతఱి మొల♦బంటిసిగ్గు, ముంచిజాలువాఱుచుఁదల♦మున్కలాయె.

రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 100.

## —♦ సఖీజనపరిహాసవాక్యములు. ♦—

సీ. పలుగర సేయక ♦ పసుపును సలిపించు,కొనక మొగంబు మ♦జ్జనము లేక
పరిశుద్ధవస్త్రంబు ♦ ధరియింపక కచంబు, లాగఁ జిక్కువుచ్చి కొ♦ప్పుగముడువక
పత్త్రగరితిలకధా♦రణ మొనర్పక నవీ,నముగఁ గాటుక లోచ♦నముల నిడక
తగునట్టి సొమ్ములు♦ దాల్పక దినముఖ,నియమపుణ్యంబు లె♦ల్లాయఁ జలుపక

గీ. నీవు తడయుట చోద్యమో ♦ నీరజాక్షి, ఘనముగాఁ బోలుశ్రీమతుల్లు ♦ గాక...
చిన్నెలింపునఁ జూచుకొం♦చున్నదాన, వేమొ విఘ్నమై వచ్చితి♦ మేలుఁ గలము.

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 5 పద్య 66.

క. రావే ముద్దులగుమ్మా, రావే బంగారుబొమ్మ ♦ రావే కొమ్మా
నీవిభుఁ డిచ్చినవస్తువు, లేవే యని పిలిచి దాదు ♦ లింపుగఁ బలుకన్. 1124

సీ. అర్ధచంద్రునిసమీపమ ♦ నమరి యున్నవి తేఁటు,లటే నేఁటి యిది విస్మ♦యంబు గాదె
యహహ మోడి వాడిన ♦ యంబుజంబులు పగ,లంగిన యిదియె చో♦ద్యంబు గాదె
బింబంబుపైఁ గెంపు ♦ పెంపుగా నుదయించె,దరుణిరో యిది విచి♦త్రంబు గాదె
కరికుంభములమీఁదఁ ♦ గనుపట్టె నెలవంక, తరలాక్షి యిది యద్భు♦తంబు గాదె

గీ. యనుచుఁ జెలువలలోఁ బ్రౌఢ♦ యైనయట్టి, భామకనుఁగీటి తనతోడి♦ పడఁతితోడ
వాయికనుచూపి కేళిచి♦హ్నములుకొన్ని, బయలుపడకుండధ్వనియొప్పఁ♦బలికెనపుడు.

క. ఇవి యేమి చిత్రమే చెలి, కువలయములు కెంపు మీఱు ♦ కొనియుండంగా
వివరింప విడి విచిత్రిం,'బన్నా యని యటులు పల్కె ♦ నదియున్ మగుడన్.

సీ. పూఁదీవె యేటి కిం♦పుచాలంగి వాడెనో, వాడదే యినకర♦ పీడనమునఁ
గరికుంభముల కేల ♦ గాయము ల్దగిలెనో, కలుగవే యతనుసం♦గరము వెలయఁ
బత్త్రింబు లేటికిఁ ♦ బస దప్పి సడలెనో, సడలవే యతిశయ♦స్పర్శనమున
జక్కవకవ కేల ♦ సతాపాంతి వాసెనో, పాయదే రాజవి♦భ్రమము మెఱయ

చ. ఒడవగఁ గూర్చికేనియును♦నొప్పదు మన్మథకేళికిమ్మటన్
నడతులగాత్రముల్ గదిసి ♦ నుష్టి యొనర్పఁగ రాజకోటికిన్
నిదురలఁ జెందియున్నరమ♦ణీతిలకంబులయందు స్పృశాడ్పలన్
చెవరి తొలంగు నందు కడుఁ♦జేసిననాఘులమేలిపుణ్యముల్.

శా. ఇరుప్రొద్దు న్నరుఁ డల్పభోజి యయి తా♦నే ప్రొద్దుశుద్ధాత్ముఁడై
చరణత్రాణములందు నేమరక రో♦జం బర్వపర్వంబులం గాఁ
బరనారీరత మానధంబుక్రియ ని♦ర్వాణాత్మమతిం బొంది యొ
క్కరుఁడున్ నిద్రభజించుశీలఘయుఁ దా♦క్యం గాంచు శ్రీయుక్తుఁడై.

చారుచర్య, పద్య 56–62

గీ. అనఘపురుషనక్షత్రంబు♦లైన జ్యేష్ఠ, మొదలుగాఁ గల నక్షత్ర♦ములన యుగ్మ
కములనైనను బుతుదివ♦సములనైనఁ, దనకులాంగనఁ గవయుట ♦ ధర్మమగును.

సీ. పరకాంత మున్నైన ♦ పడఁతి నన్యాసక్త,యైనతొయ్యలి దుఃఖి♦యైనచెలువ
సంతసం బెఱుఁగని♦సతి ననాచారఁపు,టిభయాన బాలింత♦యిగురుబోఁడి
నిష్ఠ మాలినలేమ♦నిర్మోహియగుకొమ్మ, కలహంబు వెట్టెడి♦కమలవదన
రతుల నేరుపు లేని♦రామ జారయుఁ జోర,కుమతియగా నెలనాఁగ ♦ కూటిపేద

గీ. యైన మృగనేత్రి పరితుష్ట♦యైనయువతి, తన్ను మెచ్చని తన్వంగిఁ♦దన్మలంబు
నీనివద్మాస్య కడురోగి♦యైనయువతి, రతి కనర్హలు మానవ♦తతికి జగతి. 1137

సీ. రతితంత్రములయందుఁ ♦ బ్రౌఢయై తనమీఁద, నత్యంతభయభక్తు♦లతిశయిల్ల
పాతుమార్యముచేత♦నే కొదవయు లేక, సుందరాకారత♦సొంపు గలిగి
సరసశృంగారవే♦షముల నెంతయు మించి,యుచితప్రియాలాప♦రచన లెఱిఁగి
వినయవిధేయవి♦వేకశీలతలచే, ననుకూలమగు నెఱ♦తనము నేర్చి

గీ. నిర్మలాంగియు నిపుణయు ♦ నిర్మలాక్షి,జాత్యయును బుణ్యవతియును♦సతియునైన
తన కులాంగన రతికేళిఁ ♦ దనిపె నేని, యతని కైహికలోక సౌ♦ఖ్యములు గలుగు.

గీ. అనఘ విను పౌర్ణమాసుల ♦ నమవసలఁ జ,తుర్దసుల నష్టములను ప్ర♦దోషములను
సంక్రమణములయందును ♦ సతులరతుల, ననుభవింపంగరాదని♦రార్యులెల్ల.

గీ. చైత్యచత్వరగోష్ఠశ్మ♦శానతీర్థ,వారిశృంగాటకారామ♦వాహినీను
శాలయగ్రామమధ్యంబు♦లందుఁ బగలు,సతులఁ గవిసిన దోషంబు ♦ సంభవించు

విష్ణుపురాణము, ఆ 4.

గీ. పగట నుపవాసదినములఁ ♦ బర్వతిథుల,సంధ్యలను గాదు రతిసల్ప ♦ సజ్జనులకుఁ
బాయునాయువు పగలచే ♦ భంగమొందుఁ, దలఁగు సంపద దుష్ప్రసఁ ♦ తతిజనించు.

క. అతిసురతము రోగప్రద మతిమోహము సకలహాని ♦ యగు నీరెంటిన్
కతిపయదినముల నరుసిక్, సతికష్టముఁ జేయునందు ♦ రాయుర్వేదుల్.

మల్హణచరిత్ర, ఆ 2.

## సురతాంతము.

సీ. క్రొమ్ముడి స్మడిచిన ♦ కుసుమము ల్వ్రీడిజాఱఁ, జెక్కుల మకరికల్ ♦ చెమ్మగిల్ల
సరులముత్యంబులు ♦ ఝల్లునఁ దెగిజాఱ, ఘర్మబిందువులు వ ♦ క్త్రమునఁ జిల్కఁ
బలుగెంపు చిమచిమల్ ♦ బలసి నెమ్మొగినొంప, తఱుచుగా నావలిం ♦ తలు సెలంగ
నడుగుల రతనంపు ♦ టందియ ల్వడిమ్రోయ, గడగడనల్కఁ బ్రౌఁ ♦ గౌను వడఁకఁ

గీ. బట్టె చెయ్యాని యల్లనఁ ♦ బాన్పు డిగ్గి, చీర [illegible]
వానఁ జలవంచి తనప్రాణ ♦ నాయకునకు, వెన్కగాఁ జేసి నిలిచె నొ ♦ వ్వాలఁదిమిన్న

కవిచకోరచంద్రోదయము, ఆ 4.

## గర్భిణి.

సీ. చంద్రికపైఁ బర్వు ♦ చారువల్లిక వోలె, వెలఁది నీ యంగంబు ♦ వెలుకఁ బాఱె
హేమకుంభములపై ♦ నిందనీలములట్లు, కాంత నీ చనుమొనల్ ♦ గప్పు మిగిలె
వడవాడు లీలార ♦ విందయుగ్మము మాడ్కి, సుదతి నీ కనుఁగవ ♦ సోల మందెఁ
పెన్నిధిఁ గాంచిన ♦ పేదచందంబునఁ, బొలఁతుక నీకోను ♦ పొడలు కోసయు

ఆ. లలన నీదు చెయ్యి♦లలనంబు లయ్యె ల,తాంగి నీదు మంద♦యానలీల
జడను దాల్చె గర్భ♦సంపదకలిమినీ,యందుఁ దేఁటిపడియె ♦ నిందువదన.
నిర్వచనోత్తరరామాయణము, ఆ 8 పద్య 86.

మ. నిలిపెన్ ఱెప్పల బృందిమన్ విశదిమన్ ♦ నేత్రంబులం జానుకం
బుల నాకాళిమ మేఖలం ద్రిఢిమ సె♦మ్మె మారఁగాఁ బాండిమ
న్వలిమిం జన్నుల శ్రోణిపాళి గరిమ♦న్మధ్యంబునన్ బృంహిమ
న్లలితాత్మన్ లఘిమన్ మహామహిమ మే♦చన్ గర్భదుర్వారయై.
భాగవతము, స్కం. 8, పద్య 496.

మ. పలుచంబాఱుటఁ గోమలస్మితరుచుల్ ♦ పైఁడోఁచెనా గౌరకాం
తులగండద్వితయంబు పొల్చెఁ బ్రమదా♦ర్ణోరాశిఖేలన్నవో
త్కలికాభంగపరంపరోపరిసము ♦ ద్యత్పాండుడిండీరపం
క్తులు నాఁ జిట్టుము లుల్లసిల్లెఁ దఱుచై ♦ తోడ్తోఁ గురంగాక్షికిన్. 1133
మనుచరిత్రము, ఆ 3 పద్య 120.

సీ. కౌను దొడ్డతనంబుఁ ♦ గని చింత పడుగతిఁ, గుచముఖంబులు నీల♦రుచి వహించె
మందస్మితంబున ♦ మరఁగిరాదనముద్దుఁ, బలుచని చెక్కులు ♦ పలకఁ బాఱె
ఫలరసంబుల కెక్కి ♦ ప్రీతి లామి నొల్లదో,యన జిహ్వ యెన్నిట ♦ నరుచి పుట్టె
గర్భమున్నుఁడగుబాలు ♦ కమనీయగుణధార, మహిమనా సవలతి ♦ మంపు లయ్యెఁ
గీ. కలికి చేడిసమీలతోఁ ♦ గలహ మాడు
బాలుఁజూపుల దాఁటులు ♦ వేలుపడియె
మంటికమ్మని తావికై ♦ మనసు పాఱె
నాఁడు నాఁటికి బాలికా♦నలినముఖికి.
రాజశేఖరచరిత్రము, ఆ 1 పద్య 86.

గీ. తెల్లనగు మేను కుసుమిత ♦ వల్లి గాఁగ
గురుకుచంబులు ప్రసూనఁ♦జయలు గాఁగ
నందునుండెడి నలుపు నిఁ♦దిందిరములు
గాఁగఁ జెలువొందె వాల్దేహ♦గర్భమహిమ.
కాళీమాహాత్మ్యము, ఆ 2 పద్య 80.

ఉ. బాలకురంగలోచనకుఁ ♦ బాటిలు మోహనాభిమండలా
వాలమునం జనించి పరు♦వంబున మీఁదికిఁ బ్రాఁకు రోమరా
జీలతనుద్భవిల్లి విల♦సిల్లు కుచస్తబకద్వయంబునన్
వ్రాలిన గండు తేఁటులన♦వత్తిలుఁ జూచుకమేచకప్రభల్. 1136

రామాభ్యుదయము, ఆ 3 పద్య 83.

సీ. ఎలకుందెలకు రెంటి ♦ కెక్కుడఁ గల్గెనో, నీలకిరీటముల్ ♦ నీలవేణి
మూసిపెట్టి రదేమొ ♦ ముకురంబు లొకరెండు, తెలిజిల్గుపావడఁ ♦ గలువకంటి
చిగురులు రెంటిచే ♦ తగవ్రనఁ జోడమెనో, యందంపుఁదొట్టుప్రిపా♦టిందువదన
నిదురకుఁ బడఁజొచ్చె♦నెత్తమ్ము లొకరెండు, తెఱఁగిదియెట్లొకో♦ మెఱుఁగుఁబోఁడి
గీ. యనుచుఁ బలిచన్నుఁగవ కప్పఁ♦ మొనలుగండ, పాండిమము పాదములనడ♦బడలికయును
వెల్లఁబ్రడుశయ్యఁగనుబోయి♦ నెలయు నేర్చు, నేరుపున నెచ్చరింతుర♦న్నెలఁతనగఁగ.

కకుత్స్థవిజయము, ఆ 4 పద్య 30.

మ. కడుఁ దోరంపుఁ బయోధరంబులమొనల్ ♦ గప్పారుచుం బర్వన
ప్పుడు తద్వక్త్రసుధాంశుబింబమనయం♦బుం బాండురశ్రీగనం
బడియెన్ గార్తికపూర్ణిమాతిథి బలెన్ ♦ భావించి చూడంగ నె
య్యెడనున్ స్థానగుణంబునం గలుగవే ♦ యేమేమియుం జిత్రముల్. 1138

కళాపూర్ణోదయము, ఆ 5 పద్య 124.

క. తొలిచూలు తేఁటివ్రాలుడు, నెలప్రాయపుఁదీఁగయించు ♦ కించుక గదలెన్ -
జలజలరాలెడు పువ్వులు, బలెఁ జిట్టుము లుప్పతిల్లెఁ ♦ బంకజముఖికిన్. 1139
గీ. లేమి నెడబాయు లేకాదు♦ పోమృగాక్షి, కౌనుబలిబంధనస్ఫూర్తిఁ♦ గాంచెఁ బూర్తి
వింత గోరంత యైన య♦ద్విష్ణుపదము, మీఁది పాదవులఁబడినాక్ర♦మించుజాడ.

సుదక్షిణాపరిణయము, ఆ 2 పద్య 95, 97.

శా. మించెం బోరచికోరికల్ గడువిజృం♦భించెం దనుగ్లాని గా
న్పించె న్మేచకకాంతి చూచుకములన్ ♦ జెక్కుల్ తగన్ దెల్పరె
ట్టించెన్ గోర్కులు సందడించె నడచం♦డించెన్ మృదామోదమున్
గాంచె న్వాతెఱ యోసరించెఁ ద్రివళుల్ ♦ నానాఁటికిన్ బోటికిన్. 1140

సారంగధరచరిత్రము, (చే. వేం.) ఆ 1 పద్య 35.

ద్విపద. పరిపూర్ణ సోముని ♦ బడలించు మోము, దొరకొని వేగుచం♦ద్రునిరీతినుండె-
ననవిల్తుపూచెండ్ల ♦ చందగు చనుల, మొనల నల్లని వర్ణ♦ములు గానిపించె
మృదుబింబముల వన్నె ♦ మెచ్చని మోవి, కదిసినమలినంబు ♦ గప్పినట్లుండె

బడలికల్ మేనునఁ బర్వె వంచవంప, నకుచమండంబాయె ♦ నాభి గన్పడియె
నవకనివల్లిపూ♦నల పేరుఁ బోలె, నవిరళంబగుచు నూఁ♦గారుఁ జూపట్టెఁ
గలికిచూపులచంద్రి♦కల్ పర్వె నవఁగఁ, బలుకఁబారెను గండ♦పాళికాయుగళి
మలివేళ ముఖచంద్రిఁ♦దమృతంపురసము, బిలుకుచఁదంబునఁ♦జిట్టుములెసఁగె
గగనభాగంబుసా♦కారమైయొప్ప, పగిదిఁ గాఁడిఁగె చూ♦పట్టె నానాఁట. 1141

నలచరిత్రము, (చ. రా.) ఆ 3.

ఆ. చన్ను లుకియఁ బొదలె ♦ జఘనంబు ఘనమయ్యె, పలకవెన్నుదనరె♦నలువుపుట్టె
రాజ్యయోగ్యమైన ♦ రత్నంబు దాఁచిన, పసిఁడిపెట్టెయనఁగ♦నెసఁగెఁగడుపు.

ద్వాత్రింశత్సాలభంజికాకథలు, ఆ 3.

ఆ. కాంత గర్భభరముఁ ♦ గాంచి కాంచి చలించె, నంగదేశమెల్ల♦నలపు నొందె
మధ్యసీమ యలరె ♦ మంజులలాటంబు, చెంత వారిసెనసెఁ ♦ గుంతలంబు. 1143

రుక్మిణీపరిణయము, (స. భ.) ఆ 4 పద్య 128.

సీ. మేరుశృంగములపై ♦ మేఘముల్ దిగురీతి, నాతి చూచుకములు ♦ నల్ల నయ్యె
దౌహృదశ్రీనిల్చు ♦ ధవళాంబుజము పోల్కిఁ, దలిగంటి నెమ్మోము♦దెల్లనయ్యె
గృశదైత్యజాతివ♦ర్ధిలు నిటు లను రీతిఁ, గలకంఠి లేఁగౌను ♦ బలిత మయ్యె
గర్భగార్భకతనూ♦కాంతి బైలగు లీల, విమలాంగి నూఁగారు ♦ విపుల మయ్యె
గీ. నలరుఁబోఁడికి నొకయడు♦గామ డయ్యెఁ, గీరవాణికిఁ జిట్టుముల్ ♦ దోరమయ్యె
నబ్జపాణికి మంటిపై♦నాస యయ్యె, సైకతశ్రోణికిఁ బ్రినూతి♦సమయమయ్యె.

ఉత్తరరామాయణము, ఆ 2 పద్య 137.

శా. కప్పుల్ వీడ్కొన భూధరేంద్రముల సౌ♦కర్త్యంబున న్మించువోఁ
దప్పె స్వాంతపయోధరమ్ములు కన♦స్తారావతారమ్ముపై
నుప్పొంగెం జెలువారు నిర్మలత స♦ద్వ్యోమస్యభాగంబునం
దొప్పెన్ హంసగతుల్ ప్రియంకరశర♦ద్యోగంబు రా నంతలోన్. 1145

అచలాత్మజాపరిణయము, ఆ 2.

సీ. తరుణోత్పలాక్షి నే♦త్రద్వయద్యుతు లాని, పుండరీకచ్ఛాయ ♦ మెండుకొనఁగ
ఘనముకురాస్యవ♦దనరుచిప్రౌఢిమ, మహిమరీచిఖ్యాతి ♦ నెసఁగు చుండ
శైవలరోమాళి ♦ చారుతనూరుహ, స్థితి నారదన్మూర్తి ♦ నతిశయిల్ల
వరగుచ్ఛకుచచారు ♦ వక్షోజయుగళంబు, పర్వతోన్నతిమించి ♦ పరిఢవిల్ల
గీ. సారమృదువాణివాక్సుధా♦సారభూతి, యల శుకావాప్తినలర నా♦హస్తియాన
యాన మొగిరాజసాంసవి♦ధానమైన, నమరె మునివృత్తిగర్భభ♦రమున సతికి. 1146

ఓఘవతీపరిణయము, ఆ 4 పద్య 57.

సీ. అరుచులు చెన్నారె ♦ నన్నాదిభోజ్యచయమ్ము, వందువళితి ♦ యమ్మునందు
నతులితగతి మహో ♦ రతి మీఱె మృదు పక్ష్మ, యమ్ములందాభర ♦ ణమ్ములందు
పెంచఁగా వలెనన్న ♦ ప్రేమలు జనియించె, హితులయందతిశతా ♦ హితులయందు
రాజమణీఘృణీ ♦ రాజి రాజిలె లోచ, నమ్ములం బ్రిగ్రస్త ♦ నమ్ములందు
గీ. సురుచిరాచ్యుత తేజో తి ♦ శోభిగర్భ, పృథుక సంయుక్తిమై ప్రతి ♦ బింబితేందు
బింబగంగాఝరోర్మివి ♦ డంబనంబు, లోకులకుఁ దెల్పు నా చలా ♦ లోకనలకు. 1147

రాఘవపాండవయాదవీయము ఆ 1.

సీ. గతితోఁ గళస్వరో ♦ న్నతి సామ్యము భజించె, జఘనంబుతోఁ గాను ♦ నవతు గొనియె
నెమ్మోము చెమ్మటీ ♦ న్దమ్ముల కెనయయ్యెఁ, జవిమేలుకలలనే ♦ స్తము వహించె
జడిమతో నిదురహ ♦ స్తవనఖిత్వముఁ బూనె, నోపిక మేనుతో ♦ నుపముఁ జెందె
లలితహాసము వృద్ధి ♦ లాసంబు సరియయ్యె, వలయాళివలులతోఁ ♦ దులకుఁ బ్రాకె
గీ. మందమయి ఘనమయి పాండి ♦ మ ప్రకాశ, మయి సముదితము నయి సాంద్ర ♦
మయి కృశంబు
నై రహితమై చ్యుతంబునై ♦ యనుదినంబు, మహిళ ఘనగర్భము పచేళి ♦ మతనెసంగ.

ఇందుమతీపరిణయము, (జ. నృ.) ఆ 1 పద్య 47.

సీ. గగనమధ్యము మూర్తి ♦ గనుఁగొనఁ గప్పుచే, నొప్పారెపృథులప ♦ యోధరములు
వరకంకణోర్మికా ♦ వళులు జాఱఁగఁ జారు, వేణివిళదగర్భ ♦ వృద్ధి నెరసె
గురుమీఱి చెలువాఱు ♦ కువలయావళిహల, హాలికసంపూర్ణ ♦ మై ♦ నలువుకెక్కె
భ్రమరకాకీర్ణమై ♦ సుముఖినీరజపాళి, వెలవెలనై రూప ♦ కలన దటిగె
గీ. వక్షము తుశంకఁ గల్పించు ♦ వనరుహాక్షి, గర్భగౌరవ మీలాగు ♦ గరిమఁ గాంచ
నిండెఁ దొమ్మిది నెలలును ♦ నిఖిలభువన, గర్భగౌరవవత్కీర్తి ♦ కాంతఁ బోల.

సుబ్రహ్మణ్యవిజయము, ఆ 1.

మ. నవగర్భోదయవేళయన్ తొలుకరి ♦ న్మందంబులై హంసయా
నవిశేషంబులు వొల్చె నూర్పుగముల ♦ న్వ్యాజంబునన్ దూర్పుగా
డ్పువెస న్మించెఁ బయోధరంబులొగి ను ♦ ప్పొంగెన్ వినీలాంతతన్
నవకం బేర్పడె మించెఁ జిట్టుములు సో ♦ నల్గాఁ గురంగాక్షికిన్. 1150

భద్రాద్రిపరిణయము, ఆ 2 పద్య 26.

చ. ధవుఁడిఁక ముట్టరాదనుచు ♦ దర్పకుఁ డప్పుడు మచ్చకంటిచ
న్గవపయిముద్రఁ జేసెనిటు ♦ కజ్జలయుక్తి ననంగఁ జూచుక

ష్టివినలు పెక్కు ధావినుత ♦ సన్నిసమస్కృతయానటన్నకీ
ర్తి వెలసివక్త్రసీమపయిఁ ♦ దేలెడునందెలు పెక్కుఁదద్ద్యుతుల్. 1151

సర్వకామదాపరిణయము, ఆ 1.

చ. నడుమిది పేద చంద్రికలఁ♦నం బచలోన్నతి మావిధంబునం
బడసె నెయుంచుఁ దన్ను నసు♦వక్త్రముఁ జన్నవవెల్లఁబొఱ వ
ప్పడరెడుహోములం పనర ♦ నయ్యెడ నందఱు వేడ్కఁ జూడఁ జా
రెడు నభీష్టఁ గాంచె నిల♦లేములు కాఁపురముల్ఘటించునే. 1152

మహేంద్రవిజయము, ఆ 4 పద్య 109.

క. పేడియమేనుకృశత్వము, తోడం గూడికొనెఁ గాను ♦ తోరపులీలన్
బోఁడిమిఁ గనె నపు డౌకచో, నోడల బండ్లగును బండ్లు ♦ నోడ లగుఁగదా.

క. అతి సూక్ష్మమైన నెన్నడు, మతివకు నపుడంతకంత♦కభివృద్ధిఁ గనెన్.
క్షితిలో నరునకు భాగ్యో,న్నతియోగదశాగమంబు♦నం బ్రిబలు గతిన్. 1154

నయనోల్లాసము, ఆ 1 పద్య 79, 80.

మ. వనజాస్త్రుం డిపు డింతి మై విడచిపో♦వం బైనముం గట్టి స్యం
దనమార్గంబునముంబుఁ జేసి రహిఁజెం♦దం బ్రగ్గమున్ సాఁచి కం
చెన వెట్టించెనొ బండిగండ్ల ననఁగాఁ♦దీ రెన్ వళీభంగముల్
ఘనరోమావళి సాగెఁ జూచుకములం♦గప్పట్టె నైల్యం బొగిన్. 1155

శంతనూపాఖ్యానము, ఆ 1 పద్య 104.

క. అతిసూక్ష్మమధ్యదేశము, తతమై విలసిల్లె సతికి ♦ తతకుచకటిసం
గతిచే నన వృక్షఫలసం,గతి స్వల్పుల కైన వృద్ధి ♦ కరమున్ గాదే. 1156

సావిత్రీపరిణయము, ఆ 2 పద్య 37.

---

## బాలెంత.

—:o:—

సీ. పాలుబ్బు బిగువుగు♦బ్బల నెమ్మొనలకీవి, పసపంటుపయ్యెద♦పై నటింపఁ
గాయంపు ముద్దల♦కారంపుఁదావులా,స్యనిసర్గవాసన♦లలమి కొనఁగ
నడుమున దిటముగా♦వడిఁజుట్టి కట్టిన, బంగారుమైజారు ♦ కొంగు దనర
నుల్లిపూసల పేరు♦హురుమంజిముత్యాల, కుతికంటుదాఁపునఁ ♦ గొమరు మిగులఁ

గీ. బహుప్రసవజనితపరిశ్రాంతిఁ ♦ బడలి యున్న, యంగకములనొక్కొకవింత♦యొంపు మొనయఁ
జూడఁ దగి యుండె నప్పుడా♦సుదతి యందు, లాలితంబైనబాలింత♦రాలితనము.
కవిరాజమనోరంజనము, ఆ 2.

సీ. తారహారములతోఁ ♦ జేరాడు వెల్లికి, పూసపేరులు కంఠ♦మునఁ జెలంగఁ
బద్మరాగంబుల♦పగిదిఁ జొక్కపువీడె, యములతో నెనసి దం♦తములు మెఱయ
ధగధగ వెలుఁగు ని♦ద్దపుజెక్కుటద్దము, పొంతఁ గాటుకయుక్కె♦బొట్టు వెలుఁగ
ముఖచంద్రమునిమీఁద ♦ మొనసిన కార్మబ్బు, గతి నీలి వాసెన ♦ కట్టు మెఱయ
గీ. నంత నయ్యింతిపచ్చి బా♦లెంతసొబగు, భువనమోహనమగు వేష♦మునఁ బొసంగెఁ
బసుపు లెల్లను వృద్ధ్యోది♦తపరికార, ముఁ బరిటివైభవము సేయు ♦ వెనుక వెనుక.
వాసవదత్తాపరిణయము. వ. సీ. ఆ 2 పద్య 59.

ఉ. వడఁకెడు కానుకంగు తల ♦ వాసెనఁ గట్టిన కొంగు పుక్కిటన్
విడెయపుఁ గొంగు ♦ మైలగొని ♦ వ్రేలెడు చేలచెఱంగు పాలచే
ప్రదుచనుఁదోయి పొంగు వస♦పూసల వింతబెడంగు నూనెకొ
మ్మడిరుచి చుక్కబొట్టమర ♦ ముద్దియ యొప్పెను బిడ్డకాన్పునన్. 1159
హంసవింశతి. ఆ 2 పద్య 95.

సీ. మెఱుఁగారు దవనాన ♦ కసూరిజాజుముడితోఁ, బాల పెల్లుబ్బు గు♦బ్బకవ తోడ
వసనాగ్రికటుతిక్త♦వస్తుసౌరభముతోఁ, గాటుక కనుదోయి ♦ నీటు తోడ
నలుచు మేదావిక్రిం♦దగు భూతిరేఖతోఁ, దాంబూలరాగాధ♦రంబు తోడ
నునుఁబైట బిగియఁజు♦ట్టిన లేఁతనడుముతోఁ, బసపునల్గిడిన మై♦మిసిమి తోడ
గీ. భుగభుగలఁ బర్వు సాంబ్రాణి ♦ పొగల తోడ, జటిశిఖామణినిజపన్న ♦ సదనసీమ
బరఁగెఁ గాన్పున రంగద♦పాంగవిసర, చలితబాలకురంగియౌ ♦ చంచలాంగి.
శకుంతలాపరిణయము. పె. నా. ఆ 3 పద్య 90.

## వేగుఁజుక్క.

సీ. సకుటుంబముగ వీఁగి ♦ చరమశైలముఁ జేరు, తుహినాంశుదుముదారు♦దార యనంగ
జాజీర మైవచ్చు ♦ నలినబాంధవు జెక్కుటంబుపై దీపించు ♦ నద్దమనఁగ

నరుణాగ్రిశిఖరవా◆త్యములలోఁ గనుపట్టె, సమయాకాంక్షికుచేతి ◆ శంఖ మనఁగ
నినుఁ డప్పుడు జుంటి◆ముసురుమున్న పడివాగె, కొలిచెచ్చు రాయంచ ◆ కొదమయనఁగ
గీ. నుదయగిరి పీఠిఁ దనోవ్రతం◆బుండ నిగుడు, సహితరశ్మిచే బద్ధుఁ◆డగుచుఁ దోడి
బలఁగ మైనట్టి చక్కల ◆ వలన త్రోవఁ, జూపఁ జేతెంచెననఁ ◆ జక్కవ వొడిచె.
మనుచరిత్రము. ఆ3 పద్య 54.

మ. అమృతాంశుండు నిశాసతిం గలసి శ్రీ◆స్వచ్ఛంద్రికాగంధశీ
ల్పముతోఁ బుష్కరశయ్యఁ బాసిచనఁ జే◆సా మూతి తత్కాలసం
ధ్రిమసంశ్లిష్టతరోడుహారమణివా◆కం జేరి తానొక్క చో
గుమిగాఁ బోసెనొ నా మినుక్కురను వే◆గుంజుక్కఁ గంటే చెలీ. 1162
మనుచరిత్రము, ఆ 4 పద్య 128.

గీ. తన పగతుఁ డెంతమారకుం◆డనియెనొక్కొ, యనుచు నిక్కుచుఁ గనుఁ ధవ◆శారవింద
మనఁగ మినువాఁక నంతర◆త్యంత కాంతి, నిటులు నిద్రాపతిమఁ జొక్క◆ వేగుఁజుక్క.
రాజవాహనవిజయము, ఆ 3 పద్య 24.

గీ. చక్రదంపతి సుకృతభూ◆జంబు మొక్క, జారకాంతల మతులందుఁ◆జేరు వెక్క
సిరిఁ దనరు పూర్వదిక్కాంత◆ చేయుచుక్క, విమలగతి నంతఁ గనవయ్యె◆ వేగుఁజుక్క.
సీమంతినీకళ్యాణము, ఆ 3.

గీ. కాలమను సింహమాకాశ ◆ గంధగజముఁ, జీరి కత్తుకఁ ఘమధ్యంబుఁ ◆ జింపనందుఁ
దెలివిఁ గన్పడు గొప్ప ము◆త్తియమనంగఁ, జొక్కమగునట్టి వేగురుఁ◆జుక్క వొడిచె.
శతకంఠరామాయణము, ఆ 1 పద్య 164.

క. చలివెలుఁగు గిలియుచో శే, వెలఁదుక నెత్తిఁ గొప్పవలన ◆ వెస జాఱిన చెం
గలువవిరి నాఁగఁ దగి చు, క్కల తెరువున వేఁగుజుక్క ◆ గనుఁగొనఁబడియెన్. 1168
అచ్చతెలుఁగురామాయణము, అయోధ్య, పద్య 37.

గీ. చక్రిపరిపాలనమొనర్ప ◆ జగమువిందు, దరలి వచ్చెను నీ కింక ◆ నరుగు మంచు
నురలు శశికంచు మేలిబం◆గరపుఁగమ్మ, చుట్టనఁగి నత్రశ్రీమునవేగుఁ◆జుక్క వొడిచె.
రసికజనమనోభిరామము, ఆ 5 పద్య 103.

గీ. చక్రవిద్వేషినైన నన్◆నిట్టుఁడని పీవు, రాజనాయింపు నిలువంగ◆ రాదు తలఁగు
మనుచుఁ జంద్రుని కెదిరింప◆ నినుఁడు పంపె, మాతయనవేఁగుఁజుక్క ప్రా◆దుర్భవించె.
సుభద్రాపరిణయము, ఆ 5 పద్య 122.

చ. తను నెడఁబాయ లేక బహు◆తాపముఁ బొందుచు నున్న పద్మినీ
వనితల దుఃఖముల్ దునుమ ◆ వచ్చెడి నంచు నినుండు బూని వే

ఱెక్కలు మహితపక్షిభాతి మను ♦ కంచుకిచే భువి సానవాలుగాఁ
బనిచిన మూలవాల్పుటువు ♦ భంగిని వేగురుఁజుక్క భాసిలెన్. 1169

మిత్రవిందాపరిణయము, (రా-జ.) ఆ 4.

గీ. నళిని నళినీమలినగాత్రి ♦ నవతుషార, పూరబాష్పాద్రికుచకోశ ♦ నూరడింప
నూరుఁ బంపిన సంకేత ♦ చారుఁడనఁగ, వేగముదయించెఁదమిచిక్క ♦ వేగుఁజుక్క.

రుక్మిణీపరిణయము, (స-భ.) ఆ 2 పద్య 259.

గీ. సమయలోకేశ్వరుఁడుచక్రి ♦ శక్రతురచిత, భువనజాతార్తి మాన్పవి ♦ స్ఫూర్తినొసఁగు.
లోకబాంధవనవవిభు ♦ త్త్వైకశాసనం బనఁగ వేగుఁజుక్క మిం ♦ టను నలర్చె.

వేంకటేశ్వరవిలాసము, ఆ 2 పద్య 110.

గీ. పద్మములసొంపుఁ బూలించి ♦ పటుకరాసి, చేతఁ జక్రంబులనుగుందఁ ♦ జేసి తంచుఁ
గినిసి గ్రహరాజు చంద్రుఁడె ♦ మ్మనుచుఁ బంపు, చోపుదారనరహి వేగుఁ ♦ జుక్క వొడమె.

కృష్ణార్జునసంవాదము.

మ. లలితాపాండుమిథాపిశేషదధి వే ♦ శాగోపి గాఢోదయా
చలభాయంత్రమునన్ మథించి గగన ♦ చ్ఛద్మాన్య పాత్రింబునన్
వెలయింపం దిమిరాచ్యుతుండు గొని వే ♦ వేగ స్రజన స్థత్కరా
కులమై యొప్పెడు వెన్నముద్దయన వే ♦ గుం జుక్కదోఁచెన్సఖీ. 1173

సర్వకామదాపరిణయము, ఆ 2.

గీ. అరుణకిరణుఁడు పద్మినీ ♦ వరణమునకు, వచ్చునెడఁ గాల మనిరయొడు ♦ బాణకారి
తారకామండలము నేయఁ ♦ దనరెననఁగఁ, జక్కగాఁదూర్పునను వేగుఁ ♦ జుక్క వొడమె.

వల్లీపల్లవోల్లాసము, 2 పద్య 113.

గీ. తడవు రేయేనితోడను ♦ పనరియుండి, వెడలఁబోయెడు తటిని రే ♦ వెలఁదివిప్పు
కొప్పునందుండి దిగజాతి ♦ కూలినట్టి, విరులబంతి నాఁదోఁచెం ♦ చె వేగుఁజుక్క.

రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 114.



# కోడికూత.

—:o:—

ద్విపద. తొలుకోడి కనువిచ్చి ♦ నిలిచి మై వెంచి, జలజల ఱెక్కలు ♦ సడలించి నిక్కి
గరికుక్కన కాలార్చి ♦ కంఠంబు విచ్చి, ముక్కున నీకెలు ♦ జక్కొల్పి కడుపు

వెక్కసించి మెడసాఁచి ♦ నిక్కి మిన్నూఁచి, కుక్కుటో కప్టని ♦ కూయక మున్న
ప్రబుద్ధనాథ ప్ర♦బుద్ధనాథ యనుచు, నుర్విసురోత్కృష్టకుహ♦యుడుగక మున్నె.

పండితారాధ్యచరిత్రము, పు-రా. ప్రక.

ఉ. కోమలతామ్రచూడికల ♦ కొప్పుల జంజమంజమఁ బోల్పఁ జెప్పి వి
స్సీమకఠోరతారమతిఁ ♦ జెట్టుపలాశ్చుచున్ జులెత్తి వి
శ్రామముపోలెఁ గూసె నిల♦సచ్చరమానలకూటపక్షుః
గ్రామటికాకుటీరశిఖ♦రంబులఁ గుక్కుటచక్రవాళముల్. 1177

శృంగారనైషధము, ఆ 8 పద్య 153.

మ. సకలాశాగతి సర్వకోపవిరతి ♦ శాస్త్రక్రమారంభకా
త్మకవస్తత్రియికిన్ మనుచ్చరితక♦జ్జ్ఞానోరుమూల మిం
తకుఁ బోలన్ వినుఁడంచుఁ దెల్పుగతిఁ జెం♦తం గొండపైఁ బల్లెలం
గృకవాకుల్ మొరసెన్ గృహోపరిఁ దిశా♦గిన్ భగ్నకంఠధ్వనిన్. 1178

మనుచరిత్రము, ఆ 3 పద్య 55.

క. ఇక్కువగతి పతిపాలికి, జక్కవజవరాలు చేర ♦ సంకేతరవం
బొక్కటి యొసంగెనో యనఁ, గుక్కుటములు పక్షములఁ ♦ గొంకృతి సలిపెన్.

రామాభ్యుదయము, ఆ 2 పద్య 103.

మ. సమయాభిజ్ఞతఁ గుక్కుటంబు "వివిధ♦చ్ఛందస్క్రియామంతురం
తిమయా బోభగవాన్నృషీః కుసుమధ♦న్వీ దేవతా మానినీ
రమణాయాం వినియోగ" యంచు నిడియా♦రంభించెఁ గాఁ బోలు నా
నమరెం దద్ధ్వని నూనిముల్ రతికిఁ బా♦న్మై నాథులం డైకొనన్. 1180

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 5 పద్య 56.

గీ. కోడిపపప లెక్కలఁ ♦ గొట్టుకొనుచు, గూయు క్రమమొప్పు మీ లెవే ♦ కువలయనిమేషు
కనమగట్టివధూమాన ♦ ధనముఁ దోఁచు, నసమశరుఁడు తప్పటఁ గొట్టి ♦ యార్చె ననఁగ.

కళాపూర్ణోదయము, ఆ 8 పద్య 24.

మ. కమలాప్తుండిట బ్రహ్మయై యఖిలముం ♦ గల్పింపఁగా నిమ్ముహూ
ర్తము బ్రాహ్మంబనఁ బొల్చు నేతదనుసం♦ధానంబు నించు న్నితా
ర్థములంచున్ జనకోటికిం దెలుపుచం♦దం బొప్ప ఘోషించెఁ ద
త్సమయారాధనజాతనాత్మహిమమిం ♦ చంద్రాభ్రచూడౌఘముల్. 1182

చంద్రభానుచరిత్రము, ఆ 4 పద్య 138.

గీ. చక్రరిపుఁడగు రాజశా♦సనమువలన, నెంచి మారుండు పాంథుల♦నేయఁ జూచెఁ
గావ రాకే యటంచుఁ జ♦గంబువిందుఁ, గూర్చి మేలుకొలిపె ననఁగఁ గు♦క్కుటములఱచె.
రసికజనమనోభిరామము, ఆ 5 పద్య 104.

గీ. విరహిణీపాంథజనులకై ♦ వేఁట లాడి, తెల్పఁ గొని యేఁగుచో విమాన♦కేతనుండు
వాలిఁ బుట్టించుభేరికా♦హాకియనంగఁ, గుక్కుటము గూసెఁ గుక్కురో♦కో యటంచు.
సుభద్రాపరిణయము, ఆ 5 పద్య 121.

చ. తనుప్రకృతిత్రిమూర్తిఁ దగు ♦ తామసరాజససాత్త్వికాఖ్య నే
మనుజున కైనచో నధమ ♦ మధ్యమ ముత్తమ(?) రీతి నొప్పు నీ
మనుకులసార్వభౌమునకు ♦ మత్స్వరవైఖరి నిట్టులంచు వే
గునిసి త్రిభంగియుక్తముగఁ ♦ గూసెను నప్పుడు కుక్కుటౌఘముల్. 1185
ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము, ఆ 1 పద్య 47.

క. రెక్కలువిదిలిచియార్చెలు, ముక్కునఁ జక్కంగ దిద్ది ♦ ముందటికి మెడల్
నిక్కించి మిన్నుఁ జూచుచుఁ, గొక్కురొకో యనుచుఁ గూసె ♦ గొల్లనకోళ్లుల్.
సురాభాండేశ్వరము, ఆ 1 పద్య 115.

ఉ. నాయెద వేఱు నేయకిఁక ♦ నాయెద దగ్గఱ జేరి నన్ను ర
మ్మాయనునట్లు పిల్లులకు♦యంగని చక్కటిలాగలాఁగపై
రోయుచుఁ గాచె నా మనవి♦రోధుల కిమ్మగు వేళ కొక్కురో
కోయనినట్లు పెల్లఱచె ♦ గూటను గుక్కుటకోటి వేకువన్. 1187
యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 5.

గీ. చక్రపరిపాలనముసేయు♦సంభ్రమమునఁ, దరలిచను వెంచు లోకబాం♦ధవుని బిరుదు
కాహళులనంగఁ జారుల♦కళలు క్రుంగ, గూట వేఁకువ నెందుఁ గు♦క్కుటము లఱచె.
వేంకటేశ్వరవిలాసము, ఆ2 పద్య 116.

క. రెక్కలు విదిలించుచుఁ దన, ముక్కున చరణములు దీటి♦పొలుపుగ గనముల్
మక్కువ ముందఱఁ జూచియు, గొక్కురొకోయనుచుఁ గోడి♦గుంపులు గూసెన్.
గయోపాఖ్యానము, ఆ 1.

క. కాలజ్ఞానము దెలియని, దేలీలన్ నరులు సేఁత♦లెఱుఁగ రనుచు వే
మేలుకొలిపినట్టులన, క్కాలంబునఁ గుక్కుటములు ♦ గడు వడిఁ గూసెన్. 1190
ఓఘవతీపరిణయము, ఆ3 పద్య 130.

మ. తమిసంకేతగృహంబులన్ విటుల మో♦దంబొప్పఁగాఁ గూడి కా
మమహామారన కేళిఁ దేలు కులటా♦స్తోమంబుతో నయ్యెనా

గమ మాచన్నతఁ జెంది రిక్క నిలుచం ♦ గర్వంబుగాఁ బంచుఁ గూ
ఁకిమి ముమ్మాటికిఁ జెప్పె నాఁగ నలరా♦రెంబామ్రిమాపక్షులున్. 1191

సుమనోమనోభిరంజనము, (ఉల్లాస) 5 పద్య 74,

---

# ప్ర భా త ము.

—:0:—

గీ. రాలియున్న పుష్పపరికరము విదిర్చి, వెన్నుగా నున్నచేసిన ♦ సెజ్జ యనఁగ
వేఁగుటయుఁజుక్కలన్నియు♦విరిసివిశద,భాతిఁజెలువొందెఁజూడనం♦బరతలంబు.

భారతము, (విరా) ఆ 2పద్య 239.

సీ. లెక్కింపఁ జాలకనై ♦ చుక్కలాకసమునఁ, బ్రాఁతముత్తియముల ♦ పగిది నుండ
నొదవెడు కెంజాయ ♦ నుదయాచలము మోఁద, మాణిక్యవేదితో ♦ మచ్చరింప
నాకాశనదికేళి వ ♦ నమృతభానుఁడు మేని,మించుఁ గోల్పడి మది♦యంచఁబోలఁ
జలిగాలిసోఁకునఁ ♦ దెలిసికొండొకవడి, కవలెల్లజక్కవ ♦ కవలఁ బెరయ

గీ. వెలరువాలుచు గృహదీప ♦ వితతి యొప్ప, విరులపైనళుల్ గోరంట♦విరులదొరయ
నలినములుకుముదములనవ్వ(?)♦నలుదెసలను, జాలబెరయంగఁబ్రత్యూష♦వేళయయ్యె.

కేయూరబాహుచరిత్రము, ఆ 4 పద్య 26.

చ. అళికుల మల్లనల్ల నవ♦హల్లకమొల్లకకేసరోల్లస
ద్దళదరవిందమందిరవి♦తానము చేర నగాధదీర్ఘికా
జలజనవీనగంధములు ♦ చల్లుచుఁ జల్లనిగాడ్పు లిమ్ముల
న్వొలయ గృహప్రదీపముల ♦ పోఁడిమిఁ దూలఁ బ్రభాతమొప్పినన్. 1194

భాస్కరరామాయణము, (అయో) పద్య 25.

సీ. కుముదంబులర్ధమ♦ర్ధము మొగంబు మొగిడ్చె, నర్ధమర్ధంబు తో♦యజము విరిసె
స్యందనాంగంబింత ♦ సంతసుంజరియించె, నింతనింతఁ జకోర♦మీక విరిసె
విధుకాంతశిలవెడ♦ వెడనీరిగిరితీసె, వెడసూర్యకాంతంబు ♦ వెచ్చనయ్యె
నినియించుకించుక♦దెసల యంచుల నిల్చె, నించుకించుకదివం♦బీరికెత్తెఁ [తియును

గీ. వొలఁగిపోయెడు కుముదబం♦ధుద్యుతియును, దోఁచుచున్న సరోజబం♦ధుద్యు
శశిశపై శ్వేతరక్తముల్ ♦ సంక్రమించె,సకలదిశలను బ్రత్యూష♦సమయమునను.

శకుంతలాపరిణయము, (పి. సీ.) ఆ 3.

చ. అనిశము నక్షసంతతికి ♦ నాత్మఘనంబిడి పేదవడ్డదా
తను విడువంగఁ జాలదు గ♦దా ధర నక్షలు కొంచె మోగినన్
వెనుకొని వత్తురంచు శశి♦వెన్నెలపుల్గుల నవ్వినట్లు ప్ర
న్నన నునుఁజాయవెన్నెల ద♦వచ్చెఁ బ్రభాతము రాక చేరువన్. 1196

తారకబ్రహ్మరాజము, ఆ 2.

చ. దలమగు హోవ్రవెన్నెల వి♦క్షంబది రక్తపటీరచర్చగాఁ
జలకనితారకావళి వి♦సూత్రితహారమణీప్రజంబుగా
నలుతొలుసంజకెంపులు ♦ యావకచిహ్నలు గాఁగ నంబర
స్థలియలరారెనేకుపని♦శాకశిఖుక్తవిముక్తశయ్య నాన్. 1197

కవికర్ణరసాయనము, ఆ 4 పద్య 184.

సీ. మునువిలాసంబైన ♦ దినపాదపము మొదల్, మగుడఁజిగిర్చిన ♦ చిగురనంగ
గతనిప్రశక్రోక్షి♦కర్ణతాళానిలే, రితకుంభసిందూర ♦ రేణు వనఁగ
ధ్వాంతజాలముమీఁద ♦ దండెత్తుభానుమం, తుని వెలిగొల్లెన ♦ తోఁపనంగ
మార్తాండపథరోధి♦మందేహబలపదో, ద్ధుతపూర్వనగధాతు ♦ ధూళి యనఁగ
గీ. వనజరంగస్థలినినాట్య♦మునకు వచ్చు, సిరికిఁబట్టిన కెంబట్టు ♦ తెర యనంగఁ
బ్రాగ్దిశాలిప్తఘుసృణాంగ♦రాగ మనఁగ, మెఱసె నరుణోదయపుదీప్తి♦మింటికెలన.

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 5 పద్య 58.

గీ. ద్విజకులమ్ముల కూఁతలు ♦ దెసల నెగసె, నింకె నక్షత్రతేజముల్ ♦ పంకజాత
మటు విజృంభించెఁ గువలయం♦బట్టిటు వడె, నట్టులగుఁ గాయ రాజకం♦బైనరేఁడల.

సారంగధరచరిత్రము, (చే. వేం.) ఆ 2 పద్య 187.

చ. చిరతరపుణ్యశీలతఁ ♦ జీవిత నాథుఁడు వచ్చు భానుఁ డం
బరయఁగఁ బ్రాగ్దిశారమణి ♦ యంబుజరాగమణీసమంచితా
భరణము లెల్ల యానుటయు ♦ భాసిలు దజ్జనితప్రభాసము
త్కరమట నిండఁ బర్వె నన ♦ గా నరుణోదయమయ్యె నెంతయున్. 1200

నలచరిత్రము, (సి. ధ) ఆ 4 పద్య 7.

సీ. భూరిత్రియామికా♦భోగిని తొలికొండ, పుట్టపై నిడిన ని♦ర్మోక మనఁగఁ
బ్రత్యూషవిష్ణుని♦ర్మథితాంధకారాబ్ధి, రహిఁ దోఁచునవసుధా♦లహరియనఁగఁ
బద్మనీమిత్రుఁడు ♦ బ్రహ్మవేషముఁ దాల్చ, తటినిఁ బట్టిన వెల్ల ♦ తెరయనంగఁ
సుమనంబులకుఁ గల ♦ కొప్పువాను నగ్గిల, పొడి యుంచుదీపంబు ♦ పుటిక యనఁగ

గీ. వెలయ వేసరుఁజుక్కలు ♦ వెన్నముక్కి, చెంతఁజూపట్టుకాముమ♦స్త్రిగయనంగ
మ్రుచ్చువేఁడుకకత్తెల ♦ మోము లెల్ల, వెలవెలనుబోవఁదూర్పునఁ ♦ దెలుపు దోఁచె.

తారాశశాంకవిజయము, ఆ 4 పద్య 125.

సీ. వనవాటికలయందు ♦ వరవిహంగీవిహం,గసమాజకూజిత ♦ కలరవంబు
ప్రాసాదములయందుఁ ♦ బాలకోద్గీతభూ,పాలాదిగీతికా ♦ బహుళరవము
గోస్థానములయందు ♦ గోపకాహ్వానోత్సు,కారంభసురభికాం ♦ భారవంబు
నళినాకరములందు ♦ నవనవోత్ఫుల్లార,విందభృంగచలన్మి♦ళిందరవము

గీ. స్నానఘట్టంబులందు మ♦జ్జనవిధాన, నిరతవిశ్వంభరామర♦నికరపఠిత
సుపరిసిద్ధాఘమర్షణ ♦ సూక్తరవము శ్రావ్యమై యొప్పె నయ్యుష♦స్సమయమునను.

కవిరాజమనోరంజనము, ఆ 5.

సీ. పౌండరీకసమృద్ధిఁ ♦ బాపఁగా శశికీర్తి,మలఁగెనా వెన్నెలల్ ♦ కలఁకఁ బాఱెఁ
బతివిపక్షతనుఱుక్క ♦ సతులకన్నులపోల్కి, రాజుచెన్నఱఁజకో♦రములు బడలెఁ
బద్మినుల్ వెతఁజెందఁ ♦ బరిహసించినదోష,మున నాఁగఁ గుముదినుల్ ♦ మురువుదొఱఁగె
బాంధసంహారపా♦పమున మూర్ఛిలె మాఱుఁ,డన రతికుచముల ♦ నలసి తూఁగె

గీ. నిదుర లుడిగి పునారతి ♦ కెదల వ్రాలు, వాలుగంటులయాణిము♦త్యాలసరుల
శైత్యమున నుక్కుపడి రభ♦సమున లేచు, తప్పతుల నవ్వె దీపికల్ ♦ ధవళరుచుల

ఉత్తరరామాయణము, ఆ 4 పద్య 242.

సీ. తురగరింఖాముఖో♦ద్ధూతరేణువులీలఁ, గలయంగ నుదయరా♦గంబు పర్వ
మేదురమాగధ ♦ నాదంబుగతిఁ బక్షి,విస్ఫురితసారంగ ♦ నినదమలర
సకలవాద్యములఘో♦షములీల నెల్లెడ, విహగారవంబులు ♦ వెలయుచుండ
రమణీయకాహళా♦రావంబుగతిఁ దామ్ర,చూడధ్వనులు మిన్ను ♦ సోడుముట్ట

గీ. బలసి తమఁ గ్రమ్మినడతెంచు♦బలములీలఁ, గిరణనిచయంబునిగుడుచుఁ♦బొరిగొనంగ
నడరి దినరాజు రేరాజు ♦ వంటఁ దఱుము, కరణి నెంతయు నుదయాద్రి ♦ మెఱసెనపుడు.

కిరాతార్జునీయము, ఆ 3 పద్య 159.

సీ. సారసశ్రేణిక ♦ సత్కాంతిఁ జెన్నొందెఁ, గైరవంబుల కెల్లఁ ♦ గలిగె దిగులు
చక్రవాకంబులు ♦ సంతోష మందెను, భయమందెను జకోర ♦ పటలి కెల్ల
భానుతేజంబు న ♦ పరిహార మయ్యెను, పలుచనై చుక్కలు ♦ బలసె మింట
మీనకేతనుసొక్కు ♦ [illegible]ండెను, పక్షిసంఘములు ♦ ప్రబల మయ్యె

సీ. వజ్రమండల మస్తాద్రి◆యందు నిల్చె, దానవారాతికీర్తినల్ ◆ తఱచుగాను
పతనచేసిన ఘర్మల ◆ పరిషన మన, దిశలు తెలుపెక్కె సంతటఁ ◆ దెల్లవాఱె.
గయోపాఖ్యానము, ఆ 1.

మ. దివి నంతంతకు తారకల్ వడఁకెఁ బ్రా◆గ్దిగ్భాగరాగవ్రజం
బవియం జొచ్చెను దీపకాంతులు మఱా◆బాంగులన్ డెల్లె యా
పవనుం డెల్లనఁ జన్మాలి నిసరెన్ ◆ బ్రాంతంబుగాఁ జందురుఁడున్
దక తేజంబు [illegible] [illegible] క్రుంకె ననఁగా ◆ రాత్రిప్రాంతమై యొప్పినన్. 1205
బృందావనవిహారము, ఆ 3.

చ. పలుపలు నైన చీఁకటి పరి◆భావశఃకాంత దోఁచు తారలున్
గలఁగ వటీవిటోత్కరము ◆ గందినచందురుఁడు మ్లానిపిచ్చె చే
కులవిలసిల్లు తామరలు ◆ నొక్కను మేల్కొను పక్షులున్ రుచుల్
దెలిసిన చెందొవల్ గలిగి ◆ వేకువ దాఁ బొసఁగూడె నంతటన్. 1206
ఉద్భటారాధ్యచరిత్రము, ఆ 1 పద్య 46.

ఉ. పిట్టలు గూసెఁ జీకటుల ◆ చెంపెపెఁ దాసె మెఱుంగురిక్కచాల్
దిట్టగ మానె జక్కవలు ◆ వేడుక నొండొరు డాసెఁ గల్వలె
వ్వట్టునఁ డోవ్వె వాసె వెత◆వాసిన తమ్ములు పొంగి తేంట్లకున్
గట్టిన విందు చేసె విలు ◆ నేర్పునమూసె మరుండు వేకువన్. 1207
రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 50.

---

## సూర్యోదయము.



సీ. నీరజాకరములు ◆ నిష్ఠమైఁ జేసిన, భవ్యతపంబుల ◆ ఫల మనంగ
దిపసముఖాభినం◆దితచక్రయుగ్మకం,బుల యనురాగంపుఁ◆బోఁడవనంగ
హరిహరబ్రహ్మమ◆హానుభావంబులొ,క్కటిగాఁగఁ గరఁగిన ◆ గట్టి యనఁగ
కాలవేదత్రయా ◆ లతికా ఫలము వెను, పొందఁ బుట్టినదుమూల ◆ కందు మనఁగ

గీ. నఖిలజగముల కన్నైజ ♦ యగుచు జనస, మాజకరపుటహృదయస ♦ రోజములకు
ముకుళనంబును జృంభణం ♦ బును నొనర్చి, భానుబింబంబు పూర్వాద్రి ♦ పైవెలింగె.
భారతము, (విరా.) ఆ 2 పద్య 241.

ఆ. అంత నుదయశైల ♦ మను నశోకదుమ్రము, సమితియందుఁ గాంతి ♦ చారుభంగి
నెఱయ విరిసి తొలుత ♦ నెగసిన యాజ్జ్వల, స్తబకమనఁగఁబద్మ ♦ సఖుఁడువొడిచె.
భారతము, (ఉద్యో) ఆ 2 పద్య 113.

సీ. ప్రాచీనశైలాగ్రభాగస్థమగు నశో, కంబునఁ జిగురుజొం ♦ పంబనంగ
వర్షాధిపతియని ♦ వాసవ్రుఁ గొలువఁ జే, రినయింద్రగోపక ♦ శ్రేణి యనఁగ
సురుతరపూర్వభూ ♦ ధరముసెత్తంబునఁ, బొలుచు గైరికగండ ♦ శిల యనంగఁ
గాశ్మీరపటమునఁ ♦ గావించి సురపతి, విడిచి యాడెడు తూలుఁ ♦ బడఁగయనఁగ
గీ. నరుణకిరణుండు దోతెంచె ♦ నంబుజాత, నర్మసచివస్మితాపాద ♦ నంబునందుఁ
జతురుఁడై యుష్ణకరములఁ ♦ జక్రవాక, తాప ముడుపుటనాశ్చర్య ♦ ధాముఁడగుచు.
దశకుమారచరిత్రము, ఆ 5 పద్య 128.

మ. తనతేజంబున నన్యతేజముల వి ♦ ధ్వంసంబునొందించి రెుం
డును సన్మార్గము సుప్రకాశవిగళ ♦ ద్దోషంబుగాఁ జూపియ
త్యురుకోజ్జ్వలమండలుం డగుచుఁ బూ ♦ ర్వాద్రీంద్రభద్రాసనం
బున నొప్పెన్ గ్రహరాజు విశ్వముకరం ♦ బుల్ మోడ్చి సేవింపఁగన్. 1211
హరివంశము, (ఉత్తరభాగ.) ఆ 3.

చ. అనితరకాంతిఁ బద్మినిఁ బ్రి ♦ యాతిలకంబు మెుఱంగిపోయి కే
రెునసిపవేడ్కనొందుపన ♦ యిచ్చ మెయిన్విహరించి మేనఁ జం
టినసవరాగలీల జిగి ♦ జేరఁగ నోడి రెుుదింగి రెుుయ్యనో
య్యనఁ బొడచూపెనా నుదయ ♦ మయ్యెఁ బతంగుఁడు ప్రాగ్ముఖంబునన్. 1212
నృసింహపురాణము, ఆ 3 పద్య 116.

మ. కమలామోదమెలర్ప నేత్రసుఖదా ♦ కారంబు రంజిల్ల సు
త్రామువందారుశిరంకి రప్ప మెసఁగన్ ♦ ధర్మార్థకామక్రియా
దిమమూలంబన నొప్పు మిత్రుఁ డుదయో ♦ త్సేకప్రభావంబుచే
సముఁ డద్దైవున కిందువంశజుఁడు త ♦ చ్ఛంచద్గుణశ్రేణులన్. 1213
కావ్యాలంకారచూడామణి. (ఉల్లాస.) 3 పద్య 114.

సీ. ధరణీధరములందు ♦ ధాతుపాషాణంబు, పాదపంబులయందుఁ ♦ బల్లవంబు
పాథోనిధులయందుఁ ♦ బవడంపుదీఁగ, కాలాభ్రములయందుఁ ♦ గోలమెఱుపు

హరిదంతనాగంబు♦లందు సింధూరంబు, భూమిగోమేదలియందు ♦ హేమభూష
యాకాశవీథియం♦దుదితంబరత్నంబు, నబ్జజాండగృహంబు ♦ నందు దివియ
గీ. యనుచు బాలాతపముజగం♦బాక్రమింప, నంధకారము దిక్కుల ♦ నస్తమింప
భానుబింబము వొడిచెఁ బ్ర♦భాతలక్ష్మి, కబరిభారంబుమీఁది చెం♦గలువకప్పు.
కాశీఖండము, ఆ3 పద్య 238.

సీ. పౌలోమిదిక్పాలు ♦ పాన్పుపైఁ గనుపట్టెఁ, బన్నినబవడంపు ♦ బంతి యనఁగ
నాయుక్తముల‌క్ష్య♦యంబు లొత్తిలి చాటు, కాలజాంఘికుచేతి ♦ ఘంట యనఁగ
ఘనజంతుజీవిత ♦ కాలరాసులపిధి, కొలువ నెత్తినహేమ ♦ కుంభ మనఁగఁ
బశ్చిమదిక్కాంత ♦ పరగఁ గైసేయుచోఁ, ముందట నిడుకొన్న ♦ ముకురమనఁగఁ
గీ. లోకతాపోపశమవిద్య ♦ ఘుటిక యనఁగఁ, బద్మినీకాంతనోముల ♦ ఫల మనంగ
మూఁడుమూర్తులసారంపు♦ముద్దయనఁగ, మిహిరమండలముదయాద్రి♦మీఁదనొప్పె.
భాగవతము, స్కం 10 పూర్వ, పద్య 1302.

సీ. నళినదళంబుల ♦ కళలొని వెలయించి, కువలయదళముల ♦ కొవ్వణంచి
కుసుమబాణుని పెంపు ♦ కొంత విచారించి, విరహులఁ బట్టిన ♦ వెట్టఁ దెలిపి
యంధకారము నెల్ల ♦ హతమును గావించి, చుక్కలతేజంబు ♦ చక్కఁ బెట్టి
మదచకోరంబుల ♦ మదములు విడిపించి, నిఖిలజగంబుల ♦ నిద్ర మాన్చి
ఆ. వెండిదీప్తి దిశల ♦ వెదచల్లి మునులును, నమరసంఘములును ♦ నర్ఘ్యజలము
లొసఁగఁ బూర్వశైల♦దెస నభిరమ్యమై, తామ్రకిరణుఁడైన ♦ తరణి వొడిచె.
వీరభద్రవిజయము, ఆ 3 పద్య 122.

సీ. మొగుడుతమ్ములఁజిక్కు ♦ మగతేఁటియలుఁగులు, సడలిపోఁజేయు వి♦శల్యకరణి
కాలవశంబునఁ ♦ గడచన్నవాసర, శ్రీఁగ్రమ్మఱించుసం♦జీవకరణి
చేయనువాలునఁ ♦ బాయుచైనరథాంగ, తతుల హత్తించు సం♦ధానకరణి
తిమిరంబుచే సొంపు ♦ సమసినదిశలకు, వన్నియనొసఁగు సౌ♦వర్ణకరణి
గీ. మించుబీరెండ నగ్నిఁ బుట్టించు నరణి, కలుషఘోరపయోరాశిఁ ♦ గడపు తరణి
తోఁచెఁ బ్రాచీమహీధరో♦త్తుంగసరణి, పాఁజదువుమానికంబుల ♦ బరణి తరణి.
పారిజాతాపహరణము, ఆ 4 పద్య 49.

సీ. తనుఁబాసిశశిదవ్వు ♦ చనినవెవ్వగఁబోలెఁ, దొలిదిక్కుజవరాలు♦ వెలుకఁబాఱెఁ
బశ్చిమాద్రి సభయందుఁ ♦ బఱచిన కెంబట్టు, జముకాణ మనఁగ రా♦గము జనించె
ధవ్వుఁగూర్మి కొసరుచు♦న్నవివోలెముఖరాళి, వనరుహాస్యముఁ బ♦ద్మినులు తెఱచె
భానూష్మభీతిము♦న్నడిన చుక్కలభంగి, దొరలె వేకువ గాలి ♦ దరుల మంచు

గీ. కాలగుణయుక్తి మించిచ♦క్కటికి నెగయు, వాసవునిపట్టిపాడువుగా ♦ వైచియాడు
గచ్ఛపమరినదారుచ♦క్రంపుబిళ్ళ, వోలె నొయ్యనఁ ద్రాచిలేచ ♦ బొంగ్రిద్దు వాడిచె.
మనుచరిత్రము, ఆ 5 పద్య 40.

ఉ. ఏఁగలలోన నొండెఱుఁగ ♦ నీవెవిభుండవు సందియంబునా
పైఁ గలదేని చూడుమని ♦ ప్రాగ్దిశ గౌతమదార జారునిన్
దాఁ గడు నమ్మఁ జేయుటకుఁ ♦ దాగ్రిఁగ నెత్తెడు నట్టి యొఱ్ఱఁగాఁ
గాఁగిన మద్దుచందమెస♦గం గనుపట్టె నినుండు నుష్ణతన్. 1219
ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 5 పద్య 60.

సీ. మిళితభూగగనాంత♦ముల సందువిచ్చినఁ, గాన్పించుబ్రహ్మాండ ♦ కాంతి యనఁగ
దిశ లెన్నుచిదిపూర్వ ♦ దిశయని బ్రహ్మని,ల్పినయట్టి మొదలిటి ♦ లెక్క యనఁగ
నుదయాచలాధీశు ♦ నుత్తమాంగంబున, భాసిల్లు హొంబట్టు ♦ పాగ యనఁగ
గగనాఖ్యపనసవృ♦క్షపరికాండోపరి, భ్రాజితంబగు పక్వ ♦ ఫల మనంగఁ
గీ. తారకాభక్తచంద్రికా♦క్షీరభోజ,నాంతమునఁ బూర్వసంధ్యయ♦న్కాంత వెలిచి
లీలఁ జేర్చిన పసిఁడి ప♦ళ్లెర మనంగఁ, దరణిబింబంబు గాన్పించె ♦ వరుసతోడ.
కళాపూర్ణోదయము, ఆ 8 పద్య 34.

చ. పటలకపద్మరాగమణి ♦ వట్రువగ్రాలఁగఁ బట్టి చేర్పు పెం
పొదవఁగఁ దూర్పుకొండపయి ♦ కొప్పఁగఁ దెచ్చి జగద్గురుండు దాఁ
ద్రిదశవరేణ్యుకట్టెదురఁ ♦ దేఁకువ నిల్పిన దర్పణంబునా
నుదయమునొందె భానుఁడు స♦ముజ్జ్వలకోకనదప్రదీప్తులన్. 1221
మొల్లరామాయణము, అయో. పద్య 23.

ద్విపద, శలీరుబోఁడులమాన♦ఘనములఁదివియు, నలినాస్త్రచోరక♦న్నపుఁగత్తియనఁగ
నామీనసతిదాల్చు ♦ నట్టి తేవంక, నామమోయనఁ దోఁచె ♦ నలినారియపుడు.
అష్టమహిషీకళ్యాణము, ఆ 2

ఆ. తప్పఁ లేక రాజు ♦ తెనుడించియాపరఁజెం, దుటయుఁ దాను మిగుల ♦ దోషయగుటఁ
బ్రాచిలోక మెఱుఁగఁ♦బాలఁబుట్టెడువాని, పోల్కి నెఱ్ఱనగుచుఁ♦బ్రొద్దువొడిచె.
కవికర్ణరసాయనము, ఆ 4 పద్య 196.

చ. పనకుహాసైరి పద్మినిని ♦ వావి దలంపక పాపతోడనం
బున నపహరించఁ గాన్పించుకొను ♦ జొందుచు రక్తములోన నుండెయో

య్యనఁ దలపంచెఁ దస్తువల♦యంబు హసింపఁగ నంచుఁ; గుక్కుట
ధ్వనియనుదూత పల్కు విని ♦ వచ్చెననన్ రవి దోఁచెఁ దూర్పునన్ 1224

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 3 పద్య 74.

ఉ. శంకఁ దొలంగి చంద్రుఁడను ♦ జాజులపొట్లము వైవఁ బూర్వది
క్పంకజగంధి తత్పతికిఁ ♦ గైనివసంతముసల్లఁ దెచ్చెనాఁ
గుంకుమగంధసారరస ♦ గుంభితచర్మవిశేషభస్త్రినాఁ
బంకజబాంధవుం డలరెఁ ♦ బ్రాగ్గిరికూటశిఖాతటంబునన్. 1225

భానుమతీపరిణయము, ఆ 3 పద్య 87.

చ. క్రమమున మిత్రమండల మ♦ఖండితపండితధామభూమచేఁ
గొమరు వహించెఁ బూర్వగిరి♦కూటమువహోన్నతకేతవాసియై
యమరకులాధినాథసము♦దంచితపట్టనసౌధపాళిపై
నమరెడు కుందనంపుగడి♦యారపుగంట యనంగ నెంతయున్. 1226

చమత్కారమంజరి, ఆ 3 పద్య 40.

సీ. తిమిరకుంచివిదార♦ణమునకు నుదయాద్రి, దరినిర్గమించు కే♦సరి యనంగ
శీతాంశుకిరణమూ♦ర్ఛితపద్మలక్ష్మికి, సముచితజీవనౌ♦షధమనంగ
యామినీవిరహవి♦హంగదంపతులకు, సాంగత్య మొనరించు ♦ సఖుఁ డనంగ
భువనాంతరక్షేత్ర♦మున నంశుబీజముల్, వెదవెట్టుకర్షక ♦ విభుఁ డనంగఁ
గీ. బరమ మునిపుణ్య పరిపాక ♦ ఫల మనంగఁ, బ్రాక్సతీపద్మరాగద♦ర్పణ మనంగ
జంభరిపుసౌధకాంచన♦కుంభ మనఁగ, సూర్యుఁ డుదయించె నభినంది♦తార్యుఁ డగుచు.

వరాహపురాణము, హరిభట్టు.

క. ఘనతిమిరోరగకబళిత, వనజాసననిర్మితాండ ♦ వర్ణితసంజీ
వన మిది యన నుదయించెను, దినకరుఁడు సురాధినాథ ♦ దిగ్భాగమునన్. 1228

మత్స్యపురాణము, ఆ 4 పద్య 80.

సీ. తరణివచ్చెనటంచు ♦ గురుతమోవారాశి, మగ్నులందఱును స♦మ్మదము పూన
హంససమాగమం♦బయ్యె నంచుఁ బ్రబోధ, కాము లెంతయుఁ గౌతు♦కము వహింప
మిత్రసంగతి నైన ♦ మేలు గల్గె నటంచు, నతిబాధ గనువార♦లాదరింప
నినుఁడు గల్గెనటంచు♦ఘన తస్కరాదిక, భీతిఁ జెందినవారు ♦ ప్రేమ పూన
గీ. గగనమణి యబ్బె ననుచు శ్రీ♦కాంతుఁ గన్న, మనుజులందఱు నానంద♦మనుభవింప
నిఖిలభువనప్రకాశకో♦న్నిద్రలీల, భానుఁ డుదయించె నా తామ్ర♦భానుఁ డగుచు.

సీమంతినీకళ్యాణము, ఆ 3.

ఉ. ఆననజాస్రస్ఫుటప్రతిపయి♦నంబుధి స్వపరీతిబింబముం దగన్
కేవలమైన యద్భుతము ♦ గీల్కొను చక్రియుగంబుగా మయూ
ఖావళినూత్నసంహతియొఁ♦గా భువిఁ బాంథుల మేలుతూఁపన్
జావిలిఁ దెల్పు ధక్కయను♦చాడ్పున నొప్పె విచిత్రభంగిమై. 1230

పరిబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము, పద్య 121.

మ. శిశిరకాంతవియోగసంజనితగ♦ర్భీభూతతాపజ్వరో
ల్లసదార్తిం గృశియించుచున్నయెడఁ గ♦ల్యప్రాజ్ఞవైద్యుండు నే
ర్పెసఁగన్ దప్పిబలోపతాపముడుపన్ ♦ హేలాగతిం దెచ్చు జల్
రససింధూరపుటుండయో యనఁగ మా♦ర్తాండుండు దోఁచెన్ దివిన్. 1231

రసికజనమనోభిరామము, ఆ 5 పద్య 114.

చ. సమయవినోదిమిన్న నెడి ♦ చక్కని రంగమునందు సర్వవి
గ్రిమణులు చూడ గారడము ♦ రక్తిని జూప విధుండనెడున
ద్గము నొక కర్ణమం దునిచి ♦ దాపలికర్ణమునందు హేమచ
క్రము వెడలంగఁ దీసెననఁ♦గా రవి దోఁచెఁ బ్రభాప్రభావుఁడై. 1232

విల్హణీయము, ఆ 3 పద్య 187.

మ. తమముం బాయఁగఁ జేసి రాగగుణముం ♦ దప్పించి సన్మార్గవ
ర్తిమతంబొప్పఁ దపంబు పెంపుననువ♦ర్తిష్ణుత్వముం గాంచి లో
కము లెల్లం గనుఁగొంచు సజ్జన నమ♦స్కారార్ఘ్యదానంబులం
బ్రమదంబొంది వెలింగె యోగికరణిం ♦ బ్రద్యోతనుం డయ్యెడన్. 1233

అనిరుద్ధచరిత్రము, ఆ 3 పద్య 89.

చ. తొలుతటిదిక్కుదీవులట ♦ తోడనె భూధవునాజ్ఞ చేకొన
న్మలయుకనిల్చుతద్ధవళి ♦ మంబను తెల్లనిశాని చేరుపన్
వెలిఁగెడు పద్మరాగయుత ♦ విశ్రుతకాంచనకుంభమో యనన్
జలరుహబాంధవుం డుదయ ♦ శైలముపై గనుపట్టె నయ్యెడన్. 1234

ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము, ఆ 1 పద్య 53.

ఉ. వాసెడవాసి గువ్వలర♦వంబులనెంతయు మ్రోల్గిమ్రోల్గి గో
త్రాసురమంత్రితాంబువులు ♦ త్రావి సమీపదిశన్ నిశాచర
గ్రాసముగా ననూరురుచి ♦ రక్తజలాన్నము లెత్తిచల్లఁ బ్రా
చీసతి గాంచెఁ బుత్త్రి నతి♦చిత్రచరిత్రుఁ బవిత్రమిత్రునిన్. 1235

రుక్మిణీపరిణయము, స. భ. ఆ 2 పద్య 266.

ఉ. కాలము దా విభుత్వమును ♦ గన్నది గాన సభాప్రదేశమా
లీలను దోఁప మైత్రికిని ♦ బ్రేమయొసంగిన పద్మరాగమో
యేలిక రాకఁ గాంచ మది ♦ హెచ్చి వెలింబడు పద్మరాగమో
నారవియుం బదాభగఁ గ ♦ నంబడెఁ దూర్పున మింట నయ్యెడన్. 1236

పార్వతీపరిణయము, ఆ 5.

చ. కలువలసొంపువాఱె భుజ♦గంబులు పుట్టలఁ దూఱెఁ దారకా
వళి రుచి జాఱె జక్కవల ♦ వంతలు దీఱెఁ జకోరకవ్రజం
బుల సుఖమాఱెఁ దమ్ములకు ♦ మోదము లూఱె నిశాకరద్యుతుల్
వెలవెలఁబాఱెఁ దూర్పుదెస ♦ వెల్లడిగాఁ దెలవాఱె నయ్యెడన్. 1237

భల్లాణచరిత్రము, షో॥ వీ॥ ఆ 1.

సీ. హరిదిగద్ధికరగ్ర♦హణవేది గారోద,యము నిశాభవ్యాపి♦కము వళక్షు
ఖమ్మ్రకతోష్ణల్లాభ ♦ కాయమానముఖగ, పంక్తిసత్తోరణ ♦ పరితతినీల
కంకధ్వనులు పిక♦కాహళ రావముల్, తతపక్షినినదవా♦ద్యములు భృంగ
సంభావనాద్విజుల్ ♦ చక్రివివాహప,తులు కాశ్యపిపురో♦హితుండు గాఁగ
గీ. గల్యబాలవరుని దివా♦కన్యఁ గూర్చి, హరతులొసంగఁ జన్నలా♦స్యాకరదశ
శతమణీదీపవర్తికాం♦చనసుపాత్ర, యన సహస్రకరుం డొప్పె ♦ నంబరమున.

గణోదయము, ఆ 2 పద్య 45.

చ. అలయక బాలసూర్యుఁ డుద♦యాద్రిశిఖాంగణమందు నాడుచున్
జెలువుగఁ జారుపద్మినుల♦చే ససరోరుహవక్త్రహాసమున్
గలుఁగగ వీక్షితుండగుచుఁ ♦ గమ్రఖగధ్వనిఁ జేరఁ బిల్చిన
ట్లలరు నభోంకమందునిహి♦తాగ్రకరుండయి యొప్పె లీలతోన్. 1239

శిశుపాలవధ, ఆ 3 పద్య 36.

సీ. ఆకాశవాణినో♦య్యనఁదాల్చు తమ్మికెం,పుల గొప్పనింబోలి ♦ పూస యనఁగ
వేలుపువారకొమ్మ ♦ మేలి ముత్తెపు పేర్లు,నొగి కొల్కిఁ బెట్టిన ♦ పగడ మనఁగ
విమలరంభాలలా♦టమున చుక్కఁ దెఱంగు, సమకూర్చినట్టి కుం♦కుమ మనంగ
సముచితనాదసునిక్రో♦న్నతోఁటలోఁ బూసు,గొరలు దాలిమ్మపూ♦గుత్తియనఁగఁ
గీ. బూర్వదిగ్భామినీమణి ♦ పువ్వుఁబోండ్లఁ, గూడి యాడెడు తరిమూల♦నాడి పడిన
వాజి తోరణవికచ స♦రోజ మనఁగఁ,బ్రొక్కి ఖరిదోఁచె నంభోజ♦బాంధవుండు.

నీలకుంతలావిలాసము.

ద్విపద. తనయుని పెండ్లికి ♦ ధరణీధరారి, ఘనతఁ గట్టిన మేలు♦కట్టో యనంగ
నిందీవరాక్షితో ♦ నెలమిజయంతుఁ, దంచి వసంతంబు ♦ లాడెనో యనఁగ
నిల ధరేంద్రములతో ♦ నింద్రుండు పోరి, జలజల రక్తంబు ♦ సల్లెనో యనఁగ
నరుణోదయంబయ్యె ♦ నంతలోపలను, వరవైభవంబున ♦ వాసవుఁడిడిన
కొలువులో జగజంపు♦గొడుగో యనంగఁ, జెలువొప్పుపూర్వాద్రి♦శిఖరంబుమీఁదఁ
జలమున హరివేయు ♦ చక్రమో యనఁగ, జలరాశిపుట్టంబు ♦ సతిధరియించు
పాలుపొందు పాపట ♦ బొట్టో యనంగ, బలభేది మెడనున్న ♦ పతకమో యనఁగ
వటనతో నిందుశ్రీని ♦ నాతిపై నున్న, పటువైన చెంగల్వ ♦ బంతియో యనఁగ
భానుఁడప్పుడు తూర్పు♦పర్వతంబునను, మానుగాఁ జనుదెంచె♦మహియెల్లఁ బొగడ.
నలచరిత్రము, చ. రా. ప్రథ. భాగ.

ఆ. వెచ్చకాండ్రమదుల ♦ వేడుక డిందంగ, పాఱు లలరి పగటి ♦ పనుల కడర
వడిగఁ గాఁపువారు♦పనిపాటలకుఁ బోవ, తూర్పుకొండమీఁదఁ♦దోఁచెఁ బ్రొద్దు.
రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 51.

---

# మధ్యాహ్నము.



సీ. పద్మినీపద్మాత ♦ పత్త్రింబు శిథిలమ, తాగ్రమై రాయంచ ♦ యాశ్రయించెఁ
దాలుస్రవత్ఫేన ♦ జాలంబుతో ఘోణి, పంచలరొంపిగ ♦ లంచియాడె
మార్గోద్గమద్దావ ♦ ధూమమంబుపఙ్క్తి. నెమ్మి లోపాదనుండి ♦ నిక్కి చూచె
జఠరస్థజలము సా♦సానాళమునఁ గ్రీల్చి, సామజంబిరుపక్క ♦ జల్లుకొనియె
గీ. సరసిపైనీరు సలసల ♦ దెఱలె విపిన, సకలవీథులు నిర్మృగో♦చ్చయము లయ్యె
ఋష్టిమధ్యాహ్నమిది సుధా♦మధురవాణి, యగ్నిమించెఁ బథశ్రమ♦మపనయింప.
పాండురంగమాహాత్మ్యము, ఆ 1 పద్య 136.

# సంధ్యారాగము.



చ. సురుచిరతారకాకుసుమ♦శోభి నభోంగణభూమిఁ గాలమ
న్గురువపుమాత్రధారి జత♦నంబున దిక్పతికోటిముందటన్
సరసముగా నటింపఁగ ని♦శాసతి కెత్తిన క్రొత్తతోఁపుసం
జెరయున నొప్పెఁ సాంధ్యనవ♦దీధితి పశ్చిమదిక్తటంబునన్. 1244

నృసింహపురాణము, ఆ 3 పద్య 78.

గీ. వామనానేకపముచక్ర♦వాళకుధర, ధాతుతటముగోరాడుచో♦ దరులువిఱిగి
కూలుటయు మింటికెగసిన♦ధూళి వోలెఁ, బర్వె నెఱసంజవడమరఁ♦బట్టుకొనుచు.

విక్రమసేనము.

చ. తరువులయందుఁ బల్లవప♦దస్థితి నద్రులయందు ధాతుబం
ధురగతి నంగనాజనప♦యస్తనమండలిఁ గుంకుమంబునై
పరఁగుచు సాంధ్యశోణిమవి♦భాసురమై జలవాదదిక్తట
ద్విరదము కుంభసంభవన♦వీనగళద్రుధిరంబునాఁ దగెన్. 1246

భాస్కరరామాయణము, యుద్ధ, పద్య 2633.

చ. పరిమదమదాదిరేకమునఁ♦బాసివిలాసవతీకదంబకం
బుమిసిన తమ్ములంపుఁగఱ♦యో యన నింగిలికంబుఛాయచేఁ
గమిసిన దాసనంపుఁబువు♦కాంతికిడాసిన కూర్మిచుట్టమై
కొమరున సంజ యంబరము♦కొంగుననూన్చెఁ గుసుంభరాగమున్. 1247

భీమేశ్వరపురాణము, ఆ 2 పద్య 29.

క. సుందరసాయంసంధ్యా, వందనవిప్రాస్తతోయ♦ వజ్రిహతోద్య
న్మందేహాసురరక్త, స్యందముక్రియఁ గెంపుసొంపె♦సఁగెఁ బరదిశన్. 1248

భాగవతము, స్కం 10 పూర్వ, పద్య 1289.

చ. తనువున నంధకారపుమ♦దం బలమి న్ననుభద్రదంతికి
న్మొనసినఁ జిందరేఁగి తప♦నుండను మావుతుఁ గ్రుంకు మెట్టలో
య్య సురలవైచినన్నొగిలి♦యచ్చట నెత్తురు గ్రిక్కెనో యనన్
గనుఁగవఁగోరగింపఁ బొడ♦కట్టె సముజ్జ్వలసాంధ్యరాగముల్. 1249

పారిజాతాపహరణము, ఆ2 పద్య 32.

సీ. కపిబింబపతనటీ♦కౢప్తమోహనకర్పరి, కృతశేషఫణిఫణా♦రత్నరుచిరయొ
దివసాపసానసం♦దీప్తాస్తగిరిశిఖా, జ్యోతిర్లతాప్రతా♦నాతపంబొ
తపనమార్తాండని♦ర్గళితదిక్తటపృశ్వ్య, కమలజాండకటాహ ♦ కనకఘృణియొ
చండీశతాండవో♦త్సవసంభృతతపా, హస్తాగ్రదీపగ ♦ భస్తిచయమొ
గీ. హరిద్విదాహచ్ఛిదాతిని♦దాఘమదప, దంజనాలానమూలశ♦య్యావిధాన
వారణాధోరణాకల్పి♦తోరుశోణ, మృత్తికారాశియో యన ♦ మెఱసె సంధ్య.
మనుచరిత్రము, ఆ3 పద్య 17.

క. తొట్టుకొని సంజకెంప, ప్పట్టిన రవిఁబాసి సితగ♦భస్తి నెదురుకో
నట్టె సిరివచ్చుటకు నై, పట్టిన కెంబట్టుదిడ్డి♦పాలకిఁబోలెన్. 1251
రామాభ్యుదయము, ఆ2 పద్య 92.

సీ. వనజాలయముమూసి ♦ యినుజూడఁ దిలకించు, లలితాబ్జినీరాగ ♦ లక్ష్మియనఁగ
ఘనపదాయాసపట్టి♦కఁదమోంజనముపట్టి,నపరాశయిడిన దీ♦పార్చి యనఁగఁ
గిప్పుచూపుచుఁ బాంథ ♦ గణము నేఁచుపద్రిదోష,కరి మేనిధాతుశృం♦గార మనఁగ
ద్విజనూక్తిఁ బతిరాక ♦ దెలిసి మోమెత్తిరా,త్రివహించుకాశ్మీర ♦ తిలక మనఁగ
గీ.సమయమృగహృతరవిరథూర్త్తమునిసతిఁబ్రి,భామయిఁదమోనిశాటుండు♦పరవకుండ
ననలదామంబులోడాఁచి♦ యమరులిడిన,వంచనాగారగాత్రినా ♦ వఱలె సంధ్య.
వసుచరిత్రము, ఆ 4 పద్య 7.

మ. ఇనుఁడత్యుత్కటతేజుఁడై మెలఁగి భూ♦యిష్టానురాగంబునన్
దనుఁ జేరం జనుదేరఁగా నపరది♦క్స్త్రీశిరోరత్నమె
త్తినవీరాజనమో యనం దడనుష♦క్తింబుట్టురాగంబుత
త్తనదాశాపతి మేనఁ బల్విరిసెనాఁ ♦ గన్పట్టె సాంధ్యద్యుతుల్. 1253
ఘటికాచలమాహాత్మ్యము, ఆ 2 పద్య 106.

సీ. పాటలంబులవన్నె ♦ తేటమంకెనలబిం,కము..............విద్రు♦మములసొబగు
పద్మరాగంబుల ♦ పసపిప్రియంగుచ్ఛాయ, కుసుమమొప్పిదముకుం♦కుమముచెలువు
లత్తుకచెన్నుప♦ల్లవసముల్లాసంబు, కాశ్మీరజాంగరా♦గంబుపూఁత
చక్కఁదనంబుహం♦సములచంచుస్ఫూర్తి. పటుపలాశద్రుమ ♦ ప్రసవకాంతి
గీ. బింబఫలవిభవము చంది♦రంబుకోవి, యాదిగాఁగలరక్త(పదా)ర్థసమితి
వలువకేలికినొకచోట♦నలమికూ(ర్చి), ననఁగఁజెలువొందె నెఱసంజ♦యపరదిశను.
ఉద్భటారాధ్యచరిత్రము, ఆ 1 పద్య 35.

సీ. తపనుఁడెప్పన నేయఁ ♦ దద్వహుగ్రహణార్థ,మటుదొచుఁచటులార్చ♦టార్చియనఁగ
నత్తుకాండు విష్ణుఁడై ♦ యరుగుతోడనఁ జను, పతగశేఖరుగరు♦త్ప్రతతి యనఁగ

లోకబాంధునకు ర◆త్నాకరుం డెదురేఁగి, బడిసివైచినమణి◆ప్రరుచి యనఁగ
వినువిరాకకు దిగం◆గనపాంగ వెలిఁజిమ్మ, తదనురాగరసాంబు◆ధార యనఁగఁ
గీ.॥ వరుణతారాతికన్యాను◆ సరణకరణ, సమయకాముకసముచిత◆ క్రమవిరచిత
జవమనఃప్రీతసపదిసా◆క్షాత్కృతారు, ణావయవదివ్యశక్తినా◆ నలరె సంధ్య.
లక్ష్మీవిలాసము, ఆ4 పద్య 38.

గీ. అజ్జబాంధవపరిహాఫ◆రాస్త్ర మైన, జలధివల్లభదిశయను◆ చంద్రముఖికి
నవుడొనర్చినకిసలశ◆య్యాయును బోలె, గుంజపుంజారుణశ్రీల◆ సంజ దనరె. 1256
పరమయోగివిలాసము, ఆ 3 పద్య 227.

చ. తిమిరపుదాడికాఁడు చను◆దేరఁదొడంగెను నాకెదుర్వఁగా
సమయమూగాదు గూఢతర◆ చర్యనువర్తిలి వేగవచ్చెదన్
రమణఁడమోనుదాశ్రియము◆ నన్నిలుమంచును నైజతేజమున్
గమలహితుండునిల్పనరఁ◆గాఁ జొడకట్టెను సాంధ్యరాగముల్. 1257
విప్రనారాయణచరిత్రము, ఆ 3 పద్య 23.

చ. సమయభిషగ్వరుండపర◆శైలపుఁగుప్పె దినేంద్రుఁడన్ రసేం
ద్రము నిడి పైఁదదూర్ధ్వకర◆తామ్రశలాకఘటించి వహ్నియో
గము నొనరింప సిందురము◆గాఁ బయికిం బ్రసరించెనాఁగరం
బమరెను సాంధ్యరాగము న◆భోంతరదంతురితాంశుభాగమై. 1258
ముకుందవిలాసము, ఆ 3 పద్య 41.

గీ. రాజు కువలయ మలరింప◆ రాఁదలంచు, టెంచి సమయాధికారి గ◆ట్టించినట్టి
భవ్యకల్హారతోరణ◆ పంక్తియనఁగ, సాంధ్యరాగమువిలసిల్లె◆ సాంద్రముగను.
రాజశేఖరవిలాసము, ఆ 1 పద్య 127.

సీ. చరమాద్రిశిఖరసం◆చరదభ్రచరవధూ, శ్రేణిగట్టినతోఁపుఁ◆ జీర లనఁగ
నంబరారణ్యాభో◆గంబునఁ దళుకొత్తు, గుజ్జులేమావిచి◆గుళ్లనంగ
నంబుధీశ్వరురాణి◆ హర్మ్యాగ్రభిత్తిపైఁ బొలుపారుజేగురు◆ పూఁతలనఁగ
దిక్సతీమణులుమ◆త్తిలిచల్లులాడెడు, గడితంపుబగ్గుండి◆ పొడు లనంగఁ
గీ. జిమిరమత్తేభరాజము◆ద్వృత్తి బయలు, వెడలుచో మేనఁ గనుపట్టు◆ వితతగైరి
కప్రభాచ్ఛటలనఁగన◆ఖండలీల, సంజకెంజాయలలరె ది◆శాముఖముల. 1260
రసికజనమనోభిరామము, ఆ 4 పద్య 94.

గీ. సవిధలక్ష్మిదినేశ్వరో◆గ్రప్రతప్త, వితతనిష్పందపక్షిమో◆క్షిధరస్థి
తప్రభాకరకాంతతా◆మ్రప్రదీప్తి, యెందుకో నెనో యనన్ ధాత్రి◆ మెఱసె సంధ్య.
రామచంద్రోపాఖ్యానము, వా। వేం॥ ఆ 4 పద్య 107.

చ. దినకరుచెంగట న్వరుణ◆ దిగ్గణికామణిరూపవైఖరుల్
గొనబుగఁ జూపి యంత రవి◆కూరిమి మెచ్చికుసుంభచేలమి
చ్చిన నది మేల్మిసుం గిడుచుఁ◆ జెన్నువహింప బహిర్గతంబులై
యొనరు తదీయశోణరుచు◆లోయనఁ గన్పడె సాంధ్యరాగముల్. 1262
కృష్ణార్జునచరిత్రము, ఆ 1 పద్య 145.

మ. అపరాద్రీభకుంభుండు రాకతఱి◆యానక్రిసంగ్రస్తదే
హపరార్థుండగుచున్ విరావయుతుఁడౌ◆టాలించి మేలెంచి కా
లపయోజాక్షుఁడు లీలఁ జక్రహము దూ◆లన్ సూర్యచక్రంబునై
చి పడంగొట్టఁగ జిమ్ము రక్తమన మిం◆చెన్ సాంధ్యరాగం బొగిన్. 1263
కృష్ణాభ్యుదయము, ఆ 1 పద్య 75.

ఆ. ఇనసమాగమమున◆ కెంతయు రాగిల్లి, వరుణదిగ్వధూటి◆ వన్నెమీఱఁ
గటితటంబునందుఁ◆ గట్టిన కౌసుంభ, వస్త్రమో యనంగ◆ వఱలె సంధ్య. 1264
గోపీనాథరామాయణము, యుద్ధ.

ఉ. వారిజసంభవాఖ్యవన◆పాలకనిర్మితమా వియత్తల
స్ఫారతరాటవీస్థలిని◆ బశ్చిమదిక్కను పేర నొప్పి పెం
పారెడు చూతజాతము ది◆నాంతవసంతప్రవేళఁ దోఁప సం
ధ్యారుచిజాలకైతవము◆నం జిగురించి తనర్చె మెండుగన్. 1265
నయనోల్లాసము, ఆ 3 పద. 100.

చ. భువిఁగిలవీరులందఱు న◆భోమణియుంజనఁ జూచి తాళిమిం
బవిసితొఱంగి వార్ధిఁజొర◆బాలువిధంబునఁ గ్రుంకుభానుపై
గవిసినరక్తధారలనఁ◆గా జరఠాతపముల్ చెలంగుచున్
భువనములెల్లనిండెఁ గుల◆భూధరగైరికమండలద్యుతిన్. 1266
విశ్వకర్మపురాణము, ఆ 5.

గీ. లేవనపుడు నిశానర్త◆కీవధూటి, నాట్యమొనరింపఁదలఁచియుం◆దరనుతోఁ బ్రు
సేసయుమర్పించెనో నాఁగ◆ నీప్సితమగుచు, సాంధ్యరాగంబుప్రాగ్దిశా◆సరణిఁబర్వె.
ద్రౌపదీపరిణయము.

పాడవైనయాకాశ ♦ భూరుహంబున సంధ్యఁ,గొనయఁగ గొలచెర్వి ♦ కూలినట్లు
చరమదిగ్భ్యతాళ♦కరమునవరుణుండు, గడివెట్టఁ బొలపొట్ట ♦ నడఁగినట్లు
గీ. క్రుంకుగుబ్బలిపారకి ♦ కొప్పరించి, పట్టఁజాలక వైచిన ♦ బ్రద్దపరికిఁ
బాటియగుచు ముగురపొత్తు ♦ పళ్లెరంబు, భానుమండలమంతఁ జూ♦పట్టదయ్యె.
ఉత్తరహరివంశము, ఆ 4 పద్య 271.

గీ. గగన యానవేగంబునఁ ♦ గలమరించి, కడుపునిండంగఁ గ్రోలిన ♦ కమలమధువు
గ్రక్కనోనాఁగ గగనమా♦ర్గంబునందు, భానుబింబంబురక్తాత♦పంబుఁ గాసె.
శివరాత్రిమాహాత్మ్యము, ఆ 3 పద్య 92.

మ. గగనారణ్యచరాంధకారగజమున్ ♦ గాలాహ్వయవ్యాధుఁడ
ద్భ్వగఁ బట్టం గమకించి మచ్చిడుటకై ♦ చూతాంకురశ్రేణిచే
నొగిఁ గల్పించినకందుకంబనఁగ సూ♦ర్యుండంత వీక్షింపగాఁ
దగ మందప్రభతోడఁ బశ్చిమమహా ♦ ధాత్రీధరేంద్రంబునన్. 1275
భాగవతము, స్కం 10 పూర్వ. పద్య 1286.

చ. ఉదయమునం దలిర్చుదిశ ♦ నొల్లక తన్వనుహీనుఁజేయుచుం
గదిసిప్రతీచిఁజెందె దిన♦నాథుఁడు భూరమణుండు సంతతా
భ్యుదయముఁ గోరుచున్నసతి ♦ నొల్లక తన్వనుహీనుఁ జేయఁగా
మదిఁ దలపోయు వారసతి ♦ మక్కువఁ జెందిన లీల నత్తఱిన్. 1276
విక్రమార్కచరిత్రము, ఆ 6 పద్య 108.

ద్విపద. భవచండతాండవ ♦ భ్రమణవేగమున, దివినుండి పడినయం♦దియయనఁబోలి
కిరణజాలంబుల ♦ కెంపుసొంపెసఁగ, నరుణబింబము పశ్చి♦మాంబుధిఁ గ్రుంకె.
హరిశ్చంద్రోపాఖ్యానము, (గౌరన) భాగ 1.

శా. శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బా♦ఱెంబక్షులుష్ణాంశుపా
షాణవ్రాతము కోష్ణ మయ్యె మృగతృ♦ష్ణావార్ధు లింకెం జపా
శోణంబయ్యెఁ బతంగబింబము దిశా♦స్తోమంబుశోభాదరి
ద్రాణం బయ్యె సరోజషండములు ని♦ద్రాణంబు లయ్యెం గడున్. 1278
మనుచరిత్రము, ఆ 3 పద్య 12.

మ. వికసిల్లంబ్రజ చక్రపాలనము గా♦వించెం గరవ్యాపృతిం
కకుబంతంబుల నాక్రమించెఁ బొసఁగం ♦ గానేర్చె వర్ణాళిఁగాం

తికిఁ బాపెం బెఱరాజకోటిఁదుది శాం ♦ తిం బొందె దైవంబునేఁ
తకుఁ దాపం బికఁ జేలనంగ నిమఁడ ♦ స్తప్రాప్తుఁడయ్యెం గడున్ 1279

,, ,, ఆ 5 పద్య 32.

గీ. కలువచెలిదొంగరాయిడి ♦ గలుగు నింక, ననుచు మునుమున్న పద్మిని ♦ దనవికాస
ధనమునిచినీటనిడురాగి♦తార్పవోలెఁ, జడియెఁబడమటికడలిలోఁ♦బద్మహితుఁడు.

రామాభ్యుదయము. ఆ 2 పద్య 91

ఉ. అంబుధిలోని కంతటను ♦ హంసుఁడు డిగ్గె దినాంతమజ్జనా
ర్థంబునబోలె నట్టియెడఁ ♦ దత్తటినాఱఁగఁ గట్టినట్టి ర
క్తాంబరమో యనంగఁ దన♦రారెఁ గడుం గడసంజకెవి యం
తం జొడనూపెఁ దారకలు ♦ తత్పదనోద్గతబిందులోయనన్. 1281

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 4 పద్య 117.

గీ. సరగ మిన్ననుకమ్మరి ♦ సంజకొలిమి, జెట్టుగాఁ గాల్చి బంగారు ♦ చుట్టువాల్లు
పదునువెట్టఁగఁ గొనిపోయి♦పట్టలేక, విడిచె ననఁ బొద్దుపడమటి♦కడలిమునిఁగె.

యయాతిచరిత్రము, ఆ 2.

క. కమలినిఁ బొమ్మని కరముల, నిమురుటఁ దన్నదియయువారు♦ణీపరిచయదో
షమునకు రవి ప్రాయశ్చి, త్తమొనర్చుకొనె నన నపర♦ ధరమునఁ బడియెన్. 1283

చిత్రభారతము, ఆ 6 పద్య 103.

గీ. అపరదిగ్వారసతి రవి ♦ యనెడు విటుని, రాగయుతుఁడైననేకాంబ♦రంబుచిక్క
నిర్వ్యసనుఁ జేసి కడురశ్మి ♦ పర్వ రాజు, వేగ రాఁదెల్సి తనయిల్లు♦వెడలఁద్రోచె.

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 3 పద్య 41.

చ. ఉదయధరాధరంబుపయి♦నుండి హుటాహుటి నేఁగుదెంచుపో
నొపవినదప్పిఁ బశ్చిమమ♦హోదధితోయముఁ జూచి శీఘ్రతన్
గదియఁగనీడ్చె నేమొ తుర♦గంబులుతద్రథమంచు భూజనుల్
మదిఁ దలపోయ వ్రాలె రవి ♦ మండలమజ్జలధీశుదిక్కునన్. 1285

పరమయోగివిలాసము. ఆ 3 పద్య 225.

చ. తరుణవయస్కుఁడైనహిమ♦ధామునిమీఁద మనంబు నిల్పి యం
బరసతిదన్నువృద్ధనుచు ♦ మానఁదలంచినఁ జాల సిగ్గునన్
ద్వరితగతిన్మునింగినవి♦ధంబునఁ బశ్చిమవార్ధిఁ గ్రుంకె భా
స్కరుఁడు గుముద్వతీతతి న♦గంగ వికాసకళావిషంబునన్. 1286

హరిశ్చంద్రోపాఖ్యానము, శంక ఆ 1 పద్య 221.

గీ. ప్రామినుకువమానికమ్ములు ♦ ఖారమైనఁ, దరణిశరనిధిమునుఁగఁగా ♦ నరగఁ దిగిచి-
వేయఁబోలఁ బైవసుతతి నా♦రాయణుండు, కాకది క్రుపీటజా తాప్తిఁ♦ గాంచ నేమి.
సారంగధరచరిత్రము, చే| వేం| ఆ 3 పద్య 24.

క. దోషాకరముఖవిద్యన, దోషమునకు ఱీతి నొంది ♦ తొలఁగినమాడ్కిన్
బ్రోషితుఁడై యఖిలజగ, ద్భూషణుఁ డర్కుండు గ్రుంకెఁ ♦ దోయధిలోనన్.
మత్స్యపురాణము, ఆ 4 పద్య 69.

మ. సరసీజోద్భవరుక్మకారకుఁడు ఘ♦స్రశ్రీమణిం జేర్చి మత్తో
గర మింపొంద నలంకరించుటకు వే♦గం గాచి తాసీటిలో
బరగన్ ముంచెనయట్టి మేల్మియగుజ♦ల్పంగారపుంబాఱెయ
స్ఫురణన్ భానుఁడు పశ్చిమాంబునిధిఁజ♦క్కం గ్రుంకె నొక్కుమ్మడిన్. 1289
రాజశేఖరవిలాసము, ఆ 1 పద్య 126.

చ. సమయభటుండుపూర్వనగ♦సానుతటంబునకొత్తళంబునన్
ప్రమదముమీఱనిల్చి యల ♦ పాపపుఁజీకటిసోఁకుమూఁకపై
నమరవడిన్నిగుడ్చిన వి♦యన్మయమైనవిరంగిగుండు నాన్
గమలహితుం డఖండగతిఁ ♦ గ్రక్కునఁ బశ్చిమవార్ధిఁ గ్రుంకినన్. 1290
విష్ణుమాయావిలాసము, ఆ 1 పద్య 190.

మ. స్ఫురితాంభోరుహజాతభావముదయం ♦ బున్ జోకలన్ దెల్పి యు
ర్వర కొక్కుమ్మడిఁ బిట్టు పట్టపగలు♦గ్రస్ఫూర్తి సూచించి సా
గరశాయిత్వము వాసరాంతమునవే♦ద్యంబుగాఁ జింతించియో
యరవిందాప్తుఁడు పోఁ జేర్చెఁ దన మే♦నంభోధిమధ్యంబునన్. 1291
చంద్రాంగదచరిత్రము, ఆ 5 పద్య 45.

మ. అపరాహ్ణాంబనువర్ణకారుఁడు ప్రతీ♦చ్యంభోజపత్రాక్షి క
చ్చుపడన్ జందురుకావియంబువపట♦స్తోమంబున న్నించఁగా
నపరాబ్ధిస్థలి నుంచు కుంకుమరస ♦ వ్యాకీర్ణకుంభంబునాఁ
దపనుండ స్తనసుంధరాధరము చెం♦తన్నిల్చి గ్రుంకె న్వడిన్. 1292
ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము, పద్య 58.

గీ. రిక్కరాయఁడు దమిమీఱ♦ రేవెలందిఁ, బెండ్లి యగునని కడయను♦ పేరఁటాలు
మొనసి యైరేణిసీటికై♦ ముంచు పసిఁడి, కుండయన గ్రొద్దుమున్నీటఁ♦ గ్రుంకెనంత.
అచ్చతెలుఁగురామాయణము, అర. పద్య 1[illegible].

ఉ. సమయమహేంద్రజాలకుఁడు ♦ సారసమిత్రుఁడు నేటిపద్మరా
గము నెస మాయఁజేసి కుతు♦కంబున హాయని నీలపంక్తులన్
భ్రమపడఁజూచి ఝూయనుచుఁ ♦ బల్కినుపాణులఁజేసి చూపెఁ జి
త్రమనఁగ బ్రొద్దుగ్రుంకెఁ దిమి♦రంబెసఁగెన్ దివినొప్పెఁ దారకల్. 1300
హంసవింశతి, ఆ 2 పద్య 173.

ఉ. వారిజమిత్రసింహము ది♦వస్పతిదిక్కరి నిర్గమించి దై
త్యారిపదాటవీస్థలిది♦నాఖ్యమదేభమువెంటనంటి త
త్సారమదం బెసంజరమ ♦ శైలతటంబునఁ జెంది సక్తర
క్తారుణదేహమై యరిగె ♦ నగ్గిరిమాటునకున్ రయంబునన్. 1301
చెన్నబసవపురాణము, ఆ 2 పద్య 258.

క. వనజరుచిఁ గొనఁగ సమయం,బనుచోరుఁడు రోదసీగృ♦హముఁ జొచ్చి భయం
బునఁ బఱప నడచుదీపం,బును బోల్పంబడుచుఁ బ్రొద్దు♦పొటుకునఁ గ్రుంకెన్.
శుకసప్తతి, ఆ 2.

చ. కరమనురక్తుఁడై పరుష ♦ కాంతి వహింపక భర్తచల్లనౌ
కరముల బుజ్జగింప వినఁ♦గానక పద్మిని మోమువాంచెనౌ
కరమనురక్తుఁడై పరుష ♦ కాంతి వహింపకభర్తచల్లనౌ
కరముల బుజ్జగింప వినఁ ♦ గానక పద్మిని మోమువాంచునే. 1303
శకుంతలాపరిణయము, కృష్ణ. ఆ 2 పద్య 188.

చ. అదనను లోహకారుఁ డస♦మాంబకధారికి పుష్కరాగ్రసం
పదలిడుచక్రఘోరశిఖి♦పాక మొనర్చి మయూఖదంశికా
స్పదకలనంబునంగమిచి ♦ పట్టిపయోధిమహాగ్రధారలో
పదనిడఁ గూర్చెనో యనఁగ ♦ భానుఁడు గ్రుంకెఁ గ్రమక్రమంబునన్. 1304
యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 4.

గీ. సరసతరపద్మినీదివా ♦ సంగమంబు, సేసి తద్దోషపరిహార ♦ సిద్ధి కొఱకు
స్నానమొనరింపఁగాఁబోవు♦చందమునను,బశ్చిమాంబుధిలోఁగ్రుంకె♦భానుఁడపుడు.
బ్రహ్మోత్తరఖండము, ఆ 2.

సీ. అబ్జబాంధవుఁ డిట్టు♦లపరాబ్ధిఁ గ్రుంకఁగ, నపు డహిగిరినుండి ♦ నట్టి లక్ష్మి
మొదలైన సతులను ♦ ముచ్చటగాఁజూడ, హేమాంబరము ధరి♦యించిపద్మ

వనభూపటలములు ♦ రక్తచందనమును, జనుపుఁగుంకుమఁ దాల్చి♦భక్తిమెఱయఁ
పశ్చిమాశాకాంత ♦ పయనమై వచ్చెనో, యనఁగ సంధ్యారాగ ♦ మతిశయిల్లె
సీ. ఇందుచేఁ బార్వతీప్రియు♦ఖాబ్జముఖుల, మంగళభూషణములరక్తి♦మములుమించెఁ
పక్షులారత్నములఁ జూచి♦ఫలములనుచు, మెక్కుటకుఁ బోంచుగతి చెట్ల♦మీఁద వ్రాలె.
వేంకటాచలమాహాత్మ్యము, ఆ 5.

ఉ. కుముదిని యంచు మెల్లఁ గెడఁ♦గొట్టె నితంబని తన్నె తింగినన్
కుముదహితుండు రాజగుటఁ ♦ గొట్టునొ తిట్టునొ యంచు భీతిఁ బ
శ్చిమగిరిచాటుఁ జేరె సర♦సీజహితుం డిల నున్న వేకదా
కుమతులు రాజభీతులయి ♦ కొండలఁ గోనల డాఁగియుండుటల్. 1307
కృష్ణార్జునచరిత్రము, ఆ 1 పద్య 144.

సీ. కాలమాంత్రికుఁ డస్త♦శైలపీఠంబున, రవిబింబశక్తియం♦త్రంబునిల్పి
శ్రితహితద్విజరవా♦కృతిమంత్రము లెసంగ, ద్రుమరుహచ్ఛాయని♦ర్మాల్యముడిపి
హరిపూరంపఘా♦రానంపజొమ్ములఁ, దొఱఁగఁ దామరకన్ను♦లఱముడించి
కుసుమసంధ్యారాగ♦కుంకుమాంజలినిచ్చి, తిమిరోరుధూపదీ♦పము లొసంగి
గీ. చంద్రుఁడనువెండిగిన్నెతోఁ♦జంద్రిక యను, పాయసంబు నివేదించి♦భ్రమరగాన
మమర కల్హారపంత్రిప్ర♦స్పము ఘటించి, శివునపుడుగొల్చునరపతి♦చెల్వుఁగాంచె.
రాధాకృష్ణసంవాదము, ఆ 2 పద్య 130.

ఆ. వృష్టి నొందె రాజు ♦ వెనుకొని చనువేర, నులికి గ్లానిఁ జెంది♦యున్న యినుఁడు
యాత్మతేజ మెపఱి♦యపరభూభృన్మణి, మఱుగుఁ జొచ్చె నది క్ర♦మంబుగాదె.
గోపీనాథరామాయణము, యుద్ధ.

మ. అనఘుండైన హితుండైన కామములకా♦హ్లాదంబు లేకున్కి నె
మ్మినపారంబునఁబెంపుతోఁ బిరోషి నిజఘ♦స్మక్షేత్రని స్తంభిసం
జనితోత్పత్తిఁ దినాంతశాంతమునఁ దా♦నర్చించికోపంబుతోఁ
ఘనవస్త్రాదికరంబు భానుఁ డరిగెన్ ♦ సాంద్రస్యముల్ గుందఁగన్. 1310
కృష్ణార్జునసంవాదము.

చ. మొదలఁ బురందరాశఁ దగ ♦ ముత్తిత తామసుకోపఁ బద్మినిక్
[illegible]
[illegible]
[illegible] 13[illegible]

ఉ. కాలసమాఖ్యచేనలరు ♦ కంచరవాఁడొక తామ్రపాత్రము
ద్వేలసుధారుచిందనరు ♦ వెన్నెలసీసముఁ జేతు నంచుఁ బ్రా
ల్మాలక తోమఁగా వెడలు♦మష్టన సర్వదిశాంతరంబులన్
మాలతమస్సమూహములు ♦ మంచుకొనెన్ మఱియు న్సమగ్రతన్. 1324

సానందోపాఖ్యానము, ఆ 5.

క. కలయికలెడసినజక్కవ, చెలువల కన్నీటిపడను♦చే నెల్లెడలన్
మొలచెననఁగ నలుగడలన్, బలిసి తమోలతలుబయలు ♦ పందిరిఁ బ్రాఁకెన్. 1325

రామాభ్యుదయము, ఆ ౭ పద్య 93.

సీ. కలయిండ్లకరిగెడు ♦ కన్నపుదొంగల, నీలికాసెలదీప్తి ♦ నిండెఁ గాక
గద్దించిచనుదుండ♦గపువేడ్కకత్తెల, మైలచీరలచాయ ♦ మలసెఁ గాక
ముకుళితవికసితాం♦బురుహోత్పలములకు, నెడయాడునలికాంతు ♦ లెసఁగెఁగాక
విటులకై మెండాడు ♦ వీథులజంతల, పెనుఁగాటుకలకప్పు ♦ బెరసెఁ గాక
గీ. వాఁడఁబాఱెడు విరహిణీ ♦ వదనసమితి, కందుపొందుననగునల్పు ♦ గలసెఁగాక
కాని నాఁడింత దట్టమిాఁ♦గలదెమొదల, ననఁగఁ జీకటియంతంత ♦ కగ్గలించె.

కవికర్ణరసాయనము, ఆ 4 పద్య 90.

సీ. తమినహల్యాజార♦తారతాశయుఁడైన, జంభారికిదిరత్న♦జాల మయ్యె
వల్లవీతతిఁగూడి ♦ మల్లాడు మాయగొ,ల్లనికిది చూడ క♦లాపమయ్యె
దారుకావనమౌని ♦ దారకాముకుఁడైన, పశుపతికిది గళా♦భరణ మయ్యెఁ
దారాభిసారసా♦దరతఁ గ్రిమ్మరిన త,మ్ములదాయకిదియురో♦ముద్రి యయ్యె
గీ. నభిమతనవీనవరనిధా♦నాప్తిహేతు, దివ్యసిద్ధాంజనంబైన ♦ దీనివంటి
యనుఁగుఁగనుఁగవనెత్తుచే♦యరుదటంచుఁ,గులటలునుతింపఁదిమిరంపు♦గుంపులెసఁగె.

వసుచరిత్రము, ఆ ౪ పద్య 13.

క. ఇనుఁ డెత్తిపట్టఁబోలుం, దనకరముల మున్ను మిన్ను ♦ దానికి గుఱు తా
యన చన్న నదియె యిదిగో, ననయము వ్రాలె ననఁ దిమిర ♦ మడరె న్నిగులన్.

పరమయోగివిలాసము, ఆ 3 పద్య 228.

చ. తఱియను లోహకారకుఁ డు ♦ దగ్రతఁ బశ్చిమశైలశృంగమున్
గుఱిగొని వేలుపుందెరువు ♦ గొప్పపిరంగునఁ జాయమందులో
గొఱలెడు వెన్నమానికపు♦గుండు ఘటించి యగాదు చేసినం
బఱచుగఁ గ్రమ్మ క్రొంబొగల ♦ నంగ జగంబునఁ బర్వెఁ జీఁకటుల్. 1329

రసికజనమనోభిరామము, ఆ 4 పద్య 95.

సీ. రేరాయనికిఁబొక్కు ♦ తారావధూమణి, కటిచాయనునుఁబట్టు ♦ గా ధరింప
వేయుకన్నులవాని ♦ దాయ సెంచు నహల్య, నీలాలసరులంచుఁ ♦ బాళిఁ దాల్ప
దహను నాత్మఁ దలంచు ♦ తపసిరాయిల్లాండ్రు, కప్పుకుప్పసములు♦గా ఘటింప
శివునిమరుల్కొన్న ♦ వివిధతాపసకాంత, లిందీవరములుగా♦ సెంచి ముడువ
గీ. నిగిడె జగములఁ గలకంఠ ♦ నీలకంఠ, కంఠకాదంబకరదంభ ♦ ఖంజనాభ
కజ్జలద్యుతిహారినీల ♦ ఘనతమాల, ఘోరరుచిపూరమగు నంధ♦కార మపుడు. 1330
భోజసుతాపరిణయము, ఆ 5 పద్య 19.

క. ఇనుఁ డరిగె ననుచు సమయాంగన నీలపటంబుఁ దాల్చి ♦ గలయాశలమే
కొనిరేఁడుజారిణికై వడి, ననఁజీకటి పుడమిఁ జెలఁగె ♦ నతిబహుళంబై. 1331
బిల్హణీయము, ఆ 2 పద్య 22.

చ. దళితతమాలజాలముల ♦ దాయ నిశాచరకోటిమేలు క
జ్జలరుచిఁ గేడు ధూమవిధు ♦ సారథి కేరొలసాఁగచూర్ణకుం
తలతతి రాజునొల్లక వె♦తంబడు పద్మిని శాపమూర్తి ది
క్కులఁ బచరించెఁ జీకటి య♦కుంఠితలీల నిలాతలంబునన్. 1332
వాసవదత్తాపరిణయము, వ. వీ. ఆ 3 పద్య 62.

సీ. యమునాపయఃపూర♦మనఁగ నిమ్నోన్నత,స్థలములనెల్లెడ ♦ సమము పఱచి
గంధాంధసింధుర ♦ ఘటయననిశ్శంకఁ, బంకజాతమ్ముల ♦ పొంక మడఁచి
యసితాంబుదకదంబ♦మనఁ గారుకొంచును, విరహిణీబాష్పాంబు♦వృష్టి గురిసి
యనుపమాంజనపుంజ ♦ మన నభిసారికా, జనముకన్నులఁ గప్పి♦కొనఁ దనర్చి
గీ. స్వచ్ఛశిఖిపింఛతాపింఛ ♦ గుచ్ఛభాసు, రచ్ఛవిచ్ఛటఁ దెగడు నీ♦రంధ్ర వృత్తి
నఖిలదిక్కుహరంబుల ♦ నాక్రమించి, కానిపించెను గటికిచీ♦కటులగుంపు. 1333
కవిజనరంజనము, ఆ 3 పద్య 67.

మ. తమిసాయాహ్నవిరోధిహేళిపయి సం♦ధ్యారాగరక్తప్రవా
హముగాఁ బోరుచు పట్టి హస్తగిరిదు♦ర్గాంతంబునన్ వైవ త
త్క్రిమమాలించి వియోగచింత నతి కా♦ర్శ్యం బొందుచున్ బద్మినీ
రమణీరత్నము వించు నూర్పు లనఁగా ♦ రాజిల్లెఁ గ్రొంజీకటుల్. 1334
రంగారాయచరిత్రము, ఆ 3

క. రవియనెడు కాలచక్రము, దివసాంతప్రళయవేళ ♦ దీషాగ్నులచే
దివిఁ గాల్చి యడఁగ నమ్మషి, నివహంబనఘోరతమము ♦ నిండె న్వెలుచన్. 1335
హంసవింశతి, ఆ 2 పద్య 131.

సీ. కకుబబ్ధిముఖులకుఁ ♦ గస్తూరిపూఁతలై, భూభృన్నికాయముల కం♦బుదము లయ్యె
భూరిఘోరారణ్య♦ములకు గజంబులై, యామినీముఖులకుఁ జీ♦కాకు లయ్యె
హర్మ్యపంక్తులకు ని♦ర్వ్యాఘ్రామరేఖలై, సరసిజంబులకు శై♦వలము లయ్యె
ఘనవనంబులకు నీలి ♦ పట్టుమేల్కట్టులై, కోరఁకుల కెలదేఁటి ♦ గుంపు లయ్యె
గీ. ననఁగ సకలజగద్వ్యాప ♦ కాయమాన,లీల వన్నియలను నొక్క♦టి భ్రమింప
ననుటనిజమైయశేష వ♦స్త్వాంతరములఁ, గప్పుకొని యొప్పు చిమ్మచీ♦కటులు నెఱసె.
శుకసప్తతి, ఆ 1.

ఆ. గగన మెల్లఁ గప్పి ♦ ఘనసీలరుచి నొప్పి,నీలభానుకరవి ♦ ధూతమాన
భూన్యముగుహలఁ దమము ♦ వొల్చె శంకరకరో,చ్ఛూర్ణనాగచర్మ♦ శోభగలిగి. 1337
కిరాతార్జునీయము, ఆ 3 పద్య 130.

సీ. అరుణపరిభాషాళి ♦ కాశ్మీనదైవ, శ్రీమహాభోగసం♦జీవకరణి
సమయావలోకనా♦సక్తమానసనాయి, కానాయకాభిసం♦ధానకరణి
ప్రత్యూషానూభ్రక్త్యసం♦భవహేతుయుక్తిని,ర్వారణఖద్యోతసా♦వర్ణకరణి
విప్రార్ఘ్యబాణవి♦చ్ఛిన్నమందేహవై, శిల్యకల్యాణవి♦శల్యకరణి
గీ. సకలభూతప్రపంచవి♦శ్రమవితరణి, జారచోరచకోరసం♦చారసరణి
తరణిజాకారరేఖాని♦భానధరణి, ధరణిఁ జరియించె వమితిర♦స్కరణికరణి .1338
యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 4.

గీ. మిత్రుఁడవసత్త్వమునన స్త♦మింప నపుడు, సదనులప్రసప్తజీవన ♦ జాతములు ర
జోవిహీనతసత్త్వసం♦శూన్యతఁ గడు, విన్నవై యుండ నావిర్భ♦వించెఁ దమము.
రామచంద్రోపాఖ్యానము, వా. వేం. ఆ 4 పద్య 108.

ఆ. భానుదీప్తియనెడు ♦ పరతత్త్వవిజ్ఞాన, మంతరించుసమయ ♦ మాత్మ నెఱఁగి
యావరించినట్టి ♦ యజ్ఞాన మనఁగ లో,కంబునందు నంధ♦కార మడరె. 1340
కృష్ణార్జునచరిత్రము, ఆ 1 పద్య 166.

సీ. తాతాంబునిధిపత ♦ నాతతఖేదత్వ, రాపతద్యమునాల ♦ హరియనంగ
గగ్రిహాసమారోహణ ♦ కంపితాకాశజం,బూలతావిగలత్ఫ♦లాళి యనఁగ
జైత్రయాత్రాక్రియా♦సంభ్రమన్మథన సే,వాయాత్తనవమ♦షీచయమనఁగ
స్వవిరోధ్యదర్శన ♦ సమ్మదావనిచర, న్మందేహదేహరు♦గ్బృందమనఁగ
గీ. నిజనిలయ సలిలరుహాళి ♦ నియతభంగ, కారిసంధ్యాసమయపరా♦క్రమవిధాన
కలితమతి నిశ్యదళివరా♦ఘుంబనంగఁ, దిమిరసంతతి జగిదంత♦దముఁ జెలఁగె. 1341
సర్వకామదాపరిణయము, ఆ 2.

ఆ. భూమి నిండి మింటఁ ♦ బూర్ణమై కర్కాటు, మకరమీనరాశి ♦ మహిత మైన
హరియశస్సుధాబ్ధి♦యందలి తుంపురు, లనఁగఁ జుక్క లొప్పె ♦ నాకసమున.

భాగవతము, స్కం. 10 పూర్వ, పద్య 1291.

ద్విపద. కొమరారు నభమను ♦ కొలనిలో విరియు,
కుముదజాలంబు పొ♦గునఁ జుక్క లెసఁగె. 1349

హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన. భాగ. 1.

సీ. కార్కొన్న కటికిచీఁ♦కటి మెఱుగుల్ మొత్తంబు, గురిసినవడగండ్ల ♦ గుంపు లనఁగఁ
గవజక్కవలువాయఁ♦గరనాళ్ములఁజందు, రుండూఁదుపటికంపు♦టుండ లనఁగ
వెల్లైడేమిన్నేటి♦యిసుమున నచ్చర, కొమలిడ్డ వెన్నెల ♦ కుప్ప లనఁగఁ
డెలివిరివెన్నెలవెండి♦తీగలు నిగిడించు, చదలుకమ్మచ్చుపె♦జ్జములనంగ
గీ. జగము గెల్వంగ దండెత్తు♦మగనిమీఁద, లీల రతిచల్లు దీవనఁ♦బ్రాలనంగ
వేఁడివెలుఁగెండఁగాఁగిన♦విన్ను మేన, నెక్కొను చెమటబొట్లునాఁ♦జుక్కలమరె.

పారిజాతాపహరణము, ఆ 2 పద్య 36.

క. తలచూపె నప్పు డఖిలాశల పట్టుపుటిరులుచిలువ ♦ జపరాలు సభా
స్థలమంటపకోపరిసీమల నిడిన సితాండపటలి♦మాడ్కిం జుక్కల్. 1351

మనుచరిత్రము, ఆ 5 పద్య 34.

ఉ. సురపథమాదిమార్గమునఁ♦జొప్పడి పండిన భానుఁడన్ ఫలం
బరుదుగఁ బశ్చిమాద్రి శిఖ♦రాగ్రమునంబడి పెక్కు వ్రక్కలై
యూరువడిఁ జెట్లపై నెగయు♦నుజ్జ్వలబీజములో యనంగ బం
ధురతరభంగినల్లడలఁ♦దోఁచె నభోదితసాంధ్యతారకల్. 1352

నానందోపాఖ్యానము, ఆ 5.

సీ. వటదీశహాసవి♦స్ఫుటితవేధోండరే,ఖలఁ దోఁచు వరణాంబు♦కణిక లనఁగఁ
బెల్లుబ్బునిగ్గపై♦న్వ్రాల్చినెల్లపదార్థ, ములుమున్గఁబోడము ఋ♦ద్బుదము లనఁగ
రవికిమందేహని♦ర్మథనసాధనములై, వచ్చిన ద్విజమంత్ర♦వస్త్రము లన
హరిపదంబునుసీమ♦శిరముసైన నభంబు,న నభోగతులునించు ♦ నన లనంగఁ
గీ. జనమగిరియను మనకాడు ♦ జలధి నరణిఁ, దరణిడించిన నతఁడు త♦త్సలిలమగ్న
విమలముక్తాఫలంబులు ♦ వెలికిఁజొరిపె, ననఁగ నవతారకానికా♦యంబు లడరె.

వసుచరిత్రము, ఆ 4 పద్య 15.

ద్విపద. [illegible]
[illegible]

చెదరి యాకసమునఁ ♦ జింది చూపట్టు, తుదలేని యమృతంపుఁ ♦ దుంపురు లనఁగ
వికసించుచేమంతి ♦ విరులచందమునఁ, బ్రకటంబులై కను ♦ పట్టెఁ దారకలు. 1354

అష్టమహిషీకళ్యాణము, ఆ 5.

క. అలరెను దారలు సంధ్యా, జ్వలనశిఖాదహ్యమాన ♦ చరమాద్రివనా
ఘులఁ జెటిలు వంశపటలం, బుల నెగసిన గొప్ప వెలఁది ♦ ముత్తెము లనఁగాన్.

పరమయోగివిలాసము, ఆ 3 పద్య 229.

ఉ. దిన మనుగ్రీష్మ మేఁగ జగ ♦ తిన్ నిశ నాఁగ ఘనాగమంబు దా
ర్కొనఁ గొనసాంధ్యరాగపు మె ♦ ఱుంగు మెఱుంగుగ మబ్బు మబ్బు గాఁ
దనరఁ దదంబుదాంతరగ ♦ తస్ఫుటమౌక్తికముల్ గ్రహించి య
య్యనిమిషరాశి రాశి నిడి ♦ రా దివి నాఁదనరారెఁ దారకల్. 1356

ముకుందవిలాసము, ఆ 3 పద్య 44.

గీ. రాజు సనుదెంచు నని నిశా ♦ రమణి యప్పు, డింద్రనీలపుమణిపాత్ర ♦ నిడినసోబ
నంపుటారతి తెలిముత్తి ♦ యంపుగుంపు, లనఁగ నభమునఁ దారక ♦ లతిశయిల్లె. 1357

పరిబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము, ఆ 1 పద్య 82.

గీ. రవళిఁ గువలయహితుఁడగు ♦ రాజు స్వారి, వచ్చునెడల విభావరీ ♦ వనరుహాక్షి
చెలఁగి చల్లిన ముత్తెంపు ♦ సేసఁబ్రా, లనంగఁ జుక్కలు దట్టమై ♦ నింగిఁ బర్వె.

రసికజనమనోభిరామము, ఆ 4 పద్య 96.

క. కుముదుగఁ జుక్కలు మిక్కిలి, పొదలెం దతి యనెడుకాఁపు ♦ పోరిఁబోరినివియ
త్పదకేదారాంతరమున, వెదచల్లిన తెల్లజొన్న ♦ విత్తు లనంగన్. 1359

సుభద్రాపరిణయము, ఆ 5 పద్య 66.

చ. శశినిధి సాంధ్యరాగమను ♦ చక్కనిబచ్చెనయోడ నెక్కి దు
స్తరతరరశ్మిబద్ధరవి ♦ జాలికు నీటను ముంచి మౌక్తిక
స్ఫురదురుశుక్తికల్గొని న ♦ భోధరణిన్ సమయంపుబేరి ని
బ్బరముగఁ గొట్టి రాలుచును ♦ పాణులన న్విలసిల్లెఁ దారకల్. 1360

మిత్రవిందాపరిణయము, కుం. వేం. ఆ 5 పద్య 11.

మ. ప్రతిజన్మంబునుమంగళీత్వగరిమన్ ♦ బ్రాపింప నింద్రాణిను
వ్రితచర్యన్వరుణానికిన్ రవిహరి ♦ ద్రాచూర్ణరాశిన్నభ
స్తతశూర్పంబున వాయనం బొసఁగఁ బ్ర ♦ త్యక్సింధువీచీపటా
వృతిమొప్పన్గొనిచల్లునక్షతలునాఁ ♦ బెంపొందెఁ దారౌఘముల్. 1361

తారాశశాంకవిజయము, ఆ 4 పద్య 110.

గీ. అంబరంబను కాయమా♦నంబు నందు, పల్లుకొన్న తమంబను♦మల్లె తీఁగె
యసమకుసుమాభిరామమై♦యొసఁగెననఁగఁ,జొక్కముగఁజుక్కలెల్లెడఁ♦జిక్కటిల్లె.
నయోల్లాసము, ఆ 3 పద్య 102.

ఉ. అల్లన కాలకర్తకుఁడు ♦ నయ్యెడఁ గెంపును ముత్తియంబులున్
మెల్లనఁ జూచి చూచుటకు ♦ మేలిమి తాపినఁ బెట్టి తూఁచఁగా
నుల్లసిల్లు ముత్తెములఁ♦జాడ్పునఁ బాలు తాపిను దిల్లజా
దిల్లియనంగ మించె మణి♦ కేరటిసూర్యుఁడు క్రాంకుచుండెఁ బో. 1362
కన్యకాపురాణము, ఆ 5.

# చంద్రోదయము.



సీ. నలువ చెందొవల తేఁ♦కులకు నన్నువు వెట్టి,గోరి కావించిన ♦ గుళిక యనఁగ
నఖిలద్విజశ్రేష్ఠ♦మగు చకోరచయంబు, తపముసముల్లస♦త్ఫల మనంగఁ
జిగురుజొంపము నను♦జిగియొప్పు నుదయాద్రిఁ,బొలుపారు నవకల్ప♦భూజమనఁగఁ
బూర్వపయోరాశి♦పొంతఁ గెంజాయచెన్నొందు నవపవడంపుఁ ♦ బోదయనంగఁ
గీ. నరుణరుచిఁ దనమండల♦మతిశయిల్లఁ, బొడిచి దివిఁ బ్రాఁకి దీధితు ♦ లడరఁ జేసి
యంతకంతకు నెక్కుచు ♦ సంతమసము,గ్రోలుకొనసీకచందురుండు♦గ్రాలెనధిప.
భారతము, ద్రోణ. ఆ 5 పద్య 275.

సీ. ఘనతమిస్రోద్యత♦కరిరక్తజలములఁ, జెలువారఁ గ్రోలిన ♦ సింహ మనఁగఁ
బూర్వపయోరాశి♦పొందున మండెక,వచ్చు బాడబమహా ♦ వహ్ని యనఁగఁ
బ్రథమాద్రిశృంగంబు♦పైఁ దెచ్చి పెట్టిన, ఘనపదరాగైక ♦ కలశ మనఁగఁ
బ్రాచీవధూకర ♦ పల్లవతిలమునఁ, గొమరారు విద్రుమ ♦ గుచ్ఛ మనఁగ
గీ. భానుఁ డుదయించె రాఘవ ♦ మానవాధి,పతి మనోరథపరిపక్వ ♦ ఫల మనంగ.
భూరి తేజంబు వెలుంగంగ ♦ భువనభువన, తిమిరహతిఁ జేయఁ జాలిన♦దీప మనఁగ.
-భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 1803.

ద్విపద. ........................., చిరకాలములసీమ ♦ శిశువులమామ,
పాలుపొందుకలువల ♦ పోరానివిందు, కలసినజక్కవ♦కవఁ బాపు మందు
పాలవెల్లిని దరిచ్చి♦పడసినవెన్న, శూలియాఁదలపువ్వు♦చుక్కలనవ్వు
నెరిచకోరములకు ♦ నెలనెలపంట, యురవేదివిరహుల♦నుడికించుమంట
గగనంబుతోడవు దొం♦గల గుండెదిగులు, నొగినబ్ధిఁ బొంగించు ♦ నూఱటపట్టి
హరిహరబ్రహ్మల ♦ యానందదృష్టి, సరసిజరిపుఁడైన ♦ చందురుండు పొడిచె.

రంగనాథరామాయణము, రంగ. యుద్ధ.

ఉ. వెన్నెలవెల్లపచ్చడము ♦ విచ్చినయంబరశయ్యమీఁదఁ బే
రన్నననుండిదిగ్వనిత♦లాదటఁ జుట్టును గొల్వ రాత్రియన్
కన్నియఁగూర్మిచిక్కఁ దన♦కౌఁగిటఁజేర్చి సుఖించు నాఁడనన్
జెన్నువహించెఁ జందురుఁడు ♦ శ్రీకమనీయకళంకరేఖతోన్. 1373

నృసింహపురాణము, ఆ 3 పద్య 89.

సీ. ధరవియోగులనెల్లఁ ♦ బరిమార్పఁబూని హృద్భవుఁడు గట్టిన వీర♦పట్ట మనఁగ
విరహులపైదండు ♦ వెడలువో మదమున, కెత్తినకెంజిప్ర♦రెల్లియనఁగ
నలిఁ బ్రోషితులమీఁద ♦ గొలిపెడుమరుకరి, ఘుసృణపంకాంకిత♦కుంభ మనఁగఁ
జొత్తిల్లిపథికుల♦నెత్తుటఁదోఁగిన, శంబరద్విషుచేతి ♦ చక్ర మనఁగఁ
ఆ. దూర్పుకొండతుట్ట♦తుదిమ్రాఁకుననువ్రేలుఁ, గొమ్మనలుదపూవు ♦ గొలకవోలెఁ
గందుబెరసిరాగ ♦ కాంతిదళిర్పంగ, మవ్వమొప్పఁ జంద♦మామ పొడిచె. 1374

విక్రమసేనము.

చ. అవిరళతారకానిబిడ♦హారము లోలి ధరించి చంద్రికా
ధవళవినూతనాంబరము ♦ దట్టముగాఁగ మునుంగు వెట్టి కై
రవధుధురస్మితంబమర ♦ రాత్రివిలాసిని యొప్పె శీతరు
క్ప్రవిమలరత్నదీపములు ♦ గల్గునజాండనికేతనంబునన్. 1375

భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 456.

మ. అదె రౌద్రాకృతిఁ జూచెఁ జంద్రుఁడు మయూ♦ఖాటోపమేపారె న
ల్లదె, మున్నాడెఁ జకోరసంఘమదె జ్యో♦త్స్నాపానసంక్రీడకై
యదయుండంగజుఁ డెట్లుగాఁ గలఁడొ! నీ♦యాలోకనేందీవరా
పదఁదూలించెదు చంద్రవంశజుని నో♦ప్పంజూతు రమ్మా సఖీ. 1376

కావ్యాలంకారచూడామణి, ఉల్లాస. 3 పద్య 110.

గీ. శుద్ధకాంచనపిండంబు♦సూర్యుఁ డిగిచి, పూర్ణశశిపూఁతబంగారు♦బూఁదెనొసఁగి
సాయమనుధూర్తవంచించె♦జగమునెల్లఁ, దెల్లఁబాఱెడునదెచూడు♦ తెలివివిభుఁడు.
శృంగారనైషధము, ఆ 8 పద్య 167.

గీ. అర్ధమండలముదయించు♦నమృతభానుఁ, డుదయరాగంబుతోఁగూడ♦నొప్పుమిగిలెఁ
బ్రకటతాంబూలరాగసం♦రక్తమైన, ప్రాగ్దిశాకాంతబింబాధ♦రంబు వోలె. 1378
భీమేశ్వరపురాణము, ఆ 2 పద్య 40.

సీ. మఱచినవిరహుల ♦ మానంబులడరించి, యిరవైనచీఁకటి ♦ యిండ్లకనిపి
మఱిఁగోకములనెల్ల ♦ మఱువులు గాఁవోలి, నీలోత్పలంబుల ♦ మేలుకొలిపి
వెలయఁ జకోరకా♦వలికివిందులు వెట్టి, నీరజాతంబుల ♦ నిద్రవుచ్చి
వనధులనుబ్బించి ♦ వలరాజునెగయించి, మందమారుతముకా♦నంద మొసఁగి
ఆ. తనదు తెలుపుచేతఁ ♦ దలకొని నిఖిలంబు, తెలుపుగాఁగఁదూర్పు♦దిక్కునందు
జల్లఁదనముఁజూపి ♦ జగములాండొరులకు, మామయనఁగఁ జంద♦మామవొడిచె.
వీరభద్రవిజయము, ఆ 3 పద్య 120.

సీ. పాంథలోచనవారిఁ♦బడసీనమర్చిన, సంతప్తపరశువు ♦ కంతునకును
బ్రాచీదిశాపతి♦పావడంబనిచిన, మవ్వంపుఁజిగురెల్లి ♦ మన్మథునకు
నాత్మప్రతాపాగ్ని♦నవతారమొందంగ, నంగారఖండమ♦నంగునకును
గౌముదీజలధివే♦డ్కకునిండఁదెచ్చిన, పవడంపుఁగుంభంబు ♦ భావజునకు
గీ. ననెడు విచికిత్స జనులకు ♦ నావహిల్లఁ, జక్రవాకములెడఁబాయ ♦ జారసతులు
డాయ నబ్జవిలాసంబు ♦ డాఁపరేఁడు, ప్రాచికొనరించెఁగుసుమపూ♦బంతిచెలువు.
శకుంతలాపరిణయము, పి. వీ. ఆ 3.

ద్విపద. సురుచిరలీలమై ♦ సురరాజుదేవి, ధరియించుకర్పూర ♦ తాటంక మనఁగ
మెల్లన ననలొత్తు ♦ మించులఁ బొదలి, చల్లనైవటువ్రివ ♦ చంద్రుండు వొడిచె.
హరిశ్చంద్రోపాఖ్యానము, (గౌర) భాగ 1.

చ. దినపరిణామలక్ష్మికిఁ బ్రతీచిదగంగయిసేయువేడుక
న్వరుహామిత్రబింబమను ♦ వర్తులలాక్షికపట్టికం బయో
ధినదుమఁ దోఁచి సాంధ్యనవ ♦ దీప్తిరసంబు హరించి పాఱ్చై
చినవెలిదూదియో యనఁగ ♦ శీతకరుండుదయించె నత్తఱిన్. 1382
పారిజాతాపహరణము, ఆ 2 పద్య 44.

శా. ఆరూఢస్థితిఁజంద్రికాధవళితా ♦ జాండంబులోఁ జంద్రుఁ డొ
ప్పారెం గాలభిషగ్వర్యుండవిరతం♦బై కాముకశ్రేణికిన్

మారోత్సాహము నిల్పఁ బాదరసమున్ ◆ బంధించి ప్రాపస్థమై
క్షీరస్థాలికఁ బెట్టినట్టిగుటికా◆సిక్తౌషధంబో యనన్. 1383

మనుచరిత్రము, ఆ 3 పద్య 25.

మ. జలజాతాహితకాంతిరిక్తాగ్రణి కళా ◆ జాలాఢ్యుఁడై దీపికా
కలికాఖీలవిషానలావిలతమః ◆ కాలాహిమార్గోత్క ప్రియ
ల్లలనాదేహము తారకానికరతా ◆ లాబిందువై యుండ వె 1384
న్నెలమందుల్ పయిఁ బూసి తేర్చె ననఁ గా◆న్పించెన్ బ్రసన్నద్యుతిన్.

రాజశేఖరచరిత్రము, ఆ 3 పద్య 141.

సీ. వామాంగభామినీ◆శ్యామధామాళియుఁ, గంఠహాలాహల ◆ కాళిమంబు
నాకాశకేశపా◆శాసితచ్ఛాయయుఁ, జూళికాసింధుశై◆వాలరుచియు
గరకృష్ణసారాగ్ని ◆ ఘనధూమనీలిమ, శేషభూషణఫణా◆సీమనలుపుఁ
గటితటకీలిత◆కరటిచర్మద్యుతి, మేచకశూలశో◆భాచయంబు
గీ. భువనలోచనుపైనెత్తి ◆ పోవునంధ, కారబృందంబునకుఁ దోడు◆గాఁగఁ గూర్చి
వెనుకనే తెంచుభూతేశు◆విధము దనరఁ, జంద్రుఁ డుదయాద్రిపైనొప్పె◆సాంద్రలీల.

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 4 పద్య 40.

మ. హరిదంభోరుహలోచనల్ గగనరం◆గాభోగరంగత్తమో
భరనేపథ్యము నొయ్య నొయ్య సడలిం◆పన్ రాత్రిశైలూషికిన్
వరుసన్ మౌక్తికపట్టమున్ నిటలమున్ ◆ వక్త్రంబునుం దోఁచె నా
హరిణాంకాకృతివొల్చె రేకయి సగం◆బై బింబమై తూర్పునన్. 1386

మనుచరిత్రము, ఆ 4 పద్య 17.

చ. కళలకు నిమ్ము; సొమ్ము సెగ◆కంటికి; మింటికిఁ జొప్పు; వెన్నతో
య్యాలిపయిందోడు; కూడు దివి◆జాళికి; హేళికి జంట; తుంటవిల్
గలదొరవిందు; పొందు విరి◆గల్వకుఁ; జల్వకు నిక్క; రిక్కరే
వెలఁదుల నీవి; బావి రుచి◆వీచికిఁ; బ్రాచికి వచ్చె జెచ్చెరన్. 1387

హరిశ్చంద్రనలోపాఖ్యానము, ఆ 4 పద్య 16.

చ. పనుపడ వేణునాళములఁ ◆ బగ్గములం బలెఁ గ్రిందబర్వు శో
భనకిరణప్రకాండముల ◆ భాసిలెఁ జందురుఁ డొప్పె నెంతయున్
మనసిజుఁ డెల్లప్రాణుల మ◆నంబులు చేలుగ రాగబీజముల్
పెనుజతనంబుతోడ వెదఁ◆జల్లెడు రౌప్యపుజడ్డిగంబనన్. 1388

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 4 పద్య 124.

ఉ. భానుసహస్రసత్కిరణ ♦ పంక్తులనుద్భవమైన యోష్మపా
ద్భానునివెట్టఁ బెల్లుడుకఁ ♦ బట్టెనుషాంబుధి యీరఁగడల్
పూనిసమీరుచేఁ జెలఁగి ♦ పూర్వదిశన్ గనుపట్టె దానిపై
ఫేనమనంగనొప్పె శశి ♦ బింబము తూరుపఁ గొండపైఁ దగన్. 1389

మొల్లరామాయణము, అయో. పద్య 13.

గీ. నలువ యనుకాఁపు గగనంబు ♦ నల్లనేలఁ, దారకావారమను మేలి ♦ పైరు నించి
నింగివిడుపాటుటయుఁ జూచి ♦ నించుపృష్టి, కుండయనుబోలెఁ బూర్ణేందు ♦ మండలంబు.

సుదక్షిణాపరిణయము, ఆ 4 పద్య 139.

గీ. పీఠెయకస్కాన హత్తించి ♦ పిన్నసాఁగ, పజలు జెన్నునిగొలువంగ ♦ పచ్చ చిప్ప
కూటితవిసియోఁబలెఁ గందు ♦ గొనబుమీఱఁ, జందురుం డల్లనల్లన ♦ చదలఁ బ్రాఁకె.

యయాతిచరిత్రము, ఆ 2.

సీ. తనభానుసంతతి ♦ ధరమీఁద వెలయింప, భువిగాధిపతిగురు ♦ స్ఫురణఁ బెంప
రహిఁబోడమహిమచే ♦ జాతినాతిన్ నర్ప, నభవోగ్రధర్మ మొ ♦ ప్పారఁ జేయ
మానితధరణిజా ♦ తానందమొనరింపఁ, బాంధరామాత్మద ♦ ర్పంబులడఁప
వనభూరికమలప ♦ ద్దస్ఫూర్తి మాయింపఁ, దారేశరూఢివ ♦ ర్ధన మొనర్పఁ
గీ. దేవెరాయని గర్వంబు ♦ గానుపింప, సమధికపలాశపరచక్ర ♦ సమితినొంప
నమితకువలయపరిపాల ♦ నముగ మెలఁగఁ, దూర్పుదెస రామచంద్రుఁడు ♦ తోఁచెనపుడు.

కువలయాశ్వచరిత్రము, ఆ 4 పద్య 18.

మ. ఉదయంబందుచు నంబుజాసనతేజ ♦ నొప్పెన్ సువర్ణద్యుతిన్
విరపన్ సోముఁడు గాన శోభనరుచుల్ ♦ పెంపొందె నామీఁదటన్
గుడిగట్టించి సితేతరాంగుఁ డగుచున్ ♦ దోఁచెన్ విధుం డౌటఁ ద
ప్పమహాత్రితయాఖ్యుఁ డౌనవఁ దగెం ♦ బద్మారి ప్రత్యగ్దిశన్. 1393

లక్ష్మీవిలాసము, ఆ 4 పద్య 18.1

చ. ఇనుఁడపరాంతదేశమున ♦ కేఁగినఁ దద్ధతిఁ దాల్చి రాగియై
ఘనుఁడగు రాజు పద్మినిని ♦ గైకొనఁ గోరి కరంబు లాశఁ జా
చినఁ దది మోము మోడ్చుటయుఁ ♦ జెంతఁగుముద్వతి బిగ్గనవ్వినం
గనుఁగొని తెల్లబాఱెఁ దనఁ ♦ గైరవబాంధవుఁ డొప్పెఁ దూర్పునన్. 1394

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 3 పద్య 44.

చ. నలినభవాండకోటరము ♦ నం గనుపట్టినయంతరిక్షమం
డల మను సింపెనా యనుగు ♦ టన్ బ్రకటాంకము నీలరేఖగాఁ

గళలు కరాళజిహ్వికలు♦గాఁగ మహోద్ధతి నెత్తునట్టి ప్ర
జ్వలితమహాఘణం బనఁగఁ ♦ జంద్రుఁడు తూర్పునఁ దోఁచె నెంతయున్. 1395
భానుమతీపరిణయము, ఆ 3 పద్య 14.

ఉ. కమలవిరోధి కామజయ♦కారి కరద్యుతికీర్తనీయుఁడున్
కుముదహితుండు కూటమృగ♦గోత్రకృతాంకుఁడు క్లృప్తసత్కళా
క్రిముఁడును గేశవేక్షణము ♦ కైరవణీశుఁడు కోకభేదనా
గమనుఁడు కౌముదీకరుఁడు ♦ కంధిభవుం డుదయించెఁ దూర్పునన్. 1396

గీ. తారకారాజివాలంబు ♦ తారకిరణ, దామ మంకాచ్యుతప్రతి♦మా మహితము
కలువఱేఁడెనువటుప్రివ ♦ గాలిపటము, సమయశిశువభ్రిమధ్యత♦ల్పమున నాడె.
రాజవాహనవిజయము, ఆ 3 పద్య 18.

క. ఖగఖురకిరణస్ఫురణన్, బరితప్తంబైనజగము♦పైపీవఁగ సుం
దరరజనీకరమునఁదగు, సురటి యనన్ జందుఁడు జెలరెఁ♦జూపఱ కిమ్మై. 1398
విష్ణుమాయావిలాసము, ఆ 1 పద్య 203.

గీ. సరసమై వసుగంధని♦స్తంద్రి మగుచు, సురుచిరంబుగ ఘనమార్గ♦యుక్తమగుచుఁ
దోరమైసకలామయ♦హారియగుచు, నొనరె నెంతయుఁ బూర్ణచం♦ద్రోదయంబు.
రుక్మిణీపరిణయము, కూ. తి. ఆ 3 పద్య 83.

చ. కలువలనిద్రలేపి రతి♦కాంతుని మాంద్యము వాపి పుష్కర
స్థలిఁ దిమిరంబుఁ జోపి రతి♦చాలని బాలల నూఁపి దేవతా
వలి కమృతంబుఁ జేపి యల♦వాసవదిక్సతికుండలంబునై
కలువఱేనిమండలము ♦ కాంతిలుచున్నది తూర్పుకొండపై. 1400
బిల్హణీయము, ఆ 2 పద్య 52.

సీ. భూనభోంతరములఁ ♦ బూర్ణిభవించుత,మంబుల నుచ్చాట♦నంబు చేసె
వసతులఁ మెలఁగుజీ♦వంజీవవిహగక, దంబంబు సాకర్ష♦ణంబు చేసెఁ
గవగూడి చెలఁగు జ♦క్కవలక్రీడావిలా,సంబులు సంస్తంభ♦నంబు చేసె
సలిలమధ్యంబులఁ ♦ జెలువొందు కైరవా,రావంబులవశీక♦రంబు చేసె
గీ. నలినపంక్తిని విద్వేష♦ణంబు చేసెఁ, దమ్మిచేరాశకలమార♦ణమ్ము చేసెఁ
బొసఁగ వెన్నెలమంత్రవి♦భూతిఁ జల్లి, మహిమఁ జూపి సుధాకర♦మాంత్రికుండు.
అనిరుద్ధచరిత్రము, ఆ 3 పద్య 18.

మ. ఉదయోర్వీధరవన్యదైవకరీ♦షౌఘంబునం గూర్చి యం
దు దినాంతంబున నిద్ధవర్యుఁడు నిజ♦ద్యోతాగ్ని రాఁజించి వె

చ్చేదగన్నిసపుటిక్కవెండిగఁగొనన్ • చాదొక్కమందాకుచే
వదనంబిండుచు నెత్తిమీటుగతి సా•రంగాంకుఁ డొప్పెన్ వడిన్ 1402

పార్వతీపరిణయము, ఆ 5

చ. తదవసరంబునందు బుధ•దాయకుఁ డా రజనీచరుండు సొం
పొదవఁగ మింటనుండి తన•యుద్గతిఁ జూపఁగ నేమిచెప్ప నం
గడసలమైఁ బ్రవాళిమము•ఖప్రముఖాక్షిహారవ్రజంబు మే
లుదవకుఁ గాంచరామిఁ దన•లోఁ జనమాలి మునింగె నెంతయున్. 1403

లంకావిజయము, ఆ 2 పద్య 282.

ఉ. ఖ్యాతమహీధ్రసంగతద•వాగ్నుల నిచ్చెనదీపముల్ చకో
రీతతి పేరఁటాండ్రు దివి • టెక్కులఁ నీలపుపాత్రసేసఁబ్రా
లాతతరాత్రియన్ సరసి•జాక్షి పరింప గజాధిరోహణం
బై తనరారె నాఁగ నుద•యాద్రిపయిన్ శశి పోఁచె వింతగన్. 1404

చెన్నబసవపురాణము.

సీ. ఉదయించుచుండెడు • నుడురాజబింబంబు, గళితాంశుకానన•క్రమతఁ దనరె
నిండారుతక్కాంతి•నెమ్మేనవలఁదిన, కుంకుమగంధంబు • కోమటి దెలుపఁ
గలయంగ నించు చు•క్కలునిక్కుకీలొక్కప్వా,చిక్కుముత్తియముల•చెలువువిప్పా
నంతకంతకుజాఱు•నంధతమిస్రంబు, వీడెడు నునుసిగ్గు • విధము గాఁగ
గీ. రజనిగనుపట్టెనతితృప్తిఁ•బ్రజలుచూడ,పొసఁగనిడినట్టియామేలు•ముసుఁగు జాఱ
మోముగనుపట్టె నొకవింత • గోము మీఱ, సిగ్గుచేఁ గొంకు నూతన•స్త్రీవిధమున.

కిరాతార్జునీయము, ఆ 2 పద్య 135.

సీ. జలధినుప్పొంగించి • జలరుహపంక్తుల, నీక్షించి నోళ్లమూ•యించి మించి
కుముదసంతతులను • బ్రమదంబు నొందించి, తొలఁగకఘుఘ్రకాం•తులను పెంచి
విరహులనలయించి • విరసముల్గలిగించి, చక్రవాకులవేడ్క • లాక్రమించి
చీఁకటి గజిబించి • చిగురుటాకులదీప,ములమాడ్కి వెల్గించి • మొనసి యెంచి
గీ. చలువచీరెలు సానుదే•శముల నిండఁ, బఱచినటువలె వెన్నెలఁ • బ్రబలఁ జేసి
పూర్వదిక్కాంత నీక్షింపఁ•బొసఁగుకరణి,సరగవచ్చుచునుండెనా•చంద్రుఁ డంత.

వేంకటేశ్వరమాహాత్మ్యము, ఆ 5 పద్య 171.

ఉ. గౌరవకాంక్షియై సమయ • కాంచనకారుఁడు వాసవాశఁ ద
న్నారికిఁ గొత్తపొమ్ముల నొ•సప్పఁగ నిచ్చు పదాఱువన్నెబం

గాఁడపుమమ్ముఁ బ్రాపయినఁ◆గాఁ బరిపూర్ణకళాభిరాముఁడై
కైరవబాంధవుండు వెలుఁ◆గంగఁ దొడంగెను దూర్పుకొండపై. 1407

కృష్ణార్జునచరిత్రము, ఆ 1 పద్య 169.

క. ఉదయాచలవల్మీకా,భ్యుదితసముద్భోగిభోగ◆మో యనఁ జంద్రుం
డు దనర్చెఁ దత్కళంకము, మృదురుచియగుకృష్ణపాద◆మే కాదుగదా. 1408

కృష్ణాభ్యుదయము, ఆ 1 పద్య 169.

మ. పరితోరాంబుకణాళివర్షఁగ నభో◆వారాశిఁ దర్పంగ శ్రీ
కరలీలాయతిఁ బట్టి ప్రాక్సితతర◆గ్రస్తోమమున్ వాయు నుం
దరలక్ష్మీమణిపట్టుపాలముఖముల్ ◆ దళ్కొందుచున్ దోఁచె నా
హరిణాంకుం డుదయించె రేకయి నగ◆మై బింబమై తూర్పునన్. 1409

సుబ్రహ్మణ్యవిజయము, ఆ 5.

సీ. గగన మొప్పారె నీలోప◆కంబు కరణిఁ, దారకాప్రకరంబులు ◆ కైరవముల
పగిది విలసిల్లెఁ జంద్రుండు ◆ భాసమానుఁ,డగుచు హంసవిధంబున ◆ నలరె నపుడు.

గోపీనాథరామాయణము, సుందర.

గీ. గగనరమ కీలుఁదాల్చు న◆క్షత్రమాల, కతదనాయకవిస్ఫూర్తి◆యని సువర్ణ
కారకత్వముఁగాంచి య◆క్కాలమట్లొ,నర్చె నన నట యోషధీ◆నాథుఁ డమరె.

సర్వకామదాపరిణయము, ఆ 2.

సీ. నూఱు కోకులననల్◆నోరు లెత్తఁగనోడె, నోలిఁ జెందొగచాన◆హాళిఁ గూడె
అంకులాఁడికి నెద◆జంకు నిండుగఁ దాఁకె, జేజేలకాఁకలి ◆ సెలుగు దీఱె
నెదకాండ్రి తెగఁగ్రచ్చ◆వెడలంగ నొచ్చెజో,స్నదయాదిట్టలదాఁటు◆లడలఁ జొచ్చెఁ
గొలఁది రేయెంత కె◆క్కలదారి చొక్కెఁ జే,రికలు కెక్కలదారి◆ యొకట స్రుక్కె

గీ. నేఁచి తెలఁగంటి యేసుఁగు ◆ నేలుసాలు, జిక్కెఁ దెగడుచు నత్తాల◆చానపూన
దీటితిగకంటి నాతని ◆ తేరునూరు, నెనయుఁ దప్పక్కలఁ జందురుం◆ డౌనరుటయును.

శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనకుశచరిత్రము, ఆ 3 పద్య 8.

ఉ. వేఁడిని వీడువాఁడు విను◆వీథిఁ జరించెడువాఁడు గల్వలే
చేడియ మేలువాఁడు సర◆సీరుహగేహకుఁదోడువాఁడు మున్
వాఁడనివాఁడు వాఁడికిని ◆ వాడనివాఁడు మనోజువాఁడికిన్
గూడెడివాఁడు వేల్పులకుఁ ◆ గూడగువాఁడు జనించెఁ దూర్పునన్. 1412

సావిత్రీపరిణయము, ఆ 4 పద్య 140.

మ. హరిణచ్ఛాయుఁడు తారలం దలఁచి సు◆జ్యోత్స్నామోహనవ్యోమపదముల్
బరగం దానుదయాచలం బనెడు క్రీ◆డాశైలప్రస్థోష్ఠిలన్
వరుసం దప్పక యెక్కుచుండె నన బిం◆బంబ్రౌఢిన్ జూపడెన్
బరకై స్ఫాటికమై నగం బఖిలమై ◆ హాస్ప్రమ్మఖింబం బొసఁగెన్. 1413

భరతాభ్యుదయము, ఆ 2 పద్య 85.

ద్విపద. సురరాజు దేవిభా◆నుని లీలతోను, ధరియించు కర్పూర◆తాటంక మనఁగ
నెలపలునవ్వ జ◆క్కవలు చింతింపఁ, దలఁచుచు విరహులు ◆ తల్లడం బంద
ఘనతతోఁ బూర్వది◆గ్వామాక్షి నొందఁ, జనుదెంచె శోయన◆చంద్రుండు వొడిచె.

నలచరిత్రము, ద. రా. ఆ 1.

ఉ. చుక్కలఁ జేఁడు చీకటుల ◆ నూడు వెలుంగుల జేరి జోడు పల్
జక్కవపుల్గు మొత్తముల ◆ సారెకు నేఁచెడువాఁడు చక్కనౌ
మిక్కిలి కంటి దేవరకు ◆ మేల్పగమై తనువాఁడు కల్వలన్
మక్కువఁ బోషించు వాఁడు మరు◆మామ కనంబడెఁ దూర్పుకొండపై. 1415

రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 9.

# వెన్నెల.



సీ. గంగాప్రవాహంబు ◆ గాఁబోలునని పశ్చి త్రాదు లనుష్ఠాన ◆ మాచరింప
నమృతంబువెల్లువ◆యని నిలింపాదులు, మునుకొని దోసిళ్ళ◆ముంచి క్రోల
దుగ్ధాబ్ధినిధియని◆తోయజాక్షుఁడు శేష, పర్యంక మిడుకొని ◆ పవ్వళింపఁ
బరమేశు విశ్వరూ◆పంబని బ్రహ్మాదు, లమర వందనప్రణా◆మములు సేయఁ
గీ. దలఁప భూనభోంతరముల◆కొలఁది దెలిసి, పెరసి యొప్పి దిక్కులఁ◆బొరలిపొరలి
దట్టముగ నంతకంతకుఁ ◆ దనరి తనరి, యిట్టిలంబుగ వెన్నెల◆నిట్ట వొడిచె. 1416

విక్రమార్కచరిత్రము, ఆ 6 పద్య 69.

ద్విపద. మనసిజుండని యేడు ◆ మటుమాయదొంగ, జనులపై మంత్రించి◆చల్లినయట్టి
మోహనభస్మంబు ◆ మురువున విరహి, దాహకమైపర్వెఁ ◆ దళుక్కువెన్నెలలు.

హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన, ఆ 1.

సీ. తళుకుసుధాశిమ◆త్యాలమించుల మించి, మెలయుచుక్కలమేని◆మెఱుఁగుఁ దఱిమి
కలికిరాయంచరె◆క్కలకెవ గిలుమాడి, విరిమల్లెగుత్తుల ◆ మురువుఁ దెగడి
చదుపుగోపృలిమేని◆చాయనుల్లస మాడి, వెలిదమ్మిమొగడల ◆ తెలివి గెలిచి
జీనిమీఁఱుతో గెలిక్క ◆ సిరులకునసమిచ్చి, పాపరాయనివన్నె◆ తేప్ప చూపి
గీ. పాలమున్నీటితరఁగల ◆ పసల నంది, కొండయల్లునిమైతెల్పు ◆ కొంచెపఱచి
కప్పతిలుచుట్టుగొండపైఁ ◆ గొనలు సాఁగి, వెలఁదివెన్నెలలెల్లెడ◆నెల్లవిరిసె. 1418
శ్రీరంగమాహాత్మ్యము, కైర. క. ఆ 2 పద్య 255.

ఉ. అమృతరసంబుచేతసమ◆యంబనుసంయమి పూర్ణచంద్రబిం
బమను వినిర్మలస్ఫటిక◆పాత్రములోనఁ గళంక బాణలిం
గమునభిషేకముల్ సలుపఁ◆గాఁ బ్రవహించెననంగ నిండబ
ర్వె మహీ నభోంతరాళమున ◆ వెన్నెల పెన్నెల నెల్లఁ గప్పుచున్. 1419
వరాహపురాణము, నం. మ. ఆ 4 పద్య 149.

మ. అమృతాఖ్యాసవపంగరాగ ముదయో◆ద్యత్కాంతిచేలంబుచి
హ్నముమంగా శశి రేవతీరమణుఁ డు◆న్మాదంబుమీఱం దమో
యమున స్పంగము నొంది పాఱఁగరసీ◆రాలోడితంజేయవ
చ్చె మహద్వాహిని దానఁజేర్పనన మిం◆చెంజంద్రికాపూరముల్. 1420
గీ. తారకాక్షీశుకిరణక◆దంబకంబు, చిలికెఁ బలుచని వలీవంపు ◆ జిలుఁగుమంచు
నైరవక్షీవధూకర ◆ గ్రహణవేళ, వెలికిఁ గ్రిమ్మిన సాత్త్విక◆స్వేద మనఁగ. 1421
పారిజాతాపహరణము, ఆ 2 పద్య 47, 48.

సీ. కలయనెల్లవగట్టి ◆ జలజలఁ బ్రవహించు, శశికాంతవాంతని◆ర్ఝరముజలము
మలయానిలముచే ద◆మారంబు రేఁగుసౌ,గంధికంబురజంబు ◆ కలువదుమ్ము
నిండారవిరిసిన ◆ బొండుమల్లెలనుండి, పడియు మరందంబు ◆ గుడిసెంబు
తొలఁకి మింటికిఁ బొంగు◆దుగ్ధపాథోరాశి, కరడులమీఁది మీ◆గడలమెఱుఁగు
గీ. తనకు రసవర్గములుగా సు◆ధాకరుండు, సారెసారెకుఁ గరములు ◆ సాఁచిచాఁచి
యచ్చవెలుపుగ నపుడు బ్ర◆హ్మాండమండ,పంబువెన్నెల సన్నసు◆న్నంబు సేసె.
మనుచరిత్రము, ఆ 5 పద్య 38.

సీ. మితాబ్ధికారంబు ◆ మీఱరాదనికాక, వెసఁ బట్టపగలుగా◆వింపలేదె
ప్రమాఁకులకింది సో◆మరులెంతయనికాక, మలసి నీడలరూపు ◆ మాపలేదె
బాహబాష్పేపపా◆పమున కోపకకాక, చకార్యాగ్నినైనఁ జ◆ల్లార్పలేదె
రాజకాంతాకృతి ◆ ప్రతిపన్నమనికాక, శిలలెల్లసరసము◆ల్చేయలేదె

గీ. జగతినిదియనిజగములు♦వొగడనెగడె, హరునితలయెక్కి వెలిపమ్మి♦సరసగ్రోక్కి
కలశవారాశినెమ్మెనఁ♦గలయఁబ్రాఁకి, కుముదరుచిసేలెఁ గౌముది♦సముదయంబు.
వసుచరిత్రము, ఆ 4 పద్య 22.

చ. నెలయను వెండికుండఁగడు♦ నించి నిశాఖ్యచకోరనేత్రి యిం
పలరఁగ నంబరాహ్వయము♦హాసటమూర్తి మహాభిషేకమున్
జలుపఁగ నెల్లదిక్కులవె♦సం బ్రవహించెడు పాలవెల్లినాఁ
బొలిచె సమస్తమున జలువఁ♦ బొంద నమందతసాంద్రచంద్రికల్. 1424
ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 4 పద్య 125.

క. అతనుఁ డనుదొంగ విరహుల, యతులితనిజమానధనము♦ హరియించుటకై
క్షితిపైఁ జల్లిన మంత్రాక్షతభూతిప్రభ లనంగ♦ వెన్నెల లెసఁగెన్. 1425
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 3 పద్య 70.

సీ. బలిధామమెనసినఁ♦బట్టిబంధింపడే, చీకటిదళమేది♦ చెనరెఁ గాక
యడవ్రేలుబలసిన♦ నడఁపదేవీడ పక్షికంపనాకులవృత్తిఁ♦ గాంచెఁ గాక
రాజుచేరినఁ గావ♦రముమాన్పదేయంక, మవినిశ్చితాకృతి♦ యయ్యెఁ గాక
దుర్నేతుఁ డంటినఁ♦ దునుమదే యలకప్పు, మదమేదికపలక♦ యొదిగెఁగాక
గీ. రోదసీపూర్ణవిధుపాద♦రోచమాన, విమలధారావిశేషమై♦ వెలయుడీని
మహిమచేఁ దూలవెయశేష♦ మలినగుణము, లనఁగవెన్నెలజగమెల్ల♦నాక్రమించె.
చంద్రభానుచరిత్రము, ఆ 4 పద్య 78.

క. సుదలకిడి ధరణీసురలకు, వెరవున నిడకున్నఁ బ్రజలు♦ ద్విజరాజికొగిం
బరుఁ డనఁ గని ద్విజులకు సుధ, విరివెన్నెల గురిసె ననఁగ♦ వెన్నెల బర్వెన్.
రాజవాహనవిజయము. ఆ 4 పద్య 43.

చ. శమనుని దుంతఁబట్టుకొనె♦ శకున్రీఁడు దా వెలియేనుఁ గంచు వే
గమునఁ బురారినందియని♦ గాడుపునెచ్చెలి మేఁకపోతుపైఁ
దమకముమీఱనెక్కె నల♦ధాత కుమారునినెమ్మిఁ గాంచి పాం
సముగఁ దలంచె సాంద్రతర♦ చంద్రికలోకము లెల్లఁ గప్పటన్. 1428
రుక్మిణీపరిణయము, కూ. తి. ఆ 3 పద్య 86.

క. ఇందీవరబంధుండా, నందము డెందమున నెనయ♦ నవ్వుచు రజనీ
సుందరిమేన వలందిన, చందనగంధం బనంగఁ♦ జంద్రిక మెఱసెన్. 1429
సుభద్రాపరిణయము, ఆ 5 పద్య 70.

గీ. సమయగోపాలకాగ్రణి ◆ చపలు పేరి, నంబిభిజాబిల్లిపొదువ్రనఁ ◆ గర వెసంగు
విమలచంద్రికాదుగ్ధపూ ◆ రములు పిదికి, ఘనతరచకోరవత్ససం ◆ ఘముల ననిచె.
శకుంతలాపరిణయము, పె. నా. ఆ 2 పద్య 190.

గీ. చంద్రతారాకపాలభూ ◆ షణములమరు, హరుని శిరముననుండి సా ◆ గరము చేరు
నల్లగంగాప్రవాహతో ◆ యములపగిదిఁ, బండువెన్నెల దిశనుండి ◆ నిండె జగము.
వేంకటేశ్వరవిలాసము, ఆ 2 పద్య 65.

సీ. కొమ్మలకై మేలి ◆ సొమ్ములకై పోవు, జారచోరులకిది ◆ మాఱుతల్లి
తముఁబాసి పతులన్య ◆ తరుణులఁ జెందినఁ, గనలొందుసతులకుఁ ◆ గన్నమాత
జారిణీజారులఁ ◆ గూరుప మదిఁ గోరి, మెలఁగు దూతికలకు ◆ మృత్యురాత్రి
యిక్కల నెక్కుడు ◆ రొక్కము గలిగిన, పెనుధనికాళికిఁ ◆ బెండ్లివేళ
గీ. పణ్యరమణీజననిమనో ◆ భయవిధాయి, పనులఁజరియించువారికి ◆ భాగ్యలక్ష్మి
హీనదీపాలయములకు ల ◆ క్ష్మీనిధాన, మగుచు జాబిల్లివెలుఁగప్పు ◆ డతిశయిల్లె. 1432
గణోదయము, ఆ 2 పద్య 14.

సీ. ఇవిగదా సొబగుల ◆ నెసగించునట్టిచిం, దమ్ముల కర్పూర ◆ రమ్ము లయ్యె
నివిగదా గబ్బిపా ◆ లిండ్లగుబ్బలులకు, గంధసారస్థాస ◆ కంబు లయ్యె
నివిగదా కెంజాయ ◆ లీనెడునడుగుఁదమ్ములకుహీరాశ్మనూ ◆ పురము లయ్యె
నివిగదా పొంజిగి ◆ నింపులుపచరించు, మైదీవియలకుతెల్ల ◆ మంబు లయ్యె
గీ. నివిగదా నీలిడాలుచే ◆ నిరులు కొలుపు, కొప్పుమొయిలకుమల్లికా ◆ కుసుమములయ్యె
ననుచు జ్యోత్స్నాభిసారికల్ ◆ వినుతిఁజేయఁ, బండువెన్నెలతేఁరగలు ◆ నిండెదిశల.
సుమనోమనోభిరంజనము, ఉల్లాస 5 పద్య 50.

గీ. కటికచీకటులనుభూత ◆ గణముమీఁద, జందురుండనుమాంత్రిక ◆ సాహసుండు
జల్లు వీభూతియనఁ బ్రజ ◆ లుల్ల మలరఁ, బండువెన్నెలదిశలెల్ల ◆ నిండుకొనియె.
సౌగంధికప్రసూనసంగ్రహము, ఆ 1.

గీ. పూర్వభూధరశిల్పియ ◆ ఖర్వకర్పు, రాండసౌధవిశాకుడ్య ◆ కాండమున ను
ధాకరఘటంబుచేఁబూని ◆ యందులోఁ దనర్చు వెన్నెల పాలను ◆ న్నంబొనర్చె.
సర్వకామదాపరిణయము, ఆ 2.

సీ. వనజారియుదయించు ◆ టనుబొంగి పారలిజా, ల్గొనుపాలకడలి వె ◆ ల్లువ యనంగ
విధుమండలంబను ◆ విరిగుత్తినుండి వె, ల్వడి కప్రమ్ముకొనెడుపు ◆ ప్పొడి యనంగ
యామినీకాంతపై ◆ సోముండుచల్లిన, పటవాసఘూళికా ◆ పటల మనఁగ
హాశపట్టముఖులు సాం ◆ పలరఁ దాల్చినమంచి, చలువమడుంగుల ◆ చెలువ మనఁగ

గీ. హారసీహారహీరమం◆దారకుంద, శరదశరత్కాండపాండుపసుం◆దరత మెఱయఁ
బండువెన్నెలజగమెల్ల ◆ నిండి పిండి, యారఁబోసినకరణి నిం◆పారు చుండె.

నయనోల్లాసము, ఆ 3 పద్య 105.

గీ. అప్పుడుద్విజకోటిప్రస్తుండె ◆ ననుచు నాత్మ, నెంచితపదీశ్వరుండు చే◆యించిభూన
భోంతకటమునఁ బోయించి ◆ నట్టికుసుమ,బియ్యపుఁబ్రసాదమోయన◆వెన్నెలలరె.

భరతాభ్యుదయము, ఆ 2 పద్య 190.

సీ. నెఱతావులు చెలంగ ◆ నిండారవిరిసిన, మల్లెపూవులతోడ ◆ వెల్లి విరిసి
కప్పురంపుటనంటి ◆ విప్పుఁబోరలరాలు, కపురింపుఁబొడితోడ ◆ గలసి మెలసి
కమ్మవిల్తునిదాయ ◆ కాఁపురంబైతగు, వెలిమల జిగితోడ ◆ వియ్యమంది
కలిచేల్పునిల్లా◆లిఁగని పెంపుఁ గాంచిన, పాలమున్నిటితో ◆ మేలమాడి
గీ. నిండికొనియుండె భువినిండ ◆ వెండికొండ, కొండపిండులఁ జెండాడు◆పండిపాత్తి
పిండికలకంద వెలిఁదమ్మి ◆ పెండపొడి, పండుకేయెండదండులు ◆ నిండుజిగిని.

రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 13.

---

# వసంతర్తువు.

:o:

లయగ్రాహి. కమ్మనిలతాంతముల◆కు మ్మెరసివచ్చు మధుపమ్ములను గీతనిన ◆ దమ్ము
లెనఁగంజూ
తమ్ముల లసత్కిసల◆యమ్ములసుగంధివకు,శమ్ములను సానుచును◆దమ్మెరసరవాచా
లమ్ములగు కోకిలకు◆లమ్ములరవమ్ము మధురమ్ముగుచు వీచె నని◆శమ్ము సుమనోభా
రమ్ముననశోకనికి◆రమ్ములసుచంపకచ,యమ్ములును గింశుకవ◆నమ్ములును నొప్పెన్.

భాగవతము, ఆది. ఆ 5 పద్య 138.

సీ. కమనీయకమలినీ◆కల్లోలవీథులఁ, గదలురాయంచల ◆ గతులయొప్ప
బహుపుష్పపల్లవ◆ప్రకరచిత్రితములై, తనరారు తరులతా ◆ తరులసొంపు
మకరందరసపాన ◆ మదవిలోలంబులై, క్రాలెడియెలఁదేఁటి ◆ గముల యులివుఁ
బరిపక్వమంజుల◆ఫలరసోద్ధతములై, పలుకుతా చిలుకల ◆ పటురవంబుఁ

ఆ. ప్రియుఁడు చెలువేలు ♦ ప్రీతిమైఁ జూపుచుఁ, జెప్పుచునుజనంగఁ ♦ జిగురుఁబోఁడి
కనుచు వినుచు నిర్వి♦కారసల్లాపంబు, లార నతని తెలుఁగు ♦ నరయు చుండె.
భారతము. ఆర. ఆ 7 పద్య 212.

ఉ. పల్లవపుష్పసంపదలఁ ♦ బంచి వసంతుఁడు కాఁపురాకకై
యెల్లవనంబు సంకటము ♦ లేదఁగఁ జారొదికంబుమీఁఱ న
ల్లలనఁ గ్రోలికోకిలమల♦యానిలుఁడందుఁ బురాణపత్త్రముల్
దుల్లఁగఁజేసె పత్త్రిక్రియఁ బ♦టుత్వము కాముఁడు పెచ్చులింపఁగన్. 1441
విజయసేనము.

చ. చిలుకలపిండునొప్పిడము ♦ చిత్రనురాయుధలీల యేపునం
జెలఁగు మధువ్రతావలుల ♦ చిక్కని మ్రోఁతను గజ్జ లుల్లస
త్ఫలరసపూరముం దెరలఁ ♦ బర్వుట సౌదులుగాక మేఘపం
క్తులక్రియనొప్పుభూరుహత♦తుల్ మధువేళఁ బయోదవేళలన్. 1442
నృసింహపురాణము, ఆ 2 పద్య 72.

చ. వనవివహంబులెల్ల మృదు♦వల్లుల నామృదువల్లులెల్ల లే
గొనలఁ దనర్చు లేఁగొనలు ♦ గుత్తుల గుత్తులు లేఁజిగుళ్ళఁ జెం
పొనరుచిగుళ్ళఁ గ్రొవ్విరులఁ ♦ బొందగుఁ గ్రొవ్విరులెల్లఁ దేఁటులన్
మునుకొను తేఁటులెల్ల నును♦మ్రోఁతల నెంతయు నొప్పె నామనిన్. 1443
కేయూరబాహుచరిత్రము, ఆ 4 పద్య 47.

సీ. కామినీగండూష ♦ కాదంబరీధారఁ, బులకించె నారామ ♦ భూమిఁ బొగడ
చివురాకుచవిచూచి ♦ చవిచూచియెలుఁగించెఁ, బంచమస్వరమునఁ ♦ బరభృతంబు
సంఫుల్లకోరక♦స్తబకోచితంబైన, కొరవిపై భ్రమయించెఁ ♦ గొదమతేఁటి
పరిపక్వసహకార ♦ ఫలరసాస్వాదన, ముదమునం గీరంబు ♦ చదువఁ దొణఁగె
గీ. విటపిటీసముదయములు ♦ వివిధవిధుల, నుపవనక్రీడసల్పిరి ♦ యుబ్బు మిగిలి
యఖిలజనులకు సంతోష ♦ మావహించె, మాసరములైన మధుమాస♦వాసరములు
శివరాత్రిమాహాత్మ్యము, శ్రీనాథ. ఆ 3 పద్య 118.

సీ. ముక్తపత్త్రవ్యాజ♦మునఁ జీరసడలించి, కళికలన్పులకలఁ ♦ గలుగఁజేసి
పాలివోనితావులఁ ♦ బూలదండలఁ జుట్టి, కపటేనిమధుసాత్త్వి♦కమునఁ దేల్చి
రఁఱదళిఝుంకార♦మణితముల్ ఘటియించి, దీపించక్కొరలూను ♦ మోవి యాని
పరిపిమన్నతఫల♦స్తనములఁ గబళించి, కిళిదేబులినువల్లిఁ ♦ గౌఁగిలించి

గీ. కలికిరాచిల్కపల్కుపల్కులలర్చి, సురభికస్తూరిరజములు సొంపుమీఱఁ
గలితవనలక్ష్మిఁ గూడి రాగమువహించె, మాధవుఁడుప్రాప్తనిఖిలతన్మాధవుండు.
పంచతంత్రము, బై. వేం. ఆ 3.

చ. ప్రియపరిరంభణప్రథిమ పెల్లెసఁగఁ జైత్రుఁడు వచ్చి చేయఁ గా
వ్యయమని సీతునందచెలువ వల్వెడఁ బ్రల్లదుపంగు వచ్చెఁ డా
రయముపఁ జెక్కి యాబుతువు రాఁ జలివిచ్చితొలంగిరయ్యెవ
స్వయముచితమేకదా విపది ధైర్యమనం జనుమాట యింతకున్. 1446

ఉ. పుష్పసముల్లసచ్ఛిరిజి గుబ్బలనొత్తిలి హత్తి వేఁగుజా
మిప్పలలన్నుగాడ్పుల కషీషఁ గ్రమంబున ఘూర్మశంకవై
నప్పతిలంగ నోముతెర లుప్పరమెత్తిరి దక్కరూపమ్రము
ద్దెప్పరమైనలోవాకక ప్రకటీకరణంబుఁగామినుల్. 1447

ఉ. నైపుణిఁ జందనాద్రిగహ నద్రుమసౌరభవీచిఁదాఁబ్రమ
క్తిపరిలబ్ధహాక్తికమణిప్రకరంబులు దోఁచి దక్షిణా
శాపవనుండు సల్లుపెదఁ జల్ల జనించెన కాక వీనికే
లాపాటమంగనప్రాలప మప్పుడునా వనిఁదోఁచెఁ గ్రొన్ననల్. 1448
ఆముక్తమాల్యద, ఆ 5 పద్య 99, 104, 114

సీ. సానదేటివిాట్టుమరించి నెఱివాసినయట్టి, యాకురాలుపుగండ్ల ఘుండదొలఁగి
యతిబాలకీరచ్ఛ దాంకురాకృతిఁ బోల్చి, కరవీరకోరక గతిఁ గ్రమమున
నరుణంపువెుగ్గలై యరవిచ్చిపికిలియై, కలదండలట్లుగుత్తులఫులనుపిదప
శేఖరేర్పడఁగ వర్ధిలి పెడలై వెరెమ్మ, పసరువాలుచు నిక్కఁ బసరుకప్పు
గీ. పూఁటపూఁటకునెక్కఁగ ప్పునకుఁదగిన, కొలుఁగునాఁటికెనివిాఁద గిజికొనంగ
సొగరైయాకువాలంగ జొంపమగుచుఁ, జిగురుఁదళుకొత్తెఁదరులతాశ్రేణులందు.
మనుచరిత్రము, ఆ 6 పద్య 27.

చ. ధవునిసమాగమంబున నుదారతదిష్టవశాప్తిఁ బూని చి
త్రవితతభూషణాళులను దాల్చివెసం జిగిరించె వట్ల పూ
ధవునిసమాగమంబున నుదారతదిష్టవశాప్తిఁ బూని చి
త్రవితతభూషణాళులను దాల్చివెసం జిగిరించెవృక్షముల్. 1450

ఉ. మాధవుశాసనంబునను మాద్విజముఖ్యఫలప్రదాత్రియై
తాఁగరణింజెలంగుగతిఁ దగ్గ వనీరమయొప్పియప్పుడా

మాధవప్రాజ్ఞసద్ద్విజస♦మాజమునందు ఫలప్రదాత్రియై
తాధరణిం జెలంగెను మ♦ఘారసనత్ఫలవృక్షరాజియై. 1452

సకలకథాసారసంగ్రహము, ఆ 3.

సీ. తరుణారుణాంశుబం♦ధురరసాలకిసాల, పటలివక్షఃకౌస్తు♦భంబుగాఁగ
సౌవర్ణవర్ణభా♦స్వత్కర్ణికారాభ, రమణీయహేమాంబ♦రమ్ముగాఁగ
వికసజ్జపానవీ♦నకనద్ద్యుతిస్ఫూర్తి, కురువిందకోటీర♦ గరిమగాఁగ
నతికోమలశ్యామ♦లాంచత్తమాలవ,న్యారుచి నెమ్మేని♦ సౌరుగాఁగ
గీ. సంతతశ్రీసమాయుక్త♦సహజలీల, మదనజనకత్వనిజమహా♦ మహిమ వెలయ
సర్వదిక్పూర్ణసువిలాస♦ సరణి మెఱయ, మాధవస్ఫూర్తి చూపట్టె♦మహిని రహిని.

ఇందుమతీపరిణయము, కు. ధూ. ఆ 2 పద్య. 42.

సీ. లలనాజనాపాంగ♦ వలనావసదనంగ, తులనాభికాభంగ♦ దోఃప్రసంగ
మలసానిలవిలోల♦దళసాసవరసాల, ఫలసాదరశుకాల♦ పనవిశాల
మలినీగరుడనీక♦మలినీకృతఘనీక, మలినీసుఖితకోక♦ కులవధూక
మతికాంతసలతాంత♦లతికాంతరనితాంత, రతికాంతరణతాంత♦సుతనుకాంత
గీ. మకృతకామోదకురవకా♦వికలవకుల, ముకులసకలవనాంతప్ర♦మోదచలిత
కలితకలకంఠకులకంఠ♦కాకలీవి, భాసురము వొల్చు మధుమాస♦వాసరంబు. 1453

వసుచరిత్రము, ఆ 1 పద్య. 126.

సీ. చైత్రికుండై రాగ♦సామగ్రి నెఱపి తే,వస్యాంతమై ఫల♦ప్రాప్తి నడరి
మధువై నవామోద♦ మహిమఁ దార్కొనికాల,గురువై యశేషాధ్వ♦గులఁ గలంచి
సుమనఃప్రసూతియై♦శుకలీలఁ దనరి మా,ధవుఁడై పలాశభే♦దన మొనర్చి
యామినియై భూజ♦నైకదుర్గతిఁ బాపి, సురభియై హరిహయ♦స్ఫురణ పొలఁగి
గీ. సారసవనప్రియోక్తియై♦సకలవిప్ర, వరశుభప్రదనానాస♦వములఁ జెనఁగి
యవని నలరె వసంతమ♦త్యంతమధుర, పంచమస్వరపూర్ణతా♦భవ్యమగుచు. 1454

హరిశ్చంద్రనలోపాఖ్యానము, ఆ 1 పద్య. 86.

సీ. ఆలమింటఁ జెలఁగురా♦చిలుకలచాలుపుల్, వేలుపుమన్నని♦విండ్లుగాఁగ
బూఁదేనియలఁజాలఁ♦బొదలు తేఁటులమ్రోఁత, రహిమించునుఱుముల♦రవలిగాఁగ
మూఁకలై పొడవైన♦ చీఁకటిమ్రాఁకుల, చాళ్ళు గార్కొన్నమొ♦గుళ్ళుగాఁగ
జెలుతురీయకఁజాలు♦విరిదేనియలసోన, వదలక కురియు పెన్♦వానగాఁగ

గీ. వేడుకలు మీఱఁ బోఁటల♦నాడు కొమరు, వెలఁదు లెల్లను మెఱుఁగుఁడీ♦పియలు గాఁగ
గ్రమ్మి యుప్పొంగుచును దోలి♦కారు వోలె, వలపు నెఱపుచు నామని♦పొలుపు మీఱె.

యయాతిచరిత్రము, ఆ 4.

చ. జలదము పామసేటఁ బము♦సంతతమున్ మును ప్రచ్చుకున్నయ
ప్పులకయి యస్థగింప ఫల♦ప్రస్ఫము లయ్యెడ లేమి లేమివా
టిలి గతిలేక పత్త్రిసుల్♦డెన్ తరుకోటి యనంగ సంతతా
నిలహతి పండుటాకుగమి ♦ నిండెన భూంగణసీమ నామనిన్. 1456

చారుచంద్రోదయము.

సీ. అచ్చంపు లేఁజిగు♦రాకుజొంపము కెంపు, మేలిచెందిరపుఁ గెం♦ధూళి గాఁగ
గ్రుచ్చినట్లుగ జాఁదు♦కొన్న మొగ్గలగుంపు, ప్రికటపాటలబిందు ♦ పాళి గాఁగ
విచ్చినపరువంపు ♦ విరులతండము పెంపు, శోభితభూతిరిం♦ఛోళి గాఁగ
నిశ్చలంబైన తే♦నియపానజడిసొంపు, లాలితదానధా♦రాళి గాఁగ
గీ. నునుపరాగము ల్కేళిపా♦నుపులు గాఁగ, భ్రమరపంక్తులు పైసర♦పణులు గాఁగఁ
బుడమి నెక్లైడ వాహ్యాళి ♦ వెడలు మదను, మదపుటేనుఁగుఁ బోలె నా♦మని దనర్చె.

రాఘవపాండవీయము, ఆ 2 పద్య 5.

సీ. చిలుకబాపనకొలం♦బులబందుగుల కెల్లఁ, గలితామ్రఫలకోటి♦గ్రాస మొసఁగు
నెలదేఁటి రాచగుం♦పుల చుట్టముల కెల్లఁ, బలుకుదేనియపల్లె ♦ బట్రిలొసఁగుఁ
జలిగాడ్పుకోమటి ♦ చాలుసజాతీయ, ములకుఁ దావులసంచి ♦ మొద లొసంగుఁ
గోయిలవాలవ♦కొలము దాయాదుల, కోలుకోఁ జిగురాకు♦నేల యొసఁగు
సీ. కొమ్మలు నెలర్చు సాలజా♦లమ్ములోనఁ, జిలుకసాంబ్రాణి తేజీవ♦జీరఁ డనుప
దావెమున్న వసంతుని ♦ రాణు లెల్లఁ, గన్నుగుబ్బెడు కడుపుంజి♦గనుటకతన.

కువలయాశ్వచరిత్రము, ఆ 3 పద్య 96.

గీ. బలుగుబ్బగుత్తుల♦పైరజంబులు రాలఁ, జిలికినకస్తూరి ♦ చెలువు మీఱ
మెఱుఁగారుకొదమతు♦మ్మెదరొదల్ నిగుడంగ, ననతేనెచెమటసో♦నలు చెలంగఁ
గమ్మనియూర్పులేఁ ♦ దెమ్మెరల్ వెడలంగ, వికసితనవపత్త్రి ♦ విధము లెనఁగ
లలిరత్నకనకావ♦ళులు పెనఁగొనియుండఁ, బారావతధ్వని ♦ పంత మెఱయఁ
గీ. దళుకుఁగెమ్మోవిపంటరే♦ఖలు దలిర్ప, భుజలతాలింగనంబునఁ ♦ బొసఁగ మదన
కేళి సల్పును వనదేవ♦తాలతాంగి, శుభ మెలర్ప వసంతవ♦ల్లభునిఁ గూడి. 1459

భానుమతీపరిణయము, ఆ 2 పద్య 36.

గీ. గనదమితజాతివిస్ఫూర్తి ♦ కవకుఁజాయ, బుడమిఁగనుపట్టెఁబిసలన♦ద్భుతమెయెక్కెఁ
జారుతరమూర్తిసకలర్తు♦చక్రవర్తి, మధుఁడు తనయందు సకలర్తు♦మయతఁదోఁప.

చంద్రాంగదచరిత్రము, ఆ 4 పద్య 72.

గీ. పవనదుశ్శాసనుఁడు వనీ♦పాండవేయ, లలనజీర్ణచ్ఛదాంశుకం♦బులుహరింపఁ
గళికిశుకసూక్తిఁజీరఁగి♦సలయహేతు, మయపటములీఁడెయయ్యెవ♦మాధవుండు.

సీ. శుకనాదములుద్విజ♦శ్రుతిఘోషములుగాఁగఁ, గనకకోరకముల♦క్షతలుగాఁగఁ
జేఁటిపాటలుప్రబం♦ధిగీతములుగాఁగఁ, గిసలముల్ తోరణ♦విసరములుగఁ
బలుకప్పురంపుఁబ్రది♦ప్పలువితర్దులుగాఁగఁ, బుష్పొడుల్వాలిగంధ♦పొడులుగాఁగఁ
జలిమొల్లమొగ్గచా♦ల్పులుతలఁబ్రాల్గాఁగ, విరితేనెపాదలుపం♦దిరులుగాఁగఁ

గీ. బుష్పితపలాశనికురంబ♦ములునివాళి, పళ్ళెములుగాఁగ నిర్ఝర♦పవనచలిత
తరురవంబులుభద్రవా♦ద్యములుగాఁగ, వనవధూమణిఁ జైత్రుఁడు♦ద్వాహమయ్యె.

రసికజనమనోభిరామము, ఆ 2 పద్య 10, 14.

సీ. గున్నలేమామిడి♦గుంపులచిగురాకు, గాపంపుగమికి తన్♦ఖా లొసంగి
పూఁబొదల్ విరిదేనె ♦ పొట్టజీతంబుల, నల్లమూఁకకు మొక్కా♦బిల్లచేసి
పరువంపుదాడింబ♦తరువులఫలలాభ, కారిశూరులకుజా♦గీరు లొసఁగి
పూవుపుప్పొడిదిన్నె ♦ తావులెల్లను సదా, గతివేగరులకు ఖి♦ల్లతులుజేసి

గీ. మొక్కమొగిఁ దనపౌజులు ♦ పిక్కటిల్ల, క్రొత్తపూగుత్తికత్తి చే ♦ హత్తి విరహ
చిత్తవృత్తులడంప దం♦డెత్తి వెడలె, కంతుఁడుద్వేంలీలవ♦సంతవేళ. 1468

శాలాంకనందనీపరిణయము.

సీ. కుంజఘనాఘన ♦ కోరిడగళతోర్కర, కనికాయపటుకర ♦ కానికరము
తరుసుమాసవనీప♦తన్మృధూళితపర్ణ, కలికాతసుమరజః♦కర్దమంబు
అరుణకిసాలశం♦పాలోకననికృత్త, విరహిణీచిత్తప♦ర్యంకకంబు
నానాప్రసవమాలి♦కానగారికరాస, రటదళీరమమయూ♦ఖస్వనంబు

గీ. కోకిలకుహూగ్రవజ్రని♦ర్ఘోషదళిత, మాలతీస్వచ్ఛతరుగుచ్ఛ ♦ మత్తహంస
కంబయిసెలంగెవర్షర్తు♦కరణిబూతుల, మీసరంబగువాసంత♦వాసరంబు. 1469

మిత్రవిందాపరిణయము, కుం. వేం. ఆ 2 పద్య 75.

సీ. శిశిరర్తుగెలిచి ని♦క్షిప్తతద్ధనమెత్తెఁ, గనుపట్టు పద్మరా♦గంబులనఁగఁ
దద్బలంబులఁగొట్టి ♦ తఱిమిమేనులుడుల్చి, కైకొన్నబంగారు ♦ రూకలనఁగ
తనభుజాభుజగతం♦తన్యమానంబులై, గాడ్పులుప్రతాపాగ్ని ♦ కీలలనఁగ
తనమీఁద వనదేవ♦తలుజల్లనెల్లెడఁ, దగుకుంకుమపసంత ♦ ధారలనఁగ

గీ. విరహినేత్రులఁ బొత్తిల్లు ♦ శిరసులనఁగ, నరుణతరుణప్రవాళంబు ♦ లచటనచటఁ
గ్రమ్మ ఋతురాజు నిండోలగంబుఁ జేసె, మదనసేనాధిపత్యసం♦పదలు వొదలి.

గీ. ధరములనునట్టిపచ్చరా♦తెట్టులందు, మొగ్గముత్యపుస్వస్తికం♦బులు ఘటించి
తలిరుజొత్తు లమర్చి మా♦ధవునిఁ గూర్చి, తీగయెలనాఁగ లారతుల్ ♦ద్రిప్పెఁ బ్రమసు.

కార్తికమాహాత్మ్యము, ఆ 4.

శా. అంత న్బ్రాంతవనాంతరాంతరకృతాం♦తాశాంతవాతాంకురా
హంతాక్రాంతనితాంతతాంతమృదువృం♦తానంతసంతానశా
ఖాంతర్దంతురకాంతపల్లవలతాం♦తాలోకచింతాకన
త్కాంతాస్వాంతము వింతవింతగ వసం♦తం బెంతయుం బొల్చినన్. 1472

యాదవరాఘవపాండవీయము, ఆ 2 పద్య 7.

మ. కమలామోదముసంఘటించి శుకవా♦క్యంబర్థి నాలించి యా
సుమనఃకాంక్షము తెల్ల బోధముఁ గనన్ ♦ శోభిల్లఁ గాఁ జేసి ని
త్యమహాభూతిఁ బలాశక్షేవనకళా♦వ్యాపారియై మాధవుం
డు మహిం గౌరవజాతి సేవడఁ బియ్యుం♦డున్ సద్విజుల్ మెచ్చఁగన్. 1473

బిల్హణీయము, ఆ 2 పద్య 6.

గీ. సద్విజాళిప్రసంగంబు ♦ సరసతరము, ప్రణవవిస్ఫూర్జితము బీజ♦బంధురంబు
పల్లవాలంకృతము ♦ ఫలప్రదము నైన, యాగమస్థితి నొప్పె స♦ర్వాగములు.

అనిరుద్ధచరిత్రము, ఆ 2 పద్య 40.

ఉ. అత్తఱిఁ జిత్తజాతవిజ♦యాంబుజమందిర కాటపట్టునాఁ
గొత్త మెఱుంగుఁ గ్రొన్ననల ♦ గుంపుల చక్కిలిగింతనాశుభా
యత్తత నొప్పెఁ బుష్పసమ♦యంబు సమంచితచంచరీకలో
కోత్తరవిత్తమై వనస♦ముజ్జ్వలమైకవధూసముక్తమై. 1475

చ. ననవిలుఫాదుసాపనుపు♦నన్ మధుఁ డన్నరులక్కురుర్విజా
లను పెనుగుత్తదారులవ♦నాంతరసీమలలో మరుత్కృశం
గొని చివురాకుసెత్తురులు ♦ గుప్పఁగఁ గైకముఁ గూర్చుదాఁక మొ
త్తినమయిపట్టలెత్తి నగ♦తిన్ దెరవైవగుడాకులత్తఱిన్. 1476

సూర్యతనయాపరిణయము, ఆ 2.

సీ. ప్రబలకుంజప్రజ♦పటమందిరములొప్ప, సుమనోమనోవితా♦నములు మెఱయ
మలయసమీరడిం♦భకు లూడిగము సేయ, నవ్యకాంచనభూష♦ణములు వెలుఁగఁ

పరభృతమాధవ ♦ పఠితతులఁ గొనియాడ, లతికాంగనల నాట్య ♦ గతులు చెలఁగఁ
దతభృంగగాయక ♦ పఙ్క్తితతి గానము సేయ, శుకశారికాదిసై ♦ నికులు గొలువ
గీ. వనధరాస్థానమున మాధ ♦ వ ప్రభుండు, నిగ్రహానుగ్రహక్రియా ♦ నిపుణుఁ డగుచు
మధుపమాలిన్యజాతుల ♦ మదమడంచి, యధికతరులకుఁ బచ్చడా ♦ లపుడు గప్పె.

వాసవదత్తాపరిణయము, వ. వీ. ఆ 2 పద్య 67.

సీ. పథికనిశ్వాసదం ♦ భమున వేడిమిఁ జూపి, సవినయస్ఫూర్తి వే ♦ సవి భజింప
గళదురునుమరస ♦ చ్ఛలమున జడిఁ జూపి, వానకసేవింప ♦ వర్షఋతువు
వ్యాకోచసుమకైత ♦ వమున సితాభ్రమై, భవముఁ జూపి శరదృ ♦ తువు గొలువఁగఁ
జాటీరగిరిశీత ♦ పవనమిషమున శైత్యముఁ జూపి హేమంత ♦ మనుసరింప
గీ. శుకపికగరుత్మరుద్ధూత ♦ శుభ్రపుష్ప, రజము పేర హిమానీదో ♦ షముగఁ జూపి
యవిరతంబుగ శిశిరర్తు ♦ వాశ్రయింప, సకలఋతురాజమయిన వ ♦ సంతు మలరె.

కవిజనరంజనము, ఆ 2 పద్య. 12.

గీ. సరససహకారకుసుమకే ♦ సరసమూహ, గురుతరామోదమయదిగం ♦ తరము మధుర
మధువిధురమధుపముమధు ♦ మాసమయ్య, మెవ్వనికి వేడ్క వాటింప ♦ దిజ్జగమున.

భర్తృహరిసుభాషితము, ఏ. ల. శృం. పద్య 86.

క. కమనీయవసంతప్రియ, సమాగమప్రభవహర్ష ♦ సముదికపులకో
ద్గమకలనఁ బూనె లతికా, సముదయమన నూత్నముకుళ ♦ జాలము లెసఁగెన్.

జాహ్నవీమాహాత్మ్యము, ఆ 2 పద్య 108.

చ. తలిరులు సంజ కోకిలవి ♦ తానము చీకటి పూలబారు చు
క్కలగమి యేచిపూచినచ ♦ కారపుమల్లెలచాయ వెన్న వె
న్నెలలుగ మాలతీవిరహి ♦ ణీవదనాబ్జసుషుప్తికారియై
వెలకొనియెన్ వసంతరజ ♦ నీసమయంబు సుఖోన్నతస్థితిన్. 1181

రామవిలాసము, ఆ 1.

క. తమజడఁ బోరిగొని తరుణ, త్వము క్రమ్మఱ నొసఁగుమనుచు ♦ ధరణీదేవిన్
గ్రమమునఁ బూజించినగతి, యమరఁగఁ దరులెల్లఁ బండు ♦ టాకులు రాల్చెన్.

సునందాపరిణయము, ఆ 4.

సీ. కలకంఠనాదంబు ♦ కాహళీధ్వని గాఁగ, దగుమరందమువసం ♦ తంబు గాఁగఁ
జిలుకపలుకులుద్విజా ♦ శీర్వాదములు గాఁగ, వ్రాలుపూవులుదలఁ ♦ బ్రాలుఁ గాఁగఁ
దుమ్మెదల్ హోమాగ్ని ♦ ధూమరేఖలు గాఁగ, లతలు పుణ్యాంగనా ♦ తతులు గాఁగ
తెలుపులేఁ జిగురుటా ♦ కులు నివాళులు గాఁగఁ, గుసుమరజంబు భ ♦ స్మంబు గాఁగఁ

గీ. స్థలసరోజాతతతులుగఁ ♦ జపకములు, గాఁగ మీనధ్వజుఁడు యాజ్ఞి ♦ కత వహించి
కడిమి మీఁదఁ గావించె ♦ ఘనవివాహ, విధులు మాధవవసంతశ్రీ ♦ మిథునమునకు.
దిలీపచరిత్రము, ఆ ౩ పద్య ౬.

శా. కంతుండన్నవజీరుఁ సాగ్రహసమ ♦ గ్రస్ఫూర్తి లోకత్రయీ
కాంతాకాంతమనోధనప్రీతతిఁ దా ♦ గైకోఁ దలంపూని దు
ర్దాంతప్రక్రియ దండయాత్ర చనుమా ♦ ర్గంబంటఁ జైత్రిస్ఫుర
త్ప్రాంతారామము రక్తవస్త్రగృహశో ♦ భం జేసి చెన్నారెడున్. 1484
నాగ్నజితీపరిణయము, ఆ ౨.

సీ. నలువంకఁ బగుకాంచ ♦ నములపూమొగ్గలు, ప్రజ్వలత్స్తంభదీ ♦ పములు గాఁగ
పొన్నకొన్నవకమ్మ ♦ పుప్పొడి వెన్నియ, ఫలంబు మీఁటినదాడి ♦ మంబు గాఁగఁ
దసుకుఁగెందలిరుటా ♦ కులగుంపులందంద, చలచుహరిద్రహ ♦ స్తములు గాఁగఁ
కలకలకంఠికా ♦ కలకలధ్వానంబు, లల్లనేరెడి పాట ♦ యనువుఁ జూపఁ
గీ. ప్రేమ మీఁ అంగ్లలతకూన ♦ పేరఁటాండ్రు, కొమరెకొన్ని విరివెండిపు ♦ ళ్ళెములఁ దేఁటి
యలతిఁ జిమ్మిలి పాయస ♦ మందుకొనఁగఁ, బ్రథమఋతువయ్యె వనలక్ష్మి ♦ ప్రాభవమున.
దశావతారచరిత్రము, ఆ 9.

చ. ఘనతరులాశ్రితద్విజని ♦ కాయహృదిష్టఫలప్రదాత్రితా
తనుసుమనశ్ఛటారుచివి ♦ తానము పేరునుకీర్తిలాభముం
గనుఁగొని రాగసంపదన ♦ వంతపదంబు భజించి యెంతయున్
మనుటయుఁ బాత్రిదానమహి ♦ మంబది యట్టిదకా గణింపఁగన్. 1486
శకుంతలాపరిణయము, పె. నా. ఆ 2 పద్య 15.

సీ. కలకంఠములు నోరు ♦ కాయకవడిగుయ్య, పవ్విత్తనయ్యుల మీఁద ♦ తెమ్మదియ్య
పరిమళసుమఫల ♦ భరము చేఁ దరులొప్పఁ, దేఁటుదాఁటులమోగ్రత ♦ దెసలఁ గప్పఁ
గుసుమాయుధుఁడు పుష్ప ♦ కోదండము ధరింప, వలిగాడ్పు పుప్పొడి ♦ వసుధ నింప
శారికాశుకహంస ♦ సంచారములు మీఱ, పూఁదేనెసోనలు ♦ పొంగిజాఱ
గీ. జాతిగడుఁగుండఁ బాంథులు ♦ భీతినొంద, జీర్ణపర్ణాళిరాల లేఁ ♦ జిగురుగ్రాల
మించుతెఱవీఁడ శృంగార ♦ మహిమతోడ, జగతిఁ దగెఁ గాంతవాసంత ♦ సమయమంత.
చెన్నబసవపురాణము, ఆ 4 పద్య 16.

సీ. కమనీయశాఖాధ ♦ కతరులకుసరాగ, పల్లవయోగంబు ♦ ప్రాప్తమయ్యె
మ్మానులపత్త్రాగ్రశ్రేక ♦ షదసుమనోరాజితో బ్యాపసవరజో ♦ యుక్తిఁ జెందె

బంచమసహితమై ♦ పరభృతద్విజకోటి, పాంథపీడనకు ను♦పక్రమించె
సకలరసజ్ఞాళి ♦ సముదయం బతిమాత్రి, మధుపానవశముచే ♦ మదముఁ జెందె

గీ. జాతికి విరోధి యగుచు వ♦సంతనాముఁ, డైన యన్యాయనృపతిస♦నాంతభూమి
యాపరింపఁగ నిటు లకృ♦త్యములు సాఁగెఁ, బ్రిజలు రాజానువర్తన♦పరులుగారె.

ధరాత్మజాపరిణయము, ఆ 3 పద్య 2.

ఉ. చిత్రితరక్తప్రసూనమధు♦సేవనలుబ్ధమనోజ్ఞచంచరీ
కత్రము పల్లవగ్రిసన♦కామపికాళివిషాదవల్లికా
దాత్రిము కామినీజనవి♦తానమనోగతమానభీరతా
జైత్రిము చైత్ర మొప్పెసుమ♦సాయకకేళిరసైకపాత్రమై. 1489

కృష్ణజన్మఖండము, ఆ 3.

ఉ. అందముగానిజీర్ణదళ♦నాంబరమున్విడనాడి వేడుకన్
గెందళిరాకువల్వఁ దుల♦కింప ధరించి మిళిందచోళమున్
బొందుగఁ దాల్చి మాధవుని ♦ పొందున వాసకసజ్జలీల నా
నందమెసంగ వన్యరమ ♦ నవ్యరుచిం దనరారె నర్తతిన్. 1490

చ. కనదళిపాళిచూచుకవి ♦ కస్వరగుచ్ఛకుచప్రకాశతన్
ఘనశుకరాజవాక్పటిమఁ ♦ గాంతఫలావళిభూషణంబులన్
దనపరిరాగగంధమును ♦ దాల్చివనావనికాంతయావసం
తున కనురాగమొప్పఁగను ♦ దోఁచెను దత్సమయాగమంబునన్. 1491

వల్లవీపల్లవోల్లాసము, ఆ 1 పద్య 110, 111.

మ వనవీథిం బవనాహితుండికుఁడు శ్రీ♦వ్యంబైనభృంగావళీ
స్వనతుంబీరవమొప్పగుచ్ఛపణయు♦క్వల్లీభుజంగాళి నా
మనిప్రోలన్నటియింపఁజేయ నిదె శుం♦భద్ద్రుమశ్రేణికం
దనకుంగల్గినవెల్ల నిచ్చునగదా ♦ త్యాగాభిరక్తుండిలన్. 1492

నయనోల్లాసము, ఆ 3 పద్య 91.

సీ. వికచగుచ్ఛప్రసే♦వకసమృద్ధరమైన, పువ్వుఁగొమ్మప్రవాళ♦ముగఁ దనర్చి
ధవళపుష్పంబులన్ ♦ దంతపుమెట్లపైఁ, దతచంచరీకాళి ♦ తంత్రు లమర
వల్లికాబాహుమ♦తల్లికాగ్రంబునఁ, జెలఁగుకెంజిగురుటం♦గుళులఁ జేర్చి
పవనలేపనమునఁ ♦ బల్మరు మీటుచుఁ, గలకంఠరవ ముపాం♦గంబుగాఁగ

గీ. సాగనిగరిమమా పని◆సరిసరిధని, మగనిగనిమా నిసిపగ◆మాయటంచు
మించిమధులక్ష్మివీణవా◆యించసాగెఁ, బ్రియకపితలమననువి◆హ్వలతనొంద.
శంతనూపాఖ్యానము, ఆ 2 పద్య 9.

సీ. ఎనలేనిరంగుల ◆ ననలగుత్తులఁదగు, సీరాలుసొగసైన ◆ యిండ్లుగాఁగ
గాలితాఁకుడులచేఁ◆గడునూఁగుడిగియా, లాడిగాలొనరించు ◆ జేడియలుగఁ
గొలకొలనంచలు ◆ గోరింక లొనరించు, రొదలులగ్గులొసంగు ◆ రొదలుగాఁగ
సరిదేఁటిజంతులు ◆ చక్కనిగాణీల, తండనాలనెసంగు ◆ క్రందుగాఁగఁ
గీ. దేటుగలకోయిలలు గాణ◆ తెగలుగాఁగఁ, జిలుకదాఁటులు నేలజే◆జేలుగాఁగ
వాకిగొనినసకారను◆నేల కేఁడు, గానసిరిచేయిఁజేకొని ◆ కడుఁడనర్చె. 1494
శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచనకుశచరిత్రము, ఆ 2 పద్య 34.

ఉ. విటపిలతల్ వసంతశుభ◆వేళను మున్నుగఁ బండుటాకులన్
దటుకునరాల్చి పల్లవవి◆తానముదాల్చెను బచ్చిమొగ్గలన్
జటశిరమందుఁగ్రాలఁగ ము◆దంబునజీర్ణపటాలివిప్పి క్రొం
బటములఁ దాల్చి యక్షతలు ◆ పైనిడఁగ్రాలువధూవరుల్గతిన్. 1495
సావిత్రీపరిణయము, ఆ 3 పద్య 5.

మ. తమకుంబోరిడియొనర్చెభూతరుణి క్రీ◆తింజాలఁదక్తొన్వికిం
విమలంబౌపరిధానభూషణములే ◆ వేలొందఁగాఁజేసినే
మమునైకొందుమటంచుఁబాదపములన్ ◆ భాసిల్లవల్లీసమే
తములైపుష్పితమయ్యెసాంగముగ ని◆త్యానందసంశీలతన్. 1496
పట్టాభిరామాయణము, ఆ 2.

మ. కలయంగాద్రుపఁ దూలుఁపుష్పాడి దివిం◆గప్పారుమారుండువే
డ్కలనారామరమావసంతులఁగవం◆కంబెంట్లిసేయించుచో
వెలయంబట్టినయుల్లభంబుపగిదిన్ ◆ వేమాఱుఁదమ్మాభిమిపైఁ
జెలువొందించుచు రాలుఁ బుష్పవితతుల్ ◆ చేసన్నఁబొర్లోయనన్. 1497
ప్రద్యుమ్నచరిత్రము.

సీ. చిలుకగోర్వంకకో◆యిలలమొత్తపుముద్దు, లాడిసెడునుడులుప్రా◆నుడులుగాఁగ
వికసించినట్టివా◆లికనునుసంపంగి, తుటుము జన్నంపుఁద◆మ్మఁటులుగాఁగ
గాలిచేనటునిటుఁ ◆ గదలియాడెడుపత్త్రి, సముదాయములుధవ◆త్రములుగాఁగ
శాఖలు వాలిన ◆ ఫలపుఁ బలు పసులను, బంధించనిడిన యూ◆పములుగాఁగ

గీ. వనఁటిమావుల క్రిందరా♦లినకప్రసవప్రుఁ, బెప్పలు వెలుంగ యజ్ఞవే♦దికలుగాఁగ
మారుఁ డని యొదు సోమాసి♦మఖముఁ జేసి, పాంథులనియొదు పశువులఁ♦బట్టిసాగె.
కవిజనచకోరచంద్రోదయము, ఆ 2.

గీ. సకలనరసాతిశయకీర్తి ♦ సంఘటించఁ, బాలుపడియును శుకశిక♦పరికరయుక్తిఁ
బక్షపాతానుషక్తిఁ బ్రా♦బలె నసఁగ, నమరెచెవసంతుఁడిలమున్ను♦ఖ్యాతిశయము,

సీ. తుమ్మెదలకునోగి♦తమ్ముకౌవలరుల, కమ్మఁదేనియలెల్లఁ ♦ గుమ్మరించెఁ
గీరవారంబుల♦కారివేరంబుగా, ఫలజాలముల నేల ♦ వాలుచేసె
దొరలునంటునఁ జూప ♦ తరులనంటి పెనంగు, నలలశూనలఁ ♦ దోలఁగఁదోసిచె
పని నిచ్చఁ బమయిచ్చు♦వర్తిల్లుఖగముల,కన్నులపైఁ బరా♦గములుసల్లె

గీ. విరహిజనమానసము నేర్చు ♦ విధము నేర్చు, భావభవశరకేళికొౌకకే♦యావహించె
గాలియావేశదాక్షిణ్య♦శాలియయ్యుఁ,బంచబాత్ములఁ బగవిశ్వా♦సించఁదగవె.1500
గాఢ్గేయోపాఖ్యానము.

సీ. సల్లలితారోప ♦ సల్లలితారుణ, పటకుటీరమ్ముల ♦ భ్రమరనాద
గీతంబు రంజిల్లఁ♦గీరపికావుల, రవము మృదంగాది ♦ రవముగాఁగ
మందానిలుండుకీ♦లుంబివసించెడి, గాయకుండుగ లతా♦కాంతలెల్లఁ
జివురుచేతులఁదిరిప్పి ♦ చెలఁగి నాట్యము సేయఁ, బూవింటిపాదుషా♦పుష్పపీఠి

గీ. వజలఁజేసి వసంతభూ♦వరుఁడు పుష్ప, రజము మకరందమును గంధ♦రజము ఘనవ
సంతమును గా నమర్చి ల♦తాంతహార, సంతతి యొసంగె నసఁగ వ♦సంతమలరె.1501
భార్గవపురాణము, ఆ 6.

సీ. పొన్నగున్నలచాలు ♦ పొంబట్టువలువతో,రములైన పటకుటీ♦రములుగాఁగ
నవరసాలచ్ఛటా♦నవపల్లవాశ్రిత, మమితమంగళతోర♦ణములుగాఁగ
పికపికీపంచమ ♦ ప్రకటనిస్వానముల్, వేణువీణాగాన ♦ విధులుగాఁగ
కేకికేకలు శత్రు♦లోకభీకరతాప్ర,దములైన జయకాహ♦ళములుగాఁగ

గీ. భ్రమరగానంబు శుకముల♦భరతవిద్య, వరకపోతమృదంగని♦స్వనము చెలఁగ
గణికలు నటింపఁ జూచితే ♦ కమలనయన, కొలువుఁ దీర్చె వసంతభూ♦తలవిభుండు.

సీ. కుసుమబృందములపై ♦ మూసరి గుంపులుగట్టు, భ్రమరపంక్తులు మేఘ♦సమితిగాఁగ
మహిఁ బొటపొటవాలు♦మకరందబిందువుల్, వర్షాగమోత్కర్ష♦హర్షమెసఁగ
మలయానిలోద్ధూత♦మహిరుట్పతత్ప్రసూ,నములు వ్రాలినకర♦కములుగాఁగ
దెసలు గ్రమ్ముచు వాలు♦తేనెవాకలచాలు, ఘనములో సెలయేళ్ళ♦గములుగాఁగ

గీ. బిసప్రసూనాదులతోఁ జమిలితమౌ♦పుష్పరసము, పంకసంకలితములైన ♦ పదము గాఁగ
యీవసంతస్తు వీక్షించి♦ తేవఘాటి, నేడు పక్షర్తుధర్మముల్ ♦ నెరపె నహహ. 1503

కుబ్జాకృష్ణవిలాసము.

సీ. మదనుని యాస్థాన♦మంటపంబు లనంగఁ, జాతపోతంబులు ♦ సొంపుమీఱె
నంగజరాజుసిం♦హాసనస్థలులనఁ, బున్నాగములచాలు ♦ పొలుపుమిగిలె
ననవిల్తుశృంగార ♦ నాట్యశాల లనంగ, వకుళంబు లెంతయు ♦ వన్నెచూపె
నతనునిక్రీడాగృ♦హంబులో యన నొప్పె, మాధవీనివహంబు ♦ మహిమఁ దనరె
శంబరారాతిపటుశస్త్ర♦శాల లనఁగ, లీలఁ గన్పట్టె జాతిమ♦ల్లీనికుంజ
పుంజములు మించె మంజుల♦పుష్పలతల, శ్రీకరంబును సకలసౌ♦ఖ్యాకరంబు,
నగుచు విలసిల్లె నంత చై♦త్రాగమంబు. ... ... ... ... 1504

ధనాభిరామము.

గీ. మాధవవరప్రసాదసౌ♦మగ్రివలన, యామ్యదిక్కాంతనికటప♦నాగజీర్ణ
పర్ణచిత్రపరిష్కార ♦ పటలి సడలి, యనిలడింభకగర్భిణి ♦ యగుటఁ జెలిపె. 1505

క. తలఁప నుదాహరణాకృతిఁ, గలకల రంజిల్లసరస ♦ కపికావ్యమునం
బలె నెవలమత్తకోకిల, కలయన్మధువేళవనని♦కాయం బలరున్. 1506

రామాభ్యుదయము, ఆ 1 పద్య 160, 170.

క. భ్రమరకమలుముఖసంగతి, నమరమధుస్వేదయుక్త♦యైయౌవనలక్ష్మీ
కమలాననయుపరతిచే, తమాధవునిఁ గూడినట్లు ♦ దగునవ్వేళన్. 1507

సర్వకామదాపరిణయము, ఆ 2.

---

# గ్రీష్మర్తువు.

—:o:—

మ. హరి యంభోనిధి సొచ్చె శంభుఁడు తుషా♦రాద్రిప్రభుం బ్రోఁకె వా
గ్వరుఁ డుద్యన్మకరందదుర్దినసము♦గ్రంబైనయుత్ఫుల్లపం
కరుహంబున్ భజియించె దీనిమును గ♦ల్గం గాంచియే కాక యొ
వ్వరి నింకేల సహించు గ్రీష్మ మనఁగా ♦ వర్ధిల్లెఁ దాపోద్ధతుల్. 1508

హరివంశము, పూర్వభాగ. ఆ 6.

చ. మలయజవారిసేకముల ♦ మౌక్తికనూతనహారవల్లికలన్
వలిపెపుసన్నకావులను ♦ వారిరుహోత్పలవీఁగుఁజన్నులన్
గలిగినచల్విరిం బ్రదికెఁ ♦ గాకజనావలి యొట్టివేసవిన్
గలదె శరణ్యమన్య మనఁ ♦ గాఁగదుఁ జేర్చె నిదాఘదాహముల్. 1509

నృసింహపురాణము, ఆ 3 పద్య 68.

చ. పరిమెయిమెట్టితోల్తబహు♦భంగులఁ గ్రాలెడు మిత్రు జైత్రునిం
బురిగొనవచ్చె గ్రీష్మ మను ♦ పొచ్చపుఁజేరఁబురారిఫాలభా
నురపటువహ్నియంచు వెఱఁ ♦ జొచ్చిన మన్మథుఁ గాంచె వత్తటిన్
సరసశిరీషకేసరల♦సన్మహిళామృదులాలకాగ్రముల్. 1510

నృసింహపురాణము, ఆ 3 పద్య 98, 72.

శా. ధారామండితసాలభంజికలచే♦తన్ జిత్రయంత్రోద్గళ
త్సారామోదతుషారపూరములు వి♦స్తారంబులై పర్వఁగాం
తారూఢేక్షణదీప్తితోడనచలు♦క్యాధీశుపైఁ జంద్రివం
శారాధ్యుం డని చంద్రికారసమునిం♦పైకాల్చుచందంబునన్. 1511

కావ్యాలంకారచూడామణి, ఉల్లాస. 3 పద్య 100.

ఆ. వాఁడిరుచులుగల్గు ♦ వానివేఁడిమిగ్రీష్మ, కాలమందు జగము ♦ గలయఁ బడియె
బ్రహ్మ జనులకొఱకు ♦ బ్రహ్మాండఘటమున, నుష్ణరసముఁ దెచ్చి♦యునిచెననఁగ.

భాగవతము, స్కం. 10 పూర్వ. పద్య 716.

సీ. నిర్ఝరప్రభలవే♦ణికలింకఁజటాలిఁ, బేరిన ప్రాచిపె♦న్నీట లెగసె
నెఱకులుపడియనీ♦రివురగువ్వలఁబట్టఁ, బోయునీరాడాడఁ ♦ బొలమునెఱసె
నురగాలిదవదగ్ధ♦తరుపర్ణతతి రేఁచఁ, బావురాలనిడేగ ♦ పదుపుదూఱె
నిద్రితద్రుచ్ఛాయ ♦ నిలువక జరుగనెం, బడిగనద్వగపంక్తి ♦ పొడలునెమ్మై
గీ. క్షేత్రపాలునికుదికిన ♦ చీరలాఱు, చాకిరేవులగములయ్యె ♦ సకలదిశలు
దెలుపులుగఁదోఁచెనెండమా♦వులబయళ్ళు, గండెనివియెండపననడిజుమ్మ♦ఖములురాఁజె.
గీ. ఎసఁగుకట్టావిక్రియనావి♦రెగయఁబగటి, యెండయుడుకారకుండభూ♦మండలమునఁ
బొలిచె మాపటిపండువె♦న్నెల చకోర, పోతవితతికిఁ జాపట్టు♦వోసినట్లు. 1514

ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 37, 51.

ఉ. ఎండఁగొలంకులెల్లనుమ♦హీధరముల్ దవవహ్నికీలలన్
మండె ధరాతలంబినుప♦మంగలమున్బలెనుండెఁ గాలి యా

యెండలనేమిచెప్పఁ బర◆మేశ్వర యావరణాంబురాశిలే
కుండిననాఁడె వాక్కిపడ◆కుండునె పద్మభవాండభాండముల్. 1515

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 1 పద్య 123.

మ. ఓలనిస్వేష్టజరమ్యజంగముశవా◆ఫీలాతిక్షుత్తాపరకా
రశఘోరానలభావదాయకదశ◆వ్రాతింబుఁ బచ్చాంతిపి
త్త్యలసచ్ఛైవలినీభవిష్ణుమృగతృ◆ష్ణాలీలమై నుర్వగం
గలయంబయ్యె నిదాఘకాలముసమ◆గ్రక్లాంతసత్త్వాలమై. 1516

కువలయాశ్వచరిత్రము, ఆ 1 పద్య 94.

సీ. చండభానుఁడుకక్క◆సముఁజేసి మున్ను దా,మహికిచ్చునప్పులు ◆ మరలఁగొనియె
వారిపూర్ణములైన ◆ వసుధారకలశముల్, శివలింగమూర్తుల ◆ శిరము లెక్క
నృపమందిరములఁబా◆నీయకుంభంబులు, వెసనుట్టిఁగట్టుక ◆ వేళ్ళఁదొణఁగె
భువినెల్ల జనులద◆ప్పులుమాన్పతక్రంబుఁ, దావప్పఁగొనినీళ్ళ◆ద్రావఁ జొచ్చె.
గీ. హరుఁడు కైలాసవసుధరనా◆ధాగ్రవసతి, విడిచి వటమూలతలమున◆విశ్రమించె
సతతనిజదీక్ష తాతనూ◆కృతినిశాపతి, హరములగునట్టిగ్రీష్మవా◆సరములందు. 1517

వైజయంతీవిలాసము, ఆ 1 పద్య 57.

సీ. అధ్వన్యభిక్షశ్రీ◆మాధ్వన్యసంఘంబు, ప్రతిపద్ధతిప్రపా◆పరికరంబు
పల్వలోదన్వయం◆పచ్యమానఝషంబు, బహుభిదేళిమశిరః◆పటలయురుక
ముస్తముస్తావిహా◆సస్తస్తరోమంబు, కీచకనికషజో◆ద్దీప్తరవము
పరితోవిభిన్నభూ◆పవదృష్టపాతాళ, ఘనాభగళనీర ◆ సాచ్ఛభల్ల
గీ. ముదరఖాగప్రపూరణో◆ద్యోగవిముఖ, వమధువిరహోన్నమత్కార◆వ్యక్తవిటప
కించిదాతపహృద్వనీ◆సంచరిష్ణు, మదగజేంద్రంబు వేసవి ◆ యెదురుకొనియె. 1518

విప్రనారాయణచరిత్రము, ఆ 2 పద్య 49.

గీ. అట్టివేసవిజడిదంపు◆వెట్టకతన, నేలనందంపశరిసిన ◆ సెలియలందు
ధరణిపాదంబు లెడనెడఁ ◆ దప్పుల మెల్లఁ, దివిచికొనిపోవ దివసంబు◆దీర్ఘమయ్యె.

వాల్మీకిచరిత్రము, ఆ 2.

గీ. ఏమిచెప్పెదనయ్యెండఁ◆దామరసభ, వాండభాండమ్ము లెల్లను◆ద్దండసాల
జాలకప్రాశనకరాళ◆కీలఁగ్రాల, గుమ్మరావమ్ముకరణిజ◆గమ్ము దొరసె. 1520

రాజవాహనవిజయము, ఆ 5 పద్య 99.

చ. ఉడుగని బాడబాగ్ని సెగ♦నోర్చియు నోర్వఁగలేక వేసవిన్
జడమయుఁడయ్యు నయ్యపర ♦ సాగరుఁడుస్సున నూర్పువేఁడిమిన్
బడమటి గాడ్పు లుప్పతిలెఁ ♦ బోఁడిముగాక నిదాఘవేళలన్
గడుసెగచేత మేహమయ♦గాత్రిజనుల్ తపియింప కుండురే. 15 21

కవిరాజమనోరంజనము, ఆ 4.

శా. మాయాసంసృతిసత్యసంసృతిజనిం♦పండేసి పేరాసలం
గాయక్లేశము నొంది లోకులు తలం♦కన్ మించుకాంతేక్షణా
చ్ఛాయం బోలినజాలి నాఁగ మృగతృ♦ష్ణం జూచి సారంగముల్
తోయభ్రాంతిఁ బఱంచె సంగఫలమెం♦దుం దప్ప దెవ్వారికిన్. 1522

ఉ. రేవొరసొంపొసంగి వవ♦రించిన కల్వల జీవనోన్నతిం
జోఁదిరి యొసర్చెనం చలిక♦పుష్టి కొలంకుల నింకఁజేసెఁ గా
కాదెసఁ బద్మినుల్ గనుల♦యంబుగ నండినుఁ దెట్టి బంధువుల్
ఛేదిలినన్ విరోధు నద♦లించక మానరుగా మహాప్రభుల్. 1523

సమీరకుమారవిజయము, ఆ 2 పద్య 90, 92.

ఆ. క్రమముతో నగాధ♦విమలోదకమహాహ్రి, దమ్ము లింకెఁ దపన♦తాపమునను
బోరినసంఖ్యకోశ♦పూర్ణగేహములు దు,శ్శీలనృపుని చే న♦శించుభంగి. 15 24

జాహ్నవీమాహాత్మ్యము, ఆ 2 పద్య 124.

చ. పవలనువర్తకాగ్రణి న♦భశ్చలసాగరమధ్యమార్గములో
రవియను నోడమీఁద నప♦రక్షితిభృత్పురిఁజేరరా మరు
జ్జవగతి సుళ్ళఁ జెట్టె నది♦సాగక చిక్కినమాడ్కి నూర్యుఁ డా
య్యావసరమందు మందగతు♦లానిన దీర్ఘములయ్యె ఘస్రముల్. 1525

హంసవింశతి, ఆ 2 పద్య 155.

మ. తుహినాస్యోత్క్రమకృద్గవోద్గతమహా♦ఘామాంబువాహంబువే
చరమాశాగతమైన గాలికెదురై ♦ సౌరోజ్జ్వలస్యందనం
బురహిం గ్రాలఁ గుమారుగాలిపటముం♦బోలెం దివి న్మెల్లనై
తిరగంగా నిటులయ్యె నాఁగ దినముల్ ♦ దీర్ఘంబులయ్యెం గడున్. 1526

చ. పడమటిగాలివెట్టనొక♦పారియుఁ గ్రోలమి నీరసంబులై
జడిసిన సిల్వగుంపు నొక♦సారియు గ్రుంగమి సొమ్మసిల్లి గ్రా
న్పడినగుబాల నొల్లని ధ♦ణాయునికిం ఘనవాహనంబులం
బడిబడి యంపెనో యమధ♦ర్త యనం దగె దావధూమముల్. 1527

మ. జలజాప్తోగ్రమయూఖపుంజకుముకిన్ ♦ సప్తాశ్వకాంతోపల
మ్ములు సోకించి తదుద్గతాగ్నిలవముం♦బోధించివాత్యానా
నిలవేగమ్మునఁ గాలుకొల్పిపతకా ♦ నీకంబు పాకంబుగా
నలరించె న్సమయాఖ్యపాచకుఁడు భూ♦తాహారసంప్రాప్తికిన్. 1528

శుకసప్తతి, ఆ 3.

ఆ. పగలువిస్తరించి♦మిగులవేఁడిమినూపు, తపనుఁజోరకచాయ♦తరులనీఁగెఁ
బరమసాధ్వియయ్యు ♦ భర్తవెన్నాడె నే, తగనిశిక్షసేయఁ♦దగదు పతికి. 1529
గీ. సూర్యుఁడునిజప్రతాపంబు♦నూపనూర్య, కాంతములు రేఁగినిప్పులు♦గ్రక్కఁదొడఁగె
నినుఁడు కోపింపఁ బరివార♦మినుమడించి, కడిమి నూపుటధరణిని♦క్కంబకాదె.

శకుంతలాపరిణయము, కృష్ణ, ఆ 1 పద్య 33, 34.

సీ. మృదుతరచ్ఛాయాప్తి ♦ మీఱియుండుటెకాని, మృదుతరచ్ఛాయాప్తి♦మీఱదయ్యె
భువనబంధుప్రీతిఁ ♦ బూనియుండుటెకాని, భువనబంధుప్రీతిఁ♦బూనదయ్యె
మిథునసంగతిగల్గి ♦ మించియుండుటెకాని, మిథునసంగతిగల్గి ♦ మించదయ్యె
సుమనోవికాసంబుఁ♦జూపనోపుటెకాని, సుమనోవికాసంబుఁ ♦ జూపదయ్యె
గీ. నెయ్యెడలనంచుజనులెంచు♦టెరువుగాంచు, సొమ్మసిలమించుటుడుకులు♦గ్రుమ్మరించు
బడలికలునించు భోగుల♦పనలడంచు, నెండలలరించువేసవి ♦ దండఁగాంచు. 1531

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 3.

క. బాడబవహ్నిజ్వాలల, వేఁడిమిచేజడతనొంది ♦ వేసవితఱినిన్
దాడివి(స?–వాడిన?)యపరపయోనిధి, వీడినవిట్టూర్పులనఁగ♦వెలసెన్ గాడ్పుల్.

వల్లవీపల్లవోల్లాసము, ఆ 2 పద్య 162.

గీ. ఇనునిసత్కృపవనలక్ష్మి ♦ హెచ్చుటరసి, నిశలునానాఁటభృశకృశ♦దశలఁగాంచె
నౌరులసిరులకుఁ జూపోప♦కున్నఁదనదు, పెంపుదఱుఁగుటగాకన్య♦వృద్ధిసెడునె.
గీ. ఇచ్ఛఘనులుండిరని యప్పు♦లిచ్చవడసి, పొంగి పొరలిన సరసుల♦పొలుపుదఱిఁగె
మున్నుగలకీర్తిసారముల్ ♦ పోవ నప్పు, డప్పులనుజొప్పడినయొప్పు♦ముప్పుగాదె.

మహేంద్రవిజయము, ఆ 2 పద్య 68.

క. ఇనతీక్ష్ణపాతహతయై, నను భూసతిరక్తయయ్యె♦ననుటకునరుదా
పినుఁడదిక్షమయేకాదే, యినపదతాడనముసతికి ♦ నెగ్గేతలఁపన్. 1535

సావిత్రీపరిణయము, ఆ 2 పద్య 19.

# వర్షర్తువు.

——:o:——

క. ఘనతరనైశతమఃపుంజాకో, యనఁగ ఘనాఘనతమిస్ర♦మవిరళ మైక
ప్పిన జనులకుపవస్తువిభా, వన మొక్కొకమాటుగలిగె ♦ వైద్యుతరుచులన్. 1536

చ. ఇలిపనపీనకందకేక ♦ చంపకచంబక కేతకీరజో
మిళితసుగంధబంధురస♦మీరణుఁడన్ సఖుఁడూఁచుచుండఁగా
నలియూచు మొల్లగుత్తులను ♦ నుయ్యాలలొప్పఁగ నెక్కియాఁగెను
ల్లలపలికీకులంబుమృదు♦లధ్వనిగీతము విస్తరించుచున్. 1537

క. ముకచాపచిత్రిగగన, స్ఫురణంబురణించునట్లు ♦ భూవనితనిరం
తరచిత్రితయైయొప్పెను, సురుచిరనవతృణశిలీంధ్ర ♦ సురగోపములన్. 1538

భారతము, అర. ఆ 4 పద్య 136, 138, 139.

ఆ. దిశలఁ బోలయ మెఱుఁగు♦దృష్టులుఘుర్ఘుర, గర్జనంబులులియ గజపగతుల
ఘనపయోధరములు ♦ వనరంగ జవ్వని, బోలె వచ్చెవాన♦కాల మర్థి. 1539

శా. ఆక్రోశిక్కారనురాజుబ్రోల నిజరా♦వానంతగేయార్భనా
దైకాత్యోద్యముఁగూర్చిమ్రోయ సురగో♦పాంభోదరాగత్విషా
సీకోద్యద్ధరిదశ్మకస్థలలస♦న్మృత్యోర్యరంగస్థలిన్
నేకీపాత్రిము లాడె భావముగను♦త్క్షిప్తాగ్రపింఛంబులై. 1540

కుమారసంభవము, ఆ 6 పద్య 752, 760.

సీ. ఉదధిసమేతపీ♦తోద్వాంతబాడబ,జ్వాలయితోగ్రశం♦పాలతంబు
నిర్ఘాతరవసరం♦భ్రీకృతాజాండబ,హిర్జలభ్రమదధా♦రోర్జితంబు
నిర్జాద్యగర్జిత♦స్ఫూర్జిఘూర్జర్జిత, ప్రళయభైరవరట♦త్పటహరవము
ఝంఝాప్రభంజన♦జాతసంఘట్టన, పరిగళత్తారక♦త్కారకగణము

గీ. నగుచు ఘనఘనాఘనసంఘ♦మవ్విధమునఁ, బూనిహోరున జడిదంప్ర♦వానగురియఁ
గరము భూనభోంతరముచీ♦కట్లుగొనియె, నఖిలలోకంబునుచెకమ♦యత్వమొందె.

కళాపూర్ణోదయము, ఆ 4 పద్య 88.

మ. యమునన్గంగము కృష్ణభూమడిల మ♦బ్జాక్షున్మనుష్యంబు నీ
లమహీధ్రిన్నిఖిలాచలావలిత మా♦లమ్భాజ మిందీవర

త్కుముదశ్రేణి పికద్విహంగము పమ♦స్తోమద్గ్రిహార్కపరిభా
సముదాయం బగుచుండెలోక మలఘు♦శ్యామాభ్రము ల్వర్షిణన్. 1542

భాస్కరరామాయణము, కిష్కిం. పద్య 382.

మ. చపలాలోకములున్ బయోధరగరి♦మశ్రీయు నవోల్లస
ద్విపులానందము నంబరాభరణస♦ద్వేషంబునుం గంకణ
స్ఫుటారావము సొంపుమీఱం దగుప♦ర్షావేళ విశ్వేశ్వరా
ధిపుసేవించుప్రగల్భకామినిగతిన్ ♦ దీపించు భావింపఁగన్. 1543

కావ్యాలంకారచూడామణి, ఉల్లాస. 3 పద్య 102.

క. వర్షాకాలభుజంగుఁడు, హర్షముతో విడినవన♦ఖాంకములని యు
త్కర్షింవభూమిసతిపైఁ, గర్షకహలరేఖ లమరె ♦ గహనాంతములన్. 1544

క. చెలువుఁడు ప్రావృట్కాలుఁడు, సోఁకినఁ బులకించుభూమి ♦ పులకము లనఁగా
మొలచి తలలెత్తి నిక్కుచు, సలలితగతిఁజాలువారె ♦ సస్యములధిపా. 1545

భాగవతము, స్కం. 10, పూర్వ, పద్య 753, 754.

శా. ధారాళాంబుదబృందనిర్ఝరనిరో♦ధవ్యాప్తనాశాంతముల్
భూరిధ్వాంతమయంబులైనజనులే♦ప్రొద్దున్ రవిం గానమిం
దారూహించుచు నుందు రాఁకొనుట మ♦ధ్యాహ్నంబునుద్దామని
ద్రారంభంబునరాత్రిటంబగటబో♦ధావాప్తిఁ బ్రత్యూషమున్. 1546

శ్రీరంగమాహాత్మ్యము, ఖై. క. ఆ 2 పద్య 2[illegible]6.

సీ. ఎలగోలుజల్లులున్ ♦ పెళపెళ నేటవాల్పడి గాలినట్టింట్లఁ♦దడిపి చనఁగ
నట్టితో వడగండ్ల ♦ కట్టావులుదుమార, మావులు రేచిరెం♦డవదియుఁజన
మఱిమూఁడవదినిల్చి ♦ మెఱసిబిట్టుఱిమిశీ,కరవారిస్పృష్టిఁజీఁ♦కటిగనలమ
నుయ్యేలచేరుల ♦ యోఁజఁ బైపైపెండి, జల్లుపైజల్లు పె♦ల్లల్లుకొనఁగ

గీ. భూభిదాపాదిదుర్భరాం♦భోభరంపు, వడిమరుజ్ఝంఝఁ దెరలక♦కడవవంచి
నట్లు హోరని ధారాఘ♦మైక్య మొంది, విన్నుమన్నునునొకటిగా♦వృష్టిబలసె.

మ. అలపర్జన్యుఁడు కేకిపాత్రములగుం♦పాడించుచో మేఘమం
డలపున్ మద్దెలగ్రుంగ లేవనుమరు♦న్మార్దంగికుండర్షిసె
త్తలలిన్నేలమ్రవాలుచున్నగయుచుం♦దారాడునతెల్లజ
ల్లులుఁగెంగున్నెలునయ్యెఘాసలునుస♦ల్లోలంప్రగోపంబులున్. 1548

సీ. రవిఁజూచికుడుచువా♦రలకును గ్రుకలాస,ములకునుదృష్టిమి♦న్నులనె నిల్చె
సంధ్యార్ఘ్యదాయిద్వి♦జశ్రేణి కిలుసేసు, మొదవులకును భ్రాంతి♦మది జనించె
హాలజీవిసందోహ♦ములకు బలాకికా, విసరంబులకుమంచి ♦ వెదలుదొరకె
నెలమిఁబొల్పగుయూకి♦కలకు సంతెలకూట,ములకును మఱపిచ్చు♦ మొగ్గలాడవె
గీ. నతిథిసంఘంబునకుసేని♦పక్ష్మిరేయనుప, కదుపులేఁగలఁగమికిపా♦కట్టు లెసఁగె
మంత్రిమిద్దెలవారికి ♦ మరువనులకు, నెలఁతవాసినవారికి ♦ నిదుర చెడియె. 1549
ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 91, 92, 123. (చే

గీ. మెఱుఁగుతత్రౌడు పెఁకువ♦మించు మొగులు,చాలుకవ్వాప్రమలమరు♦చ్ఛాయ మ
భ్రిమణమొందించినాత్మ్నమా ♦ నమృతపకార, వినుకడలిఁగల్గఁజేసెఁబ్రా♦వృణ్మురారి.
గీ. సాగరపిపంబుఁ గ్రోలి ధూ♦ర్జటియుఁ బోలె, నా త్రివిక్రమగతి దివి♦నాక్రమించి
విధియుబలెనాదిసృష్టికా♦వించికాదు, మొగులుదలఁకించెనపుష్త్రి♦మూర్తి మహిమ.
శా. ధారాశుద్ధిఁ బ్రసిద్ధిఁగాంచి ఘనశ♦ద్దస్ఫూర్తి వర్తిల్లఁగాఁ
దోరంబైన రసస్థితిన్ పరకపి♦ద్యున్మాలికాలక్షణో
దారంబై కవిసేవ్యమా వనములయా♦రాధూఢిఁ బ్రాపించి వ
ర్షారంభంబు ప్రబంధమట్లఖిలప♦ద్యాక్రాంతమయ్యెండగన్. 1552
సీ. హరిహయాయుధరేఖ♦లనుగడల్ వేయించి, యలముధారారజ్జు♦వులబిగించి
జలదంబులనునీలి♦వలలెల్లెడలనిల్పి, వివిధగర్జావాద్య♦రవముగొల్పి
తేవమీఱఁ దటిన్న♦టీపంక్తిఁ బ్రేరించి, కోఁపుగా మెఱుములు♦గొనఁగ జేసి
సరసులకోకసొంపు ♦ సంధిల్లఁగావించి, పెక్కుదిక్కులవారిఁ ♦ బెంపుఁజేసి
గీ. యలరెఁ దొలకరితటిపేరి♦యాటవాఁడు, మీటువాటిల్లవలరాచ♦ మెచ్చువడసి
పథికజనమానధనము ల♦పారలీలఁ, గొల్లలాడెనుభువనంబు♦లుల్లసిల్ల. 1553
రామాభ్యుదయము, ఆ 6 పద్య 6, 8, 13, 18.

క. కుంభీనసములుఁ బ్రేలిన, గుంభనమునఁ గుంభిహస్త ♦ గురుతరధారా
రంభమున రేయుఁబగలున్, గుంభద్రోణములువట్టి ♦ కురిసెన్వానల్. 1554
కవికర్ణరసాయనము, ఆ 6 పద్య 23.

చ. కరములుచాఁపివడ్డిడుట♦కై బుధశుక్రులసాక్షి వెట్టి య
య్యరుణుఁడుభూమిచేతఁదగ♦నప్పులుగైకొని యియ్యకున్నచో
ధర తనమూలవృద్ధులకుఁ♦దక్కక సాగిన వారిఁ గూర్చి య
క్కఱగుడిఁ బ్రాసియీఁగెనసఁ♦గాఁ బరివేషము పుట్టెనత్తఱిన్. 1555
చిత్రభారతము, ఆ 2 పద్య 16.

సీ. బ్రహ్మాండమగలంగఁ ◆ బటపటధ్వనులతో, నుఱుములంతంతకు◆నుఱుముచుండఁ
గడుభయంకరముగా◆వడిమ్రోఁగుప్రోఁతలఁ, బిడుగులాడాడను◆భిల్లుమనఁగఁ
గ్రముకంబులంతేసి◆కణములతోఁ గూడఁ, గరడుగట్టినవడ◆గండ్లురాలఁ
గొఱవిదయ్యంబుల ◆ వెలిఁగించుతెఱఁగున, విద్యుత్ప్రకాశమ్ము◆విస్తరిల్ల
గీ. ముసుఁగువేసినచందాన◆మొగులుగప్పి, మిఁడిసలు పెక్కు చీకట్లు◆కాఱుకొనఁగ
మించి కడవల నుదకంబు ◆ ముంచితెచ్చి, కుమ్మరించినగతివాన◆కురిసె నపుడు.
మొల్లరామాయణము, కిష్కిం. పద్య 9.

ద్విపద. కడలిపైఁ బొరలెడు◆కరడులో యనఁగ, నుడువీథిఁ బకపంక్తు◆లురుగతినడఁచెఁ
గలిగినపక్షిసం◆ఘములతో నెల్ల, దలయెత్తి చూచెఁ జా◆తకనికాయంబు
తిరుపుగట్టెడునుర◆క్రీలకాసియల, మురువున శితికంఠ◆ములు పురుల్విచ్చె
నలసస్యగర్భయా◆నచలపాలిండ్ల, చెలువున నీలాగ్ర◆శిఖరులు వెలసెఁ
గాలాభ్రభూతముల్ ◆ కళపెళనార్చు, పోలికి గర్జితం◆బులు మింటఁ బొదలెఁ
బోలుపునవెల్లువల్ ◆ పొదలెనంతటను, బలసికుంభద్రోణ◆పాతంబుగాఁగఁ
గారుకమ్ముచునేర్లు◆కాలువల్బెరయ, ధారాధరోదార ◆ ధారలు నిగిడె
నిలకును మింటికి◆నేకసూత్రములు, గలిగినట్లుండెఁ ద◆ద్ఘనధారలపుడు
జలజాస్త్రహతకామి◆జనమాంసఖండ, ములములో యన నింద్ర◆గోపంబులమరె
ధారుణీకుచహార◆తతులో యనంగఁ, జారుశైలాగ్రని◆ర్ఝరము లింపొందెఁ
బచ్చనిసార్వ్యపుటంబు◆పగిది నద్దెసఁ, బచ్చికల్మొలచిచూ◆పట్టెనంతటను. 1557
అష్టమహిషీకల్యాణము, ఆ 2.

ఉ. భోరున నష్టమాత్రజల◆పూరనిరర్గళధారలుర్వికిన్
భారముగాఁగ ముంచి జడ◆పట్టినమున్వెలివెల్లిరీతిఁగా
వేరిదరుల్వహించుకొని◆వెల్లువఁ జాఁపఁగనోడికుండలన్
నీరెడలించినట్టికర◆ణిం జలదంబులు జేరెనో యనన్. 1558
శ్రీరంగమాహాత్మ్యము, క. వ. ఆ 4.

ఉ. అంచలుపాఱెఁ గేకులకు ◆ నాటలుగేరె ఘనంబులూరెఁ గ్రొ
మ్మించులు గూరె శీతలస◆మీరము వారె మరుండు చేరిము
న్మించుగ జాతిబాణతతి◆నూఱె నటం బధికాళి ధైర్యముల్
గ్రించుకజాఱెఁ మాఱె నల◆గ్రీష్మము మీఱె జలాగమంబిలన్. 1559
అధ్యాత్మరామాయణము, కిష్కిం.

సీ. హలధరహృదయప్రి◆యాకవళీకరంధరం, బాశాంతెవిపినాంత◆హవ్యవహము
శాంబరాడంబర◆స్ఫూర్జన్మహితబింబ, మచిరాంశురుచిదీపి◆తాంబరంబు
ఘనవారచితాజ్ఞ ◆ నవికాసగరిమంబు, ధార్తరాష్ట్రవిరాస◆దాయకంబు
శితికంఠబాంధవ◆ ప్రతిపాదనోచితం, బాయతశక్రగో◆పావనంబు
గీ. వితతఘనఘోషపోషణం◆బతిశయోద, యాశ్రితకదంబమాత్రమ◆హావనాగ్ర
జాతికమునై తనర్చి వ◆ర్షాదినంబు, దేవకీనందనునికీవిఁ◆ దెలిపె నపుడు. 1560
చంపూరామాయణము, ఆ 6 పద్య 51.

ఉ. నాకఁదలిర్చుమబ్బు డుబు◆డక్క మెఱుంగు మెఱుంగుపట్టుసం
జోకబలాకికాసమితి ◆ చుక్కలనామపు రేక నెమ్మిబ
ల్కేకసరోజభేకముల ◆ కీడును మేలును దెల్పుకూఁకగా
జోకఘనాఘనంబు రహిఁ ◆ జొచ్చె మహిన్ డుబుడక్కవాఁడనన్. 1561
చంద్రభానుచరిత్రము, ఆ 4 పద్య 8.

సీ. ధూళిపర్వఁగవడిఁ◆దూప్పపా లెడుగాడ్పు, సారతురంగప్ర◆సార మనఁగ
సంపూర్ణజలమద◆శ్యామలాకృతులైన, యంబుదంబులు కుంజ◆రంబు లనఁగ
భూరిగర్జితములు◆ భేరీరవములన, మెఱుపులాయుధముల ◆ మెఱుఁగు లనఁగఁ
గేకినాదములు మ◆హాకాహళములనఁ, జాతకంబులు భృత్య ◆ సంఘమనఁగఁ
గీ. జక్రివాకమువిజయధ్వ◆జంబనంగ, నొప్పి భూగోళహితజీవ◆నోదయమున
నవనినాయక నీదువా◆హ్యాళిధాక, ననుసరింపుచుఁ దోఁచె వ◆ర్షాగమంబు. 1562
ద్వాత్రింశత్సాలభంజికాకథలు, ఆ 3.

గీ. మెఱయుప్రావృట్సమయలక్ష్మి◆ మేఘములను, నీలమయచాలనులనుము◆త్యాలునించి
పట్టిజల్లింపరాలిన ◆ బటువులైన, ముత్యములనంగఁ జినుకులు◆ మొదట దోరఁగె.
సీ. ఆకాశనీలహ◆ర్మ్యాగ్రధారముగనిష్ఠ, కాళ్ళనాఁగనువాన ◆ కాళ్ళుపాదమ
ఘనఘనాఘనమత్త ◆ కరికరాగ్రవిధూత, జలశీకరములు నా◆జల్లునిగుడ
తపనృపోపరికాల ◆ ధన్విముక్తాశుగా, సారంబులనమహా◆ధార లడర
స్తనితనిర్భిన్నాబ్జ◆జాండసవ్రివద్బహి, ర్గహరులోయనఁగఁ బూ◆రములుఘోషల
గీ. పల్లమిది మిట్టయిది మెట్ట◆పట్టులివియ, టంచుఁ దోఁచఁగనీక ని◆ట్టట్టు చుట్టి
కొట్టి పిడుగులు రాల్చుచు ◆ గుట్టలకును, బట్టెనలజడులపుడు చూ◆ పట్టె కడులు
మిత్రవిందాపరిణయము, కుం.—వెం. ఆ 1 పద్య 82, 83.

మ. శరచ్చాపోన్నతిసంస్కృతాంబరమణి♦చ్ఛాయాప్రకాశంబునన్
హరిసారంగచయప్రచారవిదిత♦ఖ్యాతిన్ మహాసారసు
స్థిరతన్ శంబరభంగరమ్యతనుభా♦తిన్ మీఱుసారస్వత
స్ఫురణం గాంచెను సార్వభౌమవిభవం♦బున్ వానకాలం బిలన్. 1565

కవిరాజమనోరంజనము, ఆ 4.

క. బహువర్ణోపేతంబై, యహహా కృతయుగముకీర్తి ♦ నలరుచు మిగులన్
రహినింద్రచాపయుతమై, మహిమొప్పె న్విష్ణుదేవు ♦ మందిరలీలన్. 1566

పద్మినీపరిణయము, ఆ 1 పద్య 83, 89.

గీ. సమయమను నాట్యకారక♦జనుఁడు మేఘ,యవనికాంతర్ధిఁజపలామృ♦గాక్షిలాస్య
మునకు ననురూపముగనొన♦ర్చినమృదంగ, శబ్దములరీతి గర్జిత♦స్వనము లొప్పె.

మూర్తిత్రయోపాఖ్యానము, ఆ 4.

చ. జలదము నీలిచల్లడము ♦ శక్రశరాసన మొప్పుకాశధా
రలు తెలిజల్లు వేసుబక♦రాజి వహించిన బూజిపూఁతల
గ్గలపు మెఱుంగు లాయుధపుఁ ♦ దాంతులు గర్జితగర్జ లొప్పఁగాఁ
దొలుకరివీరముష్టికుఁడు ♦ ద్రొక్కె నభశ్ఛలపణ్యవీథికన్. 1568

మ. తెగఁ దేజంబను బల్ఫిరంగి జలభృ♦త్సంగంబు మందుంచి పొం
దుగ శంఖంబను గుండు వేసి పటువి♦ద్యుద్వహ్ని చేఁ బ్రేల్చి మం
టఁగఁ గాలంబను యంత్రకారకుఁడు నా♦దన్ మ్రోయ నామ్రోఁతలై
జగము ల్గంపమునొంద మ్రోసె ఘనము♦ల్సంభీషణాహంకృతిన్. 1569

సీ. గగనమండలభద్ర♦కాయమానంబున, ఘనపంక్తులను మేలు ♦ కట్లుగట్టి
ధరణివేదికమీఁదఁ♦గరకానికాయమౌ, క్తికములరంగవ♦ల్లికలు దీర్చి
ఘనఘోరభేరికా♦ధ్వనులు బర్హిణగళ, ధ్వానకాహళనినా♦దములు మ్రోయఁ
దగని మెఱుంగుల ♦ దివ్వటీలు చెలంగ, ద్విజరాజమంత్రము♦ల్విస్తరిల్ల
గీ. వృష్టిగజరాజగామినీ♦విభుఁడు సమయ, పురుషుఁడయ్యెడ నిమ్నగా♦పుత్రికలను
గాంచి పెంచి ప్రమోదంబు♦గడలుకొనఁగఁ, బరిణయమొనర్చె శరధికి♦భవశరధికి.

హంసవింశతి, ఆ 5 పద్య 55, 57 62.

మ. అలపాథోనిధిజీవనంబు సెవకాఁ♦డై తెచ్చి మేఘుండు ని
ర్దళదంతస్సగభీరభావరసమై ♦ కన్పట్టుకల్లోలినీ

జలజాతాక్షుల కిచ్చి ప్రాణవిభునిన్ ♦ పర్యంకపప్రౌఢిమన్
గలయంజేసె ఘనుల్ పరోపకృతికై♦ఖ్యాతప్రశంసుల్ గదా. 1571

శకుంతలాపరిణయము, పె. నా. ఆ 3 పద్య 44

క. దళమయ్యె వర్ష మంబుధిఁ, దలక్రిందుగఁబట్టినట్లు♦ధారాశ్రేణీ
ఝళఝళలు న్మెఱపులఁ,ఢళఢళలున్ స్తనితఘుళఘు♦ళ్ళెవ్వలసిల్లన్. 1572

శుకసప్తతి, ఆ 3.

శా. అన్యాయంబున హెచ్చి గ్రీష్మఋతురా♦జశ్రాంతమున్ భోజనో
దన్యాతాపము నేర్పరింపఁగని క్రో♦ధస్ఫూర్తిగర్జిల్లి ప
ర్జన్యుం డభ్రరథస్థితిన్ మణిగణ♦చ్ఛాయల్ దలిర్పన్ మహా
జన్యస్థేమము నూపెనో యన శరా♦సారంబు పర్వెన్ వడిన్. 1573

శకుంతలాపరిణయము, కృష్ణ. ఆ 1 పద్య 142.

గీ. నవరసాన్వితమగుచు నుం♦దరమనోజ్ఞ,తరళజలధరలక్షణో♦దారవృత్త
మైప్రబంధలీలఘనశ♦బ్దపరియుక్తి, మహిమ నలరారె వర్షాగ♦మంబు మహిని.

రామచంద్రోపాఖ్యానము, వా. వేం. ఆ 4 పద్య 58.

సీ. కలమాంకురారోప♦కరశాలిపాలికా, స్త్రీపాళికిసరస్వ♦తీప్రసన్న
మాతృక్షితికృషిక్రి♦యార్థవృద్ధనియుక్త, హాలికబాలురకన♦ధ్యయనపర్వ
మన్యసంవసథప్ర♦యాణప్రయోజన, ప్రవణపరిజలకెల్ల ♦ గ్రహణశాల
యర్కసందర్శనా♦నంతరాభ్యవహార, శీలురకేకాద♦శీవ్రతంబు
గీ. నిజనివాసగృహోన్యమం♦దిరయియాను,ఖగసమూహంబులకు నెల్లఁ♦జిగురుఁగండె
నిఖిలపశుయూథములకెల్ల♦నిగళబంధ, మెడ తెగనివానజడినప్పు♦డెసఁగె మునురు.

మహేంద్రవిజయము, ఆ 2 పద్య 88.

చ. కమలభవాండగేహమునఁ♦గంధగభాండగళజ్జలంబుచేఁ
గరిమమునవల్కయల్కకర♦కాకులమౌక్తికరంగవల్లికల్
కరిమముగఁదీర్చితీర్చిచప♦లాపటలీఘనదీపజాలముల్
విమలతఁ జెట్టిపెట్టి వెడ♦లెన్ ఘనకాలపులక్ష్మియెంతయున్. 1576

సావిత్రీపరిణయము, ఆ 2 పద్య 7.

సీ. నీలమేఘంబను♦నీలాంబరముఁ గట్టి, పూర్వాస్తగిరులను ♦ బూర్ణకుచము
లందునమించులే♦పాంచమిరవికగాఁ, బొందుగాగూర్చి సం♦క్రందనధను

రాధరణంబులు♦ శోభిల్లవృష్టికాలరాత్రివిక్రమముఁ గూడి♦ వలితగగన
లక్ష్మి జలాశ్రజా♦లస్ఫురన్మౌక్తికములు రాలగర్జిత♦ములునుమణిత
గీ. ములుపిరాజల్లఁ గ్రీడించి♦మోదజాతుఁ, జలము లిలకును బాలంగఁ♦జల్లఁదనము
గాంచ సవితివిరోధంబు♦గాకయుండఁ, జెలఁగెనన ఘంబుమీఱ వా♦ర్షికదినంబు.
భార్గవపురాణము, ఆ 6.

---

# శరదృతువు.

——:0:——

ఉ. భూసతికిం దివంబునకుఁ♦ బొల్పెసఁగంగ శరత్సమాగమం
బాసకలప్రమోదకర♦మై విలసిల్లె మహార్షిమండలో
పాసితరాజహంసగతి♦భాసి ప్రసన్నసరస్వతీకమ
బ్జాసనశోభితంబగుచు♦నబ్జజయానముతో సమానమై. 1578
ఉ. శారదరాత్రులుజ్జ్వలల♦సత్తరతారకహారపంక్తులం
జారుతరంబులయ్యె వికస♦న్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభముఁ♦ దాల్చి సుధాంశువికీర్యమాణక
ర్పూరపరాగపాండురుచి♦పూరములం బరిపూరితంబులై. 1579
చ. స్ఫురదరుణాంశురాగరుచిఁ♦ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై శరత్కమల♦వైభవజృంభణ ముల్లసిల్లను
ద్ధురతరహంససారసమ♦ధువ్రతనిస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలింగె వాసరము♦ఖంబులు శారదవేళఁ జూడఁగన్. 1580
శా. దానాంభఃపటలంబునం బృథుపయో♦ధారావలిం దాల్చి గ
ర్జానిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్ర♦చ్ఛాదించి ప్రావృట్పయో
దానీకంబు శరచ్ఛయంబున నిగూ♦ఢాకారతన్ దిగ్గనాఁ
గానొప్పారె మదోత్కటద్విరదసం♦ఘంబుల్ వనాంతంబునన్. 1581
భారతము, అర. ఆ 4 పద్య 141, 142, 143, 144.
మ. మునువర్షోదకధారలన్ ముదముతో♦మూర్ధాభిషేకంబుఁగై
కొని శుభ్రాభ్రకిరీటశోభియయి సం♦క్షుభ్యన్మరాళావళుల్

ఘనపాలవ్యజనంబులై మెఱయఁగాఁ ♦ గాంతేందుబింబాతప
త్రనిరూఢిన్ శరదంబుజంబమరె నుద్యద్రాజచిహ్నంబులన్. 1582

హరివంశము, పూర్వ. ఆ 7.

శా. సోమన్యూనకరంబు నిర్మలనదీ♦స్తోమప్రవాహంబు ని
ర్ధూమాత్యంబు నిరస్తకర్దమధరి♦త్రీకంబు పుష్పీకృత
వ్యోమాశాంతము పల్లకాశముఁ బుపా♦కోద్గారియున్మీలితో
ద్దామాంభోజపరాగవికాసముశర♦త్కాలంబు గానంబడెన్. 1583

భాస్కరరామాయణము, కిష్కింధ. పద్య 404.

శా. సోమశ్రీలకు పన్నె వెట్టును ఘన♦స్తోమంబు నంబర్యసా
శ్యామాలీన్యము వోలెఁ గ్రోచు నవరా♦జద్రాజహంసావళిన్
బ్రేమంబుం బచరించు మానసమునం♦దెంపైశరద్విభ్రమం
బావేళం బ్రిదమైనవిశ్వవిభున♦స్యత్కీర్తికిన్ సాటియై. 1584

కావ్యాలంకారచూడామణి, ఉల్లాస. 3 పద్య 104.

ఆ. నీరదములు లేక ♦ నిర్మలాకారమై, యాకసంబు చూడ ♦ నతిశయిల్లె
విగ్రహంబులెల్ల ♦ విడిచి సౌమ్యజ్ఞాన, యుక్తుఁడైనదివ్య♦యోగిఁబోలె. 1585

ఆ. తొల్లి విడిచియున్న♦తోయజాకరముల, యంచు మఱలఁ జేరె ♦ నంచపిండు
పూర్వసంచితార్థ♦ములకు యోగజ్ఞాను, లందమగుడ నిల్చు♦నవ్విధమున. 1586

విష్ణుపురాణము, ఆ 7 పద్య 220, 223.

ఉ. రాజమరాళలబ్ధగిరి ♦ రంధ్రము శాలివనీశరావలీ
రాజననంబుతోజ్జ్వలాంత♦వాజహుతాశము భాస్వదిందిరాం
భోజసమాగమం బుదిత♦బోధభుజంగశయోపచారనీ
రాజనపుల్లహల్లకస♦రంబుజయించె శరద్దినంబులన్. 1587

ఉ. అళిగరుదంచలామలత♦దంతరబింబితయయ్యెఁ బాకని
ర్దళితమహోఫలౌఘహరి♦తచ్ఛదకర్కరికావనాళినాఁ
గలమవనభ్రమచ్చుకని♦కాయములోపలసాంధ్యరక్తిమోర
బలఁతిగాఁదాల్చి మింటఁ గన♦వయ్యెవిపాండుపయోదఖండములో. 1588

ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 137, 141.

సీ. జాతీస్థలముపట్టు♦చాలమి పరికించి, చాలించు లీలవ♦ర్షములు వెలిసెఁ
గైకొన్న నిరెల్లఁ♦గ్రిక్కించిరవినాక, విడుచు లీల మొయిళ్లు♦విడియఁ బాఱెఁ

హంసనాదములు గా♦హళలు గాఁ దిత్తుక్కు, లఘుచాలనములు తా♦ళములు గాఁగ
ముదమునఁ గాలుతు♦మ్మెదలఝుంకారంబు, లమరిసీవీణాస్వ♦నములు గాఁగ
ఆ. యోగనిద్రఁ జెంది♦యున్న విష్ణుని మేలు, కొలుపఁ గడఁగు గాయ♦కుఁడనంగ
బంధుజీవహర్ష ♦ పదమూ చుఁ దనార్కి, మయము గా శరత్తు♦ మయమునయ్యె. 1594

ద్వాత్రింశత్సాలభంజికాకథలు, ఆ 7.

శా. అంతస్స్రాంతసరస్సమగ్రబిసనా♦శాహారలీలాపరి
శ్రాంతానంతమరాళికానిచయను♦శాస్త్రవ్యవస్వనాకర్ణనా
శాంతాత్యంతకుతూహలోల్లసితభా♦స్వచ్ఛాళిపాళీజన
స్వాంతం బైశరదాగమంబు దనరెన్ ♦ సర్వాంసహామండలిన్. 1595

సర్వపురమాహాత్మ్యము, ఆ 2 పద్య 22.

సీ. మదహంసగమనసం♦పదలం దివిలసిల్లి, కాశచ్ఛవిచ్ఛటా♦కలన మెఱసి
చంద్రముఖస్మేర♦చంద్రికల్ వ్యాపించి, నక్షత్రమాలికో♦న్నతిఁ జెలంగి
స్వచ్ఛాంబరద్యుతి♦చాకచక్యము నొంది, భువనపంకములింకి ♦ పోవఁజేసి
యజ్ఞోద్భవప్రభా♦వాప్తిఁ బ్రకాశించి, బహువర్ణశోభిరూ♦పంబుఁ దాల్చి
గీ. లోకవితతులు నిజకుక్షి♦లో భరించి, సితపయోధరకళలచే ♦ సతిశయిల్లి
విలసితోత్పలమాలికా♦వృత్తిఁ గని, యలరె శారదవలె శార♦దాగమంబు. 1596

మిత్రవిందాపరిణయము, కుం. వేం. ఆ 1 పద్య 88.

క. సముదితకలశజరుచికత, కమథితనిష్కల్మషోద ♦ కవిజృంభితశా
లిమనోజ్ఞక్షేత్రవిశా,లమగు శరత్కాలముజ్జ్వ♦లం బై తోఁచెన్. 1597

సీ. అలమహానీలఘ♦నానీకమడరెన,నంతమందునవల♦రారె శ్వేత
తారక్షపతినుక♦రోరుద్యుతుల్ పృథు,నలకుముదస్ఫుట ♦ విలసనములు
పటుచక్రిమేఘపు♦ష్పగవయస్వనములు, సుముఖగజర్షభ ♦ ప్రమదలీల
లున్మనోహరశర♦భోన్మేషలువధిము,ఖార్కగవాక్షవి♦హారకృతులు
గీ. పనసనవ్యశోభారంభ♦భవ్యగతులు, పరిబలె నా సత్యధర్మజ♦ రాజరాజ
తనుభవను బాహువిజయయా♦త్రలు దనర్చె,నా శరద్యోగమతివిస్మ♦యంబు మెఱయ.

లంకావిజయము, ఆ 2 పద్య 29, 31.

గీ. రాజు మివులఁ బ్రసన్నుఁడై♦ తేజరిల్ల, వాహినులు చాల నిర్మల♦త్వము వహించె
క్షితినిధర్మంబు రాజాను♦గత మటంచు, నార్యులాడిన మాట య♦థార్థమగయ.

మూర్తిత్రయోపాఖ్యానము, ఆ. 4.

సీ. రాజహంసలకును ♦ రాజహంసలకును, ధారాధరావళో ♦ ద్ధండణంగె
సన్మార్గసీమల ♦ సన్మార్గసీమల, నత్యంతనైర్మల్య ♦ మధిగమించె
శరకలాపములందు ♦ శరకలాపములందు, గణనమీఱినరుచుల్ ♦ గానసయ్యె
భూదేవమణులకు ♦ భూదేవమణులకు, సాంద్రమహోత్సవో ♦ త్సవము పుట్టె
గీ. ధరణిఁ గాంతారములును గాం ♦ తారములును, సరసభాషంబుఁ గాంచె ప్ర ♦ శస్తి కెక్కెఁ
గోవిదారప్రసూనప్ర ♦ భావిభాస, మానమైనశరత్కాల ♦ మహిమవోఁప. 1600
దిలీపచరిత్రము, ఆ 1 పద్య 97.

ఉ. కాశదుకూలమింపెసఁగఁ ♦ గట్టి విధుండను మోముభాసిలం
గా శతపత్త్రిముల్ వెడఁద ♦ కన్నులుగా నళిహంసముల్ గతుల్
గా శతపత్త్రికోశములు ♦ కమ్రకుచంబులునై కడుందగం
గా శరనాథ(?)సైకతవి ♦ కాసనితంబముతోడ రాజిలెన్. 1601
భార్గవపురాణము, ఆ 6.

క. పులినములు మెల్లమెల్లన, పొలుపునఁ గాన్పించె నదులఁ ♦ బోలఁతులు మరుకే
ళులఁ బ్రియులఁ గూడి సిగ్గున, నలరఁగ జఘనములకరణి ♦ నాసమయమునన్. 1602
వల్లభీపల్లవోల్లాసము, ఆ 3 పద్య 28.

# హేమంతఋతువు.

ఉ. తరుణీయౌవనగర్వజృంభితకుచో ♦ దగ్రోష్మగంధంబులన్
వరకాశ్మీరరసాంకవాగురురస ♦ వ్యాసక్తులం బట్టి కాం
బరమాంజిష్ఠపటాదులన్ హిమగతిం ♦ బాఱిపింపరీవిశ్వభూ
వరు మెచ్చించిన సత్కవీంద్రులతులా ♦ వాసంబులందిమ్ములన్. 1603
కావ్యాలంకారచూడామణి, ఉల్లా. 3 పద్య 106.

క. కలవింక కలకలాకుల, వలభీగర్భములు సౌధ ♦ వాటములు పురం
బులయందుఁ మహీనవేళలఁ, జలి గులగులకాయునట్టి ♦ చందం బొందెన్. 1604
శివరాత్రిమాహాత్మ్యము, శ్రీనాథ. ఆ 4 పద్య 21.

క. అన్నులచన్నులదండవి, పన్నులు గాకెల్లవారు ♦ బ్రదికిరిగాకీ
చన్నులుమీఱినవలినా, పన్నులుగాకుండఁదరమె ♦ బ్రహ్మాదులకున్. 1605

ఆ. పొడుపుఁగొండమీఁదఁ ♦ బొడుచుట మొదలుగాఁ, బరువువెట్టియినుఁడు ♦ పశ్చిమాద్రి
మఱుఁగుఁజొచ్చెఁగాక ♦ మసలినఁజలిచేతఁ, జిక్కెఁజిక్కెననఁగ ♦ జిక్కకున్నె.

భాగవతము, స్కం. 10 పూర్వ పద్య 800, 801,

సీ. నేలయంతంతయు ♦ నెఱిఁజంద్రికాంతపు, జాలఁగట్టించిన ♦ లీల మెఱసె
నింగియంతంతయుఁ ♦ బొంగిదుగ్ధాంభోధి, నిట్టదొట్టినమాడ్కి ♦ దట్టమయ్యె
సకలజీవులమీఁదఁ ♦ బ్రకటమైహరికీర్తి, కలయఁబర్విన మాడ్కి ♦ దెలుపుచూపె
వక్కజంబుగనెల్ల ♦ దిక్కులునొక్కటఁ, దెరచీరలెత్తిన ♦ కరణిఁ దోఁచె

గీ. నగములెల్లనునీహార ♦ నగము లయ్యెఁ, దరువులెల్లనుఘనసార ♦ తరువు లయ్యెఁ
బక్షులెల్లను రాయంచ ♦ పదువు లయ్యె, గురుతరంబగు పెనుమంచు ♦ కురియుకతన.

పద్మపురాణము, ఆ 1 పద్య 76.

ఉ. ప్రక్కలువంచు వంచి ముని ♦ పండ్లునుపండ్లును రాచు రాచి ఱొ
మ్మక్కలఁజేయుఁ జేసి తల ♦ యల్లనఁగాళ్లసందు సందిలో
చక్కిలినొక్కు నొక్కి యిరు ♦ చంబడ గుమ్మడిమూటఁగట్టి వీ
పెక్కు దువాళిచేసి చలి ♦ యిక్కడనక్కడఁ బెట్టువేకువన్. 1608

క్రీడాభిరామము, పద్య 46.

గీ. హిమము చేనంబరం బెల్ల ♦ నిముడుకొనఁగ, నుష్ణకరుఁడునుగరములో ♦ యొయ్యయ్యసాఁచి
తామనవలాంశధరియింపఁ ♦ బూనెననఁగ, నెంతయనవచ్చునింక హే ♦ మంతమహిమ.

శ్రీరంగమాహాత్మ్యము, భై. క. ఆ 2 పద్య 241.

క. చెప్పనశక్యంబగుచలి, యొప్పతిలం బాలవృద్ధ ♦ యువజనములకుం
దప్పకశరణము లయ్యెం, గుప్పసములు ముర్మురములు ♦ గుచకుంభములున్. 1611

కవికర్ణరసాయనము, ఆ 6 పద్య 30.

చ. అలనిజభూరిసారములలో ♦ యారముతో మధుపాళికిచ్చి యో
రల ద్విజరాజు మెల్లసక ♦ రంబులు సాఁచిన మోముగందియా
కులతఁ జెలంగుపద్మిమల ♦ కున్ సిరి యెంతయు దూరమయ్యె భూ
స్థలినివపాత్రిదాతలకు ♦ శాశ్వత మేరమణీయసంపదల్. 1612

క. చెలువగుజనహస్తంబులు, వెలువడియొకచోటఁ దాళ ♦ వృంతము లుండెన్
బలువడి నడిగము చేసిన, యలయికనుఖనిద్రలందు ♦ నందము మీఱన్. 1613

చమత్కారమంజరి, ఆ 1 పద్య 39, 41.

గీ. చలికివెఁగడొంకిమేరువు◆చాటుఁజొచ్చి, యెట్టకేలకుఁగాని రాఁ◆డినుఁడువెడలి
వెడలిపరువెత్తి యపరాద్రి◆వెనుక కేఁగు, నితరజనములకీ తార్తి ◆ యెన్న నేల. 1614
కవిరాజమనోరంజనము. ఆ 4.

సీ. దినముఁ బ్రాతస్స్నాన◆ మొనరించుద్విజులకు, నగు కర్మలోపభ◆యంబుకంటెఁ
బాఱిచిపనుల్ సేయ◆లేమకోడ[illegible]కా,నత్తలవలని భ◆యంబుకంటె
గదువులోదూరమేఁ◆గఁగనున్న చపలకు, నధిపుచేనొదవుభ◆యంబుకంటెఁ
గర్షణంబొనరింపఁ ◆ గడఁగుకాఁపులకార, యమిఁబైరచెడునన్ భ◆యంబుకంటెఁ
ఆ. గడిఁదియయ్యె సీతు◆ఖగమృగపశునర, ప్రముఖజంతువులకు ◆ భావములను
జాల మించె మిథున◆సంపర్కసౌఖ్యంబు, శిశిరమహిమవినుతి ◆ సేయవశమె.
ఉత్తరరామాయణము, ఆ 5 పద్య 283.

గీ. హైమకంకణభూషిత◆లైనఁగాని, సరసులనుగూడిముఖసార◆సములయందు
దేజరిల్లవుశీతఁబ◆ద్మినులు(?)యుక్త,మినకరస్పర్శనములేమి ◆ యేమిసుఖము. 1616
సావిత్రీపరిణయము, ఆ 2 పద్య 13.

---

# శిశిరర్తువు.

—:0:—

చ. నేరవునవాత్మవంశ్యుఁడగు ◆ విశ్వనరేశ్వరుమీఁదిప్రీతిఁజం
దురుఁడుతుషారసంహతుల ◆ దొడ్డుగఁబంచిన వచ్చి యచ్చటన్
బరిగొనఁబోలునంచుఁజెడి ◆ పాఱినవైరులుభీతిఁగానలోఁ
దిరముగనిల్వనేరరొక◆డే యని చూతురు పంద లాత్మలన్. 1617
కావ్యాలంకారచూడామణి, ఉల్లాస. 3 పద్య 108.

క. పస్నిటిజడికినామని, వెన్నెలకంభోదవేళ ◆ వీడ్కోలుపుపయో
జోన్నతికి ధాన్యలక్ష్మిప్రసన్నంబగు వెళవు శిశిర ◆ సమయము దోఁచెన్. 1618
కవిరాజమనోరంజనము.

సీ. ఫాలభాగంబునఁ ◆ బ్రాలేయకరవాళి, శీతభీతి, వహించె ◆ వీతిహోత్రుఁ
బార్శ్వస్థుఁగాపించె ◆ [illegible]లభేది పతతంబు, చలిమిరిభయమున ◆ శ్వసనసఖుని

గన్న దేశమునందుఁ ♦ గఙ్లోలిసీకుండు, చలికుళ్కి జడబొగ్గి ♦ నిలుపుకొని నీడు
సాయంపరిభావ ♦ సరములఁజలిబీఱఁ, బ్రజ్వరిల్లఁగఁజేయు ♦ యజ్వ జ్వాలను
గీ. వారెయిటులుండిరింకేపి ♦ వలనటంచుఁ, బ్రహతధూమాంచవంగార ♦ సహితప్పాహ
సంతికాయంత్రిసేవకా ♦ సక్తచిత్తు, లైరి ప్రజలెల్ల నాశిశి ♦ రాగమమున. 1619

రామచంద్రోపాఖ్యానము, వా. వేం. ఆ 3 పద్య 118.

సీ. హరిలోకసంచార ♦ నిరతాభిలాషపూ, రుషచయాభీష్టద ♦ రుచిరపథము
తరుణతాతిగదశా ♦ పరిపూర్ణశాలీక్షు, సారానుభవమోది ♦ సర్వజనము
దినదినానూనసం ♦ దీప్యత్త్విషాంపతి, సుప్రభావటలాతి ♦ శోభితంబు
పటుతరభూమిరు ♦ ట్పర్ణవిదంకుర, త్పాండువర్ణద్యుతి ♦ భాసితంబు
గీ. ననుదినవివర్ధమానస ♦ వనసముదయ, మూలకారణవిస్ఫూర్తి ♦ లాలితంబు
నగుచుఁదనరారెఁజాడన ♦ య్యావసరమున, భాసురంబగుశైశిర ♦ వాసరంబు. 1620

కౌసల్యాపరిణయము, ఆ 2.

గీ. కొన్నిహేమంతచిహ్నముల్ ♦ గొనలుప్రాఁకఁ, గొన్నివాసంతచిహ్నముల్గుదురుచెంద
శైశిరంబొప్పననుయాయి ♦ సమభియాయి, బంధుసమసేవ్యమానార్య ♦ వర్యుపగిది.
సీ. వాసంతపంచక ♦ వాసరంబులకెల్ల, నగ్రగణ్యతఁగాంచి ♦ యలరు నెద్ది
పరిణయోపనయన ♦ ప్రముఖశుభక్రియో, త్సవరత్నములకుని ♦ ధానమెద్ది
రవిదీప్తియొక్కింత ♦ రాణించిపరిబలఁగా, నాత్మప్రకృతశాణ ♦ మైనదెద్ది
శైవలింగాంకురం ♦ బావిర్భవమునొంది, పెరుఁగంగఁదొల్కారి ♦ వేళయెద్ది
గీ. యుభయసంధ్యాసమానము ♦ హూర్తమెద్ది, యద్దిగనుపట్టుబుతువుల ♦ కనుఁగుఁదమ్మఁ
దగుచునాత్యుష్ణదివసమై ♦ నాతిశీత, రజనియైధాత్రిపైశైశి ♦ రంబుమిగుల. 1622
ఉ. పచ్చికపైరులుంబెరుఁగ ♦ బండినధాన్యపునూర్పుకళ్ళముల్
పొచ్చెములేనియిక్షువులఁ ♦ బూనికఁబొనకమాడుగానుఁగల్
హెచ్చుగనొప్పుచప్పరము ♦ లెల్లెడఁ జల్లనినీటికాలువల్
ముచ్చటదీరఁగన్నుఁదను ♦ పున్ శిశిరర్తువునందుఁజేలలోన్. 1623
సీ. బలితంపుటాకుఁదో ♦ టలకునీ రెత్తనే, తముఁదోడుజనులగా ♦ నముల సొబగుఁ
బొలిపెచ్చికోలకురాఁ ♦ గొలుచుకళ్ళమునూర్పు, కాఁపుబిడ్డలగీతి ♦ కస్వనంబుఁ
బండినపేరెత్తఁ ♦ బసరుపైరెడఁగా, వలియున్నచెలులగీ ♦ తులరవంబుఁ
వెలుకుగానుఁగుకెల్లఁ ♦ జాలుకుగానడిపించు, నైపుణికులొనర్పు ♦ పాటనులివ్వఁ

గీ. గూడిచియుచటనిక్కుర ♦ పీడలేని, పాంథజనములమేల్కొల్పి♦పైనములకు
పొచ్చరికఁజేయుగ్రామజ♦హిక్కితక్రి, కౌతుకులనుండిమాగధ ♦ గీతులగుచు 1624
రామరాయవిజ[illegible]. ఆ 3 పద్య 113, 114, 120, 122.

---

# అరణ్యము.

—:0:—

సీ. కకుభాశ్వకర్ణతిం♦దుకబిల్వఖదిరమ, ధూకపాటలసాల ♦ దుర్గమంబు
కంకఝిల్లీబక♦క్రౌంచఘూకానేక, కౌశికులస్వన ♦ కలకలంబు
సూకరహర్యక్ష♦శుండాలశార్దూల,శరభాదిమృగకుల ♦ సంకులంబు
బాయితబహుతర♦చ్ఛాయానిరస్తస,మస్తతీవ్రాంశుగ♦భస్తిచయము
గీ. బంధకారీకృతాశాంత♦రాంతరంబు, దుర్నిరీక్ష్యంబుజనలోక ♦ దురవగాహ
మఖిలవనమృగగణశర♦ణ్యంబునైయ,రణ్య మారయ నెవరియ♦రణ్యమనిన. 1625
భాస్కరరామాయణము, బాల. పద్య 230.

సీ. అనఘులోకవిలోచ♦నాలోకమహిమాభి, వృద్ధిరోధికుజన్మ♦విటపపటలి
యప్రతీపాశ్రియా♦నల్పకల్పితకన,త్కమనీయఘనధూప♦గంధపేటి
బహువిధజంతుసం♦బంధపరస్పరా, తనుసంగరక్రియా♦స్థానభూమి
యొసమ్మత్తరూపవ♦యోవిశేషస్థూత, నాదమంజులతోక♦నద్గ్రపాళి
గీ. నమ్రదాస్పదమఘపాంగ♦నావినోద, గీతలోలభుజంగసం♦కీర్ణమగుచు
వేశ్యవాటికపగిదివోల్పు♦వెలసినట్టి, కాన వీక్షించె ధారుణీ♦కాంతుఁడెలమి. 1626
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 2 పద్య 94.

గీ. కనిమహీశుండుకంటిరే ♦ వనవిలాస, మధికసత్వసమృద్ధిస♦మాశ్రితేంద్రి
మానిఖచరావనస్థితి♦ మదనజనక, మగుచు హరివోలె నిదిచాల♦నబ్రిమెుసగె.
నలచరిత్రము, సి. ధ. ఆ 3 పద్య 26.

సీ. కరులు మేఘములుకే♦కరకదంబము వాన, కీచకధ్వనులుఝే♦కీరవములు
చెంచుముద్దియలమే♦సిరులుమెరుంగులు, మణిఘృణుల్ హరిధను♦ర్గుణంజూరుచులు

చమరికావాలసం♦చలనముల్ పవనముల్, మృదులసాంకవమృగీ♦మదముబురద
కపురంబునురువుసిం♦గపుబొబ్బలుఋములు, హిమజాలపూరమిం♦పెసఁగువఱద
గీ. హరినఖరదారితోన్మద♦ద్విరదకుంభ, గళితముక్తావళుల్ వడ♦గండ్లగములు
గాఁగవర్షాగమంబువై♦ఖరిని దనరు, నవ్వనస్థలిదాఁటియ♦త్యాశుగతిని. 1628
రుక్మిణీపరిణయము, కూ. తి. ఆ 4 పద్య 7.

సీ. శక్రరంభాహారి♦జాతకైరావత,ఖ్యాతమై నాకలో♦కంబుకరణి
గాలవశాండిల్య♦కౌశికకపిలాది, వాసమై ధాత్రుని♦వాసమట్లు
వృషకుమారకశివా♦ప్రియశివాపరికలి,తంబయిరజతభూ♦ధరముమాడ్కి
మదనమువర్ణక♦మాధవలక్ష్మిన,నాథమైవైకుంఠ ♦ నగరిగరిమ
గీ. సంతతానందనాగేంద్ర ♦ సహిత మగుచు, విలసితంబగు నలరసా♦తలముపోల్కి
నెసఁగు నక్కాననంబున♦హితలేశ,కుంజరునకాత్మఁబ్రమదంబుఁ♦గూర్చెనపుడు.
రసికజనమనోభిరామము, ఆ 1 పద్య 100.

సీ. హారీతశుకశారి♦కారవాక్రాంతంబు, పరభృతకూజిత ♦ భ్రాజితంబు
సరసగానకళాని ♦ శభ్రమద్భ్రమరంబు, ప్రమదనృత్యన్మత్త♦బర్హిణంబు
నికటసరోహంస♦నిస్వనాకీర్ణంబు, సాంద్రపుష్పపరాగ ♦ సంకులంబు
ఫలభారకుసుమస్త ♦ బకలసద్భూజంబు, మృదులమరందఝ♦రీపరీత
గీ. మతితరామోదమేదురా♦త్యంతశీత, లానిలకిశోరవారస♦మాదృతంబు
నైనయక్కాననంబుభూ♦జానికపుడు, మోదమొనఁగూర్చెగడితంపు ♦ సేదఁదీర్చి.
సర్పపురమాహాత్మ్యము, ఆ 2 పద్య 32.

సీ. ప్రాగద్రితటభాగ♦భాగహారపరాగ, రాగదూతఘనాఘ♦నాగకులము
దారితాభ్రశతార♦తారదంష్ట్రోచ్చార, వారణోగ్రవ్యాఘ్రదార♦దారకంబు
మాలూరహింతాల♦తాలతూలరసాల, సాలకేసరసాల ♦ సాలయుతము
శబరయోషాచండ♦చండరుక్కారకాండ, కాండఖండితగండ ♦ గండకంబు
గీ. పిండితాజాండగండభే♦రుండనినద, సంశ్రవణమాత్రవిత్రస్త ♦ శరభసరభ
సాగమనదర్శనోద్భ్రాంత♦హరివరేణ్య,మవుమహారణ్యమొకటిరా♦ఘవుఁడుగనియె.
ఉత్తరరామాయణము, ఆ 7 పద్య 221.

సీ. ఘననిపాదస్వనం♦బెనయబోధిద్రుమ,చ్ఛదములుగబళించు♦మదగజములు
సటలుపైఁగ్రమ్మను♦ద్భటవృత్తిచంగున, నవనికిదాఁటుసిం♦హవ్రజంబు
సెలవులఁబ్రోవులై♦వలనొప్పనురుగులు, గ్రుక్కెడుఘనభల్లు♦కప్రతతులు
శృంగసంఘట్టన♦న్నిఖరీరాజంబులు, నరిమిగోరాడువా♦హద్విషములు

గీ. చటులగరళజ్వాలనఘన♦జ్వాలలోలయు, చందనద్రుమకోటర♦స్థలులఁగ్రిమ్మ
ఫణిగణంబుల ఘూత్కృతో♦ద్భటులుగలిగి, ప్రబలునక్కాననము ఫల♦భరితమగుచు.

సీ. మల్లికార్జునఘన♦మహిమంబునఁ జెలంగి, శుకవాక్యరచనచే♦శోభితమయి
గంధర్వరాజసం♦కలితమై ప్రభఁజెంది, పుండరీకప్రాప్తిఁ ♦ బొలుపుమీఱి
గాలవశాండిల్య ♦ కౌశికయుక్తమై, నీలకంఠస్ఫూర్తి ♦ నివ్వటిల్లి
శైలరాజతస్థాన♦మనఁగఁ బ్రకాశించి, హరిబలిమిళితమై ♦ ధరణిమించి

గీ. శ్రీగిరిముఖాగ్రతమును♦శ్రీదుపురము, నగ్నిదిశయమునివదంబు♦హరుఁడుదివియుఁ
ద్వారకయునని యెన్నఁగా♦వరుసతోఁ బ్ర, దోరముగనుండునచటి కాం♦తారవనము.

కవిచకోరచంద్రోదయము, ఆ 2.

---

## ఆటవికులు.

:o:

మ. అగరుక్ష్మారుహకాష్ఠఖండముల స♦ర్వాంగంబులం జేసి మై
మృగనాభిన్మసిఁబూసి చామరము ధ♦మ్మిల్లంబుగాఁజుట్టి యే
నుఁగుకుంభమ్ములలోనిముత్యములఁ గ♦న్గ్రిడ్డుల్వినిర్మించి భి
ల్లగజేంద్రుల్ వెలబొమ్మలందవిదచే♦లం జేయుదుర్ గాఫుగన్. 1634

క. ఏనుఁగులతలలు కొమ్ములతో నారబములకుదృష్టి ♦ దోషమువాయం
గా నెత్తుదు రెఱుకులు తమ, చేనికి బసరంబుతలల ♦ చెలువం బెసఁగన్. 1635

క. కొండలలోఁజేసిన తమ, పండిసచేలకు వరాహ♦పంక్తులు చొరరా
కుండం దెల్లనిచామర, ఖండంబులు ప్రోఁగుదాళ్ళఁ♦గట్టుదు రెఱుకుల్. 1636

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 3 పద్య 7, 8, 9.

సీ. చిలుకంపపాదికిఁ దా♦ర్చిన నెమ్మిపురిజల్లి, చేనెక్కుడిన చేగ♦సెలసువిల్లు
గట్టిగాపట్టిగాఁ ♦ గట్టినపులితోలుఁ, గుడివంకదోఁపిన ♦ కుఱుచపిడెముఁ
బేరెదఁజేర్చిన ♦ పికిలిపూవులచేరుఁ, గుడిసందిగురిగింజ ♦ కుట్టుదండ
జుంజుఱుసికమీఁదఁ♦జుట్టినతలముల్లు, దట్టిలోపలనఱ♦పెట్టుచుట్ట

గీ. కోరమీసలు మిడిగ్రుడ్లు♦గునుకునడుపు, బెదరుఁజూపులుఁగఱిమేనఁ♦గదురుకంపు
వలుదయొఱచ్చులునుగల్గి♦వచ్చెనెఱుకు, పాళెగాఁడొక్కఁడాచంద్ర♦భానుకడకు

చంద్రభానుచరిత్రము, ఆ 2 పద్య 2.

సీ. గొఱకయీఁటెలు మేటి ♦ కఱకునారసములు, వంకకత్తులు పెడ ♦ వంకవిండ్లు
నడునెత్తిసికలుగీ♦ర్వాణంబులెకువారు, మెట్టులుక్రొవ్వాడి ♦ మెఱుఁగునుసెలు
కావిలాఁగులు సీలి♦కాసెలు వాగురుల్, గుద్దుకత్తులు నల్ల♦గొంగడీలు
నలుపుమీఁతినకారు♦ములుచయొడళ్లు జుం, జురుగడ్డములు బలు♦కుఱుచదుప్పు
గీ. వలుదసాఱకాయదిప్పలు ♦ తులసిపేర్లు, గండ్రగొడ్డండ్లుచిక్కము♦ల్దండికోల
మీసముల్గద్దికొండఱు ♦ మృగయు లెదుటఁ, జేరి పొడఁగని మిగులజో♦హారు లొసఁగి.
రసికజనమనోభిరామము, ఆ 1 పద్య 63.

సీ. క్రోధరసంబు పే♦రుగుడా నవీనిలోఁ, గాటెనా జేవురు ♦ కన్ను లమర
నానసంబున వ్రేలు ♦ నఘువంశగుల్మంపు, మూలమ్ము లన గడ్డ♦ములు జెలంగ
హాత్యాలనెన్నెన్ని ♦ యనిగీచినవితాన, ముండ్లజీరలు దేహ♦మున జెలంగఁ
బల్కుటంగనఁ దమ♦వల్లెసేనిలసీని, పాచి దేఁటిసకప్పు ♦ పండ్లతోడఁ
గీ. బందిబల్లెలుతలయుంట ♦ పాటికొయ్య, లలసితడవిండ్లు దోటితో♦నంపపొదులు
నీలిదట్లును జెక్కిన ♦ నిడుపనూరు, నడర నగభిల్లులొకకొంద♦ఱరుగుదెంచి. 1639
పార్వతీపరిణయము, ఆ 6.

ఉ. క్రొవ్వు మెఱుంగుగబ్బొలయు ♦ గుజ్జగు మేనులతోడ నోరఁగా
దువ్విసిగల్ తలల్ ముడిచి ♦ దొడ్డగు నిత్తడిపోగులం జెవుల్
గవ్వలపేరులన్ నుదురు♦గప్పఁగ వంకరబొట్లు దిద్ది పై
గువ్వల వన్నెచేలమిడి ♦ కొందఱు చెంచులు వచ్చి ముందటన్. 1640
చిత్రసీమ, దళ 3 పద్య 78.

---

# ఆటవికస్త్రీలు.



సీ. స్తబ్ధరోమవిషాణ♦లబ్ధమౌక్తికములఁ, బాటింపుదురు రేఁగు♦పండ్లపాటి
ముక్తకంచుకమస్త ♦ ముక్తాఫలంబుల, మంచలింతురు కురు♦వింద లట్లు
సమదసామజకుంభ♦జములైన ముత్తియం, బులఁ జూతు రుసిరికా♦యలవిధమున
వేణుజాతములైన ♦ యాణిపూసల నెంతు, రూడుగ పండ్లకు ♦ నీడుగాఁగ
గీ. గంధసారాగురుద్రుమ♦కాష్ఠఖండ, చయము దమయింటి వంటక♦ట్టియలుగాఁగఁ
జేయుదురు కాపురంబులు ♦ సేయునపుడు, చెంచెతలు చెంచులనుగూడి♦ చిత్రలీల.

ఉ. పంకమదంబునుం బునుఁగుఁ♦జాఁదును గస్తురియుం ఘటంబులం
బంకముఁ జేసి యిండ్లలికి ♦ ప్రత్యహము న్వెలిపైవ మార్గకూ
లంకప గోమయపత్రితతు♦లం బరిడించుచునుండు గుప్పలై
యింకఁ దదీయభూతినిద♦మిత్థమటంచు నుతింప శక్యమే. 1641

సీ. పట్టుచీరలఁగట్ట ♦ భాగ్యంబు గల్గియుఁ, బారుటాకులఁగట్ట ♦ భార మనరు
రాజాన్నభోజన ♦ ప్రాభవశ్రీగల్గి,యును వన్యధాన్యంబు ♦ నొల్ల మనరు
మాణిక్యభూషాస♦మాజంబుగల్గియు, నెఱ్ఱనికురువింద♦లేటి కనరు
మంచిమెచ్చులతూఁగు ♦ మంచముల్గల్గియుఁ, జాలుఁబూఁదీగ యు♦య్యాల లనరు
గీ. ఎంతసంపదగల్గియు ♦ నెట్టివారుఁ, దమకులాగతధర్మక♦ర్మములు విడువఁ
జాల రటుగానఁ దత్పురీ♦శబరపతులు, మహిమగలిగియు మానరు♦సహజవృత్తి.

సీ. కలికుజుంజాలు వెండ్రు♦కలకొప్పుగా ఘత,రంబుగా నెమలిపిం♦ఛంబుఁ జుట్టి
తట్టుపున్గునవస్నె♦పెట్టినట్టిలలాట, పట్టికజేగురు♦బొట్టు వెట్టి
కురువిందపేర్లకుం♦దెరలీనిపాలిండ్లఁ, బారుటాకులుసూర్చి ♦ పైఁటఁదీర్చి
జమలిరొద్దాణంబు♦సందున నిఱియంగ, జర్మాంబరముఁగట్టిఁ ♦ బదిలపఱిచి
గీ. వీఁకఁగలకుఁబుగవపుల ♦ వెదురువింటఁ, జాఁగపురిఁదాల్చి నారిగా♦సంతరించి
గసికకోలలుగొనిభిల్ల♦బిసరుహాక్షు, లడవిఁదిరుగుదు రాత్మనా♦యకులఁగూడి. 1643

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 3 పద్య 4, 5, 6, 15.

చ. కుదురుగజంగసాఁచి చను♦గుబ్బలుమీటుగఁ బాలుటాకుఁబ
య్యెదపొదలంగనెన్నుదురొ♦కింతచెమర్పఁగ మేచకాలినే
ర్పుదొరలఁ బాడిచందనపు♦రోలున నేనుఁగుగొమ్ము రోకటన్
బిడ్రిదిలెడుకొప్పుతో వెదుర ♦ బియ్యముగుప్పునిజప్రియాంగనన్. 1644

వాల్మీకిచరిత్రము, ఆ 2.

---

## ఆటవికవస్తువులు.



సీ. నిష్ఫురిపాలు తే♦నియపాలపండులు, కారెనుములపెర్గు ♦ చాఱపప్పు
పునుఁగుచట్టంబులు ♦ పునుఁగుకఱ్ఱజవాజి, కస్తూరికస్తూరిపచ్చ♦కప్పురంబు

నేకలంబులకోర ♦ లేనుంగుకొమ్ములుఁ, బురుదుజింకలు పెను ♦ పులులగోళ్ళు
హరిచయియాకలు నెమ్మి ♦ పురిజొంపములు తెల్ల, సవరముల్ జల్లులు ♦ జాగిలములు
గీ. పికిలిపిట్టలు డేగలు ♦ బెట్టుడుతలు, పట్టుజిట్టలు ఫణిఫణా ♦ భద్రకుంభి
కుంభవరదంష్ట్రిదంష్ట్రికా ♦ కోటిగళిత,కలితముక్తాఫలంబులు ♦ కానుకఁజేసి. 1645

శుకసప్తతి, ఆ 1.

సీ. అట్టులవ్వీరభ ♦ టావలుల్ దనివోక, వేడుకలెదమీఱ ♦ వేఁటలాడి
కరిదంతములునుగ ♦ స్తూరివీణెయల్ పంది,కొమ్ములు ముత్తియములు ♦ నెమ్మికుత్తు
కలు పున్గఁబిల్లులు ♦ ఘనచామరంబులుఁ, పులిగోళ్లు మేటిరా ♦ చిలుకపిల్ల
లింపగుమంచిగం ♦ ధంపుఁదున్కలు పచ్చ,కప్రంపుదల్కులు ♦ గందవొడులు
గీ. చక్కెరల్ దియ్యతేనెలు ♦ చాఱపప్పు,లోనుగల మేలివస్తువుల్ ♦ పూని తెచ్చి
హెచ్చి మెచ్చులుగాధరి ♦ త్రీశ్వరునకు, నర్పణ మొనర్చిరెంతయుఁ ♦ నేర్పుమీఱ.

కవిచకోరచంద్రోదయము, ఆ 2.

---

# ఆటవికపల్లి. ౨

:o:

సీ. ఆలరుకస్తూరితీ ♦ వెలలికి వాకిళ్ళ చెం,తలవైచిపోయిన ♦ తట్టుపునుఁగు
గోడలుపూయంగఁ ♦ గుమ్మగందంబున, మేదించినట్టిజ ♦ వ్వాదియడును
నాడాడసరిజేసు ♦ లాడిపోవిడిచిన, ముదురువెదుళ్ళలో ♦ ముత్తియములు
బలుపుశేనికకొమ్ము ♦ టలవలపైఁద్రోవఁ, దవిలించికట్టిన ♦ సవరములును
గీ. వంటకట్టెలకని తెచ్చి ♦ వాములిడిన, యగరుమ్రాఁకులపైనిండ ♦ నాఱఁబెట్టు
కప్పురంపుటనంటులుఁ ♦ గలిగి మెఱయు, నెఱుకుపల్లియలొకకొన్ని ♦ యెదుటఁగాంచి.

యయాతిచరిత్రము, ఆ 1.

సీ. తోరణంబులుగ వీ ♦ థులనారఁగట్టిన, యొప్పుఁగండలకునో ♦ డొండదిరుగు
పులుగులకెక్కుడా ♦ డ్పులఁజాలనెగపెడు, పసరంపుఁబొలకంపు ♦ ముసురుకొనఁగఁ
బసివట్టినలుగడఁ ♦ బఱచిన మెకముల, పచ్చితోళ్ళనుబండ్లఁ ♦ గుప్పిచ్చి పెఱుకు
బలుజాగిలంబుల ♦ భౌభౌరవంబులఁ, గొంకిపంకములోన ♦ ఘుర్ఘురించి

గీ. పసుప్రేలిడు నారఁజంబుల◆ముడికిగవ్వలు, చేఁపతట్టలఁగడుపుతోఁ◆జెనసిచుట్టఁ
గూఁతవెట్టినజనులవా◆కొలుపఁజేయ,భయముఁగొల్పెడునొకబోయ◆పల్లెఁగాంచి.

వాల్మీకిచరిత్రము, ఆ 2.

సీ. పాసఁగఁగొప్పులవాస◆పోయంగ మిగిలిన, దంతంపువండల◆దొంతరలును
దపుకొత్తుగుప్పినేఁ◆తలునేసివిడిసిన, జల్లులవాముల◆మొల్లములును
గుమ్మి ముద్దలుచేసి◆గోడలవేయంగ, నున్నకస్తురిగొప్ప◆తిన్నియలును
జిగివారనున్నము◆ల్చేసిడించినకొమ్ము, ముత్యాలప్రోవుల◆మొత్తములును
గీ. జలికినెగడులువేయంగ◆నిలిచినట్టి, మంచిగంధంపు మ్రాఁకులఁ◆మంచెలగరు
ప్రాఁకుమంచెలుగలిగివి◆స్మయముగొలుపు,చెంచుపల్లియలొకకొన్ని◆గాంచెనృపతి.

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 2 పద్య 85.

---

# తపోవనము.

—:o:—

సీ. శ్రవణసుఖంబుగా◆సామగానంబులు, సదివెడు శుకముల◆చదువుదగిలి
కదలకవినుచుండు◆కరులును గరికర, శీతలచ్ఛాయఁద◆చ్ఛీకరాంబు
కణములుచల్లని◆గాఢ్పానపడివానిఁ, జెందిసుఖంబున్న◆సింహములును
భూసురవ్రవరులు◆భూతబలుల్దెచ్చి, పెట్టు నీవారాన్న◆పిండతతులు
గీ. గడఁగిభక్షింపనొక్కటఁ◆గలసియాడు,చున్న యెలుకలుబిల్లులు◆నొండుసహజ
వైరివర్గంబులయు సహ◆వాసమపుడు, సూచి మునిశక్తికెంతయుఁ◆జోద్యమంది.

భారతము, ఆది. ఆ 4 పద్య 23.

సీ. ఆవులునాకఁగ◆న్నరమోడ్చు పులులును, బులుల చన్ గుడువంగ◆బోవులేళ్ళ
లేళ్ళపెల్లాట రం◆జిల్లెడుహరులును, హరులుగోళ్ళనుగోఁక◆నలరుకరులు
కరులకటాళివై◆ఖరినాడు పాములు, పాముల లాలించు◆బభ్రుతతులు
బభ్రుతతులపక్కఁ◆బాయనియెలుకలు, నెలుకలఁ బెంచుపి◆ల్లులునుగలిగి
గీ. యపుడు వెఱఁ గొనరించె నా◆యంగనలకు, గీరభాషితపోషితా◆ఖిలతపస్వి
జటలతారకబ్రహ్మశ్రీ◆భావనంబు, భావితశుభావనంబు త◆పోవనంబు. 1651

కళాపూర్ణోదయము, ఆ 3 పద్య 10.

సీ. వల్లరీవలమాన ♦ ఝల్లరీఝుంకార, వల్లకీకలనాద ♦ వేల్లితంబు
పరకుహూకాకంఠీర ♦ వస్ఫారకంఠీర, వక్త్రస్థపథికేభ ♦ వలయితంబు
శుకశారికారబ్ధ ♦ సురుచిరశ్రుతితర్క, మూలవచోయుక్తి ♦ ముఖరితంబు
శింజానమంజీర ♦ మంజుగుంజితహంస, సారసోత్సుకసార ♦ సారసంబు
గీ. ప్రాజ్యమంత్రస్వరయుతవేదీ♦ప్రాజ్యహోమ, ధూమధూసరకేసర♦ద్రుమవిభాగ
మాహుతీరితశిఖిశిఖా♦వ్యాకులంబు, నైన యాశ్రమమండల ♦ మదిదనర్చె. 1652

భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 1625.

సీ. వాచంయమోత్సంగ ♦ వత్సలసారంగ, మురుచపాలస్థూల ♦ యూపశతము
ప్రాగ్వంశబంధుర ♦ బహుగంధసాన్నాయ్య, మాగ్నీధ్రముఖ్యర్త్వి♦గాశ్రయంబు
సుత్రామసఖయాయ♦జూకసామాజికం,బాతిథేయమయోట ♦ జాజిరంబు
వటుధవిత్రిపవిత్రి♦పవనోజ్జ్వలత్రేత, మఘుమర్షణజ్ఞశౌ♦కాంచితంబు
గీ. సంతతబ్రహ్మవర్చస♦స్నాతకంబు, పరమయోగినిరాకృత ♦ పాతకంబు
హాస్తికైతిహ్యసహ్యాపం♦చాననంబు, బదరికాకాననంబుచూ♦పట్టెనెదుర. 1653
సీ. పవనవేగవిశీర్ణ♦పాదపాగ్రంబుల, జడియకుండఁగఁజట్టు ♦ సామజములు
పూజార్థనియమిత ♦ పుష్పవాటికలపై, మధుకరంబులఁజోపు♦మర్కటములు
నవభృథస్నానప♦ర్యంతనిర్మలతకై, కాసారములఁగాచు ♦ కాసరములు
నిజనిజోటజభాగ ♦ నీవారసీమలు, సౌరక కావలియుండు ♦ సూకరములు
ఆ. గళిగి కంసవైరి ♦ కన్నులపండువై, చెలువుమిగిలెఁ బూర్ణ♦కలశవిగళి
దాలవాలవారి ♦ హారితన్మనిదారి, కాశ్రమంబుబదరి ♦ కాశ్రమంబు. 1654

ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 108, 109.

ఉ. సమ్మదలీలతోఁజదువ♦సామములేడును గండుఁగోయిలల్
తుమ్మెదలాలపించుఁబర♦తోవమునంబ్రణవాక్షరంబులన్
సమ్మతిఁ బ్రస్తుతించు శుక♦శారికలాగమభాషితంబులన్
నెమ్మదిఁజెప్పుశాస్త్రముల ♦ నీలగళంబులుతద్వనంబునన్. 1655

హరవిలాసము, ఆ 5 పద్య 31.

సీ. కదలుపాదపములు ♦ కల్లోలములు గాఁగ, విరులమంజరులు పై♦న్నురువు గాఁగ
హోమధూమంబులు♦జీమూతములు గాఁగ, ధవళాక్షతములు ము♦త్యములు గాఁగ
దేవపూజావిత♦ర్దికలుదీవులు గాఁగ, గ్రతుహవ్యవాహమౌ♦ర్వంబు గాఁగఁ
బర్ణశాలలుగూర్మ♦పర్వతంబులు గాఁగఁ, జదువులు సహజఘో♦షములు గాఁగ

గీ. తూలఁబట్టినసిర్కావి◆ధోవతులు ప్రవాళలతికలు గాఁగ గై◆వల్యలక్ష్మి
పుట్టినిల్లై సుధాంభోధి◆వోలె నిత్య, మహిమములమించుపుణ్యాశ్ర◆మంబుఁగనియె.

వరాహపురాణము, నం. మ. ఆ 4 పద్య 90.

సీ. ఉచ్చరించు మయూర ◆ ముపనిషద్వాక్యంబు, పారావతంబు శ◆బ్దంబు నొడువు
శారికతర్కశా◆స్త్రంబు వక్కాణించుఁ, గలకంఠములు షడం◆గముల నెఱుఁగు
హంసంబు లుభయమీ◆మాంసలు చరికించు, రాచిల్కశ్రౌతమా◆ర్గములు దెలుపు
నలఘు పురాణార్థ◆ములకుఁజొక్కుఁగురంగి, సామగానము విను ◆ సామజంబు
గీ. ఖంజరీటంబువైశేషి◆కమువిధించుఁ, గ్రౌంచమిథునంబు యోగ్యవై◆ఖరిభజించుఁ
దరమె కొనియాడ ఘటజన్మ◆తాపసాగ్రి, గణ్యపుణ్యతమాశ్రమా◆రణ్యభూమి.

రామాభ్యుదయము, ఆ 5 పద్య 113.

సీ. మును లిప్తసల్లాప◆మునమున్నఁ జెంగటఁ, జంచరీకము ఝుంక◆రించవెఱచుఁ
దపనులపైరంచుఁ◆దలపాలంబునఁబోవ, మెకము నీవరిచేను ◆ మేయ వెఱచు
వ్రతులుకాషాయవ◆స్త్రములారఁగట్టినఁ, బ్లవగపోతముచెట్టు ◆ ప్రాఁకవెఱచు
మానులమణులువో◆దీననున్నవియంచు, నంచ తామరకాయ ◆ చించవెఱచు
గీ. నేమనఁగవచ్చుఁ గొనియాడ ◆ నెవ్వఁడెఱుఁగు, నజభవాదులకైనన◆త్యద్భుతంబు
బదరికాశ్రమవాస్తవ్య ◆ పారికాంక్షి, వివిధనియమోపచితతపో◆విభవమహిమ.

కకుత్స్థవిజయము, ఆ 1 పద్య 157.

సీ. మొకరితేఁటులుమూతి ◆ ముట్టవు తేనియల్, శ్రీమధుశాసి క◆ర్పించికాని
కోకిలమ్ములు చివు◆రాకులు గొఱుకవు, శ్రీవనమాలి క◆ర్పించికాని
లేఁబచ్చికల్ గఱ◆ళింపవు హరిణముల్, శ్రీనీలమూర్తి క◆ర్పించికాని
ఫలభుజిక్రియలకుఁ ◆ జిలువలు దలఁపవు, శ్రీమాధవునకు న◆ర్పించికాని
గీ. యితరజంతువులునుహరి◆మతిఁదలంచి, కాని యేవర్తనములకుఁ ◆ బూనవనిన
నాతపోవనమాహాత్మ్య◆మభినుతింప, నలవియే వేమొగంబుల ◆ చిలువకైన. 1659

ఘటికాచలమాహాత్మ్యము, ఆ 1 పద్య 13.

సీ. చెలఁగిహరేర్నకిం◆చిద్వ్యతిరిక్తమస్తీయటంచుఁబల్కురా◆చిల్కగములు
వరుసమై వాసుదే◆వస్సర్వమితియని, సతతంబుఁబలవించు ◆ శారికలును
నచనచనారాయ◆ణాత్పరంమంత్రంబ, నిసరవిమోయుని◆దిందిరములు
మోదముతో నమో◆వేదాంతవేదినేయనియెఱింగించు పి◆కావళియును

గీ. జాపనులుసర్వవేదశా♦స్త్రములుచదువు, నపుడు గవుళ్లులుపోయిన♦యట్టి కొడలఁ
దీర్చి చదివించునట్టి స♦ద్ద్విజకులంబు, గలిగి విలసిల్లు నప్పుణ్యా♦కాననంబు. 1660
చిత్రభారతము, ఆ 1. పద్య 68.

సీ. ఎదురిండ్లపలుసాల♦లెసఁగివర్ణింపఁజా, లిన మేలిపర్ణశా♦లికలుకొన్ని
యాగమాంతంబుల♦యందలియర్థముల్, ప్రకటించుకీరశా♦రికలుకొన్ని
హావిరన్నసంభ్రమ♦ద్ద్విజకోలాహలాం, కములైన యాగవా♦టములుకొన్ని
దున్నివిత్తకపుట్టి♦ యెన్నులఁ నేఁగున, వ్రాలునివ్వరిపాల♦ చేలుకొన్ని (కొన్ని
గీ. తోఁపులాకకొన్ని తెలినీటి♦దొనలుకొన్ని, కొలఁకు లాకకొన్ని పెంపుడు♦పులులు
మొదవు లాకకొన్ని చేమంతి♦పాదలుకొన్ని, మెరయఁగఁదపోవనంబుఁ గ♦ల్పిం
చియపుడు 1661
కువలయాశ్వచరిత్రము, ఆ 4 పద్య 77.

సీ. మలినతయాగధూ♦మములయందునెకాని, మునిచరిత్రములపై♦ మొనయదెపుడు
రాగంబుపీరవ♦క్త్రములయందునెకాని, ఋషులలోచనముల♦ నెనయ దెపుడు
చలనతచలపశ్చ♦దళములందునెకాని, మౌనిచిత్తములపై♦ మలయ దెపుడు
భ్రమణంబునిత్యకృ♦త్యములయందునెకాని, వ్రతులబుద్ధులయందు♦వ్రాల దెపుడు
గీ. జాడ్య మెంతయు శ్రీగంధ♦సారతరుల, యందెకాని, యతీంద్రులఁ♦జెంద దెపుడు
నౌర యయ్యాశ్రమస్థల♦ మరయ దాని, మహిమవర్ణింపనలవి తా♦మహునిక పెం.
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 2 పద్య 121.

చ. గురుతరహోమధూమము మొ♦గుల్లుగఁ గెంజిగురు ల్మెఱుంగులై
పరగఁగ సాజ్యమాహుతుల♦ పంక్తులు పుష్పఫలంబులై తగన్
కరటిఘటాదిబృంహితము♦ గర్జగఁ గ్రొవ్విరి తేనెసోనలై
గురియఁగనొప్పు నవ్వనము♦ క్రొత్తఘనాఘనవేళయాననన్. 1663
నాగరఖండము, సంపుట 1 ఆ 1 పద్య 67.

సీ. కర్మసాక్షికిమున్ను♦ గాముసేంద్రులను డె, ల్పుటదోఁచులుబ్ధకా♦ర్భటరవములు
జడదార్లుగ్రుంకని♦ప్పుడెవత్తురని దెల్పు, నల్లేఁగుకొఱఁకుల♦ కంచపిండు
హరిపదార్చితులుమీ♦కై వత్తురని తెల్పు, గతినుమంబులనుఖృం♦గములు చేరు
సురముఖ్యులనుహవి♦స్సులకురమ్మని పిల్చు, నల్లేఁగుదివికివి♦హంగవిభులు
గీ. నవ్యదర్భాంకురములకై♦నంయమీంద్రు, లరుగుదెంచెదు తెఱఁగులు♦గఱప్రకొఱకు
జనెననఁగ నేఁగుమృగముల♦చ్చటిగిరులకు, విధులొనర్పంగ వాసర♦ప్రథమమందు.
నిర్వచనవిచిత్రరామాయణము, ఆ 1.

# పర్వతము.

—:0:—

చ. సురవరవాహినీధరుఁడు ♦ శుభ్రశరీరవిభాసి నీలకం
ధరపరిశోభితుండు గుణ♦ధాముఁడు తుంగతనుండు భూధరా
ధరణుఁ డుమాసమన్వితుఁడు ♦ సారవిభూతిసమేతుఁడై మహే
శ్వరుఁడును బోలె నొప్పు హిమ♦వంతుఁ డనంతమహత్త్వసంపదన్. 1665

సీ. ఉరుతమఃపటలంబు ♦ నుక్కుపట్టిదియని, నెఱినిగ్గులొనుచింద్ర ♦ నీలరుచులు
పున్నమవెన్నెల♦ప్రోదిపట్టిదియని, కాంతంబులగుశశి♦కాంతరుచులు
వెలుఁగొందురేయెండ♦వీడుఁబట్టిదియని, రాజితంబగుపద్మ♦రాగరుచులు
క్రొక్కారుమెఱుఁగుల ♦ యిక్కపట్టిదియని, తారముక్తాహార ♦ తరలరుచులు

గీ. ప్రచురమాధవోద్యానంబు ♦ పసిమికెల్ల, నాటపట్టిదియని గరు♦డాండరుచులు
మెచ్చిచూచుచువేమఱుఁ♦బిచ్చలింతు, రమరకన్యకలతులహి♦మాచలమున. 1666

కుమారసంభవము, నన్నె. ఆ 3 పద్య 247, 261.

మ. చెలువారున్ నవరత్నపాదకటక♦శ్రీచేతగంధర్వమం
గళనాదంబులతోడనొప్పగునభం♦గస్థైర్యవృత్తిన్ మహా
బలులైనంబ్రహసించు భూభరణశో♦భం దాల్చిమిన్నంటుచున్
గులశైలంబులపెంపువిశ్వవిభుతోఁ ♦ గూర్పందగున్ ధీరతన్. 1667

కావ్యాలంకారచూడామణి, ఉల్లాస, 3 పద్య 99.

చ. కదిసితి మరత దంతపరి♦ఖద్విపఖండితదేవదారువున్
మదనవినోదకందళిత ♦ మానసమానసవాసభీరువుం
బ్రదరపదాచ్యుతక్రకచ ♦ పాటితమస్తకదేశచారువున్
ముదితచమూరువున్ ఫలిత ♦ మాలినమేరువు సానుమేరువున్. 1668

ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 38.

చ. అటజనికాంచెభూమిసురుఁ♦డంబరచుంబిశిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠద♦భంగతరంగమృదంగనిస్వన
స్ఫుటనటనానురూపపరి♦ఫుల్లకలాపకలాపిజాలముం
గటకచరత్కరేణుకర ♦ కంపితసాలముశీతశైలమున్. 1669

మనుచరిత్రము, ఆ 2 పద్య 3.

సీ. జరఠకచ్ఛపరాజు◆చరమాంగగృహమేధి, భోగిశ్రేష్ఠునకేళిఁ ◆ బోలుచుఁజాణ
కులములోఁదరితీపు◆గలిగిమించినమేటి, మైనాకునోరసిన ◆ మాసటీఁడు
తోలువేలుపులవేలు◆పులపనుల్ గొనుజోదు, కదళీరాయలలోఁతు ◆ గన్నగబ్బి
సురరాజునకుఁబాండు◆కరిఁ జేర్చు మరకాఁడు, కల్పకంబులపంట ◆ కమ్మతీఁడు
గీ. కంటెమథితసుధాస్నాత◆కటకజాత, చంపకవనప్రకంపనా◆కంపపిసర
దళిరముఖరవమధుకర◆ముఖరశిఖర, నందనసమంచితంబగు ◆ మందరంబు. 1670

మనుచరిత్రము, ఆ 5 పద్య 47.

చ. సురగణసేవ్యమబ్జపురి ◆ చుంబితశేఖరముల్లసద్గిగం
బరమసితేతరద్యుతివి ◆ భానుకమాశ్రితసర్వమంగళం
బురుచిరభద్రినాగపరి◆పూజితభూతమునై నిజేశ్వరుం
బురహరుఁ బోలుచున్ రజిత◆భూధర మీధరఁ జెప్ప నొప్పుగన్. 1671

బసవపురాణము, పి. సో. ఆ 1 పద్య 3.

సీ. మునిమనోమోహన◆ముక్తినటీనాట్య, రంగంబులగు హేమ◆శృంగములును
గనకాబ్జకైరవ◆కల్హారసౌరభో, ద్గారంబులగు జలా◆ధారములును
క్రీడారతిశ్రాంత◆కిన్నరీపరిచిత, స్నేహంబులగుగుహా ◆ గేహములును
గుంజన్మదాలినీ◆మంజులమంజరీ, పుంజంబులగులతా ◆ కుంజములును
గీ. వలరి పెంపొందుఁ బూర్వాప◆రాంబునిధులు, నడుమధరణికిమానదం◆డంబువోలె
దేవతాత్మధరాధీశ◆దిగ్విభూష, పుణ్యనిలయంబునీహార◆భూధరంబు. 1672

శకుంతలాపరిణయము, పి. వీ. ఆ 2.

ఉ. హేలమెయి న్మహీరమణుఁ ◆ డెక్కొను నిశ్చలనమ్రిదేవతా
సాలముఁ గంధరస్థసుర ◆ చారణదంపతిగానవీచివా
చాలముఁ దుంగశృంగతట◆సక్తమణీపునరుక్తతారకా
జాలముఁ బారిజాతవన ◆ సంస్థితిమూలము హేమశైలమున్. 1673

కవికర్ణరసాయనము, ఆ 2 పద్య 230.

చ. పొలుపగుతారకాప్రసవ ◆ పుంజములన్ సిగఁజుట్టి ధాతురే
ఖల ఘుసృణం బలంది కట◆కంబుల మేఖలల న్వహించి త
జ్జలధరనూత్నచిత్రపట◆సంగతిసానులతోడికూటముల్
గలిగి తనర్చు నగ్గిరి యొ◆కానొక కాముకురేఖచూపుచున్. 1674

సుదక్షిణాపరిణయము, ఆ 1 పద్య 125.

ఉ. ప్రీతి యొనర్ప నగ్గిరి ని♦రీక్ష యొనర్ప దరీసరత్స్రివం
తీతటజాతరూపధర♦ణీరమణీయమణీసమగ్రమై
స్ఫీతసుధాంబుపూరసర♦సీరుహశీకరశీతలానిలా
న్వీతవిహారదేవతరు♦ణీహరిణీకరిణీసమూహమై. 1675

సీ. ఈదాపునీలంబు♦ లెల్లఁ దుమ్మెదలుగాఁ, గెంపులుచిగురాకు ♦ గుంపుగాఁగఁ
గ్రమ్మినమగమాని♦కమ్మలువిరులుగాఁ, జంద్రికాంతములు గు♦చ్ఛములుగాఁగ
నలరుగోమేధికం♦బులు తేనియలుగాఁగ, శృంగముల్ కొమ్మల♦ చెలువుగాఁగ
నసగైరికాదిధా♦తువులుపుప్పొడిగాఁగ, గిరిజగంధముపుప్పొ♦పరిమళముగఁ
గీ. కిన్నరస్త్రీలపలుకులు♦కీరభాష,ణములుగా నిచ్చభక్త♦ణములకమృత
ఫలము లొసగుచు మహితక♦ల్పకమురీతి, భాసురంబుగనుండు న♦ప్పర్వతంబు.

నాగరఖండము, సంపుట 1. ఆ 1 పద్య 91, 92.

సీ. అలరుఁదీవియలఁబొ♦యకమించుక్రొందేఁటి, జోటిమ్రోత లొయారి♦పాటగాఁగ
స్థలకంజనీకంజ♦ములగాడ్పుదారిఁబైఁ, బర్వుపుప్పొడిపచ్చ♦పావడులుగఁ
గనకశృంగాగ్రిసం♦గతపాండుకాండదా, నీకముల్ నవపుండ♦రీకములుగ
నతిచలచ్ఛదయుక్తి♦నలరురంభాస్తంభ, జాలంబుజయపతా♦కాళిగాఁగ
గీ. భోగవతికావతంసముల్ ♦ పుణ్యతరులు, రాజశార్దూలసంఘముల్ ♦ప్రాంతవీథిఁ
గొలువఁ బేరోలగంబున్న♦ చెలువుఁబూనె, నీధరాభృద్వరునిఁగంటె♦భూధరేంద్ర.

చంద్రికాపరిణయము, ఆ 2 పద్య 17.

క. గంగోత్తమాంగమై సా,రంగధరంబయి పతంగ♦రాజాస్పదమై
రంగుగ గిరిగనవొప్పెను, గంగాధరుభంగి నీల♦కంఠయుతంబై. 1678

రామచంద్రోపాఖ్యానము, మి. మ. సుందర. ఆ 5.

సీ. తతసరిజ్ఝరచర♦త్సితగరుద్వరగరు, ద్భవమరుత్పదసర♦ద్ద్విజవార
మతిలసద్వదనస♦న్మతిమిషత్పరిహాస, త్పతివస్త్రరతిహాస♦త్సుతనుజాత
మఖిలలస్వరదల♦త్సుభవలత్సుమగల, న్మధుమిలజ్ఝరఫల♦న్మహిజజాల
మమలహృత్పికగహ♦ద్ద్రుమబృహత్కనుమభృ, త్కలుషహృద్ధరణిభృ♦త్కలితసిద్ధ
గీ. మవ్యయానందగాయక♦శ్రావ్యగాన, భవ్యసౌధాగ్రనిర్మిత♦నవ్యకాంతి
దివ్యదిందిరశిలాగార♦దివ్యభీరు, సేవ్యజనమాజగన్నాథ ♦ సీమఁగాంచి. 1679

సర్వకామదాపరిణయము, ఆ 2.

# వేఁట.

క. వరుణుఁడు దుర్జయధరణీ, వరునాజ్ఞకు వెఱచి మృగని ♦ వారణమునకున్
బురికొలిపి శరధులెత్తిన, తెరలనఁ జెనలెత్తి రఖిల♦దిగ్భాగములన్. 1680

క. వీరిలనివల లొడ్డిరి హే,రాళముగా లోకపాల♦రమణులు మృగయా
లీలఁ గనుఁగొనఁగఁ జేసిన, జాలకజాలములు గలది♦శాఖిత్తులనన్. 1681

వరాహపురాణము, నం॥ మ॥ ఆ 4 పద్య 77, 78.

సీ. ఒకనాఁడు తెరవేఁట♦నుగ్రసత్త్వంబులఁ, బడమిమైఁబడగాస్సి♦పడవధించి
యొకసారి సారమే♦యోక్షతినుద్ధుర,స్తబ్ధరోమంబుల ♦ సంహరించి
యొకమరి దీమంబు♦లొడ్డి పొదులు దీర్చి, బహువిహంగంబులఁ ♦ బట్టి తెచ్చి
యొకవేళ డేగవేఁ♦టకుఁజని యెగఁజోఁపి, నానాండజములప్రా♦ణములు గడపి
గీ. ముంగివేఁ చేఁదువేఁట సి♦వంగివేఁట, యుక్షవేఁటయు గంటవేఁ♦ పెద్దవేఁట
మొదలుగాఁగలవేఁటల♦యదనెఱింగి,తిన్నఁడొక్కొక్కతూకువ♦ర్తింపఁదొడఁగె.

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 3 పద్య 47.

సీ. ఓదముల్ దర్పించి♦యురులొడ్డ నియమించి, యువ్వాలవ్వాలవల♦లీడఁగఁ బంచి
యడుగులెత్తించి చో♦ప్పడ జాడ వేయించి, యాయాయి పెంకిప♦ట్లరయఁ బంచి
పోగువారించి గో♦ష్పనఁ జోఁపు వెట్టించి, కొండలేఁజిగురాకు♦గూండ్లనించి
యక్కడక్కడఁ దోరివ♦లరికట్టఁ జెప్పించి, వాకట్టుగట్టించి♦పైపు లెంచి
గీ. యెచ్చరికమించి తెరవేఁట♦యెద్దువేఁట, గంటవేఁటయు మొదలుగాఁ♦గలుగు వేఁట
లెన్నిగలవన్ని యుఘటించి♦యన్నరేంద్రుఁ,డుగ్రమృగభంజనక్రియా♦ద్యుక్తుఁడయ్యె.

రామాభ్యుదయము, ఆ 2 పద్య 29.

సీ. ఒకచేత నెలుఁగొంట ♦ నొకకొండ గొరియఁగా, నొకఁడు త్రిప్పెడు త్రిప్ప ♦ డొ
అపు గొలిపె
నొకచేతఁ బులినొంట ♦ నొకచేత లేడిగా, నొకఁడెత్తునెత్తి కో♦లాఅపునిలిపె
నొకచేతసలుగొంట ♦ నొకదుప్పిశోదమగా,నొక్కఁడూఁచినయూఁపు♦లుప్పతిల్లె
నొకచేతఁ బోతొంట♦నొకమన్నుఁబెంటిగా, నొక్కఁడార్చినమాట♦లొప్పిచెల్లె
ఆ. నొక్కఁడు నొకటఁ దెగక♦యొంకటికిఁ దెగకొక్కఁ, డోపి రిట్లురెంటి♦కొకఁడచాలి
వలలఁగలమెకాల♦వలకేలు డాకేలు, బిరుదుగిరుదుఁ బంచి♦పెట్టుకొనఁగ. 1684

కకుత్స్థవిజయము, ఆ 4 పద్య 93.

సీ. సారంగదానముల్ ♦ సలుపు ధీరుఁడుగాన, సారంగదానముల్ ♦ చాల సలిపె
హరిదానము సృజించు ♦ హరివంశమణిగాన, హరిదానగతులసం♦ఖ్యలు సృజించె
ఖడ్గదానము వర్చు ♦ ఘనపుణ్యనిధిగాన, ఖడ్గదానము లనే♦కము లొనర్చె
భూదారదానమిం♦పుగఁ జేయుపతిగాన, భూదారదానము ♦ లుబ్భరిచేసె
గీ. నిజపురోహితసంకల్ప ♦ నీతి వెలయ, సాంగములుగాద్విజాళి యం♦ప్సాంగనృపతి
వేఁటలోఁపలధర్మంబు♦విడువఁ డయ్యె, క్షత్రియుఁడుగావనిజకులా♦చారమరసి.

ఆ. భల్లములనుబూని ♦ భల్లముల నణంచె, ఖడ్గముల హరించె ♦ ఖడ్గములను
బోరిలోనితెఱఁగె ♦ పొసఁగించె వేఁటలోఁ, బ్రిథువుధర్మయుద్ధ♦పరుఁడుగాన.
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 2 పద్య 104, 105.

చ. బలువిలుకాండ్రు మెచ్చ నర♦పాలకుఁ డేసిన యాశుగం బన
ర్గళమదనాగకేసరిని♦గాడి రసాస్థలిఁదూఱఁబాఱెనా
వలఁ దనపేరుఁదాల్చిన ♦ వాయువుఁగ్రోలుటయెట్లుభోగిరా
ట్కులమని నాగలోకమున♦కున్ బగదీర్పఁగఁబోవుకైవడిన్. 1687
సారంగధరచరిత్రము, చే. వేం. ఆ 1 పద్య 97.

గీ. హరియవిశ్వాసమునుభవ్య♦తరులవంచ,నయు మధుపమైత్రిగలిగిసాం♦ద్రతరమదము
కలిమిమేనుతెఱుంగని ♦ కరటులనువధించెఁ బతి యది రాజవృత్తియ తలంప.
శకుంతలాపరిణయము, పె. నా. ఆ 1 పద్య 135.

సీ. తాఱుచు నీరముల్ ♦ దూఱుచు నొండొరున్, జీఱుచు మగటిమి♦న్మీఱువారు
దాఁటుచు నోరుని క♦ట్టేఁటుచు కూనల, మాటుచు జింకల ♦ మీటువారుఁ
ద్రుంచుచు బలులమై.♦ నొంచుచు న్బోరలు, జించుచు పెంపున♦మించువారు
నేయుచుం దెలిగ్రొవ్వు ♦ గోయుచు నేపులం,దూయుచునురముగాఁ♦జేయువారు
గీ. సింగములదుంగమత్తమా♦తంగములకు, రంగములభల్లుకంబుల♦నంగములను
నిసితసాయకజాలము♦ల్నించిత్రుంచు, వారునై వేఁటసల్పిర♦వ్వీరభటులు. 1689
కవిచకోరచంద్రోదయము, ఆ 2.

గీ. జివురుగండెలు మరులును♦దవులఁజేసి, పక్షిజాతస్వరమ్ములఁ ♦ బలికిపలికి
చేరవచ్చెడిపులుఁగుల♦జెలఁగిపట్టి, చిక్కములఁబెట్టిరొకకొంద♦ఱక్కజముగ. 1690
గీ. గుంజుపిట్టలుకౌఁజుపు♦ల్గులునుడేగ, పక్కితుటుములుపూరేండ్లఁ ♦ బట్టి నైజ
పద్ధతులవేఁటలాడించి ♦ పలుతెఱఁగుల, నోలిమైఁ బట్టుకొనిరి నీ♦డోద్భవముల.
శకుంతలాపరిణయము, ఫ. వేం. ఆ 1.

శా. చెంతన్నిల్చినదప్పువోయినను ని♦శ్చేష్టంబునై శస్వధిక్
గ్రింతుల్గొట్టినదృష్టి కన్నమును ల♦క్ష్యంబంటుభూమీశున
మ్మంతర్వ్యాప్తి నవప్రసూతసురత♦వ్యాసక్తముం జూచి క
ర్ణాంతాకృష్టమునయ్యుసాగదురుమం♦తాగ్రిదిపప్రేక్షంబనన్. 1692

శంతనూపాఖ్యానము, ఆ 1 పద్య 53.

# వేటకాండ్రు.

సీ. విండ్లుగోలలను జ♦ద్దాండ్లుబళ్ళెములు కే,లనుబూని మొనలుగాఁ♦జనెడివారు
గదులంచేకత్తులు ♦ గండ్రగొడ్డండ్లు స,య్యానఁబూని యెడలేక ♦ యరుగువారు
చిక్కములు వ్యాలలును ♦ జివురుగండెలు నురుల్, బోనులుగొనివడి ♦ బోవువారు
కాఁజుపిట్టలుజలా♦గండెలు పూరేండ్లు, డేగలు గైకొని ♦ యేఁగువారు
గీ. పటకుటీరంబులకు రుచి♦పాకములకు, వలయువస్తువులెల్లఁ గా♦వడులఁబెండ్ల
నెత్తలమోపులనుపీఁక♦నెత్తి యెత్తి, మించువేడ్కలవడినడి♦పించువారు. 1693

సీ. తుంపములప్పట్టి వే♦పండరాజంబుల, వెనుకకుఁబడఁద్రోలెతు ♦ మనెడివారు
చెంగునదాఁటి చె♦లంగుసింగములతోఁ, దనె దాఁటిపడఁగూల్తు♦మనెడివారు
పలుతెఱంగుల జెబ్బ♦లులతోఁ జెనఁగికత్తు,లను కుత్తుకలుగోతు ♦ మనెడివారు
శరములేఁటికి ధను♦ష్టంకారముల వరా,హములు గూలఁగఁజేతు ♦ మనెడివారు
గీ. లేపు తోడేపు మతియుఁ గుం♦డేళ్ళనంగ, నెంత పదములరాపునఁ♦గంతుగొనుచు
టంచుఁ బలికెడువారలు ♦ నగుచువీర,వరులు కొందఱు నడిచిరి ♦ వరుసమెఱసి.

శకుంతలాపరిణయము, ఘ. వేం. ఆ 1.

సీ. గాలిబం టెగఁబోతు♦కోటరి పసిగాఁడు,నను జాగిలములతో ♦ నరుగువారు
దీమపెరటిదసులు♦దీర్చినడేగలు, పడిఁబట్టుకొనిపర్వు ♦ లిడెడువారు
బివిసవీవధములు ♦ నెపవపుట్టికలును, బడిబడిఁ బట్టుచుఁ ♦ బోవువారు

గీ. రండు రండనువారలు ◆ రాజునెదుటఁ, బదుఁడుపదుఁడనువారలు ◆ గదియువారు
గృహము వెల్వడువారలు ◆ గెరలువారు, నగుచు నడచిరి వేగమ◆య్యధిపుభటులు.
శంతనూపాఖ్యానము, ఆ 1 పద్య 42.

సీ. డాసియేనుఁగులతోఁ◆డమువీఁచనుండియు, య్యాలలూఁగనీచిన్ని◆యొలుకవాడు
లేఁడిగఁ బులికిఁ గ◆ళ్ళెముఁబెట్టి వయ్యాళి, దోలుఁ గాఁ అడవి నీ◆దుండగీడు
కరిఁజంపిపోవు సిం◆గమువెంటఁజని గోళ్ళ, ముత్యముల్ దెచ్చు నీ◆ముగుదశిశువు
గండభేరుండంబు ◆ రెండుతలల్ రెండు, చేతులనించు నీ ◆ చిన్నివాఁడు
గీ. వేఁడుకలఁజేరియరకాల◆వీడఁదన్ను, నడవిపందుల కోఁఱలీ◆పడుచువాఁడు
తక్కునెలుఁగులగిలుగుల ◆ లెక్కసేయ, నేఁటికిఁక నీవెచూచెదు◆వేఁటలందు. 1696
ఉత్తరరామాయణము, ఆ 7 పద్య 39.

# వేఁటసాధనములు.

ద్విపద. బోనులు నురులును◆బులులుఁ బందులును, కుక్కలు ముంగసు◆కుందేటివలలు
చిక్కంబులును తెర◆చీరలుజింక, లెద్దు లిబ్బులు బడి◆యేనుఁగుల్ పెద్ద
గిద్దలు డేగలు◆గేరిజంబులును, మున్నైనసన్నాహ◆ముల్ వెంటరాఁగ. 1697
పఱిభులింగలీల, పి. సో. గతి. 20.

సీ. పలలకోవళ్లు చి◆వ్వంగులబండులు, తిరుచుట్టుబొంగుకా◆లురులు చీర
తెరలునుగ్గంబులు◆దీమము ల్మారము, ల్మేకదారికత్తులు ◆ మేకముబోను
లొఁటుపైనగోడ్డండ్లు◆ మెఱుఁగుఁబళ్ళెంబులు, తట్టగొమ్ములు పులి◆చెట్టుమందు
బలువింఢ్లఁ బొట్టిగో◆లలు తోలుమోకులు, గొరకత్తు ళమ్ములు ◆ కరకణీలు
గీ. సాదిగావేఁటలకుయోగ్య◆మై తనర్చు, సాధనంబులుసవరించి ◆ సరభసమున
నాటవికసైన్యమే తెంచి ◆ యధిపుఁ గాంచి, దండములుపెట్టినిలిచి ప్ర◆తాపమలర.
రుక్మాంగదచరిత్రము, ఆ 3 పద్య 70.

సీ. వంతులుగుదియలు ◆ వలత్రాళ్ళు మోకులు, బిసలు మాఱమ్ములు◆పెద్దవిండ్లు
పచ్చకత్తెలగుదుల్ ◆ బలుతుపాకులు నెద్దు, లేనుంగులు సివంగు ◆ లీత్తిపోతు

పిడుకకుంపటు లాకు♦తడికలు పాశ్రలుత్రా,ళ్వాఁడికొష్ఠంబ్లు మ♦న్వాఁపుటుఁబలు
పాఁదిగువ్వలు వోటు♦పలకలుపోటుగుం,జలు చుక్కములు నుదు♦ల్జాగిలములు
గీ. జిగురుఁగండెలు నాలపుఁ ♦ జవ్వసెదురు, ఉరియును సాధనంబులు ♦ నలవరించు
కొనిపాటూపాటినపలలోఁ♦పినుఁగులెన్నఁ, గదిసినడిసినయమ్మహా♦కాంతునటుతఁ.

కుశేనప్రుతి, ఆ 1.

---

# వేటకుక్కలు.

---

మ. ఓగుపత్రైళ్ళమరించి కేఁటకు భటుల్ ♦ పేక్ష్వేర నంకించి ము
ష్టాగఁఓల్వన్ మురియున్ జయల్ పసిగొనున్ ♦ చూఁటున్ దెసల్నెక్కి నీ
లిగి కాల్ద్రిప్పు నెలుంగిడున్ జెపకవల్♦ఉక్కించు మైత్రాఁకుఁ జో
ల్పగపల్కాల్పుచుఁబోవు డిస్స మొలవే♦ల్పుండత్తుడుల్ మొత్తమై. 1700

రామాభ్యుదయము, ఆ 2 పద్య 21.

సీ. అలదుర్గయొక్కిరి♦తలవెక్కిరింతలా, డెడురీతి నాలుక♦ల్వ్రేలఁజాఁచు
నిజ్జిగుజ్జుపుతాతు ♦ నెక్కసక్కెములాడు, గతివాలవిక్షేప♦కలనఁదాల్చుఁ
దొడరకొండలనెత్తి♦యడవఁబూనెడుమాడ్కిఁ, బడరిచివ్వనఁబూర్వ♦పదము లెత్తు
గర్జితంబులసారె♦భర్జించుకైవడి, మొఱుఁగు నార్భటముగా ♦ మోరలెత్తి
గీ. బలిమికలిమినిజవముసం♦పదను దిట్టి, తనముపెంపున దారుణ♦ధ్వనినిరూఢి
జాగిలంబులుమృగయుల♦చ్చంపుఁబనిఁడి, పట్టెడలఁబట్టివెడలించు♦నట్టియెడను.
సీ. ధర నల్పునకుఁబ్రభు♦త్వంబువచ్చినమను,ష్యుల వికారపుఁజూడ్కిఁ♦జూచినట్లు
పల్లవుల్ తుదిలేమి♦పడి యింటిచాయరా,మొగిలంజెతల్లులు ♦ మూర్గినట్లు
పరదేశి యతిలోభ♦పరునియింటికిఁబోవఁ, దెగికొంతివలెనుగ♦ద్దించినట్లు
వంతువాసికిహీన ♦ వైశ్యులు దమలోన, నేకంబుగాఁ గల♦హించునట్లు (తతివి
గీ. తెరలియొరుఁడొక్కటినిరూక్ష♦దృష్టిఁజూచు, గొఱగొఱనుమూల్గు గద్దించు♦పటివి
కవిసికలహించి భాంకృతి♦కలకలముగ, జాగిలమ్ములు రోషభీ♦షణములగుచు. 1703

కవిరాజమనోరంజనము, ఆ 2.

# వేఁటకుక్కల పేళ్ళు

చ. పులియఁడు బూచిగాఁ డనుర♦పోతులరా జనుమంతిగాఁడు చెం
గలువ సివంగి భైరవుఁడు ♦ గత్తెర సంపఁగి వెండిగుండు మ
ల్లెలగుది వాయువేగి చిటి♦లింగఁడు సాళ్వఁడు వత్సనాభి యే
కలములమిత్తి గబ్బియనఁ♦గాఁ గలవాని గ్రహించి యుద్ధతిన్. 1703

మనుచరిత్రము, ఆ 4 పద్య 32.

చ. పొలుపరివేఁటమానికము ♦ పోతులరాజు తుపాకిపైరి బె
బ్బులి నుడిగాలి చల్పిడుగు ♦ బోడఁడు నాఁచగు పెక్కుసామము
ల్గలిగిన జాగిలంబులను ♦ గావలివాండ్రు పసిండివ్రేఁకపుం
గొలుసులఁబట్టి తెచ్చిరి య♦కుంఠితఘాంకృతు లుల్లసిల్లఁగన్. 1704

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 2 పద్య 62.

# వేఁటధర్మములు.

సీ. మృగయయందు మృగముల♦నొగిఁబొంచి వెసఁజంపుఁ, గానకుండఁగఁజంపుఁ ♦ గడఁకఁజంపు
విముఖంబులై యుండ ♦ వేచంపు మఱిసమ్ముఖంబుననుండఁగఁ ♦ గడఁగిచంపు
వలబోనులాదిగాఁ ♦ బలుయంత్రములఁజంపు, వడిమీఱుశునకాళి ♦ విడిచిచంపు
మఱియొక్కమృగముతో♦మలసిపోరఁగఁజంపు, దీమంబునకుఁజేర్చి♦తెగుపఁజంపు
గీ. నెన్నిభంగులనయిన మాం♦సేచ్ఛమృగము, నరులు చంపుదు రిల దాన♦దురితమొండ
దఖిలధర్మార్థకోవిదు♦లైనరాజ,వరులు మృగయాభిరతులైన ♦ వారుకారె. 1705

భాస్కరరామాయణము, కిష్కిం. పద్య 256.

# యుద్ధవర్ణనము.

:0:

చ. అతులకరాంతకంబున ని♦కంతకమత్పటుబాణదారితో
ఛ్ఛ్రితదనుజాంగనిర్గళద♦సృగ్జలధారలునూడనొప్పె నా
తతగిరిశృంగసంగదళి♦తప్రచలజ్జలవాహజాలసం
తతగళదంబుధారలవి♦ధంబున నంబరమెల్లఁ గప్పుచున్. 1706

భారతము, ఆర, ఆ 4 పద్య 65.

శా. గీర్వాణప్రవిముఖ్యబాణపటల♦క్రీడావిలోలంబులై
గర్వోన్నక్షనురారిశీర్షములుపైఁ♦కన్ డొల్లెఁ గల్పచ్ఛిదా
నిర్విక్తాంబుదమండలోత్కరమహా♦నిర్ఘాతహేతాపహా
తోర్వీభృచ్ఛ్రితకంటశైలములతో♦ సాహింపఁదుల్యంబులై 1707

" " " ఆర. ఆ 5 పద్య 276.

శా. దేహోత్సేకమెలర్ప నుత్కటమదాం♦కృభూతులై యాహవో
త్సాహవ్యగ్రులు విగ్రహంబుమిగులన్ ♦ సంరంభసంభృతిన్
బాహాబాహులఁ బోరునప్పు డమరెం ♦ బ్రౌఢద్విపద్వంద్వహే
లాహస్తద్వయగాఢకర్షణరణో♦ల్లాసంబువిస్పష్టమై. 1708

" " ఆర. ఆ 6 పద్య 384.

సీ. కరులఁ దుమిచెడువేళ♦గిరులఁదున్మాడుసం,క్రందనుకైవడిఁ ♦ గానవచ్చు
నరదముల్ దెరలించు♦నప్పుడుపఱమొగుల్,విరియించుగాలిగాడ్పు♦విధము మెఱయు
హయములఁజెండాడ♦నరుగుచోట్లనులేళ్ళ, గమిగిట్టుకొల్పులి♦కరణిమొలయు
భటులకునరుగుచో♦బలువేసవినిగాన, దరికొనుచిచ్చుచం♦దంబుగలుగుఁ

గీ. గసిమసంగినయంతకు ♦ కరణి యంత్య, కాలరుద్రునివిస్ఫుమ♦కాంతమృత్యు
ముఖమునుగ్రభావముదోఁచు♦మొనయుపీఠి, సమితిఁ దెగటార్చునప్పుడా♦శల్యునందు.

" " " శల్య. ఆ 1 పద్య 232.

శా. రౌద్రోల్లాసముమూర్తిసంకలనఘో♦రంబై పొరింబేర్చినా
నుదిక్తంబగునూత్నరక్తమునమ♦గ్నోన్నతస్తంబోక్షిప్త
ధ్వజమాత్రిపోగ్రగదాయుగంబువిసర♦త్సంధ్యాంబుదద్వంద్వభా
స్వద్దేశ్రిఖాలలితంబు చెన్నువడసెన్ ♦ వారిద్దఱుంబోరఁగన్. 1710

" " " శల్య. ఆ 1 పద్య 233.

సీ. గజిగానవోడసుల♦విటిగెడునస్త్రముల్, దోలఁగుసంధులకిచ్చు ♦ మొలలుగాఁగ
బలుసిడిమైగట్టు ♦ పాశముల్ చెగిపోయి, నంగములకుఁగట్టు♦లై పెనంగ
కానకంబుతోఁదాఁకు♦నీటెలుఁగుమిసిన, పలువోటులకుఁజల్వ♦నలలుగాఁగఁ
పెడులుగంటులఁదూఱు♦భిండివాలంబులు, గ్రమమునవిడునాప♦ధములుగాఁగ
ఆ. నలవుతెన్నిగొనిన ♦ నవ్వటికప్పటి, కలభ్రబలముఁ జలము♦నస్తరింప
నుభయబలములందు♦సుభటోత్తములువోరి, రాహవమునవిజయ♦దోహలమున. 1711

సీ. ఉరుపాశములు మృదు♦కరపాశములుగాఁగఁ, జక్రముల్ పృథుకటి♦చక్రములుగ
బాణముల్ నుశవృష్టి♦బాణంబులుగఁ గార్ముకమ్ములు భ్రూకార్ముక♦ములుగాఁగ
మండలాగ్రములాస్య♦మండలమ్ముగఁ గుంభి, కుంభముల్ గురుకుచ♦కుంభములుగ
వజ్రముల్ సితదంత♦వజ్రములుగఁ దత్ప్ర, ఘట్టనఁబటురతి ♦ ఘట్టనముగ
ఆ. విక్షతములు బహు న♦ఖక్షతములుగాఁగ, రక్తరసమువోఢము♦రాగరసము
గాఁగ సుభటవరులఁ♦గలిసిరణాంగన, ప్రౌఢిమెఱసిచేసెఁ ♦ బరవశులుగ. 1712
కుమారసంభవము, నన్నె. ఆ 11 పద్య 692, 749.

సీ. కమనీయమణిచిత్ర♦కాంచనచాపముల్, శక్రచాపంబుల ♦ చాడ్పుగాఁగ
సారెసారెకులీల ♦ సారించుమౌర్వులు, పటుతటిల్లతికల ♦ పగిదిగాఁగ
భీషణతరవాజి♦హేషాగ్రఘోషంబు, లురుగర్జితంబుల♦కరణిగాఁగ
మేనులనిగిడెడు ♦ మేచకరోచులు, దిక్కులఁజీకట్ల ♦ తెఱఁగుగాఁగ
గీ. భూనభోంతరమద్రువంగ♦సేనతోడ, మేఘసన్నిభాకారముల్ ♦ మెఱయఁదమిమి
విపులగిరికల్పుఁడగుకపి ♦ వీరుమీఁదఁ, బరుషసాయకవర్షము♦ల్గురిసిరపుడు. 1713
భాస్కరరామాయణము, సుంద. పద్య 369.

సీ. ఇరువాఁగుపెరయంగ♦నెగయుపెంధూళులు, తెఱచుమేఘంపుమొ♦త్తముల తెఱఁగు
సారథులిలఁగూల♦సరిఁ బాఱుతేరుల, మోఁతలుపెన్నుఱు♦ములవిధంబు
నమ్ముల్రేదెనరథు♦లంకించిపడిపైచు, చక్రాదులుజ్జ్వలా♦శనులపోలుపు
శుండాలములనుంచి ♦ జోడులుతోరఁగించు, వాలంపజాలంబు♦వానవడుపు
గీ. శస్త్రరోచులు మెఱుఁగుల♦గతియుఁగుంభ, కలితమౌక్తికములువడ♦గండ్లచాడ్పు
నెత్తురవఱదలేర్లపగిది♦నెఱయ మెఱయ, ననిపయోధరసమయంబు♦ననుకరించె.
,, ,, ,, యుద్ధ. పద్య 525.

మ. ఘనశస్త్రాస్త్రమహాతివర్షమునొగిన్ద♦ర్పామహాడంబర
ధ్వనిసంగీతఘనాఘనౌఘనిపత♦ద్ధారాళోద్ధారామఘో

శరవర్షంబులవంధ్యమొందఁజయిష్ణుపై ♦ సంరంభశుంభత్స్థితిన్
వనధుల్ ఘూర్ణిలబిట్టువాసవిపయి♦న్వర్షించె నొక్కుమ్మడిన్. 1715

హరవిలాసము, ఆ 7 పద్య 159.

సీ. చెఱకుపన్నిదమాడు ♦ తెఱఁగునగొడ్డండ్ల, పశుములురెండుగా ♦ నఱకినఱకి
యంత్రిమాడెడుభంగి ♦ నట్టిలుపలలును, విడిసినధారల ♦ వ్రేసివ్రేసి
కఱకుట్లుగ్రుచ్చునం♦గతినల్వురేవుర, గుదులుగాగొరకల ♦ గ్రుచ్చిగ్రుచ్చి
దొంతులకుఱుకురీ♦తులనొడ్డణములతో, శిరములకొడలఁ ♦ జిదిపిచిదిపి
ఆ. వ్రల్లదమునఁబల్కు♦పంతంబునొక్కఁడుగాఁ, బోటుగఱపుగన్న ♦ పోక్కఁజూపు
శివములెత్తినట్లు ♦ చేతులతీఁటవోఁ, బోరి రిందు నందు ♦ వీరభటులు. 1716

కవికర్ణరసాయనము, ఆ 2 పద్య 169.

సీ. కరికరస్థూలర♦క్తనవాంబుధారలు, బలసి జోరున జడి ♦ వట్టిగురియఁ
దరుణమేదఃఖండ♦కరకానికాయముల్, భేతాళభక్ష్యంబు♦లైతొఱఁగ
ముఖహుంకరణశేష♦ముఖరమస్తకములు, పిడుగులై పలుగొండ♦లడరఁబడఁగ
నలఘుబాహూరుజం♦ఘులువెల్లిపాముల, బలగమై పెలుచఁగ♦ప్పలుగరాల
గీ. నద్భుతావహమైనవ♦ర్షాగమంబు, భూభువనమెల్లనెఱుఁగంగఁ ♦ బుట్టెనయ్య
వరసురోరగహితముగా ♦ ధరణివిభుఁడు, గగనమునఁజూపుసంగ్రామ♦కౌశలమున.

కకుత్స్థవిజయము, ఆ 2 పద్య 108.

చ. ధనువులఁబ్రోఁత మేఘునిన♦దంబులుగా శరదీప్తిజాలముల్
ఘనతరచంచలావళులు♦గా మణిమౌక్తికదీప్తిధాత్రిమీఁ
దనువడగండ్లుగా క్షతజ♦ధారలుసంతతవర్షధారగా
ననయముఁ జెప్పనొప్పె విపు♦లాహవమప్పుడు వానకాలమై. 1718

మొల్లరామాయణము, యుద్ధ. ఆ 3 పద్య 62.

సీ. దుష్టచిత్తులశేషఁ ♦ దుదిధర్మములుగుంచి, కృతుల్లగుణములు♦శ్రుతులఁజేర్చి
జలధరంబులమాడ్కి ♦ శరములసంధించి, సత్కవులనఁగఁ బ్రా♦సములుగూర్చి
జనపాలకులలీల♦శక్తులేర్పఱిపించి, రథములకరణిఁ జ♦క్రములఁదనరి
శరనిధుల్ బలెబహు ♦ తరవారులుధరించి, వైద్యులగతిగదా ♦ వధులుగాంచి
గీ. ప్రబలదుర్వారగర్వోతుం♦భత్ప్రతాప, దరులుగంధర్వవరులుమాం♦ధాతృసుతునిఁ
జుట్టిముట్టాడిరనికి వి♦స్ఫురణమలర, ఘనతుషారంబులలవిభా♦కరునిఁబోలి. 1719

షట్చక్రవర్తిచరిత్రములో, 6 పద్య 81.

గీ. విల్లువెఱఁగంటివిల్లాఁగ♦వింటిమ్రోఁత, లుఱుములుఁగల్గు మెఱుఁగులు♦ మెఱుఁగుదీవి
యలుగ నెఱరాచతేలిమబ్బు♦పైఁ బసుదిండి, కొండపైనంపజడివాన♦గురియుచుండె.
అచ్చతెలుఁగురామాయణము, యుద్ధ. పద్య 518.

సీ. నరసింహాయమశంబు♦శరనిధిద్వంద్వంబు, కనకాద్రియుగముది♦క్కరియమంబు
తలపడువీఁకను♦ద్దండకాండప్రకాం, డగతులువారించి ♦ డగ్గఱంగఁ
జఱచుచుసవ్యాప♦సవ్యవిక్రాంతుల, వలయితగతులను ♦ వలనుమీఱి
తెగిదివ్యకాండముల్ ♦నిగుడించికొట్టుచుఁ, దపవ్రులురక్తసి♦క్తములుగాఁగ
గీ. నమరవరఘునపత్త్రిక♦ఘాతిగతుల, డాసి, చెఱుచుచుఁజేరియుఁ♦ద్ధతినిదొంచి
ఖంచి బడవేసి మూర్ఛలు♦ముంచఁదేఱఁ, బోరిరొక్కటనిద్దఱు ♦ పూర్వలీల. 1721
యాదవరాఘవపాండవీయము, ఆ 4 పద్య 87.

సీ. నగములైకూర్మిరప♦న్నగములై హాలహాల, గరములైప్రళయసా♦గరము లగుచు
ధరములైకాలాంబు♦ధరములైయసిపత్త్రి, వనములైజంఝూప♦వనము లగుచు
ఖరములైద్విరదశే♦ఖరములై పటుపాద, రసములై కఱకునా♦రసము లగుచు
జలములై రక్తపిం♦జరములై, దుర్వార, తమములై సైంధవో♦త్తమము లగుచు
గీ. వెఱపుఁబుట్టించిపోనీక♦వెంబడించి, కహకహార్భటిచాలది♦క్తటులనించి
వేగనానావిధాయుధ ♦ వృష్టిముంచి, కదనమొనరించిరిట్టుల♦గ్గలికమించి. 1722
తారాశశాంకవిజయము, ఆ 5 పద్య 42.

సీ. తతతురంగమపదో♦ద్ధతిచేతజనియించి, క్ష్మాపరాగంబుమే♦ఘ మనఁ దనరె
క్ష్మాపరాగంబుమే♦ఘచ్ఛాయఁదనరారఁ, బ్రబలమై బాణవ♦ర్షంబు గురిసెఁ
బ్రబలమైబాణవ♦ర్షమువిరాజిల్లిన, గలహాభుక్చాతక ♦ క్షామ మెడలెఁ
గలహాభుక్చాతక♦క్షామంబుదీఱిన, సమరకాంతావివా♦హంబు లయ్యె
గీ. నట్లయద్భుతమొదవెయూ♦థాధిపతులు, పరశుపట్టిసముద్గర♦ప్రాసచక్ర
భల్లకరవాలఫలకవి♦భ్రాజమాన, హస్తులై డాసి చెలఁగిపో♦రాడునపుడు. 1723
వాసవదత్తాపరిణయము, వ. వీ. ఆ 4 పద్య 91.

సీ. ప్రళయకాలోద్వేల♦జలధిసప్తకతరం, గావళీఘుమఘుమా♦రావ మనఁగఁ
బుష్కలావర్తకో♦ద్భూతజంఝూవాత, ఝాంకృతిఘోషణ♦జాత మనఁగఁ
గల్పవైశ్వానరా♦నల్పలీలాజాల, భవమహాచటచటా♦రవ మనంగ
సంవర్తకాంభోజ♦సందోహభీషణా, శనిపాత పెళపెళ♦స్వన మనంగ

గీ. సంగరాంగణరంగమ్ము♦జంగమున్న్క్య, తోడ్కొనివచ్చుగజబృంహి♦తములుకొన్ని
సింహనాదముల్ జగములు♦చెవ్రడువడఁగ, నొక్క పెట్టుగదురమున♦కెదురువెడలె.
రాఘవపాండవయాదవీయము, ఆ 3.

ఉ. ఆతతజృంభమాణనిశ♦తాక్షుటిజన్యము చెల్లుచుండఁగాఁ
భీతియొకింతలేక యరి♦భీషణబృంహితముల్ చెలంగ వి
ఖ్యాతనగాభవారణచ♦యంబు బృహత్కటిసీమనుండి దా
నాతులవర్షముల్ గురిసె♦నద్రులొగిన్ జలమేఘులంబలెన్. 1725
శిశుపాలవధ, ఆ 4 పద్య 131.

ఉ. హెచ్చగుకోపముల్లదుర ♦ నిర్వరు గాటపుఁగార్ముకంబులన్
జిచ్చులముల్కులొక్క మొగిఁ♦జిమ్మఁగసాగిరటంచుఁ జెప్పఁగా
వచ్చునొ చిచ్చుబుష్టులను ♦ సాఁకచేకొని పంజకంబులన్
జిచ్చులమర్చి పట్టిరని ♦ చెప్పఁగవచ్చునొ సందియంబగున్. 1726
చిత్రసీమ, దళ, 3 పద్య 58.

# యుద్ధరంగము.

సీ. తఱుచుగాఁ జెగిపడ్డ♦ధవళచామరములు, డిండీరములయొప్పఁ ♦ బుండరీక
ములు మరాళంబుల♦పొలుపునఁ గరవాలములు మీనభంగియుఁ ♦ దలలు శిలల
చాడ్పున కేశముల్ ♦ శైవాలరేఖయు, మాంసంబు పంకస♦మానతయును
దాల్ప భటాశ్వమా♦తంగాంగభగ్నరథములతిట్టలు సైక♦తములుగాఁగ
గీ. ఘోరపటకోటిదెప్పిళ్ళన♦ఫేనతతికి, సంభ్రమముప్పసంభృతో♦త్సాహులగుచు
నుబ్బి భూతబేతాళంబు ♦ లోలలాడ, నెట్టలంబగునెత్తురు♦టేఱువఱపె. 1727
భారతము, ద్రోణ. ఆ 1 పద్య 146.

ద్విపద. సురుచిరామృతవార్ధి♦సుతయునుబోలె, హరియుక్తమైన ని♦జాంగంబుగలిగి
చారువసంతమా♦సంబునుబోలె, నారక్తఫుల్లప♦లాశాళి గలిగి
వర్ధమానశీలుని ♦ హాసంబుఁబోలెఁ, గరమొప్పు నధికమా♦ర్గణకోటిఁగలిగి

దీపించు నేరేడు ◆ దీవియుం బోలె, రూపింప నవఖండ ◆ రూపంబు గలిగి
వలచినపతియొక్కె ◆ వనితయుం బోలె, సలలితరాగర◆సంబులు గలిగి
కరికిఁ గ్రమైచారరాని ◆ కానయుం బోలెఁ, గడునొప్పు పుండరీ◆కంబులు గలిగి
సడలనిమృదునినా◆దంబును బోలెఁ, గడఁగి యాడెడు భూత ◆ గణములు గలిగి
కమలాప్తరుచి నొప్పు ◆ గగనంబుఁ బోలెఁ, గ్రమము దప్పినతార◆కంబులు గలిగి
సరభసంబైన వే◆సవియును బోలెఁ, సురుచిరాంబరమణి◆స్ఫురణంబు గలిగి
కలిసినశివుఁడును ◆ గౌరియుం బోలెఁ, దలపోయఁగా నర్ధ◆తనువులు గలిగి
పెక్కుచందంబులఁ ◆ బెంపుసొంపడరి, యక్కజం బయ్యె ర◆ణావనిస్థలము. 1728

రంగనాథరామాయణము, యుద్ధ.

సీ. రథయానపాత్రంబు ◆ పృథుచక్రికమఠంబు, శవమకరంబును ◆ శయభుజంగ
మురుతరచామరో◆త్కరఫేనవితతి తు,రంగతరంగంబు ◆ రాజదస్త్ర
బడబాగ్నిదుర్గంబు ◆ బహురత్నసహితంబు, సంభ్రమావర్తంబు ◆ సామజాద్రి
కలితంబు డాకినీ◆గణహాసఘోషంబు, సాంద్రశోణితపూర◆సలిలమయము
ఆ. నగుచు నబ్ధిఁ బోలె ◆ నతిదుస్తరంబు న,గాధతరము దుర్వి◆గాహమంత
రహితపారముదిత◆రసవాహినీకంబు, దుర్నిరీక్ష్యగతిసు◆దీర్ఘ మయ్యె. 1729

భాస్కరరామాయణము, యుద్ధ. 11 పద్య 1984.

సీ. ఖండితశుండాల◆గండముల్ నక్రముల్, భూరితుండంబులు ◆ భుజగసమితి
పదతలంబులు కచ్ఛ◆పంబులు దంతముల్, శుక్తులు కుంభని◆ర్ముక్తమౌక్తి
కములు రత్నములు వా◆లములు జలూకముల్, మెదడు భేకంబులు ◆ మొదడు రొంపి
పేర్వులు పవడంపుఁ ◆ దీవులు నరములు, నాఁచు మజ్జంబు ఫే◆నంబులస్థి
ఆ. సైకతములు రక్త◆చయము తోయంబులు, నొఱఁగు నెడలనొరలు ◆ మొఱలు ఘనత
రంగరవము గామ◆తంగజాయోధన, స్థలము జలధిఁ బోల్పఁ ◆ దగె నరేంద్ర. 1730

భాగవతము, స్కం. 10 ఉత్తర. పద్య 884.

సీ. కొండలవలె నేలఁ ◆ గూలినమదగజ, ఘనకదంబములు మే◆ఘములు గాఁగ
మోఁకాలిబంటితో ◆ నేకమై యాడెడు, గనుపట్టు మెదడు పం◆కంబు గాఁగ
వలుగులఁ దాఁకున ◆ నిలఁబడు మాంసఖం,డములు దామింద్రగో◆పములు గాఁగ
బలువిడి నెడనెడఁ ◆ బాఱెడి రక్తంబు,లంబుప్లుతప్రవా◆హంబు గాఁగ
గీ. వాహినుల గుంపు శరముల ◆ వాన గాఁగ, మొనల హుంకృతు లవియుఱు◆ములును గాఁగ
వర్షకాలంబు చూడ్పన ◆ వారికన్నుఁ, గవలకును దోఁచె నప్పుడ◆క్కజము గాను. 1731

శతకంఠరామాయణము, ఆ 4 పద్య 108.

సీ. చెలఁగి పిశాచము◆దలి కపాలములతోఁ, గొని నేత్రరక్తంబుఁ ◆ గ్రోలుచుండ
శునకజంబుకతతి ◆ యొనసి పీనుఁగులపైఁ, బ్రాఁకి క్రేవులు పీఁకి◆ వైచుచుండ
ఖగచయంబులు మాంస◆ఖండకాండంబులఁ, జించి జవంజవ ◆ సేయుచుండ
నీఁగలతెట్టియ◆లెక్కమై మెసఁపడి పై, మునుకొని జామ్మున ◆ ముసరుచుండ
గీ. గుట్టలై యున్న శవములఁ ◆ గుర్కి యుఱికి, గప్పుగప్పున మిగులదు◆ర్గంధము లెసఁగ
పల్మఱును గుప్పుచుండఁ బా◆పములకెల్ల, రణమహీస్థలి భీభత్స◆రసము దోఁచె.
కుబ్జాకృష్ణవిలాసము, ఆ 1.

---

# యుద్ధసేన.

—:0:—

ఉ. రయవిచలత్తురంగమత◆రంగములన్ మదనాగనక్రసం
చయములఁ జంచలచ్ఛటుల ◆ సైనికమత్స్యములన్ మహోన్నతరి
బయి కురురాజచంద్రునుద◆యంబునఁ దద్దయుఁ బొంగెఁ బ్రస్ఫుర
ద్భయదమనోహరప్రకట◆భంగులఁ దద్భటవార్ధి యుద్ధతిన్. 1783
భారతము, అర. ఆ 6 పద్య 58.

గీ. అమరుతొడవులవజ్రాంశు◆లంచుపిండు, కరణి హరినీలములఁ జేర్పు◆కాంతి యుపల
పగిది మాణిక్యరుచిపద్మ◆భంగి మెఱయఁ, గురుబలంబు గెందామర◆కొలనిఁ బోలె.
,, ,, ,, భీష్మ. ఆ 1 పద్య 96.

క. అరదములు దీవులున్నత, కరులు గిరులు హరులు వీచి◆కలు సుభటసమూ
త్కరముగ్రసత్త్వములుగా, శరనిధిగతిఁ బాండుపుత్త్ర◆సైన్యంబొప్పెన్. 1785
,, ,, ,, భీష్మపర్వము, ఆ 1 పద్య 131.

సీ. శృంఖలాంకుశంబుల◆బిగువులు డించినఁ, గొంకక జాడించు ◆ కుంజరములు
కింకిణీజాలఝంకృతియలం◆కియలకోడక మెండు, కొనుచుఁ గరాళించు ◆ ఘోటకములు
హస్తులు గదియిన ◆ కదరి నిల్వక త్రిళ్ళు, సముహయంబుల మణి◆స్యందనములు
తేరికిఁ గరికిఁ బోఁ◆ దెరువీక హేవాక, కలితులై కేరుచు మొ◆క్కలపుభటులు

ఆ. నురువులురులవెడఁద♦నోళ్ళతోడుత మోర, లెత్తికొనుచు వేఁదు♦లెత్తినట్టి
లుబ్బరేఁగియున్న ♦ యుష్ట్రములను సేన, కగ్రిలీలఁజేయు♦చుండఁగడఁగి. 1736
భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 517.

సీ. కరటిఘటాకోటి ♦ కటనిర్గళన్మదా, సారంబు దొలుకారుఁ ♦ జేరఁబిలువ
రథనేమినిర్భిన్న♦పృథివీపరాగంబు, నీహారసమయంబు ♦ నేర్పుఁదెగడ
సుభటభుజోచ్చట♦క్షురికాప్రభాభంగి, ముందువేసవితోడ ♦ మాటలాడఁ
దురగఘట్టఖలీన♦మతఫేనతారకా, వళిశరత్కాలంబు ♦ వరుసఁజూపఁ
గీ. బవనచంచలధ్వజపట♦పల్లవములు, నవవసంతంబుఁదెలుప స♦న్నాహభేరశి
ఖిస్వలతికలుఁ శిశిరంబుఁ ♦ గడఁకఁ దెలుప, హంసడిభకులసేన యేఁ♦చినఁగ నడిచె. 1737
ఉత్తరహరివంశము, ఆ 4 పద్య 223.

సీ. ఎడనెడవడిఁగూడి ♦ సుడిరీతిఁదిరుగుచుఁ, దలపడిదర్పంబుఁ ♦ దెలుపువవియు
సెనువెన్కకొక్కింత ♦ చనియొక్కటొక్కటి, దంతముల్ భేదిల్లఁ♦దాఁకునవియు
వెడవాయనీకబ♦ల్వ్యాడినంటఁగదుముచు, నట్టిట్టువడిఁద్రోపు♦లాడునవియు
మావంతులన్యోన్య♦మధితులైకూలినఁ, బూఁపుదప్పకయుల్కుఁ♦బోరునవియు
గీ. నగుచు నపుడగ్గజేంద్రంబు♦లతిశయిల్లె, దంతఘట్టననిష్ఠుర♦ధ్వానములను
జటులఘంటాఘణంఘణ♦శబ్దములను, గఠినఘీంకారములనుది♦క్తటములదర. 1738
కళాపూర్ణోదయము, ఆ 8 పద్య 79.

సీ. మదచండవేదండ♦మండలుల్గొండలు, ఘోటకచ్ఛటలూర్మి ♦ ఝాటకములు
దరదమూలైయొప్పు ♦ నరదముల్ దీవులు, పడవాళ్లుకడిమిగ♦న్నడుమొసళ్లు
కరవాలచయము భీ♦కరవాలమీనముల్, చక్రిసంహతితోయ ♦ చక్రవితతి
చంద్రార్ధచంద్రాంక ♦ చర్మముల్ కూర్మము, లాయుధద్యుతిజాల♦మౌర్వకీల
గీ. లగుచుఁ గనుపట్టుదైత్యసే♦నార్ణవంబు, భూరిచంద్రోదయంబునఁ ♦ బొంగిపొరలి
కెరలి శరలీలవఱలంగఁ ♦ దరలివచ్చి, నమరవాహినితోముడం♦బమరఁగవిసె. 1739
తారాశశాంకవిజయము, ఆ 5 పద్య పద్య 18.

సీ. కోటపేరిటిశక్తి♦గుప్తిస్థగావింపఁ, బోరిఁబోరిరాలుని♦ప్పులో యనంగ
రణదుర్గమీఁదనీ♦రంధ్రంబుగాఁజల్ల, రాజిల్లునాడాచ♦లాజ లనఁగ
గడిదుర్గమనియెడి ♦ కాలాహిఁగ్రక్కిన, క్రొవ్వేఁడివిషపు ♦ గుళిక లనఁగ
రంగరాయాక్షమా♦రమణాభ్రమునఁబుట్టి, తోఁగెడుపిడుగుకప్ప ♦ తునుక లనఁగ

గీ. లెక్కకెక్కుడుగాదూఁకు ♦ రేకలాలు, నుంటికోప్రులు జబరుజం♦గులుఫిరంగు
లొక్కమొగి గాతుఁ గావింప♦నుక్కుమెఱసి, గుండ్లగుంపులుజడివాన♦గురిసినట్లు.
రంగారాయచరిత్రము, ఆ 3 పద్య 56.

# యుద్ధయానము.

సీ. సమదసింధురకదం♦బములుగావివి నిర్ఝ,రచిరచరద్భూధ♦రములుగాని
రంగదుత్తుంగత♦రంగముల్ గావివి, కనుపట్టుజవనాశు♦గములుగాని
కమనీయమణిశతాం♦గములుగావివి సము,త్కటరత్నమయపుష్ప♦కములుగాని
పటుసముద్భటభట ♦ ప్రకతులుగావివి, యతులితసింహసం♦హతులుగాని
గీ. ఘనచమూడంబరములివి ♦ గావువాయు, చలితచతురర్ణవప్రఘో♦షములుగాని
యనుచుఁజూపఱులద్భుతం♦బందుచుండ, దండిఁబురుకుత్సనృపమౌళి♦దండువెడలె.
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 6 పద్య 8.

సీ. ఖేలాభవాభీల ♦ కోలాహలముజలో,ద్వేలారవాస్ఫాళీ♦లీల లీన
హేలాగతాలోల ♦ వాలావళీగతుల్, కీలాలఘణులతో ♦ మేలమాడ
కేళీఘుతాలీన ♦ శాలీనరదకాంతి, జాలీభవత్ఫేన ♦ పాళిఁదెగడ
వ్యాళేశ్వరాళీక ♦ రాళీకృతకరంబు, లాలీఢగగనోర్మ్య♦లోలిగాఁగ
గీ. శాత్రవద్వీపములుముంచఁ ♦ జనెడుకల్ప,సమయఘుమఘుమరవదీర్ణ♦జలధి యనఁగ
వని మెరక కొండ పల్లమే♦ర్పఱచకుండ,నురుటుమీఱంగగజసైన్య♦మెదుటనడచె.
రాఘవపాండవయాదవీయము, ఆ 3.

సీ. నురగజంబులమీఱు ♦ సొగసుగుల్కెడుమత్త, మాతంగవరములు ♦ మలసినడువ
రవిహయోత్కటవేగ♦చువలీలనిరసించు, హయములెల్లెడఁ బర్వ ♦ హొరాయలుగులుక
మేరుమందరశైల ♦ సారముల్వ్రదళించు, నందమౌ రథములు ♦ సందడింప
విచ్చుకత్తులచేత ♦ విజ్జువీగుచువేగ, బయలుదేఱెడు వీర♦భటులు సెలఁగ
గీ. వీరశృంగారములతోడఁ ♦ బేరులొలయ, మంత్రిపుంగవుతోఁగూడి♦మత్సరమునఁ
దండ్రిమీఁదికిదండెత్తి♦తనయుఁడపుడు, వెడలెఁగరవాలహస్తుఁడై♦వినయముడిఁగి.
ధీరజనమనోవిరాజితము, ఆ 1 పద్య 80.

సీ. చతురంగబలవేగ ♦ సన్నాహపదసముత్థితరజః పటలంబు ♦ దిశలఁ గప్పె
గంధసింధురఘటా ♦ కర్ణతాళోద్ధూత, ప్రవహాంబుశీకరజః ♦ పటలి నడువ
బహువిధస్తంభశుం ♦ భద్రత్నకేతుకాంతులు నభంబునఁ జీఁక ♦ టులుగఁ జేయ
యురుఖడ్గసంఘర్ష ♦ జోద్ధూతవిస్ఫులింగములు దిక్కులకుఁ బ్ర ♦ కాశ మొసఁగ
గీ. ఘోటకాటోపహేషిత ♦ కుంజరోగ్ర, మహితఘీంకారఘోషభీ ♦ మప్రతాప
కార్ముకజ్యారవంబులో ♦ క్కటఁ జెలంగ, సిరులఁ జెంపొందయా రాజ ♦ సేననడిచె.

వైశ్యపురాణము, ఆ 6.

సీ. భేరీమృదంగఘ ♦ క్కారావమొలయఁగ, జయదుందుభిధ్వాన ♦ సంకులముగ
రాజవేషముఁ బూని ♦ రమణ సహస్రబాహామండితంబయి ♦ హారి మకుట
కటకకేయూరకం ♦ కణధారియై ఘోర, దంష్ట్రిక లొప్పార ♦ దహనసదృశ
తేజంబుతో బహు ♦ వాజిసంఘటితమహా, తుంగశతాంగమం ♦ దున వసించి
గీ. తూర్పుదిశకేఁగెఁ బూర్వమం ♦ దుసఁ దదీయ, సైన్యకోలాహలంబుచేఁ ♦ జకితజగము
దళితనభము విశీర్ణగో ♦ త్రంబుభీత, భూతజాతంబు నయ్యెఁ బ్ర ♦ భూతముగను. 1745

వేంకటాచలమాహాత్మ్యము, దా. చిన. వేం. ఆ 3 పద్య 30.

---

# యుద్ధభేరి.

—:O:—

సీ. రోదసీకుహరంబు ♦ మేదురంబైయుండఁ, దిగ్గజశ్రేణియుం ♦ బెగ్గడిలఁగ
ధారుణీచక్రంబు ♦ తల్లడమందఁగఁ, బృథుగోత్రశైలము ♦ ల్పెల్లగిల్ల
సప్తార్ణవంబులు ♦ సరవితో ఘూర్ణిల్ల, దినమణిగతిదప్పి ♦ తిరుగఁ బడఁగ
గొనకొనిసురకోటి ♦ గుండెలుపగులంగ, శేషాహివీనులు ♦ చెవుడుపడఁగఁ (నఁగఁ
గీ. బరగబ్రహ్మాండభాండంబు ♦ పగిలెననఁగఁ, బ్రళయరుద్రుండువాయించు ♦ పటహమన
బిడుగులొక్కటవడిమ్రోయ ♦ పెల్లుదోఁప, భీషణంబుగఁ బ్రస్థాన ♦ భేరిమ్రోసె.

భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 1932.

# ద్వంద్వయుద్ధము.

:0:

ఉ. నింగియు నేలయుం జగుల ♦ నిష్ఠురభంగిఁ జెలంగియార్చుచుం
బొంగిపదోగ్రఘట్టనల ♦ భూమిచలింపఁగఁ బాఱు తెంచుచుం
జంగమభూరిశైలముల ♦ చాడ్పునఁ జేరుచు ఘోరమత్తమా
తంగయుగక్రమంబుల మ♦పంబుననొండొరువీఁకఁ దాఁకుచున్. 1748

భాస్కరరామాయణము, కిష్కిం. పద్య 179.

సీ. పంచాస్యయుగళంబుఁ♦బాథోధియుగ్మంబు, ఘనగిరిద్వంద్వంబు ♦ గగనయుగము
భాస్కరద్వయమును ♦ పావకద్వికమును, గవిసిపోరుచునున్న♦గతి పలిక్వ
సామజభేరుండ ♦ శరభోరగంబులు, నప్రతిభటములై ♦ యనికిఁగడఁగి
వృత్రేంద్రులును ఘోల♦నేత్రగజాసురుల్, చటులతరాహవ ♦ సంభ్రమంబు
గీ. సల్పునట్లుగ నిరువురుఁ♦జలముబలము, మెఱయనన్యోన్యజయకాంక్ష♦మిగులుచుండ
రఘుకులాంబుధిచంద్రుండు ♦ రావణుండు, నోరసిపేర్చిమిడిఁదలపడి♦రుక్కుమిగిలి.

భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 2017.

# మల్లయుద్ధము.

:0:

సీ. చెయ్యిచ్చియొకకొంత♦సేపు నేర్పున బల్మి, యినుమడింపఁగఁజోర♦నీకమలసి
యొకతెఱంగునఁజొచ్చి ♦ యొండొంటఁగాసెలు, దొడకిపట్టుకకొంత♦తడవుపోరి
యడిమాని కొంతపా♦ద్దవనినాఁదినకాళ్ళ, పెకలించిపడనైవఁ ♦ బెనఁగిపెనఁగి
మఱికొంతవసిమెడ♦పిరియభుజమ్ములఁ, జిక్కించి యక్కున ♦ నొక్కి నొక్కి
గీ. నడుములనొడిసి కబళించి♦పుడమిమీఁద, సమముగాఁ వాలిబలపరా♦క్రమములెసఁగ
హెచ్చుగుందేమియును లేక♦యీశ్వరుండు, హరిహయసుతుండుమల్లసం♦గరమొనర్చె.

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 4 పద్య 191.

తరల. పెనఁగికొట్టుదురెలమిఁజేతుల ♦ జేయిచేయియువీడ్వడన్
పెనచి పట్టుదురుదగ్రరోషుల ♦ భీమహుంకృతు లొప్పఁగన్
మొనసిపాయుదు రంటితిగుతుర ♦ ముష్టిముష్టియుమీఱఁగన్
గినిసితాకుదు రొండొరున్ రణ♦కేళిచిత్రము దోఁపఁగన్. 1750

మైరావణచరిత్రము, ఆ 2 పద్య 85.

---

# స్త్రీయుద్ధనైపుణ్యము.

సీ. తంత్రీవినోదంబు ♦ తడవుసైపనివేళ్ళ, గొనయంబుతెగలపైఁ ♦ గోరికనుట
యద్దంబుపిడిముట్టి ♦ నలయుపాణితలంబు, లస్త్రకంఠీజయించు♦లావుకలిమి
చెలికత్తెనొత్తిలి ♦ చీఱలేనియెలుంగు, సింహనాదంబుచేఁ ♦ జెదరకునికి
ప్రమదవనర్తనకేళిఁ ♦ బంతవింపనిపదం, బైదురాణంబుల ♦ నలఁతఁబడమి
గీ. సోయగపుఁజిత్రరూపంబుఁ ♦ జూచుచోట, వేసరు విలోచనంబులు♦వికృతదైత్య
లక్ష్యమీక్షించుటలుమొక్క♦లంపుగెలుపుఁ,గైకొనియెసత్యభామసం♦గ్రామసీమ.

మ. అరిఁజూచున్ హరిఁజూచుఁ జూచుకములం♦దందందమందారకే
సరమాలామకరందబిందు సలిల♦స్యందంబులందంబులై
తొరఁగం బయ్యెదకొంగొకింతదొలఁగన్ ♦ దోడ్తోశరాసారముం
దరహాసామృతపూరముం గురియుచుం ♦ దన్వంగికేళీగతిన్. 1752

ఉత్తరహరివంశము, ఆ 1 పద్య 161, 162.

సీ. సౌవర్ణకంకణ ♦ ఝణఝణనినదంబు, శింజినీరవముతోఁ ♦ జెలిమి సేయఁ
దాటంకమణిగణ ♦ ధగధగదీప్తులు, గండమండలరుచిఁ ♦ గప్పికొనఁగ
ధవళతరాపాంగ ♦ ధళధళరోచులు, బాణజాలప్రభా♦పటలినడఁప
శరపాత ఘుమఘుమ♦శబ్దంబుపరిపంథి, సైనికకలకల♦స్వనమునుడుప
గీ. వీరశృంగారభయరౌద్ర ♦ విస్మయములు, గలసిభామినియయ్యెనో ♦ కాకయనఁగ
నిఖిలవృఁదొడుగుటదివుచుట ♦ యేయుటెల్ల, నెఱుఁగరాకుండననిచేసె♦నిందువదన.

మ. పరిఁ జూచున్ వరుఁ జూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరతభ్రూకుటిమందహాసములతో వీరంబు శృంగారమున్
జరగన్ గన్నులఁ గెంపు సొంపుఁ బరగన్ జండాస్త్రసందోహమున్
సరసాలోకసమూహమున్ నెఱపుచున్ జంద్రాస్య హేలాగతిన్. 1754

భాగవతము, స్కం. 10 ఉత్తర. పద్య 177, 178.

సీ. నెలవంకబోమలకుఁ దలఁకి క్రొమ్మొక్కుచున్న,పగిది నానమితచాపములు మెఱయఁ
గలికిచూపులకు భీతిలి డాఁగి నిలిచిన, కైవడిఁ బొదులతూణములమరఁ
గుచమండలములఁ గన్గొని భయంబందెను, రీతిఁ జక్రములు పరిభ్రమింప
నలువొందు రోమావళులకుఁ గాకవడంకు, కరణిఁ బత్త్రంబులు గంపమొంద
గీ. వీరశృంగారములు మేళవించినట్లి, చెలువమున నిందుముఖులు తేజీల నెక్కి
వచ్చి రాహవ మొనరింప వారిలోనఁ, బడఁతియొక్కతె మున్నాడి పాఱుతెంచి.

జైమినిభారతము, ఆ 5 పద్య 111.

# యుద్ధధర్మము.

:0:

క. ఉరుతరబలదర్పంబున, నరిపంచి రణంబు సేయఁ బైకొని పిలువన్
విరుదజితోఁ దలఁగుటకంటెను, మరణం బెంతయును మేలు మగవారలకున్. 1757

భాస్కరరామాయణము, కిష్కిం. పద్య 214.

క. దూతకు వధకంటెఁ గళా, ఘాతము ముండనము నంగకర్తనమంకం
బౌతతదండము లెందును, దూత యవధ్యుండని చెప్పుదురు ధర్మవిధుల్. 1758

,, ,, ,, సుంద. పద్య 453.

చ. వెఱచినవాని దైన్యమున వేఁదుఱునొందినవాని నిద్రపై
మఱచినవాని సౌఖ్యమున మద్యముఁ ద్రావినవాని భగ్నుఁడై
పఱచినవాని సాధుజడ భావమువానిని గావుమంచువా
దఱచినవానిఁ గామినుల జంపుట ధర్మముగాదు ఫల్గునా. 1759

భాగవతము, స్కం. 1 పద్య 155.

క. హీనునితోఁ బగ రణము స, మానునితోఁ జేయఁదగు స♦మాధానము సం
ధానగుణంబులు పగవ స, మానునితోఁ బోలఁగి కొలిచి♦ మనుటయె యొప్పున్. 1759
ఉత్తరరామాయణము, ఆ 2 పద్య 8.

# సముద్రము.

క. శరనిధి రత్నంబులు దివి, కరిగెనొ యని తారకముల♦ నతులోర్మికరో
త్కరములఁ దెమల్చి తెచ్చిన, పరుసున నవవిపులఫేన♦ పంక్తులు నెలఁగున్.
గీ. వనధి నీరెల్లఁగొని పోవఁ♦గని సహింప, కబ్దతతిఁ గిట్టి చుట్టిన♦ నరుగనోప
కోలిదొంతులుగొనిపడి♦యున్నకారు, మొగుళులనఁ జూచితటభూమి♦ మొగుళులమరె.
కుమారసంభవము, ఆ 1 పద్య 117, 120.

మ. అతిగాంభీర్యము గోత్రగోపనము స♦త్త్వాటోపమాహాత్మ్యమున్
హితలక్ష్మీసదనత్వమున్ సతతవృ♦ద్ధిత్రప్రభావంబు ను
న్నతసర్వోత్తరజీవనోదయము నా♦నావాహినీ సౌఖ్య శా
లితయుం జేర్చుఁ జసుక్యనాథునకుఁ బో♦లెన్ జూడ నంభోధికిన్. 1762
కావ్యాలంకారచూడామణి, ఉల్లాస. 3 పద్య 96.

మహాస్రగ్ధర. కనియెన్ గల్లోలమాలో♦త్కరజనితతటా♦క్రాంతడిండీరపుంజం
బును ముక్తావజ్రనీలాం♦బుజమరకతసం♦స్ఫూర్తిసంశోభితంబున్
వనకోలక్రూరదంతా♦వళిమకరధునీ♦వ్యాళమైనాకయుక్తం
బును గృష్ణాజహ్నుకన్యా♦ముఖఘనతటినీ♦మూర్తిభద్రున్ సముద్రున్. 1763
రుక్మాంగదచరిత్రము, ఆ 4 పద్య 127.

సీ. రంగదుత్తుంగత♦రంగసంఘంబులు, సరసాభినయకరా♦బ్జములు గాఁగ
బహువిధప్రచలన♦పాఠీనపంక్తులు, ధవళాక్షిలోలనే♦త్రములు గాఁగ
సురుచిరస్నిగ్ధపాం♦డురఫేనపటలంబు, చారుతరాట్టహా♦సంబు గాఁగ
లాలితభూరిశై♦వలప్రవాళంబులు, విరిసిన ఘనజటా♦భరము గాఁగ

గీ. ఘుమఘుమధ్వనీవాద్యఘో♦షములు గాఁగఁ, జండతాండవాడంబర♦శంభుమూర్తిఁ
బోలునని తన్ను జనములు ♦ పొగడునట్టి, వర్ణనకు నెక్కెఁ యొప్పు మ♦హార్ణవంబు.
పంచతంత్రము, దూ. నా. ఆ 4 పద్య 5.

ఉ. కనియె నగస్త్యుఁడమ్మునిని♦కాయముతోఁ బునరుక్తపానసం
జనితకుతూహలాగమన ♦ సంభ్రమవిభ్రమవన్నిశావలో
కనతరళోర్మిహస్తధృత ♦ కమ్రికణత్ప్రసవావళీసమ
ర్చననియమైకధీనిధి ది♦శావలయావధి నమ్మహోదధిన్. 1765
తారకబ్రహ్మరాజము.

సీ. దరిఁదన్ని తిరిగెడు ♦ తరఁగలు చను దెంచు, తరఁగలు నొండొంటిఁ ♦ దాఁకురవము
గుములుగూడుకకంధ♦రములాకసముడిగ్గి, నీరంబుఁ గ్రోలెడు ♦ నిబిడరవము
మబ్బునఁగసరెత్తి ♦ యుబ్బియంతంతకుఁ, బొరలంగఁబడియెడు ♦ భూరిరవము
నముదినవపూర్వాప♦రాష్టావేళలఁ బోటు, పాడిచివిచ్చినసీటి ♦ ఘోరరవము
గీ. దశదిశాభాగములఁ బ్రతి♦ధ్వనులనీన, వలయశైలాదిగిరిగుహా♦వాససింహ
శరభశార్దూలహృదయభీ♦కరము లగుచుఁ, దనకు నైజంబులుగమించు♦వనధిరాజు
కాళహస్తిమాహాత్మ్యము, ఆ 4 పద్య 60.

సీ. పరితఃపరికీర్ణమై ♦ పతిచినట్లున్నశై,వాలజాలము నీలి ♦ జాలుగాఁగఁ
బ్రిబలిపైఁ బ్రాఁకిన ♦ పవడంపు లతలింపు, దగ్ధవైచినపసిండి ♦ తీగ్లుగాఁగ
బ్రహ్మాండపాటనో♦ద్భటములై మినుముట్ట, ఘోరఘోషములు ఘీం♦కారములుగ
వేలాగహానపక్షి♦కోలాహలము లెల్ల, వారిగట్టిన పాఁజు ♦ నదలుపులుగ
గీ. నెగసి వ్రాలెడు జలజంతు ♦ లెక్కనెక్కఁ, గూలవిసరినఁబటుమావ♦టీలుగాఁగ
నూర్మిరేఖాకరంబుల♦ట్టూఁచికొనుచు, గంధగజలీలఁ గ్రాలుసా♦గరముఁ గాంచి.
రామాభ్యుదయము, ఆ 7 పద్య 38.

సీ. అంజనగిర్యధి♦త్యకశాద్వలస్థలి, పచ్చరాకొణిగెలోఁ ♦ బౌరువంబు
ఖలుతుంగమడువులో♦పలికరేణువువట,చ్ఛదములోనినునుపైన ♦ శౌరిమూర్తి
దానవారియురంబు♦లోనిశ్రీవత్సంబు, భానుజాంతరపద్మ ♦ పత్త్రసమితి
కాదంబవనిఁదోఁచు♦సాదిమశ్యామిక, మింటనంటినసీల ♦ మేఘరేఖ
గీ. యనఁగ నిజమధ్యమున ధాత్రి♦దనర మెఱయు, బహులవాతూల జవముహా♦
ర్మ్యహురుదగ్ర
లహరికాజాలడోలికా♦విహారదంబు, నరవితానంబుజలనిధా♦నంబుఁగనిరి. 1768
చంద్రరామాయణము, ఆ 6 పద్య 88.

సీ. మిన్నందఁ జెరిఁగియు ♦ మేరఁ దప్పక పెక్కు, భంగముల్ గల్గియుఁ ♦ బాఱలేక
సుల్లెన్ని గలిగిన ♦ నుజ్జ్వలముక్కక, యనువయ్యుఁ బరులకు ♦ నలవుగాక
సరివారిలోపల ♦ నురువులఁ గ్రమ్మక, నేలపైఁ బొరలియు ♦ జేలగాక
తనలోన బడబాగ్ని ♦ దరికొనిమండియు, వడగాలిమీలపై ♦ నుడియనీక
గీ. బయలుపడియును దనలోఁతు ♦ బయలుగాక, దిగులుపడిచియు నొండెడ ♦ దిగులులేక
యిసుకకంబైన గుణమణు ♦ లెసక మెసఁగ, నసమరసమయమైనవె ♦ క్కసమువాని.
ద్వాత్రింశత్సాలభంజికాకథలు. అ 2.

సీ. గోత్రాధిపఖ్యాతిఁ ♦ గొమరారియుండుట, సురశైలరాజభూ ♦ సురులఁ బోలి
మకరాంకసంవర్తి ♦ మహిమఁ జెన్నొందుట, గగనకిన్నరవరాం ♦ గజులఁ బోలి
ఘనరసాలంకృతుల్ ♦ గనుపట్టియుండుట, హరజటాసిద్ధకా ♦ వ్యములఁ బోలి
హరిచరణప్రభూ ♦ తాభిముఖ్యంబౌట, జలిదానవనాక ♦ ములను బోలి
గీ. రంగదుత్తుంగచటులత ♦ రంగనటన, భంగకల్లోలజాలసం ♦ భ్రమనినాద
పూరితాశాంతరాళమై ♦ పొల్చుచున్న, పశ్చిమాంబుధిఁ గనియె గో ♦ పప్రభుండు.
అనిరుద్ధచరిత్రము, ఆ 5 పద్య. 51.

ఉ. ఊరక మ్రోయుచుం దెసల ♦ కుద్ధతిఁ దుంగతరంగహస్తముల్
బారలు చాఁపుచున్ నురుగుఁ ♦ దైపయిఁ జూపుచు దుంపుపస్ పడం
బాఱుచుఁ బొంగుచున్ బయలు ♦ ప్రాఁకుచు గట్టులు దాఁటుచున్ సుధా
నీరధి మించెఁ జూడు తరు ♦ ణీ జడభావము మానదెయ్యెడన్. 1771
సమీరకుమారవిజయము.

సీ. ధరణీధరాధిప ♦ తనయాభిరామమై, తారాద్రికై వడిఁ ♦ దనరుదాని
మకరకుళీరాది ♦ మహితమై నీరదా, యనముచందంబున ♦ నలరుదానిఁ
బ్రబలానిమేషప ♦ రంపరాభరితమై, విబుధలోకము రీతి ♦ వెలయుదాని
సర్వతోముఖమహా ♦ సంపత్సమృద్ధమై, యలకాపురము పోల్కిఁ ♦ జెలఁగుదానిఁ
గీ. బ్రస్ఫురత్కంకణోర్మికా ♦ భాసమాన, మగుచు లక్ష్మీకరంబట్లు ♦ తగినదాని
వారిరాశిని జూచి భూ ♦ వరుని తోడ, నలరుచును నర్మసచివుఁ డి ♦ ట్లని యెనపుడు.
దిలీపచరిత్రము, ఆ 2 పద్య. 45.

సీ. జగములు ముంపంగ ♦ సమకొన్నకై వడి, సుక్ష్వేలముగ నుబ్బు ♦ చున్నదానిఁ
బాతాళనాగము ♦ లైప్వఁదేలియాకాశ, గంగలో విహరింపఁ ♦ గడఁగుదాని
నింగిమీఱంగెడు భంగి ♦ నెరయు సముత్తుంగ, భంగసంఘంబులఁ ♦ బరగుదాని
గాలంకషాటోప ♦ కుటిలతరగ్రాహ, బడబాగ్నిఘోరమై ♦ ప్రబలుదాని

గీ. సురఘనధ్వనినుడుగక ♦ మెఱయుదాని, నాతతావర్తభీకర♦మైనదాని
నిబిడవర్షధారాప్రాప్త ♦ నిఖిలసింధు, భూరిజలసముత్సేధినఁ♦బోధిఁ జేరి. 1773

భాస్కరరామాయణము, కిష్కిం. పద్య 760.

ఉ. శ్రీకరబృంద మెంతయు న♦శీతమరీచిమరీచిజాలమై
త్రీకృతధాళధళ్యమయి ♦ తేజరిలన్ నిజనక్షత్రమైన ర
త్నాకరభావ మీజలధి♦యంబుజలోచన చూచితే కనుం
బ్రాకటమై తనర్పఁ దన♦బాహ్యవిభాగమునందుఁ జూపెడున్. 1774

ఉ. ఓలలితాంగిచూడుకడు♦నొప్పెడునీరమునిండు గాఁగఁ దాఁ
గ్రోలి తిమిప్రకాండము శి♦రోవివరంబున వెల్వరించును
ద్వేలపుటూర్ధ్వధారయల♦వేలుపుకేటిపయిం గుతూహల
శ్రీలమరన్న దీవిభుఁడు ♦ చిమ్మెడుచిమ్మనఁ గ్రోవిసిరవన్. 1775

కళాపూర్ణోదయము, ఆ 4 పద్య 193, 194.

సీ. ఈతనిగాంభీర్య ♦ మెట్టిదో కవ్వమై, తిరిగినమందర♦గిరియెఱుంగు
నీతనియౌదార్య ♦ మెట్టిదో యజరామ, రత్వంబుఁగనుసుర♦ప్రతతియెఱుఁగు
నీతనిసంపత్తి ♦ యెట్టిదో సిరిఁగూడి, యిల్లరికమున్న స♦ర్వేశుఁడెఱుఁగు
నీతనిప్రాభవం♦బెట్టిదో వజ్రిని, గణనసేయని నగ♦ఘంబెఱుంగుఁ
గీ. గాక యీతని నోరులశ♦క్యంబె తెలియ, నప్పులెక్కువ భంగము♦ల్చెప్పఁదలఁచు,
లోనిచిచ్చార్పఁగానోప♦లేనివాఁడు, నిక్కమని కొండ లాడినఁ ♦ దక్క వగునె.

వాసవదత్తాపరిణయము, వ. వీ. ఆ 4 పద్య 45.

సీ. అమృతస్వరూపత్వ♦మమరియుండియుఁ దన్ను, భంగజీవనుఁడంచుఁ♦బల్కుకొదవ
ఘనసారసత్వసం♦కలితుఁడై వెలసియు, జడవృత్తి నలజడిఁ♦బడుకొఱంత
సర్వతోముఖవికా♦సస్ఫూర్తి పొగడొంది, యునుగబంధత్వమొం♦దీనతెఱంగు
భువనోన్నతఖ్యాతిఁ ♦ బొంది లచ్చికిఁబుట్టు, చోటయ్యుమడివడు♦చుండువిధము
గీ. మదిని దలపోసి తలపోసి♦మాటిమాటి, కట్టెనిట్టూర్పునిగుడించు♦నటులచటుల
తరతరంగంబులెడనెడఁ ♦ దనరనొనరు, వారినిధిఁగాంచిరప్పుడ♦వ్వారలెదుట.

రఘురామచరిత్రము, పద్య 221.

# నదీవర్ణనము.

౯౦

మహాస్రగ్ధర. ఘనులా రాజన్యసూను♦ల్గనిరెదురఁగృతా♦కాశగంగాపరిష్వం
గను రంగత్తుంగభంగం♦గలితజలవిహం♦గన్సదాశంభుసంగన్
మునిగేహోపాంతరంగన్ ♦ మురహరపదసం♦భూతపూతాంబుసంగన్
జనతాంహోభంగచంగన్ ♦ సగరనృపనుత ♦ స్వర్గసోపానగంగన్. 1778

భాస్కరరామాయణము, బాల. పద్య 343.

ఉ. ముందటఁ గాంచె నంత బుధ♦ముఖ్యుఁడు హల్లకఫుల్లపద్మని
ష్యందమరందపానవిల♦సన్మదభృంగజలత్తరంగమా
కందలవంగలుంగలతి♦కాచయసంగ మరాంగనాశ్రితా
వందితపుణ్యసంగయము♦నన్ భవభంగశుభాంగనక్మిలిన్. 1779

భాగవతము, స్కం. 3 పద్య 167.

ఉ. ఉన్నతరంగభామలలి♦తోభయపార్శ్వములన్ బ్రసన్నమై
యున్నది యుబ్బిపాలుఁగలి ♦ తాయతకంకణమౌక్తికద్యుతి
చ్ఛన్నమృదుప్రవాహములు ♦ సాఁచి చిరాగతుఁబ్రాణనాయకుం
జెన్నుగనిండుఁగౌఁగిటికిఁ♦జేర్చిచెలంగు మృగాక్షికైవడిన్. 1780

శ్రీరంగమహాత్త్వము, భైర. ఆ 1 పద్య 89.

ఉ. జీవనమెల్ల సత్కవిని♦షేవిత మాశయమెల్ల నచ్ఛతా
పావనతాగభీరతల♦పట్టు ప్రచారములెల్ల విశ్వధా
త్రీవలయత్రికాలఫల♦దేశికముల్ నవకంబులెల్ల ము
క్తావళివిభ్రమాస్పదము ♦ లానది పెంపు నుతింపశక్యమే. 1781

వసుచరిత్రము, ఆ 2 పద్య 105.

ఉ. ఫేనసమూహముల్ రుచులఁ♦బెంపగుఁగొజ్జఁగిపువ్వుగుంపులై
కానఁబడంగఁదుంపురులు ♦ గమ్మనిమల్లియలై తనర్పఁబెం
పొనిననుల్లమొల్లవిరు♦లై విలసిల్లఁగ నింపుపుట్టియో
ప్పూనె హరంపుతేనగవు♦పొందఁగఁదుందగునిమ్మహానదిన్. 1782

చిత్రభారతము, ఆ 4 పద్య 43.

సీ. ఉబ్బుబ్రగ్గులగబ్బి♦గుబ్బలుగాఁగ బి,త్తరమైనతరఁగలు ♦ తలులుగాఁగ
వాలుగుల్తొగలుమ♦త్త్యాలపేరులుగాఁగ, మురువగువెల్దమ్మి ♦ మొగముగాఁగ

దోరంపుఁదామర♦తూండ్లు చేతులుగాఁగ, నల తేఁటిచాల్పునూఁ♦గారుగాఁగ
బలులోఁతునుడియొప్పా♦క్కిలిగాఁగ మిక్కిలి, కొమరైనచింపంబు ♦ మతికగాఁగఁ
గీ. గప్పుగలనాఁచుగొప్పైన♦కొప్పుఁగాఁగ, మేఁతలిడిసంచలిరుపంక ♦ మూతిగఁజవ
రాణఁదులకించుపూఁదీఁగె♦వీణెఁగాఁగఁ, బలుకు టెలనాఁగ యమునఁబోలె♦నలరిమఱియుఁ.

యయాతిచరిత్రము, ఆ 2.

సీ. బహుపుణ్యవితరణో♦ద్భటములు తటములు, శ్రితలోకనాకని♦శ్రేణి వేణి
యీషణత్రయజయో♦త్కర్షంబు ఘోషంబుఁ, బ్రశమితాఖిలభక్త♦భయము రయము
దమితోపతాపసం♦తానంబు ఫేనంబు, సంసారశమనపే♦శలము జలము
జ్ఞానదాతపటుప్ర♦సంగముల్ భంగముల్, ఘనమోక్షలక్ష్మిన♦గళ్లుసుళ్లు
ఆ. శంఖములకుఁ బాండు♦జలజకుట్మలములు, మహితవత్సమునకు ♦ మధుపసమితి
పీతవసనమునకుఁ ♦ బృథుపరాగంబులై, మీఱెఁ బెలయ నీక ♦ వేరకన్య. 1784

పరమయోగివిలాసము, ఆ 3 పద్య 96.

సీ. వికసించునెత్తమ్మి ♦ విరిమోము బాగుగాఁ, గలువలు కన్నుల ♦ చెలువుగాఁగఁ
గప్పు మీఱినాఁచు ♦ విప్పు పెన్నెఱులుగా, జక్కవల్ గుబ్బల ♦ నిక్కుగాఁగఁ
బుప్పొడి నెమ్మేనఁ♦బూయు కుంకుమగాఁగఁ, దెల్లని తెరలు కు♦చ్చెళ్లుగాఁగ
బెళుకు బేడిసలు చూ♦పుల మిటారంబుగా, జవ్వాదు నురుగు లే♦నవ్వుగాఁగ
గీ. బహుళవిహగారవము మధు♦పానమత్త, కలకలాయిత మధురవా♦క్యములుగాఁగ
మగని కౌఁగిలి యాపించి ♦ మగువవచ్చు, తీరుఁగనుపించి మించెఁ గా♦వేరి యపుడు.

శ్రీరంగమాహాత్మ్యము, క.వ. ఆ 2.

సీ. కమనీయతరకచ్ఛ♦పములు మీఁగాళ్లుగా, సైకతస్థలికటి♦స్థలముగాఁగ
భానురావర్తక♦భ్రమమది నాభిగా, వరకోకములు కుచ♦ద్వయముగాఁగ
విదితశంఖములయొ♦ప్పిదము కంఠంబుగా, నొగిపద్మములసొంపు♦మొగముగాఁగఁ
దళుకుబేడిసమీలు♦ధవళనేత్రములుగా, వవకమౌ ఫేనంబు ♦ నవ్వుగాఁగ
గీ. ఘనతతనయందు పుణ్యముల్ ♦ గ్గలుగునంచు, వీచికాహస్తములు సాఁచి♦ వేడ్కఁబిలుచు
మేటికామినివిధమున ♦ మెలఁగుచున్న, సప్తగోదావరిని గాంచె ♦ శంబరారి.

ధనాభిరామము, ఆ 2.

సీ. కంజాతవిమతశే♦ఖరజటాకోటీర, కౌబేరవారిజా♦కరమరాళి
ప్రకృతికైతవగవీ♦భరితశివాలయ, క్షితిధరోద్ధతక్షుర♦క్షీరలహరి
కపిలకోపజ్వర♦గ్లపితసాగరసము, ద్ధృతనవ్యదివ్యౌష♦ధీమతల్లి
జాతిమజ్జనకుజ్జ♦నాతిపాతకజాత, దర్దురీసందోహ♦దంధశూకి

గీ. ఆహరిద్వారకాక్షిప♦ర్యంతచార, జటిహితనిమిత్తవిధికృత♦స్ఫటికరథ్య
యగునిది శరణ్యకృష్ణవే♦ణ్యాదిసింధు, జలజదృగ్జాలమూర్ధన్య♦జహ్నుకన్య. 1787
చంపూరామాయణము, ఆ 4 పద్య 69.

సీ. పతితభూభృత్సేవ♦సలుపునర్థాపేక్ష, గలుగు హేలాపతీ♦గతిఁ దనర్చి
తతకబంధస్ఫూర్తిఁ ♦ దనరారు రామసం, గ్రామభీమస్థలి♦కరణినలరి
వేళాభివృద్ధిఁగాం♦చు వాసరముఖ, లక్ష్మీవిలాసలీ♦లలఁ జెలంగి
ముఖభంగవిభ్రమం♦బులు గాంచు నతిశర, త్కృష్ణవృద్ధాంగన♦రీతి మెఱసి
గీ. విమలకమలాంతరభ్రమ♦ద్భ్రమరమధుర, ఝుంక్రియాగీతతానసం♦జననహేతు
భూతతటరుహకీచకో♦ద్భూతశీత, పవనగతిఁ బొల్చు నాసరి♦త్త్రిభువధూటి. 1788
వాసవదత్తాపరిణయము, వ. వీ. ఆ 2 పద్య 8.

సీ. ఆలోలకల్లోల♦జాలదివ్యామృత, సీకరాచ్ఛాదిత ♦ శ్రీనభంబు
తటసముత్కీర్ణసం♦తానాగశీతల, చ్ఛాయాశ్రయానేక♦జనకులంబు
గంభీరకుముదపు♦ష్కరసౌరభాగత, బంభరఝుంకార ♦ గుంభనంబు
నవమృణాళచ్ఛేద♦నవ్యాజవిభ్రమ, కలహంసమిథునవా♦క్కలకలంబు
గీ. విమలసైకతవేదికా♦ఘనుదయంబు, సకలశైవాలజంబాల ♦ సంకులంబు
గౌతమీనామధేయప్ర♦కాశితంబు, గంగ గనుపట్టె నధికమో♦క్షప్రదంబు. 1789
యాజ్ఞవల్క్యచరిత్రము, ఆ 3.

ఉ. క్షోణిప యాతఁడక్కుధర♦కూటశిఖాంతరమందు గాంచె న
క్షీణజలోచ్ఛలన్మృదజ♦శీకరబంధురసింధురార్భక
శ్రేణిని హంసకోకబక♦చిత్రితరమ్యవిశాలసైకత
శ్రోణిని దీర్ఘవేణిని బ♦హుప్రభురాణిని గృష్ణవేణినిన్. 1790
ఆనందసుందరీచాతుర్యవిలాసము, ఆ 2.

సీ. ఏపుణ్యనదిసవీచి♦కాపరంపరసాగ, రస్వర్గసోపాన ♦ రాజియయ్యె
నేపావనతరంగి♦ణీపయోఝర మిందు, ధరుని చేనొఁదలఁ ♦ దాల్పఁబడియె
నేపవిత్రతరామ♦లాపగాంబులవంబు, సోఁకినంతన యఘ♦స్తోమమణఁగు
నేపరిశుద్ధవా♦హినిమజ్జనంబులఁ, దరియింపఁజాలొకాని ♦ తనరుచుండె
గీ. నట్టియమునాసరస్వతీ♦యమళసంగ, రంగదనుపమభూరిత♦రంగపద్మ
రంగనటనామసంగపా♦రంగతుంగ, గంగనాతండుముదమెసఁ♦గంగఁగనియె. 1791
బలరామక్షేత్రమాహాత్మ్యము, ఆ 2.

శా. ఆవర్తోపమనాభియై కమలయై ♦ యజ్ఞస్ఫురద్దేహయై
శ్రీవిజ్ఞానసమగ్రయై కలుషరా♦జీవారిసజ్జ్యోత్స్నయై
యావైరించికిభార్యయై తలఁపఁ ద్ర్యా♦త్యక్షుంప్రవాహాఢ్యయై
యేవిశ్వేశ్వరియొప్పెఁ గృష్ణ ధరలో ♦ నేఁగొల్తుఁ దద్వాహినిన్. 1792

కృష్ణామాహాత్మ్యము, ఆ 1 పద్య 301.

సీ. తటమహాఘకుటవార♦చటులాళిపటలాఖ్య, నటజాలగానము♦త్కటముగాఁగఁ
గమనీయవిమలాబ్జ♦గమనాధ్వతమహంస, రమణీవిరావము ♦ త్క్రమముగాఁగ
లహరీచరహితాప్తి ♦ సహసోద్ధబహుచక్రి, మహిళానినాదమా♦గ్రహముగాఁగ
నిరతోదకరతాగ్ర♦సరరామతరుణశ్రీ, పరవప్రపంచము♦త్తరముగాఁగ
గీ. నళికిచూచుచునుకద♦స్నెలఁజరించు, పూనిమాణవులొప్పని♦ప్పైనదాని
గౌతమీనదిఁగాంచితే♦కమలముకుల, సదృశవక్షోరుహాప్వయీ ♦ సన్నుతాంగి.

సత్యకామదాపరిణయము, ఆ 2.

# నదీనామవిశేషములు.

సీసమాలిక. గంగ సరస్వతి ♦ కాళింది గౌతమి, చిత్రోత్పల విశాల ♦ శీత చంద్ర
భాగ కావేరి వి♦పాశ సితాలక, శీతలవాహిని ♦ సింధు సరయు
గిరి విరావతి గండ♦కి దశార్ణ కృష్ణవేణిక శంఖమాల దే♦విక తృణఘ్ని
బహుళ విశాఖిని ♦ బ్రహ్మభాగ సురస,వాలుకావాహిని ♦ వర్ధమాన
శోకాపఘాత పి♦నాకినీబాహుదా వక్రి, పర్ణివలని తామ్ర♦వతి విత్రస్తు
నర్మదబాహుక ♦ నందచిత్రిత యుత్పలావతి కపిల మా♦ల్యవతి త్రిదివ
లక్షణ హరిణి క♦లాంగలిని త్రినాభు, ద్యుమతి కుముద్వతి ♦ తుంగభద్ర
ఋషితజితాపగ ♦ ఋజ్వభద్ర సునంది, భృగువరగండకి ♦ భీమరథి మ
హాజలగోమతి♦హంసావళీశ్వర, గండకహరిగండ♦క శతభద్ర
బ్రహ్మగండికనీల ♦ పద్మావతీశావ,తి హిరణ్యశాఖావ♦తి హిమక్రౌంచ
హరితలమానస ♦ హంసకంబు సుమేఘ, సౌభద్ర కౌశికి ♦ చక్రధార
శ్యామమహోత్కట♦సోమమహావక్రి, శౌక్తిపాశావతి ♦ చంద్రమత్త

పంచగంధ్యరుణప్ర♦భాంజని వలరవ, వజ్రవాలుకశూక ♦ వరుణవక్త్రి
పంచమహామాయి ♦ ఫల్గుణిసురకర్త్రి, షధనుష్మతి వితస్త ♦ చంద్రవక్త్రి
స్కందావతి సమూల ♦ చక్షుకదంజక, పుండరీకపయోష్ణి ♦ భూతపాద
కూటవైఘయుంజితత్రి♦కూటవేదవతిన,క్రవతి వేగవతి వే♦త్రవతి గర్భ
వతి యంత్రినందియుం ♦ గృతమాలకృష్ణపా,దజయంతివందశా♦త్రాఖ్యాశుక్తి
మతిశూరిధృతినువ♦ర్ణతటీమణిప్రభా,ప్లక్ష కుజల పిప్ప♦ల శుచిసింధు
వర్ణకాశ్యపి మణి♦కర్ణిక మందాకి,ని మలప్రహారి సా♦నుమతి క్షీర
కౌమోదకీ సఖీ♦మోదితకరతాల, వేదత్రియి మయూఖి ♦ విలయవిదిత
భవనాశనియుసర్వ ♦ పాపహకటికక్షి, పోత్రిదవేదస్మజం♦బూరకుంభ
కరణిత్రిసంధ్యయు♦గాయత్రిబుషికుల్య, ప్రభవిష్ణువువికూట ♦ రత్నకృష్ణ
తోయపాపఘ్నవి♦ద్యుతధౌర్గ్యసర్వదా, వైణ్ణధృష్టిద్యుతి ♦ వందవార
శీఘ్రోదయుంబ్రిణీత♦చెర్యేరుగుండ్లక,మ్మయుంగుంద మొదలుగా♦మహీందనర్ద్య

గీ. పుణ్యకూలంకషాబృంద♦ముల నమంద, వికసదరవిందగంధిల ♦ విమలకమల
ఘురరవంబుల నురుభక్తి ♦ జలకమాడి, సకలదానాదిసత్క్రియల్ ♦ సలిపెనంత.

హంసవింశతి, ఆ 4 పద్య 205.

ఆ. శర్మ కృష్ణవేణి ♦ నర్మద గౌతమి, గంగ పెన్నయలక ♦ తుంగభద్రి
సహ్యతనయయమున ♦ సప్తగోదావరీ,తీరముల మునింగి ♦ తిని వెలంది. 1795

సత్యభామా పరిణయము, ఆ 2 పద్య 49.

# సంగీతము.



సీ. అమృతంపుసోనపై ♦ నడరినక్లైపాట, చెన్నైన మోరల్లం ♦ జివుళులొత్తె
మారుతాహతిపేర ♦ భ్రమరకులు దలయూంపం, దొడంగె మరందమా♦ధుర్యమునకు
నింపులగనియైన ♦ యీరాగరసముద్రం,గలకుం గోరకపుల♦కముల నొసంగె
సెలయేరులమనశుభ్రి ♦ జలములుదొరంగించె, గిరులునుమంజుల ♦ గీతింగరంగె

ఆ. ననినంబోలుంజొసంగు♦నగుం దగు ననంగ స,చేతనంబులెల్లం ♦ జిత్రరూపు
లట్టుసోగినిలువ ♦ నంగనయొక్కతి, పాడంగల మనోజ♦భంగు లలర.

నృసింహపురాణము, ఆ 2 పద్య 83.

క. తేనియ మనురో యమృతపు, వానయొ పుండ్రేక్షురసము ♦ వఱ్ఱోడిన పే
ల్లో నాఁ దుంబురునారద, గానరసం బభవ్రనోల♦గంబునఁ బర్వెన్. 1797

నన్నెచోడ కుమారసంభవము, ఆ 9 పద్య 235.

సీ. ప్రౌఢితో సరిగమ♦పధనిస్వరంబుల, ప్రతినియతశ్రుతి ♦ క్రమము లెఱిఁగి
రాగభేదములవ♦స్థములఁ దొలంగించి, లయతాళశుద్ధిసెం♦తయుఁ జలిర్ప
గాత్రమవికేవమూ♦ర్ఛనలేర్పడఁగ మంద్ర, మధ్యమతారసా♦మగ్రి పసర
ధాతుమాతువ్రలుగీ♦తప్రబంధములందు, నసమానలీలమై ♦ నతిశయిల్లఁ
గీ. వారమగు పేత్రిమరసమునఁ ♦ దోఁచితోఁచి, వీనులకు నింపుఁ జలువగా♦ విస్తరిల్ల
నాకరణిఁ జనకాంత య♦నేకగతుల, నాత్మగుణగానములు సేయ ♦ నచ్యుతుండు.

కళాపూర్ణోదయము, ఆ 2 పద్య 33.

సీ. బహువిధాలంకార ♦ పర్యాప్తి చిత్తముల్, గరఁగించుటను వార♦కాంతఁ బోలి
పటుతరాలాపసం♦బంధప్రబంధని,ర్వాహణమై ఖరిఁగవి ♦ వాణిఁ బోలి
మహితాంగరాగసం♦పత్తిగాత్రమస్ఫూర్తి, బహుళమైన నృపుని వై♦భవముఁ బోలి
వరతారకాంతర♦స్ఫురితవాసపాత్రిధిఁ, దగి మహాయోగికృ♦త్యంబుఁ బోలి
గీ. వెండియు భుజంగమోహనో♦ద్వేలరక్తి, జాలమాధుర్యగతి మించి ♦ రాలు వెలయ
పారవశ్యైకహేతువై ♦ పవననూను, మానితానూనపల్లకీ♦గాన మమరె. 1799

సమీరకుమారవిజయము, ఆ 6 పద్య 209.

గీ. సరసవై ఖరిషడ్జమ♦స్వరసరాగ, సరణిఁ బాడిన మది భయ ♦ సంభ్రమములు
గలిగి భ్రమసెందు పున్నాగ♦గణము లెల్ల, న్యాయమున నప్పుడే పయన♦న్యాయమయ్యె.

సీ. సరససారంగాతి ♦ శయనిరూఢిఁ దనర్చెఁ, బున్నాగవైభవ♦స్ఫూర్తి నలరె
రమణీయరూపవ♦రాళి సంగతి మించె, శంకరాభరణసౌ♦ష్ఠవముఁ జూపెఁ
గరిమ కళ్యాణమై♦ ఖరులు గానఁగనయ్యె, ఘనమేఘరంజని ♦ కర్మిమత నమరె
మంజులశ్రీరాగ ♦ మంజరి సిరులబ్బె, హితజగన్మోహనా♦కృతి వహించెఁ
గీ. గలికి దృఙ్నాభి చూర్ణకుం♦తలవితాన, రోమరేఖాపఘనకచ♦స్తోమకుచవి
లాసమహిమాతిశయముల ♦ లలితగీత, కృతకవిద్యాధిదేవతా ♦ కృతి నటించె.

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 2.

మ. అనురాగాంకురకందమై కృతమనో♦జ్ఞానందమై మాధురీ
ఘనసంపత్పరిణింది తామృతఝరీ ♦ కల్పప్రసూనాలి నా

తనసరిజాతమరందమై శ్రుతిపుటాం♦తఃప్రీణనామందమై
చనరున్ మంజులగాన మెవ్వరిది యు♦త్సాహంబుపుట్టున్విన న్. 1802
సుమనోమనోభిరంజనము, ఉల్లాస. 1 పద్య 101.

---

## రాగవిశేషములు.

:o:

సీ. భైరవి మాళవి♦ బంగాళ హిందోళ, రాజమంజరియు శ్రీ♦రాగగౌళ
భూపాళ లెన్మిది♦ పురుషరాగంబులు, దేశాక్షి ఘూర్జరి♦ దేశితోడి
దేవక్రి యాందోళి♦ దేవగాంధారియు, గౌళ గుండక్రియా♦హారిసలలి
త బిలాహరికురంజి♦ ధన్యాశి పూర్ణగౌ,ళ వరాళి నాట భ♦ల్లాతకి మల
గీ. హరులు సారంగరామక్రి♦యలు ననంగ, గన్నడయనంగ మంగళ♦కౌశికియన
వెలయు నారాయణియుఁజతు♦ర్వింశతివిధ,ములనుదనరారు స్త్రీరాగ♦ములనుమతియు.
సీ. కాంభోజి కేదార♦గౌళ శోకవరాళి, పున్నాగ గుమ్మకాం♦భోజి శంక
రాభరణము మేఘ♦రంజి తోడి వరాళి,నాదనామక్రియ♦ నాట రీతి
గౌళ రామక్రియ♦ మేళరామక్రియ, గౌళనారాయణ♦ గౌళ మధ్య
మావతియు ముఖారి♦ మలహరి సామంత, వంతువరాళియు♦ బౌళి రాగ
గీ. చెంచుమలహరి దేశాక్షి♦ శ్రీవరాళి, మాళవియుఁబాండిసింధురా♦మక్రియయువ
సంత సామంతశుద్ధవ♦సంత గుజ్జ, రియును హేజిజ్జినీలాంబ♦రియు ననంగ. 1804
గీ. పొసఁగ ముప్పదిరెండున♦పుంసకములు, మాళవశ్రీయనంగను♦ మలహరి యన
దేవమలహరి రేగుప్తి♦ దిరమూకుంద, మలహరన సైదుమిత్రలీ♦ మర్మమరసి. 1805
హంసవింశతి, ఆ 5 పద్య 123, 124, 125.

---

## వీణలనామములు—వీణ.

:o:

ద్విపద. రావణహస్తంబు♦ బ్రహ్మవీణయును, లావణ్యవీణ కై♦లాసవీణయును
యాకాశవీణ పి♦నాకివీణయు వి,వేకింపసారంగ♦ వీణయుఁ గూర్మ

వీణయు స్వాయంభు ♦ వీణయు గౌరి, వీణయుఁ గిన్నర ♦ వీణయు జనక
యనునవి మొదలుగా ♦ నంమలోమున్ను, ధ్వనియించినట్టియా ♦ దండియడిగిచి.

బసవపురాణము, పా. సో. ఆ 4.

సీ. తళుకునీలపుదట్ట ♦ ములువోలెనీవలు, గానంగఁ బసుసుబ్బ ♦ కాయ లమర
రతనాలపూసల ♦ రాజిల్లెడుసిరాజి, పగడంపుమెట్టుల ♦ జిగివొలంకఁ
బ్రిమకరాగలతాంకు ♦ రములుగ్రాఁకినలీల, మెఱుఁగారుతంతులు ♦ మీటుచూప
ఘుమఘుమధ్వనినించు ♦ కొ్రివ్వినయపరంజి, కళుకులయనుసుల ♦ యొళుకుదనర

గీ. జీవరత్నంపుమేరువు ♦ చికిలికెంపు, బిరడలు గరుడపచ్చల ♦ కరివెజీని
వ్రాఁతపహాంబట్టుగవిసెన ♦ రాజనరు, వీణయొకయింతినిల్పెన ♦ వెలఁదియెదుట.

వాల్మీకిచరిత్రము, ఆ 3.

---

# వీణావాద్యము.



సీ. తతనితంబాభోగ ♦ ధవళాంశుకములోని, యంగదట్టపుఁగాంతి ♦ రంగువలన
శశికాంతమణిపీఠి ♦ జాజునాఱఁగఁగాయ, లుత్తుంగకుచపాళి ♦ నత్తమిల్లఁ
దరుణాంగుళీధూత ♦ తంత్రీస్వనంబుతో, జిలిబిలిపాటము ♦ ద్దులునటింప
నాలాపగతిఁజొక్కి ♦ యరమోడ్పుఁగనుదోయి, రతిపారవశ్యవి ♦ భ్రమముఁదెలుపఁ

గీ. బ్రౌఢిఁబలికించుగీతప్ర ♦ బంధములకుఁ, గమ్రకరపంకరుహరత్న ♦ కటకఝణఝ
ణధ్వనిస్ఫూర్తి తాళమా ♦ నములుగొలుప, నింపుదళుకొత్త వీణవా ♦ యింపుచుండి.

మనుచరిత్రము, ఆ 2 పద్య 27.

సీ. వలుదగుబ్బలుపైసే ♦ వకప్రవృత్తిఁ దగుగుబ్బ, కాయలకపరంజిఁ ♦ చాయ లొసఁగ
లలితాంగుళీదళం ♦ బులుసమేళములైన, సారెలపైఁ గ ♦ సంపద లీడఁ
బాణికంకణయుతుల్ ♦ ప్రాణానుబంధంబు, గలతాళగతికను ♦ గ్రహములీన
నాలాపభంగియ ♦ త్యక్తసంవాది స, మస్వరంబులకు గ్రా ♦ మంబు లునుపఁ

గీ. బ్రిచురతానామృతములమూ ♦ ర్ఛనలచేన, చేతనంబులు చేతన ♦ రీతిఁ దనరఁ
జేతనంబు లచేతన ♦ భాతినొనర, వీణవాయించు నొకయలి ♦ వేణిఁగంటి. 1809

మనుచరిత్రము, ఆ 2 పద్య 30.

సీ. తతకాంతికుముదబాం◆ధవకాంతమణిగణం, బులసాంద్రవిమలాంబు◆వ్రలు జనింప
వనసీమసంచరి◆ష్వరమదత్యామినీ, వితతులునిశ్చలా ◆ కృతులుగాఁగ
శయకంకణోత్పన్న ◆ ఝణఝణారావంబు, తాళమానంబులై ◆ తనరుచుండ
సకలభూజోల్లస◆చ్ఛారికాశుకపికా, ళులకుసం◆తోషమై ◆ చెలఁగుచుండ
గీ. సారెసరిగమపధనిసం◆జ్ఞాస్వరముల, కలితలలితాపరూపరా◆గములనెల్ల
వెలయ నాలాపములసల్పి ◆ చెలులచెంత, నెలమిఁగొలువంగ వీణావా◆యించుచుండె.

రంభానలకూబరవిలాసము, ఆ 3.

సీ. కొల్లివ్వాఁడికొనగోళ్లఁ ◆ గ్రుచ్చి తంత్రులుమీటు, నంచంబు మదిజల్లు◆మని కలంప
మురిపెంబుగాఁబల్కు ◆ ముద్దు పలుంగున, కల్లనఁగోయిల ◆ లరుగుదేర
సారములుకలిపించి ◆ సొగసుగాఁ బలికించు, వింతకు జాతెల్ల◆వెసఁ గరంగ
హాయిలుగాఁబాడెడు ◆ నొఱపైనపాటకుఁ, జేరువమోదులు ◆ చిగురు వెట్టఁ
గీ. దానవెన్వడిఁగవ్వడి ◆ పైనిమున్ను, గూరిచిన తేటపాటను ◆ గూర్మి మీఱ
వీణె మీఁదను హాయిగా ◆ వెలఁదిమిన్న, వింతగాఁబాడఁ జొచ్చెను ◆ వీను లలర.

రసికజనమనోరంజనము, ఆ 3 పద్య 43.

# మృదంగవాద్యము.

ద్విపద. ఆరీతివచ్చిన◆యల్లమప్రభువు, పారిమద్దెలయూరు ◆ ఫలకంబునందు
సంధించి బంధించి◆సప్త తాళముల, బంధురగతులుత◆ప్పకయుండ శ్రుతులు
కూడంగఁ గుడిచేతఁ ◆ గొట్టుచుముద్దు, కూడుదావటికంటఁ ◆ గూడహత్తించి
పరిపాటిగా చిమ్మ ◆ పైతాతఁబొడిచి, కరవేగమునవాద్య ◆ కౌశల్యమెసఁగ
నందికేశ్వరునట్లు ◆ నాల్గుఖండలను, బొందుగాఁగ బ్రమాణ◆ములు వినుపించె.

ప్రభులింగలీల, పి. బ. అ 1 గతి 4.

సీ. తత్తరిదొడుగుడాం◆తరికిటిదొడ్డుగుడాం, దొడ్డుతకతకతక◆తోంధిమికిటి
ఢిక్కతోంధిమిధిమి◆తకప్పఝుంతరికిణ్ణ, ధింధిమద్ధిమధిమ◆ద్ధేయటంచు
స్వరవిన్నేత్రోత్తర ◆ శతతాళగరిమయు, న్నూళాదిభేదవి◆స్ఫూర్తియుఁదగఁ
బ్రస్తారతావ్యాప్తి ◆ పారీణతల్లుమీఱఁ, జక్కణిప్రాబంధ ◆ సరణులబ్బ

గీ. మర్దళంబులు మ్రోయించి ♦ మఱియు వేఱ, వాద్యవిద్యావిశేషంబు ♦ వఱలుచుండ
గానములు చేసి రప్రదేశ ♦ కాలమునను, వెలసె బుధపంక్తిసన్నిధి ♦ విరళగతిని.
కిరాతార్జునీయము, ఆ 3 పద్య 83.

# నృత్యము—అభినయము.



సీ. శృంగారమే పార ♦ నంగవల్లికయందు, గీతసామగ్రియం ♦ గీకరించి
కరతలామలకంబు ♦ గాఁ గరాంబుజముల, నర్థమాద్యంతంబు ♦ నభినయించి
భావింపనరుదైన ♦ భావమర్మంబులు, మెఱుఁగుఁజూపులలోన ♦ మేళవించి
తాళమానములతోఁ ♦ దాళనిర్ణయలీలఁ, జరణపల్లవముల ♦ సంగ్రహించి
గీ. యఖిలమును మెచ్చఁ బ్రత్యక్ష ♦ మైనయట్టి, నాట్యవిద్యాధిదేవత ♦ నాఁ దనర్చి
భరతశాస్త్రమర్మజ్ఞతా ♦ ప్రౌఢి మెఱసె, నూర్వశీకాంత వేల్పు పే ♦ రోలగమున.
విక్రమార్కచరిత్రము, ఆ 2 పద్య 91.

చ. వెనుకకు మొగ్గవ్రాలి కడు ♦ విన్నను వొప్పఁగఁ దొట్టి నీళ్లలో
మునిఁగి తదంతరస్థమగు ♦ ముంగర ముక్కునఁ గ్రుచ్చుకొందు లే
చెనురసనాప్రవాళమున ♦ శీఘ్రము గ్రుచ్చెను వల్లపూసపే
రనుపమలీల నిప్పుడు చు ♦ పాయము లిట్టివి యెట్టునేర్చెనో. 1815
క్రీడాభిరామము, పద్య 146.

సీ. సవ్యహస్తంబర్థ ♦ చంద్రాభినయముతోఁ. గౌనంటి కటితటిఁ ♦ గదియఁజేర్చి
కొనగోళ్లనుదుటఁ గ్ర ♦ మ్మిన పెంజెమటమాటి, మాటికిఁ దిగిచిపో ♦ మీటికొనుచుఁ
జనుకట్టు విప్పఁజా ♦ ట్టునఘనస్తనకాంతి, చల్లించియుంకము పై ♦ వెల్లివిరియఁ
గోపఘూర్ణితమైన ♦ కోదమనాగము వోలె, నలఁతినిట్టూర్పునం ♦ దందనిగుడ
గీ. నలసవళితంబులైన క ♦ టాక్షవీక్ష, ణాంచలంబులు యువధైర్య ♦ కంచుకములు
చించి చీకాకుపఱచి వి ♦ సంచుఁజేసె, రామ నర్తనకేళీవి ♦ రామవేళ 1816
వైజయంతీవిలాసము, ఆ 1 పద్య 91.

సీ. అర్థాభినయవేళ ♦ నంగరేఖారూఢి, గల్లకెల్లవిజాతి ♦ గానికోపు
కడకట్లరెడుశక్తి ♦ కారగౌరవముక్తి, మొరయుగ్గడించుచో ♦ ముద్దుపలుకు

లయఁగయికొనుచోట ♦ లాస్యహావప్రౌఢి, యాదిగూడినచోటి ♦ యందగింపు
జతియెత్తి కొలుచో ♦ జతిగస్న పొజలిక, తీరుమానముచోటి ♦ తేటసొలపు
గీ. కాంతఁగనువారి నెరుఁగాఁ ♦ గరచి వైచె, నున్న యన్నాట్యపాటవం ♦ బుండనిమ్ము
పాటలో మోదయొకపాటఁ ♦ బాడఁబాడ, మాటకమ్మరొ మ్రోటుమాన్ ♦ తేటలొత్తె.

సీ. చరణానుచితవాద్య ♦ మురజి నెత్తఁగఁ జూచు, వాల్యాపుమరుతూఁపు ♦ వాఁడిదిద్దఁ
దెత్తెయ్యటంచు ధా ♦ త్రికిఁ జూపు పదఘాత, మెంతనైష్ఠికుఁడైన ♦ నెదకుఁ గోరఁ
బదవాక్యదృక్పూర్వ ♦ బాహాభినయలీలఁ, దముఁ బిల్చుటయె కాఁగఁ ♦ గమను లెంచఁ
గదలెనో గపలదో ♦ నుదతి పుటాలమే, నవురంచుఁ బ్రజ చూడ్కి ♦ కౌఁగిలింపఁ
గీ. జేటికాశయధాటికా ♦ చేదగళిత, లలితతాళావసానోల్ల ♦ లత్కపోల
ఘర్మజలకణకైంకర్య ♦ కలనకొప్ప, నతనుఁడత్తన్వినృత్తాన్వి ♦ తతఁ జెలంగె. 1818
బహులాశ్వచరిత్రము, ఆ 5.

సీ. సంయుతాసంయుత ♦ సంజీవహస్తముల్, పదుమూఁడు నొకయిరు ♦ వదియు నాల్గు
త్రింశద్గణంబున ♦ నృత్తహస్తంబులు, నైదువక్షంబులు ♦ నైదుఘటలు
స్కంధంబు లాఱును ♦ గంధరల్ తొమ్మిది, జానువులేడు పా ♦ ర్శ్వంబు లేడు
నుత్తమాంగంబు లే ♦ కోనవింశతి దశ, బాహుల్ త్రికుక్షులుఁ ♦ బదము లాఱు
గీ. స్థాయిదృష్టు లెనిమిది సం ♦ చారిభావ, దృష్టు లిరువది రసదృష్టు ♦ లెనిమిదియును
బొంకముగఁ జూపి వింతకో ♦ పులు సెలంగ, నాడఁగలిగినఁ గలహించఁ ♦ బాడి నీకు.
వాల్మీకిచరిత్రము, ఆ 3.

క. రాణంగురుజులు శతముఖ, బాణంబులు మఱియుఁ జక్రి ♦ బాణంబులుఁ దే
ల్పాణములు గాల్పభోగము, గాణలు నాట్యంబు సలుపఁ ♦ గాహళా యలారన్. 1820
కవిజనచకోరచంద్రోదయము, ఆ 4 పద్య 209.

సీ. ఘారుడంబును శుద్ధ ♦ పద్ధతి బహురూప, లక్షణంబులు పండ ♦ లాస్యములును
బెక్కణపద్ధతి ♦ పేరణాపద్ధతి, కుండలీనృత్తంబు ♦ భాండికంబు
రాసకాఖ్యము నాట ♦ రాసకంబును జిత్ర, పద్ధతియును దేశ్య ♦ పద్ధతియును
జర్చరీకందుక ♦ చానరికోలాట, ములు నాఁగఁదగు పేళ్లఁ ♦ గలుగునట్టి
గీ. షోడశంబగు నృత్తంబు ♦ చొరవ లెఱిఁగి, సరవిఁ జంచుపుటంబును ♦ జాంపుటమును
ధ్రువము మధ్యము రూపక ♦ త్రిపుట జంపె, యేకతాళాటతాళాదు ♦ లెల్ల నెఱిఁగి.
హంసవింశతి, ఆ 5 పద్య 122.

సీ. అన్యోన్యహస్తదం♦డావృత్తులెసఁగఁగ నొం, డొరులసామ్యమ్ము లిమ్ముఁ ♦ గొందియొండె
యీవలావలవచ్చి ♦ యితరేతరముదోల్తు, నిల్చినచెలువ్రల ♦ నిలిచి నిలిచి
కంకణమంజీర ♦ కాంచికల్ మ్రోయ స,వ్యాపసవ్యస్ఫూర్తి ♦ చూపి చూపి
తాళవాద్యరవానుఁ♦గుణంబుగా మండ, ద్రుతమృదుగతులను ♦ జరిగి తిరిగి
గీ. యనుపమరసోదయంబున ♦ నభినవాత్తి, చిత్రవర్తనభంగులఁ ♦ జెలఁగి చెలఁగి
విడివడినమన్మథోన్మద♦ద్విరదములన, సఖులుహల్లీసకముసల్పు ♦ సంతసిల్లి. 1822

ఉత్తరరామాయణము, ఆ 6 పద్య 140.

సీ. అలఁదినబోనంపు♦బోలపంబుచే ధిమిం,ధిమిళద్దమెలయ మ♦ద్దెలరవంబు
ఝంఝుఝంఝున మ్రోయ♦కాంస్యతాళధ్వనుల్, కలమంజులవిపంచి♦కావిశేష
కాకలీకలనంబు♦లేకలీలఁగనెంచఁ, గలయుపాంగశ్రుతిఁ ♦ గలసి మెలసి
కంకణఝణఝణల్ ♦ కాంచికాఝుఝుఝుణల్, గజ్జెలఘుళఘుళల్ ♦గడలుకొనఁగ
గీ. నాగవాసంబు మోసల ♦ నాగవాస, నాకవాసవిలాసిను♦ల్నాఁగ వాసి
సరసలాస్యంబు రసములా♦స్యములఁ దోఁప, నెఱపె నరపాలపర్యండు♦నిరుపమముగ.

రామరాయవిలాసము, ఆ 3 పద్య 181.

గద్య.

శ్రీ పరమేశ్వర కరుణాకటాక్షలబ్ధ సుకవితావిలసిత
చరణజకులసంజనిత, దాసరి కోండయార్యాఖ్య
సుజనసుత, పీఠికాపురప్రభుపోషిత, సకలజన
విధేయ, లక్ష్మణనామధేయ సంకలితం
బైన వ్యాసరత్నాకరమునందు
ప్రథమభాగము
సంపూర్ణము.



శ్రీ

పరమేశ్వరాయనమః

# వర్ణనరత్నాకరము



## ద్వితీయభాగము.



## ప్రకీర్ణకములు



### పరతత్త్వస్తుతి



యన గౌరినాఁబరఁగు ◆ చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహ◆రంబగురూపముఁ దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని ◆ పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పర◆తత్త్వముఁగొల్చెద నిష్టసిద్ధికిన్. 1824

భారతము; విరాటపర్వము. ఆ 1 పద్య 1.



# విష్ణుస్తుతి.



ఉ. వీంగుణపారసత్త్వగుణ ♦ విస్ఫురణం బరమేశ్వరోరువా
మాంగమునందు మున్నుదయ♦మై నియమస్థితిఁ గొల్చి తద్దయుం
లోంగొని పేర్మితో నఖిల♦లోకములుం దగఁ గాచు చున్నవే
డాంగు ననంతు విష్ణుఁ గమ♦లాధిపుసంస్తుతిఁ దేలె సమ్మతిన్. 1825

నన్నెచోడ. కుమారసంభవము, ఆ 1 పద్య 4.

సీ. పన్నగంబులరాజు ♦ పగవాఁడుఁగూడి నీ, శయనంబుఁ బయనంబు ♦ సంతరింప
దుగ్ధవారాశికూఁ♦తురు నాలుఁ గూడి నీ, శరణంబుఁ జరణంబు ♦ సవదరింపఁ
దామరపగవాఁడు ♦ దయితుండుఁ గూడి నీ, బడిచూపుఁ గుడిచూపుఁ♦బరికరింపఁ
జందురుచెలికాఁడు ♦ సైదోఁడుఁ గూడి నీ, యుల్లంబు మొల్లంబు ♦ నుపచరింపఁ
గీ. గంపమానమనోధ్యాన ♦ గతులు మావ, కేకతంబున్న మునులకు ♦ నేకతంబు
లేక పొడగానవచ్చు నీ ♦ లీల గాన, నన్యులేనాఁటి ధన్యులే ♦ యంబుజాక్ష. 1826

ఉత్తరహరివంశము, ఆ 1 పద్య 119.

సీ. తొమ్మండ్రుకొడుకులఁ ♦ దొలిచేలుపులఁ జేయఁ, బొడమించు నేదేవు♦బొడ్డుఁదమ్మి,
మూఁడుత్రోవలఁబాఱి ♦ మున్నీటిగరితగాఁ, బరగు నేదేవుని ♦ పాదతటిని
పండ్రెండురూపులై ♦ పగలింటిరాజుగా, వలఁతి యేదేవుని ♦ వలనికన్ను
వేయిమానికపుదీ♦వ్యలతోడఁ బడగలు, దాల్చు నేదేవుని ♦ మలకపాన్పు
గీ. మునులకెల్ల నేదేవుని ♦ మూర్తి వెలుఁగు, హృదయగేహంబులో దీప ♦ మెత్తినట్లు
హరి మురారి యద్దేవు మ♦హానుభావు, మనసులోఁ గంటి భవములు♦మానునంటి.

సీ. పుండరీకములతోఁ ♦ బురణించుకన్నులఁ, గారుణ్యమను తేనె ♦ గడలుకొనఁగ
మందారశాఖతో ♦ మలయఁజాలెడుకేలఁ, బాంచజన్యంబను ♦ పండు మెఱయ
నుదయాద్రితటముతో ♦ నుద్దించు నురమునఁ, గౌస్తుభం బను దివా♦కరుఁడు దోఁప
నాకలోకంబుతో ♦ నవ్వుపాదంబున, నాకాశనదియను ♦ నమృత మొప్ప
గీ. నమృతధారాధరము మాట♦లాడినట్లు, భాగ్యదేవతరూపు చే♦పట్టినట్లు
లలితగతినున్న సద్గుణా♦లంకరిష్ణు, విష్ణుఁ బొడఁగంటి భవముల ♦ వీడుకొంటి. 1828

ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 144, 146.

చ. కలుములకొమ్మనున్ సతముఁ ♦ గాంచఁగ ఱొమ్మున నుంచి యామెపై
వలపుదలిర్ప హారము ల♦వారణతో సవరించు నేర్పునం
గులుకుమిటారిగబ్బివలి♦గుబ్బచనుంగవఁ గేలఁ గూర్చి తాఁ
గిలకిలనవ్వు శౌరి మముఁ ♦ గేవల సత్కృపఁ బ్రోచుఁగావుతన్. 1829

ఒడయనంబివిలాసము, ఆ 1 పద్య 18.

సీ. దండంబు శార్ఙ్గకో♦దండోగ్రకాండప్ర,కాండఖండిత దైత్య♦కాండ నీకు
జోహారు మదగజ♦ద్రోహగ్రహావహ,గ్రాహచ్ఛిదాహవో♦త్సాహ నీకు
వందనం బరవింద ♦ మందిరామందిర, త్సుందరోరస్స్థలా♦లింద నీకు
జేజే హరాజాది ♦ రాజీవభూజాస, మాజోచితాంఘ్రిపం♦కేజ నీకు
గీ. బహునమస్కారములు చక్ర ♦ పాణి నీకు, నైకసాష్టాంగములు జగ♦న్నాథ నీకుఁ
బ్రణతిశతములు సురసార్వ♦భౌమ నీకు, నంత సేవాంజలులు సదా♦నంద నీకు.

ఉత్తరరామాయణము, ఆ 1 పద్య 322.

ఉ. ఎప్పుడు ధర్మహానియగు ♦ నీధరణీస్థలి నాక్షణంబునం
దప్పక మాటిమాటి కవ♦తారము లెత్తుచు సాధుకోటిమే
లొప్పఁగ నుద్ధరించి కుజ♦నోద్ధతిమాన్పిన విష్ణుమూర్తి మా
యప్ప కృపాపయోనిధి ని♦రంతరసౌఖ్యము మాకు నీవుతన్. 1881

బ్రహ్మోత్తరఖండము, ఆ 1.

ఉ. హరికిరీంద్రవిగ్రహవి♦హారికి నాశ్రితబృందదుఃఖసం
హారికి ధూతదేవవిప♦హారికి కాన్తిభసంజ్వలన్మణీ
హారికి హస్తపద్మగమ♦హారికి సాగరబాలికామనో
హారికి వాహనత్ఫణవ♦హారికి శౌరికిఁ గేలుమోడ్చెదన్. 1832

రాఘవపాండవయాదవీయము, ఆ 1.

సీ. వందన మిందిరా ♦ సుందరీహృదయార, విందమధ్యచరన్మి♦ళింద నీకు
నంజలిసజ్జన ♦ పుంజమస్తరవివ,ద్భంజనాధీనహృ♦త్కంజ నీకు
దండము భుజగజ ♦ తుండామృణాళత్ప్రి,చండరక్షోగళ ♦ కాండ నీకు
జోహారు నైగమ♦వ్యాహారవారము,క్తాహార హారినీల ♦ తరల నీకు
గీ. నతిజితహృషీకయతిలోక♦శతికృతాప, చితిసమంచితచరణరా♦జీవనీకు
నమనముపిచండగోళవి♦భ్రమదనంత, తోయజాతభవాండని♦కాయనీకు. 1833

సుమనోమనోభిరంజనము, ఆ 2 పద్య 138.

సీ. దండం బఖండమా♦ర్తాండమండలవిభా, మండితాఖండ పి♦చండునకును
వందనం బజశతా♦నందసంకీర్తితన, వందితచరణార♦విందునకును
జోహారు దానవ♦వ్యూహమహోగ్రహచే, ష్టాహారి సాహసో♦త్సాహునకును
నభివాదనము జగ♦త్పరిభవాంతకకృతా, ఖిలవాద్యచిద్విలా♦సభవునకును
గీ. జగదధీశ్వరభక్తవ♦త్సలముకుంద, పరమపూరుష గోవింద ♦ పద్మనాభ
ఘనమనోనాథ మాధవ ♦ మద్భయంబు, మాన్పి వేగమె కావవే ♦ మహిమ వెలయ.

శేషధర్మములు, అల్ల. సు.బ్ర. ఆ 4.

---

# మహేశ్వరస్తుతి.

---

సీ. రమణీయశృంగార ♦ రజతపర్వతమునా, శోభిల్లు సిద్ధవి♦న్యాసమూర్తి
ఆపర్వతాగ్రిమై♦కైకశృంగంబునా, నమరు జటామకు♦టాతిభాతి
ఆతుంగశృంగశి♦లాపూర్ణసరసినాఁ, బొంగారు జాహ్నవీ♦భూరివారి
అభిమ్నసరసి వి♦హారమరాళికా, పంక్తినా నొప్పు క♦పాలలీల
ఆ. యామహామరాళి ♦ కాబ్జినీకాంభోజ, పుష్పనిభసముద్ధ ♦ భోగిభోగి
సమితిఁ దాల్చి పొల్చు ♦ శంకరుండంబికా,ధవుఁడు మా కభీష్ట♦దాతగాత. 1835

కుమారసంభవము, నన్నె. ఆ 1 పద్య 2.

సీ. తరుణపల్లవరాగ ♦ తామ్రవిద్యుల్లతా, భాసురంబగు జటా♦భార మెఱుఁగి
నిబిడసంతమసాతి ♦ నీలబాలతమాల, పరిపంథియగు కంఠ ♦ భాగ మెఱుఁగి
తారముక్తాహార ♦ ధవళశారదనీర,దాకార మగు నిగ్ర♦హాంగ మెఱుఁగి
ద్రవశాతకుంభగౌ♦రకుసుంబకుసుమ కుం,దనశీల మగు ఫాల♦నయన మెఱుఁగి
గీ. యెఱుఁగికొనవచ్చు నటమీఁద ♦ హృదయకమల,కర్ణికాభ్రమరీభంబుఁ♦గదియఁజేర్చి
పరసుధాభిషేకంబుఁ ♦ బరమయోగి, సార్వభౌముండవగునిన్ను ♦ చంద్రమౌళి.

ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 174.

సీ. కుజము కుంజరము చేఁ♦గూలునో కూలదో, కూలు గుంజరము నీ♦కుజము గూల్చె
వ్రేటు పేరటిచే ♦ మడఁగునో మడఁగదో, మడఁగు బ్రేరటినీ♦మారి మడఁచె

కాలునో యొకనిచేఁ ♦ గాలదో సాలంబు, గాలునీ సాలంబు ♦ గాల్చెనొకనిఁ
దునియునో పరశుచేఁ ♦ దునియదో వృక్షంబు, తునియునీ వృక్షంబు ♦ తునిమెఁ బరశు
గీ. వనుచుఁ దమలోనఁ జర్చించు ♦ నమరవరుల, కభిమతార్థఫలార్థమై ♦ యందవచ్చుఁ
బారిజాతంబు శాఖాగ్రలఁ ♦ బండియుండ, నందఁగంటి శాఖోత్కలిల ♦ నందఁగంటి.

ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 176.

సీ. జయ విరూపాక్ష యీ ♦ శ్వర దివ్యలోచన, జయ వజ్రహస్తది ♦ శానివాస
జయ పినాకేష్వాస ♦ శాశ్వత నిత్య య,నిత్య నిత్యానిత్య ♦ నిరుపమాన
జయ చింత్య జయరుద్ర ♦ జయ మహాదేవయ,చింత్య చింత్యాచింత్య ♦ చిత్స్వరూప
జయ పాదభక్తార్తి ♦ సంహారకారణ, జయ ముకుందప్రియ ♦ జయగిరీశ
గీ. దివసమాసార్ధమాసవ ♦ ర్షస్వరూప, కల్పయుగవత్సరాధీన ♦ కాలఖేట
రుండ బహురూప చండీశ ♦ దండపాణి, జయ నమస్తే నమస్తే ప్ర ♦ సన్నమూర్తి.

హరవిలాసము, ఆ 6 పద్య 72.

సీ. శ్రీభీమనాయక ♦ శివనామధేయంబుఁ, జింతింప నేర్చిన ♦ జిహ్వ జిహ్వ
దక్షవాటీపురా ♦ ధ్యక్షు మోహనమూర్తి, చూడంగ నేర్చిన ♦ చూపు చూపు
దక్షిణాంబుధితట ♦ స్థాయిపావనకీర్తి, చేవింప నేర్చిన ♦ చెవులు చెవులు
తారకబ్రహ్మవి ♦ ద్యాదాతయౌదల, విరులుపూన్పఁగ నేర్చు ♦ కరము కరము
గీ. ధవళకరశేఖరునకుఁ బ్ర ♦ దక్షిణంబు, వర్తిఁ దిరుగంగ నేర్చిన ♦ యడుగులడుగు
లంబికానాయకధ్యాన ♦ హర్షజలధి, మధ్యమున, దేలియాడెడు ♦ మనసు మనసు.
సీ. గరళకూటవినీల ♦ కంఠాయ శంభవే, మదనాంతకాయ యో ♦ న్నమశ్శివాయ
కాద్రవేయాధిప ♦ గ్రైవేయభూషాయ, మధుభిత్సఖాయ యో ♦ న్నమశ్శివాయ
కుంభినీధరసుతా ♦ కుచకుంభ పరిరంభ, మహాలోలుపాయ యో ♦ న్నమశ్శివాయ
వేదాదివిశ్లేష ♦ విద్యావధూమాళి, మణికపాలాయ యో ♦ న్నమశ్శివాయ
గీ. గంధదంతావళజలంధ ♦ రాంధకారి, విబుధపరిపంథివాహినీ ♦ నిబిడవర్గ
బంధఘోరాంధకారసం ♦ భారకిరణ, మాలినే శాశ్వతాయ యో ♦ న్నమశ్శివాయ.

భీమేశ్వరపురాణము, ఆ 3 పద్య 197, 210.

ఉ. వాలినభక్తి మ్రొక్కెద న ♦ వారితతాండవకేళికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరి ♦ జాముఖపద్మమయూఖమాలికిన్
బాలశశాంకమౌళికిఁ గ ♦ పాలికి మన్మథగర్వపర్వతో
న్మూలికి నారదాదిముని ♦ ముఖ్యమనస్సరసీరుహాలికిన్. 1841

భాగవతము, స్కం. 1 పద్య 2.

ద్విపద. శ్రీగిరిజాధీశ ♦ శ్రీగిరినాథ, నాగచర్మాంబర ♦ నాగకేయూర
బాణవత్సలుఁ బంచ ♦ బాణసంహారు, వాణీశవినుత గీ♦ర్వాణేశవంద్యు
గంధర్వకిన్నర ♦ గాంధర్వలోలుఁ, గంధరశ్యామల ♦ కంధరోదారు
దారుణాంధకదర్ప ♦ దళనప్రచారుఁ, జారుజాంబూనద ♦ శైలకోదండుఁ
గారుణ్యజలధిగం♦గాధరు నభవు, శారదాచందన ♦ శారదాంభోద
మల్లికాకర్పూర ♦ మాలికాయశుని, మల్లికార్జునదేవు ♦ మహితప్రభావు
మాఫాలసేపట్ల ♦ మవేమ్ములువేల్పుఁ, బాపాళిఁబాపస♦ద్భక్తిఁబూజించి. 1842
హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన. ఆ 1.

సీ. కడలేనిసంసార♦జలధిలో మునిఁగిన, జనులపాలిఁటినావ ♦ శంభుసేవ
కడుదూరమైయున్న ♦ కైవల్యసీమకుఁ, జక్కనిపెనుత్రోవ ♦ శంభుసేవ
యతిభోగభాగ్యంబు♦లనుముత్తియంబుల, సతులఁగూర్చినకోవ ♦ శంభుసేవ
సకలాగమజ్ఞాన ♦ సారమహీజాత, జాతంబులోచేవ ♦ శంభుసేవ
గీ. నిరవధికఘోరపాతక ♦ దురవగాహ, గహనదహనసమున్నిద్ర ♦ గంధవాహ
పక్షిశిఖామాలికలతేవ ♦ శంభుసేవ, సద్గుణలతాంతములతీవ ♦ శంభుసేవ. 1843
రాజశేఖరచరిత్రము.

ఉ. కతుకతినంబు లద్రులు జ♦గంబున సందున సంభవించి పెం
పడరునిమం గరంప వశ♦మా యని నన్నుపు డంటివే కదా
వడిఁ గనకాద్రిచాపముగ ♦ వంచిననీకు హిమాద్రిజాతయా
పడఁతిఁ గరంచు టెంతయను ♦ పార్వతి మెచ్చ శివుం దలంచెదన్. 1844
అప్పకవీయము, ఆ 1 పద్య 20.

చ. వనితరో ఖండికొండనెల♦వంకలు పెక్కు వహించెఁ జూచితే
యని సరసోక్తిఁ దా ననిన ♦ నచ్చపుగంధపుఁబూఁతగుబ్బజా
జీన నునుప్రేటకొంగు సవ♦రించుచు నవ్వనగౌరిఁ గౌఁగిటం
దనిపెడు చంద్రశేఖరుఁ డు♦దారకృపన్ మముఁ బ్రోచుఁ గావుతన్. 1845
ఉత్తరరామాయణము, పీఠిక. పద్య 3.

# బ్రహ్మస్తుతి.

చ. అమితరజోగుణస్ఫురణ ♦ సాహసమైపరమేశుదక్షిణాం
గమునజనించిభక్తిఁజిర♦కాలము సద్విధిఁగొల్చితత్ప్రసా
దమున నజాండలోకజని ♦ తత్వనువేదకళాగమాది వి
శ్వము సృజియించిపొల్చునజు♦వాగ్విభు సంస్తుతిచేసి సన్మతిన్. 1846

కుమారసంభవము, ఆ 1 పద్య 5.

ఉ. ఆతతసేవఁ జేసెద స♦మస్తచరాచరభూతసృష్టివి
జ్ఞాతకు భారతీహృదయ ♦ సౌఖ్యవిధాతకు వేదరాశిని
ర్ణేతకు దేవతానికర ♦ నేతకుఁ గల్మషజేతకున్ నత
త్రాతకు ధాతకున్ నిఖిల ♦ తాపసలోకశుభప్రదాతకున్. 1847

భాగవతము, స్కం. 1 పద్య 3.

ఉ. నాలుగుమోముల న్నిగమ♦నాదము లుప్పతిలం బ్రచండవా
తూలహతిన్ జనించురొద ♦ తోడి గుహావళి నొప్పు మేరువుం
బోలెఁబయోజపీఠముని ♦ ముఖ్యులుగొల్వఁగ వాణిఁగూడి పే
రోలగ మున్నధాత విధి♦వోజ్జ్వలుఁజేయుతఁ గృష్ణరాయనిన్. 1848

మనుచరిత్రము, ఆ 1 పద్య 3.

చ. తనజనికారణంబయిన ♦ తామరకున్ హితుఁ డాటచే విక
ర్తనునకు వేయిఘృష్టులిడి ♦ దానికి శత్రుఁడు గాన నేణచి
హ్నునకుబదేనుజేసి యవి♦యున్ శిఖిభానుముఖామరాళిచే
దినమొక టప్పగైకొనను ♦ దిష్టనుజేయు విధాతఁ గొల్చెదన్. 1849

అప్పకవీయము, ఆ 1 పద్య 18.

చ. అలిఁగినభారతీపతి ని♦జాంఘ్రులపై నిటలంబుఁ జేర్చి యం
దలపడు యావకాంకములు ♦ హల్లకసాయకసాయకక్షతో
కలనముగాఁ దలంచి దయఁ ♦ గౌఁగిటఁ జేర్చుచు సంతసిల్లు న
జ్జలరుహసూతి మా కొసఁగు ♦ సమ్మతభూతి చిరాయురున్నతుల్. 1850

భోజసుతాపరిణయము, ఆ 1 పద్య 5.

చ. కరిరథవాజిముఖ్యములు ♦ గాక మరాళము మీకు యానమై
పరగుట కేమి హేతు వన ♦ భారతి నిగమసంబుదీనికిం
దొరకుట మాకు నిచ్చలు న♦నూనము వేగ్రమనిపల్కు ధాతయా
దరమున నిచ్చుఁ గాకనిర♦తంబు మదీయమనోరథార్థముల్. 1851

మూర్తిత్రయోపాఖ్యానము, కృత్యాది. పద్య 3.

చ. భువనములం బ్రసిద్ధిఁ గని ♦ భూరితరోత్కృవరప్రభావ మొం
ది విధునిరాక నుబ్బుచు సు♦వర్ణగుణాంచిత రత్నరాశియై
కవులు సమాశ్రయింపఁదగి ♦ కర్బురగర్భతశ్రీగురుత్వముం
దవులు సరస్వతీశ్వరుఁ డు♦దారతమాకుఁ జిరాయు వీవుతన్. 1852

ఉత్తరరామాయణము, పీఠిక. పద్య 5.

మ. తనరన్ హోమముల నిల్చి పల్కుచెలియు♦ క్షత్రప్రౌఢిసూచించుటన్
ఘనులన్ విష్ణుపదప్రవేశులుగ సం♦కల్పించి యుత్కృష్టప
ద్మనులం దావుల నెప్పుడున్ శరనులం♦దేలించి చెన్నొందు న
వ్యనజాతాసను విశ్వనిర్మితకళా♦వ్యాపార మూహించెదన్. 1853

నృసింహవిలాసము, ఆ 1.

చ. ప్రజలసృజించి వారలకు♦రాకృతకర్మఫలానుభూతులన్
నిజముగ ఫాలదేశముల ♦ నెమ్మి లిఖింపఁగ నేర్పు గల్గువా
రిజభవుఁ డష్టనేత్రుఁడు వి♦రించి సురాసురమానిసన్నుతుం
డజుఁడు విభుండు మాకొసగు ♦ నాయువు శ్రేయము నర్థసిద్ధియున్. 1854

బ్రహ్మోత్తరఖండము, ఆ 1.

ఉ. జాతునిరస్తసర్గవిధి ♦ జాతుని పీడితభక్తలోకజీ
వాతుని దానవాంబుధర♦వాతుని తోషితదేవమౌని సం
ఘాతు నిరాకృతేంద్రియవి♦ఘాతుని నిర్జరపూజ్యవత్సరో
జాతుని విష్ణునాభినల♦జాతునిఁ జేతులుమోడ్చి మ్రొక్కెదన్. 1855

రాఘవపాండవయాదవీయము, ఆ 1.

చ. అనుపమమైనయాత్మచతు♦రాననతాధికిఁ దోడు సత్యవ
ర్తనము మెఱుంగువెట్ట విబు♦ధప్రకరంబుల కెల్లఁ బెద్దయై
మనుమనిన న్గళాకలన ♦ మానితుఁజేసిననద్దయార్ద్రిహ్మా
త్మనరుహుఁడా మహామహుఁ బి♦తామహుని న్నుతియింతు నెంతయున్. 1856

మహేంద్రవిజయము, ఆ 1 పద్య 5.

# హరిహరస్తుతి.

సీ. యజ్ఞరక్షకుఁడును ♦ యజ్ఞవిధ్వంసియు, నై లోకనుతులఁ బెం♦పొందువాఁడు
కందర్పజనకుఁడుఁ ♦ గందర్పదర్పవి, దమనుండు, నై కేళిఁ ♦ దనరువాఁడు
భువనసంభర్తయు ♦ భువనసంహర్తయు, నన నాప్తగుణకృత్యు♦లైనవాఁడు
భూధరోద్ధారియు ♦ భూధరావాసియు, నగుట నిత్యప్రీతి ♦ నెగడువాఁడు
గీ. నిషధిజాతంబులగు రత్న♦నిషములురముఁ, గప్పుకంఠంబుఁ గైసేయ♦నొప్పువాఁడు
భుజగశయనుండు భుజగవి♦భూషణుండు, నెపుడుఁ గరుణఁతో వరదుల♦యీవ్యదరుపూరుష

హరివంశము, ఆ ౬.

సీ. అభ్రంకషంబైన ♦ యాలపోతునితండు, త్రుంచినాఁడీతండు ♦ పెంచినాఁడు
సాధుసమ్మతముగా ♦ సామజంబునితండు, గాచినాఁడీతండు ♦ ద్రోచినాఁడు
బ్రహ్మహత్యభార్థమై ♦ పర్వతేశునితండు, దాల్చినాఁడీతండు ♦ వాల్చినాఁడు
ఫణవరంపరతోడి ♦ పన్నగేంద్రు నితండు, మెట్టినాఁడీతండు ♦ చుట్టినాఁడు
గీ. నేఁడు నాఁడును నాఁడును♦నేఁడు మనక, జూపఁజెప్పంగఁజెప్పంగఁ♦జూపఁగ నీగి
నమచుఁ గొనియాడుసంయమి♦జనులకొదవె, రజతగిరిమీఁదహరిహరా♦రాధనంబు.

ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 180.

సీ. జవరాననూతుఁడై ♦ పార్థునకాతండు, పచ్చినాఁడీతండు ♦ మెచ్చినాఁడు
చంచత్కృపానూర్తిఁ ♦ బంచాస్త్రునాతండు, పెంచినాఁడీతండు ♦ ఏఁచినాఁడు
శేషపన్నగరాజు ♦ సెజ్జగానాతండు, వ్రాల్చినాఁడీతండు ♦ దాల్చినాఁడు
హాలాహలముఁ జూచి♦యల్లంతనాతండు, చెంగినాఁడీతండు ♦ మ్రింగినాఁడు
గీ. చక్రియాతండు వసుమతీ♦చక్రియితఁడు, నవనపరుఁడాతఁడీతఁడు♦మారణపరుఁడు
విశ్వమయుఁడాతఁడీతండు ♦ విశ్వనాథుఁ,డనుచు హరిహరనాథుల♦నభినుతింతు.

శివజ్ఞానదీపిక.

# శ్రీకృష్ణస్తుతి.

సీ. ప్రాణంబుతోఁ గూడ ♦ పక్కసిచన్నుల, పాలుద్రావినప్రోఢ ♦ బాలుఁడీతఁడే
పేర్మిక్రీడఁ బూబారు ♦ విటచిలోకములమెచ్చించిన యాజగ♦జెట్టి యితఁడె
దుర్వృత్తుఁడగుకంసుఁ ♦ దునిమి యాకనితండిరిఁ, బట్టంబుగట్టిన♦ప్రభుఁడితండె
సత్యభామకుఁ బారి♦జాతంబు వేడ్కఁగల; కోర్కెఁదీర్చిన గని♦కుం శిశ-

గీ. వెన్నలును గోపికాచిత్త♦వృత్తములును, నరసి ముచ్చిలనేర్చిన ♦ హరి యితండె
శ్రుతిశిరోభాగములఁదన♦శుభగచరణ,సరసిజామోదమునుఁగూర్చు♦చతురుఁడితఁడె.

భారతము, ఉద్యో, ఆ 3 పద్య 175.

శా. ఓ నారాయణ! యో మురాసురహరా! ♦ యో భక్తచింతామణీ!
యో నీలాంబుదవర్ణ! యో గుణనిధీ! ♦ యో లోకరక్షామణీ!
యో నీరేరుహపత్రనేత్ర! కృప నా♦యుల్లంబులో నుండవే
యో నా వేభవబంధముల్ చెఱుపవే ♦ యో దేవకీనందనా! 1861

శా. గోవిందాయ నమోనమో భగవతే ♦ గోపాలభర్త్రే నమో
దేవేశాయ నమోనమో మురభిదే ♦ దిక్పాలకర్త్రే నమో
భావజ్ఞాయ నమోనమో మదహృతే♦పాపపహర్త్రే నమో
జీవస్థాయ నమో యనంగ శుభముల్ ♦ చేకూరు మాకెప్పుడున్. 1862

ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 129, 130.

శా. శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై ♦ చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలనకళా ♦ సంరంభకున్ దానవో
ద్రేకస్తంభకుఁ గేళిలోలవిలస♦ద్దృగ్జాలసంభూతనా
నాకంజాతభవాండకుంభకు మహా♦నందాంగనాడింభకున్. 1863

భాగవతము, స్కం. 1 పద్య 1.

సీ. వీఁడె పేరక్కసి ♦ విగతజీవఁగఁ జన్ను, బాలు ద్రావినమేటి ♦ బాలకుండు
వీఁడె నందుని♦వెలఁదికి జగమెల్ల, ముఖమందుఁ జూపిన ♦ ముద్దులాఁడు
వీఁడె మందలో ♦ వెన్నలు దొంగిలి, దర్పించి మెక్కిన ♦ దాపరీఁడు
వీఁడె యాలయించి ♦ వ్రేతలమానంబు, చూఱలాడిన లోక ♦ సుందరుండు
గీ. వీఁడు లేకున్న పుర మటు♦వీస్థలంబు, వీనిఁ బొందని జన్మంబు ♦ విగతఫలము
వీనిఁ బల్కని వచనంబు ♦ విహగరుతము, వీనిఁ జూడనిచూడ్కులు♦వృథలువృథలు.

భాగవతము, స్కం. 9 పద్య 1249.

మ. జయ గోవింద! ముకుంద! చక్రధర! కం♦సద్వేషి! సాత్రాజితీ
ప్రియ! నారాయణ! కౌస్తుభాభరణ! కుం♦భితారిపారీణ! కా
ళియదర్పఘ్న! పతంగవాహ! వనమా♦లీ! కృష్ణ! వైకుంఠశౌ
రీ! యశోదాత్మజ! భక్తవత్సల! మురా♦రీ! గోపికావల్లభా. 1865

పారిజాతాపహరణము, ఆ 2 పద్య 56.

సీ. కోఱమాలి విసమిడ్డ ♦ కఱకురక్కసిఁ జెండి, పఱప్రమీఁ గొఱుబండి ♦ విఱుగఁ ద్రొక్కి
వెఱగొప్ప వ్రేతల ♦ మొఱఁగి వెన్నలు మెక్కి, తఱిఁ జూచి మద్దులు ♦ పెఱికివైచి
యఱచేతఁ గొండఁ జూ ♦ పఱువోగడఁగఁ బూని, వెఱఁగిబ్బతోలి వేల్పు ♦ మఱియడంచి
చిఱుతపాయపుఁ గొల్ల ♦ తెఱవల వలపించి, మఱవకపనులఁ జ ♦ ల్కఱు ననుగాచి
గీ. వెఱపెఱుంగక మడువున ♦ నుఱికికడిమి, మెఱయఁ దక్కరి విసదారి ♦ బిఱుసుఁ దఱిమి
మఱియుఁ బెరగు తులువల ♦ నుఱుము చేసి, వఱలు కఱివేల్పు నెదనెంతు ♦ గుఱిదలిర్ప.
నీలాసుందరీపరిణయము, ఆ 1.

శా. శ్రీవైదర్భివివాహవేదిక విరిం ♦ చిస్థాణుశక్రాదిబిం
బావిర్భావసమస్తభూషణమణీ ♦ హారప్రభాహారియై
యావేళన్ దెరమాయఁ ద్రోయు నిజపిం ♦ ఛ్వాకారతన్ దోఁచు స
ద్భావం బెన్న వెలుంగు కృష్ణుఁడు కృపన్ ♦ బాలించు మమ్మెప్పుడున్. 1887
యాదవరాఘవపాండవీయము, ఆ 1.

మ. పరపుంభావకళానిరూఢి ధరణీ ♦ వామాక్షి క్రీడించి యొం
త రతిశ్రాంతిని ప్రాలవక్షమునఁ ద ♦ త్తాత్రచ్ఛవిస్ఫూర్తి మే
దురమై నెమ్మొయియందు నిండ విలస ♦ ద్దూర్వాంకురగ్రాహియా
హరినీలంబనఁ బొల్చు కృష్ణుఁడు మదీ ♦ యాభీష్ట మిచ్చుం గృపన్. 1888
భోజనుతాపరిణయము, ఆ 1 పద్య 3.

శా. శ్రీలక్ష్మీజలజాక్షి యంశములచేఁ ♦ జెల్వొందువారిం బదా
ర్వేలస్త్రీల ననేకరూపములచే ♦ శ్రీమీఱ నుద్వాహమై
యాలోలాక్షుల నేకరూపమగు సౌ ♦ హార్దంబుతో నేలు గో
పాలుం డెప్డు వసించు మామకమనః ♦ పద్మాంతరాళంబునన్. 1869
మూర్తిత్రయోపాఖ్యానము, కృత్యాది. పద్య 1

శా. శ్రీరాధాధరబింబమున్ దొరయురా ♦ చిల్కన్ నిజోరస్స్థలీ
రారాజన్మణికాంతిరాఁ బిలిచి త ♦ ద్రాకేందుబింబాననా
స్మేరాంకూరముచేఁ గృతార్థుఁ డగుచుం ♦ జెల్వొందు గోపాంగనా
జారగ్రామణి కృష్ణుఁ డీవుత మహై ♦ శ్వర్యంబు మాకెప్పుడున్. 1870
ఉత్తరరామాయణము, పీఠిక. పద్య 1.

ష్టావాలంబను నాపగ్రహాయుగం♦బనోన్యస్యహార్దంబునన్
సేవింపందగు రామచంద్రుఁడు శుభ♦శ్రీలిచ్చు మాకెప్పుడున్. 1874

హరిశ్చంద్రనలోపాఖ్యానము, ఆ 1 పద్య 1.

శా. శ్రీరామాంశజమైనజానకి యురః♦స్సీమాంతరాత్యంతలవి
స్తారప్రాజ్యహారనాయకనజే♦సందర్శితంబౌ నిజా
కారం బారసి యన్యకాంతయను శం♦కం జెందునం జెంచి త
ద్వారీరత్నము వంకపీఠి నిడు సీ♦తాభర్త నన్ బ్రోవుతన్. 1875

హంసవింశతి, ఆ 1 పద్య 1.

చ. కనుఁగొనఁ జేరెడం బడమి♦ కానుపుచన్నపకుంకుమద్యుతిన్
బెనఁగొను క్రొత్తముత్తియపుఁ♦జేరు సముజ్జ్వలసాంద్రకీర్తిమం
జెవసినతారకాళియన♦ నింపెసలారు చెసేంద్రవంశహా
వస్ఫుఁడగు రామచంద్రుఁ డన♦వద్యకృపారసదృష్టిఁ బ్రోచుతన్ 1876

శకుంతలాపరిణయము, పె. నా. ఆ 1 పద్య 3.

శా. శ్రీసీతాపతి కేళియం దభిముఖా♦సీనప్రియోరస్స్థలో
ద్భాసిప్రస్ఫుటహారరత్నకలితా♦త్మచ్ఛాయ నీక్షించి య
న్యాసం దేహముఁ జెందఁ దన్నిశము నం♦తాహంగతుం బూన్చు శ్రీ
కౌసల్యాతనయుండు మస్తునగదా♦శర్మ్యేష్టకుల్ మాన్పుతన్. 1877

ఇందుమతీపరిణయము, మ. వృ. ఆ 1 పద్య 8.

శా. శ్రీగంజిల్ల నొనర్చుఁ గావుత శిలా♦జీవప్రిధానప్రథా
ధారంకర్ల్మముఁ గాంచి దారుశకల♦ద్వంద్వంబునుం బాదుకా
కారంబూని భజింప భూభరణభా♦గ్యస్ఫూర్తిఁ గల్పించు సీ
తారామాంఘ్రియుగంబు మాకు స్వసుఖో♦దారాయు రైశ్వర్యముల్. 1878

మహేంద్రవిజయము, ఆ 1 పద్య 1.

ఉ. శ్రీకమనీయదర్శనుఁడు♦ సేవకమానసమోదకృద్ఘనా
లోకుఁడు రమ్యతారకుఁడు♦ లోకచయాభయదాంబకుండు భ
వ్యాకృతిభావిభాసితుఁడు♦ నైతవరారిదు రామచంద్రుఁ డ
స్తోకకృపాకటాక్షములఁ♦ జూచి సదా మముఁబ్రోచుఁ గావుతన్. 1879

వయునోల్లాసము, ఆ 1 పద్య 1.

## లక్ష్మణస్తుతి.

మ. నిజనిద్రాలసతావిగాన మెహల◆న్నిర్నిద్రితావృత్తిఁ బూ
ని జగత్ప్రాణిసమృతిపరివాదముడుగ◆న్విశ్వావనోత్సాహియై
యజరారాతివిఘాతికిన్ వనవిహా◆రాధారమై పొల్చు సూ
రిజనప్రస్తుతశేషభావనిరతున్ ◆ శ్రీలక్ష్మణున్గొల్చెదన్. 1880

హరిశ్చంద్రనలోపాఖ్యానము, ఆ 1 పద్య 4.

ఉ. కంటికి ఱెప్పవోలెఁ దన◆కంటె మఱెవ్వరు సేవకుల్గలా
కంటకుఁ బాత్రమై పదిసె ◆ యన్నయు సంతసిలంగ భారమ
న్నింటను దానె పూని కడు◆నెమ్మదిఁ గావఁగఁ గోల్వదంటయున్
బంటునునైన లక్ష్మణునిఁ ◆ బ్రార్థనఁ జేసెద నిష్టసిద్ధికిన్. 1881

నయనోల్లాసము, ఆ 1 పద్య 3.

## భరతస్తుతి.

ఉ. అంచితరాజ్యరక్షకఖి◆లావనపావన రామపాదుకల్
గాంచిన మేటి గావునన ◆ కంటకకోమలతాయుతాత్మని
శ్చంచలభావనాసరణి ◆ సారెఁ జరింపఁగ నమ్మహాత్మ సం
ధించితదాత్మతన్దగు సు◆ధీనిరతున్ భరతున్ న్భజించెదన్. 1882

హరిశ్చంద్రనలోపాఖ్యానము, ఆ 1 పద్య 3.

మ. భగవద్భక్తియుఁ బోలె భాగవత సే◆వాయుక్తి భక్తాళికిం
దగు నన్మాటకు సాటిగాఁగ భగవ◆త్సంబంధమౌ పాదుకా
యుగళం బాఁదలయందుఁ దాల్చికొని యా◆ర్యుల్మెచ్చఁ బూజించి భ
వ్యగుణశ్రీగణనీయుఁడైన భరతుం ◆ బ్రార్థింతు నశ్రాంతమున్. 1883

నయనోల్లాసము, ఆ 1 పద్య 4.

## శత్రుఘ్నస్తుతి.

శా. లవణోదాత్తశరప్రకర్షమృతిలీ◆లాధీరనారాచలా
ఘవమాత్మప్రక్షితరామభద్రపదర◆క్షాలక్ష్మియుం గార్ముకా

రవనిర్భర్త్సితమేఘనాదతయుఁ బో◆రంబూని త్రైలోక్యసం
స్తవనీయాగ్రభవత్త్రయీచరితుఁడౌ ◆ శత్రుఘ్నుఁ బ్రార్థించెదన్. 1884

హరిశ్చంద్రనలోపాఖ్యానము, ఆ 1 పద్య 5.

శా. స్వామిం గొల్పుటకంటెఁ దచ్చరణదా◆స శ్రేణి సేవించుటెం
తే మేలంచుఁ దలంచువాఁ డగుటచే ◆ భృత్యానుభృత్యత్వను
స్థేమక్షేమత సర్వదా భరతుస◆క్తిన్ సాహచర్యక్రియా
సామీచీన్యమునన్భజించు ఘనుఁడౌ ◆ శత్రుఘ్నుఁ బ్రార్థించెదన్. 1885

నయనోల్లాసము, ఆ 1 పద్య 5.

# ఆంజనేయస్తుతి.

సీ. తరుణార్కఫలకబళనో◆ద్ధతిఁ జూపె నెవ్వాఁడు, రుచులచే ఫలమోహ ◆ రుచులచేత
నకలంకరామ ము◆ద్రికఁ బూనె నెవ్వాఁడు, శయముచే హృత్కుశే◆శయముచేత
మున్నీరు పల్వలం◆బుగ దాఁటె నెవ్వాఁడు, జవముచే గుణగణా◆ర్జవముచేత
నక్షశిక్షాప్రౌఢి ◆ నలరారె నెవ్వాఁడు, రణముచే నియమధా◆రణముచేత
గీ. ధరణి నెవ్వాఁడు దానవ◆ద్విరదదళన, విహృతిఁ దనకేసరికిశోర◆వృత్తిఁ దెలిపె
నతని మత్కావ్యభవ్యవా◆గమృతఘటన, మంజులస్వాంతు హనుమంతు◆మదిఁ దలంతు. 1886

వసుచరిత్రము, ఆ 1 పద్య 8.

చ: కమలదళాక్షు భక్తుల క◆గాధభవార్ణవ మింతబంటియౌ-
నని మణఁగటిస్థలంబునఁ గ◆రంబిడి రాముఁడె సర్వదైవతో
త్తముఁడని చాటుచుం డెడి వి◆ధంబున దక్షిణపాణి నెత్తి ని
త్యమును బ్రతాపముద్రి కల◆రారు సమీరకుమారుఁ గొల్చెదన్. 1887

చంద్రభానుచరిత్రము, ఆ 1 పద్య 3.

ఉ. తిరముగ విటపి వేవెలుఁగు◆దేవునిఁ గన్గొని పట్టియాస ని
బ్బరముగ నేఁగి చేఁగడిమిఁ◆బట్టినలావరి నేలచెల్వకోఁ
తురి చెలువంపుజాడ నియోద◆తుం దుడుకెల్లను దీర్చినట్టి యా
కెరువలిపట్టి నాదుమదిఁ◆గల్గినకోరిక లెల్ల నీవుతన్ 1888

బహులాశ్వచరిత్రము, ఆ 1 పద్య 8.

ఉ. పాయక కీర్తి రాముజన◆పాలుఁడు జానకిఁ జూడ నంపుచోఁ
తోయధి గోష్పదంబుక్రియఁ◆దోఁపఁ జిటాలున దాఁటి లంకఁ గ
న్న్యాయతలీలఁ బోయి రిపు◆జారుల దోషులఁ బోలెఁ గట్టి బా
హాయతశక్తిఁ గొట్టె సతి◆నారసి తద్భుజుఁ గన్న మారుతిన్. 1889

అప్పకవీయము, ఆ 1 పద్య 15.

ఉ. ఎక్కడ రామకీర్తన మొ◆కించుకయేని వినవైన వేడ్కఁ దా
నక్కడ వచ్చి యంజలి కృ◆తాంజలియై ప్రమదాశ్రుపూరముల్
పిక్కటిలంగ మైఁ బులక◆బృందము జాదుకొనంగఁ బాడుచున్
జొక్కుచు నాతు నయ్యనిల◆సూనుఁ బ్రభావతభానుఁ గొల్చెదన్. 1890

వాల్మీకిచరిత్రము, ఆ 1.

ఉ. దంతనిశాతహేతినిరు◆దంతనిశాచరకోటిధాటిదు
ర్దాంతనితాంతవిక్రముని◆దాంతుని శాంతనిశాంతమానసున్
సంతతభక్తిమద్వనవ◆సంతుని కాంతసుకీర్తి నెంతయున్
మంతుకు నెక్కువీరహను◆మంతుఁ దలంతు నిరంతరంబుగన్. 1891

తారాశశాంకవిజయము, ఆ 1 పద్య 16.

సీ. వనరాశిభంగంబు◆గనఁజేసె నెవ్వాఁడు, కరముచేఁ బర్వతో◆త్కరముచేత
ఘనబలాహకశక్తిఁ◆గలిగించె నెవ్వాఁడు, రయముచే వేగమా◆రుతముచేత
నరిపురవిస్ఫూర్తిఁ◆బరిమార్చె నెవ్వాఁడు, హేతిచే నిజనఖ◆హేతిచేత
తతమహామిత్త్రివ◆ర్ధన మొనర్చె నెవ్వాఁడు, క్షణముచే మధురవీ◆క్షణముచేత
గీ. నవని నెవ్వాఁడు జానకీ◆స్వాత్మసూచ, నాంజనాత్మజవిఖ్యాతి◆నధిగమించె
నతని మాపకకృతిచమ◆త్కృతికిఁ దలఁతు; మహితధీమంతు హనుమంతు◆మానవంతు.

చంద్రికాపరిణయము, ఆ 1 పద్య 8.

సీ. శైశవంబుననె భా◆స్కరుఁ ద్రమింగె నితని తేజమునకే ఘనుఁడింక◆సదృశుఁడనుచు
హనుమైటోద్ధతి నగ్ర◆జుమడచె నీతని కను, దధిమకేమిఁకఁ బోల్పఁ◆దగునటంచు
నురుధాటిఁ గడలిలో◆మెఱిసె నీతని గర్భ, రతకు నెయ్యదియింకఁ◆బ్రతియటంచు
వాలాగ్రమున గిరుల్◆వ్రాల్చె నీతని స్థైర్య, సంపదకిఁక నెవ్వ◆సాటియనుచు
గీ. జానకీరామచంద్రులే◆శౌర్యవంతు, పటుగుణస్ఫూర్తులప్పట◆ప్పటికి నెంతు
రా మహాశాంతు నలిదాఁతు◆నరికృతాంతు, నతులమతిమంతు హనుమంతు◆నభినుతింతు.

ఉత్తరరామాయణము, పీఠిక. పద్య 8.

ఉ. తావకపాదపద్మముల ♦ తావున మొక్కటిచక్క సేవనల్
గావు మదీయప్రాణులకుఁ ♦ గావునఁ జూపము వీనినంచు నీ
తావిభుమ్రోలనిల్చి ప్రమ♦దంబునఁ జూపెడురీతి మోడ్పుఁగే
ల్పావనభక్తిఁ బూనెడు కృ♦పావని పావని నెంతు నామదిన్. 1894

హంసవింశతి, ఆ 1 పద్య 7.

సీ. ఏవీరవర్యున ♦ హీనప్రతాపంబు, తాపంబుఁ గల్పించె ♦ దైత్యతతికి
నేమహామహు దివ్య♦నామసంతానంబు, తానంబుగా జగ♦త్త్రయముఁ బాడె
నేజిష్ణుపాదపం♦కేజపరాగంబు, రాగంబు భక్తవి♦రాజి కొసఁగె
సరవి నేకర్తకు♦జ్జ్వలదకూపారంబు, పారంబుఁ జూపె సు♦దారభంగి
గీ. నట్టిగుణవంతు సామంతు♦నరికృతాంతు,దాంతుహరిపదస్వాంతుని♦తాంతశాంతు
రక్షితసమంతుభువనవి♦శ్రాంతుఁ గాంతు,నచలవరకుంతుహనుమంతు♦నాశ్రయింతు.

నృసింహవిలాసము, ఆ 1.

మ. ఉదయాస్తాచలసీమల న్నిలిచి య♦య్యుష్ణాంశునిం జేరి నె
మ్మది నాచార్యునిగా వరించి సకలా♦మ్నాయాదివిద్యాఢ్యుఁడై
కదనక్షోణిని దైత్యవీరవరులన్ ♦ ఖండించి శ్రీరామకా
ర్యదయాళుండగు నాంజనేయుని దగన్♦ బ్రార్థింతు నశ్రాంతమున్. 1896

బ్రహ్మోత్తరఖండము, ఆ 1.

సీ. శోషితాంభఃపూర ♦ శుంభదంభోధిరా,డ్జంబాలపరిలుఠ♦జ్జలచరములు
తతదవీయఃప్రదేశి♦తామితవ్యత్యస్త, సంచరగ్రహగణా♦భ్యంచితములు
బంభ్రమ్యమాణదు♦ర్భరకందుకచ్ఛటా,దభ్రవిభ్రమభూమి ♦ ధరవరములు
భూనభోంతరపరి♦స్ఫుటవలన్మక్షికా, పక్షికరాయమాణధా♦రాధరములు
గీ. వనధిలఙ్ఘనసమయభా♦స్వన్మరుత్కు,మారజంఘాసముద్భూత♦మారుతములు
ప్రాగ్భవారబ్ధదుర్ఝర♦ప్రకరతూల, విసరములసెల్లఁదూలంగ♦విసరుఁగాత 1897

కృష్ణభూపాలీయము, పద్య 6.

సీ. కలుము లీనోపఁడే ♦ కమలాప్తసుతరాజ్య, సంఘటనోపాయ ♦ చతురమంత్రి
యిష్టార్థము లొసంగఁ♦డే జానకీశోఘ, వాన్యోన్యకుశలవా♦ర్తైక దూత
చిరతరాయుర్వృద్ధిఁ ♦ జేయఁజాలఁడె ల,క్ష్మణజీవదానభి♦షగ్వరుండు
కళల నీనేరఁడే ♦ ఘనమాని సంపూర్ణ, రామ సఖ్యైక పౌ♦రాణికుండు

గీ. పావనాకృతి శైవాంశ♦భవుఁడు శ్రీహ, రిస్వరూపుఁడు భావివి♦రించనుండు
నిరవధికకీర్తియగు నాంజ♦నేయమూర్తి, తత్ప్రసేవనములం జగ♦త్పావనములు.
మహేంద్రవిజయము, ఆ 1 పద్య 7.

సీ. త్రిజగద్విభుత్వవ♦ర్ణితచరిత్రస్ఫూర్తి, దగు నమరేంద్రుఁ డె♦ద్దానిఁ దెచ్చె
సర్వజంతువ్రాత♦చైతన్యహేతువై, తగుజగత్ప్రాణుఁ డె♦ద్దానిఁ దెచ్చె
లోకభీకరదైత్య ♦ లుంటాకపటిమచేఁ, దగు రాఘవేంద్రుఁ డె♦ద్దానిఁ గొనియెఁ
బ్రథితసంపూర్ణసం♦పత్ప్రదానఖ్యాతి, దగు మహీతనయ యె♦ద్దానిఁ బడసె
గీ. నట్టి హారంబు నఖతప♦ట్టాభిషేక, సమయసత్కారముగఁ దాల్చి ♦ యమరునట్టి
యాంజనేయుండు రామరా♦జ్యాధిపతికి, భోగబలవిక్రమైశ్వర్య♦ములనొసంగు.
రాఘవంశముక్తావళి, ఆ 1 పద్య 8.

# గరుడస్తుతి.

ఉ. ఆయతచండతుండనిహ♦తాహినికాయుని దప్తహాటక
చ్ఛాయుని సర్వవేదమయ♦సన్నుతకాయుని దేవదానవా
జేయుని నప్రమేయుని న♦శేషవిహంగకులాధిపత్యధా
రేయునిఁ బ్రస్తుతింతు సుచ♦రిత్రవిధేయుని వైనతేయునిన్. 1900
శ్రీరంగమాహాత్మ్యము, భైర. ఆ 1 పద్య 8.

గీ. నామదిఁ దలంచెద సుపర్ణ♦నామధేయు, మురహరవిధేయునమరస♦మూహగేయుఁ
గనకనిభకాయు భక్షిత♦కాద్రవేయు, వక్త్రకాంతిజితాత్రేయు♦వైనతేయు.
అప్పకవీయము, ఆ 1 పద్య 13.

చ. తన తనుకాంతి కాంచనకృ♦తంబులరీతి రహించ హారతా
శనవరభూషణౌఘముల♦సారెఁగనుంగొని చేయిసాఁచి కై
కొనఁ బటు పూత్కృతుల్ నిగుడ ♦ ఘోరఫణావళు లెత్త భీతిచా
లనమువహించు నైజసతు♦లం గని నవ్వు సుపర్ణు వేఁడెదన్. 1902
హంసవింశతి, ఆ 1 పద్య 8.

మ. జననీశాపముఁ బాపఁగాఁ దలఁచి యి♦చ్ఛన్ కచ్ఛపేభంబులం
దనకాళ్ళందవిలించి మానికులజా♦తస్ఫీతభూజాతశా
ఖను యుక్తస్థలిడించి దైవతపతిం ♦ గంపింపఁగాఁజేసి గ్ర
క్కున దివ్యామృత మర్విపైనునుచు తా♦ర్క్ష్యు న్భక్తితోఁ గొల్చెదన్. 1903
భార్గవపురాణము, ఆ 1.

శా. దాసుండై సఖుఁడై ధ్వజంబయి సము♦ద్యద్వాహమై యాసనం
బై సద్వీజనమై వితానమయి యు♦ద్యద్దీపాలయాకాంతను
ల్లాసం బొప్ప భజింపుచుండినమహో♦గ్రత్రయ్యాత్మకు న్వేదవే
ద్యాత్రిసాహాదిబలున్ బ్రశాంతుని గరు♦త్మంతు న్దలంతు న్మదిన్. 1904
రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 1 పద్య 4.

మ. అరవిందప్రభవాండభాండనికరం♦బబ్రింబుగన్ దుండకం
దరమంచూనిమెలంగు శ్రీరమణు నో♦ద్యల్లీలమై వీపునన్.
సరవిం దాల్ప ననల్పశక్తిగల యా♦ఛందోమయాకారుఁడౌ
గరుటామంతుఁడు సూర్యరాయధరణీ♦కాంతాగ్రణిం బ్రోవుతన్. 1905
యతిరాజవిజయము, ఆ 1 పద్య 8.

## సుదర్శనస్తుతి.

సీ. వైతేయమదవతీ♦ధమ్మిల్లములతోడ, విరులనెత్తావికి ♦ వీడుకోలు
దనుజశుద్ధాంతకాం♦తాకటాక్షములతోఁ, గలికికాటుకలకుఁ ♦ గానివావి
దానవమానినీ♦స్తనకుంభములతోడఁ, బసుపుఁబయ్యెదలకుఁ ♦ బాయుతెరవు
దైత్యావరోధవ♦దయితాధరములతో, సొబగువీడెములకుఁ ♦ జుక్కయెదురు
గీ. చేసి సురసుందరీకరా♦శీరతాల, వృంతచలితాంతకుంతల♦విలసదింద్ర
కులవధూటీలలాటికా ♦ కుంకుమంబుఁ, బదిలపఱుపఁ జక్రంబ నీ♦భరమకాదె.

మ. సతతంబు న్మతియింతు జంతుమయసం♦సారక్రియారక్షణా
క్షతశౌర్యక్షపితారిపక్షమగుటన్ ♦ సంగ్రామభీమభ్రమా
గతనేహాంతికదీర్ఘికాతటలుఠ♦త్కృంతచ్ఛిదాచ్ఛాదన
క్షతజక్షాళితకేళితామరసర♦క్షశ్చక్రిముం జక్రమున్. 1907
ఉత్తరహరివంశము, ఆ 3 పద్య 147, 149.

చ. అడరుగళాస్రధారలు మ♦హాముఖ వాంత సుధాంబుధారలు
న్బొడవగు వహ్ని కీలములు ♦ పొంగుసుగాఁ బెఱ దైత్యకోటికి
న్నెడిదపుఁ గిన్కతో నెసరు ♦ వెట్టిన పెద్ద పసంటి వోలె నె
క్కుడు వెస రాహు మస్తకము ♦ గొన్న సుదర్శన దేవుఁ గొల్చెదన్. 1908
ఆముక్తమాల్యద, ఆ 1 పద్య 9.

మ. హరిపీనోన్నతబాహుదండకృతసా♦హాయ్యంబునం దుర్నిరీ
క్ష్యరయస్ఫూర్తులతో నవిభ్రమముమిం♦చం గానరిప్రఖ్యయు

ర్వరఁ జెల్వార నజాండభాండతతి న♦వ్యగ్రంబుగాఁ జేయు న
స్థిరచక్రంబు మదీయ దుర్దశల సం♦క్షీణంబుగాఁ జేయూతన్. 1909

ఇందుమతీపరిణయము, మ. నృ. అ 1 పద్య 13.

శా. అనువేలంబుననంతకోటి హరిద♦శ్వాభాసమాహానుమే
యనితాంతప్రథితానసముజ్జ్వలసహ♦స్రార్కప్రదీప్యచ్ఛిఖా
ఘనమై శత్రుకరాళిమయ్యు హరిభ♦క్తశ్రేణికెల్లన్ ముద
ర్శనమై యార్తులఁబాపు చక్రమొసఁగున్ ♦ సౌఖ్యంబు మాకెప్పుడున్. 1910

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. అ 1 పద్య 6.

చ. అనుపుగ దేనిఁ బూని వన♦జాక్షుఁడు సజ్జనరక్షణంబు దు
ర్జనగణశిక్షణంబును ని♦రంతరముం బొనరించుచుండు న
య్యనుపమతేజమా బుధజ♦నైకసుదర్శనమైన శ్రీసుద
ర్శనమొనగూర్చు నార్యమహి♦జానికనూనజయోచ్ఛ్రియంబులన్. 1911

యతిరాజవిజయము, అ 1 పద్య 3.

## పాంచజన్యస్తుతి.

మ. హరిపూరింపఁ దదాస్యమారుత సుగం♦ధాకృష్టమై బాభిపం
కరుహక్రోడమిళిందబృంద మెదురే♦క్కం దమ్మిక్రియాపంక సం
కర దైత్యాసు పరంపరం గముచు రే♦ఖం బొల్చు రాకా నిశా
కర గౌర ద్యుతి పాంచజన్య మొసఁగుం♦గళ్యాణ సాకల్యమున్. 1912

ఆముక్తమాల్యద, అ 1 పద్య 5.

మ. దినమూన్ మ్రొక్కెద దుష్టపంచజనదై♦తేయోదరోచ్ఛేదవృ
త్తిని జన్మించుటఁ దుష్టపంచజనదై♦తేయోదరోచ్ఛేదనం
బెనయుం జాడ మమూం గలంచుటిదినీ♦కేధర్మమంచాడురే
ఘను గొండల్ ప్రతిమోయఁగా మొరయుశం♦ఖశ్రేణికామాళికిన్. 1913

ఇందుమతీపరిణయము, మ. నృ. పద్య 14.

శా. కమలావల్లభుఁ డుల్లమం దలరువే♦డ్కం దన్నుఁబూరింపఁ ద
త్కమనీయామలసస్మితాధరసుధా♦ధారస్ఫురత్ఫేనపుం
జమొకో నా విలసిల్లుచుం బుధులకున్ ♦ సౌఖ్యంబులుం గూర్చు శం
ఖము మాకీవుత సంతతంబఖిలమాం♦గళ్యంబు లత్యాదృతిన్. 1914

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. అ 1 పద్య 7.

క. ధన్యంబై హరిపూనుట, మాన్యంబై సకలసకల ♦ మండలికి నసా
మాన్యమగు పాంచజన్యము, జన్యములం గెలుపు సూర్య ♦ జనపతి కొసఁగున్.
యతిరాజవిజయము, ఆ 1 పద్య 6.

## కౌమోదకీస్తుతి.

ఉ. యాదవ సార్వభౌమ భయ♦దాయత బాహునియుక్తిఁ జేసి యం
దే దనుజేంద్ర సాళ్వపుర ♦ హేమమణీవరణంబు సంగతం
బై దివి నాత్మ కంకణము♦లందొక కంకణ మయ్యె నట్టి కౌ
మోదకి మోదకీలిత స♦ముజ్జ్వల కల్పకమాల్యఁ గొల్చెదన్. 1916
ఆముక్తమాల్యద, ఆ 1 పద్య 7.

మ. పరిణదత్కాంచనకింకిణీగణఘనా ♦ రావంబు గర్జానము
ల్బణమై తోఁప మురారివారిదమనా ♦ భాసిల్లఁ దద్దోర్మరు
ద్రణసంప్రేరితమై ద్విషద్గిరులవ♦జ్రప్రక్రియం దాఁకి గీ
టణఁగం జేయు గదాయుధంబడచు న♦ద్యన్మద్ద్విదౌద్ధత్యమున్. 1917
ఇందుమతీపరిణయము, మ. నృ. పద్య 15.

ఉ. సాదరలీల నాత్మనయ ♦ నాంచలచాలనసంజ్ఞ నేసమా
సాదితవేగమై యమర ♦ సంఘము లుబ్బఁగ లేచి శత్రువి
చ్ఛేదన మాచరించి హరి♦చిత్తము నుల్లసిల్లంగఁ జేయు కౌ
మోదకి మమ్ము నిత్యముఁ బ్ర♦మోదిత చిత్తులఁ జేసి ప్రోవుతన్. 1918
రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 1 పద్య 8.

క. అరిదరకలనాస్పదమై, హరికైయిదవకరసరో♦రుహంబు వితానం
బఱఁగెడు నల కౌమోదకి, నిరతముఁ గృతిపతి కొసంగు ♦ నిఖిలశుభంబుల్.
యతిరాజవిజయము, ఆ 1 పద్య 4.

## నందకస్తుతి.

మ. వరితతోర్ధ్వాధరభాగ పీఠ యుగళీ ♦ భాస్వత్త్సరుస్తంభ సం
స్థితిఁ దీండ్రించెడు జాళువా మొసలివా ♦ దీప్తార్చిగా కజ్జలా
న్విత ధూమాసిత రేఖ పైయలుగుగా ♦ విజ్ఞాన దీపాంకురా
కృతి నందం బగు నందకం బఘ లతా ♦ శ్రేణిచ్ఛిదం జేయుతన్. 1920
ఆముక్తమాల్యద, ఆ 1 పద్య 6.

మ. తనునీలాభసమిత్ప్రధూమితవిధూ♦ద్యద్వ్యోమశాధూమకే
తునితాంతోద్ధితధూమరేఖగతి స్వ♦ర్దీర్ఘధూమకేతుద్యుతిన్
గని రక్తాభతదుస్థతార్చియన ను♦గ్రింబయ్యెఁ దా నందకం
బనఁ బేర్కొన్న మహాద్భుతాసిమదరి ♦ వ్యాపాదముం జేయుతన్. 1921

ఇందుమతీపరిణయము, మ. నృ. పద్య 16.

ఉ. స్పందితచిత్తదుష్టరిపు♦సంచయకంఠవిలుంఠనక్రియా
నందితదేవతార్పితఘ♦నస్ఫుటకల్పక పుష్పమాలికా
బృందసుగంధయుక్తమయి ♦ పెంపువహించు సమస్తసజ్జనా
నందకమైన నందక మ♦నారతమున్ మముఁగాచుఁగావుతన్. 1922

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 1 పద్య 9.

క. బృందారకబృందావన, సందర్భవినిర్భరైక ♦ శక్త్యాకరమా
నందకము విహితమహితా, నందక మగుఁ గాత సూర్య♦నరనాథునకున్. 1923

యతిరాజవిజయము, ఆ 1 పద్య 5.

## శార్ఙ్గస్తుతి.

చ. పిడికెడు కానఁ గొప్పఁ గని ♦ పేర్మిఁ ద్రివక్ర సమాంగి జేసి తేఁ
బిడికెడు కానఁ గొప్పఁబయిఁ ♦ బెచ్చు గుణంబును గంటి నంచు నే
ర్పడక నిజత్రివక్రతయుఁ ♦ బాఁపఁగ మ్రొక్కెడునానుమాలిపైఁ
జడిగొన నమ్ము లీనుహరి ♦ శార్ఙ్గధనుర్లత గాచుఁ గావుతన్. 1924

ఆముక్తమాల్యద, ఆ 1 పద్య 8.

మ. ఋజుభావాదృతమయ్యు వక్రిమగుణో♦పేతాత్మకంబై పర
వ్రజజీవైకవికర్షణక్రమకళా ♦ పరివ్యక్తమయ్యున్ సదా
నిజజీవైకవికర్షణక్రమకళా ♦ నిర్నిద్రమౌ తచ్చతు
ర్భుజుశార్ఙ్గంబు మదంగసంగతమహా ♦ భూరివ్యథల్ మాన్పుతన్. 1925

ఇందుమతీపరిణయము, మ. నృ. పద్య 17.

ఉ. ఖండనకేళిచండతర♦భావవిజృంభణశైలవిద్విష
త్ఖండనలోల విష్ణుకర♦తామరసంబున సారయుక్తమై
తాండవమాచరించు విబు♦ధప్రమదావహమైన శార్ఙ్గకో
దండము మాకు నిత్యసుఖ♦దం బగుచున్ విలసిల్లుఁగావుతన్. 1926

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 1 పద్య 10.

చ. ధృతిసెడ సాత్మచిత్తము జ♦యించిన కల్మలివాలుగంటి భ్రూ
లతికల సామ్యముం గని చె♦లంగుట గెల్పు ఘటించు నంచు సం
తతము శౌరి కోరికను ♦ దాలుచు శార్ఙ్గ మురుప్రతాపదీ
పితునిగఁ జేయుఁగాత సుక♦విస్తవనీయుని సూర్యరాయనిన్. 1927

యతిరాజవిజయము, ఆ 1 పద్య 7.

# ఆదిశేషస్తుతి.

ఉ. శయనంబై యుపధానమై నిలయమై ♦ సచ్ఛత్రమై పాదుకా
ద్వయమై పుంజశీకరమై మృదులవ♦స్త్రంబై సమస్తోచిత
క్రియలం జక్రికి నిత్యసన్నిహితమూ♦ర్తిన్ బొల్చు శేషాహి న
న్నయమేధానిధిఁ గావ్యలక్షణకళా♦చార్యున్ బ్రశంసించెడన్. 1928

శ్రీరంగమహాత్మ్యము, భైర. ఆ 1 పద్య 2.

మ. హరినాభిన్ జనియించు నజ్జుఁడు బా♦ల్యక్రీడనాసక్తిఁ బం
ధురభోగాగ్రిచిరత్నరత్నరుచిసం♦దోహైకవాంఛాప్తి త
ద్భరణోద్యుక్తతచే రచించినఫణా♦వ్యాసక్తపద్మస్రగా
భరణశ్రీరహిఁజెందు శేషుఁడు వచః ♦ ప్రాగల్భ్య మిచ్చుం గృపన్. 1929

భోజనుతాపరిణయము, ఆ 1 పద్య 8.

మ. స్థిరదీపప్రతిసీరలౌ మణిఫణా♦శ్రీదీప్తులన్ భోగముం
దిరలీలారతి లక్ష్మివల్లభునకున్ దై♦తేయారికిం లజ్జనొం
దు రమాదేవికి మోద మల్కయు మదిన్ ♦ దోడ్తోడఁ బర్యాయవృ
త్తి రచింజేయుఫణీంద్రుఁ డీవుత మహా♦ధీవైభవోన్మేషముల్. 1930

ఇందుమతీపరిణయము, మ, నృ. ఆ 1 పద్య 10.

మ. ఘనశయ్యాసనపాదుకాంశుకసమ♦గ్రచ్ఛత్రిముఖ్యోల్లస
త్తనుభేదంబులచే రమాధవునకున్ ♦ దా శేషమైయుండుటన్
జనులెల్లం బను శేషుఁడంచు విమతిం♦చన్కించు నత్యంతశాం
తు ననంతు న్బరభక్తిమంతు ఫణికాం♦తుం గొల్తు నశ్రాంతమున్. 1931

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 1 పద్య 1.

చ. ఇలనుభరించు నెవ్వని య♦హీనఫణాఫలకంబు లేనివే
నలవుల సెజ్జయై యలరు♦నాహరి కట్టి యనంతమూర్తి ని

స్తులతరకీర్తి పూర్తి నిడి♦తోరపుంగూరిమిఁ బ్రోచుఁగాత ని
ర్మలనుగుణాంకు వేంకటకు♦మారమహీపతి సూర్యరాడ్విభున్. 1932

యతిరాజవిజయము, ఆ 1 పద్య 6.

## విష్వక్సేనస్తుతి.

క. శ్రీరమణచరణసేవా,చారనియోధావదాను ♦ సత్కీర్తిజయ
శ్రీరాజమానుదానవ, వీరఖగస్యేనుఁదలఁతు ♦ విష్వక్సేనున్. 1933

శ్రీరంగమహాత్మ్యము, భైర. ఆ 1 పద్య 4.

ఉ. త్ర్యాజ్యజనాథుశాసనవి♦ధానముహుళ్ళలనక్రియామహా
ప్రాజ్యతగొన్నవేత్రము క♦రంబునఁదాల్చి యజాండభాండసా
మ్రాజ్యధురంధరుండయి ర♦మావరభుక్తవిముక్తశేషమే
భోజ్యముగా గ్రహించుహుత♦భుగ్ద్యుతిసైన్యపతి న్భజించెదన్, 1934

రుక్మిణీకల్యాణము, జ. వేం, రం. ఆ 1 పద్య 5.

మ. ఇభవక్త్రాదికపారిషద్యపటలం ♦ బెల్లప్డు నుద్యత్తటి
త్ప్రభ పాణిప్రచలత్సువర్ణమయవే♦త్రప్రాప్తసంజ్ఞన్ జగ
త్ప్రభవద్విఘ్ననివారణార్థము హరి♦ద్భాగంబులం బర్వ స
త్సభ నన్వర్థసమాహ్వయంబు గను వి♦ష్వక్సేను సేవించెదన్. 1935

ఇందుమతీపరిణయము, మ. నృ. ఆ 1 పద్య 9.

## వీరభద్రస్తుతి.

ఉ. కేలు మొగిడ్చి గొల్చెదను ♦ గేవల దీనజనావనక్రియో
ద్వేలదయాసముద్రు రిపు♦వీర మహాప్రళయోగ్రరుద్రు భ
క్తాళిగృహీతభద్రు రుచి♦రాత్మముఖోపరిలగ్నభద్రికా
కీలలనాకపోలయుగ ♦ లీనహరిద్రుని వీరభద్రునిన్. 1936

రాఘవపాండవయాదవీయము, ఆ 1.

## రవిస్తుతి.

చ. అనుపమదివ్యమూర్తి యను ♦ నంతియకాదు భవాప్తమూర్తులం
దును వరమూర్తి దాన ప్రభ♦తోడ జగజ్జనరాజికెల్ల నిం

జనయము దాన దృష్టియను ♦ సంతియకాదు త్రిలోచనాదిలో
జనములు దానయైన రవి ♦ చారునిజప్రభవాకు నీవ్రతన్. 1937

కుమారసంభవము, ఆ 1 పద్య 6.

## కుమారస్తుతి.

క. తనజనకుఁ డురస్థాణువు, జననియపర్ణాఖ్య దా వి♦శాఖుం డనఁగాఁ
దనరియు నభిమతఫలముల, జనులకు దయ నొసఁగుచుండు♦షణ్ముఖుఁ గొలుతున్.

కుమారసంభవము, ఆ 1 పద్య 8.

## మల్లికార్జునస్తుతి.

మ. అమలజ్ఞానసుదీపవర్తిఁ గొని వృ♦ద్ధాచార్యుఁడై వేదశా
స్త్రములందున్న సదర్థ మెల్లఁ గొని వి♦ద్వత్ప్రీతిఁ గావించు వా
ని మహాత్మ్యంబనఁ గొల్చు పుణ్యనిధి పా♦ణిముఖ్య సర్వజ్ఞ జం
గమలింగంబను మల్లికార్జును సదా ♦ కల్యాణుఁ గీర్తించెదన్. 1939

కుమారసంభవము, ఆ 1 పద్య 15.

## హయగ్రీవస్తుతి.

శా. క్షీరాంభోధిలసత్తరంగపటలీ ♦ శీతీకృతాష్టాపదో
దారాశ్వత్థమహీజమూలమునఁ బ♦ద్మస్థాయియై శిష్యుల
త్యారూఢస్థితి శాస్త్రముల్ చదువఁగా ♦ వ్యాఖ్యానముద్రాన్వితుం
డై రాజిల్లు హయాననుం గొలుతు వి♦ద్యాజాలహృద్యాననున్. 1940

మ. అకలంకస్థితి శంఖచక్రవిలస♦ద్వ్యాఖ్యానముద్రానుపు
స్తకయుక్పాణి చతుష్టయుండు పరప♦ద్మస్థుండు శుభ్రాంశుమం
డ్యకృతాకారుఁడు జ్ఞానదుండు హయవ♦క్త్రస్వామి నిత్యంబు మా
మకచిత్తంబుననిల్చి తీర్చు మృదుశుం♦భద్వాక్య సందర్భమున్. 1941

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 1 పద్య 11, 12.

## విఘ్నేశ్వరస్తుతి.

చ. తమ వసితాంబుదంబు సిత♦పంక్తియుగం బచిరాంశు లాత్మగ
ర్జన మురుభర్జనంబు గర♦సద్రుచి శక్రశరాసనంబునై

చన మదవారివృష్టి హిత◆సస్యసమృద్ధిగ నభ్రవేల నాఁ
జను గణనాథుఁ గొల్తు నని◆శంబు నభీష్టఫలప్రదాత గాన్. 1942

కుమారసంభవము, నన్నె. ఆ 1 పద్య 7.

ఉ. అల్లన తుండమెత్తి శివు◆నౌఁదలయేటిజలంబు పీల్చి సం
ఫుల్లతఁ బాదపీఠమున◆ఁ బొంతననున్న సహస్రనేత్రుపైఁ
జల్లి శివార్చనాకమల◆సంహతిఁ బ్రోక్షణ సేయునట్లు శో
భిల్లు గజాననుండు మద◆భీప్సితసిద్ధికరుండు గావుతన్. 1943

విజయసేనము, ఆ 1.

ఉ. గ్రక్కున నేత్రయుగ్మము క◆రద్వితయంబున మూసిపట్టి యొ
మిక్కిలికంటికిం దనదు◆ మిక్కిలిహస్తము మాటుచేసి యిం
పెక్కఁడు బాలకేళిఁ బర◆మేశ్వరుచిత్తము పల్లవింపఁగాఁ
దక్కక ముద్దునం బొలుచు◆దంతిముఖుం గొలుతున్ బ్రసన్నుఁగాన్. 1944

దశకుమారచరిత్రము, ఆ 1 పద్య 5.

చ. తనరఁగఁ గ్రుచ్చి యంబిక ము◆దంబునఁ గౌఁగిటఁ జేర్చుచో ఘన
స్తనయుగకుంభయుగ్మములు◆ దార్కొని యొప్పనకై యనూయమైఁ
జెనకి కనంగ నొండొకటిఁ◆ జేరినలాగున నుల్లసిల్లఁ బెం
పెనసినవానిఁ బ్రీతి నుతి◆యించెద నేనికమోముపేలుపున్. 1945

నృసింహపురాణము, పీఠిక. పద్య 5.

చ. పరముఁడు కంధరస్థలము◆పై నిడి వేడుక ముద్దులాడఁగాఁ
గరమున నమాళి గంగయూద◆కంబులు మెల్పునఁ బీల్చి యూఁదిశి
కరముల భూషణేందునకు◆ గౌరవతారకలీలఁ జేయు త
త్కరివదనుండు మత్కృతికిఁ◆ దానుముఖస్థితితోఁ దఁదోడగున్. 1946

విక్రమసేనము, ఆ 1.

శా. జేజే యంచు భజింతు నిష్టఫలసం◆సిద్ధుల్ మదిం గోరి ని
ర్వ్యాజప్రౌఢకృపావలంబునిఁ గటా◆ప్రస్యందిదానాంబునిం
బూజాతత్పరదేవదానవకదం◆బున్ బాలకేళీకళా
రాజత్కౌతుకరంజితోరగపతి◆ ప్రాలంబు హేరంబునిన్. 1947

శృంగారనైషధము, ఆ 1 పద్య 4.

సీ. కలితశుండాదండ◆గండూషితోత్సృష్ట, సప్తసాగరమహా◆జలధరములు
వప్రక్రియాకేళి◆ వశవతీర్ణసువర్ణ, మేదినీధరరత్న◆మేఖలములు

పక్వజంబూఫల♦ప్రకటసంఘటనా, చుంబితభూభృత్క♦జంబకములు
వికటకండూలగం♦డక దేహమండలీ, ఘట్టితబ్రహ్మాండ ♦ కర్పరములు
గీ. శాంభవీశంభులోచనో ♦ త్సవకరములు, వాసవాద్యమృతాశన ♦ వందితములు
విఘ్నరాజమహోల్లాస ♦ విభ్రమములు, మించి విఘ్నోపశాంతిఁ గా♦వించుఁ గాత.
హంసవిలాసము, ఆ 1.

ఉ. ఆదర మొప్ప మ్రొక్కెడుదు ♦ నద్రిసుతాహృదయానురాగసం
పాదికి దోషభేదికిఁ బ్ర♦సన్నవినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి మంజువాదికి న♦శేషజగజ్జననందవేదికిన్
మోదకఖాదికిన్ సమద♦మూషకసాదికి సుప్రసాదికిన్. 1949
భాగవతము, స్కం. 1 పద్య 5.

మ. తొలుమ్రొక్కుల్ గొనువేల్పుఁ గొల్తు శశభృ♦త్కోటీరుఁ గోటీరట
త్కలభూషాంకితగాత్రు గాత్రమరసం♦ఘస్తోత్రవేశానిర
ర్గళధారాళకటప్రదానతటినీ♦రజ్గద్విరేఫాలికా
కలికాలోలవిచారుఁ జారుహరి ఘు♦క్ప్రాలంబు లంబోదరున్. 1950
జైమినిభారతము, ఆ 1 పద్య 4.

ద్విపద. సారంబుగా వేడ్క ♦ సమకొల్పు బీజ, పూరంబువలకేలఁ♦బొలుచురత్నాల
హారంబు డాకేల ♦ నాదిత్యమకుట, హీరంబు నెదఁగల్గు ♦ హేరంబుఁ బొగడి.
హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన.

ఉ. అంకముఁజేరి శైలతన♦యాస్తనదుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్టఁ దొండమున ♦ నవ్వలి చన్గబళింపఁబోయి యా
వంకకుచంబుఁ గాన కహి♦వల్లభహారముఁ గాంచి వే మృణా
ళాంకురశంక నంటెడు గ♦జాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్. 1952
మనుచరిత్రము, ఆ 1 పద్య 4.

చ. అరుదుగ వామభాగలల♦నాకలనాచలనాత్ముఁడైన యా
హరు గురుఁ గాంచి తాను ద♦దాకృతియౌగతి నేకదంతుఁడై
కరికరిణీగుణంబులు మొ♦గంబునఁ దాల్చి జగంబు లేలు నాం
తరకరుణాసనాథు గణ♦నాథు మరుద్గణనాథుఁ గొల్చెదన్. 1953
నరసభూపాలీయము, పద్య 6.

సీ. చంద్రఖండకలాపుఁ♦జారువామనరూపుఁ, గలితచంచలకర్ణుఁ ♦ గనకవర్ణు
మోదకోజ్జ్వలబాహు♦మూషికోత్తమవాహు, భద్రేభవదను స♦ద్భక్తసదను

సన్మునిస్తుతిపాత్రు ♦ శైలసంభవపుత్త్రు, ననుదినామోదు నా ♦ ద్యాపరిసాదుఁ
బరశువరాభ్యాసు ♦ బాశాంకుశోల్లాసు, నురుతరఖ్యాతు నా ♦ గోపవీతు
గీ. లోకసన్నుతగుణవంతు ♦ నేకదంతు, నమితహేరంబు సత్కరు ♦ ణావలంబు
విమలరవికోటితేజు శ్రీ ♦ విఘ్నరాజుఁ, బ్రథితవాక్ప్రసిద్ధి కెప్పుడుఁ ♦ బ్రస్తుతింతు.

మొల్లరామాయణము, ఆ 1.

మ. నిజదంతప్రసవంబు హస్తమధుపో ♦ న్మేషంబు హారావళీ
భుజగవ్రాతలతాసమేతము మదాం ♦ భోవారమారందమున్
భుజశాఖాప్రతిపత్త్రిముల్ ఘటఫలం ♦ బుల్ గల్గి సొంపొందు నా
గజరాజాననకల్పభూజ మొసగుం ♦ గల్యాణసాఫల్యమున్. 1955

బహులాశ్వచరిత్రము, ఆ 1 పద్య 7.

చ. తనుఁ గని యొక్క యెత్తునను ♦ దక్షజయున్నిటలాక్షుఁడున్ ముదం
బున నిరుచెక్కులుం గదిసి ♦ ముద్దు గొనంగ నొకింత నెమ్మొగం
బునవుగ వెక్కసం దిగిచి ♦ యత్నవిహీనపరస్పరాస్యచుం
బనములు దల్లిదండ్రులకుఁ ♦ బన్నుగఁ జూర్చు గజాస్యు సన్నెదన్. 1956

అప్పకవీయము, ఆ 1 పద్య 22.

ఉ. ఒందురదంబు పోవిడిచి ♦ యుక్కునఁ జక్కని మొక్కలీఁడనన్
రెండవ కొమ్ము తొండమున ♦ నేర్పున మాటి మతంగశృంగజే
డెండెమువన్ గ్రహించి తన ♦ దాసుల కీఁబరికించి హస్తిత
క్త్రింపెయి మాయబోయదొర ♦ కుం గొడుకై తగు వేల్పుఁ గొల్చెదన్. 1957

పాంచాలీపరిణయము, ఆ 1.

ఉ. మోదకహస్త హస్తిముఖ ♦ మూషకవాహన యేకదంత లం
బోదర తప్తకాంచనస ♦ ముజ్జ్వలవిగ్రహ బాలచంద్రశే
ఖాదృతమౌళి యంచుఁ దను ♦ నచ్చపుభక్తిఁ దలంచు వారలన్
మోదమునిండఁ బ్రోచు గణ ♦ ముఖ్యుని విఘ్నపతిన్ దలంచెదన్. 1958

వాల్మీకిచరిత్రము, ఆ 1.

ఉ. మొరిక్కులొవర్తుఁ గేలుఁగవ ♦ మోడిచి జొక్కపుఁ గొక్కుజక్కిపై
నెక్కుడుబల్వజీరునకు ♦ నిమ్ముగ నమ్రశవారి మేల్పనుల్
చక్కఁగఁజేయు దేవరకు ♦ జక్కెర గొబ్బెరపండు లుండ్రముల్
మెక్కెడు పాపజంతెముల ♦ మేటికి బత్తిని మాటిమాటికిన్. 1959

నీలాసుందరీపరిణయము, ఆ 1.

మ. హరజూటీనటదాపగాంబుపృషదం♦దంతాగ్రంబునం బీల్చి సా
దరితం బజ్జలజంబు తల్లికి సమ♦ర్ప్యత్పుష్కరాకృష్టసా
గరగౌర్యగ్రజకంధరాంతరఫణి ♦ గ్రైవేయకం బద్భుత
స్ఫురణం బండ్రడి కొసంగి ముద్దుఁగొను దే♦వుం డిచ్చు నిర్విఘ్నతన్. 1960

తారాశశాంకవిజయము, ఆ 1 పద్య 17.

మ. కలుషేభావళి నాఁప నంకుశము వి♦ఘ్నస్తోమధరశ్రేణి వ్ర
శ్కులు గావింప వరస్ఫురత్కులిశమున్ ♦ గర్వప్రమత్తారివీ
రుల బంధింపఁగఁ బాశమున్నతమనో♦రుగ్రోణుపుల్ మాన్పఁ బు
ష్కలదానాంబువు లాను శేల్పడఁచు మ♦త్కావ్యాంతరాయచ్ఛటన్. 1961

ఉత్తరరామాయణము, పీఠిక. పద్య 7.

ఉ. సంతత మేను లోఁ దలఁతు ♦ సంతస మొప్పఁగఁ గాంతిఁ బర్మనీ
కాంతుని పాలితత్రిదశ♦కాంతుని సర్వకళాతి కాంతునిన్
శాంతుని భక్తహృన్నలిన♦శాంతుని నిష్ప్రతిపాదకోక్తివే
దాంతునిఁ గీర్తిపూర్ణహరి ♦ దంతుని దంతుని నేకదంతునిన్. 1962

రాఘవపాండవయాదవీయము, ఆ 1.

సీ. విలసితాబ్జధరాతి ♦ కలనాభిచర్యుండు, వరవినతానంద ♦ వర్ధనుండు
రాజితానందాభి♦రణతతచర్యుండు, మహితామలినతుండ ♦ మండితుండు
కళ్యాణధామస్వ♦ఘనపక్షనుస్ఫూర్తి, వర్ణనీయసుముఖ ♦ వర్తనుండు
విదితవేగాభోగ ♦ బలపదచరణుండు, సమరసోత్కటదాన ♦ సౌరభుండు
గీ. నగుచు నగణితనుగుణంత ♦ నతిశయముగ, నలరునట్టి వినాయకుఁ ♦ డస్మదీయ
నిర్భరగ్రంథసందర్భ ♦ నిఖిలయుక్తి, పటిమఘనబనాగరిష్ఠుఁడై ♦ పరఁగుఁగాత.

కృష్ణభూపాలీయము, పద్య 5.

సీ. తనకర్ణయుగ్మచా♦లనవిలాసంబులు, చామరాందోళన ♦ సరణిఁ జెనుపఁ
దనరదనాగ్రిము♦ద్దామతరైకాత, పత్రిమహానై భ♦వంబుఁ జూనుపఁ
దనపుష్కరాగ్రంబు ♦ ధారాప్రవాహంబు, లమితరాజ్యాభిషే♦కములఁ దనుపఁ
దనగణనాయక♦త్వము సంగరాభంగ, చతురంగసైన్యప్ర♦శస్తి మనుపఁ
గీ. దన ప్రథమపూజ్యభావంబు ♦ ధరణివలయా, నాథ లోకవశాగ్రగ♦ణ్యత్వ మనుప
ననుపమ పేర్మిమ హేరంబుఁ♦ డనిశ మొసఁగు, రామరాయేంద్రరాజకా♦ర్యములఫలము.

రాఘువంశముక్తావళి, ఆ 1 పద్య 7.

# సరస్వతీస్తుతి.

క. వేదాగమరూపమున మ, హాదేవునపారగుణ మ♦హాసంస్తుతిసం
పాదితయగుభారతినేఁ, డాదిగ మత్కృతికి నెలయు ♦ నదిగాక దయన్. 1965
కుమారసంభవము, ఆ 1.

ఉ. కరకమలంబెసంగఁబటి♦కంపుఁ గమండలువంటికాంతిభా
సురమగు మౌక్తికంపుజప♦సూత్రముదాల్చుట బ్రహ్మవాదమై
పరగిన హంసమున్ బిలిచి ♦ బాలమృణాళముఁ జూపుచందమై
సిరితిలకింపనొప్పు బుధ♦సేవితమూర్తిఁ దలంతు భారతిన్ 1966
నృసింహపురాణము, పీఠిక. పద్య 6.

సీ. సింహాసనము చారు ♦ సితపుండరీకంబు, చెలికత్తె జలువారు ♦ పలుకుఁజిలుక
శృంగారకుసుమంబు ♦ చిన్నిచుక్కలరాజు, పసిఁడికిన్నెరవీణె ♦ పలుకుఁదోఁడు
వలువ నెమ్మేనుఁద♦మ్ములు కేళిగృహములు, తళుకుటద్దంబు స♦త్కవులమనసు
వేదాదివిద్యలు ♦ విహరణస్థలములు, చక్కనిరాయంచ ♦ యెక్కిరింత
గీ. యెపుడు నేదేవి కాదేవి ♦ యిందుకుంద, చంద్రచందనమందార ♦ సారవర్ణ
శారదాదేవి మామక♦స్వాంతవీథి, నిండువేడుక విహరించు ♦ చుండుఁ గాక.
శృంగారనైషధము, ఆ 1.

సీ. రాజీవభవువిగా ♦ రాపుఁబట్టపుదేవి, యంచబాబానెక్కు ♦ నలరుఁబోణి
పసిఁడికిన్నెరవీణెఁ ♦ బలికించునెలనాఁగ, పదునాల్గువిద్యల ♦ పట్టుఁగొమ్మ
యీరేడుభువనంబు ♦ లేలు సంపదచేడె, మొలకచందురుఁ దాల్చు ♦ ముద్దరాలు
వెలిచాయకోడమ రా♦చిలుకనెచ్చెలికత్తె, ప్రణవపీఠికనుండు ♦ పద్మగంధి
గీ. మందరాచలకందర♦మథ్యమాన, దుగ్ధపాథోధిలహరికా ♦ ధూర్తయైన
లలితసాహిత్యసౌహిత్య ♦ లక్ష్మినొసఁగు, వరద యై మాకు వినతగీ♦ర్వాణివాణి.
భీమేశ్వరపురాణము, ఆ 1.

ఉ. క్షోణితలంబు నెన్నుదురు ♦ సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ జంచరీకచయ ♦ సుందరవేణికి రక్షితామర
శ్రేణికిఁ దోయజాతభవ ♦ చిత్తవశీకరణైకవాణికిన్
వాణికి నక్షదామశుక♦వారిజపుస్తక రమ్యపాణికిన్. 1969
భాగవతము, స్కం. 1 పద్య 6.

సీ. ప్రణవపీఠమున మం♦త్రపరంపరలు గొల్వ,నుండు నేదేవి వే♦దోళగంబు
భావజ్ఞులకుఁ బరా♦పశ్యంతిమధ్యమా, వైఖరులే దేవి ♦ వర్త్మసరణి
జపహారకీరపు♦స్తకవిపంచిసమంచి, తంబు లేదేవి హ♦స్తాంబుజములు
కుందేందుమందార ♦ కందళీబృందంబు, చంద మేదేవి యా♦నందమూర్తి
గీ. కాంచె నేదేవి కాంచన ♦ గర్భచతుర, పూర్వదంతకవాటవి♦స్ఫాటమనోజ్ఞ
చంద్రికాంతశిరోగృహా♦స్థలవిహార, మమ్మహాదేవి వాగ్దేవి ♦ నభినుతింతు. 1970
జైమినీభారతము, ఆ 1 పద్య 5.

ద్విపద. వల్లకీమృదుపాణిఁ ♦ వరనీలవేణిఁ, బల్లవారుణపాణిఁ ♦ బరమకళ్యాణిఁ
జారుహారశ్రేణి ♦ సైకతశ్రోణి, వారిజాసనురాణి ♦ వాణిఁ బ్రార్థించి. 1971
హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన.

సీ. చేర్చుక్కగానిడ్డ ♦ చిన్నిజాబిల్లిచే, సిందూరతిలకంబు ♦ చెమ్మగిల్ల
నవతంసకుసుమంబు♦నందున్న యెలదేఁటి, రుతికించిదంచిత ♦ శ్రుతుల నీన
ఘనమైన రారాపు♦చనుదోయి రాయిడి, దుంబీఫలంబు తుం♦దుడుకుఁ జెందఁ
దరుణాంగుళిచ్ఛాయ ♦ దంతపుసరికట్టు, లింగిలీకపువింత ♦ రంగు లీన
గీ. నుపనిషత్తులు బోటులై ♦ యోలగింపఁ, బుండరీకాసనమునఁ గూ♦ర్చుండి మదికి
నించు వేడుక వీణవా♦యించు చెలువ, నలువరాణి మదాత్మలో ♦ వెలయుఁ గాత.
మనుచరిత్రము, ఆ 1 పద్య 5.

ఉ. కాసారంబులు సాహిణంబులు సరి♦త్కాంతుండు పూఁదోఁట వి
ద్యాసీమంబులు రచ్చపట్లు సురకాం♦తాలోకసీమంతభూ
షాసిందూరము పాదలాక్షయగు భా♦షాదేవి మత్ప్రీతిఁ జి
హ్వాసింహాసన మూనఁ గాతఁ గృతియుం♦ గ్రాలంక్రియాశక్తియున్. 1973
కవికర్ణరసాయనము, పీఠిక. పద్య 5.

మ. రమణీయాక్షరరాకృతిం బోలుచు వ♦ర్ణశ్రేణివీణానులే
పము చేతం గరఁగించి యాదునిజబిం♦బంబొప్ప నచ్ఛామృతే
త్వము శాస్త్ర ప్రతిపాదకత్వమును ద♦ద్వర్ణాళియందల్లఁ బూ
ర్ణము గావించినవాణి నిర్మలమతిన్ ♦ రాజోక్తిఁ బోల్చం గృపన్. 1974
వసుచరిత్రము, ఆ 1 పద్య 4.

సీ. ఒకటి ముకురవిలా♦సోల్లాసమునమించ, నొకటి శౌకప్రౌఢి ♦ నుల్లసిల్ల
నొక్కటి నారికే♦ళోన్నతిఁ దాల్ప నొ♦క్కటిగోస్తనీగుచ్ఛ ♦ కలనఁ దనర

నొకటి సువృత్తభా♦వోన్మేష మొంద నొక్కటి వల్లకీతుంబి ♦ కలనఁ జెలఁగ
నొకటి ధారవిశేష♦యుక్తి బెంపొంద నొక్కటి గిరీశమతాను ♦ కారిగాఁగ
గీ. వనపుసాహిత్యసంగీత ♦ రసము లనెడు, గుబ్బపాలిండ్లు దాల్చు ప♦ల్కులవెలంది
సరసగుణహారు నోబయ ♦ నరసధీయు, నవ్యకృతినాయకునిఁగా నొ♦నర్చుఁ గాత.

నరసభూపాలీయము, ఆ 1 పద్య 4.

మ. పరమప్రౌఢిన శేషవర్ణరచనా ♦ పారీణఁ డౌ బర్తృహృ
త్సరణిన్ డాయుదు నేన యేశ యను నో♦జన్ వర్ణసంధానభా
స్వరవృత్తి న్సమమూర్తులై యొకయునా♦సంగీతసాహిత్యబం
ధురవక్షోజము లూను తల్లిని భజిం♦తుం దత్ప్రసాదాప్తికిన్. 1976

చంద్రభానుచరిత్రము, ఆ 1 పద్య 4.

శా. వీణాతంత్రులసద్గుణంబులు ముదా♦విర్భావమున్ జేయఁగాఁ
బ్రాణంబున్బలె బొమ్మడించుకనుధా ♦ ప్రాయానులాపంబులన్
బాణింగూర్చుచు సారెసారెకు రుచు♦ల్వాటింపఁ బల్కించు న
వ్వాణీదేవి నటించు మద్విమలజి♦హ్వారంగమధ్యంబునన్. 1977

వైజయంతీవిలాసము, ఆ 1 పద్య 8.

శా. శ్రీచింతామణిమంత్రిదేవతజగత్ ♦ క్షేమంకరాపాంగవీ
క్షాచంద్రోదయ భక్తశేవధిమహా ♦ సంగీతసాహిత్యవి
ద్యాచారుస్తనకుంభశారద మదీ♦యస్వచ్ఛజిహ్వాస్థలిన్
వాచానృత్యము సల్పుఁగావుతఁ గవి♦త్వస్ఫూర్తి వర్తిల్లఁగన్. 1978

కవిరాజమనోరంజనము, ఆ 1 పద్య 6.

చ. తనహృదయాంబుజాతమునఁ ♦ దార్కొను నాథగతానురాగవా
హిని వెలిఁగ్రమ్మఁ జేసినొకొ ♦ యీగతి నాఁగ విధాతచెంగటన్
దనరి జపాప్రసూనసవి♦ధస్ఫటికాకృతిరక్తిఁ గుల్కువా
గ్వనజపలాక్షి మాకొసఁగుఁ♦గాత వచోరచనాచమత్కృతుల్. 1979

ఉత్తరరామాయణము, పీఠిక. పద్య 6.

గీ. వాణి నజురాణి ఘననీల♦వేణి మధుర,వాణిఁ బల్లవసంకాశ ♦ పాణిఁ బృథుల
సైకతశ్రోణి నాత్మలో ♦ సన్నుతింతు, సుమధుమధురసుధావచ♦స్స్ఫూర్తి కొఱకు.

హంసవింశతి, ఆ 1 పద్య 5.

ఉ. చేవిలసిల్లు రాచిలుక ♦ చెచ్చెర బింబమనీష నొక్కఁ గె
మ్మోవిఁ దలిర్చుగంటునలు ♦ మోములవేలుపుఁ గాంచి నవ్వఁ ద

ద్భావ మెఱింగి సిగ్గుతడఁ ♦ బాటున మో మరవంచు భారతీ
దేవి యొసంగుఁ గాత మది ♦ దీప్తకవిత్వవరోవిచిత్రతన్. 1981

శకుంతలాపరిణయము, పె. నా. ఆ 1 పద్య 6.

చ. ఎలమి సమస్తభాగ్యనుమ ♦ హీశుఁడు స్రష్టయె వేల్పుపెద్దనాఁ
వెలుఁగుచునుండు బ్రహ్మ సృషి ♦ చిత్రముగాఁ దనమాటలోపలన్
మెలఁగఁగఁజేయుభారతి స ♦ మిష్టకళావతి పెద్దతిమ్మభూ
తలపతి వేంకటేంద్రునకు ♦ ధన్యతరోక్తు లొసంగువేడుకన్. 1982

రెష్టిమతశాస్త్రము, ఆ 1 పద్య 3.

చ. హరి కనకాంబరుండు మద ♦ నారి హిరణ్యగిరీంద్రచాపుఁ డ
య్యిరువురు భాగ్యవంతులు స ♦ రేకప వారలకంటె నెక్కుడై
పరగితి వీవు నీకడుపు ♦ బంగరుపొక్కసమంచుఁ గాంచనో
దరు నలరించువాణి కవి ♦ తాచతురత్వము మా కొసంగెడున్. 198

కృష్ణార్జునచరిత్రము, ఆ 1 పద్య 6.

ఉ. అంచలతేరుపైని గమ ♦ లాసనుతోడ వసించి నేత్రప
ద్మాంచలచారువీక్షణకృ ♦ పామృతధార శ్రితాళిమీఁద నం
చంచల నించి కోరిక ల ♦ హర్నిశముం దయసేయుభారతీ
చంచలనేత్ర నాట్యములు ♦ సల్పుత మద్రసనాంగణంబునన్. 1984

రాఘవపాండవయాదవీయము, ఆ 1

ఉ. రాణఁదలిర్చుభక్తిని గ ♦ రంబులు మోడ్చెదఁ జారుసైకత
శ్రోణికిఁ జంచరీకచయ ♦ సుందరవేణికిఁ బల్లవప్రభా
పాణికి జంఘకావిజిత ♦ భావజతూణికి దివ్యభూషణ
శ్రేణికిఁ గీరవాణికిఁ బ ♦ రీతదృగేణికి వాణి కెయ్యెడన్. 1985

గణోదయము, ఆ 1 పద్య 2.

శా. వీణాపుస్తకపాణి షట్పదలస ♦ ద్వేణిన్ బృహత్సైకత
శ్రోణిన్ బద్మజురాణి సర్వనుగుణ ♦ శ్రోణిన్ బురాణి న్నతేం
ద్రాణి న్నేత్రజితైణిఁ బాదగతగీ ♦ ర్వాణిన్ బ్రవృద్ధాశ్రిత
శ్రేణి న్వాణి నభీష్టసిద్ధికి మదిన్ ♦ సేవింతు నశ్రాంతమున్. 1986

గోపీనాథరామాయణము, బాల. పద్య 6.

ఉ. ఆద్యునిఁజేసి యర్థ్యానవ ♦ మాంకునజాహ్వయయోగశక్తిస
ద్వేద్యుని సత్యనాథునిని ♦ జేర్చినొవర్చి స్వరాష్ట్రినక్షర

గీ. దమ్మిపూ యిక్కయై కడుఁ ♦ దనరుచుండ, నెల్లజగములకును దాసె♦తల్లి యనఁగ
నలరుకలుములచెలి మడి♦యాలయమున, నొప్పుగా నెల్లకాలంబు ♦ నుండు గాత.
కవిచకోరచంద్రోదయము, ఆ 1 పద్య 2.

చ. అలరులవిల్తుతల్లి చర♦ణాశ్రితపోషణకల్పవల్లి ని
ర్మలగుణరత్నరత్నముల ♦ రాసులగల్లి నిజార్చనాకుతూ
హలితనురీమతల్లి కడు♦నక్కటికంబులపాలవెల్లి వే
డ్కలఁదగుతల్లితల్లి మద♦గారమునందు వసించుఁ గావుతన్. 1997
రాఘవపాండవయాదవీయము, ఆ 1.

మ. అకలంకస్థితిచే నజస్రితనుకాం♦డాలింగనారంభకౌ
తుకసంభద్భుజశాఖమాసకలస♦ద్భూజంబునందిచ్చమీ
ర(?) కుచస్ఫారగుళుచ్ఛయై పెరుగు నా♦లక్ష్మీమహాకల్పవ
ల్లిక మమ్మెప్పుడు సత్కృపాఫలితదృ గా♦లింజూచి రక్షించుతన్. 1998
రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 1 పద్య 1.

చ. లలితపరాక్రమక్రమవి♦లాసకలాసముదాయభోగభా
గలఘుతరాచ్ఛలక్షణము ♦ లారసి యారసికుండె యర్హుఁడౌ
చెలిమిని రామరాడ్విభున ♦ కిందిర సుందర మందిరంబుల
న్నిలిచి యనేకరాజ్యపద ♦ నిశ్చలయుక్తి ఘటించుఁగావుతన్. 1999
రాఘువంశముక్తావళి, ఆ 1 పద్య 2.

## పార్వతీస్తుతి.

చ. మునిమనుజాసురాహిసుర♦ముఖ్యులు మున్నుగ సర్వజీవులన్
దనవశ మర్థిఁ జేసి మను♦దర్పకు నోర్చిన వీతరాగిఁ జి
ద్ఘనతను నీశునాత్మశుభ♦గస్థితి మైమెయి నర్థనారిఁజే
సినసగజాత మత్కృతిని ♦ జేకొని తత్సుభగత్వ మీవుతన్. 2000
కుమారసంభవము, నన్నె. ఆ 1.

చ. అమరనదీసమేత కమ♦లాప్తభవారుచిశీతభూధరో
త్తమరమణీయనీలజల♦దద్యుతిసైఖరి వెల్లదీవిపై
నమరిన సింధురాజతన♦యాధిపదీపిత దీప్తి మీఱుచున్
రమణని యర్ధదేహమున ♦ రంజిలు గౌరి శుభంబు లీవుతన్. 2001
బహులాశ్వచరిత్రము, ఆ 1 పద్య 4.

చ. పరిణయవేళయందుఁ దన◆పాదముఁ బట్టియు సన్నికంటిపైఁ
దిరముగ మోపి కంతునకుఁ◆ దీఱఁగదా పగ యంచు నీలకం
ధరుఁడు దరస్మితుం డగుటఁ◆ దద్వలయాహిఫణాగ్రరత్నసం
దరముకురంబునం గని యె◆ద న్మదమందు భవానిఁ గొల్చెదన్. 2002

అప్పకవీయము, ఆ 1 పద్య 21.

చ. పరిణయవేళ నాగ్నిక◆పద్మముపైఁ జెలిమించు ముత్తెముల్
కరముల నించి నించి యొడి◆కంబడగన్ దలఁబ్రాలు వోసి యా
హరుమెయిజాలుగో నలిను◆రావగసిగ్గున డిగ్గ నంచులోఁ
బరిహాసనంబొనర్చు నల◆ పార్వతి మాకు శుభంబు లీవుతన్. 2003

వాల్మీకిచరిత్రము, ఆ 1.

సీ. అలరుపెంగడిమితోఁ◆టలనాడు పూఁబోఁడి, పూపవెన్నెల జేనిఁ◆ బూనుచాన
కోరి యేనుఁగుమోముఁ◆ గొడుకుఁగాంచినతల్లి, చిలువదాలుపువేల్పు◆వలపుటింతి
తెలిబొబ్బమెకపు మే◆త్తేజి నెక్కెడి దంట, చెదుగురక్కసిమూఁకఁ◆జిదుమదిట్ట
తొలుపల్కుగిల్కుటఁ◆దెలు గల యెలనాఁగ, యెల్లమేట్లెంకియై◆యొసఁగుచాన
గీ. యొనరఁ దెఱగంటితెరవల◆ యుడిగములకు,నడరియుడివోనిబలుసిరు◆లిడెడుదిట్ట
గట్టుదొరపట్టియైనచేని◆కనికరమునఁ,బొదలుచును మమ్ము ననయంబుఁ◆బ్రోచుఁగాత.

నీలాసుందరీపరిణయము, ఆ 1.

శా. శ్రీవాణీకరచామరద్వయరుచుల్◆ చెన్నొందువక్త్రస్ఫుర
ల్లావణ్యాఖ్యపయోబ్ధివీచికలలీ◆లన్ జాల రాణింపఁగా
శైవాంకస్థలభద్రపీఠవసతిన్◆ సౌఖ్యోన్నతిం గాంచు నా
ర్యావామాక్షి యొసంగు మా కతులవి◆ద్యైశ్వర్యసత్కీర్తులన్. 2005

భోజసుతాపరిణయము, ఆ 1 పద్య 1.

ఉ. గాంగపయోరుహోత్పలముఁ◆ గన్గొని మాళినిగూఢయైనయ
ప్యాంగన నేత్రిలక్ష్మియని◆ యల్గిన నీశుఁడు తావకీనదృ
క్స్వంగవికీర్ణకాంతియిది◆ సత్యము కన్నులు మూయు పాయు నాఁ
బొంగుచు నట్లచేసి నగు◆భూధరకన్యక నన్నుఁ బ్రోచుతన్. 2006

మూర్తిత్రయోపాఖ్యానము, కృత్యాది. పద్య 5.

ఉ. ఊరక చుట్టుకొన్నఁ గమ◆లోత్పలపంక్తులు వాడు నంచునో
యేలును నూర్చి చుట్టితివ◆ యెంతటిజాణవు మేలు మేలు నీ

నేరుపు మెచ్చవచ్చునని ♦ నెచ్చెలు లిచ్చక శంభుఁ గేరునా
హారగిరీంద్రకన్యక ద♦యారతిఁ గోర్కులు మాకొసంగుతన్. 2007

ఉత్తరరామాయణము, కి. తెక, పద్య 4.

క. హస్త్యనుకంపాముదితమ, హర్యము నిజజనకసంతి ♦ లాహార్యను సౌం
దర్యకళార్ధాంగీభవ,దర్యను గుణవర్య నార్య ♦ నాత్మఁ దలంతున్. 2008

రాఘవపాండవయాదవీయము, ఆ 1.

ఉ. స్నానజలంబు ఘాతకవస♦నంజనులేపన మోగిరంబుఁ దా
నే నెఱఁగూర్చి నాథు నెనఁ♦యించును జెండికికూఁతు రంచు సం
ప్యానముఁ బూని యుర్వరుని ♦ యుప్పనటంచు నటించు భృంగిచం
దానకు నెచ్చెలుల్ నగఁ ♦ దవ్వేడు శాంకరి మమ్ముఁ బ్రోవఁగన్. 2009

మహేంద్రవిజయము, ఆ 1 పద్య 4.

సీ. సర్వమంగళ గాన ♦ సర్వమంగళ దాన, చాతురీకలనంబు ♦ సంతరించి
దుర్గ గావున మహా♦దుర్గావనస్పృహా, నిరతతాత్పర్యాఖి♦స్ఫురణఁ గాంచి
యార్య గావున సము♦స్తార్యసేవాకరిమ, స్థిరతత్పరత్వవృ♦త్తిని ఘటించి
యచలాత్మభవ గాన ♦ యచలాత్మభవమాన, నీయసంపదఁగదు♦జించి యించి
గీ. రాజరాజేశ్వరీదేవి ♦ రామరామ, ంయరాజ్మౌళికినిరంత♦రాయకీర్తి
రహీదగనితోధికాఖండ♦రాజ్యలాభ,ములనొసఁగుఁ గాతభూపుత్ర♦మోదయగుచు.

రామవంశముక్తావళి, ఆ 1 పద్య 4.

## జానకీస్తుతి.

సీ. సకల లోకాభినం♦ద్యకలాకలాపంబు, చోఁదయు నెమ్మొముసం♦నురునితోడ
బహుదివ్యఫలపరి♦పాక సౌభాగ్యంబు, నెదపుకెమ్మోవిమా♦నికముతోడ
నవవయశ్శ్రీనిధా♦నంబులై తగునురో, భవసుధాపూర్ణకుం♦భములతోడ
నమ్లానసుమమాలి♦కాభిరూప్యముఁ దాల్చు, లలితభుజాకల్ప♦లతలతోడ
గీ. నడరి జనకాబ్ధిసీమరా♦మాభిధాన, హరికహీనగుణపోషిత♦హరిరాస
గిరిమథనయత్నమునఁ దోఁచు♦సిరియ శేష,రాజ్యములొసంగుఁ జెరుమఁ ♦ రాయమణికి.

వసుచరిత్రము, ఆ 1 పద్య 2.

సీ. నిఖిలలోకానంద♦నీయస్థిరోద్భూతిఁ, బొలుచుమనోహృత్తాం♦భోజపాణి
యంభోధిమథనాస♦హాయశౌర్యపరాస్త్రఁ, జాలమించునవాస్త్ర ♦ సంశ్రితశీల

క్ప్రసరణము ల్సుధారస ప♦రంపరలై యలరారఁ గాత నేఁ
డసదృశవైభవస్ఫురణ ♦ నస్మదభీష్టలతాఫలాప్తికిన్. 2016

మహేంద్రవిజయము, ఆ 1 పద్య 2.

చ. సుకవులవాక్కులన్ నృపుల ♦ చూడ్కుల సాధ్వుల మోములందు గో
పికరములం బయోజవన♦వాటికలందునుబోలె లీల మా
మకమగు మందిరంబున స♦మగ్రముదాస్పదయై వసించి జా
నకియగు లక్ష్మి మమ్ముల న♦నారతసంపద లిచ్చి ప్రోవుతన్. 2017

నయనోల్లాసము, ఆ 1 పద్య 2.

# దశావతారస్తుతి.

మ. గురుపాఠీనమవై జలగ్రహమవై ♦ కోలంబవై శ్రీనృకే
సరివై భిక్షుఁడవై హయాననుఁడవై ♦ క్ష్మాదేవతాభర్తవై
ధరణీనాథుఁడవై దయాగుణగణో♦దారుండవై లోకముల్
పరిరక్షించిననీకు మ్రొక్కెద మిలా♦భారంబు వారింపవే. 2018

భాగవతము, స్కం. 10 పూర్వ. పద్య 100.

సీ. నీటిలోఁ జిప్పకక♦నిలిచి క్రిమ్మలుపూనికఁ, గఠినకర్పరపుఁజూ♦క్కానుబిగువు
దంష్ట్రినెత్తి సమహీ♦తలపుగాడుపుఁజీర, యురుదారుకలనయం♦దుదయ మగుట
పరులకుఁ [illegible] ♦ [illegible]మిచూపువిధంబు, పులిమిన నెత్రుగు♦గ్గిలపునూనె
ద్వీపాంతరముసకుఁ ♦ దెగువమైఁ జను పెంపు, చేముట్టునాఁగంటి♦జీనుతగులు
గీ. సౌగతాగమమాలిమి ♦ శాస్త్రసరణి, వల్లువల్లనచిత్రిధా♦వనముగల్లు
నిన్నుఁ దరిచేసి భవవార్ధి♦నిస్తరించి, దరిఁ దటియకున్నఁ గలదె మో♦ద ముమురారి.

పాండురంగమాహాత్మ్యము, ఆ 2 పద్య 66.

క. భువనగకచ్ఛపకిటిమా,నవసింహాదిత్యభృగుజ♦నరాఘవయా
దవబుద్ధకల్కులను గే,శవుపదిరూపములు మది న♦జస్రముఁ దలఁతున్. 2020

అప్పకవీయము, ఆ 1 పద్య 9.

మ. సరసుల్ మెచ్చఁగ మీనమై కమఠమై ♦ సత్పోత్రియై మర్త్యకే
సరియై వామనుఁడై త్రిరామతనుఁడై ♦ సర్వజ్ఞుఁడై కల్కియై
ధర జన్మించి భయంబు మాన్చి భువన♦త్రాణైకదీక్షాధురం
ధరుఁడై యొప్పెడు దైవతం బొసఁగు భ♦క్తశ్రేణికిన్ సౌఖ్యముల్. 2021

జాహ్నవీమాహాత్మ్యము, ఆ 1 పద్య 2.

# మత్స్యావతారస్తుతి.

క. మీనయి తానతలగతం, బైనిగమచయంబుఁ దెచ్చి ♦ యజునకు నొసఁగం
గా నేర్చిన సుమనస్సమ్మానితునుగ్రగ్రహాబ్ధిజంతు ♦ మత్స్యాత్మహరిన్. 2022
భారతము, శాంతి. ఆ 2 పద్య 39.

గీ. కపటమత్స్యంబవై నీవ్ర ♦ గడలినడుమఁ, బుచ్ఛ మల్లార్చ నెగసిన ♦ భూరిజలము
మింటఁ గడుఁదెల్లనై పాలు ♦ మంటఁ జూచి, యభ్రనదియందుపక్షించు ♦ నఖిలజగము.
శృంగారనైషధము, ఆ 8 పద్య 120.

ఆ. ప్రకటమకరపరిణ ♦ పాశంబులందుల, జలములందు నెందుఁ ♦ జొచ్చియుండఁ
గాచుఁ గాక నన్ను ♦ ఘనుఁ డొక్కఁడైనట్టి, మత్స్యమూర్తి విష్ణు ♦ మహానకీర్తి.
భాగవతము, స్కం. 6 పద్య 301.

మ. మితి గపీకం బిమింగిలక ♦ మెమ్మయి నెంచిన నీదువాతఁ గు
త్సితపలలాశిపైరోచబుఁ ♦ జేఁపదిపోక్కటనీ భ్రమింగుచే
శ్రుతులను మూరుప్రత్యగుడఁ ♦ జొచ్చుతటి న్హవబేధనైధనై
దితిజవశక్తి నీడ్చుకొని ♦ తెచ్చుటకాక తవల్పతాల్పతన్. 2025
ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 19.

ఉ. వాలము తాఁకున న్విరులు ♦ వజ్రనిపాతముసంస్మరింపఁ బెన్
వాలుగవై మహార్ణవము ♦ నం దొలుఁబల్కుల దొంగరక్కసున్
వాలికవంకవాఁడిగతి ♦ వ్రచ్చి వెసన్నిగమాలిఁ దమ్మిపూ
చూలికిఁ దెచ్చియీవె త్రిద ♦ శస్తుతనీయ మురాసురాంతకా. 2026
పారిజాతాపహరణము, ఆ 3.

చ. విలయతమిస్రవేళ నతి ♦ వేలమహాంబుధి నూర్ధ్వలోకవా
సులు నతులై కనుంగొనెడు ♦ చూడ్కుల కొవ్వహుతాశనక్రియా
కలితగతిన్ వెలుంగు ఘన ♦ కాయవిజృంభణఁ జొబమీనవై
కలయఁగఁ గ్రాలునీవెడఁద ♦ కన్నులు ప్రోచు మమున్ మురాంతకా. 2027
మనుచరిత్రము, ఆ 6 పద్య 106.

చ. ముదమున సోమకాసురుఁడు ♦ ముచ్చిలి యచ్చలమూరఁ గొన్న ప్రాఁ
జదువులు తెచ్చి తజ్జరగ ♦ నాంద్రితరాంత్రములంటనంటు బల్

గడుఁదూలంగఁ గీర్తియను ◆ గంగఁ దోలంచి విధాతృవిస్ఫుర
ద్వదనసరోజగంధములఁ ◆ బంబులు చేసెతగా జగన్నిధీ. 2029
పాండురంగమాహాత్మ్యము, ఆ 2 పద్య 56.

సీ. మొగము శంఖము మీస◆ముల్లదాఖడ్గము, లొప్పులనుచక్రమువాల◆మనుపశార్ఙ్గ
మనుబూని మగమీన◆మూర్తివై మెఱసి పా, తాళమొఱసి తట◆స్థలి దొఱసి య
రసి "స్వయంతీర్ణః ప◆రాంస్తారయతి" యని, నోజగానిఁది "యః◆శ్యుచ్ఛ్రియః ప
తనహేతు" వనిసోమ◆కునకుఁ జెల్ప సుభాల్గు, ఖాల్గుఖాల్గ నెగసి◆పడుచుఁగడలిఁ
గీ. గ్రిచ్చుకొనివచ్చుముచ్చుపై◆వ్రచ్చిశ్రుతులు, దెచ్చివిధికిచ్చినట్టినీ◆హెచ్చువినుతి
సేతు వైకుంఠనాథ ! ల◆క్ష్మీసనాథ !, రక్షణపరాయణుండ ! నా◆రాయణుండ!
రుక్మిణీపరిణయము, స. భ. ఆ 4 పద్య 102.

ఉ. ప్రళయాప్తపూర్ణజలార్ణవాంతరవివ◆ర్ణాకీర్ణధావత్తిమిం
గిలదూర్త్రానుగతిస్వతాలుయుగవి◆క్షేపాంబునిర్ఘోషని
ర్గళితామ్నాయ సనత్పునః పరిసత్కృ◆ద్వ్యాభ్రింతిప్రపదాత్మస్వరూ
పలసత్ప్రాభవమూర్తి మద్గురు పర◆బ్రహ్మాంబనీవేహరీ. 2030
యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

మ. హితమత్స్యాకృతిఁదాల్చి యబ్ధిఁబడి సెం◆పేపారదోర్వీర్యవి
స్ఫురితరక్షాసురుసోమకాసురుఁ గతా◆సుంజేసి మున్నంచిత
శ్రుతికాంతామణి నుద్ధరించినగతిన్ ◆ శుంభద్బలారాతిసం
హతిఖండించి ననుగ్రహింపుము మహా◆త్మా దేవకీనందనా. 2031
రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 4.

## కూర్మావతారస్తుతి.

క. అమృతమథనమున మంథన,గమలీలోద్ధరణకేలిఁ ◆ గైకొనిసురసం
ఘమునకు బ్రియమొనరించిన, యమేయుఁగూర్మాత్ము నంబు◆జాక్షుఁ గొలుతున్.
భారతము, శాంతి. ఆ 2 పద్య 40.

క. గతభువనసర్గసముదయ, ధృతభూవలయాంకసదృశ ◆ దృఢచరమతనూ
వితతబహుచక్రచిహ్నముఁ, బలగధ్వజకపటకచ్ఛ◆పమునినుఁగొలుతున్. 2033
శృంగారనైషధము, ఆ 8 పద్య 121.

మ. జలపూరప్లవమానమృణ్మయమహీ◆సంరక్షకైగారయీ
బలెం, ముక్తామణిశుక్తిశంఖనికరం◆బంబెల్లఁ జూర్ణంబుగా

జలధిప్లవద్రజసద్మజిహ్వాజీపరివరి ♦ భ్రామ్యన్మహామందరా
చలసంఘృష్టిమహత్ప్రపన్నైకమక♦చ్చాని విన్నుం గొల్చెదన్. 2034

ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 20.

చ. చటుల కృపీటసంస్థితకు♦శేషశిశ్రిలకపుంపితగాత్రయి
చ్యుతపదమౌలి కంఖమునఁ♦జక్కకడెంబము మస్తగా విశం
కటపటమాంగమంఘకీ♦మస్తకఁజేసి ఘనప్రమైక్యపా
పటిమ జగంబుఁబ్రోచు నల ♦ వార్షిక్యమంబు విభున్ భజించెదన్. 2035

మనుచరిత్రము, ఆ 6 పద్య 107.

ఉ. కోపనశావనవ్యశిఖి ♦ గోత్మసఁగం గనుగందిముందిత
త్తాపము నాఁపలేకతమి♦షామజలభ్రమిఁగూలి తూలుజం
భాపహరాజ్యలక్ష్మివెర♦వాఁగఁ దెల్పవెయాతకాయహా
పైపృథుకర్పరంబమర ♦ నాశ్రితరక్షణపక్షిరేఖకా. 2036

పాండురంగమాహాత్మ్యము, ఆ 2 పద్య 57.

సీ. అమృతవారాశి కు♦టము మందరముఁ గవ్వ,ము ఫణి రజ్జువుఁజేసి♦పూర్వదేవ
తలు దేవతలుఁ బట్టి♦తరువగా ఘుమఘుమ, ధ్వనుల బ్రహ్మాండము♦తల్లడపడ
నపుడు "పరోపకా♦రార్థ మిదం శరీ,ర"మని కూర్మావతా♦రమునఁగ్రుంగి
నగిరిక్రిందనిలచి ♦ "నానోన్నదకసమదా,న"మని యింద్రాదుల♦కమృతమిచ్చి
గీ. నిరుపమానలక్ష్మిరమ♦ణీమణీమ,ణులు గొలువ విలసిల్లితో ♦ నలఘుదాన
శీల! వైకుంఠనాథ! ల♦క్ష్మీసనాథ!, రక్షణపరాయణుండ! నా♦రాయణుండ!

రుక్మిణీపరిణయము, స. భ. ఆ 4 పద్య 103.

మ. సుచిరాలబ్ధమధూపగూహనకళా♦త్సుక్యార్ణవస్వర్ణదీ
ద్విచరుద్వైకరసాస్రికేళిపిధిసా♦క్షిభూతమందాచలో
ద్ధ్వచరప్రస్థరధూర్వహాభ్రగసుధాం♦ధస్సాధనాపధ్యరా
బ్రచనాఘుట్టిఘటట్టపృష్ఠకమఠ♦బ్రహ్మంబ వీవే హరీ. 2038

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

చ. విగతరజస్తమోనతుఁడు ♦ విశ్వమయుండు ననాది రూపుఁడై
నెగడినయెవ్వఁ డీశ్వరితుల ♦ నేర్పడలిర్ప సృజించిమించె ని
జ్జగతి నజస్రముం గమఠ ♦ సత్త్వముఁడై భరియించె నెవ్వఁడ
య్యగనిలయప్రియున్ హరి న♦నంతుని నే శరణంబు నొందెదన్. 2039

కృష్ణాభ్యుదయము, పద్య 50.

మ. అసురారాతిత్వత్కృతోరుమంథరమహీ◆ధ్రాలోడనోద్యత్పరి
 త్రాసస్పృద్ధూతవికర్షణభ్రమితదు◆గ్ధాంభోధిమధ్యోత్థభ
 వ్యసుధా [illegible] గతరంగసంగతమహా◆వర్తోద్భవన్ లక్ష్మినిం
 పెనఁగ [illegible] గైకొనినట్లు జేకొనుము న◆న్నీశా సముల్లాసివై. 2040

రుక్మిణీకల్యాణము, జన్నా. వేం. రం. ఆ 4.

## వరాహావతారస్తుతి.

క. వారాహరూపమునఁ జెం, పారినవదనదంష్ట్రనొకట◆ నవనిసగిరికాం
 తారంబుగ నెత్తినయా, శౌరిం గ్రోడాత్ముఁ దలఁతు◆ సమ్యగ్భక్తిన్. 2041

భారతము, శాంతి. ఆ 2 పద్య 41.

శా. క్రూరుండైన హిరణ్యనేత్రుఁడను ర◆క్షోవీరుఁ డక్షోభ్యుఁడై
 వేమాపేదఁగఁ గ్రుంగఁ ద్రొక్కిన మహా◆విశ్వంభరాచక్రమున్
 వారాహాకృతి నుద్ధరించి సుచిరా◆వాప్తిం బ్రతిష్ఠింపఁగా
 గారుణ్యం బొనరించి తెవ్వనికి శ◆క్యం బిట్లు క్రీడింపఁగన్. 2042

హరివంశము, పూర్వ. ఆ 6.

గీ. చించి వెడలిన తనురుహ◆శ్రేణి చేతఁ, బద్మజాండంబు కడపపూ◆బంతిఁ బోలఁ
 బెరిఁగియున్నట్టి కిటిరూప◆ధరుని నిన్నుఁ, ఖురచతుష్టయబిలచతు◆శ్శరధిఁ గొలుతు.

శృంగారనైషధము, ఆ 8 పద్య 122.

ఉ. అరయఁగ నెల్లలోకములు◆ నంతెలి నొంది మహార్ణవంబులో
 నొరగి నిమగ్నమైనధర◆ నుద్ధతిఁ గొమ్మున నెత్తినట్టియా
 కిరిపతి యగ్నికల్పుఁ డురు◆ఖేలుఁడు నూర్జితమేదినీమనో
 హరుఁడు కృపావిశేషయుఁడు స◆ద్బాధ్వముల న్నను గాచుఁ గావుతన్. 2044

భాగవతము, స్కం. 6 పద్య 804.

చ. ఒకమతి ఋడ్డగింప విల◆యోదకము ల్పయినుబ్బి చిప్పవ్రి
 స్సుకొని మహాక్షితీధ్రజన◆ నూకరలె న్మెయివెంచి వెండి క్రిం
 శికిఁ గయివాలు తత్సలిల◆ నిర్మలధారసతిః పరస్ఫుర
 త్ప్రతికృతికి నీయజాండమును◆ బంగరుముంగఱఁగా నొనర్చవే. 2045

ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 21.

ఉ. ఆపెనువెల్లిఁ జెర్లు మక◆రాకరమేఖల నీవు దేర్చియు
 ష్ఠాపదటంకవిభ్రమవి◆డంబినియా నిజదంష్ట్రిఁ గూర్చుత

ద్రూపము దీక్షితంబగు స♦రోరుహలోచన ! సప్తజిహ్వాజి
హ్వోపరిభాగధూమపటల♦యోపమమై విలసెఁ బల్వలాలన్. 2047

పాండురంగమాహాత్మ్యము, ఆ 5 118.

సీ. హిమగిరిఁ గేరు దేహముపజ్రములతీరు, రోమములుఁ బ్రళయా♦భ్రములసరి కనుఁ
గవయు బ్రహ్మాండముఁ♦గబళించుముట్టెతో, తాళముఁ బెకలించు♦దంష్ట్రయొప్పఁ
గ వరాహమూర్తివై ♦ కదిసి హిరణ్యాక్షు, గర్భనిర్భేదివై♦భూర్యాపన్న
పక్షయచ్ఛేదివై ♦ వారాశిమగ్నభు,గ్నవసుంధరోద్ధర♦ణప్రమోది
గీ. వై జగతి "యతో ధర్మస్త♦తో జయ" యను, వచనము నిజముఁ జేసిన♦వర్ధమాన
కీర్తి ! వైకుంఠనాథ ! ల♦క్ష్మీసనాథ, రక్షణపరాయణుండ ! నా♦రాయణుండ.

రుక్మిణీపరిణయము, స. భ. ఆ 4 పద్య 104.

మ. ఖరకృద్ధ్యోహిరణ్యదైత్యహరణో♦గ్రప్రక్రియాకల్పకో
ద్ధరణాంభోజభవాండభాండరచనా♦స్వీకృతస్వక్షమా
ద్వరపిండోపమమేరుమండితదిగం♦తక్షోణిచక్రిస్వని
ర్భరశంకూకృతదంష్ట్రికాంకురకిటి ♦ బ్రహ్మంబ వీవే హరీ. 2048

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

చ. సురరిపుభీతిచే బెగడు♦చున్ ఫణివాసము డాసియున్న యి
ద్ధరణి సముద్ధరింప నిశి♦తక్షురనిష్ఠురభీకరస్ఫుర
త్ఖురనికరక్షతిన్ దనుజ♦కోటులమీటి కిటీంద్రరూప మే
హరి! ధరియించె నయ్యజున ♦ నంతుని నే శరణంబు నొందెదన్. 2049

కృష్ణాభ్యుదయము, పద్య 51.

# నరసింహావతారస్తుతి.

ఆ. నారసింహవపురు♦దారభావమునొంది, ఘనుహిరణ్యకశిపు ♦ ఖరనఖముల
వ్రచ్చిదీప్తమూర్తి ♦ వరలునృసింహాత్మ, నాత్మభవుని భక్తి ♦ నాశ్రయింతు.

భారతము, శాంతి. ఆ 2 పద్య 42.

క. మెచ్చి ప్రియభక్తునకునై, వ్రచ్చితి ఖరనఖరముల హి♦రణ్యకశిపు న
య్యాచ్చెరువు నృసింహాకృతి, యిచ్చఁ దలఁచి తలఁచి కొలుతు♦మేము నిను హరీ.

హరివంశము, పూర్వ. ఆ 6.

మ. అతిగంభీరహిరణ్యదైత్యహృదయా♦హంకారకూపోదరా
పతితస్వర్గరమానువర్ణకలశ♦ప్రత్యుద్ధృతిప్రక్రియా

యుతపంచాంగుళలోహయంత్రమగునీ ◆ హస్తంబువర్ణింతును
ద్ధతకంఠధ్వనికుంఠితారిహృదయో◆త్కంపాన్నృకంఠీరవా. 2052

శృంగారనైషధము, ఆ 8 పద్య 123.

ఉ. అడవుల సంకటస్థలుల ◆ నాజిముఖంబుల నగ్నికీలలం
దెడరుల నెల్ల సాకు నతి ◆ కెక్కఁగ దిక్కగుఁగాక శ్రీనృసిం
హుఁడు సురశత్రుయూథపవ◆ధోగ్రుఁడు విస్ఫురితాట్టహాసవ
క్త్రుఁడు ఘనదంష్ట్రపావకవి◆ధూతదిగంతరుఁ డప్రమేయుఁడై. 2053

భాగవతము, స్కం. పద్య 303.

మ. అసురేంద్రాశయకుండికాచ్ఛరుధిర◆వ్యాప్తస్వకచ్ఛాయఁగాం
చిసముద్యత్ప్రతిసింహమత్సరమిళ◆చ్చేష్టన్ దదుద్దామదీ
ర్ఘసటాఝూటముఁ బెల్లగించుగతి నాం◆త్రశ్రేణిఁగిన్కం బెరం
జుసితక్రూరభవన్నఖావళులుప్రో◆చున్మర్త్యపంచాననా. 2054

మ. మునుమున్ దెల్పను దూఱఁదూఱ నతికెం◆పున్వొండియుందూఱఁగం
దనగాయంగల నల్పుఁదోఁపనఖకో◆ణశ్రేణిచే విక్రమం
బునవాఁడుగ్రతఁగొన్నయట్టి విలస◆న్మూర్తిత్రయీ తేజముం
గొనులీలన్విదళింపవేయసురవ◆క్షోభిత్తిమిథ్యాహరీ. 2055

ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 22, 23.

చ. అలఘుజగద్విపద్విపఘ◆టాంకుశశాతనఖాంకురాగ్రలాం
గలములమున్న నీవసుర ◆ ఘస్మర ! వైరిభుజాంతరాళజాం
గలమహిఁజాలువట్టిపయిఁ ◆ గ్రమ్మెడు నెత్తురు నీరువెట్టి యం
దలుకవెకీర్తిపూర్తికల◆మాంకురమిందిరమాఫలార్థనై. 2056

పాండురంగమాహాత్మ్యము, ఆ 2 పద్య 59.

సీ. ఎంతఁ జదివిన ర◆వంతకులాచార, ధర్మ మెఱుఁగడని◆తనకుమార
కుఁడయిన ప్రహ్లాదు ◆ నొడిసిపట్టి తెగన,ఱకవచ్చినట్టి హి◆రణ్యకశిపు
కట్టెదుట నినుప◆కంబము పటుపటఁ, బగులఁబొగ లెగయ ◆ భగభగ మను
పెనుమంటఁ జిటజిట◆మనుమిడుఁగురులు బ్రహ్మాండము నిండ బ్ర◆హ్మాదులు గడ
గీ. గడ వడఁక నల్లడ లడల◆వెడలి కేవ్వ, నార్చి రిపు నేర్చి వటు నేలి◆నట్టి శ్రీనృ
సింహ ! వైకుంఠనాథ! ల◆క్ష్మీసనాథ!, రక్షణపరాయణుండ! నా◆రాయణుండ!

రుక్మిణీపరిణయము, స. భ. ఆ 4 పద్య 105.

మ. సదసత్సంశయవాదభేదనకళా◆చారంభకుం ... ... ...
భేదహస్తంభవినిర్గతాత్మమహచి◆త్ప్రహ్లాదగుర్వాశ్రయా
[illegible] లోకసనసన◆చ్ఛ్రాద్ధనిర్దర్శిత
[illegible] ప్రహ్లాదవన్యహారి ◆ బ్రహ్మంబ వీవే హరీ. 2058

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

ఉ. క్రోసిచెడన్ హిరణ్యకశి◆పుక్రతుభుగ్రిపురాట్పురారథా
రావృతవక్ష మగ్రినఖ◆సంప్రకరంబుల గ్రుచ్చిచ్చి వచ్చి ప్ర
హ్లాదున కేవయానిధి హి◆తాపహుఁడయ్యె నృసింహమూర్తియై
యాదనుజవరిజాంతకు న◆నంతుని నే శరణంబు నొందెదన్. 2059

కృష్ణాభ్యుదయము, పద్య 52.

మ. చటులస్ఫూర్తి వికంకటప్రకటదో◆స్సానస్ఫురత్స్ఫారశిమో
త్కటితస్తంభవినిర్గమోత్కటమహో◆దీప్యన్నృసింహాకృతిన్
పటుబాహాబలుఁడౌ హిరణ్యకశిపున్ ◆ ఖండించి ప్రహ్లాదసూ
త్కటసద్భక్తి రమన్ గ్రహించుగతినన్ ◆ గైకొమ్ము లక్ష్మీశ్వరా. 2060

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం.ఆ 4.

## వామనావతారస్తుతి.

క. వామనరూపంబునను,ద్దామబలున్ బలినడంచి ◆ త్రైలోక్యాతి
క్రామత జేర్చిన యద్భుత, ధాముం గ్రాంతాత్ముఁ దలఁతు ◆ దామోదరునిన్.

భారతము, శాంతి. ఆ 2 పద్య 43.

క. వామనరూపంబున నీ, వా మెయి బలివేఁడఁ జనుట ◆ యటమీఁద మహో
ద్దామమహిమ యటఁజూపుట, దామోదర మాదృశులకుఁ ◆ దరమె నుతింపన్.

హరివంశము, పూర్వ. 6.

గీ. భోగి సహవాససంబంధ◆ములు భజింతు, భువనదారహస్తంబునఁ◆బోయుమనుచు
కెంటమాటల బలిఁ బ్రతా◆రించినట్టి, దంభవామన మామన◆స్తాప ముడుప.2063

మ. తటిసాక్రాంతసమస్తలోకబలిదై◆త్యధ్వంసి యో దేవ నీ
యటకాలుద్ధతి రాహుమండలము బ్ర◆హ్మాండంబుతో నొత్తినం
గుఱుగు జ్ఞంచెడసంది బిట్టొరలు న◆గ్ఘోరాహినీయంఘ్రికిన్
గిఱుఁజెప్పైనవిధంబు వామనములోఁ ◆ గీలించినట్లయ్యెడున్. 2064

గీ. తిరిగెనంట జాంబవంతుండు ♦ దేవనీకు, దైత్యబంధనవేళఁ బ్ర♦దక్షిణంబు
దద్భ్రమీచక్రవలయంబు ♦ దంభవటుక, యుచితబంధనరజ్జువై ♦ యుండకున్నె.
శృంగారనైషధము, ఆ 8 పద్య 124, 125, 126.

క. వటుఁడు సమాశ్రితమాయా, పటుఁడు బలిప్రబలశోభ ♦ నప్రతిఘటనో
ద్భటుఁడు త్రివిక్రమదేవుఁడు, చటులస్థలమందు నన్ను ♦ సంరక్షించున్. 2066
భాగవతము, స్కం. 6 పద్య 302.

మ. బలిదైతేయ భయాంధకారభరిత ♦ బ్రహ్మాండగేహంబులోఁ
బలెఁ బైమండెడు తత్ప్రతాపమయదీ♦పజ్వాల డిందన్ గడుం
దలమై మింటికి గ్రక్కునన్ నెగయు ను♦ద్యత్తన్మహాచ్ఛాయనాఁ
గలనీలాంకము శింశుమారమొరయం♦గాఁ బెంపవే వామనా. 2067
ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 24.

క. దండితబలివై జగములు, నిండఁబెరుగుచున్నవేళ ♦ నీయడుగున భూ
మండల మతిసూక్ష్మాకృతిఁ, గొండిక మచ్చయునఁబోలెఁ ♦ గొమరొందు హరీ.
పాండురంగమాహాత్మ్యము, ఆ 11 పద్య 60.

సీ. అదితికశ్యపునకు ♦ "నంగుష్ఠమాత్రః పురుష" యనువచనము ♦ రూఢిసేయ
వామనమూర్తి న♦వతరించి వడుగవై, గొడుగు జందెముఁ బచ్చ♦గోఁచిపంచె
పంచశిఖలు మౌంజి ♦ పాలాశదండము, కృష్ణాజినము చెంబు♦నిట్టివేష
మమర "నణోరణీ♦యాన్మహతో మహీ,యా" నన్న వేదవా♦క్యము ప్రసిద్ధి
గీ. పడ బలికడను బుడమి మూఁ♦డడుగు లడిగి, త్రిభువనములాక్రమించువ♦ర్ధిష్ణువనిభ
జింతు వైకుంఠనాథ! ల♦క్ష్మీసనాథ!, రక్షణపరాయణుండ! నా♦రాయణుండ!
రుక్మిణీపరిణయము, స. భ. ఆ 4 పద్య 106.

మ. కృతదీక్షాధ్వరదేశకాలఫలము♦క్తిజ్ఞానసత్పాత్రస
త్కృతిదానప్రదదానవేంద్ర విభవ♦శ్రీమూర్ధబుధ్నోద్భవా
మితతత్పుణ్య యశోలతాసముదయో♦న్నేత్రపస్వవేషోత్సవ
వ్రతసంవర్ధిత విశ్వశాశ్వతవటు♦బ్రహ్మంబ వీవే హరీ. 2070
యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

ఉ. వేలుపుఁబోరిలు నేలుట క♦వేలపులీల పొసంగ వామనుం
డై లఘురీతి నబ్బలిగృ♦హంబునకేఁగి త్రిపాదమాత్రమీ

నేలవరించి యేఘనుఁడు ♦ నేర్పడఁగ్రాఁగ మూఁడులోకముల్
పోలి హరించె సాహసి న♦నంతుని నే శరణంబు నొందెదన్. 2071

కృష్ణాభ్యుదయము, పద్య 53.

మ. పటులీలన్ జమజంచి యంతట మహో♦గ్రబ్రహ్మాండసంపూర్ణ వృ
త్త్యటదంగద్యుతిచే నెసంగి బలిపై♦త్యాక్షేశభాస్వచ్ఛిర
స్తటిసైజాంఘ్రినివార్కిఁ స్వస్తరమ ని♦చ్ఛంగొన్నచందాన నన్
బటులీలంగయికొమ్ము వేగ వసుదే♦వక్ష్మాధిరాజాత్మజా. 2072

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ4.

# పరశురామావతారస్తుతి.

ఆ. పరశురాముఁడనఁగ ♦ భవ్యుండుజమదగ్ని, కుద్భవించియిరవ ♦ దొక్కమారు
మనుజపతులనెల్ల♦దునిమినకోర్ధాత్ము, నధికభక్తి శార్ఙ్గి ♦ నాశ్రయింతు. 2073

భారతము, శాంతి. ఆ 2 పద్య 44.

గీ. వేయిచేతులకొర్విన ♦ వీరుఁ దుర్చంప, నుర్వివేర్చఁగువో నిర్వది♦యొక్కమాటు
రాచప్రోవుల నుఱుపను♦ రామమూర్తి, వైననినుఁ జెప్పుదురు మును♦లాదిదేవ.

హరివంశము, పూర్వ. ఆ 6.

క. రాముఁడు రాజకులైకవి, రాముఁడు భృగుసత్కులాభి♦రాముఁడు సుగుణ
స్తోముఁడు నను రక్షించును, శ్రీమహితోన్నతుఁడు నద్రి♦శిఖరములందున్. 2075

భాగవతము, స్కం. 6 పద్య 305.

గీ. క్షత్త్రజాతికి నీచేయి♦కారణంబు, దత్క్షయంబున కదియ ని♦దాన మయ్యెఁ
గారణమునందె విలయంబు♦ గార్యమునకు, ననుటయుచితంబుగాదెరా♦మావతార.

శృంగారనైషధము, ఆ 8 పద్య 127.

మ. శమితక్షత్త్రికళత్రనేత్ర జలవ♦ర్షావేళ నీకీర్తిహం
సము క్రౌంచస్ఫుటతావకాంబకముషిం♦జాఁగంగ నీక్షించి వ
ర్షము రా నంచలునందనేఁడుఁ జనుని♦ర్బన్నాటితచ్చేష్టవా
యమిఁ దిర్యక్త్వితిదా గతానుగతికం♦బౌఁగాకుఠారీ హరీ. 2077

ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 25.

ఉ. మాతృకఠోరకంఠబిల♦మార్గగళద్రుధిరారుణౌనసం
బై తళుకొత్తుదోఃపరశు♦హంసికి మేఁత యొసంగవే రిపు

క్ష్మాతలనాథ మేచకక♦చాకుచహారిమృణాళనాళసం
ఘాతము నూత్నసైనిమద♦కర్దమనష్టన సంప్రభూతమున్. 2078

పాండురంగమాహాత్మ్యము, ఆ 2 పద్య 61.

మ. జరతాభావ మహాతపూనముపు♦శ్యాఖ్యానహాసాంకుర
త్పరిశంకానజాబాహుబాహుజకులో♦త్తంసప్రశంశాతివీ
రరసావేశరసైకవింశతికప♦ర్యాయాసహృద్విశ్వరా
ట్పరణస్వీకృతమార్గభార్గవపర♦బ్రహ్మంబ వీవే హరీ. 2079

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

సీ. జమదగ్నిగర్భవా♦సమునఁ బుట్టి వివిధ,విద్యాతపోధను♦ర్విద్యల కధి
పతివై ప్రజలి“ఇదం ♦ బ్రాహ్మ్య మిదంక్షాత్ర”,మనిముని రాజచి♦హ్నములశాప
చాపనైపుణిఁ జూపి ♦ పాపభూపతుల శ,తారికఠోరకు♦ఠారధార
నస్రధారాప్రవా♦హములు గా శతధా స,హస్రధా ఖండించి ♦ యానదులను
గీ. దర్పణముభూమి భూ గేవ♦తార్పణముగఁ, జేసినపరశురామవే♦షి వని నిను భ
జింతు వైకుంఠనాథ ! ల♦క్ష్మీసనాథ!, రక్షణపరాయణుండ! నా♦రాయణుండ !

రుక్మిణీపరిణయము, స. భ. ఆ 4 పద్య 107.

చ. క్షితిపతులం బరశ్వథము♦చే వధియించుచుఁ దత్క్షితీశ్వర
క్షతజజలంబుచేతఁ బిత్రు♦కర్మ మొనర్చి తనర్చె నెవ్వఁ డ
ద్భుతతపరాక్రమాకరు న♦వేలవిభావిజితప్రభాకరున్
హతనతపాపసంతతిన♦నంతుని నే శరణంబు నొందెదన్. 208I

కృష్ణాభ్యుదయము, పద్య 54.

మ. నతసంరక్షక తొల్లి భార్గవకులీ♦నఖ్యాతిచే నేకవిం
శతివారంబులు హైహయప్రముఖరా♦జన్రాతమున్ ద్రుంచి యం
చితదోశ్శక్తి త్రిలోకసన్నుతజయ♦శ్రీఁగొన్నమాడ్కిం ద్విష
త్ప్రితతిన్ మాన్చి ననుంగ్రహింపుము జగ♦త్ప్రఖ్యాతి వాటిల్లఁగన్. 2082

రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 4.

# రఘురామావతారస్తుతి.

క. క్షత్రాత్ముఁ గొలుతు దశరథ, పుత్త్రున్ శ్రీరాముఁ డనఁగఁ ♦ బొలిచిన దేవున్
శత్రుభయదు రావణు నొక, మాత్రిందునుమాడినట్టి ♦ మధుసూదనునిన్. 2083

భారతము, శాంతి. ఆ 2 పద్య 45.

చ. నిశిపితి నేతు వక్షి నవి◆నీతు పికాస్య సహాంగపంబుగాఁ
గలహాముసం బ్రిదీప్త పటు◆కాంచనములం గడకొత్తు తెల్లవా
రలకు వినంగఁ జెప్ప దక్షి◆రామము నేడుఁగాము జన్మయం
గళగుణమైన భవంబు బహు◆కల్మషపంకమయోధి మాధవా. 2084

హరివంశము, పూర్వ. ఆ 6.

సీ. తనుసృజించినవిధా◆తవుఁ బూర్వరాముండవు, లీలాక్షిసనహస్త◆లేఖనముగఁ
దనవిశ్వభూపణ◆క్ష్మముతోడ భూమికు,నిచ్చిదాకేరియ◆న్వయము నొందఁ
దన్నుఁ జింతించున◆ధ్యాత్మవేదులు రావ,ణానీకహృక్ష్మహ◆మాసపడఁగఁ
దనభక్తధారఁ బ్రదే◆చ్చినశంబుపనికీర్తి, కడలికంబుకపంబ◆కంబు గెలువ
గీ. దివ్యనామసహస్రప్ర◆తినిధి యనఁగఁ, దారకబ్రహ్మమనఁ దన◆ పేరు మెఱయ
నతిశయిల్లిన సీసప్త◆మావతార, మహామహంబును వర్ణించ ◆ నాదిపురుష. 2085

సీ. జనకాత్మకును లోక◆జనపావనునకుఁగా, సుక్షేజయుఁ బక్షుప్ర◆మాస్తించి
తఱునిఁ బుత్త్రునిఁజేసి◆తప్తి సెయ్యముకొంకె, నజునిపొత్తునింపై◆యజనికీర్తి
ధాత్రి నిక్ష్వాకుసం◆తతినుప్పునంబొంది, యాశ్రయించినవారి◆కమృత మిత్తు
వాలాయముగ విశ్ర◆వసుకుమార్కకస్నెను, విశ్రవస్త్వముగూర్చి ◆ వేడ్కఁ బడితి
గీ. పెద్దకాలంబు వాసితి ◆ పిరియవఘూటి, ననుజానొకనాఁడువాసిదే◆హంబుదొఱఁగి
తెవ్వఁడెఱుఁగును నీచంద◆మిట్టి దనఁగ, రాజితానేకగుణభద్ర◆రామభద్ర. 2086

గీ. కామసమ్మోహితకాంచ◆ఘాతమునకు, వగచి నీచాటుకవిచెంచు◆వానిఁగినిసెఁ
గామమోహితయగువింతిఁ◆గస్తిపఱుప, ననుజుఁ బురికొల్పితిదినీకుఁ◆జనునె రామ.

శృంగారనైషధము, ఆ 8 పద్య 128, 129, 130.

సీ. తాటక మర్దించి ◆ తపసిజన్నముఁ గాచి, నాలువిల్లు విఱిచి ధై◆ర్యమున మెఱసి
ప్రబలులైనట్టివి◆రాధకబంధోగ్రి, ఖరదూషణాది రా◆క్షసులఁ దునిమి
వానరవిభు నేలి◆వాలిఁ గూలఁగ నేసి, జలరాశి గర్వంబుఁ ◆ జక్కఁజేసి
సేతువు బంధించి◆చేరి రావణకుంభ, కర్ణాదివీరులఁ ◆ గడిమిఁ ద్రుంచి
గీ. యలవిభీషణు లంకకు◆నధిపుఁ జేసి, భూమిసుతఁ గూడి సాకేత◆పురమునందు
రాజ్యసుఖములుగైకొన్న◆రామవిభుఁడు,వరుసనమ్ముఁబ్రోచుచుండుఁబ్ర◆వాసగతుల.

భాగవతము, స్కం. 6 పద్య 306.

మ. పవిధారాపతనంబుఁ గైకొనని య◆ప్పౌలస్త్యమైసప్తధా
తువ్రలందూఱఁ బరిశ్రమంబునతును◆ద్యోగించెనా సప్తసా

లపి ఖేపంబొనరించి నిల్వక దెసల్ ♦ చన్నట్టి యుష్మన్మరు
జ్జవనాస్త్రంబు బొసంగుగన్ సిరుల్ రఘుకుల ♦ స్వామీ రమావల్లభా ! 2089

సీ. స్యందనస్థితబిడౌ ♦ జఃక్షత్రజాడ్యకృ, జ్జంఝామరుద్ధరు ♦ ఝాత్కృతములు
క్రవ్యాశిరాడ్గాత్ర ♦ కనదసృగ్గాహన, స్ఫుటశల్యహవ్యభు ♦ క్ఛూత్కృతములు
యోధవర్మితహృత్పు ♦ టోత్కీర్ణితనిజపాత, సాలాశ్మకృతము హు ♦ స్థాత్కృతములు
పతితోగ్రరక్షఃక ♦ బంధభారభృశార్తి, భుగ్నభోగఫణీంద్ర ♦ ఫూత్కృతములు
గీ. శ్రాంతరథ్యనిరంతర ♦ చ్ఛాయదములు, దివ్యతావకకార్ముకో ♦ త్సేరితములు
కలుషము లడంచుఁగాత లం ♦ కాపురాంగ, ణాంబరచరత్కలంబక ♦ దంబకములు.
ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 26, 27.

ఉ. దారుణబాణపాతమద ♦ ధారలు గాఁగఁ గ్రాలుదోర్ధను
ర్వారణరాజుఁగొల్చి దశ ♦ వక్త్రముఖాంబుజవాటిఁగూల్చి బ్రం
హారక హృత్సరోజములు ♦ దాననచేసి వికాసమా సరా
కారతనొందఁజేసిన ప్ర ♦ గల్భత నీకతగున్ దగున్ హరీ. 2091
పాండురంగమాహాత్మ్యము, ఆ 2 పద్య 62.

సీ. సూర్యవంశము పరి ♦ శుద్ధమని దశరథుఁడు కుమారమనోర ♦ థుఁ డని భరత
లక్ష్మణశత్రుఘ్ను ♦ లకు నన్నవై పుట్టి, సౌందర్యచాతుర్య ♦ సౌకుమార్య
శౌర్యధైర్యౌదార్య ♦ వీర్యసత్యౌచిత్య, గాంభీర్యకర్తుమ ♦ కర్తుమన్య
థాకర్తు మతిసమ ♦ ర్థత్వసత్త్వఘట, ఘటనాపటీయస్త్వ ♦ ఘనయశస్త్వ
గీ. సౌఖ్యసఖ్యదయాముఖ్య ♦ శాలివైన, రాముని సరాముని దయాభి ♦ రాము నిను భ
జింతు వైకుంఠనాథ ల ♦ క్ష్మీసనాథ; రక్షణపరాయణుండ నా ♦ రాయణుండ.
రుక్మిణీపరిణయము, న.భ. ఆ 4 పద్య 108.

మ. సవజిద్భక్తవిశిష్ట్యదౌష్ట్యచిరసూ ♦ త్కృత్స్వైళసమ్మేళనో
ద్భవసంపద్వశదిఙ్ముఖోద్గతశిఖో ♦ ద్దామానలభ్రాంతికృ
ద్భువనద్విడ్దశక ● ంఠకంఠదళన ♦ ప్రోత్క్రాంతితాకుంఠవై
భవనిర్మోఘశరౌఘరాఘవపర ♦ బ్రహ్మంబ వీవే హరీ. 2093
యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

సీ. మిత్రకులుండవై ♦ మించి తాటకఁద్రుంచి, మునియాజ్ఞ మారీచ ♦ ఘనసుబాహు
లనుగొట్టి యజ్ఞపా ♦ లన మొనర్చి యహల్యఁ, బోషించి జనకుని ♦ పురినివిల్లుఁ
దునిమి సీతనుగొని ♦ జనకాజ్ఞ వనికేఁగి, యాలినిగోల్పోయి ♦ వాలిఁ గూల్చి
కపులినిగట్టి లం ♦ కాపురికేఁగి రా, వణుఁజంపి యల విభీ ♦ షణున కెలమి 209

గీ. రాజ్యము నొసంగి సీతాఖ్య♦లక్ష్మినపుడు, పుష్పకంబున నిడి గొని♦పోయినట్లు
రిపులను హరించి వేగ న♦న్నిపుడు సీదు,స్యందనంబున నిడికొని♦చనుము కృష్ణ.
రుక్మిణీకల్యాణము, జ. వేం. రం. ఆ 4.

ఉ. వావిరి నే యవిక్రియం ద♦పక్రపరాక్రమధాముఁడై త్రిలో
కీవిపినానలుం గలుష♦కృత్యు నశేషవిశేషధర్మవి
ద్రావణు రావణుఁన్ సదమ♦దం బొనరింపుచు రామనామకుం
డై విలసిల్లె నా ఘను న♦నంతుని నేశరణంబు నొందెదన్. 2096

కృష్ణకళ్యాణము, పద్య 55.

## బలరామావతారస్తుతి.

క. హలముసలధరునిఁ గరుణా, నిలయహృదయు రాముఁ గాహి♦నేయు సితాంగున్
బలద నిభాంబరుని శుచిం, దలఁతును గోవిందు శౌర్య♦ధనుఁ భోగాత్మున్. 2097
భారతము, శాంతి. ఆ 2 పద్య 46.

గీ. కుముద బాంధవ రేవతీ♦రమణ భద్ర, కామపాల శరస్మేక్షు ♦ గౌరవర్ణ
త్రిజగతీలోచనోత్సవ ♦ దేవనీకు, వందనమై యుండు నీలాంబ♦రాకలనము. 2098

క. బలరామకృష్ణసంజ్ఞలఁ, దెలుపు నలుపు నైన దివ్య ♦ తేజంబులతో
నిలమీఁద నవతరించిన, జలజాక్షుని నెలులు శర్మ♦సౌరభ మొసఁగున్. 2099
శృంగారనైషధము, ఆ 8 పద్య 136, 137.

చ. క్షితిహలకృష్టిఁ బుట్టి యడఁ♦గెన్ క్షితియందున సీతయంచుఁ ద
త్సతి విరహార్తిపాండిమముఁ ♦ దాలిచి రామశరీరమెత్తి యీ
క్షితి ఖననక్రియ న్మృగుడఁ ♦ జెందఁగఁగాక కళిందజాతట
క్షితి దుననేటికిన్ హలము♦చే మఱి నీ కవశాత్మతన్ హరీ. 2100

ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 28.

మ. వికటోత్తంభిత సీరభోగపటలీ ♦ విస్ఫూర్తి మన్మూర్తి కం
చుకనిర్మోకభయానకంబు వికృతా♦క్షుత్క్ష్వేళ మగ్నిచ్ఛటా
వికిరత్క్రూరనిరీక్షణంబు నగు నీ ♦ వేషంబు శేషానుకా
రికళన్ గ్రాలదె క్రోలదే సమదవై♦రిప్రాణవాతూలముల్. 2101
పాండురంగమాహాత్మ్యము, ఆ 2 పద్య 63.

మ. ప్రియకృత్పూర్వభవాగతద్వితయ కీ♦ర్త్యస్ఫూర్తిమూర్త్యంతరా
శ్రయగాత్రద్యుతి నేత్రకల్పకలన♦ద్రామావతారాప్తిత

ద్భయరూపాపయశోపహ ప్రకృతి సీ♦తాపద్మనోపాయ ని
ష్ణతులీలాహల సాధనోజ్జ్వల కరి♦పరిహృత్రంబ శ్రీవే హరీ. 2102

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

ఉ. హంసబకాఘకంసనర♦కాది నృశంసవతంస సంఘ వి
ధ్వంసన మాచరింప యదు♦వంశమునం జనియించెఁ గృష్ణుఁడై
హంసనవచ్ఛవిప్రవిక♦చాబ్జరుచి ప్రచురాన్యుఁ డెవ్వఁడా
హంసమున్ లసద్యశు న♦నంతుని నే శరణంబు నొందెదన్. 2103

కృష్ణాభ్యుదయము, పద్య 57.

మ. ధరణీకాంతభరంబు మాన్పుటకు నీ ♦ ధాత్రీస్థలిన్ దేవకీ
వరపుత్త్రత్వముఁ దాల్చి మించి త్రిజగ♦ద్వామామనోహారి సుం
దరరూపంబుననున్న నీదు ఘన సౌం♦దర్యంబు వీక్షించి యే
తరుణుల్ నిన్ను వరింపకుందురు ముకుం♦దా! కృష్ణ పద్మేక్షణా! 2104

రుక్మిణీకళ్యాణము, జ॥ వేం॥ రం॥ ఆ 4.

## బుద్ధావతారస్తుతి.

గీ. బుద్ధ, నీగట్టిహృదయ సం♦పుటముఁ దాకి, కుంఠితము లయ్యె మరునంప♦కోల లెల్ల
ముద్దువయ్యెయిక దా యిప్డు ♦ మురవిరోధి, యలరు లెల్లను వర్తులా♦స్యంబు లయ్యె.
గీ. ముఖ్యచతురాననుఁడ వీవు ♦ మునిశరణ్య, గౌణచతురాననుండల ♦ కమలభవుఁడు
నీవు సర్వజ్ఞుఁడవు బుద్ధ♦దేవ నిజము, శంభు సర్వజ్ఞుఁ డనుట లా♦క్షణికవృత్తి.

శృంగారనైషధము, ఆ 8 పద్య 138, 140.

మ. తరుణత్వోత్సుత బాణపంచకమునం ♦ దైత్యాబలాశ్రోణిత
ద్వరసందోహము యుష్మదాత్మకజర♦ద్బాణంబొకంట న్జైడన్
ద్వరఁగావించితి వేటికో యహహ బు♦ద్ధంబయ్యె నీభావ మ
త్తరుణీశీలతనుత్ర మేరికి నసా♦ధ్యంబౌటఁగా కేశవా. 2107

ఆముక్తమాల్యద, ఆ4 పద్య 30.

చ. ప్రతిదినకేశలుంఛనపు♦రా యిడి నెట్టన బట్టఁగట్టి పైఁ
బొతపుతమంచునున్న కుఱు♦బోడతలన్ ధరియింప నోడియున్
సతముగ సొమ్ముగాన నిడఁ♦జాలక గా శిఖిపింఛవల్లి సౌ
గతమతధుర్య! దానిఁ గటిఁ ♦ గట్టుము పుట్టము మిన్న కేటికిన్. 2108

పాండురంగమాహాత్మ్యము, ఆ 2 పద్య 64.

సీ. త్రిపురదైత్యులను మి♦త్తికి బత్తిఁ జేయఁ దలఁచి వచ్చినయంగన ♦ లయతిజృంభ
కుచకుంభపరిరంభ ♦ గుంభనరంభాత్త, రస్తంభసంభమా♦రఘనజఘన
బింబబింబాధర ♦ పీడనతాడన, దంతక్షతనఖక్ష♦తప్రముఖర
తుల నతులాగతులఁ ♦ గలసి మెలసి విలసిత తపస్స్వితక్షితిఁ ♦ జేసి జేసి
గీ. కంటిగొంటమ్మ వైమింటు ♦ గంటకతిరి, పురపరులఁ గాల్చికాల్చిన ♦ బుద్ధ! గుణస
మృద్ధ! వైకుంఠనాథ, ల♦క్ష్మీసనాథ, దక్షిణపరాయణుండ! నా♦రాయణుండ.

రుక్మిణీపరిణయము, స. భ. ఆ 4 పద్య 119.

మ. త్రిజగద్భిత్తిపురాశ్రితాశ్రితకుల ♦ స్త్రీలోకలోకోత్తరా
త్మజిత ప్రాగ్వ్రత భంగసంగర సము♦ద్ధస్పర్ధసర్వార్థవై
హాజుగుప్సోదయ ధర్మకర్మబలని♦ర్వ్యత్పణ్యా చైతన్య దా
ర్ఢ్యజయార్చిప్పరిశుద్ధ బుద్ధతను భ్రూ♦ద్బ్రహ్మంబు నీవే హరీ. 2110

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6

## కల్క్యవతారస్తుతి.

క. కలకాలచలితధర్మము, నిలుపంగలయట్టి విష్ణు♦నిం గల్క్యాత్ముం
దలఁతుఁ దురగివాహను మ్లేచ్ఛుల నెల్లం గీటడంచు ♦ శుభచారిత్రున్. 2111.

భారతము, శాంతి ఆ 2 పద్య 48.

గీ. జ్ఞానకర్మేంద్రియోపాధి ♦ సంపరిభూత, దశమహాకల్కినీహార ♦ దశశతాంను
దశమదివ్యావతారు న♦త్యంతనియతిఁ, గల్కిదేవుని నిమఁ గొల్తుఁ ♦ గైటభారి.
క. విశ్వవ్యాప్తయశోని, త్యైశ్వర్యసమృద్ధి విష్ణు♦యశుఁడను నామం
బీశ్వర కల్కిసమాహ్వయ, విశ్వసదర్థిమయి చెల్లు ♦ నీజనకునకున్. 2113

శృంగారనైషధము, ఆ 8 పద్య 141, 142.

శా. ఘోరాపారమహౌఘపంచకముఁ జె♦ల్కున్నేయఁగా నేర్ప నా
ధారాపంచకభావనం జెలఁగు గం♦ధర్వంబుఁ ద్రొక్కించుబల్
బీరంపున్నెఱరౌతు కీటకశరా♦శీ వారవాణీభవ
ద్ఘోరుద్భ్రాంత కృపాణికాద్వితయ వి♦ద్యుద్గ్రంథి నిం గొల్చెదన్. 2114

ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 31.

చ. కలి హిమవేళ శోభనపుఁ ♦ గమ్మవిరుల్ సకలంబు తుల్చి భూ
వలయవనంబుఁ గప్పికొని ♦ వర్తిలు జాడ్యపుటేఁచఁ పర్వగాఁ

నలరుల కారులీల భవ♦దాగమనంబటఁ గల్గ రోపపా
టలమగునీ కనుంగడల ♦ డాలునగున్ జిగురాకు నాకృతిన్. 2115

పాండురంగమాహాత్మ్యము, ఆ 11 పద్య 65.

సీ. కలియుగాంతమున దు♦ష్కరముష్కరతురుష్క, చండాలపతితపా♦షండమండ
లీమండితాఖండ ♦ భూమండలముఁజూచి, కమ్రామ్రపర్ణార్ణ ♦ తామ్రపర్ణి
తటమున బ్రహ్మవి♦ద్బ్రాహ్మణునకుఁ బట్టినై పుట్టి యుత్తమా♦శ్వాధిరూఢుఁ
డవయిజోడుఁదొడిగి ♦ డాలుకత్తికమానుఁ, బూని పూనిక మీఱఁ ♦ బుడమిఁబుట్టి
గీ. నట్టిదుష్టులఁ బుడమిఁ జెం♦డాడ నున్న, కలికిమూర్తి! గుణస్ఫూర్తి ♦ కలితశౌర్య
కీర్తి! వైకుంఠనాథ, ల♦క్ష్మీసనాథ, రక్షణపరాయణుండ! నా♦రాయణుండ.

రుక్మిణీపరిణయము, స. భ. ఆ 4 పద్య 111.

మ. అసకృన్నైచ్ఛ్యయుత ప్రపంచకృత పం♦చాఘౌఘతామిస్రతై
జనధారాగతి పంచకస్ఫుర దుపాం♦చత్పంచ కళ్యాణికా
శ్వసమారూఢ భవత్కరాసి రుచివి♦జ్ఞాన ప్రతీపాంత ని
ర్వ్యసనాంతఃకరణప్రదీప కలికి ♦ బ్రహ్మాంబవీవే హరీ. 2117

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6 పద్య 113.

ఉ. చండతరస్వరూపుఁడయి ♦ సర్వసుఖావహసత్క్రియాంగనా
షండ కలిప్రభావ కలు♦షస్వకులాశ్రమధర్మషండపా
షండ విఖండనార్థము వి♦సం గొను నెవ్వఁడు కల్కిభావము
న్నండజరాజవాహను న♦నంతుని నే శరణంబు నొందెదన్. 2118

కృష్ణాభ్యుదయము, పద్య 58.

## కృష్ణావతారస్తుతి.

మ. యదువంశంబున వాను దేవుఁడన క్రీ♦డార్థంబు జన్మించి దు
ర్మదదైత్యావలిఁగూల్చి పార్థునకు సా♦రథ్యంబు త్రైలోక్యస
మ్మదమారంగ నొనర్చి దేవముని స♦మ్మానోద్ధృతిన్ భూభరం
బు దొలఁగించినచక్రి నంబురుహనా♦భుం గొల్తుఁ గృష్ణాత్మనిన్. 2119

భారతము, శాంతి. ఆ 2 పద్య 47.

చ. వలపలికన్ను నీకు రవి♦వారిజలోచన చందురుండు దా
పలినయనంబు; కర్ణుఁడును ♦ పార్థుఁడుఁ దత్ప్రియనందనుండుఁ ద

ళ్కొలజూఁడు; వీరొకండొకని♦తోఁ గలహింప సహించి తెట్లొకో ?
వలపలి లోచనాబ్జమును ♦ వామదృగబ్జము వేడె యచ్యుతా. 2120

శృంగారనైషధము, ఆ 8 పద్య 133.

ఉ. ఆయత యోష్మదాకృతి క♦రాగ్రనగాంచలవాంతవారిధా
రాయుత చంద్రకాంత పల♦కావళి బింబితయై వెలుంగ నా
రాయణమూర్తి మత్కవచ♦రత్నముచేఁ బరిరక్షఁ గాంచె నా
నో యదువీర వృష్టిఁ బసి♦యాజడఁ బ్రోవవె సప్తరాత్రముల్. 2121

ఆముక్తమాల్యద, ఆ 4 పద్య 29.

సీ. బ్రహ్మను గన్న ప♦రబ్రహ్మమూర్తివై, యాద్యంత శూన్యుండ♦వయ్యు "ధర్మ
సంస్థాపనార్థాయ♦సంభవామి యుగే యు,గే" యటంచును దేవ♦కీతనయుఁడ
వయి బల రామస♦హాయుఁడవై శిష్ట, రక్షణమును దుష్ట♦శిక్షణమును
సలుపుచు రుక్మిణి ♦ సత్యభామ సుదంత, భద్ర కాళింది జాం♦బవతి మిత్ర
గీ. వింద లక్షణయును బదా♦ర్వేలనార్య్వ, రంగనలు గొల్వ వెలయుకృ♦ష్ణాహ్వయప్ర
సిద్ధ! వైకుంఠనాథ! ల♦క్ష్మీసనాథ!, రక్షణపరాయణుండ! నా♦రాయణుండ!

రుక్మిణీపరిణయము, స. భ. ఆ 4 పద్య 129.

ఉ. శ్రీధర చక్రపాణి సర♦సీరుహపూర్ణసువర్ణనేత్ర స
త్యాధిప గోపికామదన ♦ తత్త్వమయాత్మక దానదాస ము
ద్రాధిని కంధరాగ మగ♦ధాధృతిమోక్షనిదానయోగ వి
ద్యాధర రాజధాన్య వన♦తత్పర సత్పరమార్థవాంఛితా. 2123

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

# క వి స్తు తి.

క. వాక్స్తామ్రపర్ణికవితా, మౌక్తికమయ కావ్యహేమ♦మండనులగుత
త్ప్రాక్తనసుకవుల నియమా, త్యక్తుల వాల్మీకి కాళి♦దాసులఁ గొలుతున్. 2124

దశకుమారచరిత్రము, ఆ 1 పద్య 9.

శా. సందీప్తార్కసమప్రికాశుజలద♦శ్యామాంగుఁగ్రిప్తాఖిల
చ్ఛందోబృందవిభాగుఁ బావనయశ♦స్సందోహునస్పందద్ధీ
సందర్భాంచితు భారతాగమకథా♦సద్భావు లోకత్రియా
నందప్రాప్తికరుం బరాశరసుతున్ ♦ సర్వజ్ఞుఁగీర్తించెదన్. 2125

మ. చతురోద్యస్మృతివాతపోతకమహా♦పాంయాత్రికుండై తగన్
జతురామ్నాయపయోధుల న్మెలఁగి భా♦స్వద్రిత్నముల్ శామస
న్నుతిరూపంబుగఁ గూర్చి విశ్వజగమున్ ♦ భూషించె నేధన్యుఁ డా
ప్రతిముఖ్యుండు ప్రసన్నుఁ డయ్యెడుఁ గృపన్ ♦ వాల్మీకి మాకెప్పుడున్. 2126

హరివంశము, పూర్వ. ఆ 1.

ఉ. భానురభారతార్థముల ♦ భంగులు నిక్క మెఱుంగ నేరమిన్
గానట బీసజే చదివి ♦ గాధలు దివ్వు తెనుంగు వారికిన్
వ్యాసమునిప్రణీత పర♦మార్థము తెల్లఁగఁజేసినట్టి య
వ్యాసనకల్పులం దలఁతు ♦ నాద్యుల నన్నయ తిక్కనార్యులన్. 2127

నృసింహపురాణము, పీఠిక. పద్య 9.

సీ. వ్యాస వాల్మీకి సం♦యమివాక్సుధాంభోధి, లోలోర్మిపంక్తుల ♦ నోల లాడి
భట్ట బాణ మయూర♦భారతీ సందర్భ, సౌభాగ్యగరిమంబు ♦ సంగ్రహించి
భాస సౌమిల్లిక ♦ ప్రతిభాసముస్మేష, హేలావిశేషంబు ♦ నిచ్చగించి
మాఘ భారవి వచో♦మకరంద నిష్యంద, మాధుర్యమునకు స♦మ్మదము నొంది

గీ. కాళిదాసుమనంబులోఁ ♦ గాంచి మొక్కి రాజశేఖరుఁ గవిరాజుఁ ♦ బ్రస్తుతించి
ధీరమతి నన్నపార్యుని ♦ తిక్కయజ్వ శంభుదాసుని గరమర్థి ♦ సన్నుతించి. 2128

శృంగారనైషధము, ఆ 1 పద్య 7.

మ. వనజాక్షోపమ వామలూరుతనయున్ ♦ ద్వైపాయనున్ భట్టబా
ణుని భాసున్ భవభూతి భారవి సుబం♦ధున్ బిల్హణుం గాళిదా
సుని మాఘున్ శివభద్రు మల్హణకవిన్ ♦ జోరున్ మురారిన్ మయూ
రుని సౌమిల్లిని దండిఁ బ్రస్తుతులఁ జే♦ర్కొందున్ వచశ్శుద్ధికిన్. 2129

ఆ. వ్యాసరచిత భార♦తామ్నాయ మాంధ్రభా,షగ నొనర్చి జగతిఁ ♦ బొగడుఁగనిన
నన్నపార్యుఁ దిక్క♦నను గృతకృతు శంభుదాను నెఱ్ఱనుకవిఁ ♦ దలఁతుభక్తి.

మనుచరిత్రము, ఆ 1 పద్య 7, 8.

సీ. భువిఁ గవితాకన్యఁ ♦ బుట్టించె నెవ్వాఁడు, బడినాగమము లెల్ల ♦ నడపె నెవ్వఁ
డేను నీవనుమాట ♦ లెనయించె నెవ్వాఁడు, కోమలపదలీలఁ ♦ గూర్చె నెవ్వఁ
డనఘు తులాకోటి ♦ నలరించె నెవ్వాఁడు, నిఖిలగుణంబులు ♦ నేర్పె నెవ్వఁ
డినకరసంప్రాప్తి ♦ నెసఁగించె నెవ్వాఁడు, రహినించె నర్థగౌ♦రవము నెవ్వఁ

గీ. డట్టి వాణీగురుత్వమ♦హాత్త్వశాలుల, ఘనులఁ బ్రాచేతసవ్యాస ♦ కాళిదాస
దండిభవభూతి మాఘస♦త్కవిమయూర,భారవులభారవులనాత్మఁ ♦ బ్రస్తుతింతు.

మ. మహి మ న్వాగనుశాసనుండు సృజియిం◆పం గుండలీంద్రుండు ద
న్మహనీయస్థితి మూలమై నిలువ శ్రీ◆నాథుండు పోషింప న్మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయిం◆పన్ సొంపువాటించు నీ
బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునఁ ద◆త్ప్రాగల్భ్య మూహించెదన్. 2132
వసుచరిత్రము, ఆ 1 పద్య. 9, 10.

సీ. ఎవ్వాఁడు మొదలఁ దా ◆ నిలకు భారతి దించెఁ, దగ భగీరథుఁ డభ్ర◆తటినిఁ బోలెఁ
భ్రమరకీటన్యాయ◆భాతి నేకవిరాజు, వాగ్దేవి దానయై ◆ వన్నెకెక్కె
వరవృత్తములు మాని ◆ వాణి యెవ్వానికై, వలచి నానా శ్లేష◆ములకుఁ జిక్కె
నెవ్వాని వాఙ్మాత్రి◆మిసుని ధాత్రికిఁ దెచ్చి, పేర్మితోఁ గరముల◆ర్పించుకొనియె
గీ. నట్టి మహిమాధికులఁ గొల్చి ◆ యఖిలమునివ,చోనుపమశక్తిభృత పురా◆ణార్థవితతు
లనఘుఁ డెనుఁగను భవ్యాది◆వ్యాంజనమునఁ, గనుఁగొనఁగఁ జేయు నాంధ్రస◆త్కవులఁ
నరసభూపాలీయము, ఆ 1. పద్య 8. (దలఁచి.

ఉ. ఏయెడ నర్థగౌరవస◆మృద్ధియు శబ్దవిశుద్ధియుం దిరం
బై యనవద్యతం బరగ ◆ నాంధ్రవచస్థితి భారతంబు రా
మాయణమున్ రచించిన మ◆హాత్ముల నాత్మఁ దలంచెదన్ జగ
ద్గేయుల నన్నపార్యునిఁ ◆ దిక్కనుధీమణి నెఱ్ఱసత్కవిన్. 2134
రాఘవపాండవీయము, పీఠిక, పద్య

క. పుట్టకుఁ బుట్టెడు వేళం, దిట్టవు నునుపచ్చి పుట్ట◆తేనియ చవితోఁ
బుట్టె నన నమృతముట్టెడు, పుట్టనిసువు సత్కవిత్వ◆ములు వర్ణింతున్. 2135
క. ఇట్టాడరాని యోగము, ఘట్టమునకు నడవ యచ్చు◆కట్టిన మునిరా
ట్పట్టాభిషిక్తుఁ దపముల, పుట్టినెలవయిన వ్యాస◆ముని వర్ణింతున్. 2136
గీ. వ్యాస వాల్మీకి ముఖసూక్తి ◆ వైభవముల, నేర్పుమీరంగ నిజకార్య◆దర్పణములు
సరసమానసముల నేటు◆పఱుచుకీర్తి,ధవుల నన్నయ భట్టాది ◆ కవులఁ దలఁతు.
పాండురంగమాహాత్మ్యము, ఆ 1 పద్య 10, 11, 12.

సీ. శారదోన్మేషంబు ◆ జగతి సంధించియుఁ, బరమ నారదమైత్రిఁ ◆ బరగుసుకృతి
నుష్మైకధన్యుఁడై ◆ యొనరియు ననుపమ, ప్రఖ్యాతిఁ గాంచిన ◆ భవ్యచరితు
నసమబాణాంకత◆నలరారియు నలిక, నేతుృ మెప్పించిన ◆ నిర్మలాత్ము
ఘనశబ్దవిస్ఫూర్తిఁ ◆ దనరియు హంసస,మాగమ శ్రీఁ గాంచు◆ ననఘశీలు
గీ. మఱియు నగణితసుమనస్స◆మాజమునకు, నతు రామృతధారాగ◆సార్వభౌమున
నా మెతల నిచ్చలునొనర్చు!◆ నలఘుమహిమ, నెఱపినవిచిత్రసత్కవి◆నిధులఁ దలఁతు.
చంద్రభానుచరిత్రము ఆ 1 పద్య 5.

సీ. ఘననాకుభవభుజం♦గప్రయాతం బెన్ని, సుకతాళబింబసం♦శుద్ధి వొగడి
యలకాళిదాసుని ♦ యార్యసన్నుతి చేసి, దండిపంచస్తవృ♦త్తము గణించి
యల మయూరకుమాతు♦లగీతసంగతి మెచ్చి, బాణపుష్పితలతఁ ♦ బ్రస్తుతించి
భవభూతిశశికళా♦భానురత్వం బెన్ని, మతి ధనంజయు వసు♦మతి నుతించి
గీ. ప్రౌఢిఁగాంచుకవిత్రయీ♦ప్రాణవమహిమ, సార్వభౌమునిపృథ్వీభా♦స్కరునికాంతి
భీమమత్తేభబలమును ♦ సోమహరిణి, నటులనమరేశ్వరుని ప్రజ♦పటిమఁ దలఁతు.

బహులాశ్వచరిత్రము, ఆ 1.

ఉ. శ్రీకరరామభారత వి♦శేషకథాజలరాశిఁ దేలి య
స్తోకపదార్థరత్నములు ♦ దోరముగా బుధకోటి కిచ్చి నుం
శ్లోకరుచుల్ దిగంతముల ♦ లోకములన్ బ్రసరింపఁజేయు వా
ల్మీకి పరాశరాత్మజుల♦మేటికవీంద్రులఁ బ్రస్తుతించెదన్. 2140

దశరథరాజనందనచరిత్రము, ఆ 1 పద్య 7.

సీ. ఎవ్వాఁడు సాహితీ♦హేతుభూతుం డయ్యె, నెవ్వాఁడు శ్రుతిచిక్కు♦లెడలఁజేసె
నెవ్వాఁడుకావ్యంబు♦లిలకుదురొక్కొనఁబూన్చె, నెవ్వాఁడురసవృత్తు♦లెలమిఁబఱచె
నెవ్వాఁ డాంధ్రకవిత్వ♦మిల వెలుంగఁగఁజేసె, నెవ్వాఁడుతజ్జాతు♦లిరవు గొల్పె
నెవ్వాఁడు శృంగార ♦ మిదియని తెలిపించె, నెవ్వాఁడు పదశయ్య ♦ లేర్పరించె
గీ. నట్టి వల్మీకజనివ్యాసు ♦ ననఘు కాళి,దాసు బాణుని నస్మార్య♦తత్కృతిపరు
నైషధాధారు పెద్దన ♦ నతులభక్తి, నరసి సేవింతు ప్రార్థింతు ♦ నభినుతింతు.

శంకరవిజయము, ఆ 1.

సీ. వాక్యనిర్జితశేష ♦ వాల్మీకి వాల్మీకి, హరిభక్తియుక్తి ధీ♦వ్యాసు వ్యాసు
ఘనభావకాళిదా♦సును గాళిదాసును, జారుమాధుర్య వా♦చోరుఁ జోరు
దివిజేంద్ర ధనదవై♦భవభూతి భవభూతి, ధర్మబుద్ధి నవీన ♦ దండిదండిఁ
గవితాభరిప్రహృష్టమా♦ధవమయూరు మయూరు, భానురాకృతిపుష్ప♦బాణుబాణు
గీ. మానితాచారమతి తాస ♦ మాఘు మాఘు, ధ్యానబద్ధమురారి ము♦రారి గాత్ర
పటువిభారవి భారవిఁ ♦ బ్రస్తుతింతు. సర్వశబ్దార్థవిజ్ఞాన ♦ సరణికొఱకు. 2142

హంసవింశతి, ఆ 1 పద్య 10.

సీ. పదపదార్థజ్ఞాన ♦ భాషావిధానముల్, వ్యంగ్యనానావస్తు ♦ వర్ణనములు
బహువిధాలంకార ♦ భావక్రియంబులు, శబ్దప్రయోగర♦సజ్ఞతలును
ఛందోవిశేషల♦క్షణలక్ష్యభేదముల్, కవిసమయముచమ♦త్కారములును
గ్రహశశితుహిమిత్ర వ♦ర్గగ్రహఫలములు, రీతిశయ్యాపాక ♦ నీతివిధులు

గీ. గద్యపద్యచతుర్భద్ర♦ఖడ్గచక్ర,మురజగోమూత్రికానాగ♦ముఖ్యబంధ
కావ్యరచనల నెఱిఁగిన ♦ ఘనుల నాడి, కవుల నభినుతిఁజేసి త♦త్కరుణ మెఱసి.

వైశ్యపురాణము, ఆ1.

సీ. శబ్దశాసను శబ్ద♦శాసనుం డని కుండ, లీంద్రుని మెచ్చి కుండ♦లీంద్రుఁ డనియు
శ్రీనాథకవిచంద్రు ♦ శ్రీనాథుఁడని భాస్క,రుని దగభాస్కరుం ♦ డనియు రంగ
నాథుని శ్రీరంగ♦నాథుండనియు మల్లి,కార్జును లలిమల్లి♦కార్జునుఁ డని
రామభద్రకవిని ♦ రామభద్రుండని, సోమకవీంద్రుని ♦ సోముఁ డనియు
గీ. నవనిఁ బెద్దన్నఁ బెద్దని ♦ యలరు ధూర్జ,టికవి ధూర్జటియని యనం♦తకవి యల య
నంతుఁడని యమ్మహాత్ముల ♦ నెంతు మదిని, నేఁబలుకుకబ్బమవనిపై ♦ నెగడుకొఱకు.

ఓఘవతీపరిణయము, ఆ 1 పద్య 16.

సీ. రామలీలాభివ♦ర్ణనలించె నెవ్వాఁడు, దగధర్మగుణలీలఁ ♦ దాల్చె నెవ్వాఁ
డొగి సత్కళారుచి ♦ నొప్పారె నెవ్వాఁడు, విజయాగ్రజఖ్యాతి ♦ వెలసె నెవ్వాఁ
డార్యానుకూలుఁడై ♦ యలరారె నెవ్వాఁడు, పరిక్షితక్షమావాప్తిఁ ♦ బరగె నెవ్వాఁ
డర్థసంగ్రహణక్రి♦యలమీఱె నెవ్వాఁడు,ఘనవిభ్రమముఁగాంచి ♦ దనరు నెవ్వాఁ
గీ. డట్టి భాస్కరభానుసో♦మాఖ్యభీమ, సూరిశంకరశ్రీనాథ ♦ చోరకవి మ
యూరులను సారవచనప్ర♦చారులను ను,ధీరుల నుదారులను భక్తి♦మీఱఁ దలఁతు.

కవిచకోరచంద్రోదయము ఆ 1.

చ. కవులురచించు గ్రంథములు ♦ గన్గొని తద్గుణముల్ సభ న్మహో
త్సవమున నేర్పరించి యప♦రాధము లున్న గుణంబుగా గ్రహిం
చి వనధిజాతచంద్ర విమ♦శేఖరభోగ్యపదార్థశోభియౌ
శివునిగతిం జెలంగు, కవి♦శేఖరులం గొనియాడఁగాఁ దగున్. 2146

భార్గవపురాణము, ఆ 1.

శా. వ్యంగ్యాలంకృతి వృత్తి రీతి గుణశ♦య్యాపాకనానాభిదా
ఢంగ్యావిద్ధమనోజ్ఞవాక్యము సద♦భిప్రజ్ఞవీక్షించి న
వ్యాంగ్యాసమ్మిత మానటంచు రసయో♦గ్యత్వంబుచే దోషవై
సంగ్యంబొప్పెడు సత్కవీశ్వరులకున్ ♦ సన్మానముం జేసెదన్. 2147

శ్రీరంగమాహాత్మ్యము, నల్లా. చ. నృ. ఆ 1.

సీ. వల్మీకజవ్యాస♦వాగభ్రగంగామ, హోర్మిమాలికలలో ♦ నోలలాడి
కాళిదాసమురారి ♦ కావ్యనవ్యామృత, ధారాపరంపరల్ ♦ దనియఁ గ్రోలి
భవభూతిమాఘభా♦రవిచోరచనాచ,మత్కారములకు స♦మ్మతముఁ గాంచి
బాణమయూరసు♦బంధుప్రబంధము,రందరసాప్తికా♦నంద మొంది 159

ణము, ఆ 1.

గీ. భావసౌమిల్లిబిల్హణ ♦ ప్రతిభ మెచ్చి, సారమతి నన్నయార్యుని ♦ శంభుదాసు
దిక్కయజ్వని శ్రీనాథు ♦ ధీరుఁ బెద్ద,కవిని భీముని సోమభా♦స్కరులఁ దలఁచి.
కృష్ణకళ్యాణము, ఆ 1.

సీ. పరికటతరాహీన♦పద ధురంధరుఁడైన, యనఘుపల్కురికజా♦తుని భజింతు
వరశక్తి జాత వి♦స్ఫురిత తేజఃపరా,శరసముద్భవున కం♦జలిరొనర్తు
లాలితాత్యుపమోజ్జ్వ♦లాలంక్రియాభివర్ణితకాళిదాసధీ♦నిధిఁ దలంతు
రహీనకలార్థగౌ♦రవ పారదృశ్వతా, తతభారవికి నమ♦స్కృతులొనర్తు
గీ. జితవిమతబాణు,బుధజన♦హితమయూరు, ఘనునిదుర్వచోపహ్నుతిదం♦డినినితాంత
కలితభవభూతిసుగుణమా♦ఘులఁదలంతు,నూరినిమురారినిభజింతు ♦ సొంపుమీఱ.
కృష్ణభూపాలీయము, పద్య 7.

మ. కవనాఖ్యోత్సవనంబునాటి జగతిం♦గాండోన్నతిం బెంచి వ
ర్యవితానస్థితిసంఘటించి రసనం♦పన్మాధురీసాధురీ
తివిశేషంబు రసజ్ఞజాలమునకుం ♦ దెల్లంబుగాఁ గూర్చి సౌ
రభముం జెందినవారి భక్తిఁదలఁతుం ♦ బ్రాచేతసవ్యాసులన్. 2150
మహేంద్రవిజయము, ఆ 1 పద్య [illegible].

చ. గురురుచి మూఁడుమూర్తులను ♦ గూడి త్రయీమయమూర్తిఁ దోఁచిన
ట్లురుదుగ ముప్పురం గలసి ♦ యంచితపంచమవేదభారత
స్ఫురణముఁ జూపినట్టి పరి♦శుద్ధుల నెన్నెద నన్నయార్య భా
స్వరమతి నెఱ్ఱప్రెగ్గడను ♦ జక్కఁగఁ దిక్కనసోమయాజినిన్. 2151
రామరాయవిలాసము, ఆ 1 పద్య 10.

## కుకవినింద.

చ. పలుకుల పొందులేక రస♦భంగము సేయుచుఁ బ్రాఁతవడ్డ మా
టలఁ దమ నేర్పుచూపి రొక♦టన్ హృదయం బలరింపలేక యే
పొలమునుగాని యట్టిక్రమ♦ముం దమమెచ్చుగ లోకమెల్ల న
వ్వులఁబొరయం జరింత్రు కుక♦వుల్ ధర దుర్విటులట్లు చూడఁగన్. 2152
నిర్వచనోత్తరరామాయణము, ఆ 1 పద్య 6.

చ. వెస వసుధాస్థలంబునఁ గ♦వీంద్రులు గొందఱు శేముషీమషీ
రసము మనఃకటాహకుహ♦రంబుల నించి కలంచి జిహ్వికా
కిసలయతూలికం గొని లి♦ఖింతురు కబ్బము లెన్నఁగా మహా
వ్యసనముతో నిజాననవి♦యత్తలతాళపలాశరేఖలన్. 2153
భీమేశ్వరపురాణము, ఆ 1 పద్య 12.

ఉ. తొల్లిటి సత్కవుల్ కృతులు ♦ దొంతులు పేర్చినమాట లుండఁగా
జల్లిపదంబు లూఁదుకొని ♦ సంధులు దాఁటుచు నొక్క జాదుగా
నల్లిన కబ్బముల్ సభల ♦ నార్యులు నవ్వఁ బఠించు దుష్కవుల్
మొల్లము వారిచేతఁ దుద ♦ ముట్టునె భవ్యములైన కావ్యముల్. 2154

శ్రీరంగమాహాత్మ్యము, భైర. ఆ 1 పద్య 18.

మ. భరమై తోఁచు కుటుంబరక్షణకుఁగాఁ ♦ బ్రాల్మాలి చింతన్ నిరం
తరతాళీదళసంపుటప్రకరకాం♦తారంబునం దడ్డపుం
దెరువాటుల్ దగిలొట్టి తజ్జ్ఞపరిష♦ద్విజ్ఞాత చౌర్యక్రియా
విరసుండై కొఱతం బడుం గుకవి పృ♦థ్వీభృత్సమీపక్షితిన్. 2155

మనుచరిత్రము, ఆ 1 పద్య 9.

శా. భావం బెక్కడలేక వృత్తనియమా♦పాయంబుఁ జింతింప కెం
దే వర్తించి పరార్థవంచనలచే ♦ దీపించి మూర్ఖాళిసం
భావింపం గుకవిప్రణీతకృతి సా♦మాన్యాకృతిం బూని పై
పై వన్నెల్పచరింప దానిఁ దిలకిం♦పం బోరు ధీరోత్తముల్. 2156

వసుచరిత్రము, ఆ 1 పద్య 11.

ఉ. పైకొను కాంతుచేఁ దగిలి ♦ పల్మఱు భీకరలోభిగేహవ
ల్మీకములందుఁ బాయని య♦మేయమదోద్ధత దుష్కవీంద్రద
ర్వీకరరాజికి న్వివిధ♦విశ్రుత కావ్యకళావిశేషదీ
క్షాకుశలార్యతంత్రములు ♦ గారుడమంత్రము లెందు నారయన్. 2157

హరిశ్చంద్రోపాఖ్యానము, శంకర. ఆ 1 పద్య 14.

సీ. శబ్దదరిద్రుఁడై ♦ శారదాభ్రముఁ బోలుఁ, బ్రాసంబువిడిచి సం♦త్రాసిఁ బోలు
నపహృతాన్యాలంక్రి♦యతఁ దస్కరునిఁబోలుఁ, బృథులార్థ దూరుఁడై♦ పేదఁబోలు
విగళితౌజస్కుఁడై ♦ పగలింటినెలఁ బోలు, నవిదితధ్వనికుఁడై ♦ చెవిటిఁబోలు
పద్యానభిజ్ఞతా♦భంగిఁ బంగువుఁ బోలు, భిన్నమాధుర్యుఁడై ♦ పిప్పిఁ బోలు
గీ. ముక్తిసూక్తప్రసాదుఁడై ♦ మూర్ఖుఁ బోలు, జీర్ణపాదత నదియోర♦చెట్టుఁ బోలు
లుప్తసముదాయభావుఁడై ♦ లోభిఁ బోలు, సుకవిహాసరథపదిహాం♦ధకవి కుకవి.

బహులాశ్వచరిత్రము, ఆ 1.

గీ. ఛంద మెఱుఁగుట శబ్దశా♦స్త్రము చదువుట, బహునిఘంటుపరిజ్ఞాన♦పాటవంబుఁ
గాదు కుకవులకవితకుఁ♦గారణంబు, ఉచిత లజ్జాపరిత్యాగ♦మొకటి గాని. 2159

సీమంతినీకళ్యాణము, ఆ 1.

మ. పరపాకంబులఁగోరి యెందుకయినం ♦ బ్రాల్మాలివృత్త్యర్థమై
యొరుపాదంబులనంటి యర్థకలనా♦యోగంబు లేమి న్నిరం
తరచింతన్ వగరీతిఁదోఁచక వివ♦ర్ణత్వంబునన్ దీనులౌ
నరులంజూచి సుదృష్టిసంబు రసవ♦న్నరోత్కృష్టులం బల్కునే. 2160

తారాశశాంకవిజయము, ఆ 1 పద్య 20.

సీ. జల్లి పొల్లుల నొకపద్య♦మల్లఁగాని, తవిలికృతి సెప్పఁగలఁడె కా♦కవి తృణాంకు
రములు గైకొని యొకకులా♦యముఘటించుఁ, గాని గిజిగాఁడు మాఁడువు♦గట్టఁగలఁడె.

విజయనందవిలాసము, ఆ 1.

చ. గొనకొని జల్లిపొల్లిలోనఁ♦గూర్చి యొకానొక పద్య మల్లనే
ర్చిన కుకవీంద్రుఁ డంచిలవి♦శేషపదార్థసమృద్ధిఁ గావ్యక
ల్పన మతిఁగాంచునే పుడమి♦పైఁ బులుఁబోఁచలఁగూఁ డమర్పఁబూ
నిన గిజిగాఁడు గట్టఁదగు♦నే మణికాంచన సౌధరాజముల్. 2162

వేదాంతరసాయనము, అవతారిక. పద్య 7.

సీ. సత్కవీశ్వరు లెలుఁగంగఁ♦జాలకవులఁ, జెందుకూఁతలె కూయుసు♦జెనఁటి మొఱకు
మత్తకరికుంభదళనో♦ద్వృత్తహరిని, మొనయలేకను గుక్కలు ♦ మొఱుగునటుల.

భోజసుతాపరిణయము, ఆ 1 పద్య 13.

ఉ. సంధులు జాఱి సత్కవుల♦సంగతిఁ గానక హీనవృత్తిసం
బంధము లే యొనర్చుచుఁ గు♦పంకిలజీవనరూఢిఁ గాంచి హృ
ద్బంధుర సౌమనస్య పరి♦పాటి యొకింతయుఁ గాంచరన్నపు
ష్కంధులె నిక్కమౌ సరసు♦లా తలఁపం గుకవీంద్రు లెందునున్. 2164

వాసవదత్తాపరిణయము, ఆ 1 పద్య 15.

గీ. వహితవిశ్రమపదనియ♦మం బెఱుఁగక, శబ్దరూపంబులందు సౌ♦ష్ఠవము లేక
నుదరవివరైకపూర్తికై ♦ యొడిగి తిరుగు, కవులు వివరించిచూచినఁ♦గవులుగారె.

మూర్తిత్రయోపాఖ్యానము, కృత్యాది.

ఉ. నిబ్బరమైన యక్కరము ♦ నేర్చినవారలపోలె వట్టిత
బ్బిబ్బులు నాలుగల్లి తమ♦భీకరవేషవిశేషపుష్టికై
యుబ్బి ప్రభువ్రజంబొనఁ గదిసి ♦ యొంటరిపాటున మూఢసన్నిధిన్
దబ్బులు గొట్టు దుష్కవులు ♦ డాయఁగనోపుదురే రసజ్ఞులన్. 2166

రంగారాయచరిత్రము, ఆ 1.

గీ. సతము శబ్దాపశబ్ద మెం♦చకను రంధ్రములను వెదకుచు నసార్థ♦ముల గ్రహించి
ప్రాసముల మోసమొందుచుఁ♦బరగు కుకవి, చోరుల నిరాకరించెద♦పారదిమదిని.
కవిజనచకోరచంద్రోదయము, ఆ 1.

క. విటసంప్రాప్తాభరణ, స్ఫుటనంచవనరాయవేశ్య ♦ పూఁబోఁడివలె
న్నటియింతురు కుకవులు తొ,ల్లిటిసత్కవిరాట్ప్రబంధ♦తస్కరవృత్తిన్. 2168
నిర్వచనవిచిత్రరామాయణము, ఆ 1.

గీ. శుభ్రవర్ణలసత్పద♦స్ఫురితగతులు, సుకవిమణివోలెఁ గాకవి♦ చూపఁగలఁడె.
శుభ్రివర్ణలసత్పద♦స్ఫురితగతులు, సుకవిమణివోలెఁ గాకవి ♦ చూపుబెట్లు. 2169
కృష్ణికల్యాణము, ఆ 1.

చ. వికలవచఃప్రగుంభనల♦వేమఱు మూర్ఖజనాళి కెంతయున్
బ్రికొటుముదంబుసేయుచును ♦ బండితవందితమైనయట్టి యా
సుకవిసమాఖ్య ఘూకతతి ♦ కోఁచుఁడౌ కవిభానుఁ డొప్పుచో
నొకనిముసంబునున్ దనదు ♦ నుగ్రతఁ జూపుచు నిల్వనేర్చునే. 2170
కృష్ణామాహాత్మ్యము, ఆ 1 పద్య 12.

సీ. రమణీయశబ్దస్ఫు♦రణపదనీతి చమత్కారసత్క్రమ్య ♦ మహిమ మెన్న
నతులితసరసము♦ హాగనర్థపరిచార రహితసత్త్రిసం♦చరలకలిమి
మలినహీనసుపద్ధ♦తి లలితపరమహాంసావళితోడ స♦ఖ్యగతి లేమి
తమ్మినిగళానిధిఁ♦ దాము జూడఁగ లేక, కుజనులతోఁ బొందు♦ గోరుకతన
గీ. బహుమృదులదర్శనాభావ♦పటిమవలనఁ, దన్ జ్ఞఘటితపటుప్రబం♦ధనాఘనస్థ
శక్తిహీనతసభలోన♦ చలితగతిని, కాపుకావను కవులు కా♦కవులె చూడ. 2171
కౌసల్యాపరిణయము, ఆ 1.

చ. గడియకుఁ గావుకావుమనఁ ♦ గాడని పోలినఁ దూలిపోవుచుం
గడు మలినత్వ మొంది గుణ♦గౌరవమందక నేకదృష్టిచే
నుడుగక దోషకీటముల ♦ నొద్దిక నేర్చుచుఁ బక్షపాతమె
క్కుడఁ దగఁ గల్గి దూఱుపడు♦ కాకవికాకములం బలంతురే. 2172
ఆ. ఇంటియింటికేఁగి ♦ యెదురుచుఁ గిచకిచ. హొసమొదవఁగాఁ బ♦రార్థములను
సంగ్రహించి సుకవి♦జనులపై దుముకు వా,నరులు గారె కుకవి ♦ నరులు దలఁప.
భార్గవపురాణము, ఆ 1.

మ. తమకావ్యాదుల సత్కవుల్ "సుకవినిం♦చంజేసి" యంచొక్కభా
గముఁ గల్పించి రకారణంబ యది ని♦ష్కార్పణ్యమాత్సర్యభా.

వహిం గాకౌఘము లూహకున్న నలదే◆వానాంప్రియశ్రేణికిం
ట్లిమరుం గీర్తివిశేషపూర్తియిలఁ గా◆వ్యాసారపూర్ణోత్తమై. 2174

మహేంద్రవిజయము, ఆ 1 ప. 11.

మ. ధ్వనిసాఁకస్వపటంచు శయ్యయనఁ దల్పంబంచు దోషంబుసా
గనుచాపంబను వర్ధమన్న సమభా◆గంబంచుఁ బాకం బటం
చనిన స్వంటయటంచు వృత్తియనిన◆న్వ్యాపారమానంచు నే
ఘనబుద్ధుల్వివరింతు రక్కవుల న◆క్కాణించఁగా నేటికిన్. 2175

రావువంశముక్తావళి, ఆ 1.

## —◆ సప్తసంతానములు. ◆—

క. తనయుఁడు చెఱువును గావ్యంబు నిధానము గుడి వనంబు ◆ భూదేవస్థా
పనమును ననునియ్యేడును, జను శాస్త్రములందు సప్త◆సంతతు లనఁగన్. 2176

అప్పకవీయము, ఆ 1 పద్య 15.

సీ. శిఖిసాక్షిగాఁ బాణి◆సఖియైన కులకాంత,యందు నౌరసపుత్త్రుఁ◆ బొందుటయును
మధువైరికైన మ◆న్మథవైరికైన మం,దిరము సుందరముగ ◆ నిలుపుటయును
శ్రోత్రియద్విజవర్య◆పుత్త్రుఁ బావనగుణాం,చితచరిత్రునిఁ బెండ్లి◆సేయుటయును
పూర్వమహారాజ◆పుణ్యకథాలీల, వెలయఁ గావ్యంబు ని◆ర్మించుటయును
గీ. ధనము పాఁతుట పుణ్యసా◆ధనముగాఁగ, వనము నిల్పుట పుణ్యజీ◆వనముగాఁగఁ
జెఱువుఁ ద్రవ్వుటయనఁగ న◆చ్చెరువు మీఱు,సప్తసంతానములు జగ◆త్సంతతులను.

సీమంతినీకళ్యాణము, ఆ 2.

## —◆ కావ్యప్రశంస. ◆—

క. ధర్మములలోన నుత్తమ, ధర్మము కావ్యము నిజంబు ◆ ధర నెవ్వని కా
ధర్మము చేకుఱు నతఁడు సు,ధర్మను వసియించుఁ బెక్కు ◆ దైవత యుగముల్.
గీ. దుష్కృతము లెన్ని చేసినఁ ◆ దుదినిసప్త, సంతతులలోన నొక్కటి◆ సలుపు నతఁడు
కుతుకమునఁ దనసూటొక్క ◆ కులము వారి, నరకములఁ బాపి ముక్తికి◆ నడుపు నిజము.
క. ఇల సప్తసంతతులలోఁ, పలఁ గావ్యము దక్క దేవ◆భవనవసాదుల్
స్థిరము లగుఁ గొన్నివర్షం,బుల కని చంపువు రచించె ◆ భోజుం డెఱుకన్. 2180
గీ. నిలిపి లెక్కడ నచటనె ◆ నిలిచియుండు, నగ్రహారాదిసంతతు ◆ లరసి చూడ
కవియుఁ గృతిముఖరచనచే◆ నఖిలదిశల, నెగడుఁ గావునఁ గావ్యమ◆న్నిటికిఁ దొడవు

క. పురిటిబిడదనీరు గోదా,వరిఁ గలపిన యోగ్య మైన ♦ వడువునఁ గడు దు
శ్చరితుం డైనను గావ్యాం,తరమునఁ జెప్పఁబడి పావ♦నచరిత్రుఁ డగున్. 2182
క. క్షితి నెవ్వని నామము స,త్కృతి నెన్నిదినంబు లుండు ♦ దివి నాపుణ్యా
వ్రతుఁ డంతకాలముండును, ధృతి నింద్రద్యుమ్ను నునికి ♦ దృష్టాంతము గాన్.
క. తనకు హితార్థము లెఱిఁగిం,చు నఘంబు లడంచు ధనము ♦ శోభనము యశం
బును గూర్చు నఖిలసురలన్, గనఁబడఁ గాఁజేయు నెపుడుఁ♦గావ్యము కవికిన్.
గీ. మేటిబ్రహ్మర్షి యయ్యె వ♦ల్మీకభవుఁడు, గాంచె రవినిమయూరుండు♦గడియలోన
హరిణరోగము వాసె శ్రీ♦హర్షణఃనకుఁ, గావ్యమునఁ జెందరాని స♦ద్గతులుగలవె.
చ. అలరఁ బురాణకావ్యముల ♦ నార్యులు చెప్పినవారు దక్కఁగాఁ
దెలియఁ జతుర్యుగంబులను ♦ దీవుల నేడిఁట నెంద ఱందఱో
యిల జననంబు నొంది మని ♦ యేఁగిరి పుణ్యచరిత్రు లందులో
పల నిపు డొక్కఁడేనియును ♦ బ్రస్తుతి కెక్క నెఱుంగ మెక్కడన్. 2186
గీ. రామకథలోనఁ గపులు వా♦రాశిఁ గట్టి, రనుచు వాల్మీకి చెప్పంగ♦నఖిలజనులు
సేతు వనుచు నెఱింగిరి చెప్పకున్న, నదియు నొకసోగదీవి య♦టండ్రు గాదె.
క. వివరించె యజుర్వేదము, కవి యగువిప్రుండు శుచి జ♦గంబుల నేత
త్ప్రవిమలకావ్యము మిక్కిలి, పవిత్ర మగుఁ గపిలగోవు♦పాల తెఱఁగునన్.2188
ఆప్పకవీయము, ఆ 1 పద్య 14,16,17,18,19,20,21,22,23,24,25.

## ——♦ కవితాప్రశంస. ♦——

గీ. విబుధలోకంబు "కవితైవ♦విద్య" యనుచుఁ, జదువువచనార్థమనుసం♦శయముగలదె
విద్యలకు నెల్ల నుత్తమ♦విద్య కవిత, దానిఁ దెలియుట విశ్వ మం♦తయునుగనుట.
క. ధారుణి నాకుజమారుతి, పారాశర్యులు చరించు♦భావుకశిష్టా
చార మవశ్యక మని కవి, తారతమతు లైరి కాళి♦దాసప్రముఖుల్. 2190
మ. జననాథాగ్రిణి యాత్మరాజ్యమున ని♦చ్చల్ పూజ్యుఁ డాసీమఁ బా
సినఁ దా గవ్వయుఁ జేయఁ డన్నికడలన్ ♦ శ్రేష్ఠుండు విద్వాంసుఁ డా
యనకన్నం గవి మేటి యా "సుకవితా♦యద్యస్తి రాజ్యేన కిం"
మ్మనువాక్యంబు నిజంబు దీనిఁ గని కా♦వ్యంబుల్ రచింపం దగున్. 2191
క. వనితయుఁ గవితయుఁ దానై, చను దెంచుట గలుగు నేని♦సరసం బగు ధా
త్రిని బల్మికోలఁ గావిం,చిన విరసం బగు నటంచుఁ ♦ జెప్పిరి విబుధుల్. 2192

క. ఛందోలంకారాదుల, యందలిపాటిల్లఁ దుదిని వ్యర్థము గావే
సుందర మగువాక్యంబుల, పొందికఁగ రచించుబుద్ధి పుట్టక యున్నన్. 2193

క. విరచించుశక్తి పుట్టని, పురుషునిచదువులు ప్రకాశములు గావు వసుం
ధరఁ జీవరహితసదనాం,తరమున రేయిఁ బడియున్న ద్రవ్యముల క్రియన్. 2194

గీ. ఆశుధారాకవిత్వంబు లందు శయ్య, లుపమ లుత్ప్రేక్షలును లేక యుండుఁ గాన
నెంతయోజించినను బద్య మంత సార,వంత మగుఁ గాన నిలుకడ వలయుఁ గృతికి.

అప్పకవీయము, ఆ 1 పద్య 53, 54, 55, 56, 57, 58, 59.

## కావ్యభేదంబులు.

సీ. ఉచ్చారణక్రియ నొప్పారు వర్ణంబు, వర్ణసంచయమున వఱలుఁ బదము
పదవితానముచేత భాసిల్లు వాక్యంబు, వాక్యభేదమున నివ్వటిలు నర్థ
మర్థవశంబున నమరును భావంబు, భావసంగతిఁ గను పట్టు రసము
రసనుపరీశస్తిచేఁ బొసఁగును బద్యంబు, పద్యరాశిని గూర్పఁబడును గావ్య

గీ. మట్టికావ్యంబు ద్వివిధమై యతిశయిల్లుఁ, బరువడిఁ బ్రబంధచాటుప్రబంధములన
సర్గములసంప్రయుక్తమును నాశ్వాసములను, దెనుఁగున బ్రబంధమను నది తనరుఁ గృతుల.

సీ. పురమును ఋతుషట్కమును బ్రయాణంబును, శైలంబు వేటయు సాగరంబు
మానీంద్రపుణ్యాశ్రమంబును మంత్రంబు, దూత్యంబు పిదప సద్యూతరణంబు
విజయంబు మద్యపానజవికారంబును, వనవిహారంబును వారి క్రీడ
కన్యాంగసౌందర్యకథనంబు హిమకరా,భ్యుదయంబు విప్రలంభోదితంబు

గీ. పద్మమిత్రోదయంబును బరిణయంబు, సురతమును దౌహృదంబును సుతజననము
ననఁగ నిరుపదిరెండు వర్ణనలు గూర్చి, చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస.

క. కనుఁగొన సంఖ్యాబద్ధం,బు నసంఖ్యాకంబు నాఁగ భూప నియతిఁ గ్రా
తనరారుఁ బూర్వకవిమతే,మున నా చాటుప్రబంధములు జలజాక్షా. 2198

సీ. శాల్గువెగలయుదాహరణములుముక్త, కాదిపంచాదశమును సంఖ్యాన్వితములు
గద్యరగడద్విపదదండకములు మంజ,రులును సంఖ్యారహితచాటువులు నృసింహా.

అప్పకవీయము, ఆ 1 పద్య 27, 28, 29, 30.

## సుకవిమాహాత్మ్యము.

గీ. మణివలనఁ గంకణమును గంకణమువలన
మణిభూషణము బ్రకాశ మగునట్లు మదిఁ దలంపి

సుకవివలన నాయకుఁడు నా♦యకునివలన
సుకవియుఁ బ్రసిద్ధిఁ గాంతురు ♦ సకలదిశల. 2200

తే. శాకుజాతునిచే రఘు♦నాయకుండు, వ్యాసుచేఁ బాండవులు కాళి♦దాసుచేత
భోజుఁడు ప్రసిద్ధినొందిరి ♦ భువినిదమదు, నడక లెల్లను గథలుగా ♦ నడుమ్రకతన.

క. ఇమ్మహిని మునులచే వెల, సె మ్మను గావ్యములు "నానృ♦షిః కురుతే కా
వ్య" మ్మనువచనార్థంబే, సమ్మతి గలివేళ సుకవి♦జనములే మానుల్. 2201

అప్పకవీయము, ఆ 1 పద్య 41, 42, 43.

## —♦ సత్కవిలక్షణము. ♦—

క. ధరణీసురుఁడు ప్రశాంతుఁడు, గురుభక్తుఁడు శుచియుఁ గల్ప♦కుఁడు పూర్వకవీ
శ్వరవాక్ప్రయోగదక్షుఁడు,గరుణామతి యెవ్వఁడతఁడు ♦ కవియనఁ బరగున్.

క. శ్రుతిశాస్త్రాంగపురాణ, ప్రతతియు నితిహాసకావ్య♦భరతాగమముల్
స్మృతిసంగీతరతికళా, గతుల నలంకృతుల నెఱుఁగఁ♦గాఁ దగుఁ గవికిన్. 2203

అప్పకవీయము, ఆ 1 పద్య 44, 45.

## —♦ సప్తవిధకవులు. ♦—

ఆ. వినుతిఁ గాంతు రిల వి♦వేకివాచకరాచి, కార్థశిల్పభూష♦ణార్థు లనఁగ
మార్గనానుగతస♦మాహ్వయుఁడు ననంగఁ, గవులు సప్తనామ♦కములతోడ. 2204

సీ. గణవర్ణశబ్దార్థ♦గుణదోషనికరంబుఁ, బరికించి కూర్పఁ గ♦బ్బము వివేకి
బహుతరానుప్రాస♦పదబంధనియమంబు, వదలక కృతిసేయు♦వాచకుండు
మృదుమధురోక్తులు ♦ వెదకి కావ్యంబెల్ల, రచియించుఁ బదపడి ♦ రాచికుండు
మితశబ్దములలోన ♦ నతివిపులార్థంబు, నిమిడించు నర్థాఖ్య ♦ నెసఁగునతఁడు

తే. సెప్పుయమకంబులెప్పట్లు ♦ శిల్పకుండు, పొందుపఱుచునలంకృతుల్ ♦భూషణార్థి
సరళపదవిరళార్థవి♦స్ఫురణముగను, జూపు రస మెందు మార్గవ♦స్ఫుటకరుండు.

అప్పకవీయము, ఆ 1 పద్య 46, 47.

## —♦ వాచికుఁడు. ♦—

క. ఛలవర్ణగుచ్ఛపిచ్ఛిల, లలితపదాడంబరావ♦లంబనకవితా
సులభపరచనాచతురుం, డలవడు వాచికుఁడు నా ను♦దగ్రప్రౌఢిన్. 2206

## —♦ ఆర్థుఁడు. ♦—

క. మితశబ్ద మయ్యు నర్థము, సతతవ్యాఖ్యానలాల♦సక్షమవిపుల
స్థితి నొప్పఁ గవిత సెప్పెడు, నతఁ డార్థుం డనఁగ నెగడు ♦ సార్యులసభలన్.

—♦ శిల్పకుఁడు. ♦—

క. మహితనుశబ్దార్థంబులు, బహువిధయమకార్థబంధ ♦ బంధురరచనా
విహితవిచిత్రములై చన, విహరించున్ శిల్పకుండు ♦ విశ్రుతకృతులన్. 2208

—♦ రౌచికుఁడు. ♦—

క. ఒదవెడుకృతిపైఁ గలసొబ, గడలక యెండాఁక నిష్ట ♦ మగు నందాఁకన్
మృదుమధురరచన నువిశా,రదుఁడై సాగించునతఁడు ♦ రౌచికుఁ డెందున్. 2209

—♦ భూషణార్థి. ♦—

క. తిప్పటవడి నొడువునప్పుడు, వివిధాలంకారసరణి ♦ విడువక చవి గా
నవహితుఁడై కృతి చెప్పెడు, కవి యెందును భూషణార్థి ♦ కడుఁ బొగడొందున్.

—♦ మార్గవానుగతుఁడు. ♦—

క. సరళము లగుశబ్దములను, విరళము లగునర్థములను ♦ వీనుల కింపం
దరళత లేక రసౌఘము, లరుదుగఁ గృతి చెప్పు మార్గ ♦ వానుగుఁ డెపుడున్.

—♦ వివేకి. ♦—

క. శ్రుతశాస్త్రాలంకార, ప్రతిభుఁడు శబ్దాదిదోష ♦ పటుగుణఘటనా
చతురుఁడు వివేకి నాఁ జను, నతఁడు మహాకవిశతంబు ♦ లందుఁ జరించున్. 2213

కావ్యా॥ చూడా॥ ఉల్లాస॥ 3 పద్య 81, 82, 83, 84, 85, 86, 87.

—♦ అష్టాదశవర్ణనలు. ♦—

మ. పుర వారాశి మహీధరర్తు శశభృ ♦ త్సూర్యోద యోద్యాన పు
ష్కరకేళీ మధుపాన మోహన వియో ♦ గ క్షేమయాన స్వయం
వర పుత్త్రోత్సవ మంత్రి దూత్య రణదో ♦ ర్వ్యాక్రాంతి సంకీర్తనా
కర మష్టాదశవర్ణనాన్వితము త ♦ త్కావ్యంబు భవ్యం బిలన్. 2214

కావ్యాలంకారచూడామణి, ఉల్లా॥ 3 పద్య 92.

# కవితాపాకములు.

క. పాక మనంగా నర్థని,రాకులగంభీరయుక్తి ♦ యది యిరువెఱఁగై
లోకమునఁ బేర్చు ద్రాక్షా, పాకంబును నారికేళ ♦ పాకము నాఁగన్. 2215

కావ్యాలంకారచూడామణి, ఉల్లాస॥ 4 పద్య 55.

ఉ. పాక ముదీరితార్థపరి ♦ పాక మనం దగు నందు గోస్తనీ
పాకము నారికేళఫల ♦ పాక మనన్ ద్వివిధంబు గోస్తనీ

పాకము సంప్రతోర్థపరి♦పాకనివేద్యము నారికేళ పా
కాకలనంబు గూడి నిబి♦డార్థవిచార్యము వీనిలక్ష్యముల్. 2216

నరసభూపాలీయము, ఆ 2 పద్య 85.

క. తెలియఁగ ద్రాక్షాపాకము, కలితంబుగనర్థబోధ♦కంబై తగనా;
నిల నారికేళపాకం, బలరను మఱిగూఢభావ♦మై కృష్ణనృపా. 2217

కృష్ణభూపాలీయము, పద్య 106.

## ద్రాక్షాపాకము.

శా. లీలా మన్మథ మంథరంబులుఁ గటా♦క్షాలీ లాలిత భ్రూలతా
కూలశ్రీలుఁ గపోల ఖేల రుచి తో♦కూతానురాగంబులున్
సాలస్యంబులు నైవకౌతుకపరీ♦తాలోకజాలంబులన్
బాలారత్నము గీలుకొల్పె ముద మొ♦ప్పన్ విశ్వభూపాలుపై. 2218

కావ్యాలంకారచూడామణి. ఉల్లాస॥ 4 పద్య 57.

క. మాలిక లై వెలిదమ్ముల, పోలిక లైచందమామ♦పులుఁగులకునూ దా
మేలిక లైననిరీక్షణ, మాలికల నృసింహుఁ జూచె ♦ మదవతి వేడ్కన్. 2219

నరసభూపాలీయము, ఆ 2 పద్య 86

మ. అవురా వాతెఱతేట ఖూబు పిఱు దో♦య్యారంబు మజ్ఝారె గ
న్గవతళ్కుల్ భళి దంతకాంతు లరరే ♦ కన్బొళ్కు లప్పప్ప కొ
ప్పువిలాసం బహహా తనూరుచి బలా♦బో మ్మంద మయ్యారె యూ
రువికాసంబు సెబాసు చెల్వ మని పే♦ర్కొంగల్గె నిక్కామినిన్. 2220

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము.

క. అందములై, వెలిదమ్ముల, చందములై, కుసుమచాప ♦ సరసవిలాసా
మందములై తగువీక్షణ, బృందములను గలికి కృష్ణ♦విభు వీక్షించెన్. 2221

కృష్ణభూపాలీయము, పద్య 107.

## నారికేళపాకము.

శా. హృజ్జాతుండు నటుండు వోలె నటి వి♦శ్వేశక్షమాభర్తకున్
లజ్జాకాండపటంబుచాటున వధూ♦లావణ్య లాస్యంబులన్
సజ్జాతంబులఁ జేసి చూపె జెఱి లస♦త్సాంగహారాళిచేఁ
ఖజ్జం గొందలు కామినీమణులు కు♦ప్యద్దర్పలై చూడఁగన్. 2222

కావ్యాలంకారచూడామణి, ఉల్లాస॥ 4 పద్య 58.

మ. వరభూషాదులపై మనంబిడక దృ◆గ్వ్యాపార మెంతేఁ బరా
పరసందర్శననాతిభిన్న మయి చూ◆పట్టంగఁ గార్యాంతర
స్మరణం బేమియు లేక నిశ్చలత నీ◆సాంగత్యముం గోరి మా
హరిణీలోచన యాత్మయందు నరసిం◆హా నిన్నె భావించెరా. 2223

నరసభూపాలీయము, ఆ 2 పద్య 87.

సీ. సారవత్పారవో◆జ్జ్వలదంఘ్రిశృంగార, నూపురంబలిబిలి ◆ గోపురంబు
గణసదుగ్లభమణీ◆గణఘృణిచుంబిత, గోపురంబలిబిలి ◆ గోపురంబు
ఘనమునిజనచిరం◆తనపుణ్యసరణికిఁ, బాఁపురంబలిబిలి ◆ గోపురంబు
కీర్తితమోక్షల◆క్ష్మీపతక్మలాక్షికిఁ, గాఁపురంబలిబిలి ◆ గోపురంబు

గీ. కాంతచిత్రవర్ణనితాంత◆కాంతియుతవ, నీపథమధులిట్పుంఖపిక◆నికరకలక
లారవావృత వృషభాచ◆లాగ్రమునను, మూఁపురంబైన యలిబిలి ◆ గోపురంబు.

శా. బంధుద్వేష దవాగ్ని గంధవహముల్ ◆ బాపావలంబాజ్ఞతా
గ్రంథు ల్సంచితవిత్తభూరుహకుఠా◆రంబుల్ నుసంసారజీ
ర్ణాంధుపరిస్ఫుటపాతహేతువులు వే◆దాంతజ్ఞ ధైర్యాబ్జినీ
గంధేభంబులు వారకామినులవీ◆క్షల్ నీ వపేక్షింతువే. 2225

సీ. ఉత్తముం డురుతత్వ◆వేత్తయు నిర్జితేంద్రియుఁడు దుర్గసజయా◆ధికుఁడు సర్వ
శాస్త్రార్థపారఁగు◆ఁ డస్త్రశస్త్రవినోది, సకలభూతహితుండు ◆ శాంతచిత్తుఁ
డతిథిపూజాపరుం◆డార్తావనుఁడు దయా,శాలి సముండు సు◆జ్ఞాననిష్ఠుఁ
డర్థవంతుండు స◆దాచారసంపన్నుఁ, డీపరాత్రయదూరుఁ◆డింగితజ్ఞుఁ

గీ. డన్నదానచణుండు మ◆హానుభావుఁడు పితృభక్తికల్పుండు నిష్కపటగుణుఁడు
సత్యవచనుండు నిఖిలల◆క్షణతనుండు, శౌరికీర్తనయుతుఁడు స◆జ్జనుఁడు గాని.

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము, పద్య 22, 681, 682.

మ. హరికాండాంచితకాండజాత పటుకాం◆డావార్యవిస్ఫూర్తికిన్
హరికాండపరిధితావతంసకరకాం◆డాభంగురపాలికికిన్
హరికాండస్ఫురితప్రచారముల కా◆హా ఖిన్నయై యున్న మా
హరిణీలోచన నేలుకొమ్ము గుణహా◆రా కృష్ణభూవల్లభా. 2227

కృష్ణభూపాలీయము, పద్య 103.

—◆ కదళీపాకము. ◆—

శా. వేదోద్ధారకవేణునాదకుహుకాం◆వేల్లత్కృపావీక్షణా
[illegible]ంతాటన వేదనావిరహితా ◆ వేశ్మైకశాఖిస్థల

వేదిశ్రోణిరమేశవేషదశకా♦వేదస్ఫురద్విక్రమా
వే(ధోం)డావన వేంకటాచలపతీ ♦ వేదండరక్షాకృతీ. 2228

మ. కరిసంరక్షణకామపాలసహితా♦కంజాక్షకాకోదరే
శ్వరతల్పాకమనీయరూపకనకా♦క్షుద్ధ్వంసకారుణ్యసా
గరకళ్యాణమయాంబరాంతకటిభా♦గాకంపసంహారకా
తరసందోహభయాపహారికలితా♦తార్క్ష్యాఖ్యగోత్రాధిపా. 2229

చ. శరధిశయాన శార్ఙ్గధర ♦ శంఖశశాంకదివాకరాక్షశం
బరహర శౌరి శక్రమణి ♦ భాసురభాసిత శాటకేయశం
కరసఖశాశ్వతాశరవి♦ఖండితవాసవిశౌర్యధుర్య శం
బరజభవాండపాలక శ♦మచ్రిదభద్రిమహీంద్రవల్లభా. 2230

చ. నరసఖ నవ్యరూప వర♦నాథశరీరగనక్రికుండలా
భరణ నగాత్మజావిసుత♦పావననామక నందనందనా
నరహయమిత్రిచాపహార♦నారదగానసకౌతుకానతా
దర నవనీతచోర నయ♦దానవినోదర నాగభూధరా. 2231

చ. వరద వరాహరూప వసు♦వాసవశీకృత లోకవార్ధిభూ
వరవరుణాలయోన్మదని♦వారణవందితమానిజాలవా
సరమణిపుత్రికాహృదయ♦శాసన సోదరవాను దేవవా
ర్ధరతనుకాంతిశోభివన♦దంత్యవనావరనీలశైలపా. 2232

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము, పద్య 379,380,381,382,383.

## కవిత్వము.

చ. సరసముగాఁగ భావములు♦జానుఁదెనుంగున నింపుపెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఘణితి♦పేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమ♦దుత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లార్యులకుఁ ♦ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్. 2233

కుమారసంభవము, ఆ 1 పద్య 35.

క. తెలుఁగుకవిత్వము చెప్పం, దలఁచినకవి యర్థమునకుఁ♦దగియుండెడుమా
టలుగొని వళులుం బ్రాసం,బులు నిలుపక యొగిని బులిమి♦పుచ్చుట చదురే.

క. అలవడ సంస్కృతశబ్దము, తెలుఁగుబడివిశేషణంబు ♦ తేటపడంగాఁ
బలుకునెడ లింగవచనం,బులు భేదింపమికి మెచ్చు ♦ బుధజనము కృతిన్. 2235

గీ. ఎట్టికవికైనఁ దనకృతి ♦ యింపుఁ బెంపఁ, జాలుఁ గావునఁ గావ్యంబు ♦ సరసులైన
కవులకెల్లఁ బ్రీతిఁ ♦ గాని సమ్మతిఁ, బొందుఁ బరిణతిగలుగు క ♦ వీశ్వరుండు.

నిర్వచనోత్తరరామాయణము. ఆ 1 పద్య 7, 8, 9.

సీ. పోసఁగ ముత్తెపుసరు ♦ లొప్పఁ బొంకించినలీలఁ, దమలోన దొరయుశ ♦ బ్దములు గూర్చి
యర్థంబు వాచ్యల ♦ క్ష్యవ్యంగ్యభేదంబు, లెఱిఁగి నిర్దోషత ♦ నెసఁగఁ జేసి
రసభావములకు న ♦ ర్హంబుగ వైదర్భి, మొదలైనరీతు లి ♦ మ్ముగ నమర్చి
రీతుల కుచితంబు ♦ లై తనరారెడు, పాకంబు లింపుగాఁ ♦ బాదుగొల్పి
గీ. యనర యుపమాదులును యమ ♦ కాదులు నగు, నట్టియర్థశబ్దాలంక్రి ♦ యలు ఘటించి
కవితఁ జెప్పంగనేర్చు స ♦ త్కవివరునకు, వాంఛితార్థంబు లొసఁగని ♦ వారుగలరె?

కళాపూర్ణోదయము, ఆ 1 పద్య 186.

మ. తెనరన్ వ్యాకరణజ్ఞుఁ దండ్రియనుచుం ♦ దర్కజ్ఞునిం భ్రాతయం
చును మీమాంసకునిన్ నపుంసకుఁ డటం ♦ చు న్వీడి దూరంబునం
గని యస్పృశ్యునిబోలె ఛాందసుని వే ♦ డ్కం గావ్యలీలారస
జ్ఞు నిజేచ్ఛం గవితావధూమణి వరిం ♦ చున్ భావగర్భంబునన్. 2238

ముకుందవిలాసము, ఆ 2 పద్య 227.

చ. అరసివిశుద్ధశబ్దములు ♦ నర్థములన్ ధ్వనివైభవం బలం
కరణము రీతివృత్తులును ♦ కల్పన పాకము శయ్యయున్ రస
స్ఫురణము దోషదూరత య ♦ చుంబితభావము లొప్ప చిత్రవి
స్తరమధురాశులీలకవి ♦ తల్ రచియింపఁగ నేర్చె నంతటన్. 2239

తారాశశాంకవిజయము, ఆ 3 పద్య 54.

సీ. సకలార్థతత్త్వజ్ఞ ♦ శబ్దశాస్త్రజ్ఞానిఁ, గన్నతండ్రిగ నెంచి ♦ గౌరవించు
ఘనతరసాహిత్య ♦ కల్పకులైనట్టి, తార్కికులందు సో ♦ దరత నిల్పుఁ
బరమపురాణామ్నా ♦ యపఠనశీలుర నంట, రానివారినిగ దూ ♦ రతఁ జరించు
మహితధీయుతుల మీ ♦ మాంసశాస్త్రజ్ఞులఁ, బుంస్త్వహీను లటంచు ♦ బుద్ధి నెంచు
గీ. భూరినాటకకావ్యశ్రేం ♦ గారభావ, కనదలంకారశబ్దల ♦ క్షణము లరయు
వానికడఁ జేరి మదిలోన ♦ వలపు లూరఁ, దొడరి వరియించుఁ గవితావ ♦ ధూలలామ.

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 1.

ఉ. ఆశుకవిత్వమన్న నది ♦ యా గణికాకృతి చిత్రకావ్యమో
కేళలచిత్రరేఖనము ♦ వింతగు గర్భకవిత్వ మన్ననో

కోశగతాస్థిశోధన మ◆గుం గనబంధమె బంధమందమే
కేశవసంభవాపగఁ ◆ గీర్తితమాధ్వనికావ్య మేకమే. 2241
బిల్వేశ్వరీయము, బింబ. 1 పద్య 199.

## కావ్యము.

చ. పరగ సువర్ణబంధమృదు◆భావము గల్గియు లోనుచూడఁగాఁ
బొరపగు చిత్రరూపమును◆బోలె నసత్కవికావ్య మిమ్మహిన్
బరగు సువర్ణబంధమృదు◆భావవిశేషము లొప్ప దెల్వలన్
సరియగు రత్నపుత్రికయు ◆ సత్కవికావ్యము నొక్కరూపమై. 2242
కుమారసంభవము, ఆ 1 పద్య 37.

క. లోకోత్తరగుణపుణ్యా, శ్లోకకథామధురిమధుర◆శుభవాఙ్మయర
త్నాకల్పం బగు కావ్యం, బాకల్పంబగుఁ గృతార్థుఁ ◆ డగుఁ గవివరుఁడున్.
శ్రీరంగమహత్త్వము. ఆ 1 పద్య 13.

గీ. తరుతటాకాదిసంతతు◆ల్ధరణి నెచట, నిలిపి రచటనె యుండు వా◆నికిని గృతిసు
ఖంబునను విశ్వవిఖ్యాతి◆గానఁ గృతియె, సంతతివతంస మదిమాకు◆సంఘటింపు.

ఉ. కేవల కల్పనాకథలు ◆ కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరి పుట్టు రత్నము ల◆వారితసత్కవికల్పనావిభూ
షావహపూర్వవృత్తములు ◆ సానలఁ దీరిన జాతిరత్నముల్
గావున నిట్టి మిశ్రకథ◆గా నొనరింపుము నేర్పు పెంపునన్. 2245
వసుచరిత్రము, ఆ 1 పద్య 18, 19.

మ. పరమజ్ఞానలతాలవాలము జగ◆త్ప్రఖ్యాత విఖ్యాతసా
గరచంద్రోదయ మిష్టసంఘటనరే◆ఖాదివ్యధేనూత్తమం
బురుకార్పణ్యదశానిశాదినముఖం◆బుద్వేలనిర్వాణభ
వ్యరసాస్వాదరసాయనం బనిన గా◆వ్యం బెన్న సామాన్యమే. 2246
నరసభూపాలీయము, ఆ 1 పద్య 26.

సీ. తనయన్వయమునందు◆మును జనించినవారి, చరితమంతయుఁ బ్రశ◆స్తముగఁ జేయుఁ
దనమాతృవంశంబు ◆ జనుల పౌరుషలీల, లాస్థానవర్ణనీ◆యములు సేయుఁ
దనకు సద్బంధులై◆తనరెడువారి స,ద్వృత్తంబు లన్నియు ◆ వెలయఁ జేయుఁ
దానొనర్చిన మహో◆త్తమపౌరుషంబులు, ధరలోనఁ దగఁ బ్రసి◆ద్ధములు సేయు

సీ. వివిధశబ్దార్థచాతురి♦విన్నయంత, కవిజనులు మెచ్చు కావ్య మొ♦క్కటియకాజె
యట్టికావ్యంబు రచియించు♦నతఁడెవిపుల,భాగ్యవంతుండునిజవంశ♦పావనుండు.

శ్రీమంతినీకళ్యాణము, ఆ 1.

సీ. రాజవిద్వత్సభా♦రంజనం బగు నెద్ది, పరదేశసంతత♦బంధు వెద్ది
సకలసంపద్బహు♦సౌఖ్యదం బగు నెద్ది, ముక్తిసాధనశుభ♦మూల మెద్ది
పాపపుణ్యాజ్ఞాన♦భాజనం బగు నెద్ది, తలఁగునవోనిమహాప♦దార్థ మెద్ది
పటుతమోజలదవ్రి♦భంజనం బగు నెద్ది, తనుభూషణంబయి ♦ తనరు నెద్ది
గీ. అట్టి యనవద్యహృద్యవి♦ద్యావిశేష, మెలమిఁగని కవితాలీల ♦ నలరుచున్న
నుకవికావ్యము విరచించి♦శుభచరితుఁడు, శ్రీకళత్రుని కొసఁగర♦క్షింపలేఁడె.

కౌసల్యాపరిణయము, ఆ 1.

మ. తెనుఁగుంగావ్యముఁ జెప్పవయ్య మృదువై♦దేశీయమై భావమై
వినసింపై సరసత్వమై విరళమై ♦ విఖ్యాతమై కీర్తియై
జనితామోదకహృద్యపద్యకరమై ♦ సద్ధర్మమై చోద్యమై
తనరం బల్కవె చింతయేల యనుచుం ♦ ధర్మజ్ఞ భాషింపవే. 2249

వైశ్యపురాణము, ఆ 1.

ఆ. భువి యశంబును దివి♦భోగంబు నిచ్చును, సరసకావ్యకన్య ♦ పరకవులకుఁ
దదనువల్లభునకుఁ ♦ దండ్రికి నిహపర, వివిధసుఖము లొసఁగు ♦ వెలఁది వోలె.

నారాయణాచలమాహాత్మ్యము, ఆ 1 పద్య 13.

ఉ. ద్వైతముభాతిఁబెంపుగనె ♦ పట్టిపెనంగక బావ్యావృత్తిన
ద్వైతమురీతిస్వీయమను♦భావమె మాన మటంచు సంగ్రహం
బూఁతగఁబట్టకందుపయి ♦ దూడకయేదకసాంఖ్యపద్ధతిన్
ఖ్యాతిగఁజేయుకావ్యమె జ♦గన్నుతమహా హితసత్యసంపదన్. 2251

విశ్వేశ్వరీయము, బింబ. పద్య 204.

## ♦ నవరసములు. ♦

క. ధర శృంగారము హాస్యము, కరుణయు వీరము భయాన♦కముబీభత్సం
బురురౌద్ర మద్భుతము శాం,తరసంబును రసము లనఁగఁ ♦ దనరుం గృతులన్.
సీ. మరకతానీకదం♦భమున శృంగారంబు, హాస్యంబు ముక్తాఘ♦లౌఘురుచులఁ
గరుణవిదుమ్రవర్ణ♦గౌరవచ్ఛలమున, రౌద్రంబు కురువింద♦రత్నకలన
వీరంబు గోమేధి♦కారోపితస్ఫూర్తి, భయము వైడూర్యశో♦భామిషమున
బీభత్స మింద్రనీ♦లాభాగుణంబున, శాంతి నిర్మలహీర♦కాంతిగతుల

తే. నద్భుతము పుష్యరాగరా♦గాపదేశ, విలసితంబున ప్రాకార♦వృత్తిఁ గాంచి
నవరసంబులు వొల్చునీ♦భవనవీథిఁ, బ్రబల నుబలనృసింహా యో♦బయనృసింహ.

నరసభూపాలీయము, ఆ 3. పద్య 6, 153.

—♦ శృంగారరసము. ♦—

చ. ఇల వలరాజురూపునకు ♦ నెక్కువ యయ్యెడు విశ్వమేదినీ
లలనునిరూపయౌవనవి♦లాసములం జెలిమాటు చేరి య
గ్గలికపుసిగ్గు వేడుకల♦గ్రందున కడ్డపడంగ నిమ్ములన్
మెలఁతుక వాలుఁజూపులకు ♦ మేపులు పెట్టెడుఁ జూచితే సఖీ. 2254

—♦ హాస్యరసము. ♦—

క. లీనాచారుల జవులకా,లీనాత్ముల సతతసవ్య♦లీకులఁ జూడం
బూనెడు విశ్వేశ్వరుని న,వీనదరస్మితము లచ్చ♦వెన్నెలఁ బోలున్. 2255

—♦ కరుణారసము. ♦—

క. అనిఁ దృణము గఱచి జే యని, నినదించుచుఁ బొరలు విమత♦నికరముఁ గరుణన్
గనుఁగొని కాచుట నైజము, గొనకొని యరిరాయగండ♦గోపాలునకున్. 2256

—♦ రౌద్రరసము. ♦—

క. రుద్రుం డగు విమతనరో,పద్రవకరణములఁ గుపిత♦బలభద్రుఁ డగున్
ముద్రణితకదనగతి న,న్నిద్రాకృతి విశ్వమేది♦నీపతి చూడన్. 2257

—♦ వీరరసము. ♦—

క. అరివీరుల నమరావతి, కరిగించుచు వివిధ ధనము ♦ లర్థివరుల కి
య్యరవడి నొసఁగుచుఁ బరఁగెడు, నిరతోత్సాహంబు విశ్వ♦నృపునకు నొప్పున్.

—♦ భయానకరసము. ♦—

క. రిపునృపులు విశ్వనాథ, ప్రపటుధ్వజదంష్ట్రిఁ జూచి ♦ పరఁగినభీతిన్
విపినవరాహంబుల నిల, నిపుడుం గనుఁగొనఁగ వెఱతు♦రెట్టితలఁపులో. 2259

—♦ భీభత్సరసము. ♦—

మ. అతిదృప్యత్పరగండభైరవభుజో♦ద్యత్ఖడ్గకృత్తాహిత
చ్యుత భూరిక్షతజప్రవాహములలో ♦ శుండాలరుండావలీ
కృతకేలాచరయానపాత్రములలోఁ ♦ గ్రీడించు నారోధన
క్షితి భూతంబులు మజ్జమాంసరసమ♦స్తిష్కప్రమత్తంబులై. 2260

—♦ అద్భుతరసము. ♦—

క. సమధిక మగు నచ్చెరువ,చ్చముగా విశ్వేశు దాన♦జలధారాపూ
రము చేతఁ జేతి కందును, విమలాంబర కనకహారులు ♦ విద్వత్తతికిన్. 2261

—♦ శాంతరసము. ♦—

క. విశ్వేశుమహిమ విని కవి, విశ్వంభర విడిచి మదము♦వీడ్కొని విమతుల్
శశ్వద్గమశమయుక్తి వ, నశ్వరులై నిలుతు రహర ♦ నగముల నడుమన్. 2262

కావ్యా. చూడా. ఉల్లా॥ 5 పద్య 60, 61, 62, 63, 64, 65, 66, 67, 68.

## కృతిసమర్పణము.

సీ. ఆయురారోగ్యని♦త్యైశ్వర్యములుగల్గి, విభవంబుతో ధాత్రి ♦ వెలయుకొఱకు
ధనమునకై నరా♦ధముల సన్నుతి సేయఁ, బొడమినపాపముల్ ♦ చెడుటకొఱకు
హృదయంబు లక్ష్మీశ ♦ పదపంకజములందు, నిశ్చలవృత్తితో ♦ నిలుచుకొఱకు
రౌరవంబులఁ బాసి ♦ రయమున వైకుంఠ, సదనంబునకు వేడ్కఁ ♦ జనెడుకొఱకుఁ
గీ. బరమవైష్ణవజను లెల్లఁ ♦ బ్రస్తుతింప, మత్కృతంబయ్యు హరికథా♦మాన్య మగుచు
నుత్తమం బగు విష్ణుధ♦ర్మోత్తరంబు, రంగనాథున కర్పింతు ♦ రాణ మెఱసి. 2263

మత్స్యపురాణము, ఆ 1 పద్య 7.

సీ. వరతరోత్ప్రేక్షాల♦వక్రమోదాత్తవి,భావనాలంకార ♦ పటిమతోడ
శయ్యాచమత్కార ♦ శబ్దస్ఫురణపదా,వృత్తి పాంచాలికా♦రీతితోడ
సుకుమారపదగోప♦నోక్తుశ్రవ్యతనవయ,మకగతదీపక ♦ మహిమతోడ
సురసప్రధానవ♦స్తుప్రధానపదార్థ,పక్వముద్వీపల♦పాళితోడ
గీ. సకలశృంగారలీలాభి♦సరణితోడ, వృద్ధిఁబొందినకృతికుమా♦రిక వివేక
హీనధనిభూతమున కిడఁ ♦ బూను టెన్న, బూడిదెను బోయుపన్నీరు♦పోల్కి గాదె.

కౌసల్యాపరిణయము, ఆ 1.

సీ. మత్తేభగామిని ♦ మత్తకోకిలకంఠి, శ్రీకర్ణవరసర♦సిరుహవదన
పృథువితతనితంబ♦బింబ చంపకనాస,లలితపదాలాప♦జలదవేణి
యుత్పలగంధి వి♦ద్యుత్కాళికాంగి శ్రీ,ఫలవృత్తవక్షోజ♦పాళితరళ
నయనమదన దర్పణ కపోలతలశంఖ,గళభుజంగోరువి♦గ్రహరుహాళి
గీ. యగుచు విలసిల్లుకావ్యక♦న్యకమ సుకవి,లసదలంకారశయ్యార్థ ♦ లలితహర్ష
కలనఁ దేలుసరసునకుఁ ♦ బలయుఁగాన కృతిపతినిఁజేతు నీ మహో♦న్నతసుకృతిని.

ఓఘవతీపరిణయము, ఆ 1 పద్య 71.

# ఆశుకవితానిరసనము.

క. నిరలంకృతియును నసరస, వరపాకప్రక్రియానివారితశయ్యా
విరహాకృతి బాధహీనము, ధర నాశుకవితదనరు విధవకాంతవలెన్. 2266

ఆ. ఆశుకవితయందు ♦ హావభావాదులు, శేషకల్పనలును ♦ జేరకుండఁ
జేసి కవులశక్తి ♦ వాసి దొలంగును, అటులఁగామి కీర్తి ♦ యధిక మగును. 2267

క. ఆశుకవిత్వంబందున, సౌశబ్ద్యం బుండదెపుడు ♦ సభలో దానన్
బ్రాశస్త్యహానిగలుగదె, యాశనముం డైన వాని♦కెప్పుడు భువిలోన్. 2268

క. ఆలోచించని కవనం, బాలోచింపంగవలయు ♦ నందఱు విబుధుల్
ఆలోచించినకవనం, బాలోచింపంగవలయు ♦ నాలోచింపన్. 2269

క. స్వవనము కవనము కవులకు, సువిచారతకలిగెనేని ♦ శోధింపంగన్
స్వవనము స్వవనము కవులకు, సువిచారతకలిగెనేని ♦ శోధింపంగన్. 2270

(?)గీ. రసము లేనట్టి కవిత వ్య♦ర్థంబు గాదె, ఫలమురీతిని రూపంబు ♦ పసిది గాన
రసము కలిగిన సుకవిత ♦ తానుభవము, గలిగియుండును ధరణిశ్లా♦ఘ్యంబుగాదె.

క. మండనమిశ్రునియంతటి, పండితవరునకునుయతిరాట్ ♦ భంగం బయ్యెన్
పండితులపతులా మఱి యా, ఖండలగురులా దలంప ♦ కవులాధునికుల్. 2272

సావిత్రీపరిణయము, పీఠిక.

# ఆశీర్వచనము.

సీ. శ్రీరస్తు శుభమస్తు ♦ ధీరస్తు విజయోస్తు, పుత్త్రిరంజనమస్తు ♦ పుణ్యమస్తు
ధనమస్తు ధాన్యమ♦స్త్వనవద్యసుఖమస్తు, చిరతరసంకల్ప♦సిద్ధిరస్తు
సత్యమస్తు మహోస్తు ♦ శౌర్యమస్తుయశోస్తు, స్వస్త్యస్తు సుగుణోస్తు ♦ శక్తిరస్తు
సామ్రాజ్యమస్తు శా♦శ్వతధర్మఫలమస్తు, వృద్ధిరస్తు మహోగ్ర♦సిద్ధిరస్తు

గీ. జ్ఞానమస్తు శ్రీయఃపతి ♦ ధ్యానమస్తు, గురుచరణభక్తిరస్తు స♦త్కుశలమస్తు
శాంతిరస్తు నిరంతరై♦శ్వర్యమస్తు, భాగ్యమస్తు మహాసౌఖ్య♦భామ నీకు. 2273

హంసవింశతి, ఆ 1 పద్య 47.

సీ. తతరుణ్నిశాంతసం♦తపనుండు తపనుండు, రంజితసద్ద్విజ♦రాజు రాజు
ఘటితమహానుమం♦గళుఁడు మంగళుఁడు సం,పూజితవృధులవి♦బుధుఁడుబుధుఁడు
చితనభస్సంచార♦జీవుండు జీవుండు, దృఢదళదామ్నాయ♦భృగుఁడు భృగుఁడు
నఖిలాపపద్రమం♦హాశనిశనిసుక,ర్మనిహితసత్ఫరి♦గ్రహముగ్రహము

గీ. నీతిపరిపూర్ణసుజనతా◆కేతుకేతు, వెలమిఁ దగనిల్చి ప్రోతుర◆హీనరాజ్య
ప్రాసపాట్యన్వయాబ్ధిరా◆కానుధాంశు, విజయరామావనీంద్రుస◆ద్విభవసాంద్రు.

కౌసల్యాపరిణయము, ఆ 1.

## కుశలప్రశ్న.

సీ. మాతామహుండైన◆మనశూరుఁడున్నాఁడె, మంగళమే మన◆మాతులునకు
మోదమే నలుగురు ◆ ముగురుపేనత్తల, కానందమే వారి◆యాత్మజులకు
నక్రూరకృతవర్మ ◆ లాయుస్సమేతులే, జీవితుఁడే యుగ్ర◆సేనవిభుఁడు
కళ్యాణయుక్తులే◆గదసారణాదులు, మాధవుతమ్ములు ◆ మానధనులు
గీ. నందమే మనసత్యక◆నందనునకు, భద్రమే శంబరాసుర ◆ భంజనునకుఁ
గుశలమే బాణదనుజేంద్రు◆కూఁతుపతికి, హర్షమే పార్థుసఖికి◆హాలికిబలికి.

భాగవతము, స్కం. 1 పద్య 847.

సీ. శౌనకా సుఖమె వి◆శ్వామిత్రులెస్సలా, కణ్వ మంచిదియె భా◆ర్గవశుభంబె
సుత పరిణామంబె ◆ సుతపసంతోషంబె, చ్యవన సేమమె పరా◆శర శివంబె
కపిల మంగళమె మా◆ర్కండేయ కుశలమే, వత్ససౌఖ్యమె కాత్స్యా◆యోత్సవంబె.
మాండవ్య భవ్యమే◆మైత్రేయ భద్రంబె, సుబలమేలె వశిష్ట◆శోభనంబె
గీ. క్రతుభరద్వాజగౌతమ◆కశ్యపాత్రి, కలశసంభవ కౌండిన్య◆గర్గమంద
పాల జాబాలి రోమశ◆ప్రముఖులార, యారలానందముగ నున్న◆వారెయిచట.

వాల్మీకిచరిత్రము, ఆ 1.

## వందనము.

సీ. చేమోడ్పులగునీకు ◆ శేషశయాన జో, హారులునీకుఁబ◆రాపరేశ
వందనంబులునీకు ◆ వాసుదేవ, రమేశ, దండముల్ నీకు వే◆దండవరద
ప్రణతులునీకు శ్రీ◆రంగరాజముకుంద, సాష్టాంగములు నీకు ◆ సృష్టినాథ
దాస్యముల్ నీకు స◆దాస్యనిర్జితచంద్ర, నడియఁడనీకు భ◆వాభవేశ
గీ. చేరిసేవించెదము నిన్నుఁ◆జిదచిదీశ, యంజలులు నీకు సర్వహృ◆దబ్జవాస
కడునమస్కారములునీకు◆గమలనాభ, మ్రొక్కులొనరించెదము నీకుఁ◆జక్రనయ్యా.

భార్గవపురాణము, ఆ 2.

సీ. చక్రపాణికి నమ◆స్కారంబుఁ గావించి, శార్ఙ్గపాణికిఁ గరాం◆జలి ఘటించి
కంభేశ్వరునకు మ్రొ◆క్కులుగూర్చి యలసోమ, నాథులకభివంద◆నములు నేసి

నాగనాథునకుఁ బ్రణామంబు సవరించి, విశ్వనాథునకును ♦ వినతి సలిపి
అవిముక్తశివునకు ♦ సాష్టాంగవందనంబు, లాచరించి మఱియు ♦ నచటఁ గలుగు
గీ. దేవతాతతికెల్లను ♦ భావశుద్ధి, చెలఁగుచుండ నమోవాక♦ములవరించి
యభ్రపథగంగామదృతుకమున♦నభ్రలీల, నలర నష్టానిపుంగవు♦లవలఁ దాఁటి. 2278
వాల్మీకిచరిత్రము, ఆ 2.

## గురుఁడు.

క. గురుఁడే తల్లియుఁ దండ్రియు, గురుఁడే దైవంబు బంధు♦కోటియు హితులుం
గురుఁడే యని నమ్మిన సుస్థితభావుల కన్య మున్న♦దే చిక్కన్నా. 2279
నీలకుంతలావిలాసము, ఆ 2.

క. గురుఁడే యుత్తమదైవము, గురుఁడే గతి పాపములను ♦ గూల్పం గురుఁడే
నరుల కది గాన సద్గురు, వరసి ప్రయత్నమున నమ్మ♦నగు నిరతంబున్. 2280
వేంకటాచలమాహాత్మ్యము, ద్వి॥ చిన॥ వేం॥ ఆ 3 పద్య 209.

క. విద్యోపదేశగురుఁ డన, వద్యమతి సుబోధకత్వ♦పద్ధతి నైశా
రద్యుఁడు జాతివయోమహి, మాద్యున్నతివంచనీయుఁ♦డై యొనరవలెన్. 2281
మహేంద్రవిజయము, ఆ 2 పద్య 32.

## శిష్యుఁడు.

చ. వినయవిధేయవర్తనుఁ డ♦విస్మృతిశాలి యసంశయాశయుం
డనితరసక్తమానసుఁ డ♦పాస్తపదూరుఁ డధీతపాఠచిం
తనపరుఁడున్ సుఖగ్రహణ♦ధారణగణ్యుఁడు సూక్ష్మబుద్ధి సు
స్వనుఁడు గురుప్రియుండు నగు♦వాని నె శిష్యునిగాఁ గొనం దగున్. 2282
మహేంద్రవిజయము, ఆ 2 పద్య 33.

## గురుధర్మము.

సీ. ఆలస్యనాస్తికా♦హంకార పంచక, ద్వేషవిద్యాచోర♦దోషకులకు
పాషండనిష్ఠుర ♦ పతితకార్యకృతఘ్న, కలహప్రియ విషయా♦గర్వితులకు
స్తంభనమోహనో♦చ్చాటనమారణ, వశ్యకుహకవిద్యా♦వాదులకును
నసులోభమోహాతి♦శయకామ్యకరులకు, వేదకోద్యానియుక్తి ♦ సోమరులకు

గీ. వినయభయభక్తి విశ్వాస♦ఘనతచేత, గురులశుశ్రూష చేయని ♦ కుత్సితులకును
స్వస్వరూపోపదేశంబు ♦ సార్వభౌమ, యెన్నివిధములకైన ని♦య్యంగరాదు. 2283
శ్రీరామస్తవరాజము, ఆ 2.

క. పరగునశిష్యులపాపము, పరిహారణమొనర్చి పుత్త్రభావ మునిచి స
త్కరుణను ధన్యులఁజేయుట, ధరణిని గురువులకు సహజ ♦ ధర్మము గాదే. 2284
కుబ్జాకృష్ణవిలాసము, ఆ 4.

# శిష్యధర్మము.

సీ. జడివానబట్టిన ♦ చాడ్పున వాదించు, వట్టి చదువుపోరు ♦ గట్టిపెట్టి
యుదరపోషణకొఱ♦ కొడిగట్టివట్టియా, భయరూపములనెల్లఁ ♦ బయటఁగలిపి
నానావిధన్యాయ ♦ నటనలు తనచేటె, గాన యొండొరులది♦గాని తెలిఁగి
యేలోకసుఖములు ♦ బైలుపచోరము, లోను లోగారమన్ ♦ లోఁ దెలియంగ
గీ. దేహవర్ణాశ్రమాచార♦ దేశకాల, రూపరేఖాభిమానముల్ ♦ రోసి విడిచి
పిన్నపెద్దతనంబులు ♦ పిండి గలిపి, యార్యశుశ్రూష సేయ మో♦క్షాప్తిఁ దగును.
శ్రీరామస్తవరాజము, ఆ 2.

# గురుశుశ్రూష.

సీ. నాల్గుశుశ్రూషల ♦ నడకల వేర్వేఱ, విభజింతు వినవయ్య ♦ విమలచరిత
ఆర్యాభిమతపదా♦ర్థానుకూలము సేయు, నది యాత్మశుశ్రూష♦ యండ్రు బుధులు
ఆపాదమస్తకా♦భ్యంజనాతిథ్యము, లంగడున్ శుశ్రూష♦లనఁగఁ నొప్పు
క్షేత్రగుహారామ♦సీమలనరయుటల్, స్థానమున్ శుశ్రూష♦జాడలాయె
గీ. తాత దైవంబు తల్లియుఁ ♦ దండ్రి కర్త, యేదుగడయును గురుఁడంచు♦ నెంచి భక్తి
సేయ సద్భావశుశ్రూష♦ సిద్ధమిట్టు, లెఱిఁగి నడుపంగవలయును ♦ గురునిఁ జేరి.
శ్రీరామస్తవరాజము, ఆ 3.

# —♦ విద్య. ♦—

సీ. కమనీయవిద్య దాఁ♦ గామధేనువుభంగిఁ, గామితార్థంబుల ♦ గలుగఁ జేయు
సజ్జనవిద్వాంస♦సంఘంబులోపల, మానుగాఁ దను బెద్ద♦ మాన్యుఁ జేయు
నెన్ని దేశంబుల♦ కేఁగిన సాయమై, తల్లిచందంబునఁ ♦ దన్నుఁ బ్రోచుఁ
జన్నగాఁ దనపుణ్య♦పాపము ల్తెలియించు, సాధించు నిహపర♦సాధనంబు

గీ. నగ్నిఁగాలదు రాజుల♦కలవి గాదు, నీళ్ల నానదు చోరుల♦పాలుగాదు
అన్నదమ్ములపాళ్లకు ♦ నలవిగాదు, చెలఁగి విద్యాధనమునసఁ ♦ జేటు లేదు. 2287
పంచతంత్రము, దూ॥ నా॥ ఆ1 పద్య 58.

ఉ. హర్తకుఁగాదుగోచర మ♦హర్నిశమున్ సుఖపుష్టిఁజేయు స
త్కీర్తి ఘటించు విద్యయను ♦ దివ్యధనం బఖిలార్థికోటికిం
బూర్తిగ నిచ్చినం బెరుఁగుఁ♦బోదు యుగాంతపువేళ నైన భూ
భర్తలు తద్ధనాధికుల♦పట్టున గర్వము మాను టొప్పగున్. 2288

ఉ. భూషలుగావు మర్త్యులకు ♦ భూరిమయాంగద తారహారముల్
భూషిత కేశ పాశమృదు♦పుష్పసుగంధజలాభిషేకముల్
భూషలు గావుపూరుషుని ♦ భూషితుఁజేయుపవిత్రవాణివా
గ్భూషణమే సుభూషణము ♦ భూషణముల్ నశియించు నన్నియున్. 2289

ఉ. విద్య నిగూఢగుప్తమగు ♦ విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి♦విద్యగురుండు విదేశబంధువున్
విద్య విశిష్టదైవతము ♦ విద్యకు సాటిధనంబు లేదిలన్
విద్య నృపాలపూజితము ♦ విద్య నెఱుంగనివాఁడు మర్త్యుఁడే. 2290
భర్తృహరిసుభాషితము, ॥ఏ॥ ల॥ నీతి. పద్య 14, 16, 17.

## విద్యలు-కళలు.

సీ. వేదంబువాదంబు♦వీణాదివాద్యంబు, లాలేఖ్యకర్మంబు ♦ లాగమములు
మంత్రతంత్రంబులు ♦ మందులు మాయలు, సింధురగంధర్వ ♦ శిక్షణములు
జూదంబు ముచ్చిమి♦జ్యోత్స్యంబు గానంబు, ధర్మార్థకామశా♦స్త్రములు కవిత
కావ్యనాటకములు ♦ కథలుపురాణంబు, లాయుధనైపుణ♦మంజనంబు

గీ. నాదిగా నన్నివిద్యలు ♦ నన్నికళలు, నభ్యసించిరి యౌవన♦మమరె నలరి
యక్కుమారులఁ గనుఁగొని♦యవ్విభుండు, పమ్మదాంబుధిలోఁ గేళి♦సలుపుచుండె.
దశకుమారచరిత్రము, ఆ 2 పద్య 116.

సీ. చదివెను బుగ్యజు♦స్సామాదివేదంబు, లధికరించెనుతదర్థ♦హాస్యజాత
మభ్యసించెను లక్ష♦ణానేకముల నెల్ల, నధిగమించెను పడం♦గాంగములను
పఠియించెఁ గాణాద♦భాష్యమీమాంసలు, తెలిసె వ్యాసమతంబు♦తేఁటపడఁగ
గ్రహియించె సాంఖ్యయో♦గములమర్మము లెల్ల, నాకళించెను పురా♦ణాదికముల

గీ. నేర్చెఁ దెల్లముగా దండ♦నీతిశాస్త్ర, మరసె సాధ్యాంతముగను వై♦ద్యాగమంబు
నెఱిఁగె సాంగధనుర్వేద♦ మెల్లనపుడు, సోముఁ డుత్కృష్టశాస్త్రమ♦ధాముఁ డగుచు.

తారాశశాంకవిజయము, ఆ 2 పద్య 53.

## ధనుర్విద్యానైపుణ్యము.

చ. దొనపయిఁ జేయి యెప్పుడును♦ దూపు లెడల్పుటె మున్న రీతిఁ దాఁ
జనుమర చేర్పునం దెపుడు♦ జాఁకయుమ్మరిఁ బోనియున్న చా
డ్పున శ్రవణాంతసీమ నెపుడున్ వలయాకృతిచాపమై నశిం
చినగతిఁ దోఁచెఁ దత్కరముఁ♦ జిత్రరయంబునఁ జెక్కురూపులై. 2293

కళాపూర్ణోదయము, ఆ 8 పద్య 122.

## శకునవిద్యలు.

సీ. గౌరిపంచాంగంబు♦గౌళిపంతులపంచ, పక్షులశకునముల్♦ పైడికంటి
పలుకులరీతులు♦ప్రశ్నభాగంబులు, గల్యాలు గూయంగఁ♦గలుగు మేలు
కీడును బోచిళ్ళ♦జాడ లింగిడి నేర్పు, దిక్కువిదిక్కులు♦దెలిసినడువు
దుష్ట్రలక్షణములు♦ తొండదు కొక్కిరవంబు, సాముద్రికస్థితి♦ జతురగమహిమఁ
గీ. దెలియ నేర్చిన యొకమహా♦ధీగరుఁడు, శకునవిద్యావిచక్షణా♦ధికుఁడు సోకు
మార్యరేఖలమారట♦మారుఁడైన, యౌవనదిశ జెందు మతిమంతుఁ♦డనెడివాఁడు.

హంసవింశతి, ఆ 4 పద్య 46.

## విద్యాసాహస్యుఁడు.

ఉ. గద్యము పద్యమంచు జనువాఁ♦డై కొనుటొండె ధ్రువాపరిబంధసం
పద్యుతుఁడౌటయొండె బహుచు♦భాషల పెద్దలు మెచ్చుటొండె లో
కోద్యమలక్షణంబు దెలుఁగు♦టొండె గడున్ ఫలియించుఁగాక యే
విద్యలు నేరఁడేని పశు♦వాతఁడె గాఁడె గణించిచూడఁగన్. 2295
ఉ. సంగీతంబుఁ గవిత్వతత్త్వమును సౌ♦జన్యంబు ప్రభావంబు స
త్సంగత్వం బెఱుఁగంగలేని భువి నా♦శ్చర్యంబుగా వాలమున్
శృంగద్వంద్వములేని యెద్దతఁడె నన్ ♦ జెల్లుం దృణం బొతఁడు
న్యంగీకరంబున మేయఁడా పసులభా♦గ్యం బిచ్చటం గల్గుటన్. 2296

ద్వాత్రింశత్సాలభంజికాకథలు, ఆ 4.

## —♦ గురువులేనివిద్య. ♦—

ఆ. తల్లిదండ్రిలేని ♦ తనయుని పోలికె, సతికి పతియు లేని ♦ చందమునను
గురువులేనివిద్య ♦ కూడ దెందులకైన, నజ్ఞునకైన నిజము ♦ యరసిచూడ. 2297

శ్రీరామస్తవరాజము, ఆ 2.

## కరణము.

చ. తెలితలపాగ చొక్కపు మొల♦తిత్తి భుజంబునం జల్వపచ్చడం
బల చిటివ్రేలిముద్రిక యు♦యారము మీఱం బొగాకుచుట్ట సొం
పలరెడు కావిదోవతి ప♦దాబ్జయుగంబున ముచ్చె లొప్పఁగా
నల విభుఁ డంత గ్రామకర♦ణం బటకై చనుదెంచి వేడుకన్. 2298

హంసవింశతి, ఆ 3 పద.39

## కుమ్మరి.

సీ. ఆదివరాహంబు♦ మేదిని యెత్తిన, మాడ్కిఁ జొప్పడఁగఁ దా♦మన్ను మోయుఁ
బ్రథమవేళల సృష్టి♦బ్రహ్మ చేసినయట్లు, ఘటకోటు లుత్సాహ♦గరిమఁ జేయు
విష్ణువు చక్రంబు♦వేడుకఁ ద్రిప్పెడు, చాడ్పునఁ బలుమాఱు♦సారె ద్రిప్పు
బయలిపురంబులు♦భర్గుండు గాల్చిన, చందంబు నూపష్ట్రినా♦వంబుఁ గాల్చు
గీ. కపివరుఁడు పర్వతంబులు ♦ గమిచి తెచ్చి, కుప్ప లిడురీతిఁ గుండలు♦కుప్ప వెట్టు
నవి దివియు ధాత కాండంబు♦లడఁచునరిణీ, సాధుపదవర్తి ఘుటకారచక్రవర్తి.
గీ. తీర్చు ప్రమిదెలు కులుకులు♦ద్రేటగట్లు, గరలముఱువులు వడికల్లు ♦ కిరుదుకల్లు
బొద్దుటీనలు నునువులు♦మొదలు గాఁగఁ, జనులు నిర్మించుఁ గుండలో♦పై నతండు.

హంసవింశతి, ఆ 5 పద్య 10, 13.

## గొల్లలు.

ఉ. తెల్లనిపట్టెనామములు♦ దీఁగెల నెట్టెములుం బదంబులన్
బిల్లల చెప్పులున్ జెవులఁ♦ బింఛములున్ మొలనున్న క్రొత్తకం
బళ్లును వన్నెగాఁ జెరుగుఁ♦ బాలును నేతులు వీఁక వంకకా
వళ్ళు ధరించి శౌరిఁ గన♦వచ్చిరి కొండలు గొల్ల లర్థితోన్. 2301
సీ. కొరగించెడు కొంచ♦గొంగుఁబువ్వలచాయ, దీవన్నె గొగ్గడఁ♦బెట్లు గలిగె
మెఱుఁగుజొక్కపుచాయ♦మించు నీ తెల్లని, గురుపిండపే రంధ్ర♦గూర్చుకొంటి

నిగుడుఁగప్పనిచందమ్మ◆నిప్పుకైవడి నున్న, దీకొడ్డిపూస నీ◆కెవ్వఁ డిచ్చెఁ
బొలసిన గబ్బుకం◆పులు సోఁకుమున్నైషృ, నీనల తిరునామ◆ మెచట దొరకె
తే. జడలు మొదమీఁద వ్రేలెడు◆ జల్లిగోఁక, నేడపపరించుకొంటివి◆ బోడకోడె
యనుచు నాడేడుమూఁకవా◆క్యములకలరి, శ్రీధరుఁడువారిఁగృపనాద◆రించెనపుడు.
జైమినిభారతము, ఆ 3 పద్య 71, 74.

సీ. కిఱ్ఱుచెప్పులు గొప్ప◆గిరునామంబులు, మొలచెక్కుకత్తులు◆ నిలువు సిగలు
కుడిముక్కుఁగ్రమ్మలు◆ గురువిందపేరులు, పిల్లగ్రోవులు మేటి◆ వల్లెత్రాళ్ళు
లొరగట్టుపంచెలుఁ◆ బెరసుఁబచ్చడములు, గార్కొన్నలోవంక◆కఱియొడళ్ళు
గుంపపోగులు చిప్ప◆గొడ్డండ్లు సెలగోల, లొప్పారు పలువంక◆యుంగరములు
గీ. గలిగి వాటంబుగా నెల్ల◆కడలనుండి, పెల్లుమీఱఁగ గిబ్బల◆పేచ మడఁచి
కోర్కె లిగురొత్తఁ గన్నెఁజే◆కొనెడ మంచు, మొల్లముగఁ జేరిరచటికి◆గొల్లలెల్ల.
నీలాసుందరీపరిణయము, ఆ 3.

సీ. కంబళి తలముడ్డు◆ కవ్వము మజ్జిగ, చానకొప్పలి నుచ్చు◆పాఁతళగుది
కావడి యుట్లు చి◆క్కము సందికడియంబు, నూకలతోఁపపా◆గాకుతిత్తి
బొప్పి మజ్జిగముంత◆ బొటమంచిపిల్లల, గూడు దామెనత్రాడు◆కోఁతకత్తి
తోర్లుగట్టెయుఁ జల◆దుబ్బ చిల్కుడుగుంజ, బూజబింగెలు వెన్న◆పూసచట్టి
గీ. పాలబుడిగలు వడిసెల◆ప్రాతమెట్లు, మలపమందులపొడిబుఱ్ఱ◆మన్నెముల్లు
తోలుకుళ్ళాయితోడుపును◆దొడ్డికంబ, ముట్టుచవికెయుఁ గొమరొప్ప◆సాలయునతఁడు.
హంసవింశతి, ఆ 2 పద్య 75.

## సుద్దులగొల్లలు.

ఉ. కొమ్ములు వీరణాలుఁజిగి◆గుల్కెడువాత్రితల కృష్ణలీలలం
గ్రమ్మ గుడార్లు పీరుఁడగు◆ కాటమరాజుకథానులాపముల్
బమ్మెరపుస్తకాలు ముఖ◆పట్టికకట్టురుమాలలు న్నెఱా
సొమ్ములు నామములెవ్వలయు◆ సుద్దులగొల్లలు వచ్చి రెంతయున్. 2305

సీ. ఘెళఘెళవీరణాల్◆ ఖిళిపెళివాయించి, పోటుబోకొమ్ములు◆నాట నూది
దొనకొండగంగను◆దొలుత సన్నుతిఁజేసి, కృష్ణునకలిభక్తిఁ◆గేలు మోడ్చి
యాదికాలపుగొంత్ర◆ నందఱఁ గొనియాడి, తాతతండ్రులపేళ్ళ◆దలఁచిపొగడి
బిరుదులనరుదుగాఁ◆ జేర్కొని మెఱయించి, దీవించి వీరుల◆ త్రోవ తెన్ని

గీ. కులము పెద్దలకథ లోమి♦కొనఁగఁ జెప్పి, శివము పుట్టించి పుత్త్రిలఁ♦జెందఁగలరి
వీరలను గొల్వఁ డని తెల్పి ♦ వీఁడుకొల్వ, జనిరి మద్దులగొల్లలు ♦ సంతసిల్లి. 2306
హంసవింశతి, ఆ 2 పద్య 87, 88.

—♦ చండాలుఁడు. ♦—

సీ. నడునెత్తిఁ గొప్పుఁ గ♦ర్ణములఁ గీలించిన, తెల్లనిముడుసుఁ జెం♦దిరపుజొట్టు
మొలఁగాసెఁ బోసెన♦ముతికిపాఁతయు నందు, నడుము బిగించిన ♦ నరపవాలు
దలనిట్టునట్టుగా♦నలసియొల్లమిగాఁగఁ, జెనచిచుట్టినకావి♦ప్రేలికయును
పైద్రిప్పికప్పిన ♦ పాఁదోలుపాయయుఁ, జేనున్ననీలయు♦ష్టియు నుగలిగి
గీ. కోరి పసరపునంజూటి♦గుదియుఁ గల్లు, బుంగయునుఁ బూనితన మేని♦పొలసుకంపు
అలముకొన వీరబాహును♦నాహ్వయమున, గపటచండాలవేషసం♦కలితుఁ డగుచు.
హరిశ్చంద్రోపాఖ్యానము, శంక ఆ 4 పద్య 213.

—♦ చాకలి. ♦—

ద్విపద. మాసినవస్త్రముల్ ♦ మఱిమోసికొనుచు, వేవుజామున నేఁగి ♦ వేఱొక్కరేవు
గావించి యుదుకుచు ♦ గడియలు చేసి, శస్త్రసమేతుఁడై ♦ సద్భక్తివితతి
వస్త్రముల్ రజత ప♦ర్వతభాతిఁ దాల్చి, పరిగొనివచ్చుచోఁ ♦ బురవీథిభవులు.
బసవపురాణము, పా॥ సో॥ ఆ 4.

ఉ. వేళమె కోడికూతయగు♦వేళలఁ జద్దిభుజించి బండ్లుగం
గాళముకూడునీరుచవు♦కారముఁ దేవిడియంపుఁ జొక్కలతో
మైలలమోపు వీఁపున న♦మర్చినరేవు గుఱ్ఱాని నెక్కి వ
య్యాళిగఁబోవు వాఁడు విమ♦లావతటాక సమీపభూమికిన్. 2309
శుకసప్తతి, ఆ 3.

—♦ చెడువిద్యార్థి. ♦—

సీ. నన్నయ్యవారలో ♦ నామాలు దిద్దుకొమ్మనినచోఁ గడుపు నొ♦ప్పనుచు నేడ్చి
దండమ్మ నను గుణిం♦తము పెట్టరమ్మన, నంగుళివ్రణమాయె ♦ ననుచు జుణిఁగి
శిష్యులచేఁ గాలు♦సేతులు గట్టించి, తెచ్చి పద్యముఁ జెప్పఁ ♦ జెమల కుండి
పలక వ్రాయుమటంచు ♦ బడి కేగుకొనిపోవ, బలపంబు లేదని ♦ పలుక కుండి
గీ. ములుకచేనుండ బుగ్గలు ♦ నులిమితిట్టి, తొడలు వడిపెట్టి కోఁదండ ♦ మునఁ గట్టి
తొప్పతెగఁ బెట్టఁబట్టించు ♦ కోపమాపుఁ, గొట్టుచెట్టుగసజ్జన♦కోలదగను. 2310

సీ. గద్దించి వడి దిట్టి ♦ దిద్దుమంచును వ్రేలు, వెట్టించ నచట నే ♦ బెట్టి కుండుఁ
బలుచూలు లోయని ♦ పల్కుమంచును గొట్టి, చెప్పిన శిలవృత్తి ♦ దప్పకుండు
నొకటికి సెలవియ్య ♦ నుఱికి చీకటిదాఁక, జనులగాపరుల వెం ♦ బడిన పోదు
జనని యడుకొన్కని ♦ చదువుకోఁ బొమ్మన్న, వినక వేములువెక్కి ♦ వెక్కియేడ్చు.
గీ. సారెపద్యపుఁబలుకన్నైఁ ♦ జమురుపూఁతు, నెప్పుడును బెద్దపలకపో ♦ ల్కైత్తిఁ జేతు
బాలరామాయణముఁ బ్రస్త ♦ కాలుఁ దాతు, వేయుసజ్జనకోలలు ♦ విఱిచివైతు. 2311
క. చరికిఁబంత పగిలెఁగొట్టెముఁ, బరువడిసూత్రంబు ద్రెంచి ♦ పారఁగవైతు
న్రక్కెమాఁజ బలపములిచ్చినఁ, బారి దివతును బగులఁగొట్టి ♦ పోయెనటందున్.
గీ. సన్న బింగిలు పెట్టించు ♦ నాఁడె యయ్య, వాడు విదిర్చింపఁగాఁ జూచి ♦ చేరి యచటఁ
జింతవ్రేల్లొమ్మనంచుక ♦ సిగముగట్టె, ఒడిచియుఱికిలినయగారు ♦ మిడిసికిసూయ.
హంసవింశతి ఆ 3 పద్య 141. 142, 143, 144.

—♦ చోరుఁడు. ♦—

ఉ. పాయిదలనీలిదిండొలిపి ♦ బూడిద మిండులబంతి గాలచీ
రయు సెలగోలకత్తి భ్రమ ♦ రమ్ములక్రోలులు మైలమందుగో
య్యాయు నురిగొ్రింకి నారసము ♦ నాదగఁ గల్గిన సాధనంబుల
న్నియు సమకూరఁజేసికొని ♦ నేర్పున నేఁగితి మిచ్చఁబ్రొద్దునన్. 2314
దశకుమారచరిత్రము, ఆ 5 పద్య 72.

ద్వి. మొఱకువెండ్రుకలును ♦ ముదురుమీసములుఁ, గఱకునల్లనిమేనుఁ ♦ గలవాఁ డొకని
దడయక పుట్టించి ♦ ధాత్రీతలేశు, పడఁతిఁ జంపింప ను ♦ పాయంబుఁ గఱపి
పొరిఁబొరిఁ బొమ్మన్నఁ ♦ బోయితఁ డావి, చిరముండ్లబంతియు ♦ సెలకట్టె కత్తి
బలపంబు భ్రమరాలఁ ♦ బట్టినకోవి, యొలికిలోపలిభూతి ♦ యొగిమైలమందు
కులునీలికాసెయుఁ ♦ గొంకినారసము, నొఱపుగాఁ బూవి వాఁ ♦ డుక్కున నేఁగి
యావారణాసిపు ♦ రాధీశునగరు, వావిరిఁ గన్నంబు ♦ వడివేసి చొచ్చి. 2315
హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన. భా. 2.

క. మొలనీలికాసెయును బద,ముల నోరచ్చులు ధరించి ♦ ముదము దలిర్పన్
సెలగోలయు ములుబంతియు, బలపముఁ గత్తియును బూవి ♦ పటుసాహసియై.
హరిశ్చంద్రోపాఖ్యానము, శంక ఆ 5 పద్య 111.

సీ. కలుకైనకన్నపుఁ ♦ గత్తియు బలపంబు, వన్నెమీఱినయట్టి ♦ సన్నపిసుక
మాటసూత్రలయుల్లు ♦ ముసుకు నల్లనిచీర, కుక్క వాకట్టులు ♦ వక్కనపలు

ఘాతయంత్రము చొక్కు♦బూదెయు గడ్డనో, రాకుచుట్టయు నొంటి♦యట్టిచెప్పు
లరగోల గొలుసు క♦త్తెర యదృశ్యప్రమూలికలు గల్గు తాయతుల్ ♦ తలను దాల్చి
గీ. కజ్జలమురీతి గాఢాంధ♦కారమైన, యర్ధరాత్రింబునందు తా♦నరుగఁ దలఁచి
సన్నసన్నగ జీకటి♦చాటుచేసి, తెగువతో నేఁగె జనుపని ♦ నగరుకడకు. 2317

సీ. ఈవేళ నాతలం♦పీడేర్చి బోయిచితే, భ్రామరాంబకు దున్న♦బలి యొసఁగుదు
నీశర్వరిని కార్య♦మింపుగా పొసఁగితే, నూకాలతల్లికి ♦ మేఁక లిత్తు
నీవేళ నాకోర్కె ♦ లింపుగా పొసఁగితే, పోతురాజుకు బలి ♦ పోతు కూడు
నీతటి భయములే♦కింటికిఁ జేరితే, కొల్లాపురీదేవి ♦ కోర్కెఁ దీర్తు
గీ. ననుచు శక్తుల వేర్వేఱ ♦ నాత్మఁ దలఁచి, దైవగణముల నెల్లఁ జి♦త్తమున నిల్పి
బిలముఁ ద్రవ్వెడు కత్తి య♦గ్గలికఁ బట్టి, పిడియురంబునఁ గదియించి♦వడిగఁ ద్రిప్పె.
నీలకుంతలీవిలాసము, ఆ 1.

## ♦ జంగములు. ♦

సీ. కక్షపాలలు పైఁడి♦కట్లబెత్తంబులు, శంఖసంఖ్యాలమించు♦శరభములును
పిడిగంటలును నెమి♦పింఛంపుఁగుంచెలు, ఛత్రము ల్పులితోళ్లు♦చామరములు
యోగదండంబులు♦యోగపట్టెడలును, గండపెండేరము♦ల్కుండలములు
తనువుల భూతిపూఁ♦తలు కావివస్త్రముల్, మేలైన రుద్రాక్ష♦మాలికలును
గీ. శ్వేతకేతనములు రుద్ర♦వీణియలును, బాత్రిసుగునట్టి రజతంపుఁ♦బాత్రికలును
గేలుఁదామరబలునైన♦శూలములును, మెలకబంగరు గిలుకుపా♦వలును గలిగి.
రాజశేఖరవిలాసము, ఆ 1 పద్య 167.

## ♦ జాలరులు. ♦

సీ. కాలుమెసల్ల వా♦కట్టుకుందులు చగ, జాంగుళ్ళబులఁ దాఁకు♦టుంగరములు
కడలేనినడ గట్టి♦పడిన చిక్కులు చుట్టి, చెక్కిన మొలత్రాళ్లు ♦ చిక్కములును
జొంగు లల్లాడుగోఁ♦చులు తండుఁగోలలు, నెట్టుకొల్పిన మీల♦పుట్టికలును
ప్రతిదినాందోళికా♦భృతి నల్పుపై వెండ్రుకలు నిండి కాయలు♦గల భుజములు
గీ. చెవుల వెలుములు కుఱుఁ బ్రాఁత♦చెవుల వాగు, పడిగె ప్రోగులు మెలిగొన్న♦పచ్చడములు
నమరగు మిగూడి జాలరు♦లరుగుదెంచి, రలరుమొగములతోఁ దాంట్టి♦వలలు గొనుచు.
పంచతంత్రము, వై॥ వెం॥ ఆ 1 పద్య 603.

## ♦ త్రైధికుండు. ♦

సీ. కావడిపై సంటఁ♦గట్టిన యొక కావి, కాటికంబళియాత్ర♦సంచి యదర
నేతిలక్ష్మిగస్సు♦నించిన సోరకాయ, బుర్ర లిర్వంకలఁ ♦ బొసఁగి యుండ
నెగ నెత్తి కుఱుచగా♦ బిగియఁగట్టిన పంచె, పై బిగించినపార్తెఁ♦బట్ట యొప్ప
ముఖఘర్మసలిలంబు తోపి ♦ మణుఁగఁజుట్టినవల్లె, త్రోసల మారుతలోల్య♦ము నపహరింప
గీ. గమనజవమున నట్టాడఁ♦కావడదరి, కిఱ్ఱుకిఱ్ఱని భుజముసఁ ♦ గేలి సల్ప
గొడుగుద్రాక్షమాలిక♦ల్కాంతసీమఁ, దనరవచ్చెను వేడ్క స♦త్రైధికుండు. 2821

హంసవింశతి, ఆ 2 పద్య 172.

## ♦ బలిజశెట్టి. ♦

చ. సరిపెనతోడి సజ్జ బలా♦సందిటి తాయెతు లంగవస్త్రముల్
సరిగ చెఱంగుపాగ విలు♦వన్మణిముద్రిక లంచుకమ్ములున్
మెఱుఁగులుగుల్కు దోవతియు ♦ మిన్నగు నీలపుఁబోఁగుజోడు చి
త్తరపువిభూతిరేఖ లమరఁ♦దన రుద్రరక్కలు గల్గి భాసిలన్. 2822

హంసవింశతి, ఆ 5 పద్య 95.

## ♦ బుడబుడక్కవాఁడు. ♦

సీ. నొసలిపైఁ జుక్కల♦మిసిమిసామపురేఖ, లమవోరద భుజముపై ♦ నసిమి సంచి
వాలువీనుల గాజు ♦ నీలాలపోఁగులు, పైనొప్పు పప్పళి ♦ పచ్చడంబు
మెలిగొనఁ జుట్టిన ♦ తలపాగ చెఱఁ గుంచి, పైటపేటాచుట్టు ♦ పట్టునేలు
కడిఁది మీఱఁగఁ జంక♦నిడిన జోట్టియకోల, దాకమోగెడు డుబు♦డుక్కకేల
గీ. వఱల దిక్కుల నెంచి దు♦ర్వారమైన, కీడు మేలును జెప్పుచుఁ♦గేక లిడుచుఁ
గొర్లికొనుచును దనపేరు♦ కేరికొనుచు, వచ్చె నచటికి డుబుడుక్క♦వాఁ డొకండు.

హంసవింశతి, ఆ 2 పద్య 28.

## ♦ మల్లురు. ♦

సీ. కంబము కోణీదెలా♦గనుడొల్లతాటిదం, డములు త్రోయంగ రె♦ట్టలగమకము
సంగడాల్ పూన బా♦జాలపురాయంబు, బరిలోడుద్రిప్పు మేల్ ♦బరులయుబ్బ
బలుగోతమయిరళిం♦పఁగ నురంబులటోకు, పడితాళీములు సేయు♦ తొడలకండె
మొరపుగ తిరుపట్టె♦కురుచ లెత్తఁగ పొంచ, ములాడ డంకలు ♦ బొరల మెఱలు

గీ. బలిమి గనిపెట్టి గంధపు♦ట్టెలెఱమట్టి, కావితిరుకాశదట్టులు ♦ గాపుబొట్లు
మొల్లసరులొప్పు చరతాౖటి♦పిల్లజుట్లు, పెద్దచేౖతాళ్లుగలజోదు♦బిరుదుజెట్లు.

గీ. కడఁగి దిశలుప్రతిధ్వనుల్ ♦ బొడమునటులు, గామిగులుమల్లజఱచిస♦లాము'డుసు
ముందఱను నిల్వఁగాదస♦దఁదితత్కఁ,రమ్ము లిరుగేలఁబూవి ప♦రాకటంచు. 2325

చ. విడిచినయంత మల్లు లటు♦వెన్కకుఁజెంగునవింగడింపుచున్
బడిబడిమీసలంటి మెలిఁ♦బట్టుచు దంచలనిల్చి కమ్మఁచున్
బిడికిస లూదిపట్టుకొని ♦ బిట్టుగఁశేకలు వేయుచున్ బొమల్
ముడిగొనఁ బండ్లు గీటుచు స♦ముద్ధతిచేఁ జెయిసోక మీటుచున్. 2326

క. భాయీ యిదెయొకనుడిలో, మాయనుపించెదను మాను ♦ మాయనికర్రమై
చాయఁగని అొమ్మగుద్దిన, చాయగగుద్దుటను పెట్లు ♦ సరిగాఁ దాకెన్. 2327

సీ. అత్తిఱఁ గలఁబడి♦బిత్తరులను హత్తి, చేతులదట్లకా♦సెలనుజేర్చి
నుడిగాలితిరిగెడు♦వడువునవడిఁజుట్టు,కొంచునైశానలా♦గించివేయు
వేటులలోలాగించి♦వేసిసమమ్మగాఁ, బుడమిపైఁబడియంట♦లిడకలేచి
మెడలపైఁ గర్నాదు♦లిడి పులుల్ వలెతాటఁ, జిక్కినఖమ్ములఁ♦జిమ్మకరణి

గీ. రెమ్మచును పొంచములు గూర్చి♦రెండుకడల,నిరికిగళకత్తెరలుగట్టు♦లెటిఁగికూడ
తిరుగఁబడి కురులతగరుల్ ♦దీకొనుగతి, నుదితలఁదలఁదాకించు♦నొకరికొకరు.

ఉ. కొక్కసచేబిగింప మెడ♦గొబ్బునకేల్వడిఁ జెట్టి దీసి మే
లొక్కకితబట్టి త్రిప్పి చెయి♦లావునదున్నక రెండుప్రక్కలన్
డొక్కరసందువేయఁ దొడ♦నొక్కుచు సందెడఁజేసి త్రోసి వెన్
జక్కనురాట మెక్కి పడి♦జాతికడంబడఁసింకఁ బొర్లఁగన్. 2328

సీ. వడిగకక్షమునకు♦వచ్చి చక్కఁగకాళ్లు, వెనుకకు నిగుడింప♦వెంబడిగను
మోకాళ్ళవంచి తె♦ప్పునబొటప్రేళ్ళచే, తిరుకాశదూర్చి యె♦త్తిపొరలించి
సరనుకయోరరాఁ♦బరిబడి పొరలించి, యొకకేలఁగుత్తుక ♦ నొడిసిపట్టి
ముడిగిగడ్డముక్రింద ♦ ముష్టియానించి యం,కిణిగొట్టి సీసాన ♦ కినిసినిలువఁ

గీ. జంకలను చేతు లునిచి పై♦చక్కనెత్తి, తలకు సందిలితప్పించి ♦ తొలఁగిలేచి
వివసమాయించఁజూచి యా♦వీణజెట్లు, కెలమి బిరుదులొసంగి వీ♦డ్కొలిపియంత.
(ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము, 82—88.

సీ. వెడఁద రాచలుపల ♦ బెడిదంపు గతినత, సరకుసేయని యుర♦స్థ్సలులతోడ
గండెపెరిగి యుక్కు ♦ కంబాలతో మాఱు, మలయుబాహువులయ♦గ్గలికతోఁగ-

పరమల్లజయలబ్ధి ♦ బిరుదమాల్యములతోఁ, బరగు ముంజేతుల ♦ గరిమతోడ
నగఘాతుపప్రక్రి♦యాశోభిగజలీల, నగు శ్వేతమూర్తి మై♦బిసుపుతోడఁ
సీ. భోలుప్ప మీఱుచు సెగుభుజం♦ములనుగట్టి, జమిలిమూఁపుల మూలతోడ♦నమునుమల్లు
రంపుటాఁబోతులనఁ బోలెఁ ♦ బెంపుమీఱు, జెన్నుచను దెంచి రాన్నపు♦సవకొలువు.
పరమయోగివిలాసము, ఆ 3 పద్య 48.

## —♦ మాస్త్రీషు. ♦—

సీ. తలిపాగపొరమీఁదఁ ♦ జెలఁగెడు నాయుధభాగ్యర్చన సన్పినట్టి దా♦ససపుఁబూపు
నెడమచే గొలునునఁ ♦ దోడపుఁగత్తియుఁ బూల, సిసపొందు కుడికేలఁ♦బెద్దకత్తి
పట్టితోఁ జెక్కు_నిండ్లావంకి కుసుమపూ, వన్నియొదుప్పటి ♦ వల్లెవాటు
భుజములు విరులచేఁ ♦ బూజించు బోడిక, ల్మ్కురువైన మాందటి♦బిరుదుడవిణ
గీ. దండహంపీరతలగుఁడు ♦ గండమనుచుఁ, బద్యము పఠించుజీతంబు♦బంట్లుఁలాడ
మాగికొనుపౌరజనులగుం♦పులు జెలంగ, నతఁడుపౌరకొల్వుచేసిగే♦హమునకరుగు.
శుకసప్తతి, ఆ 3.

## —♦ రాజసేవకులు. ♦—

చ. అలఘుతరాఘదోగ్రకలి♦తాండదను నైజపు ధర్మపద్ధతిన్
నిలిచి పవిత్రమత్తత స్వదలి ♦ నిశ్చలబుద్ధిఁ బరోపకారులై
చెలిమి బహుప్రజావనము ♦ సేయుటయందునె బద్ధదీక్షులై
కొలుతురు వీరు రాజుల న♦కుంఠితసౌఖ్యనిరాసభావులై. 2333
సీ. అవికలంబైనసం♦ధ్యావిధి వీరికి, లేశమాత్రింబైన ♦ లేదు మిగుల
నచ్యుతసంగంబు♦నైనలేదు క్షణంబు, స్వస్వకాలమునందు ♦ సవననియమ
ముల నొనర్చుటలేదు ♦ తలఁపనొక్కప్పుడు, వేదాధ్యయనచింత ♦ లేదు చూడ
నస్నపానాదులు ♦ నాఁకటిసమయాన, నవకాశమేచాల ♦ దాహరింప
గీ. నిలిచి సుఖనిద్రఁ గావింప ♦ నిమిషమైన, సమయమేకల్గకుండునే♦సమయమునను
ఇష్టులనుజూచి భాషించు♦టెఱుపడదు, మహిపతులసేవఁ గావించు♦మానవులకు.
విశ్వగుణాదర్శము, తి. బుక్క. చిన. తా.

## —♦ రెడ్డి. ♦—

సీ. కెమ్మిక్కపచ్చడమును ♦ గంటీలపోఁగులు, మోలఁజీటికమ్మలు ♦ మదుగువల్లె
మిండుచల్వరుమాలు♦రెండొంకుటుంగరం, బులుఁజుక్క బొట్టుసొం♦పొలయ మెడను

గందంపునునుఁబూఁత ♦ కర్ణయుగంబున, నేర్పుగాఁ జెక్కఁగ♦న్నెరపురాలు
కత్తెరగండంబు ♦ గజ్జెలు నందెలు, నాదించుజిగిసక♦లాతితిత్తి
గీ. పాదములఁ గిల్లుకిజ్జని♦పలుకుమెట్లు, గుచ్చుటద్దాలుచేపట్లు♦గోల యమర
రెడ్డిప్రియురాలివాకిటఁ♦ బేర్మి నిలిచి, వాకిలి సడల్పుమనుచుఁబి♦ల్వంగనపుడు.

హంసవింశతి, ఆ 3 పద్య 90.

## —♦ దరిద్రుఁడు. ♦—

సీ. చేయప్పులనుచునిచ్చినవారు కటువుగా, నడుగ నుంకించి నో♦రాడ కరుగ
నెవ్వరైనచుట్టాల♦మనుచు వచ్చినవారు, బడలిక చేతఁ జె♦ప్పకయె చనఁగ
నాయవారంబున♦కనుచుఁ జేరినవారు, పరిహసింపకమున్నె ♦ తిరిగిపోవ
నెక్కలెజోగంచు ♦ నేతెంచువారు మా,టాడిచూడక వేగ♦మవలి కేగ
గీ. శిశువు లెల్లను గలవాని♦చిన్నవాండ్రు, తినెడిబియ్యతిండిగని యది♦తెమ్మ,టంచు
గీజుపోరుటకెడఁ బెల్ల♦గిల్లఁబొగిలిపాలఁతియూరార్పనతఁడు కాఁ♦పురముసేయు.

శుకసప్తతి, ఆ 3.

## —♦ దాసర్లు. ♦—

సీ. చేమాకుతాళము♦ల్చేలఁగ రొండుల జేతు,లుంచి యందఱ వెక్కి♦రించుకొనుచుఁ
బజ్జధూపమున దీ♦పపుఁగోలరాఁజహ,స్తము సాఁచి జేగంట ♦ చఱచికొనుచుఁ
దలయొరగిలఁ గుర్రింకి ♦ తప్పెటగతికి వా,యించి గంగెద్దు నా♦డించుకొనుచుఁ
దిరువడిసానుల బెరసిగంటలు మ్రోయ, బోడచప్పరముల♦ నాడికొనుచుఁ
గీ. ద్రోవఁగూర్చుండిబొంతలు♦ప్రోలఁబఱచి,ముదురుబెండలకోరఁగా♦ముసుఁగుఁజేర్చి
హస్తదండలుమొఱయించి ♦ పాడుకొనుచు, నలరు దాసర్లవీక్షించి♦యాక్షణమున.

చంద్రభానుచరిత్రము, ఆ 5 పద్య 45.

## చెడ్డపుత్త్రుఁడు.

సీ. గుడిమీఁదఁ బడుగావి♦క్షడిలోనిచెదు గీఁగె, పుణ్యనదీతీర్థ♦మునను మొసలి
కంటిలోఁ గొంచెంబ్రటు♦కయు రచ్చమఱ్ఱిని, బ్రహ్మరాక్షసి కాపు♦రమ్ము సేయు
భవనసీమను దాఁచు♦పాము కల్పకుజంబు, కడ గచ్చపొదపాల ♦ కషశిలివిషము
వనమునఁ జిచ్చు ది♦వ్యౌషధికినిఁ బుప్పి, బ్రతుకు బాలెడుచింటఁ♦ బరశురాము
గీ. హస్తముదకానగురిడ్డు స♦స్యమున మల్లె జీవితతతికి రోగంబు ♦ చెఱకు వెన్ను
మణికి దోషంబుసత్ప్రునందు♦ మార్దవంబు;పుట్టుచందానఁబుట్టెను♦పుత్త్రుఁడొకఁడు.

గీ. వాఁడు నానాఁటి కభివృద్ధిఁ ♦ బఱలఁ బెఱిఁగి, కాళ్లను దేఱి గడిమీఱి ♦ గట్టిసాగి
రాలుఁగాయతనాన నే ♦ రజపుదారి, నాఁటఁ దేఁటియుఁ బలుగుంట ♦ మారి యయ్యె.

మ. గుణమా సెబ్బ వివేకమా నహి మనో ♦ సూక్ష్మత్వమా లేదు భా
షణమా కల్ల విచారమా రవ్వ సం ♦ భాచారమా నాస్తి మా
ర్గణముఖ్యావనశీలమా శశక శృం ♦ గప్రాయ మాప్తాది తో
షణమా దబ్బర సత్యమా హుళి గ ♦ ణించన్ వానికద్దిస్తనీ. 2340

సీసమాలిక. ఆకతాయబికారి ♦ యసిబందగుండమఁ, గుండికట్టెగులాము ♦ మొప్పెగోపు
పోలెవాఁ డగచాట్ల ♦ పోఁతు దుర్మార్గుండు, పడిసేటు నగరాను ♦ పంద లండి
కొయ్యదిప్ప ఖరాబు ♦ కూళ బందెలమారి, ముందటిపాపాల ♦ ముద్ద ధగిడి
రోగు దూబరదిండి ♦ వోచవాఁ డవలక్షణము లాడుగోల బ్రా ♦ త్యుఁడు బజారి
పలువిత్తు వలుఁగాకి ♦ పారిద్యాకుఁ డుచ్ఛిష్ట, మొందుసుద్దులమారి ♦ యులిపికట్టె
పాపిష్ఠి బజగేడి ♦ పంచమహాపాతకియు వ్యతీపాత పో ♦ కిళ్ళమారి
దరబేసి చెడుగొట్టు ♦ బెరికి దగాకోరు, విసపాలపిత్తు చి ♦ ల్విషము దగులు
బాజి హరాంకోరు ♦ వాగ్రజప్రక్కలముచ్చు, చీవాట్లమారి పా ♦ పీ చీనపిత్తు
మూసినమురికి ని ♦ ర్మోక్షి స్వామిద్రోహి, దుష్టరోఁతలమారి ♦ దోసకారి
బడిమికూళ్లకుమిత్తి ♦ పడిసె యెంగిలికాయ, బడుగుగూడెసగొట్టు ♦ పాడుగట్టు
గుండెకుళ్లుదము తా ♦ కట్లమారియభాసి, కడుపేర్మి నడసేను ♦ గలపడింపు
దూబదర్శన మూఁడుశోకగుక్కున గుల్ల, గుడ్డాల గోవోజె ♦ కొరుకు బల్లి

గీ. కొంటె కసుమాళమును దూబ ♦ కొంపచెఱుపు, చేడి నేరయు చెరపన ♦ చేటరోసు
బడియ దుర్బీజమును భ్రష్టు ♦ నుడియు చేట, పెయ్యకల్మిచ్చు చెడుగుసా ♦ పెనలమారి.

క. అనుచుఁ బొరుగిరుగువారుం, దనవారుం గానివారు ♦ తక్కినవారున్
దనుఁ దిట్టఁ జేయు దుడుకులు, మనమున లక్షింపకతఁడు ♦ మఱియున్మతియున్.

గీ. వాని కెనిమిదియేండ్లది ♦ మేనమామ, కూఁతుఁ బెండిలిచేసిన ♦ కోడెవయసు
పాక ముట్టునాతలూఁగెడు ♦ భార్యమీఁద, మనసుచాలించి దుర్మార్గ ♦ మతి వహించి.

హంసవింశతి, ఆ 5, పద్య 103, 110, 111, 113, 114, 115.

## లుబ్ధుఁడు.

సీ. ప్రస్తుతంబనిపదా ♦ ర్థములు రాజులవేఁడి, కొనితెచ్చి యమ్మించు ♦ కోమటిండ్ల
మాపి ముల్లడిచి గు ♦ మ్ములకొల్పు వైమెత్తు, లూర్వఁకు వస్తైన ♦ నుండుఁ గాని

రొట్టెచుట్టంబేని ♦ యుంటి కేతేర రెం, పవమానకముఁ దెల్పి ♦ యావలఁ జొనుప
మును పరిత్రిశితము చే ♦ సిన పైఁడి రాకున్న, ముచ్చిచ్చునను వేఁగు ♦ వచ్చు దమక
గీ. వనరు "శాకాయలవణాయ ♦ వా" యటంచు, బెనఁగుఁ ధూళిః పరిగ్రహోద ♦ పి' యనునాశ
ముంచిదయాగకుఁ గాటుపా ♦ మునకు బలియు, నొసఁగఁడ నిభర్తకై పాక్క ♦ నుపిదమదిస.

పాండురంగమాహాత్మ్యము, ఆ 4 పద్య 220.

## —♦ లుబ్ధబ్రాహ్మణుఁడు. ♦—

సీ. సంతలోఁ బత్తి బిచ్చము లెత్తి నూతాలు, పగల జన్నిదములు ♦ వడికి వడికి
నికట కానన భూము ♦ లకు నేఁగి మత్తియా,కులు దెచ్చి విస్తళ్ ♦ గూర్చిగూర్చి
శాకపుబీజముల్ ♦ చల్లి బావులనీరు, చేఁదిపోయుచు బైరు ♦ చేసిచేసి
వేకువ నంగళ్ళ ♦ విక్రియవేళల, జాజీన మిరియాఁబు ♦ లేటిరయేటి
గీ. యన్నియును విక్రయించి భా ♦ ర్యాకుమార,ముఖ్యులాఁకట మ్రొగ్గిన ♦ మొగము జూడఁ
డాసపడి యేమి కోరిన ♦ నాగ్రహించు, జందెములు తెంచుకొని దక్షి ♦ జన్మఖలుఁడు.

శుకసప్తతి, ఆ 4.

## —♦ లుబ్ధవైశ్యుఁడు. ♦—

గీ ద్వాదశిన మాస సంక్రాంతి ♦ తతి నిగ్రహణ, మప్పదర్థోదయమహోద ♦ యాములనొక్క
కాను భూసురునకు నీఁడు ♦ గాని గడన, గోరు ఘనవంతుఁడవ్యాస ♦ యార్యావుజుండు.
క. ఆదాయమునకుఁ దగినది, లేదా యిన్ వెచ్చ మంత ♦ లేదా యెనెనా
టాదాయోదనిధీయను, దేదాయ గపయ్య యక్క ♦ తిన చిత్తునకున్. 2347
ఉ. కట్టఁడు యోగ్యశాటిఁ బొడ ♦ కట్టఁడు రాచనగళ్ళకుం జెవిం
బెట్టఁడు కీర్తి తారమిశి ♦ పేర్కొనుచో నరకాను బేరముం
బెట్టఁడు ధర్మచింత సరి ♦ పెట్టఁడు గట్టిమనంబు దిట్ట త
క్కట్టిడి వైశ్యుఁ డన్యుల క ♦ గణ్యముగాఁగఁ గణించె రొక్కమున్. 2348
చ. దిన మొక కూర గాని మఱి ♦ తేఁకుఁడు శాకము లంచుఁ బల్కు వం
డిన పలు గూరఁ గాంచి జగ ♦ డింపఁగఁ జొచ్చునటంచు వాని నొం
టిన భుజియింపఁ జెట్టి కడ ♦ నిచ్చ భుజించెద రింటివారల
య్యనుపమశాకసూపకల ♦ మాన్నస్నుహృతౌదుల వాఁడెయుంగమిన్. 2349
క. పెసరుం జప్పేవిటికని, కిసరున్నె యిఁగొనఁడు పండుగ ♦ ను గొయకూరే
కొసరుం బలుచని చల్లయె, పెసరుంగనఁ డితనిలోభ ♦ మున కేమందున్. 2350

క. పచ్చనియాకుం దానికిఁ, బుచ్చినగొంటొకటి నమలుఁ ♦ బోమెటఁ ద్రూసం
జెచ్చో మాయనొయని తెలి, పచ్చడ మటువెట్టి యొంటి ♦ పంచెన తిరుగున్.

మ. కరఁగుండాఁ బొరుగమ్మకాన కెదురం ♦ గళ్ళం గొనంబోవ దృ
క్క్రూరసంజ్ఞన్ మరలించి వారలకిడున్ ♦ గా సెచ్చు గా బేరముల్
తెరవాటిండజి వీడ్కొ తెచ్చుమనకున్ ♦ లేకున్న నేమాయె ని
త్తురుగా కొయ్యన నంచుఁ బోక యడకొ ♦ త్తుం జేతికిచ్చున్వడిన్. 2352

మ. పడికొంచెంబుగ రాచు నుప్పుడులకుం ♦ బానీయ మర్పించుఁ ద
క్కైవ గట్టుం దిన మెచ్చు గుందులుగఁ బూ ♦ న్కైన్ నేతిలో నూనియల్
మిడుచు న్నానియ నాముదంబుఁ గలపున్ ♦ మేలాముదంబందు వె
ల్మిడి నించుం గదియించుఁ బ్రొద్దవైదు హా ♦ ళిం గొత్రుబియ్యంబునన్. 2353

క. తా బేదఁ కప్పు నెత్తైడి, చేఁ బాతిక వడ్డిఁ గొలుచు ♦ నుమ్మడ్డుగకున్
ప్రాఁబిచ్చపడిని గాసుక, టేఁబోఁ డీతఁడుగ వెచ్చ ♦ మిడుగుదు వడుగున్. 2354

క. కాంతుల సొమ్ములు వెలచేఁ, గొంత పడిం గొంత కొలను ♦ గొంత హుణాచిన్
గొంత హరించుఁ గువాళ్ళపు, దొంతర నైశ్యుండు పశ్య ♦ తో హరుఁ డుగదా. 2355

సీ. క్రొత్త తిరువాదిఁ గని ప్రాత ♦ తూకయంచుఁ, బ్రాలహుణఁ జూచి నాడెంపుఁ బణమటంచు
నాణె మొరయంచు నొరదైన ♦ నాగరంబు, ధవళి నెడవెట్టి టంచావ ♦ ట్టంబుఁ దినియు.

బహులాశ్వచరిత్రము, ఆ 5.

—♦ ముష్టిబ్రాహ్మణుఁడు. ♦—

సీ. దేవురించుచువాకె ♦ జేతెడు మొగమును, బడఁ బాలుచుండెడి ♦ బడుగుటొడలుఁ
బొలు పేది మెదుకకం ♦ పునునీను సిగయును, బల్లమీసములును ♦ బిల్లికనులుఁ
జీంబోతుగడ్డంబుఁ ♦ జెడ్డచూపులుఁ జాలఁ, జివికిన కోలయుఁ ♦ జింపిగొడుగు
బాఁతదోవతులును ♦ బంచాంగమును ఘాల, తలమునఁ బట్టెవ ♦ ర్ధనముఁ గలిగి
గీ. ముష్టియెత్తిన ధాన్యముల్ ♦ ముడిచినట్టి, ముఱికిబట్టలు మూఁపుపైఁ ♦ దఱచువేల
సేవ మొనరించు మాయామ ♦ హీనుపర్వఁ, గాలకౌశికుఁ జూచెభూ ♦ పాలకుండు.

హరిశ్చంద్రోపాఖ్యానము, శంక. ఆ 4 పద్య 103.

—♦ వైదికుఁడు. ♦—

సీ. అఱుతఁ గీల్కొన్న ము ♦ త్రాసముల ఘావళి, యంసాగ్రమున గోనె ♦ యఱిమపంచి
కట్టిన మూతకనీ ♦ రాడ్విధోవతియు నాపై బిగించిన యతి ♦ ప్రాఁతబట్ట

తలచుట్టుకొన్న చిం♦పులపైరవాసంబు, తనుటచేఁ గరఁగెడు ♦ నేసబొట్టు
మారేడుబుజ్జలో♦ మంత్రాక్షతంబులు, పదముల విజ్జోడు ♦ పాపరక్షు
గీ. లాడిసి పంచాంగ మొకకేలఁ♦బొదవుఁ బ్రేళ్ల, ఘండియుంగరమును మెడ♦ద్రేలుముటికి
జందెములునష్టయాచ్యుత♦స్మరణమాన్య, సీమఁ గనుపించెఁ బఱతెంచెఁ♦జేనికడకు.

శుకసప్తతి, ఆ 2.

## —♦ నింద్యవైదికుఁడు. ♦—

సీ. పంచాంగములు సెప్పి♦ బాజారులోపల, రంజిల్ల యాయవా♦రంబు లెత్తి
తలనీరుదమంత్రాక్ష♦తములుంచి కలకాఁపు, టిండ్ల నుపాదాన♦ మెత్తి తెచ్చి
గ్రహణసంక్రమణాది♦కాలంబులను రాచ, నగ రాశ్రయించి దా♦నములు పట్టి
తిలలు దర్భలు పూని ♦ శ్రాద్ధసన్నిధిమంత్ర, ములు సెప్పి నీరుకా♦సులు గడించి
గీ. జన్మదములమ్మి గ్రహశాంతి♦జపముఁ జేసి, శవములను మోచి దుర్దాన♦సమితికొగ్గి
వచ్చునాదాయములు గ్రాస♦వాసములకు, గాఁగ దినములు గడపె న♦క్కాలమునను.

హంసవింశతి, ఆ 2 పద్య 152.

## —♦ పేదనియోగి. ♦—

గీ. పరకతలగుడ్డ యొకపాటి♦ పచ్చడంబు, ముదుక నీర్కావిదోవతి♦ మొలనుసంచి
తిత్తి వెండుంగరము వ్రేల ♦ హత్తియొప్ప, నుండు శకుఁడను పేదని♦యోగి యొకఁడు.
సీ. క్షేత్రఘాతంబుల♦స్థితులు వక్కాణించి, పౌర్ణగణితోక్త♦సంఖ్య దెలిసి
మిశ్రితగణితార్థ♦ మిళితమనస్కుఁడై, గాఢప్రకీర్ణక♦గణిత మెఱిఁగి
త్రైరాశికాద్యంత♦సారాంశము గ్రహించి, సూత్రగణితమునఁ♦ జొచ్చి కలఁచి
మఱిభిన్నగణితంబు♦మార్గ మెల్లను గాంచి, పరగణితంబులు ♦ పారఁజూచి
గీ. నిఖిలసిద్ధాంతసూత్రము♦ల్నేర్చి జగతి, గణకకులసార్వభౌమత్వ♦గణనకుఁ దగి
గణితమర్మజ్ఞుఁడితఁడని♦జనులు మెచ్చఁ, దెలిసియతఁడెంత లెక్కైనఁ♦దేటపఱుచు.

హంసవింశతి, ఆ 5 పద్య 26, 27.

## శైవబ్రాహ్మణుఁడు.

సీ. పంచాక్షరీపూత♦భసితత్రిపుండ్రాంకి, తాంకభాగములుస్నా♦నార్ద్రశిఖయుఁ
గ్రమకృతగ్రంథసూ♦త్రవాత్రరుద్రాక్ష, భూషణంబులు శైవ♦భాషణములు
నాగుల్ఫలంబమా♦నాంబుశోణంబైన, తోత్రంబు నుపవీత♦సూత్రములును
గాగృహీతాభిషే♦కక్షీరసంపూర్ణ, భాండంబునుం బుష్పక♦రండకంబుఁ

గీ. గుండబొజ్జయు నొకపాటి ♦ గుజ్జురూపు, నుత్తరీయంబుఁ దనరంగ ♦ యోగిహృదయ
గోచరునిఁ గొల్వ శివచిహ్న ♦ గోచరాంకుఁ, డొకఁడు వచ్చె శివబ్రాహ్మ ♦ ణోత్తముండు.

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 3 పద్య 94.

## ——♦ మర్ధుఁడు. ♦——

సీ. మెలిఁబెట్టి చుట్టిన ♦ తెలిపైఁడినీపాగ, చెవిసందిపాగలోఁ ♦ జెక్కుకలము
దోఁడిగిన నెఱచల్వ ♦ నడుము నంగీజోడు, జీరాడునడికట్టు ♦ చెఱఁగుకోనలుఁ
బజతలంబుల నెత్తి ♦ పాలు పాపోసులు, బెక్కుగాఁ జంకఁ జీ ♦ టీఖిలీతి
నడికట్టులో మొల ♦ నిడినకలందాను, హస్తాగ్రమున వేలి ♦ దస్తరంబు
గీ. మించుబాహువుమీఁదఁ గా ♦ శ్మీరశాలుఁ, జెవులముత్యాలపోగులుఁ ♦ జెలువు దనర
నలఁతి నీర్కావిఖోపతి ♦ యమర నటకుఁ, డాయపత్యంబు సేయ వ్యా ♦ పారి వచ్చె.

హంసవింశతి, ఆ 2 పద్య 29.

## ——♦ వేదోపాధ్యాయుఁడు. ♦——

సీ. పదవర్ణసౌష్ఠవ ♦ ప్రకటనం బెంతయు, నింపుమీఱంగ ర ♦ క్షించి యిచ్చి
తగనుదాత్తాదిభే ♦ దములు గెంటకపర్వఁ, గనుబొమ్మచేష్టలఁ ♦ గఱపికఱపి
యెడనెడఁ గవళ్లఁ ♦ దడఁబడకుండంగ, గుఱుతులు మఱిఁ జూదు ♦ కొలిపికొలిపి
నిజశిక్షలో బుద్ధి ♦ నిలుక విస్వరములు, పలికిన బుగ్గలు ♦ నులిమినులిమి
ఆ. యొక్కమండపమున ♦ సజ్జ్వలబ్రహ్మవ, ర్చసముతోడ బ్రహ్మ ♦ చారులకును
బరమనియమవృత్తి ♦ పరత వేదముఁ జెప్పు, చున్నయట్టి యొక్క ♦ యొజ్జఁ గనియె.

కళాపూర్ణోదయము, ఆ 4 పద్య 41.

## ——♦ వైష్ణవులు. ♦——

సీ. శ్రీమహితాష్టాక్ష ♦ రీమంత్రజపపరా, యణుల నారాయణ ♦ ధ్యానపరుల
దేవతాంతరచింత ♦ నావిదూరులఁ గామ, రోషాదిరహితుల ♦ రూఢమతులఁ
జిదచిదీశ్వరతత్త్వ ♦ విదులఁ ద్రైలోక్యపా, వనచరిత్రుల బుధ ♦ వంద్యపదుల
నకలంకశీలుర ♦ నఖిలశ్రుతిస్మృతి, శాస్త్రపురాణవి ♦ జ్ఞానఘనులఁ
గీ. దమకుఁ జక్రికి నిత్యసి ♦ ద్ధంబులైన, శేషశేషిత్వములు చింత ♦ చేసికొనుచు
నతనిదాస్యంబు గతిగాఁగ ♦ నరయు పరమ, వైష్ణవులఁ గంటి సభయై పరి ♦ వర్తిలంగ.

కళాపూర్ణోదయము, ఆ 4 పద్య 33.

సీ. కరుణాసముద్రులు ♦ గమనీయమూర్తులు. ఘనజనస్తుతులు జ ♦ గత్పవిత్ర
చరితులు దేవతాం ♦ తరభక్తిరహితులు, సర్వేశకైంకర్య ♦ చతురమతులు

శ్రీవరదప్రాతఃకరీ◆నామమంత్రి జపాళి,రాములు సద్గుణ◆ధాము లమల
చారులు శ్రీమతే◆నారాయణాయన,మో యని సతతంబు ◆ గేయముగను
గీ. బల్కువారలు ద్రావిడ◆బ్రహ్మతత్త్వ,బోధకులు శేషశేషిత్వ◆పూర్తికలిత
జీవపరమాత్మభేదులు ◆ చిదచిదీశ్వ,రజ్ఞు లైనట్టి వైష్ణవా◆గ్రిణులు వేడ్క. 2366

భార్గవపురాణము, ఆ 4.

### —◆ సాతాని. ◆—

సీ. పట్టుఁబుట్టముఁ జుట్టి◆నట్టి జోడిశిరంబు,పై నొప్పు నక్షయ◆పాత్రినొక్కటి
యిరుకక్షములలోని ◆ తిరునామములపుస్త,కమునను దాళవృం◆తమ్మున రెండు
క్షుద్రకుటీప్రాంత ◆ శునకభీతినిగుడి,కేలఁదాల్చిన తిరు◆కోలనొకటి
డాచేతిదారుఖం◆డపుఁ దాళయుగి రెండు, స్వపవిత్రీకంబులఁ ◆ బడియు రెండు
గీ. రమణ నష్టాదశోర్ధ్వపుం◆డ్రములుదమకు, నమరనత్యర్థవైష్ణవ◆త్వము ఘటిల్ల
బికిర మెత్తంగసాతాని ◆ పిండు దిరుగుఁ,దగ ధనుర్మాసవాసరాం◆తముల నపుడు.

మహేంద్రవిజయము, ఆ 2 పద్య 100.

### —◆ సువర్ణవర్తకుఁడు. ◆—

ఉ. మైనపుటంటుపల్వగల ◆ మచ్చులచా లొరగల్లుకత్తెలున్
దూనికనాలుగేనొ్బరల◆తోఁ దగువట్రములోన నున్ననా
నానగరోద్భవంబులగు ◆ నాణెము లుండెడుసంచిఁగొంచు జే
రానకువచ్చి నన్నయఘు◆రంధరుఁ డంగటికిం గణింపఁగన్. 2368

శుకసప్తతి, ఆ 1.

### —◆ స్వర్ణకారుఁడు. ◆—

చ. కమటముకట్లసంచి యొర◆గల్లును గత్తెర నుత్తె చీర్ణముల్
ధమనియు శ్రావణంబు మొల◆త్రాసును బట్టెడ నీరుకారు శా
ణము పలుకారు మూస బలు◆నాణెపరీక్షలమచ్చు లాడిగా
నమరఁగ భద్రకారక స◆మాహ్వయుఁ డొండొకఁ డుండు నప్పురిన్. 2369
చ. కరుఁగను బోతఁ బోయఁగను ◆ గ్రాఁచి కదించను గమ్మిదీయఁగా
నొరయఁగ నన్నియ ల్మిగుల ◆ నుండఁగఁ జూపఁగ బూదగట్టు రే
కరయఁగనీరఁ జెక్కఁబడి ◆ యచ్చునవేయఁగ నుద్దగించఁగా
సొరిదివిచిత్రచిత్రిముగ ◆ సొమ్ములుసేయు నతండు నేరిచెన్. 2370

హంసవింశతి, ఆ పద్య 181 182.

## —♦ వైద్యుఁడు. ♦—

చ. మెఱవడుతీగచుట్టు జిగిరించినపాగ జనుంగుపచ్చడం
బలచిటివ్రేలిముద్రిక యొ♦యారపు గందపుఁబూఁత డొల్లుపో
గులు మణిముద్రిక ల్వలపు♦గుల్కెడుకిడ్యము చంకపత్రమం
జుష్రిలతోడముచ్చెలున్ వెలయ ♦ గుప్తగుణుండను వైద్యుఁ డొప్పెఁగన్. 2371

హంసవింశతి, ఆ 1 పద్య 232.

## —♦ సవారిబోయలు. ♦—

సీ. పైచరమోరడీ♦బలిమికం బొద్దిక, ముల్లడీతాకుఁడు♦జల్లికట్టు
మైనప్లు మెడగుడు♦మారువెంబడి బిట్టు, ఱతుకుసమాధాన♦జతనమడుగు
లోడాటు నడ్డకా♦లుఱవ పాడిచెళకుని,బ్బగము నీరడికందు ♦ బఱిమిడిరిగు
నుమ్మరిసెలవుపా♦దొత్తుకలు ధుతాళి, తొడిగట్టయుం గాల♦జడుపులావు
గీ. హాయిలుబూరుగవన్నాగ♦హాయలుపిగువు,బొట్టడేగరుకేకప్పు ♦ బెట్టడిసుపటు
పటముతాకుడు మెఁగవోయ♦ల్పదిలమదిగొ, హెచ్చరికటంచువడిబోయ ♦ లేఁగుచుండ,
ఉ. సంచపురేకుదుప్పటులు ♦ జాఱసిగ ల్బిగిచల్లడాలు వా
సించెడిగంధపట్టియలు ♦ బిల్లురుమాలలు సందితాయెతు
ల్మించుగ సానచిమ్మసును ♦ మీసలు డీటుచు మీఱి కేరి ధ
క్కించుచువటంచు గుంపుగొని ♦ కేకలు వేయుచు వచ్చి వారిలోన్. 2373

హంసవింశతి, ఆ 5 పద్య 163, 164.

## —♦ కాముకుఁడు. ♦—

క. పాపిఁ దలంపఁడు నిందల,కై వెఱవఁడు ప్రాణహాని♦కైనఁ జకితుఁడై
పోవఁడు కాముకుఁ డెందును, భావజునిప్రసూనబాణ♦బలమెట్టిదియో. 2374

మూర్తిత్రయోపాఖ్యానము, ఆ 2.

సీ. కూర్మితో నొకవేళఁ ♦ గుబ్జాంగనకు శౌరి, కుసుమమాలికలతోఁ♦గొప్ప ముడుచు
కాఁగించి యొకవేళఁ ♦ గలికిముఖంబునఁ, దేఁటకస్తురిబొట్టు♦తీర్చి దిద్దు
నూహించి యొకవేళ ♦ నువిదకట్టోయికిఁ, గొటుకేతనకొన♦గోట నిడును
ముఱముచే నొకవేళ ♦ మొగుదచక్కని పేనఁ,బరిమళిచందన♦పంకమలఁదు
గీ. మగువ కొకవేళఁ పైఁటచ♦క్కఁగ సవరించు,నతివ కొకవేళ నొడ్డాణ♦మమరఁ బెట్టు
నొకకొక వేళ హారముల్ ♦ చిక్కుదీసి, వక్షమున నైచి వలపుచే ♦ వశ్యుఁడగుచు.

కుబ్జాకృష్ణవిలాసము, ఆ 4.

మద్దెలలో నెల్ల ♦ మర్యాద నెఱగత్తె
గనబిల్క సన్యాసి ♦ యనువుమీఱ
వల్లంబు పోనాడు ♦ వైశ్యునిశేవను
గాలిగాలినపిల్లి ♦ కరిమము బోఁపఁ

గీ. గంతుమాయాల నుమ్మెత్త ♦ కాయఁదినిన, వెఱ్ఱితెఱఁగున నెపనంపు ♦ వెఱపువోడమి
చికిలి నెఱవన్నె కాండ్రకు ♦ సివము లెత్త, నెనసి చరియించు వీఁట నా ♦ హేమరేఖ.

హంసవింశతి, ఆ 1 పద్య 220.

శా. నీవీబంధము చక్కదిద్దు నెటివే ♦ ణిన్ లెస్సగా సేయుఁ గ
న్మోగింజిల్కు దరస్మితంబు జిగిమా ♦ పుల్వాఱగాఁ జూచు మం
గేరిం జన్పడఁ జేయు నెచ్చెలియతోఁ ♦ గేల్కేల దట్టించి వా
చాపైఁ బత్రిని ముచ్చటాడు సకి తన్ ♦ జారు ల్విలోకింపఁగన్.

హంసవింశతి, ఆ 2 పద్య 193.

సీ. పూఁటపూఁట మొఱుంగు ♦ నీటుగాఁ బెట్టుచుఁ
గమ్మలు కొఱిమ్మించు ♦ కాంతులీన
ఘాటిమాటికి నూనె ♦ పాటుగాఁ బదనిచ్చి
తలదువ్వి కొప్పిడు ♦ వలపు గులుక
గడెగడెకును బెట్టి ♦ నిడియున్న గడితంపుఁ
జలువలు గట్టును ♦ జెలువు దనర
జవనెనంబును వింత ♦ దేఱఁ జొక్కటపు సొ
మ్ములు దాల్చి నెమ్మేనఁ ♦ దళుకు లొలుక

గీ. గళమునను బూయు గందంబు ♦ గందవడియుఁ
గొఱిమ్ముడిని జెక్కు సవరంబుఁ ♦ గొఱివిరులును
సొగసు దనరార విటకోటి ♦ సొక్కి తిరుగఁ
జిత్తజాయత్తచిత్తయై ♦ చిగురుబోఁడి. 2385

హంసవింశతి, ఆ 3 పద్య 77.

—♦ జంగమురాలు. ♦—

సీ. పటు నెత్తి ముళ్లపా ♦ గిడి తాలికలొనర్చి, కడలు జాల్పిన గొప్ప ♦ జడలదిండు
నలికభాగమునఁ జెం ♦ తాకువెడల్పుగ్గ, బొనగించుకొన్న పెం ♦ భూతిరేఖ

సందిట నిరువంకనొందు హైఁడికమ్మ్లు, నందంబు నొందు రుద్రాక్షపూస
కటితటిఁ గాసెపై గట్టిగాఁ బిరుచుట్టు, గట్టిన కుఱుమాపుఁ గావికోక
గీ. నాగబెత్తంబుఁ దామ్రపు నంది ముద్ర, యుంగరము జన్నిదములువాటు యోగపట్టె
యమరజంగమూరా లరయ్యె నఖిలపల్ల, వావశీకృతసమ్మోద యయ్యవారొద. 2388
శుకసప్తతి, ఆ 2.

## వంచకులు.

సీ. కల్పితప్రణయవిభ్రమపాకాల వైదగ్ధ్య, జనితమాయాతాపసంభ్రమంబు
ప్రతివాక్యశపథపారంపరీవిజ్ఞాపి, తాత్మీయకృతకమోహాతిశయము
దంభేతరానుబంధనిబంధనిహ్నవ, జల్పిత సూనృతశపథశతము
కపటనిద్రాజాతకైతవోత్స్వప్నప్రలాపమవాచామిథోనామధేయ
గీ. మురుకరచ్ఛద్మసంప్రయోగోపగూహ, నసకృదతులితకృతకాంతరదశంబు
సౌఖ్యముఖ్యత్వవంచనాసమ్మదంబు ఖండితల నుండె నవ్వంచకద్వయంబు.
శుకసప్తతి, ఆ 2.

## కృతఘ్నుఁడు.

సీ. తన కార్యమునకు సద్ధర్మం బొసంగిన వాని, కలధనంబు హరింపఁగాఁ దలంచుఁ
దన శత్రుతోడ శాత్రవ మొనర్చిన వాని, శత్రుతతితో నతిమైత్రి సంఘటించుఁ
దను సర్వదిశలఁ గీర్తన మొనర్చిన వాని, చరిత మెల్లెడల దూషణము సేయుఁ
దన ప్రాణభయ నివర్తన మొనర్చినవానిఁ, దవిలి హింసింపఁగాఁ దలఁచుచుండుఁ
గీ. దన సమృద్ధికి మివుల సంతసము నందు, వాని యభివృద్ధిఁ గనియాత్మ వనట నొందు
వనజ నయన కృతఘ్నుండు వానితోడ, నీఁడయినయట్టి దుర్జనుం డెందుఁగలఁడు.
సీమంతినీకల్యాణము, ఆ 2.

## కార్యసాధకుఁడు.

మ. ఒకచోఁ నేలను బవ్వళించు నొకచో నొప్పారుఁ బూసెజ్జపై
నొకచోఁ శాకము లారగించు నొకచో నుత్కృష్టశాల్యోదనం
బొకచోఁ బొంత ధరించు నొక్కొకతఱిన్ యోగ్యాంబరశ్రేణి తా
లెక్కకు రానీయఁడు కార్యసాధకుఁడు దుఃఖంబునన్ సుఖంబునన్ మదిన్. 2389
భర్తృహరిసుభాషితము, ఏ॥ల॥ నీతి. పద్య 74.

## — వ్యభిచారదూషణము. —

ద్విపద. ఇంతటికైన యొడ ◆ లెఱుఁగమిఁ జేసి, యింతులఁ గోరి పో ◆ యెడి దురాత్ములకు
మానభంగము బొందు ◆ గానని రెండు, తానఁ జెడుట మూఁడు ◆ నగుబాట్లు నాల్గు
మనసుతాపం బైదు ◆ ధనహాని యాఱు, ఘనమగు ముక్తికిఁ ◆ గడఁబాయు టేడు
నెప్పాటనైనఁ దా ◆ నియ్యెడు చేట్లు, తప్పునే యెలయాండ్రఁ ◆ దగులువారలకు.
పండితారాధ్యచరిత్రము, పురా. పర్వ.

సీ. ప్రాణేశుఁ డెఱింగినఁ ◆ బ్రాణంబునకుఁ జేటు, దండించు నెఱింగిన ◆ ధరణిపతియుఁ
మామ యెఱింగిన ◆ మనువెల్లఁ జెడిపోవుఁ, దలవరి యెఱింగినఁ ◆ దగులు సేయుఁ
దలిదండ్రు లెఱింగినఁ ◆ దల యెత్తకుండుదు, రేరా లెఱింగిన ◆ నెత్తిపొడుగు
నాత్మజు లెఱింగిన ◆ నాదరింపరు భ్రాత, బంధువు లెఱింగిన ◆ వెలి యొనర్తు
ఆ. రితరు లెఱింగిరేని ◆ యెంతయుఁ జుల్కఁగాఁ, జూతు రిందు నందు ◆ సుఖము లేదు
యశము లేదు నిర్భ ◆ రానందమును లేదు, జారుఁ జేరఁ జనదు ◆ చారుముఖికి. 2391
భాగవతము, స్కం. 10 పూర్వ. 978.

సీ. గుట్టుతప్పిపోవు ◆ ముందటివిచారము లేదు, సావడికుడుగు మ ◆ చ్చరము పుట్టు
నగరివారు హసింతు ◆ రగడౌను పిన్నపెద్దలకుఁ జుల్కన తల్లి ◆ దండ్రులోర్వ
రింటికి సేగియౌ ◆ నెవరు మెచ్చరు లేని, గర్వంబు దొట్టుఁ జే ◆ కాసు దుల్లు
నోడ లోడుగాఁ జొచ్చు ◆ నోడువులపాలగు, సందులు మాటు ◆ [illegible]
గీ. చిన్నపని గాదు లంజెరి ◆ కమ్మ నినుము, ప్రజలు మీఱొక్కటైనమా ◆ [illegible]
బదుచఁడవు నీవు మాబిడ్డ ◆ పరుస మొగ్గ, ప్రొయొక్కటము రాకు నీవిది ◆ మొదలు చేసి.
నిరంకుశోపాఖ్యానము, ఆ 2 పద్య 129.

సీ. అత్తమామలు గన్న ◆ నారడివుత్తురు, బావ పరీక్షింప ◆ నేవగించు
మఱఁదులు గాంచినఁ ◆ గఱకఱి నెంతురు, వదినె లెఱింగిన ◆ [illegible]
బంధువుల్ గనినచోఁ ◆ బరఁగ నిందింతురు, తోడికోడలు చూడ ◆ నాడికొనును
బతి గనుఁగొన్నచోఁ ◆ బ్రాణహాని యొనర్చు, వాడవారెఱింగిన ◆ పన్నిదఱుగు
గీ. నరయ నిదిగాక యున్నిట ◆ నాఁడు పుట్టు, పుట్టఁ బాపంబు పుట్టినఁ ◆ బుట్టినింటి
కేని మఱి సొచ్చినింటికిఁ ◆ గీర్తి ఘనత, దేక యపకీర్తి దెత్తురే ◆ తెఱవ లెచట.

చ. పతిహితభక్తిచే వెలయు ◆ పద్మదళప్రతిమాననేత్రికిన్
వ్రతములపోల లేటికి ధృ ◆ వంబుగఁ బుణ్యము లబ్బు నెప్పుడున్
బతిని దిరస్కరించి పర ◆ భర్తలఁ జెందిన భామ పుణ్యముల్
వ్రతజపహోమబంధనములు ◆ గావె వచింపఁగ నెంతనోఁచినన్. 2394

క. లలిజాగ్రత్స్వప్నసుషు, ప్తులను మనోవాక్శరీర♦ములచే సేవే
శిలనైన సతులు పరపురు, షులఁ గోరిన వన్నె లేదు♦సూవె ధరిత్రిన్. 2395

సీ. పంక్తికంఠునిమోహ♦ పరితాప మెంచెనే, భువనమాత జగత్పవి♦త్రసీత
యల పుళిందునిఁబొంద♦నాసక్తిఁ జెందెనే, ప్రియహితామితనయ♦భీమతనయ
నహుషుని విరహంపుఁ♦దహతహల్పాచెనే, సాంద్రసద్గుణచర్య♦ యింద్రుభార్య
మఱి సింహబలుని పెం♦న్మాయలఁ జిక్కెనే, యాఱడిపవిఁ బూని♦యాజ్ఞసేని
గీ. మునుపటి పతివ్రతలు మహా♦మూర్ఖచిత్తులైన దుర్జను లతిఘోర♦సూనసాయ
కాస్త్రజర్ఝరితాత్ములై♦ గాసపడిన, మాన మిడిపుచ్చుకొనిరఁటే♦ మచ్చకంటి.

హంసవింశతి, ఆ 1 పద్య 127–129.

సీ. దశకంధరునిమోహ♦దశ విచారించెనే, సకలజగన్మాత♦జనకజాత
నహుషభూపాలుమ♦న్నన కొప్పుకొనియెనే, స్త్రీరత్నమైనశ♦చీపురంధ్రి
యల సింహబలునిమా♦యలఁ జిక్కి పొక్కెనే, విపులసద్గుణమాన్య♦ ద్రుపదకన్య
శబరాధిపునిదురా♦శలకు లోనయ్యెనే, రతివిభాకృతిభీమ♦ రాజపుత్రి
గీ. తొల్లిటిమహాపతివ్రతల్♦దుర్మదాంధ, కాపురుషు లంగభవశరా♦ఘాతవికల
చిత్తులై తమ్ముఁజేరి యా♦సించినపుడు, సిగ్గు వోనాడికొనిరఁటే♦ చిగురుబోఁడి.

శుకసప్తతి, ఆ 1.

క. పరదారగమన మొప్పదు, పురుషుల కది యెల్లపాప♦ములకంటె నరే
శ్వరవర యాయుస్సంక్షయ, కరంబు దద్వర్జనంబు♦ గడు మే లరయన్.

భారతము.

మ. పరకాంత న్మదిలోననైనఁ దలఁపం♦బాపంబు దుఃఖంబునున్
బరివాదంబును నొంది ఘోరనరక♦ప్రాప్తవ్యథల్ పెక్కువ
త్సరముల్ చెందుదు రట్టి యన్యవనితా♦సంభోగదోషంబు దా
నరనాథోత్తమ యింతయంతయని యె♦న్నన్ వచ్చునే యోరికిన్.

విష్ణుపురాణము, ఆ 4.

చ. పరులకు నవ్వుపట్టు తన♦ బంధుజనంబుల కెల్ల నింద య
స్థిరమ్ముల కాలయంబు గడు♦ పిగ్గులచేటున కాస్పదంబు స
త్వరముతో వ్రిపాక కడు♦భాసురకీర్తికి మూలహాని యె
వ్వంకిఁ బరాంగనం గలయు♦వర్తనమే బలమెంతకల్గినన్. 2399

మైరావణచరిత్రము, ఆ 1 పద్య 107.

క. విరవమ్మ నీలకుంతలి, మును మరగు కుతరుణి తార ◆ మోదంబునఁ జం
ద్రుని వలచి మోసపోవఁట, వినలేదే జారవాంఛ ◆ విడువఁగరాదే. 2400

క. సారంగధరునితోఁ రతిఁ, గోరినచిత్రాంగి పగలఁ ◆ గుంగుచు మడిసెన్
ధారుణిలోఁ పలదుర్యశ, కారణ మగు నింపపాలు ◆ గాలేదె సఖీ 2401

నీలకుంతలీవిలాసము, ఆ 3.

ఉ. చీను చిటుక్కుమన్న నెతఁ◆జెందదిచిత్తముతోడ జారతో
స్నేమినుఖంబుఁ గాంచ విటుఁ◆డేటికి నీభ్రమ వట్టిపాప మిం
తే మఱియేమిలేదు పెఱ◆తెర్వులఁ బోవుట గాదటంచు నో
కామిని నేఁడు నామనవి◆గా వినిపింపు నిలింపభర్తకున్. 2402

అహల్యాసంక్రందనీయము, ఆ 3.

## —◆ కాముకీకపటవాక్యములు. ◆—

సీ. వేళవెట్టిరే బాడ◆బాలు పరాశరుఁబట్టి, దాశకన్యాకేళిఁ ◆ దప్పఁజేసి
కులములో వన్నె తె◆క్కువయార్యాసే గాధి, పట్టికి మేనక ◆ చుట్టరికము
ననుపుకాఁడై వేల్పు◆నాగవాసముఁ గుంకి, మహిమఁ గోల్పడియో కే◆మాండకర్ణి
స్వారాజ్యమేలంగ ◆ నీశైరె సురలవా, ల్యాజారుఁడైన జం◆భాసురారి
గీ. వాసికెంటెను నీ మహా◆త్మ్యంబు ఘనమె, పవనపర్ణాంబుభక్షులై ◆ నవసి యినుప
కచ్చడాల్ గట్టుకొను ముని◆ముచ్చులెల్ల, తామరసనేత్రలిండ్ల బం◆దాలు గారఁ.

మనుచరిత్రము, ఆ 2 పద్య 73.

క. నరకమని చదివి చెప్పియు, ధరణీపతి దండభయముఁ ◆ దగిలించియు నా
స్తికు గాక యుధమపురుషులు, వారివారు లజ్జతె ఐమింప◆రే పరసతులన్. 2404

తారకబ్రహ్మరాజము, ఆ 2.

[illegible]లోకములోనఁ గొందఱు◆లులల్ సతులన్ దనియింపలేక య
న్యోకమనీయవన్యపురు◆షాల్ తమకాంతల నంటకుండఁ దా
ళాకులలోన వ్రాసిరి ప◆రాంగనఁ గూడినఁ బాప మంచు న
య్యాకులపాటుచూచి యిష్ట◆దాకులపాటొనరింప నేటికిన్.

సీ. కన్నకూఁతు రటంచు◆ నెన్నక భారతి, తరుణిఁ గూడఁడె నీపి◆తామహుండు
[illegible] యను మేర◆మీఱి రాధికతోడ, నెనయఁడే నిన్న నీ◆యనుఁగుబావ
[illegible]ంచు నొకింత ◆ వాపిలేకను జ్యేష్ఠ, వెలఁదితోఁ బొందఁడే ◆ నీగురుండు
[illegible] ఘన కవా◆[illegible] పట్టఁడేరీదు, సహపాఠియగు ఘటి◆[illegible]

గీ. యిట్టి మీవారినడతలు ♦ గట్టిపెట్టి, యమ్మ నేచెల్లన్యాయంబు♦లాడె దొర
కడకు నీఱంకు నీవెఱుం♦గవిధితాన, దూఱెదవు నన్ను చలపొరి ♦ దోసకారి.
తారాశశాంకవిజయము, ఆ 3 పద్య 59, 72, 81.

క. గౌతమపత్నీసురత, ప్రీతాత్ముఁడు దివిజపతికిఁ ♦ బ్రేమగురుస్త్రీ
పాతివ్రత్యముఁ జెఱిచిన, శీతాంశునకేమి హాని ♦ సేకుఱెఁ జెపుమా. 2408
శకుంతలాపరిణయము, పె. నా. ఆ 2 పద్య 163.

సీ. క్రీడింపదే శర్వా♦రీవల్లభునితోడ, నార్యసన్నుతను రా♦చార్యభార్య
భోగింపదే సుధా♦భుజ్నాథుతోడ గౌ,తమతాపసోత్తము ♦ ధర్మపత్ని
రమియింపదే వేడ్క ♦ రత్నాకరునితోడ, హరకపర్దాంతర్వి♦హారిగంగ
వరియింపరే క్షపా♦వరశిరోలంకారు, ఘనదారుకావని ♦ మునివనితలు
గీ. వారలెల్ల మహాపతి♦వ్రతలు గారె, సరససౌభాగ్యసౌందర్య ♦ పురుషుఁ గనిన
సంచలింపదె భువి నెట్టి ♦ సాధ్వియైనఁ, జాలు నీనిష్ఠ లేల న♦న్నేలుకొనుము.
రామచంద్రోపాఖ్యానము, వా. వే. ఆ 4 పద్య 143.

సీ. దారుకావనములోఁ ♦ దాపసస్త్రీలతో, విహరించె మన్మథ ♦ దహనకారి
గౌతమమునిభార్యఁ♦గని మోహమునఁజెంది, కలియఁడే సురరాజు♦కాంక్షచేత
గోపికాస్త్రీలపైఁ ♦ గోరిక జన్మించి, కేళిఁజేయఁగ లేదె ♦ కృష్ణమూర్తి
గురుభార్యయనెడు సం♦కోచంబు మదిలేక, తారనుగూడె సు♦ధాకరుండు
గీ. అట్టివారలు నీవలె ♦ నధికనియతు, లెఱుఁగకున్నారొ ధర్మార్థ♦కరుఁడవేము
గాకయుండిననిట్టి వి♦కల్పబుద్ధి, గలుగఁ బనిలేదు సద్భక్తి ♦ కలిమిగాదు. 2410
నీలకుంతలీవిలాసము, ఆ 3.

## —♦ చిత్రకారుఁడు. ♦—

గీ. హరితహారిద్రకృష్ణర♦క్తావదాత, శబలపాటలధూమల♦శ్యామకపిశ
వర్ణములఁగూర్చి చిప్పల♦వాగెలునిచి, చిత్తరువువ్రాయుగుళ్ళలోఁ♦జిత్రఘనుఁడు.
హంసవింశతి, ఆ 3 పద్య 8.

## —♦ చిత్రపటములు. ♦—

సీ. అమరవల్లభుఁడుగౌ♦తముకూర్మియిల్లాలి, జీకటితప్పసే♦సినవిధంబు
సితభానుఁడాచార్యుఁ♦జిగురాకుబోఁడిపైఁ, గన్నువైచినకన్నె♦కలుషమగులు
నట్టేట దాశక♦న్యకకు నువ్విళు లూరి, జాలిఁ బొందిన పరా♦శరువిరాళి
గారాపుగూఁతుపైఁ♦గాఁగొని పనిఁ బూను, వనజసంభవుని నె♦మ్మనము జలితి

గీ. దారవనవీథిశీతాంశు♦ధరునింతు, శౌరిగోపాలకామినీ ♦ చౌర్యకేళి
కామరసభావములుమించి ♦ కానఁ బడఁగఁ, దీర్చె యిడుపులయందుఁజి♦త్రించినారు.
శృంగారనైషధము, ఆ 7. పద్య 151.

——♦ భూతవైద్యుఁడు. ♦——

ఉ. భూతియుఁ గావుఁబొట్టు మెయిఁ♦బూనినమాలెక్కలు నుక్కుకక్కెముల్
చేతఁగడెంబుఁదాయెతులఁ ♦ జేర్చినమందులు మంత్రితంత్రకో
పేతపునాగబెత్తమరఁ ♦ బెట్టెలునొప్పఁగ రౌద్రకర్ముఁడన్
భూతచికిత్సకుండొకఁడు ♦ పొల్పుగ వచ్చుటనుండుమానిసీ. 2412
సీ. పైగాలిసోఁకిన ♦ బాలుఁబిశాచక, తండంబులెల్లను ♦ దల్లడిల్లి
పొలఁకువఁ దనుఁ గొన్నఁ ♦ బోవుదయ్యంబుల, విసరము ల్భీతిచే ♦ విస్తరిల్లి
పేరు విన్నప్పుడే ♦ దూరమైచను భూత, చయములు దిగులున ♦ సరభసిల్లి
తోడకినిల్చినయంతఁ ♦ దొలఁగుదుష్టగ్రహ, పరిచయంబుల్ భయమునఁ♦బరిఢవిల్లి
గీ. యుఱుకు నారౌద్రకర్ముని ♦ కరము సోఁకఁ, బ్రేతబేతాళమోహినీ♦పిశితభోక్తృ
కామినీ శాకినీ ఢాకి♦నీ మదాంధ, భయకరబ్రహ్మరాక్షసు♦ల్పల్లటిల్లి. 2414
హంసవింశతి, ఆ 3. పద్య 62, 63.

——♦ బేతాళుఁడు. ♦——

సీ. పసుపునిజాంజులు ♦ షల్లవెండ్రుకలజొం, పము మారుతమునఁగం♦పంబు నొంద
విలయమేఘాకృతిఁ ♦ దలఁపింపఁగాఁజేయు, నొడలిపైఁ జీకటి ♦ ముడివడంగఁ
జండనిష్ఫాలకం బై ♦ వేండ్రంబులైనట్టి, కన్నులఁ గోపాగ్ని ♦ కణములురులఁ
శేరిపులునరములుఁ ♦ బెనఁచినతలకాయ, పేరులుగళమునఁ ♦ బెనఁగొనంగ
గీ. నడుగ కంధంద త్రావుచో♦నుబిము మీఁద, వఱదలై క్రొత్తనెత్తురు ♦ గిఱికొనంగఁ
గత్తులమొనసంస్ఫుటరూపంబుఁ ♦ గఱచికఱచి, పలలకబళంబు మెసఁగుచు♦భయదభంగి.
హరిశ్చంద్రోపాఖ్యానము, శంక. ఆ 3. పద్య 81.

——♦ రాక్షసులు. ♦——

సీ. వికృతాననంబులు ♦ విరళదంతంబులు, నిడుపైనకోరలు ♦ నిక్కుమెడలు
ముడివడ్డబొమలును ♦ ముమ్మూలముక్కులుఁ, బల్లవెండ్రుకలును♦బట్టెతలలు
బొక్కబొమ్మలు లోఁతుఁ♦బొట్టలు మిడిగ్రుడ్లు, గూనివీఁపులునిడుఁ♦గ్రొంకివేళ్లు
భూరకాళులు నీచఁ♦బోయినచేతులుఁ, గోలముఁగాఁపులు గుది♦గొన్నతొడలు

గీ. నతిభయంకరగతి నూపు నట్టహాస, కహకహారావములతోడఁ గాన నయ్యె
దావపావకఘనశిఖా దగ్ధతాల, సాలసంకాశ మగుపిశాచద్వయంబు. 2416

చ. పిఱికొనఁ దాల్చి నెట్టముగఁ బ్రేవులు చుట్టి కపాలపాత్రలో
విరియఁ గలంచుఁ గ్రొవ్వెమ్మెదడు వెండ్రుక లేతి తోలంగనైచు నె
త్తురుచవిచూచుఁ గండలు తుఁఘూ యని క్రాయుఁ ద్రిశూలధారలం
జెరివిన ప్రేతమాలికలఁ జిమ్ముఁ బిశాచవిభుండు వేడుకన్. 2417

ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 122, 124.

సీ. కొఱవితో ఁగడించు కఱకునల్లని మేను, మిడిగ్రుడ్లు గడితంపు మిట్టనుదురు
వెడఁదనోరును దుట్టె పెదవులు గొగ్గికోరలు బుఱ్ఱముక్కు నిట్టలపుఁ జెవులు
గుఱువంపుచేతులు గుంటలౌ ముక్కునదొట్టె, కడుపునిడుపుగాళ్లఁ బొదువు మెడయుఁ
బల్లవెండ్రుకలుఁ దోల్పచ్చడంబును నల్లపూఁతగందమ్మును బుట్టతలయు
గీ. నెముకకోలయుఁ బ్రేవుజందెమును బునుక, చెంబుఁగలవానిఁ దిండికై వెంబడించి
యలఁతి బూచులు గొలువంగ వలఁతి యగుచు, గండఁడను నొక్క బ్రహ్మరాక్షసుని గాంచి. 2418

మహేంద్రవిజయము, ఆ 6 పద్య 106.

## —మన్మథుఁడు.—

సీ. పృథులవిశ్వంభరా రథమున కెదురుగాఁ, బూన్పించె నెవ్వాఁడు పువ్వుఁదేరు
కాంచనాచలకార్ముకమునకు సాటిగాఁ, జేపట్టె నెవ్వాఁడు చెఱకువిల్లు
నవిరళపాశుపతాస్త్రమునకు వాఁడి, మిగిలించె నెవ్వాఁడు చిగురుఁదూపు
నతులితామరదాన వాదిబలంబుల; గెలిపించె నెవ్వఁడ య్యాళిబలంబు
గీ. నట్టి జగజెట్టి మన్మథుం డఖిలలోక, ములకు వెఱగొంగ జీవుల మూలకంద
మతని యిలుఁ జొచ్చి వెడలని యతఁడుగలఁడె, యతనియమ్ములఁ జడకున్న
యాధిపుఁగలఁడె. 2419

కళావిలాసము.

సీ. మకరందమాని మైమఱచినగొనయంబు, వెడ్రమోయఁగడివోని వింటితోడ
జలజకేసరరాజిఁ జల్లెడుమూఁకగా, దాఁటునతారిరథ్యములతోడఁ
గర్ణికారపుమొగ్గ కనకంపుగుబ్బగాఁ, గోయిలనోరూరు గొడఁగుతోడ
రతికన్నుఁగవమచ్చరముసేయు టెక్కెంబు, వడఁక వీతెంచుసేవకులతోడ

గీ. వలపుఁదూఁపులు కరసాన♦వాఁడిచేసి, మండునెలతోడఁ దనమేన♦మామయైన
నిండునెలతోడ వలరాజు♦నిర్జరేంద్రు, సభకు సేతెంచె భుజబలో♦త్సాహమెసఁగ.
ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 194.

సీ. కామినీభూనమే♦ఘశ్రేణి విరియంగఁ, దొఁగజెల్లుగుంపులు♦దొంగలింప
సాంధ్యరాగావిల♦చంద్రికాంబులు దేఱ, నిఱులమొత్తపుటస♦లివురఁబాఱ
యువజనరాగప♦యోరాసు లుప్పొంగ, వెలిదమ్మికాజిపు♦వ్వులు ముడుంగ
మదచకోరమరాళి♦మండలి చెలరేఁగఁ, బఱచు చెడిపెలను♦మొఱపులడఁగ
గీ. నభినవశరత్సమాగమం♦బనఁగమించు, నట్టిరాకానిశావేళ♦నలరువింట
గొనయమెక్కించి వలరాజు♦కినుకమీఱ, విరహిజనములపై దండు♦వెడలెనపుడు.
పారిజాతాపహరణము, ఆ 2 పద్య 50.

సీ. కెందమ్మితూడు చి♦కిలినాళముగఁజేసి, చెఱకుతుంటియుమౌర్విను♦సరణిఁగూర్చి
గేదంగిదళముల♦మీఁదికట్లమరించి, యందంపుఁబువ్వాడి♦మందుఁబోసి
కుందకోరకము మేల్♦గుండుబాగుఘటించి, తొగతీవగజమున♦దొరయనెత్తి
రహిమించుజివురాకు♦రంజకం బొనరించి, వెన్నెలనిప్పుకీ♦విం దవిల్చి
గీ. యించువిలుకాఁ డగాదుఁగా♦వించునంత, చంచరీకోగ్రధూమంబు♦మించియపుడ
మించుఁబోఁడికి కంచెల♦చించి గుంతు, ఢీయనుచువచ్చి హెచ్చిగుం♦డియలనాటె.
శకుంతలాపరిణయము, ఫ. వేం. ఆ 8.

సీ. చెంగల్వవిరులజో♦డంగీలు తొడిఁగి క్రొం, దళుకులమరువమ్ము♦దట్టిగట్టి
పొగడపువ్వులసాలు♦పొందుగాఁ జైగప్పి, పరువంపుమల్లెల♦పాగఁజుట్టి
చిలుకగుఱ్ఱము నెక్కి♦చెఱకుసింగిణిఁబట్టి, తలిరుటమ్ములదొనఁ♦దాల్చియార్చి
యళిబలంబులమొన♦నెలగోలు గావించి, వనజారి వెనుదళ♦వాయిఁజేసి
గీ. కొదమకోయిలగుంపులు♦కూచిసేయ, మదమరాళోత్కరము చుట్టి♦కదిసికొలువ
మలయపవమండజాత్యుఁడై♦నెళవుఁదెలుప, దర్పకుండను హ్మాగ్రమాను♦దండువెడలె.
పద్మినీపరిణయము, ఆ 4 పద్య 16.

సీ. గండుకోయిలదండు♦మెండుగా వకవికల్, వాటించి విరివిక♦వాదుగఱప
చెలరేగి తొగరయము♦క్కులపులుంగులబారు, లాలితంబుగ పహా♦రాలు దీర్ప
కడువేడ్కచే వసం♦తుఁడు సారెడగ్గటి, కుతుకమూపెన్మప♦లతుగణింప
ననురాగమొదవి జ♦వ్యానఁ గేవలెడనెడ, గజులెత్తి యంగర♦క్షుణమొనర్ప

గీ. పొసఁగువేడుకతేంట్లుతం♦బూర్చివేయ, మారుతేము వెంటఁగదలిహు♦సారిఁ దెల్ప
వేడ్క పాంథులపై దాడి♦వెడలె నైదు, తూఁపులుంగొనిమారుఁడ♦ద్భుతముగాఁగ.
సత్యభామాపరిణయము, ఆ 2.

చ. చిగురుఁగటారినూఱి వెడ♦సింగిణి కేల సమర్చి సూరెలం
దగిగొరవంకపోఁజూగడు ♦ దాడిగరా వడినారిదీటుచుం
బొగరునఁ జిల్కతేజిమళు♦పుల్ దుమికింపుచుఁ దేఁటు లార్వఁగా
జగములమీఁదికి న్వెడలెఁ ♦ జక్కెరవిల్తుఁడు మచ్చరంబునన్. 2425
రసికజనమనోరంజనము, ఆ 2 పద్య 12.

——♦ మన్మథపూజ. ♦——

సీ. ధ్యానంబు హృదయవా♦స్తవ్యకుటుంబికి, నావాహనము జగ♦ద్వ్యాపకునకు
నర్ఘ్యపాద్యములు నా♦రాయణప్రియసూతి, కభిషేక మబ్ధిక♦న్యాంకశాయి
కలరుదోయిళ్లు పు♦ష్పవ్రాలవింటిదొరకు గంధము గంధగిరిమరు♦ద్బాంధవునకు
ధూప మపరిమితప్రి♦తాపోష్మసురభికి, దీపంబు తిమిరభ♦యాపహునకు
గీ. మధురసఫలోపహారంబు♦మత్స్యకేత, పరిజనపరాయణునకంచు ♦ భక్తి నొసఁగి
యాసమథనాయమదనాయ♦మధుసఖాయ, మనసిజాయనమోనమో♦యనుచు మ్రొక్కె.
వసుచరిత్రము, ఆ 3 పద్య 170.

సీ. గంధంబు పెట్టిరు♦త్కటనీలశిరజాల, శిరజాల హృతహర♦స్వాంతధృతికి
విరిచాలు నించిరి ♦ పరియోజితనయాన్య, తనయాన్యమితమోహ♦♦ధాతృమతికి
ధూపమర్పించి ర♦ద్భుతసంపదబలాప, దబలాపహృతవిష్ణు ♦ దర్పగతికి
దీపమెత్తిరి నైజ♦తేజోలహరిభావ, హరిభావయుక్తఘు♦స్రాధిపతికి.
గీ. తళియ పట్టిరి నిత్యస♦త్కాంతమధుప, కాంతమధుపవనాద్యాప్త♦కాండవృతికి
వినతి సల్పిరి శృంగార♦జనికి రతిప, తే నమో భగవతే యంచుఁ ♦ దెలివ లపుడు.
చంద్రికాపరిణయము, ఆ 4 పద్య 82.

చ. శరధినుతానుతాం నుమ♦చాపధరాయ రతీశ్వరాయ శం
బరమథనాయ గంధవహ♦నానమదద్విరదాయ పాంథసం
హరణచణాయ లోకభయ♦దాద్భుతవిక్రమభానురాయ నుం
దరతరమానితాయ మద♦నాయ నమోనమ యంచు మ్రొక్కుచున్. 2428
విజయనందనవిలాసము, ఆ 2.

ఉ. తామరసచ్ఛదంబున ము♦ఖంబున వ్రాసిరి చేసి రిన్నెటిన్
గాముని కామనీయమును ♦ గాదిలిచిల్కహలుమానుమాళమున్
సోముని సౌమనస్యమును ♦ జక్కులరుక్కులనంబు చందనా
రామలలామశైలశిఖ♦రస్ఫురదాతతవాతపోతమున్. 2429

ఉ. మొల్లల మెట్టదామరల♦మోదుగు మొగ్గలఁ బొన్నపూవులన్
మల్లెలఁ గన్నెగన్నెరుల ♦ మామిడిగుత్తుల రాచకల్వలన్
పల్లకపాలికావళుల ♦ నంబురువాళిని బోలెఁ గేళినీ
వల్లభుఁ బూజచేసి రభి♦వందన పూర్వముగాఁ దలోదరుల్. 2430

శకుంతలాపరిణయము, కృష్ణ. ఆ 2 పద్య 174, 176.

సీ. రతిమనఃకాంతాయ ♦ రాజీవకుంతాయ, మలయానిలధరాయ ♦ మన్మథాయ
సత్కారవాహాయ ♦ జగదేకమోహాయ, మత్తకీరరథాయ ♦ మన్మథాయ
పద్మాక్షకుమారాయ ♦ బాలికాధారాయ, మహనీయ విబుధాయ ♦ మన్మథాయ
మాధవపరిభవాయ ♦ మాధవసచివాయ, మానితాత్మకథాయ ♦ మన్మథాయ
గీ. మధుజాహర్షపరిబోధాయ ♦ మన్మథాయ, మధుపగణగుణచాపాయ ♦ మన్మథాయ
పాలితవిహారనిరోధాయ ♦ మన్మథాయ, మనసిజ్ఞాయతుభ్యం నమో ♦ మన్మథాయ.

రాధికాసాంత్వనము, ఆ 3.

## —♦ వసంతోత్సవము. ♦—

ఉ. కమ్మనితావులంబోలుచు ♦ కప్పురమున్ మృగనాభిపంకమున్
గుమ్మను చందనం బగురు ♦ కుంకుమఁగూర్చిన యవ్వసంతముల్
చిమ్మనగ్రోవులం దునిచి ♦ చేడియ లొండొరుమీఁద నవ్వుచున్
జిమ్మిరి పయ్యెద ల్చెదరఁ ♦ జెక్కులఁ జెమ్మటజాలువాఱఁగన్. 2432

పద్మినీపరిణయము, ఆ 5 పద్య 83.

సీ. పసిఁడికొప్పెరలందు ♦ పన్నీరు దెప్పించి, కుంకుమపూవందు ♦ గూర్చి పేర్చి
చిమ్మనగ్రోవుల ♦ చెలరేఁగి చెలరేఁగి, గంధేభయానలఁ ♦ గౌరవమునఁ
గంసారిపైఁజల్లఁ ♦ గంజదళాక్షుండు; కర్పూరగంధులఁ ♦ గదనబట్టి
హేమపాత్రిలచేత ♦ నెలమితోఁ బైనింపఁ, బద్మాక్షుఁ డదలుఁ ♦ బద్మనాభుఁ
(ఆ. జొట్టుకొన్న నతఁడు ♦ సుందరాంగులమీఁద, సొంపు మీఱ,మతిసుఖఁ♦జాన లెల్ల
పరభసంబు మీఱఁ ♦ జల్లుపోరాడుచు, హర్షముగ వసంత ♦ మాడిరపుడు.) 2433

గయోపాఖ్యానము, ఆ 1.

## —♦ పుత్రోత్సవము. ♦—

సీ. వ్యాకోచవీజక♦వారితజాతము గంధ, సలిలాభిషేకంబు ♦ సంగ్రహించి
యతిరాగకలితదం♦పతిమనోంబుజనవ్య, హవ్యముల్ మదనాగ్ని♦యందుఁ జెల్పి
చక్రద్విజానేక♦సముదయపరిమదసం, భ్రమదకన్యాప్రదా♦నము లొనర్చి
పద్మకోరకబృంద♦బంధీకృతమిళింద, సందోహముల విమో♦చనము చేసి
గీ. పద్మగర్భాండమను మహా♦భవనసీమ, సమయభూజాని ప్రాగ్దిశా♦రమణియందు
నతులరుచిబాలమార్తాండ♦సుతునిఁ గాంచి, యుచితగతి మీఱఁజేసెఁ బు♦త్రోత్సవంబు.

సీమంతినీకళ్యాణము, ఆ 3.

## —♦ ఉపనయనోత్సవము. ♦—

సీ. శిరసంటె నొకమనా♦సిని నెన్నుదుట శోభ, నంపుబొట్టిడి దీవ♦నల నొసంగి
నలుఁగిడె నొకవధూ♦తిలకంబు గంధామ, లకముతోఁ బసుపు మే♦ళన మొనర్చి
చిక్కవాలక యుండ ♦ నొక్కసీమంతిని, యటకలివెట్టెఁ బా♦యలుగ దువ్వి
జలకంబు లాడించెఁ ♦ గలశంబులను ముంచి, యొక్కపురంధ్రిక♦వోష్ణవారి
గీ. నొకకుటుంబిని ప్రాంశుపీ♦ఠికను నిల్పి, వలిపె నీర్కావి మడుఁగు దో♦వతి చెఱంగు
చమిరి మైతడి యొత్తి కే♦శ్యంబుఁ దుడిచి, కొనముడి ఘటించె నమ్మాని♦తనయమణికి.
చ. తిలకముఁ దిద్దె నెన్నుదుటఁ ♦ దీరిచెఁ గాటుక లోచనంబులన్
లలి నిడెఁ జుక్కఁ జెక్కుటను♦లాక్షఁ బదంబులయందుఁ బూసె మైఁ
గలప మలందెఁ బూసరులఁ ♦ గంధర పై చెను బచ్చగోఁచియున్
మొలఁ గదియించె నొక్కసతి♦పొందుగ నమ్మునిపట్టి కంతటన్. 2436
ఉ. ఆమునిదంపతుల్దగ స♦హాస్యముఖమందుఁ గృతాభిషేకులై
క్షౌమవసానులై పరివిల♦సత్తిలకాళికులై సుగంధచ
ర్చామహితాంగులై సుతుక♦రమ్ములఁ దమ్ములమున్ ఫలంబులున్
న్నెమ మెలర్పఁగా నునిచి ♦ నిల్చిరి పందిట వేది ముందటన్. 2437
సీ. సఫలతాంబూలహ♦స్తద్వయంబుగ సభా, సైనమ యంచు స♦భ్యానుమతిని
ప్రార్థింపఁగా వార♦యం ముహూర్తస్సుము, హూర్తోస్తటంచుఁ బీ♦ఠోపవేశ
మున కియ్యకొనఁగఁ దాం♦బూలఫలములు బ్రా, ర్థచేనుంచి పు♦త్రుఁడును బత్ని
పరుస సవ్యంబుగా♦వసియుంపఁ గూర్చుండి, యాచమనత్రయం ♦ బాచరించి
గీ. యతఁడు విఘ్నేశపూజపు♦ణ్యాహవాచ, నములఁ గావించి యుపనయ♦నక్రియార్థ
మంతసంకల్పమొనరించి♦యాత్మజునకుఁ, బసుపుఁ బ్రాల్నించి యుంపించెఁ♦బంచశిఖలు

గీ. ఆతఁడు పునశ్శుభోదక♦స్నాతుఁడైన, సుతుని దగ సంభృతబ్రహ్మ♦సూత్రుఁ జేసి
యంకురార్పణ మొనరించి♦యటులసకల, నాందిముఖకృత్యసంవిధా♦నములఁ దీర్చి.

గీ. బ్రహ్మచారులఁ బూజించి♦స్వసుతువారి, పంక్తిఁ గూర్చుండఁ బెట్టియ♦వ్వరతపస్వి
యర్థి నిర్వర్తితౌభ్యావ♦హోముఁడైన, వానిలేవంగ నెత్తె స♦త్వరము గాఁగ. 2440

మ. ఉచితాచారముగాఁ బురోధయొనఁ దా♦నుచ్చావచాశీర్వచో
రచనాసంభ్రమలై సదస్యులగు స♦ర్వబ్రాహ్మణగ్రామణుల్
ప్రచురప్రక్రియ నానతీసుతునకున్ ♦ బ్రహ్మోపదేశంబు వా
నిచయాధీశుఁ డొనర్చెఁ దజ్ఞసుమనో♦నిక్షిప్తలగ్నంబునన్. 2441

గీ. అంత నాతఁడు మౌంజికృ♦ష్ణాజినంబు, పసుపుగోఁచియు దండంబుఁ♦బంచశిఖలుఁ
దనర జనయిత్రియొద్దఁ బ్రా♦థమికభిక్ష, గొని పిదపఁ గైకొనియెభిక్ష♦జనకునొద్ద.

క. మహదాశీర్వచనధ్వని, ముహురుక్తతథాస్తు వాద♦ముగ ముగియ మహా
మహులగు నార్యులకు ద్విజో,ద్వహుఁడతఁడప్పుడు ఫలప్ర♦దానము లొసఁగెన్.

ఉ. మున్నుగఁ దామె కైకొన స♦ముత్సుకులయ్యును వారిలోన వా
ర్మున్నుగ మీరు కొందు మటి♦మున్నుగ మీరలె కైకొనుం డటం
చున్నిజమున్వలెం బ్రియముఁ♦జూపుచు సభ్యు లొకింతవంతు పో
కున్న నొసంగి రన్యముని♦కొక్కని కగ్రిఫలప్రదానమున్. 2444

సీ. స్నాతాగతోప వి♦ష్టస్వస్తి వాచనో,త్సుక బుభుక్షుద్విజ♦స్తోమపంక్తి
యాస్తీర్యమాణాతి♦విస్తీర్ణ సాగ్రాంశు, మత్ఫలాంతర దళా♦మత్రి పటువు
పాత్రాభిఘారాది♦పరివేషణనియుక్త, సాత్త్వికాచార వి♦చ్ఛాత్రగణము
తారతమ్యగృహీత♦తాంబూలదక్షిణా, ప్రీతినివృత్తోత్తమ♦బ్రాహ్మణంబు

గీ. వగుచుఁ గనుపట్టె మధ్యాహ్న♦మందు మౌని, భోజనావాసకాయమా♦నాజిరంబు
బాంధవాతిథివిప్రసం♦బాధకలన, వలన మిక్కిలి గన్నుల♦ పండువగుచు. 2445

సీ. పుచ్చుకొన్నవి తోడి♦బుడుతల కిడి వెండి,యును దమ కంచుఁగై♦కొనెడువారు
బాల్యంబునుండి య♦భ్యాసంబు లేదంచుఁ, గొని వేఱొకనిచేత♦నునుచు వారుఁ
గడులేఁత వివి యంచు ♦ విడిచి పళ్ళెరమందు, ముదురు వక్కలకునై♦వెదకువారుఁ
గసటు వోవంగఁ బోఁ♦కలు సున్న ముడికింప, నెసటఁ బోసిరటంచు♦ నెంచువారు.

గీ. నైయనాహూతజానప♦దాతిపూత, నైష్ఠికశ్రోత్రియబ్రాహ్మ♦ణప్రవరులు
వీటికాదాతల కొకింత♦విసువుఁ జేసి, రంత నొకకొంతవడిఁ జత్వ♦రాంతరమున.

క. తద్వాసరాంతమున న,ప్విద్వత్కులశేఖరుండు ♦ విశ్రుత శాస్త్రో
ద్యద్విధిసంధ్యావందన, సద్విధము నుపక్రమించె ♦ స్వతనూజునకున్. 2447

ఉ. ఘనమతి నాతఁ డాభ్యుదయి♦కంబుగ మూఁడవనాఁడు కూర్మి నం
దనునకుఁ గల్మిమీఱఁగ స♦దస్యులనెల్లరఁ గారవించి దీ
వన లొనరింపఁజేసి మణి♦వస్త్రసువర్ణవిభూషణాదులం
దనిపెఁ దపోధను ల్దలఁచి♦నం గొదయే వివిధార్థసిద్ధికిన్. 2448

క. ఘనమతి నాలవనాఁ డమ్మునిపతి తనతనయునకును ♦ మునుకొని మేధా
జననం బొనరిచి బంధుల, ననిపెఁ దగ బహూకరించి ♦ యనుపమ గరిమన్. 2449

క. ఈవడువున నమ్మునిపతి, యావటుఁడు ద్విజత్వ మొంది ♦ యభివృద్ధిఁ గనం
గా విధిగ నుపాకర్మము, గావించెం గోవిదప్ర♦కాండ యుతుండై. 2450

మహేంద్రవిజయము, ఆ 4 పద్య 135—150.

—♦ కందుకక్రీడ. ♦—

సీ. ఒక యెలదోఁటలో ♦ నొకవీథి నొకనీడఁ, గుచకుంభములమీఁది♦కొంగుదలఁగఁ
గబరికాబంధంబు ♦ గంపింప నుదుటిపైఁ, జికురజాలంబులు ♦ సిక్కువడఁగ
ననుమానమై మధ్య♦మల్లాడఁ జెక్కులఁ, గర్ణకుంతలకాంతి ♦ గంతు లిడఁగ
హారోహభారమున ♦ నడుగులు దడఁబడ, దృగ్దీప్తి సంఘంబు♦దిశలఁ గప్ప

గీ. వామకరమున జాఱిన♦వలువఁ బట్టి, కనకనూపురయుగళంబు ♦ గల్లనంగఁ
గంకణంబుల ఝణఝణ♦త్కార మెసఁగ, బంతి చేనాడు ప్రాయంపు♦టింతిఁ గనిరి.

భాగవతము, స్కం. 8 పద్య 391.

ఉ. ఎగసిన బంతిఁ జేనొడయు ♦ నీవగలాఁడి చెలంగుపొంగు మే
నొగియల బైరిడేగవలె ♦ నుండెడి గుత్తపుగుబ్బ లప్పుడా
మొగమునకొక్క మైనెగయు ♦ ముచ్చట చన్గవజక్కవ ల్వడిన్
సెగిరిచనంగఁ బోవుగతి♦నిం పలరెన్ బళి దృగ్విలాసమై. 2452

విష్ణుమాయావిలాసము.

—♦ బాల్యక్రీడలు. ♦—

సీ. చిట్లపొట్లాకాయ♦సిరిసింగణావత్తి, గుడుగుడుగుంచాలు ♦ కుందెనగుడి
డాఁగిలిమ్రుచ్చులా♦టలు గచ్చకాయలు, వెన్నెలకుప్పలు ♦ తన్నుబిల్ల
తూరనతుంకాలు ♦ గీసనగింజలు, పిల్లదీపాలంకి ♦ బిల్లగోడు
చీడుగుడువ్వాలపోటి ♦ చెండుగట్టినబోది, యల్లియుప్పనఁబట్టె ♦ లప్పళాల్లు.

గీ. చిక్కనాబిల్లలోటిల్లు ♦ చిందఁబాడి, యైన శైశవక్రీడా ♦ హారసరణి
చెంచుకోమరులతోడను ♦ క్రీడించుకాఁడు, చిన్నఁడభినవబాల్యపం ♦ పన్నుఁడగుచు
కాళహస్తిమాహాత్మ్యము, ఆ 3 పద్య 53.

## —♦ బాలికాక్రీడలు. ♦—

సీ. పేర్వేరబొమ్మల ♦ పెండ్లిండ్లు సేయుచు, నబలలతోడఁ ♦ బ్రియ్యంబులందు
గుజ్జెనగూళ్ళను ♦ గొమరొప్పవండించి, చెలులకుఁ బెట్టించుఁ ♦ జెలువు మెఱసి
రమణీయమందిరా ♦ రామదేశంబులఁ, బువ్వుఁదీఁగెలకును ♦ బ్రోదివెట్టు
సదమలమణిమయ ♦ సౌధభాగంబుల, లీలతో భర్మడో ♦ లికల నూఁగు
గీ. బాలికలతోడఁ జెలరేఁగి ♦ బంతులాడు, శారికాకీరపంక్తికిఁ ♦ జదువు సెప్పు
బర్హిసంఘములకు మురి ♦ పములు గఱపు, మదమరాళంబులకుఁ జూపు ♦ మందగతులు.
భాగవతము, స్కం. 10 పూర్వ పద్య 1685.

సీ. ఒకవేళ రత్నాల ♦ చెకచెకల్ వెదఁజల్లు, బంగారు తప్పెటమేల్ ♦ బంతిఁ గొట్టు
నొకసారి మిక్కిలి ♦ యొయ్యారివగమీఱి, ముదుమొప్ప దాఁగిలి ♦ మూఁత లాడు
నొకపరి యానంద ♦ మువ్వొంగఁ జెలఁరేఁగి, మెప్పుచు వెన్నెల ♦ కుప్పలాడు
నొకమరి గెల్పొందు ♦ నురుతీలఁ దవరుచుఁ, గొమలతో వామన ♦ గుంటలాడు
గీ. దోయముల్ సరిబేసులు ♦ దొరయునాళ్లు, గంబములయాటలచ్చన ♦ గండ్లు మొదలు-
గాఁగ శైశవగరిమశృం ♦ గారమలర, బాలికలతోడ నాడుభూ ♦ పాలపుత్త్రి. 2455
ఇందుమతీపరిణయము, కు. భూ. ఆ 2 పద్య 143.

చ. గురుసవిధప్రదేశమునఁ ♦ గోమలకల్పకపుష్పధూళిచే
ధరసుత బొమ్మరిల్లలిపి ♦ తన్మృదుపల్లవపాత్రపంక్తిఁ గే
సరములు ఖాద్యము ల్మధుర ♦ సంబు ఘృతంబు ప్రసూనపుంజ మో
గిరమని పెట్టె నన్నియు స ♦ ఖీతతి కట్టినయాఁ బ్రియంబునన్. 2456
వసుచరిత్రము, ఆ 3 పద్య 30.

సీ. అచ్చనగండ్లు దో ♦ యాలును డాఁగిలి, మూఁతలు నాలుగు ♦ మూలలాట
గుజగుజరేకులు ♦ గుజ్జనగూళ్లును, బొమ్మల పెండ్లిండ్లు ♦ నమ్మనములు
నత్తగోడలియాట ♦ నాలుమగనియాట, తాటిచెట్లాట కో ♦ లాటములును
పింపిళ్లుఁ జెండుగో ♦ రింపులు వామన, గుంతలు వెన్నెల ♦ కుప్పలాది (గూఁడి
గీ. మఱియుఁ బుడికిళ్లు మొదలుగా ♦ మనసువచ్చు, నాటలన్నియుఁ దోడితో ♦ య్యాలులఁ
పడుచువనమున వేడుక ♦ పడుచునాడు, ముద్దరాండ్రకు నల్లారు ♦ ముద్దుగాను.
దశావతారచరిత్రము, ఆ 8.

సీసమాలిక. దూచియు జాబిల్లి♦బూచి కన్నులకచ్చి, గుడిగుడిగుంచాలు♦కుంటెనగిరి
చీకటిమొటికాయ♦ చింతాకుచుణుదులు, పులియాటలును జిట్ల♦పొట్లకాయ
తూరనడుక్కాలు♦ తూనిగతానిగ, చిడుగుడు మొకమాట♦చిల్లకట్టె
దాఁగిలిమూఁతలు♦ తనుబిల్లయాలాకి, గుబ్బట గురిగింజ♦ కొండకోఁతి
చిక్కణబిల్లయు♦ జెల్లెము గొడుగును, బిల్లబిద్యము లక్క♦ఒక్కడండ
గడ్డెనబోడియొ♦క్కపిక్కొక్క బరిగాయ, పోటుగీరనగింజ♦ బొంగరములు
పెంచులబేరిదో♦పిల్లుగాలిపటంబు, సరిబేసి పుటచెండు♦ చాకిమూట
గోట దొర్లుడుకాయ♦గొబ్బిళ్ళమోపిళ్లు, నీగపోగిసబంతి♦మాగిలాట
వెన్నెలకుప్పలు♦ వేళ్లిలుబొట్టగ గిరి,సింగన్నవత్తియుఁ♦ జిందుపటుపు
గచ్చకాయలు కిఱ్ఱు♦ గానుగతిప్పుళ్లు, గుజ్జపెక్కుడు మంటి♦గూళ్ళనూళ్ళ
కాలికంచంబును♦ గట్టెగుజ్జము వినా,యకుతిరితూనె కో♦ట్లాటచెమటా
కాయొత్తుగొడుగు బొం♦గరము రామన్నాట, పొడుగుళ్ళ నుయ్యాల♦బోర్లపక్క
బండ్లికలును జొప్ప♦బెండ్లమంచంబులు, గంగెద్దులాటలు♦ గనికెమండ
వీసెగాజులు పోతు♦టీనెగుజ్జంబులు, నాల్గుకంబాలాట♦ నట్టకోతి
దంటికిన్నరమంటి♦ గంటిపోట్లాటలు, సింగన్న దాఁటులు♦ జిగురుశాతి
దాబాటలను మంచి♦తాటాకు చక్రచ,క్రాలత్రిప్పుడుతోఁచి♦గాయపదుపు
పాడుపాతరమాళ్ళ♦పాతరల్ బంతులు, చిమ్మనగ్రోవులు♦ చిఱ్ఱుబుఱ్ఱ
లాకుపీకలు జంద్రె♦లాటలు చుంద్రాళ్లు, గిలకలు చిటుకెలు♦ కీచుబూరలు
కోలాటములుపిల్లఁ♦గ్రోవులు గుమ్మడి, క్రోఁతికూఁతలు నూఁదు♦కోప్రులొడ్డు
విడుపుసెట్టునుగాయ♦ విండ్లమ్ములాటలు, పులిజూదముల్కకట్టె♦పుట్టచెండ్లు
దాయాలు సొగటాలు♦వాటాప్రియ చదరంగ,ముసుజోటురాళ్లును♦మూఁతపొడుపు
ప్రామనగుంటలు♦ వడిగుప్పిగంతులు, చెఱకులపందెముల్♦ చిమ్ముఱాయి
తుమ్మెదరేఁపుళ్ళ♦కుమ్మరసారెలు, బందారుబసవన్న♦పత్తికాయ
తిరుగుడుబిళ్ళల♦ తిప్పుళ్ళ జుఱుగుళ్ళ, చటితాళవీళలు♦ నెటికెతట్లు

గీ. తాటియాకుల చిలుకలు♦ తాళ్లపాములకటువగచాట్లప్రాంతనై♦యాడుకొనుచుఁ
జదువుపై సంధ్యపై నాస్థ♦ చాలలేక, పొల్చె నీరీతి నేప్రొద్దు♦పుచ్చుచుండ.

హంసవింశతి, ఆ 3 పద్య 146.

సీ. బొమ్మలపెండ్లిండ్లు♦ బువ్వాఁపుబంతులు, పుణికెప్పనిట్టుక్కి♦ బొమ్మరిండ్లు
గుజగజరేకులు♦ గొబ్బిళ్ళునీగెగ, బుడిగిచ్చు జాబిల్లి♦ పుక్కటిల్లు

గుజ్జెనగూడులః ♦ కోలుకోలన్నలు, గీరనగింజలు ♦ పొరుపట్లు
పిప్పిళ్ళు త్రొక్కుళ్లు ♦ చేడిసె తిరుగుళ్ళు, నచ్చనగండ్లు దా♦యాలు పొన్లు
గీ. లడరు వామనగుంట లా♦డైనయట్టి, యాటపాటలఁ బ్రొద్దుపో♦నుఁగుఁజెలులఁ
బాయకచరించు బాలకీ♦ప్రియ మేల, వచ్చెవిరహాగ్ని యిటులేల♦ హెచ్చెననుచు.

హంసవింశతి, ఆ 5 పద్య 155.

—♦ దాఁగుమూఁతలు. ♦—

సీ. తరుణులు తనతోడ♦దాఁగుమూఁతలనాడ, వారికై పొదరిండ్లు♦బడి వెదకును
వెదకి యొక్కొకరిని ♦ వీపులపై కొండు, లానగాఁ బర్వెత్తి ♦ తాను గెల్చి
గెల్చితి నేనని ♦ కేరింత లాడుచుఁ, బొదరిండ్లలో పలఁ ♦ బ్రొంచి దాఁగు
దాఁగితివాకృష్ణ ♦ తరిమిపట్టెద మంచు, చెలులు వెంటాడిన ♦ చెదరియురుకు
గీ. దొరకనొకమాటుతనజాడ♦దోఁపకుండ, దాఁగునొకమాటు వెలపలై♦ తానెవచ్చు
తన్ను వెదుకంగ నింతులఁ♦దానె పిలుచు, దాఁగుమూఁతలకృష్ణుఁడు♦తరుణులలర.

బృందావనవిహారము, ఆ 3.

—♦ డోలికావిహారము. ♦—

సీ. కెమ్మోవితావికే♦గిమ్ముతుమ్మెదగమి, తూలెడుకురులలోఁ ♦ దోడిబడంగఁ
జలితకర్ణోత్పల♦దళముల క్రాంతిన, పాంగదీపులు వెంటఁ ♦ బరపు గాఁగ
సీమంతమునఁబొల్చు ♦ సేసముత్తియములు, జెరయుగుమ్మడికమ్మ♦విరులఁదొరుఁగ
నాందోళవత్క్రాంతి ♦ నమరుపాలిండ్లపైఁ, జెమటబొట్టులు హార♦సమితిఁబ్రోవ
గీ. వశులలార్పునవలిక్కాను ♦ బలిసినిలువఁ, జూచువారిచూడ్కికినొప్పు♦చూర లిడుచు
లీలఁబాడుచుఁదీఁగయుయ్యాలనెక్కి, పోయియూఁపఁగనొప్పారెఁ♦బొలఁతియొర్తు.

నృసింహపురాణము, ఆ 2 పద్య 85.

మ. తమిఁబూఁదీఁగెల తూఁగుటుయ్యెలలఁ బం♦తాలాడుచుం దూఁగు నా
కొమరుంబ్రాయపుగబ్బిగుబ్బెతలయం♦ఘ్రుల్ చక్కఁగాఁ జాఁగి మిం
టిమొగంబై చనుదెంచు తీవఁగనుగొం♦చే దివ్యసూనీంద్రి నా
కమ్మగీనేత్రిలమీఁదఁ గయ్యమునకుం ♦ గాల్ దాఁచులా గొప్పెడున్. $246_{2}$

కళాపూర్ణోదయము, ఆ 1 పద్య 147.

క. చెలి తీవయుయ్యె లూఁగఁగఁ, వలరుంజడయున్ మొగంబు ♦ నలుక మెయిన్ జా
ఱిలి దండిదగుల నెలయూన్, దుఃఖుల వెనుకకును గదిమి ♦ తోఁపిపాడు రహిన్.

యయాతిచరిత్రము.

శా. పువ్వుందీవెలతూఁగుటుయ్యెలలసొం◆పుల్ నింపఁగాఁ దూఁగు న
వ్వవ్వంబోఁడుల గబ్బిగుబ్బవలిపెం◆బుల్ జారి వర్తింపఁగా
నవ్వేళ న్సరిదూఁగ రమ్మనుచు భూ◆షారావభాషార్భటిం
గ్రొవ్వు ల్మీఱఁగ వేల్పుజవ్వనులకుం ◆ గోం గిచ్చిన ట్లొప్పెడిన్. 2464

రాజవాహనవిజయము, ఆ 3 పద్య 90.

క. చరణనఖముఖసరోజము, లురువడి నుడువిధుల నోరయ ◆ నుయ్యాల లూఁగె
న్విరిదీఁగె లెక్కి యొకచెలి, తరుణిం గనువారి గెల్వఁ◆దాఁ జనె ననఁగన్.

మిత్రవిందాపరిణయము, కుం. ౫ం.

క. మిన్నంటఁ బదములుం దల, యున్నుయ్యెలమీఁదనుండి ◆ యటునిటుఁ దూఁగన్
వెన్నునిపాదము మదమునఁ, దన్నినదోసంబు దొలఁగఁ ◆ దలవాఁచె ననన్. 2466

బహులాశ్వచరిత్రము, ఆ 2 పద్య 32.

చ. సరిపిరి డోలికావిహృతి ◆ సాటికిబేటికి నింతు లిద్దఱం
దుల నొకకన్నె తన్నె నొక ◆ తొయ్యలి యుయ్యెలతీఁగపగ్గ మ
వ్వెలఁదియుఁ దన్నె నన్నెలఁత ◆ వేనలిఁ జూడక త్రాడుదన్నువా
రలతలఁదన్నువారలఁడి◆రా మదిరాక్షి చెలంగి రత్తఱిన్. 2467

రామాభ్యుదయము, ఆ 1.

ఉ. బంగరుగిల్కుటందియలు ◆ పై కెగఁద్రోచి మెఱుంగుపావడల్
చెంగు లమర్చికట్టి పయి◆చేలము కాంచికల న్బిగించి యా
పొంగుచు నాత్మసచ్చరిత◆ముల్వడిఁబాడుచుఁ దీవయుయ్యెలం
జెంగటనూఁగు కిన్నరుల ◆ చిన్నిపొలంతులఁ జూచె వేడ్కతోన్. 2468

ఉ. ఉస్సని యూఁగఁ గాంచికలు ◆ నూడఁగ నందెలుజారి ఘల్లునం
గ్రిస్సినకాలులాడ నెఱి◆గుబ్బలపైతెయుదలాడఁగా సరుల్
దిస్సినకొప్పుజాఱ మయి ◆ దీవలస్వేదములూర వారుభూ
యస్సురతప్రసక్తలక్రి◆యన్ నృపమౌళి కొనచ్చి రింపులన్. 2469

శంతనూపాఖ్యానము, ఆ 1 పద్య 59, 60.

—◆ రాసక్రీడ. ◆—

ఉ. ఆసమయంబునన్ విభుఁడ ◆ నంతుఁడు కృష్ణుఁడు చిత్రమూర్తియై
చేసెను మండలభ్రమణ◆శీలపరిస్ఫురసక్తబాహుకాం

తానువిలాసమున్ బహువి♦ధస్ఫురితానన హస్తపాదవి
న్యాసము రాసమున్ గృతవి♦యచ్చరనేత్రమనోవికాసమున్. 2470

చ. నడుములు వీఁగి యాడఁ జిఱు♦నవ్వులు నివ్వటిలంగ హారముల్
సుడివడ మేఖలల్ వదలఁ♦జూడ్కి మెఱుంగులు పర్వ ఘర్మముల్
వొడమఁ గురుల్ చలింప శ్రుతి♦భూషణముల్ మెఱయన్ సకృష్ణలై
పడఁతుక లాడుచుం జెలఁగి ♦ పాడిరి మేఘతటిల్లతాప్రభన్. 2471

క. అంకరహితేందువదనలు, పంకజలోచనునిఁ గూడి ♦ పరఁగ నటింపం
గింకిణుల నూపురంబుల, కంకణముల మ్రోఁత లెసఁగెఁ ♦ గర్ణోత్సవమై. 2472

క. హరిణీనయనలతోడను, హరి రాసక్రీడ సేయ ♦ నంబరవీథిన్
సురనాథులు భార్యలతో, సొరిది విమానంబు లెక్కి ♦ చూచి రిలేశా. 2473

క. కురిసెం బువ్వులవానలు, మొరసెన్ దుందుభులు మింట ♦ ముదితలు దారున్
సరసన్ గంధర్వపతుల్, వరుసన్ హరిఁ బాడి రపుడు ♦ వసుధాధీశా. 2474

క. రామలతోడను రాసము, రామానుజుఁ డాడఁ జూచి ♦ రాగిల్లి మనో
రాములమీఁద వియచ్చర, రామలు మూర్ఛిల్లి పడిరి ♦ రాజకులేంద్రా. 2475

క. తారాధిపనిభవదనలు, తారాధిపవంశ్యు గూడి ♦ తారు నటింపం
దారలతోడ సుధాంశుఁడు, దారున వీక్షింప రేయి ♦ దడవుగ జరగెన్. 2476

మ. యమునాకంకణచారియై వనజపు♦ష్పామోదసంచారియై
రమణీఘర్మనివారియై మదవతీ♦రాసశ్రమోత్తారియై
ప్రమదామానసనవ్యభవ్యసుఖసం♦పత్కారియై చేరి యా
కమలాక్షుం బలరంగ గాలి విసరెం ♦ గల్యాణభావంబునన్. 2477

చ. ప్రమద యొకర్తు మాధవుఁడు ♦ పాడ విపంచి ధరించి కేల సం
భ్రమమునఁ దంత్రి మీటుచుఁ ద♦రంబుగ గానము సేసి యొక్క రా
గము దగ నాలపించి సుభ♦గస్వరజాతులు వేఱువేఱ కా
నమరఁగఁ బాడెఁ దన్ రమణుఁ♦డౌ నన దారువు లంకురింపఁగన్. 2478

క. ఆడుచుఁ బాడుచు నందొక, చేడియ మంజీరమంజు ♦ శింజిత మమరం
గూడి హరికరము సనుఁగవ, పై డాయఁగ నిలిపె జఘన♦భారాలసయై. 2479

క. చందనలిప్తంబై యఱ, విందామోదమున నొప్పు ♦ విపులభుజము గో
విందుఁ డొకతరుణిమూఁపునఁ, జొందించిన నది చెమర్చి ♦ పులకించె నృపా.

సీ. చెలువయొక్కతె చెక్కుఁ ◆ జెక్కుతో మోపిన, విభుఁడు దాంబూలచ◆ర్వితము వెట్టె
నాడుచు నొకలేమ ◆ యలసినఁ బ్రాణేశుఁ, డున్నతదోస్తంభ◆మూఁతఁ జేసె
జెమరించి యొకభామ ◆ సేరినఁ గొనగోరఁ, జతురుఁడు కుచఘర్మ◆జలము వాపె
నలకంబు లొకయింతి◆కలికిలేఁ జెక్కుల. నంటినఁ బ్రియుఁడు పా◆యంగ దువ్వెఁ
ఆ. బడఁతి యొకతె పాట◆వాడి డస్సిన నధ, రామృతమున నాథుఁ◆డాదరించె
వీర మొక్కసతికి ◆ సంసావృతం బైనఁ, గాంతుఁ డురముఁ జేర్చి◆కౌఁగిలించె.
క. హాసంబులఁ గరతలవి, న్యాసంబుల దర్శనముల ◆ నాలాపములన్
రాసశ్రాంతల నాహరి, సేసెన్ మన్ననలు కరుణ ◆ సేసి నరేంద్రా. 2482
క. హరి తనుసంగసుఖంబునఁ, బరవశలై వ్రేత లెల్లఁ ◆ బయ్యెదలు నిజాం
బరములు నెఱుఁగమి చోద్యమె, సురసతు లీక్షించి కరఁగి ◆ చొక్కిరి మింటన్.

భాగవతము, 10 స్కం. పూర్వ పద్య 1080—1095.

## గృహవర్ణనము.

సీ. నగిసీపనులమించు ◆ నిగనిగజిగిగుల్క, గంబము ల్దూలముల్ ◆ గళిగివింత
సంతనదగు చూరు◆చక్యంబుపల్కుల, జిగిసరంబీకిరింద ◆ జిల్గుమే ల్క
లంకారిచాదినీ ◆ లాంతరు ల్వ్రేలుఁగ ము,క్తాచూర్ణపరిలిప్త◆ధాగధగ్య దు
భిత్తిభాగాదిశో◆భిత గోపగోపికా, బహుళకేళీచిత్ర◆పటము లమర
గీ. తళుకు లిలఁ జిల్కు నిల్వుట◆ద్దములగములు, మజిహమీరు ఘనందైన ◆ ఘరుః
చెలఁగు గృహములు గట్టించి ◆ యెలమినందు, మించి యయ్యింతితోఁ బ్రవే◆శించిరపు

కవిచకోరచంద్రోదయము, ఆ 4డు.

## —◆ బ్రాహ్మణగృహము. ◆—

సీ. అరఁగులనున్న ప్ర◆ లెజమట్టిపట్టెలు, దీర్చినగోడలు ◆ తేజరిల్ల
నిండునున్న పుఁబూఁత ◆ నెఱచాలు బోదెలు, దిద్దిన దేవర◆మిద్దెదనర
నారికేళపుమట్ట ◆ తీరుగానలికిన, ముంగిలిమలెసాల ◆ ముద్దుగులుకఁ
బంచవన్నియ ముగ్గు◆పద్మములొప్పించిన, బృందావనము లొఁగి◆లందె వెలయ
గీ. నుదికినమడుంగుదోవతు◆లుంచి సట్టి, దండె వౌపాసనము సేయు ◆ కుండ మమర
బడలిక లడంచు పసపాకు ◆ పందిలలర, నొందు నాబ్రాహ్మణుని గృహం◆బుత్పలాక్షి.

హంసవింశతి, ఆ 1 పద్య 151.

సీ. బలుకంచుగుబ్బబో◆ గ్గాలుపులు తీసెల, వాకిలి నడవ చా◆వడియు మగులొ
నఖిలవస్తువుల ధా◆న్యములకణంజలు, దేవతార్చనమిద్దె ◆ తావిపడక
యిలువంటకొట్టంబు ◆ పలుగాఁడి పసిదొడ్డి, పసపోకు పందిరి ◆ బావి తోట
మడిసంచిదోవతి ◆ మడతవేల్దిండెంబు, ధమనికుండంబు బృం◆దావనంబు
గీ. నక్షతలచిప్పసాన చిం◆తాగ్రిసనమును, గిండిచిటిచాపపళ్యెంబు ◆ గిన్నె పెట్టె
కలశసమిత్పత్త్రిములు పెట్టు◆గొప్పయటుక, యమరఁగాఁపురముండున◆య్యగ్రజుండు.

హంసవింశతి, ఆ 2 పద్య 137.

సీ. అలికి ముగ్గులువెట్టి◆నట్టేతిన్నెలు కంచు, బోరుతల్పులు పాలు◆వోసిచాల
యూర్చవచ్చునసంగ ◆ నొనరు చోవడితాళు, వారంబు చిన్నిగ◆వాక్షు లమరు
వంట కొట్టము చిలు◆వాన మించినమిద్దె, పట్టెమంచముతోడి ◆ పడుకటిల్లు
పడసాలముంగిలి ◆ పందిరిపసిగాఁడి, కాయధాన్యములున్న ◆ కణఁజములును
పెరటిలో నారికేళజం◆బీరముఖ్య, నిఖిలఫలవృక్షములు మంచి◆నీళ్లబావి
మర నయ్యింట నిత్యక◆ళ్యాణములును, బచ్చతోరణములుమించఁ◆బరఁగునతఁడు.

శుకసప్తతి, ఆ 3.

## వైశ్యగృహము.

క. జెయబీగములావు ◆ గొలుసులోపలియడ్డ, మూగ్రినుబోగ్గాలుపులు ◆ మగులుగోడ
కుధాన్యంబుల ◆ కణఁజము ల్బియ్యంపు, గరిసెలు దినుసులు◆గల కొటార్లు
మ. చిల్లరలు న◆మ్మెడుదుకాణము బచ్చు, నులిగె బొక్కసపిల్లు◆మచ్చులుఁదులఁ
ణముల్ నాణెము◆ల్గలకట్లసంచిగోతము లెక్కకడితెంబు ◆ డడము భరణి
క్కడి సమస్తవస్తువు◆ల్గనరునటుక, బొవినుగ్గులకుచ్చెల ◆ పాఁడిపసుల
గాఁడిజాలాదిదివెగూఁడు ◆ గాబుతొట్టి, యొప్పధనచిత్తుఁడను పేరి◆యుండునచట.

జాజికాయలు రాస్న ◆ జాపత్రియుహరిద్ర, నాగరగంధక ◆ నాభిరసము
లతిమధురంబుదు◆త్తాభ్రకశైలాశిలా, జిత్తులు మురుదారు ◆ సింగు హింగు
పన్నభేదియు వస◆యక్కలకరపంచ, లవణద్రవ్యములు బో◆ళము మణిశిల
పిప్పళ్ళు కోష్టావు ◆ పిప్పలీమూలంబు, హరిదళనాగకే◆సరము లింగి
గీ. లీకము సదాపవేళ్ళు ధా◆న్యాకములును, గటుకరోహిణి పటిక జం◆గాలపచ్చ
కర్పరియుఁగారవియు రేణు◆కమతివస యుఁ, దాళకము మాంసనఖము నే◆పాళములును.
సీ. క్షారపాషాణములు నభ్ర◆కంబు లైదు, గ్రంథి తగరంబును యవాని◆కాద్వయంబు
కచ్చురములుఘరాటి వెలు◆గ్గులు కుళుష్ఠ, కుసుమములు వందురవ్వ యు◆ లెసఁగఁగలవు.

సీ. గంటుభారంగియుఁ ♦ గంకుష్టమును మెంతి, మంజిష్ఠ జిలకఱ్ఱ♦మ్రానిపసపు
విషకంటకాలాఘ్ను ♦ వేతసంబుసునీరు, చించలంబును బులి ♦ చించలంబు
జీరకంబును నల్ల♦జిలకఱ్ఱపుష్కర, మూలంబు కాంపిల్య♦మునుసముద్ర
ఫేనంబు ధాతకీ♦సూనంబు సాసువు,లుప్పళులును గజ♦పిప్పలియును
గీ. గాకమాచియు స్థౌణేయ♦కంబుచిత్ర, మూలగోరోచనములుఁ గా♦పోతతార్క్ష్య
శైలసౌవీరరసముఖాం♦జనములు వెలి, గాగమును గల్గి యీండ్లు న♦బ్బేరియుంట.
సీ. వింతగాఁ బుంజీభ♦వించి నానాధాన్య,ములరాసు లుండెడి ♦ నిలయములును
సకలరత్నాకర♦స్థలములై యేకీభ,వించి విస్మయ మిచ్చు ♦ వేశ్మతతులు
నఖిలదేశంబుల ♦ నమరునానౌషులపుం,జీభవించిన చిత్ర♦గేహములును
జీనిచీనాంబరా♦నూనబృందంబుల, మందీభవించిన ♦ మందిరములు
గీ. సర్వరసవర్గములు టంక♦సాలవేఱియు, చావడి హవాదినుసు మేలు♦పరకుఁగలిగి
నాల్గుదిక్కుల పేఁటల ♦ నగరజనుల, కలరఁ నమ్ముచు ధనచిత్తుఁ♦డచట వెలయు.

హంసవింశతి, ఆ 2 పద్య 226, 227, 228, 229, 231.

## —♦ శూద్రగృహము. ♦—

సీ. ముంగిటఁ బులిజూద♦ములుగీచియుండిన. రచ్చబండలు గొప్ప♦ప్రహరిగోడ
పంచదిన్నెలు చాదు♦పట్టెలు ముమ్మూల, గూండ్లుదీర్చినయట్టి ♦ గోడ లలరు
దేవరచవిక పం♦దిరి కోళ్ళగూఁడులు, గొఱ్ఱుగుంటుక కాడి♦క్రొత్తపల్లు
లట్టువగల గాఁడి♦కొట్టంబు పలుగడి, కంపపాతినలేగ♦కదుపుదొడ్డి
గీ. ప్రత్తిగూటంబు తొట్టియుఁ ♦ బలక పీఁట, బావి పిడకలకుచ్చెల ♦ పసులమేపు
మంగలము దాలి ఱో లుల్క♦మాగినసందు, గలిగివిలసిల్లునాతని♦నిలయమెప్పుడు.

హంసవింశతి, ఆ 4 పద్య ఆ 4 పద్య 124.

## —♦ రెడ్డిగృహము. ♦—

సీ. అచ్చమై వాకిట ♦ రచ్చబాయి మెఱుంగు, పంచెతిన్నెలు గొప్ప♦పారిగోడ
కంపతెట్టులును రా♦కట్టు ముంగిలి మల్లె, సాలె దేవరయఱ♦చవికె యొకటి
కోళ్ళగూండ్లును గొఱ్ఱు♦తుఱుగాఁడి యేడికో,లలు కాఁడి పలుపులు♦గలుగునట్టుక
దూడలు పెనుమావ♦కోడెలు తుఱుగాఁడి, గిత్తలీనినమెటి♦గిడ్డదొడ్డి (మురుబ్బ
గీ. యిఱుకుమాగినుపెరంటిలో♦నెక్కుబావి, మునుఁగలును జొప్ప పెనువామి ♦ జను
పగోలు పిడికెలకుచ్చెల ♦ దాలిగుంత, దనర నిరతంబు వెలయు నా♦తనిగృహంబు.

శుకసప్తతి, ఆ 2.

## బలిజెగృహము.

చ. తెరఁగగు లావుకంట్లములు తండిగముల్ సలకల్ పడెల్గుఁ దూ
గఁటములు [illegible]ంపు లడిగంబులు పంబులు తాళ్ళిడుకట్లు మం
కెనములు గోతము ల్నగలు గెంటెపుబోరెము లాతనింటిలో
గణన కశక్యమై వెలయుఁ గంజసమానవిశాలలోచనా. 2494

సీ. గూటపుతిరుగుప్పు కొలికిదామెనత్రాప్పు, కంచళికెముకలి కదురుకోల
మజ్జిగజమును మోడి మెఱుఁగుగాఁదీసిన, పిల్లచుట్టలు నల్లబిళ్ళ వల్లె
తాళ్ళిప్పుమ బురికొనల్లబ్బనములును సి,గంతెలు నక్లైన కట్లైలసిమ
బలుపొన్నుల్లలరారు బగినగూటంబులు, పెనుజోగిపట్లైప్పు పిల్లపట్లై
గీ. డలును బూవులకోరగి న్నెలువిభూతి, పండ్లు గంగాళమును గుసి గెండ్లిపాల
మర్రిబరణియు రుద్రాక్షమాలికాస, మూహములుగల్గి యుండుఁ దద్గేహమునను.
హంసవింశతి, ఆ 5 పద్య 97, 98.

## తిలఘాతకగృహము.

గీ. గానిగె కడెంబు మోకులు గడ్డపార, కాడి సిద్దెలు గూటంబు కడవజల్లి
గంప కమగంత తక్కెడి గట్టిరొద్దు, చుట్టుచవికెయు సర్వవస్తువులుఁ దనరు.
హంసవింశతి, ఆ 5 పద్య 205.

గీ. వెల్లిగిసెనూనె కుసునూనె వెత్తినూనె, నల్లనూ నిప్పనూనెయుఁ దెల్లనూనె
కుసుమగాముగ కుండలు గొబ్బెరయును, నూనెపోగనూనెతగిరెసనూనెమఱియు.
శుకసప్తతి, ఆ 5 పద్య 2౦6.

## వేశ్యాగృహము.

సీ. బకదారులోకదాతి శుకశారులెనయుమూ, సికెదారి చెల్లెండ్రనిలయు మమరు
ముంగిట నిడు తిన్నెమూయనిమద్దెల, కుట్లదండియుఁ గుడి కూటిగుండ
కోపెం టెక్కెంబు గుడ్డవాసెన కొంగు, కుంటెన కొండిగాఁడింటిబంటు
బోజుగిడ్డకావలి బుడుతగోడుంగుల, గబ్బిగుండడు రసమబ్బువెజ్జు
గీ. ముందు బొడ్డాసఁ బాఁతినముసుఁగుజాటు, చిగురుచల్లనిబలుపూఁత చెందిరంపు
వానబోలికట్టు గేస్తురాలు స్తరించు, నూరబవినీఁడుగల గృహం బొరపివిటుఁడు.
బహులాశ్వచరిత్రము, ఆ 5.

## —♦ వేశ్యాకేళిగృహము. —

సీ. ముదుఁగుఁదామరక్రింద ♦ నడఁగుక్రొంబఱపుతో, నకినెలపట్టిమం♦చపుగటంబు
డక్కరినేస్తకాం♦(డకునిడ్డ జగపీఁట, తళుకుబంగరుకాసెఁ ♦ దగులుతోగులు
వేతెఱమొక్కలందుకై ♦విటమోహమున నూఱు, బాగాలు వైచు క♦(డ్రంపుబరణి
తెల్లజిల్లెడుపేలు♦పిళ్ళారిదినెగూడు, గాజుటద్దము కాపు♦కరవటంబు
గీ. పట్టుపుట్టంబు సొగటాల♦పాళి నేఁత, (డ్రాఁతచిటిచాఁప మంచిపీ♦పంచిమంచి
సుతులుగూడినదండియ ♦ సొంపుగన్న, పడుకయిలుసొచ్చెనప్పుడ♦పణ్యమహిళ.
క. ఆలరుందావియుగంధపు, వలపున్ సాంబ్రాణిధూప♦వాసన యిలువా
కిలి సారముంచిన విటమణి, కలకాలం బిచట (బదుకఁ ♦ గాఁదగు ననియెన్.
మ. రణనాళీకచరాలుతక్కలరవీ ♦ రంగద్విటంకంబు టెం
కణలబ్ధాంగణవేదికాభవనభ♦క్కత్కారమామోదనా
చణశయ్యాతలపీతశు(భపటవా♦సభ్రాజిపేటీక మ
గ్గణికాకేళినికేతనంబు విటవ♦ర్గస్వర్గ మీక్షించుచున్. 2501

బహులాశ్వచరిత్రము, ఆ 5.

## —♦ సూతికాగృహము. ♦—

సీ. మణిగణద్యుతికి మా♦ర్కొలయుదీప్తులరేయుఁ, బగలునుశెలుఁగుదీ♦పములగములు
నిరుచక్కియలదారి ♦ కెలమిఁ గాఁపుగ నుల్లి, పొట్టుగప్పిన యగ్ని♦పొగలతెగలు
ద్వారమూలమూల నం♦దముగ నుంచినదీర్ఘ,శాఖోటకుటనమి♦త్సముదయములు
నిదసందుదివముందు♦రొదసేయఁ దగదని, పల్లుకువృద్ధాంగనా ♦ పరిజనములు
గీ. గలిగి తత్తత్ప్రదేశసం♦ఘటితపూర్గ, కుంభకరంభాతటస్తంభ ♦ జృంభమాణ
పితవితానపతాకాభి♦నుతవిభూతిఁ, గాంచి యొప్పారెఁ దత్సూతి♦కాగృహంబు.

వాసవదత్తాపరిణయము, వ. శ్రీ. ఆ 2 పద్య 58.

సీ. ఉల్లిపాట్టావాలు ♦ నుముక రాఁజెడుపొగ, బ్రడపల పొదిగిళ్ళఁ♦(గమ్మకొనఁగ
గుమ్మంపుఁబైవంకఁ ♦ గుచ్చినపచ్చిభూ, తులసిమాబీరతోఁ ♦ గలపివేప్రల
బాహ్యద్వయమునందు♦(వ్రాపినగోమయా, ప్రతిమలస్పష్టాంగ ♦ భంగిఁదోఁప
నింగువపొంగింపు ♦ లెసఁగింపఁబొసఁగిన, కటుగంధమెల్లెడఁ ♦ గడలుకొనఁగఁ
గీ. జమురు ముంచి వెలింగించి♦సంజ నిడిన, దృష్టిదీపాలవెలిమిడి ♦ తెట్టె లలర
గాఁపుగూర్చిన తత్సూతి♦కాగృహంబు, నాగ్రహంబున నేగ్రహం♦బావహించు.

మహేంద్రవిజయము, ఆ 4 పద్య 124.

## —◆ స్త్రీశూన్యగృహము. ◆—

సీ. చంద్రిక లేని ని◆శాగగనము మాడ్కి, శారిక లేని పం◆జరము కరణి
నళినసంతతి లేని ◆ కొలని కైవడి రేయి, దీపిక లేని మం◆దిరము పగిది
నానైకఫలరాజి◆లేని యారామంబు,గతి నాస లేని వ◆క్త్రంబు భంగిఁ
జెలఁగు కోయిల లేని ◆ యెలమావిచాడ్పున, నినదీప్తి లేని దు◆ర్దినము నట్లు
ఆ. చారుమౌర్వి లేని ◆ చాపదండము నోజ, లలితతంత్రి లేని ◆ యొళగుపోలె
నవవితనయ లేని ◆ యావాస మంతయుఁ, బాడువాఱియుండెఁ ◆ బార్థివుండ. 2504

భాస్కరరామాయణము, అర. పద్య 254.

## —◆ వంటపూఁటియిల్లు. ◆—

ఉ. కప్పురభోగివంటకము ◆ కమ్మనిగోధుమపిండివంటయున్
గుప్పెడు పంచదారయును ◆ గ్రొత్తగఁ గాచిన యావునే పెన
ర్పప్పును గొమ్మువల్లనఁటి ◆ పండ్లును నాలుగైదునంజులున్
లప్పలతోడ గ్రొమ్మెఱుఁగు ◆ లక్ష్మణయజ్వాలయింట గూరకున్. 2505

క్రీడాభిరామము.

గీ. కంటిఁ బాంధజనాహ్వాన◆కారి మృదుల, వాతపోతచలత్పట◆కేతనాంక
మై మదీయశ్రమచ్ఛిదా◆హారి యగుచు, నలరు నొక వంటకూలి యొ◆య్యారి యిల్లు.
సీ. హాళి పుట్టించె ష◆ట్ప్రయోగకల్పితానల్ప,రసపూర్ణ గాథా దు◆రంతపటిమ
రక్తి గల్పించె ధా◆రాళవాచాసుధా, మాధురీధుర్యసం◆గీతరీతిఁ
దెలియఁజేసె ననేక ◆ దేశసభాంతరా, ళీకాంతరనిక◆రప్రపంచ
మన్ఘరం బొసఁగెశ◆బ్దార్థవైచిత్రిని, బంధనోజ్జ్వలగద్య◆పద్యసమితిఁ
గీ. దద్గృహంబులకన్న కల్పిత◆తారకాయ, మానసోమసమానతు◆లైనపథిక
కథికగాయకచారుస◆త్కవులయుడర, పూర్వగంతరసల్లాప◆ములు నరేంద్ర.

శుకసప్తతి, ఆ 4.

## —◆ చాకలియిల్లు. ◆—

మ. బహిరభ్యంచితరాసభోత్కరము ఘో◆ఘోరావభాక్కుక్కురం
బహురీశోదయకాలధౌతవసనా◆యాతాచ్యుతాశీర్వచో
బహుళీంబాయతకుంభకంబు గిరికా◆బాహార్థమార్జాలమై
గృహమొప్పున్ రజకాగ్రగణ్యునకు దూ◆రీభూతదారిద్ర్యమై. 2508

శుకసప్తతి, ఆ 3.

——◆ అన్నసత్రము. ◆——

సీ. ఆజ్యపరీవాహా◆యమద్భుతంవితనుతే, సూపస్యసౌవర్ణ◆రూపమస్తి
శాకాన్నమీచీన◆పాకాన్నమానతే, భక్ష్యాళిశర్కరా◆పరిచితాని
పాయసమాధురీ◆పరమేశ్వరోవేద, జయతిరసావళీ◆సౌష్ఠవేన
శాల్యన్నధవళిమా◆శక్య తేనగదితుం,దధినుధామాధురీ◆మధికరోతి
గీ. యనుచు సకలదిగంతరా◆యాతవిప్రు, లాడుచు భుజింత్రు శ్రీహరి◆కర్పితముగ
వేంకటాద్రీశుసింగప్ప◆క్ష్మావరుండు, రమణ నర్పించు నన్నస◆త్రములయందు. 2509
మూర్తిత్రయోపాఖ్యానము, కృత్యాది.

——◆ పానీయశాల. ◆——

సీ. లవణశుంఠీజంభ◆లరసానుయుక్తమా, నీరుమజ్జిగకుండ◆బారు లలర
లఘువృత్తైలానూన◆లలితసౌరభమిశ్రి, శీతలజలకుంభ◆జాతమమర
జీరకక్షైరర్య◆చారుగంధము లొల్క, పలుచనియంబళ్ళ◆పంట్లుపనర
రవయుప్పు నీరుల్లి◆రసము నించినకోష్ణ, గంజి కాగులగుంపు◆కడు రహింప
గీ. గంధబర్హిష్టలామజ్జ◆కపరిశస్త, కాయమానముహుర్ముహు◆రాయమాన
మండపవమానఘనసార◆బృందవేది, కాలయవితాన పానీయ◆శాలలొప్పె. 2510
హంసవింశతి, ఆ 2 పద్య 159.

——◆ నేతగానియిల్లు. ◆——

సీ. కుంచె మగ్గపుగుంత◆గూటంబు పగ్గంబు, పరిటె ద్రొక్కుడుపట్టె◆పలకదోనె
పరిపరియచ్చులు◆చరికుండ యాడిత, చీడుదబ్బలుదండె◆[illegible]డెకోరివి
కోతిపుల్లలు నాల్క◆కుదుతరికొయ్యలుం, జొప్పయసూచలుం గోత◆మూరుకత్తి
కారంపుబదుగులు◆గంజెలకప్పెర, గోలములాకలు◆నీళ్లకడవ
గీ. గంప డొల్లకళాసంబు◆కదురుచెమికె, నూలురాట్నంబు జాలంబు◆గాలుగ్రోడ
వఱల నాశుభభద్రుని◆వాసభూమి, యప్పురంబున సంతతం◆బొప్పుచుండు.
హంసవింశతి, ఆ 2 పద్య 11.

——◆ నేతగాడు. ◆——

గీ. గొప్పకన్నులు చిలునవ్వు◆గులుకుమోము, బవిరిగడ్డము చక్కనై◆పరగుముక్కు
నెగుభుజంబులు విపులత్వ◆మెసగురొమ్ము, జిగిమిగులులేంగనుపట్టు◆దొగటసెట్టి.

ఉ. ఆఁటది నేర్పుతో వగల ♦ యందముఁ జందముఁ జూపఁ బూని కో
లాటము వేఁగియుక్తి వడిని ♦ లాలితపృక్తరళపరిభావభుల్
పాటిగఁ బోఁగువెంబడిని ♦ పార్శ్వములం జరియింప వస్త్రముల్
ధాటిగ నేయు నప్పలుక ♦ తట్టునఁ బెట్టు ఖణిల్ ఖణిల్లనన్. 2513

హంసవింశతి, ఆ 2 పద్య 12, 13,

—♦ రాట్నము. ♦—

కం. వడిదారము చెవులందోఁ, కుక్కుడుపలకయు దిండుకదురు ♦ గుంజలునుం ద్రో
క్కుడు బొమ్మయును ద్రిప్పుడు, పురకయును గలుగు రాట్న ♦ ములు గైకొనుచున్.

శుకసప్తతి, ఆ 2.

—♦ నూలువడకుట. ♦—

సీ. పోఁగువెంబడిఁ బర్వ ♦ పొల్చువాలుచూపుల, ధళధళల్ పొదండ ♦ కళలనీనఁ
బుంజలపురకట్లు దెం ♦ పులకుఁ బర్వెత్తుచో, మట్టెల ఖణఖణ ♦ ల్మెట్టుమ్రోయఁ
గేలెత్తుచో బాహు ♦ మూలజాతప్రభా, చకచకల్ పైఁడి వ ♦ సంతమాడఁ
బరిటఁ ద్రిప్పఁగ జాఱు ♦ పైఁటలోఁ గన్పట్టు, గుబ్బలమిసమిస ♦ ల్గొబ్బిలాడ
గీ. వింతవగ కప్పు నెఱిఁగొప్పు ♦ వీటమెఱయు, నిగనిగల్ జాతి నీలాల ♦ నిగ్గునింపఁ
గుచభరంబున నడుము కొం ♦ కుచు వడంక, నూలుఁ దోడును వేడ్క నె ♦ వ్వాలుగంటి.

హంసవింశతి, ఆ 2 పద్య 22.

చ. కరములఁ గంకణాళిఘుళు ♦ ఘుళ్ళనరాట్నముఁ ద్రిప్పువేళఁ బైఁ
టఁ దిగజాఱ వెల్కుడుకు ♦ నబ్బురపు న్నెలి గబ్బి గుబ్బపై
సరులిసుమంత చిందుగొనఁ ♦ జక్కని చూడ్కులు జూచువారిపై
దరమున గాఁపవ్వేలఁది ♦ యోర్పునఁ గండెలు సుట్టు నేర్పునన్. 2516

హంసవింశతి, ఆ 2 పద్య 23.

గీ. ఎడమ కుదెసదొడ్డుగా నెఱ్ఱిచి ♦ యేకులెల్ల, గెలనఁ బలువగవేఁ పుడు ♦ గింజలునిచి
చేపపీఁటలమీఁద వా ♦ సీనులైన, వారలైవావి వరసలు ♦ వదరికొనుచు. 2517
సీ. గుంపునంపును లేక ♦ కొనసాగఁ బ్రోఁగువెం, ట మెఱుంగుఁ జూపు పే ♦ రెములు వారఁ
బ్రాయంపుఁ బడుచులఁ ♦ బనిగొంటి వేదూది, యానెడిపాటలఁ దేనె ♦ చినుకులీన
నేకుతోఁ జెలఁగు కే ♦ లెత్తుచో భుజమూల, కాంతులు బయలు బం ♦ గారు సేయఁ
బడుక ద్రిప్పెడు రయం ♦ బునఁ బైఁటజాఱుచో, మినుకు గుబ్బలు తళు ♦ క్కునిరపింప

గీ. ముడిచికొన్నట్టి తెలిగంజి ♦ మడతచీర, లరిది తొడనిగ్గుచేఁ బసు♦పంటినట్లు
పొసఁగఁజరణాభత్రొక్కుడు♦బొమ్మమీఁద,బచ్చెనఘటింపవడికిర♦వృద్ధముఖులు.
గీ. ఎన్నికలుపట్టి పుంజంబు ♦ లేర్పరించి, పంటకట్లులుమితితోడు♦పడగలూఁచ
కండెలొనరించి చాలించి♦కాఁపుటెంతు, లున్నయవ్వేళనద్భుతం♦బుట్టిపడఁగ.
శుకసప్తతి, ఆ 2

—♦ సంత. ♦—

సీ. కలసమీఁదపుటూళ్ల♦కాఁపుగుబ్బెతలని,వ్వ్రోకికి నాకర్షింప ♦ మంత్రవిద్య
బచ్చుఁద్రాయపున్నప♦ఖవ్యూహములనెల్ల, పంఖంగ గుమిఁగూర్ప♦వల్లెత్రాడు
చిల్లరసరకుల ♦ సెట్ల బేరాలకిం, పుగలాభమొందింపఁ ♦ బూఁటకాఁపు
పెనుకోలుకాండ్రిప ♦ జనసమూహంబుల, గణితిచూపెడు♦నాయ♦కపత్రిభుండు
గీ. ముదిరిగరిటియభుజముపై ♦ మొనయఁబెట్టి, ఘంట ఖంగనిమ్రోయనం♦గట్టబడిని
మరిగితిడుగుసళాదికి♦మణియకాండ్ర, కవనిబడికాఁపు పాలింత♦నలరుసంత. 2520
హంసవింశతి, ఆ 2 పద్య 48.

—♦ రచ్చకొట్టము. ♦—

సీ కంబళాకాత్రిమిత♦త్మాభాగసవిధంబుఁ, జేరువారలతోడఁ ♦ బోరువారు
నిజదేహబహువర్ణ♦నీయవిచిత్రముల్, చెవులొగ్గువారితోఁ ♦ జెప్పువారు
నాగామిదిపసగ♦మ్యాపురాధ్వపరిమాణ, మదసెటింగినవారి ♦ నడుగువారు
క్షీరవిక్రయపరా♦భీరనారీకోటి,తోడ నవ్వుల బేర♦మాడువారు
గీ. నగ్గి గొనితెచ్చి రథ్యాత్ర♦ణాళి నైచి, సీమతిమిరోత్థితికిఁ బ్రతి♦క్షించువారు
నైనసానావనీపమా♦యాతపథికు, లమరఁ గనుపట్టు రచ్చకొ♦ట్టిముసకరిగె. 2521
శుకసప్తతి, ఆ 3.

—♦ అరాజకరాష్ట్రము. ♦—

చ. అవని యరాజకం బయిన ♦ యప్పుడ భూప్రజలందు సర్వధ
ర్మవులుఁ దొలంగు దేవముని♦ముఖ్యులు వాయుదు రొలి వృష్టి లే
దపు మతి యర్థచుల్ దఱుఁగు♦నందురు గావునఁ గాలయాపనం
బవితథవాక్య చేయక స♦యంబున రాజ్యము విల్పు మిత్రిటిన్. 2522
భారతము, ఆది. ఆ 4 పద్య 248.
సీ. పాపంబునీచేతఁ ♦ జాడ్రిపించె మనకింక, రాజు నశించిన ♦ రాజ్యమందు
బలవంతుఁడగువాఁడు ♦ బలహీనుపశుదార, హయసువర్ణాదుల ♦ నపహరించు

జారచోరాదులు ♦ సంచరింతురు ప్రజ, కన్యోన్యకలహంబు ♦ లతిశయిల్లు
వైదికంబైయున్న ♦ వర్ణాశ్రమాచార, ధర్మమించుకలేక ♦ తప్పిపోవు
ఆ. నంతమీఁద లోక ♦ లర్థకామంబులఁ, దగిలిసంచరింతు ♦ ధరణినెల్ల
వర్ణసంకరములు ♦ వచ్చును మర్కట, సారమేయకులము ♦ మేరఁబుత్రి. 2523

భాగవతము, స్కం. 2 పద్య 483.

సీ. జగతి యరాజకం ♦ బగుపట్లఁ బ్రజలందు, సకలకర్మంబులు ♦ విఫల మగును
వర్ణాశ్రమాచార ♦ నిర్ణయంబు దొలంగు, నామయం బమితంబు ♦ గా మెలంగు
జారచోరాళి ని ♦ శ్శంకఁ బ్రవర్తించు, సస్యసంశూన్యమై ♦ క్షమ గడంగు
వేదశాస్త్రంబులు ♦ విడుతు రుర్వీసురుల్, విఫలంబులై యొప్పు ♦ వృత్తతతులు
గీ. ధర్మమను నశించు నర్థంబు ♦ తఱుగు నీతి, బాధలు ఘటిల్లు ననృతంబు ♦ పరిఢవిల్లుఁ
గాన నీవింకఁ బట్టంబుఁ ♦ గట్టుకొనుము, భూతలాంకితసముద్ర ♦ భూజుఁడవగుచు.

రామచంద్రోపాఖ్యానము, వా. వేం. ఆ 3 పద్య 72.

## —♦ పాడూరు. ♦—

మ. వరఁగంగాలినయిండ్లు పేన్ప గరిసెల్ ♦ పల్లేరు లుమ్మెత్తలుం
జిటిపెంకుల్ చిగిరింతలున్ గునుకలున్ ♦ జిల్లేడులున్ మూషకో
త్కరముల్ దున్నినపెంటదిబ్బలును న ♦ క్కల్పందికొక్కుల్ దరు
ద్ఘోరుఁగంబూడినపాతఱల్ పడినగు ♦ ళ్లున్ గల్గు పాడూరిలోన్. 2525

హంసవింశతి, ఆ 5 పద్య 29.

## —♦ చండాలవాటిక. ♦—

సీ. బహువిధపశుకళే ♦ బరసమాకీర్ణంబు, దుర్గంధలహరికా ♦ నర్గళంబు
పలలభక్షణకుతూ ♦ హలసారమేయంబు, కాకగృధ్రానీక ♦ కలకలంబు
మక్షికాచ్ఛాదిత ♦ మాంసతోరణరాజి, చత్వరాస్తరణార్ద్ర ♦ చర్మపటలి
వరిబలవిట్చరఘుర్ఘు ♦ రధ్వానపూర్ణంబు, సవిధభక్షమాభాగ ♦ సంభృతాస్థి
గీ. వారుణీపానకృత్యోదు ♦ ర్వారజనిత, మదభరాలస చండాల ♦ మండలేత
రేతరానర్థకలహంప ♦ జాతరవము, గనియె మాతంగవాటము ♦ మనుజవిభుఁడు.

హరిశ్చంద్రోపాఖ్యానము, శంక. ఆ 5 పద్య 8.

## —♦ శ్మశానవాటిక. ♦—

సీ. దుర్గంధలహరికా ♦ నర్గళవాహిని, కీకసనిర్మితా ♦ నేకవేది
శవభూమభూమసం ♦ ఛాదితాసురవీథి, శోణితపద్యాపా ♦ షాణరాజి

శిథిలితఘటశకార్పం॥ చీవరఖట్వాళి, యాతతభీకరా॥ లాతపటలి
పవనసముద్ధూత॥ పాండుభసితరాసి, కేవలవ్యాకీర్ణ ॥ కేశవితతి
గీ. కాకజంబుకకాలేయ॥ కపరినాద, భూతబేతాళకహకహా॥ ద్భూతఘోష
రౌదరిముదారిదినిర్నిద్ర ॥ రుద్రభూమి, యద్ధరాజాని యద్భుతం॥ బందికాంచె.
షట్చక్రవర్తి చరిత్రము, ఆ 3 పద్య 167.

సీ. పృథుశిలాస్తంభసం॥ భృతమైనయీమంచె, నవరత్నసింహాస॥ నంబె నీకు
నరశిరఃకఠినబం॥ ధురకపాలంబులు, మంగళాచారసం॥ భములె నీకు
శూలోగ్రమానవ॥ స్థూలకేశంబులు, రమణీయమగు చామ॥ రములె నీకు
భూతబేతాళజం॥ బుకనినాదంబులు, కవిగాయకప్రసం॥ గములె నీకు
గీ. సురుచరిత్రమహాశ్మశా॥ నోపకంఠ, శాకినీలోకభయదశ్మ॥ శానభూమి
సకలరాజ్యరమానివా॥ సంబె నీకు, సత్యగుణసంపదభిరామ ॥ సార్వభౌమ. 2528
హరిశ్చంద్రోపాఖ్యానము, శంక. ఆ 5 పద్య 100.

## —॥ వేశ్యావాటిక. ॥—

గీ. కుంగఁబాలుసహస్రాంశుఁ ॥ గూడలేక, వెనుకఁజిక్కినజరదంశు॥ వితతిబోలెఁ
బొలుచునపరాహ్ణవేళ న॥ ప్పురమునందు, భానుజాలేపకాశ్మీర॥ పణ్యవీథి. 2529
శృంగారనైషధము, ఆ 2 పద్య 40.

సీ. పతిగళార్పితభుజా॥ లతికలై రతికేళి, యలసార్పుముంగిళ్ళ॥ మెలఁగువారు
నలిగియేఁగుచుఁబ్రియు॥ న్నిలిపిన నిజభుజం,గీభావ మేర్పడఁ ॥ గెరలువారు
పరులొండుకడకేఁగఁ॥ బురుషభూమికఁబూని, తెనువాఁగిభంగింపఁ॥ దివురువారు
రాకుమారులయిండ్ల॥ కేకతంబునఁ దదా,ప్తులవెంటబుడిబుడిఁ ॥ బోవువారు
గీ. మదనమంత్రిరహస్యము॥ ల్సదనవలభి, నిభృత పారావతములకు ॥ నేర్పువారు
నైన వెలయాండ్రచే నప్పు॥ రాధిరాజ, వేశవాటికచూడ్కికి ॥ వేడ్క యొసఁగె.
వసుచరిత్రము, ఆ 4 పద్య 65.

చ. అమరఁగ వింతనింపొసఁగు ॥ నందు విటాలికి వేశవాటిహ
ర్మ్యములు విమానమానహర॥ హారిశిరోగృహభాగభోగభా
గమరభుజంగసంగహృద॥ యంగమరంగదనంగసంగర
క్రమరమణీమణీమణిత॥ కల్పన నేర్చినసారువాలచేన్. 2531
కళాపూర్ణోదయము, ఆ 1 పద్య 124.

గీ. కూర్చిపంక్తుల నున్నట్టి ♦ యబ్జముఖుల, యాననంబులు వాల్గన్ను♦లంబుజములు
కలువలును దోరణంబులు ♦ గట్టినట్లు, భాసిలుం గన నొప్పాడ♦పణ్యవీథి. 2532
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 1 పద్య 27.

సీ. వారట ధ్వజధనుర్వ్యాకటద్భృంగఝుం,ఝూటఝుంఝుంక్రియా ♦ సంకులంబు
లంజికావిటమనో ♦ రంజకస్ఫుటకచ,శ్యంభళీసంభ్రమో♦జ్జృంభణంబు
క్షుద్రవేశ్యాంబికా♦యుక్తనైజప్రియా, యల్లకావనిలంత♦పల్లవంబు
గోత్రికాలాదివా♦రాత్రియూర్తిభవ, త్పాంసవేష్యాసభ♦ర్మాసనంబు
గీ. హారిలావణ్యగణ్యాప♦ణ్యాంగనాక, దంబశృంగారచేష్టావి♦డంబవివిధ
ఖేలనాపాంద్రిమదనేంద్ర♦జాలకపట, నాటకముఁ గాంచెఁబురివేశ♦వాటికంబు.
నైజయంతీవిలాసము, ఆ 3 పద్య 68.

చ. రతిపతి పుష్పలోఁట యొన♦రంగ భుజంగుల కొడ్డుమీఁట సం
తతమదవజ్వరంబునకు ♦ దట్టపుమందులమూట సౌఖ్యసం
హాతులకొబల్కు గాట మిర♦నై తగు నప్పురి నొక్కచోట శో
భితగతిఁ జెంది వేశ్యతతి♦పేఁట బుధు ల్నుతిసేయు నేటగున్. 2534
రాజశేఖరవిలాసము. ఆ 2 పద్య 97.

## ——♦. దేవాలయము. ♦

సీ. కుముదధవళప్రాకార♦గోపురంబుల చేత, విద్రుమప్రాకార ♦ వితతి చేత
మరకతహారిణీ♦మండపంబుల చేత, బహుశాతకుంభకుం♦భముల చేతఁ
జాలదీపించుమౌ♦క్తికల్లముగ్గుల చేతఁ, గనుపట్టుపట్టుమే♦ల్కట్ల చేతఁ
గమనీయపద్మరా♦గచ్ఛత్రముల చేత, వృషరాజకేతన♦శ్రేణి చేత
గీ. మహితకర్పూరధూపధూ♦మముల చేత, నవ్యమాణిక్యనీరాజ♦నముల చేత
శంఖభేరీమృదంగఘో♦షముల చేత, వెలయు నవ్విశ్వనాథుదే♦వళముఁ గాంచె.
హరిశ్చంద్రోపాఖ్యానము, శంక. ఆ 4 పద్య 20.

సీ. తప్తకాంచననిర్మి♦తస్ఫుటాంచితరత్న, దీపితోన్నతభవ్య ♦ గోపురములు
శాతకుంభస్తంభ♦సకలభేదవినోద, మణిచిత్రపుత్రికా ♦ మంటపములు
భవ్యనిర్మితదిశా♦పతివిరాజితపరి, వారదేవాలయ ♦ ప్రాభవములు
తపనీయధగధగ♦ద్ధగితకాంతివిచిత్ర, మధ్యప్రకీర్ణప్రస♦న్నమందిరములు
గీ. నవ్యభృంగీశ చండీశ♦నందికేశ, కలితపారిషదాహ్వాన ♦ గౌరవములు
గలిగి సద్భోగమోక్షప్ర♦కార మగుచు, మహిమఁ జెలువొందె మల్లేశ♦మందిరంబు.
ఒడయనంబివిలాసము, ఆ 5.

సీ. డంబైనగర్భగృ◆హం బంతరాళికం,బును ముఖమంటపం◆బును జెలంగ
గాలిమంటపము ప్రా◆కారంబులోలీలు, బోదెలు చుట్టలు ◆ పొంధుఘడఁగఁ
గప్పటచట్టము◆ ఘనగోపురమ్ములు, జగతియుఁ జప్పట◆ళ్ళానగనుగులుఁక
గచ్చుగోడలు రాతి ◆ కంబము ల్వాలసు,న్నము సువర్ణము ద్వార◆సమితి వెలయ
గీ. దృష్టిపాత్రిపుబొమ్మలు ◆ దేజరిల్ల, నులుకుసింగంబులఅగూన్య◆ మెఱుఁగుఁదోర
ణములు చిత్రవ్యాఘ్రాంబనుల్ ◆రమణకెక్క, దేవళమ్మిం చెనత్యంత◆దివ్యముగను.
హంసవింశతి, ఆ 1 పద్య 180.

సీ. రూఢిగాబహువిధ◆రుద్రసూక్తంబుల, శివునభిషేకంబు ◆ సేయువారు
గంధపుష్పాక్షతా◆గరుధూపదీపనై, వేద్యంబులిచ్చి సే◆వించువారు
శివునిసన్నిధిఁ బ్రద◆క్షిణపూర్వకంబుగా, మునుకొని పలుమాఱు◆ మ్రొక్కువారు
స్కాందపురాణాది ◆ శైవాగమములెల్ల, వీనులకింపుగా ◆ వినెడువారు
గీ. నీలగళుపాటవినుచుమై ◆ సోలువారు, శంఖమర్దళధ్వానముల్ ◆ సలుపువారు
నగుటఁ గని చోరుఁ డలరుల◆కరుగుతతిని, లలితమైనట్టి యాశివా◆లయమునందు.
శివరాత్రిమాహాత్మ్యము, లో. సో. ఆ 2.

ఉ. నీలకవాటము ల్మెఱుఁగు ◆ నిద్దపుపచ్చలమెట్లు రిక్కరా
రాలహారంగుగూన్లు మగ◆రా ల్మిగులం దవులించుచుట్టు బే
డాలు జగా వెలుంగువగ◆డా ల్దగుకంబము లొప్పునట్టి దే
వాలయ మొక్క టిమ్ముగ ధ◆రాధిపుఁ డత్తఱిఁ గాంచె మెచ్చుచున్. 2539
శకుంతలాపరిణయము, ఫ. వేం. ఆ 2.

సీ. శుంభన్మణీమయ◆స్తంభగుంభితశాత, కుంభపాంచాలికా◆దంభకాంతి
దుర్వారపర్వాబ్జ ◆ గర్వనిర్వాపణ, ధూర్వహచ్ఛత్రాళ్య◆ఖర్వలీల
డిండీరఘనఖండ ◆ మండలీఖండనో,త్సండముక్తాల్లాభ◆మండలాభ
కాంచనమంటప◆సంచయాభ్యంచిత, చంచలలోచనా◆ చంచలరుచి
గీ. వెలయఁ జెలువందుకోవెల ◆ నలరు సకల, సురవరనికరసంతత◆వరదుపళిత
జలజదళతులితనయను◆జగదధీశుఁ, గని నుతించి మునీంద్రులు◆సనిరి వేడ్క. 2540
సర్వకామదాపరిణయము, ఆ 2.

## —◆ గ్రామదేవతాలయము. ◆—

సీ. కాఁపుగుబ్బెశలు పొం◆గళ్లువెట్టినపాల, కడవచారికలపో◆క్కళ్ళత్తాం
దోరలుదెప్పించి బం◆తులుగట్టి యర్పించు, పోతేళ్లనెత్తురు◆బురదరొంపి

కోక్కిచెల్లినభుజంగ♦ము లోపంగఁ జెక్కిన, కుక్కుటపటలంబు ♦ కొక్కుగుంపు
మంత్రిముల్ ఘలియింప♦మాంత్రికుల్ పయిజోతి, వన్నె మెయించినపంచ♦వన్నెకోళ్లు
గీ. పరగ గుగ్గులుగురుధూప ♦ పరిమళంబు, శాకినీడాకినీభూత ♦ సంభ్రమంబు
చరదితప్రాణిమృత్తికా♦తురగచయము, వలమునాగంగగుడిఁజేర♦నరుగునపుడు.

శుకసప్తతి, ఆ 2.

## —♦ జాతర. ♦—

క. అతఁడిఁ దన్నగరీపతి, జాతరసాటించెఁ బశువి♦సర ఘనితరసా
ధ్యాతతవాతామయని, ఖ్యాతాహతిఁ దూల గాలి ♦ గంగల కెల్లన్. 2542
సీ. గోత్వచ్చచమురంటు♦కొనిరి మస్తకముల, జలక మాడిరి నిశా♦మిళితవారి
కట్టిరి ఛిఱుతచా♦కముల క్రొంబుట్టముల్, కాటుకదీర్చిరి ♦ కన్నుఁగవల
దిద్దిరి సిందూర♦తిలకంబు బటువుగా, నిక్కఁగొప్పులవిరుల్ ♦ గ్రుక్కి రర్థి
నింబపత్రిపాళి మా♦ల్యంబులు వైచిరి, చిట్టిపొట్టిధరించి ♦ రిట్టునట్టు
గీ. తరుణధావన దగధగ♦ద్దశనమణుల, హత్తుకొలిపిరి శేఁతవీ♦డ్యములడాలు
పర్వదినములఁ జామర♦భ్రమదలుదిత, నియమసంభావనారంభ♦నిభృతబుద్ధి. 2543
క. ఎడ్డెతనపుగయి నేతల, లడ్డులు నడచిరి పురస్స♦రద్భాగ్యముగా
గుడ్డంబుచక్కఁ గట్టం, బడ్డమహాశక్తి దివ్య♦భవనంబునకున్. 2544
సీ. అంభోధరముక్రింద♦నసియాడుస్నైరావ, తియుఁబోలె సిడివ్రేలెఁ♦దెలవ యోర్తు
చెందమ్మికొలను కం♦జిల్లునంచయుఁబోలె, నిప్పుటేటఁ జరించె ♦ నెలఁత యోర్తు
తోలుసంజయంచత♦ర్తిలునంచయునుబోలె, నీఁగెఁబందిరిగుండ♦ మింతి యోర్తు
చలినీటిపై నెక్కు♦కలువమొగ్గయుఁబోలె, ననఁటాకునర్తించె ♦ పలివ యోర్తు
గీ. కాంతయొక్కర్తు మూర్ఛన♦గండ లిచ్చె, మారుగాలిచ్చె నొకసుధా♦మధురవాణి
లలనయొకర్తు నోరితా♦ళంబు లిచ్చె, శక్తిజాతరసద్భక్తి ♦ శక్తు లెసఁగ. 2545
క. బత్తులు మనువాకత్తుల, మొత్తిరి పశుసమజముండ♦ములు చండముగా
నెత్తురుధారలు ఘోరవి, పత్తిమిరనవారుణప్ర♦భలు ప్రబలంగన్. (డఁగెఁదమము
గీ. వెలుచఁ గలుచొక్కు, చెలువల ♦ తలకు నెక్కఁ, దోనదిక్కుల తల కెక్కఁ ♦ దో
దేవిగుడిలోన నొక్కొక్క♦దివియదోఁపఁ, దోన నొక్కొక్కచుక్కయుఁ♦దోఁచె మింట.

పాండురంగమాహాత్మ్యము, ఆ 3 పద్య 73–79.

సీ, శోభనదేవతల్ ♦ సొంపుగానందంద, వాద్యభేదములజ♦వ్వాడిచెలఁగ
పక్షిధ్వజికొమ్ము లనాదు ♦ బాదులుదీర్చి, భూంత్కారరవములు ♦ భోయకొలుప

నాటకాంగనలు క♦ర్ణాటకంబులఁదీరి, ధిమితధిత్తాధిమి♦ధిమితయనఁగ
వరుసగొల్లలుదల♦వంచి చేకేళ్ళతో, చెటచెటధ్వనులుకు♦చ్చించిసేయ
గీ. కనకతప్పెటనాదముల్ ♦ గ్రిందుకొనఁగ, తగనగారాలఘణఘణా♦ఘణలు జెలఁగ
వరుస నూపురిమ్రోఁకల♦వారుకూడి, సంభ్రమముఁజూడనొప్పెనా♦సమయమరయ.

బృందావనవిహారము, ఆ 2.

## ఆకాశగమనము.

సీ. బడివాయకిలనగ♦పఙ్క్తితతితోఁ జివ్వున, నెగిరినట్లైతోఁచు ♦ మగువలార
పైపైసమీరణా♦ర్భటినింగిబోరున, నఱచినట్లైతోఁచు ♦ నతివలార
నిఖిలభూములు జవ♦నికవాబడారున, నెడిఠినట్లైతోఁచు ♦ నింతులార
ఘనఁజన వెడఁదలై ♦ శశిమేను గ్రక్కునఁ, బెరిఁగినట్లైతోఁచుఁ ♦ దరుణులార
గీ. కొండలచ్చనగండ్లయి ♦ నిండుచెఱువు, లెల్ల నద్దంపుబిళ్ళలై♦యేర్లుముత్తి
యంపుసరులై యరణ్యంపు♦గుంపులెల్ల, నారులై తోఁచుఁ జూడవున♦నారులార.

వసుచరిత్రము, ఆ 4 పద్య 59.

## కోళ్ళపందెము.

క. అంతటనితాంతహర్ష, స్వాంతయుతద్యూతజనర♦వక్షుభితహరి
ద్దంతిపఙ్క్తియై నగర, ప్రాంతంబున కోడిపదువు ♦ పందెము సాగెన్. 2551
గీ. కావిపాఁతలు దారాలు♦కట్టుముళ్ళు, ముష్టలును నీళ్ళముంతలు♦మూలికలును
గత్తులపొదుల్లు మంత్రము♦ల్కట్టుపసరు, లెనయ వచ్చిరి పందగా♦ళ్ళేపురేఁగి.
గీ. డేగ నెమిలి పింగళి కోడి ♦ డేగకాకి, వన్నెలై దింటికిరులందు♦వన్నెలందు
రాజ్యభోజనగమనని♦ద్రామరణము,లను విచారించి యుపజాతు♦లను వచించి.
చ. చోరఁబడికాంచిప్రాంతలును♦చుట్టియుఁ గత్తులు పెన్రిశి సందిటం
బెరయఁగఁబట్టి చెక్కు గఱ♦పించి గి రేర్పడ గీచి నిల్చి కొ
క్కెరయఁగ జూచి పందియపు♦టెంకువ దిద్దుచుఁ జిట్కెవేసి స
ళ్ళిరి మఱివో యటంచునసు♦శ్రీపెళిపుంజులు దన్ను లాడఁగన్. 2554

హంసవింశతి, ఆ 3 పద్య 211, 212, 213, 216.

## కుక్కుటనామవిశేషములు.

సీ. పచ్చైజుట్టుది మైల♦పుట్టమిట్టుది గూబ, చిలుకజుట్టుది మూఁగ♦చిట్టుకోడి
పట్టుమార్పుది యరక♦జుట్టుది భోరది, బూడిదెవన్నెది ♦ పొడది సెల్లు

కాలుది గుజ్జుది ♦ గాజులగాడునో, గలది పంచెట్టుది ♦ గడ్డికోళ్ళు
దెబ్బనిదురగలి ♦ దీకెలదారెమ్ము, నల్లది కొప్పుది ♦ తెల్లయురగ
గీ. పిల్లవేళ్ళది మొద్దుది ♦ నల్లయురగ, లనఁగఁదగు కత్తి కాల్పుంజు♦లందులోనఁ
బసపుపావఁచ్చు కోలంటె♦ లెసఁగునట్లు, రావిరేకలుబిరుదులు ♦ శీవి గలుగు. 2555
సీ. గరుడండు శరభంబు ♦ కంచుడమారము, రణభేరి కార్చిచ్చు ♦ రాతిబొమ్మ
రాముబాణము మిత్తి♦ రాహుత్తు డిడుగు హూవ్వీరుండు పుంజుల ♦ వేరువిత్తు
గండగత్తెర గుండె♦ గాలంబు మాష్టీఁడు, పట్టభద్రుఁడు బెట్టి♦ భైరవుండు.
కత్తులపోది సింహ♦ గాలి బేతాలుండు, పనులపాతర పోద♦ రసము ఛిలుకు
గీ. టమ్మ సుడిగాలి చక్రంబు ♦ జలజడపడి, శూలము పిరంగి వెలినక్క♦ సాలువంబు
కాశికాత్య్రింతకుఁడు పంజ♦ గాంఁడ్రు మెచ్చు, లనెడు పేరులపుంజుల♦ గొనిముగించి.

హంసవింశతి, ఆ 3 పద్య 214, 215.

## — ♦ స్వారిగుఱ్ఱము. ♦ —

సీ. పచ్చనిహురుముంజీ♦ జనివాగెపక్కెర, పారసిపల్లంబు ♦ పట్టమయము
రాణ నొప్పారు హై♦ రాణంబుసింగిణి, తఘకులకోరుల♦ తరకసంబు
మిహిపసిండిపరుంజు♦ మొహదా కెలంకుల, రావుగుజ్జరిసేఁత♦ కేవడంబు
ఢాకెలంకుననిరా♦ జీకరాచురకత్తి, కుఱఁగటఁ గ్రొవ్వాఁడి♦ గోరకలపోది
గీ. పీలికుంచెతలాటంబు♦ బేరజంబు, మణులమొగముట్టు వన్నిసా♦హిణి యొకండు
శక్తిరియొద్దుటికిఁ గొనివచ్చె ♦ గంధవాహ, బాంధవంబగునొకమహా♦ సైంధవంబు.

మనుచరిత్రము, ఆ 4 పద్య 28.

సీ. పిస్కెంపు నడకింపు♦ నునుకెంపు పల్లంబు, దీపించు పచ్చతా♦ దృష్టిదండ
శళుకొవీలంపుసిం♦ గంపుఁదలాడంబు, దండిజైమార్యంబు ♦ నిండువాగె
నిగరంపుఁబగడంపు ♦ జిగిదొట్టు మొగముట్టు, రంగారుమదిరిఁ♦ సింగిణీలు
గోమేధికంబులఁ ♦ గొమరొందుకళ్లెంబు, వజ్రాలకెలంక♦ వన్నియలునుఁ(సములఁ
గీ. గొత్తముత్తెంపుఁజల్లఁ ద♦ళ్కొత్తుజాన, మురుమధకతాళి మెలుఁగొందు♦ తరక
బసిఁడితలుపుసుగలిగిసాం♦ పెసక మెసఁగు, నుత్తమాశ్వంబుఁగొని తెచ్చె♦ నొక్కసాది.

ఉత్తరరామాయణము, ఆ 7 పద్య 397.

## — ♦ గుఱ్ఱపుస్వారి. ♦ —

చ. జడలు మలంచి చొళ్ళెముగ ♦ సన్నపుఁబాగ లడంగఁ జుట్టి చ
ల్లడములు పూని మీఁదఁ జల♦ లంబుగఁ గట్టినమట్టికాసెలం

బిడియము లంటఁదోఁపి పృథు◆భీషణబాహుల సాళువంబులన్
దడవి కెరల్చుచుం జనిరి ◆ నాథునిమోహరిల నృపాలఖండముల్. 2559

మనుచరిత్రము, ఆ 4 పద్య 30.

చ. తనహృదయంబు వెంబడిన ◆ తప్పక ఘోటక మంతవంతనే
పనుపడ నిల్పి ముందఱికిఁ◆బాఱి కెలంకులకుం దొలంగి తా
వెనుకకు నేఁగుదెంచి కడు◆వేడ్క యొనర్పఁగ బంతి యాడె నె
మ్మని గనకంపుఁగోల నడి◆మింటనె త్రిమ్మరఁ దారి కొట్టుచున్. 2560

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 2 పద్య 29.

చ. ఎగురఁగ వైచి కొట్టు టది◆యెంతభరం బని బంతి యగ్రగా
మిగ వడిఁ బాఱవైచి పుడ◆మిం బడనీకయె దాని మీఱి చి
త్రగతి హయంబుఁ దోలుచును ◆ గ్రమ్మఱ మీఁదికిఁ గొట్టియాడె విం
తగఁ దనచేతిరత్నమయ◆దండము కాంతులు గాఁడి పాఱఁగన్. 2561

సీ. తొలుదొల్త నయ్యేక◆తురగంబు మండల, గతిచారియగుచు నొ◆క్కండు తోఁచె
నావెనుకను సహా◆హాశ్వాలి చెదరక, చక్రాకృతినిబర్వ◆సరణిఁ దోఁచె
నంతట ననతిస్ఫు◆టావయవంబుగా, నెనసి యేకాంగవే◆ష్టనత దోఁచెఁ
దుదఁ దద్విభూషణ◆ద్యుతి రాజిమాత్రంబె, కొఱవిఁ ద్రిప్పినరీతి◆ మెఱసి తోఁచె
గీ. నంతకంతకు నతివేగ ◆ మగ్గలింప, రాఁగ వాగె యొచ్చరిక ప◆రాకు జియ్య
యనుజనులు జెచ్చవడితమ◆పని మఱవఁగ, బరగునమ్మేటినెఱరాతు◆ ప్రౌఢికతన.

ఉ. ఉరుజవశాలియత్తురగ◆ముల్ముకచక్రనయావలంబియై
తిరుగు రయంబుచేత నెడ◆తెరివ్వక కుమ్మరిసారెచాడ్పునన్
బరగెఁ గడున్ ధృతాభినవ◆భాండతకుం దగ నుక్కుపట్టుదాఁ
దరలక పైని దద్భ్రమణ◆దండగతిన్ హరిపుత్త్రిఁ దొప్పఁగన్. 2563

క. వల్గితముఖగతిపంచక, వల్గువిహారముల సైంధ◆వము నలయించెన్
వల్గావిభాగకుశలత, వల్గత్కుండలమరీచి ◆ వల్లరు లెసఁగన్. 2564

శా. నానావీథిగతిప్రభేదవిహృతిన్ ◆ సంతృప్తుఁడై కంతుఁడిం
పూనన్ వాగె గుదించినన్ బురువక◆ప్రోన్నమ్రపూర్వాంగమై
కానంగాఁబడియెన్ మరుజ్జవనమా ◆ గంధర్వమర్కాశ్వసం
తానస్పర్థను మిన్నువ్రాఁకెడుక్రియం◆దా నెంతయుం జూడ్కికిన్. 2565

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 2 పద్య 31, 34, 36, 37.

మ. అని చింతింప యదృచ్ఛ నచ్చెలువ త♦న్మార్గంబు వీక్షించినన్
ఘనసైన్యంబులు గొంత మించఁదన తు♦ఙ్గాణంబు తేజీఁజవు
క్కునఁ దాటించి గుదించి చిత్రరవుఁ బా♦గుల్కొల్ప నాడించె శో
భనతద్వల్గనవల్గదగ్రిమరుచి♦స్ఫాయత్కిరీటంబుతోన్. 2566

కళాపూర్ణోదయము, ఆ 5 పద్య 111.

ఉ. పక్కెరలొక్కెడం బిగియ ♦ బాగగు తంగు లమర్చి వానిపై
నెక్కటిగల్లమున్నెలిపి ♦ యింపెనఁగ న్మొగపట్టలుంచి పెం
పెక్కిన కత్తలానిగము ♦ తెక్కి ఖలీనము లూని చేతుల
న్వ్రక్కుచు వచ్చి రత్తఱిని ♦ వేలకొలందిగ సాదిసంఘముల్. 2567

కౌసల్యాపరిణయము, శ్రీ. వేం. ఆ 2.

—♦ నెత్తము. ♦—

సీ. కయ్యాధికంబుగఁ ♦ గల్లసారెలునైచి, యొక్కదాయంబుల ♦ యెడలు గడపి
యానునైనడాలుక♦త్తెనము పాసికలను, వలసినదాయంబు ♦ వైచికొనుచు
తప్పనాడినఁగని ♦ తప్పార్పవచ్చిన, శేధు లేదని తుది ♦ వాదువెట్టి

... ... ... ... ... ...

గీ. చాప్పనరుఁ దగినంతియు ♦ సంభ్రమించి, సత్యములు చేసి సభికుల ♦ సాక్షి గోరి
యతతఁబోటక తద్వాటు ♦ లైనవారిఁ, బాడియడుగుచు మందట ♦ లాడియాడి.

సీ. బలియుఁ డోడిన ధన♦ములుగొనఁజాలక, పుడుకు మ్రాఁకనియాస♦యుడుఁగువారు
ననదలు గెలిచివా♦రడిగిన నేమియు, విడువక ధనములు ♦ పడయువారు
నోడినధనమింక ♦ నాడినంగాఁ బియ్యఁ, బెట్టఁజూపొమ్మని ♦ పెనఁగువారు
గెలిచినధనమెల్లఁ ♦ బలుకప్పినప్పుడ, పెట్టెల పోనీక ♦ కట్టువారు

గీ. బొత్తుగా నాడి యోటమి♦పొత్తువారి, మీఁద లెక్కించి వంచన♦ మెఱయువారు
లంచములు గొని యెడఁబోర♦లంగఁ బలికి, పెద్దజెలయాటదగ గెలి♦పించువారు.

దశకుమారచరిత్రము, ఆ 5 పద్య 64, 65.

ఆ. వాదులానితోడ ♦ వాట్లీనితోడను, బూతుతోడఁ దిండి♦పోతుతోడ
నటమటీనితోడ ♦ నడియరితోడను, వెలకు నెత్తమాడ ♦ విరవు గాదు. 2570

సీ. కేళికి గొనరి వై♦సిక వెట్టి పలకపై, సారెలు వోయించి ♦ పరముచూచి
తనకొలంగయిననె♦త్తంబుఁ గైకొని పన్ని, పాసిక దాళించి♦పాఱ జిగి

లోహటంబులు మాని♦లులిఁ గన్నఁ జడకున్నఁ, బరదాళ మని పోవుఁ♦బలుకయిచ్చి
తప్పార్తుఁ జూ తెండు♦దాయంబులును గని, వారింపకుము పోటు♦వారిలుఁగలవు.
గీ. పంతమడిగిననీవలె ♦ భాగమింత, బోరఁ బెద్దదాయంబాడి ♦ పోరుపుచ్చి.
వైచునదిదనమునికిపో♦వచ్చు ననుచు, బేరుకొని పాటుతజిసరి♦బేసి యడిగె. 2571
క. అత్తివంచిత్తిగ దుగ, సత్తా దచ్చ్యాక వంచ ♦ చావం చీర్తై
దత్తిగ యిద్దుగబద్రలు, చిత్తంబునఁ దలఁచినట్లు ♦ చేతికిఁ దెచ్చెన్. 2572
సీ. దుగుణంబుసేసిన♦తోడ నే మూఁడని, వారించి లేదని ♦ వలుము సేసి
యూరకెత్తకు దాయ♦ముగ్గడించినఁగాని, పట్టివేయకుమని ♦ ఘటితలించి
వెడలినసారెలు ♦ వెనుకముందఱచేసి, యెత్తినపారెపో♦నీకయార్చి
సమమాయెరమ్మని♦సరసవారికినిచ్చి, గెలుపునఃమాళంబు ♦ గెరలఁజేయ
గీ. బడిసియోరైదుపూజించి♦పలకమీఁద, బలుపమునవారిసి వెలిఁబ్రాయిఁ♦దొలఁగవైచి
పన్నిపంచియొక్కటినాడఁ♦బంచివారిలుఁ, దప్పనోపతిరియమునఁ♦దానగెలిచె.
సీ. చేయదు దుగుణంబు ♦ సెలవు లేకుండిన, నెక్కనపలుకఁ బో♦నిచ్చుఁగాని
పలుకదు రోషించి ♦ పడసిపాసికలతో, నవదాయ మైనను ♦ నాడుఁగాని
యొల్లదు గోపించి ♦ యొండువెత్తము వన్న, నెచరంబు నేర్పని♦యున్నఁగాని
నడుఁకదు వంచించి♦నయ మెక్కు డడిగిన, నిలుత మింతట నన్న♦నిలుచుఁగాని
గీ. పలకదలుమక బైసిక♦పల్లటిలక, బోఁటి దూలక యాతాళ్ల♦పుచ్చుకునక
క్రిందగెలిచినవారిలు లె♦క్కింపు మనక, తప్పు నాడక తొల్లింటి♦దాక నెపక.
సీ. ఒకదాయ మాడిన ♦ నన్నదాయం బాడు, మనక వాటులు రెండు♦గొని నెలఁగి
కానేనియాటఁదాఁ♦గడచిపోయినఁజెప్పు, నెత్తంబు వడదని.♦ నేర్పుదెగడి.
యొకదాయమునకును ♦ నొంటిదాఁకినఁబోయి, యింకవై చెదనని♦యిష్టమడించి
పోయెడి నని వేరియఁ♦బూఁచిన వారించి, చూచిపో నిమ్మని ♦ నూటి చెల్లించి
గీ. సారెమోపును బారలును ♦ సదరనిదర, మెటిఁగి లాగైనఁగైకొని♦యించుకంత
పాసఁగ కుండినరుక్మిణి♦బొంకుబొంక, శౌరిఁ బలుమఱు గెలిచెనా♦సత్యభామ.
ఉత్తరహరివంశము, ఆ 3 పద్య 112—128.
గీ. వాహనంబులుసారెలు♦వాఁడిశరము, లూర్జితాక్షములనువులె♦యొడ్డనములు
గాఁగఁబోరెడునీ ద్యూతే♦కర్మమందు, నెసఁగజయమునునపజయ♦మెవ్వఁ డెఱుఁగు.
భాగవతము, స్కం. 6 పద్య 414.
ఉ. ఆడితె నీదుపందె మని♦హాస్యనఖప్రసరచ్ఛవిచ్ఛటా
క్షేపిడితపాండురద్యుతి స♦మృద్ధి గరం బమరంగఁ బాచికల్

వేడుకతోడఁ బుచ్చుకొని ◆ వ్రేళ్ళను విట్టు నటున్ బొరల్చి వి
ఘాతిడకలంకకంకణవి◆రావము మీఱఁ గదల్చి పై ఘుచున్. 2577

సీ. నిలుమహాభోంకకు◆నెత్తికమ్మాయంచుఁ, బక్షులు లెక్కడునోయ్యఁ◆బలుకుమనుచు
జిక్కెడు నీసారె జా◆చేనంచుఁ జిక్కెనొ, దీనిపాలిటికూడు ◆ దివ్వనవుచు
వదె దుగ తిలకమా◆ సుదతి నీవంచునొ, నిదె సారెదాఁకె నీ◆యిచ్చయంచు
నినుమాటుదంచిన ◆ నెనటిపోఁతలటంచు, నొనట్ల యుడికెడుఁ◆గానియంచు
గీ. నిట్టి దంటమాటలు నేర్చి ◆ తెచట ననుచు, దంట నేనాట నీసంగ◆తమున నంచుఁ
దమపరస్పరసరసవా◆క్యములు దనర, నేలఁతో తనవిభుఁడుమ దాను ◆ నెత్తమాడె.

చ. తుషఁ గవ వాపికుందుటను ◆ జక్కవజోళ్ళమనోనురాగ మే
ల పొగడ నతిపాతిశయ◆లబ్ధనుసౌగమశారికల్ తుణం
బవుడ వియోగ మొందె యహా◆హా యెనఁ జావఁ దొడంగెఁ దుల్యరా
గప్రబలనయంబున్ బరిస్ఫుటమ్ము ◆ కాద్వైతదీయమ యెల్లవారికిన్. 2579

ఉ. సారెకుఁబోటు దాఁకినను ◆ జాడ్యము వొందక జోడు విడ్చి పో
పారెఁగడంకతోఁ బోడిచి ◆ చాటుచుఁ దీవ్రవరణస్ఫురన్మహా
శారిఫలప్రఘట్టనలఁ ◆ జాలఁగ నచ్చరమెక్క నయ్యెడన్
వారలు జోదులుంబలె న◆నర్చిరి జూదఁపుఁబోరు మీఱుచున్. 2580

కళాపూర్ణోదయము, ఆ 6 పద్య 119—122.

సీ. ఇనుచక్కవగడాల◆ననుజగడాలేటి, కవునె సతాహార◆నైతి వబల
తీవంచయరఁగుపై ◆ నీవన్నె చూడనె, యొంచభారామచ్చ◆రించినడువ
బద్దుగానీమాట ◆ పాటింపఁజెల్లునే, యిత్తిగింబలుక వే◆మెత్తు నిన్ను
బదిలంబుగానాడు◆పట్టుపా టెఱుఁగవ, యిఁకఁ దొమ్మిదేటికే ◆ యింపుగాదు
గీ. ఇచట నీదుండగమ్ము చాఁగ◆నిత్యనింక, నెరయదచ్చొక మన యాట◆సరికివచ్చె
ననుచు సల్లాపములు ప్రరి◆హాసగతులు, వెలయజూదంబులాడిర◆వ్వేలఁద్ములె లెలమి.

పట్చక్రవర్తిచరిత్రము, ఆ 8 పద్య 70.

సీ. జోడుకట్టిన గెల్తు◆సుదతిరో నీను లీల, పై జోడుగూడఁడిన◆ప్రతిన దగునె
పారె పంచఁగ మేలు◆సమతూరు మాకింత, కాయక వుందుమే ◆ కరణిఁ గలుగు
నిపెట్టియిఁ గుంకుమ ◆ యిది యంటె వాల్గంటి, పెనఁగెద నలుపుల◆విడువ నేను
తెలుగ నత మాయొ◆మీఱి పోఁజూడకు, కొసరక ముందుగాఁ ◆ గూడి వత్తు

గీ. ననుచు నర్మోక్తి చాతుర్య♦మమరనపుడు, కవరలురరత్నకంకణ♦రవ మెసంగఁ
బంధములుగోరి వైచుచుఁ♦బగడసాల, తారతో సాదు మాటిడాంకుఁ♦జేరి మ్రొక్కె.

తారాశశాంకవిజయము, ఆ 4 పద్య 160.

## —♦ అశోకవృక్షము. ♦—

సీ. అరుణపుష్పావళి ♦ నగ్నిగా సంధించి, యలులనల్లెలుఁగాఁగ ♦ నావహించి
దండడి వీతెంచు ♦ దక్షిణపవనంబు, భస్త్రానిలంబుగాఁ ♦ బరిఢవించి
చిలుకలుఁబికములుఁ ♦ జేదోడు సేయఁగ, మాధవుఁ డనెడి క♦మ్మరి కడంగి
యంగజుం డను పతి ♦ యానతిఁ బనిపూని, మొగడలమ్ములకుల♦మొనలు చఱచు
ఆ. కొలిమియొక్కొ యనఁగఁ ♦ గురియుపరాగంబు, విస్ఫులింగములుగ♦విరవాలులుక
నేచిపూచియున్న♦యీయశోకమహీరుహంబుఁ గంటె మాళ♦వాధినాథ. 2583

విక్రమసేనము.

## —♦ మఱ్ఱివృక్షము. ♦—

సీ. తనపలాశశ్రేణి ♦ ధర కంతటికిఁ బచ్చ, పట్టుఁబుట్టంబు మే♦ల్కట్టుగాఁగఁ
దన యూర్ధ్వశాఖావి♦తానంబు సురలకు, మరకత రచితహ♦ర్మ్యములుగాఁగఁ
దన ప్రేలుఁగొమ్మలు ♦ మునులకుఁ గల్పిత, పర్ణశాలాకలా♦పములు గాఁగఁ
దన నిశాంతభ్రాంత ♦ ఘనవిటపచ్ఛాయ, వలయాదిహరిణశా♦ద్వలము గాఁగ
గీ. వాలఖిల్యమునీశ్వరా♦వాసమైన, రోహణమురీతి పిత్రుముక్తి ♦ దేహ మగుచు
గయఁ బ్రసిద్ధివహించు న♦క్షయవటంబు, చందమునసున్నయొకమఱ్ఱి♦క్రిందికేఁగి.

కాళహస్తిమాహాత్మ్యము, ఆ 3 పద్య 198.

సీ. సద్విజరాజసం♦శ్రయమహాస్పదలీల, శాఖలు కకుబంత♦జయముఁ బ్రాఁక
సాంద్రవర్ణక్రమ♦స్థాయిత్వమునమించు, జటలనంతానాప్తి ♦ పటిమ మెఱయ
విష్ణుపదార్పిత♦విహితవృత్తిఁ దనర్పఁ, నగ్రిము లస్తాశ్వ ♦ ననుకరింప
నహిలోకరాడ్భూష♦ణాకారమై యొప్పు, మూలంబు కుండలి♦ముఖ్యుఁ దొరయఁ
గీ. దన మహాగమవిఖ్యాతి ♦ ధరణిలోన, నఖిలజనులకు నద్భుతం ♦ బావహిల్లఁ
దేటపడఁగానుజాపెడు ♦ తెలుఁగుదోఁప, మలసిచూపట్టెఁబథినొక్క♦మఱ్ఱిచెట్టు.

హంసవింశతి, ఆ 2 పద్య 116.

## —♦ శమీవృక్షము. ♦—

సీ. సెగసినకొనలేచి♦నింగి యంతంతకు, నవులఁ ద్రోవఁగఁ దన♦రారుదానిఁ
జాఁగినశాఖలా♦శాచక్రమునకొలం,దులు బారపెట్టంగఁ ♦ బోలుదానిఁ

గవటులోండొంటితోఁ♦గడియుచు నెడములు, గ్రమింగి ప్రబ్బఁగ సొంపు♦మిగులు దాని
లోనిజొంపము పవ♦లును బెనుఁజీకటి, నొదవించిపోదలంగ♦నొప్పు దానిఁ
గీ. గవిరియెఁ బవమానవివిధన♦ర్తనకళాను, వర్తిఁగాకఘూకారవ♦స్ఫూర్తి జాత
భీతి చరిపరవర్తి నా♦భీలభుజగ, చండమూర్తి శమీతరు ♦ చక్రవర్తి. 2586

భారతము, విరా. ఆ 1 పద్య 182.

—♦ జంబూవృక్షము. ♦—

మహాస్రగ్ధర. అటఁగాంచె స్మానసాజ్ఞం♦బలరనురనగ♦ప్రాంత సంక్రాంతజంబూ
పుటదాయాదప్రభావాం♦కురిత కిసలయా♦కుంచితాత్మీయశాఖా
చటలచ్ఛాయా కులాయ♦చ్ఛికటిత కురరీ♦బాంధవాయాతకీర
స్ఫుటవాక్యాత్మధుర్య ధుర్యా♦ద్భుతమగు నొక జం♦బూధరిత్రీరుహంబున్. 2587
సీ. ఛాయామనోహర♦సౌభాగ్యమున హెచ్చె, భాస్వదాకృతి చేతఁ ♦ బ్రబలుటరుదె
లాలితానేకప♦ల్లవవిలాసముఁగాంచె, విటపశేఖరరూఢి ♦ వెలయుటరుదె
ఘనపత్త్రవైభవ♦ఖ్యాతిఁ జెన్నలరారె, రాజమానోన్నతిఁ♦గ్రాలుటరుదె
ఆత్మీయసమగ్రీలి♦లలనొప్పె నలవిష్ణు, పదసేవ నేప్రొద్దుఁ♦బొదలుటరుదె
గీ. యనివినుతిసేయఁదగు లతాం♦తానురక్త, భసలదాయాద నిజవిభా♦భాసమాన
ఫలరసాస్వాద సంతోష♦భరిత భూరి, శారికాకీరవార మా♦భూరుహాంబు. 2588

వాసవదత్తాపరిణయము, ఆ 2 పద్య 18, 19.

—♦ సవారి. ♦—

సీ. ఘటితంబులగుతప్త♦పటికంపుఁ బిడిగుబ్బ, లలరొంను పొల్పుత♦ల్పుల బెడంగు
వ్రాసినమృగపక్షి ♦ ఫలపుష్పతరులతా, ప్రతిమలతోడి య♦ప్పరితిముభంగి
ముత్తెంపు మొత్తంపు ♦ గుత్తుల గుత్తంపు, జాలరుల్ వ్రేలున♦స్తరులడంబు
నుద్దిగానఁగరాని ♦ నిద్దంపుటద్దంబుఁ, గవగూళ్ళముంగిటి♦కడపహొరంగుఁ
గీ. బైకి దోసినగవిసెన ♦ పసిఁడి మొసలి, వాలదండెలు బాలీసు♦పరుపుదిండ్లు
జాలువాసంబెలయును గూ♦జాకటారిఁ, బరగు నొక కొత్తరంగుస♦వారిఁ దెచ్చి.

రామరాయవిలాసము, ఆ 2 పద్య 35.

—♦ పల్లకి. ♦—

మ. తళుకుంగెంపుల పైడియడ్డలును ని♦ద్రాపచ్చడాల్దండెలుం
గిలుకుం దంతపుఁగోళ్లు వింతపనిచ♦క్కీల్ట్ లెప్పంజరీపింజరీ

బలు రాయంచగరు ల్పెలంగు పరువుం ♦ బాలీనునుపగూర్చి పె
స్తలు కళ్యాణముఁ బల్లకీనిలిపిరం♦తఃకక్ష్యయం దయ్యెడన్. 2590

రామరాయవిలాసము, ఆ 3 పద్య 142.

## —♦ తూఁగుటుయ్యేల. ♦—

సీ. బంగారుగొలుసులు ♦ పవడంపుఁదరమెన, కోష్ఠుల వింతబొ♦గులబొంగడలు
రత్నంపుఁజిలుకలు ♦ రాయంచప్రతిమలు, పసిఁడిపువ్వుల్లవ్రా♦ఁతపనులసొబగు
వివిధంబులగు చిత్ర♦విరచనలునుదసి, లీనూలుపట్టెయ♦ల్లిక బెడంగు
బలు తెఱంగులపట్టు ♦ తలగడబిల్లలు, మవ్వంపుఁగుంకుమ ♦ పువ్వుపఱపుఁ
గీ. గలిగి మెఱుఁగులుదిక్కులఁ♦గడలుకొనఁగ, మించుదంతపుటుయ్యేల♦మంచమునను
బొలుపుమీఱుచుఁదనయంతి♦పురముసతుల, యూడిగంబులుగైకొంచు♦నున్న శౌరి.

కళాపూర్ణోదయము, ఆ 2 పద్య 15.

చ. అలఁతిగ నంటివం బొలుచు ♦ సారజపుంజగజంతరీరొదల్
గులుకు మెఱుంగుఁ గెంపుతతి♦గోళ్లనమర్చిన నాగవాసపుం
గొలుకుల జాళువాగొలుసు♦గోళ్లఁ దగుల్కొని వ్రేలు పచ్చరా
చిలుకలతూఁగుమంచమున ♦ శ్రీరమణుండు వసించు నత్తఱిన్. 2592

చంద్రభానుచరిత్రము, ఆ 1 పద్య 91.

## —♦ డేరాలు. ♦—

చ. సమముగ మిట్టపల్లములు ♦ చక్కఁగఁ జేయుచుఁ జుట్టి నీరువా
టముఁ గని నాల్గువంకల గు♦డారము లెత్తిరి చీనిపట్టుప
గ్గములు బిగించి గూటములుఁ ♦ గట్టినరాతులగూర్చిముందటం
గొమరగుపైఁడితీవపని ♦ కుట్టులచప్పరము ల్పెలంగగన్. 2593

వాల్మీకిచరిత్రము, ఆ 3.

## —♦ పొదరిల్లు. ♦—

గీ. క్రొవ్వి కలహించు తుమ్మెద ♦ కొదమకదుపు, రాయడినిగడుదళమూగా♦రాలినట్టి
ప్రసవదళములు పఱపని♦పఱపు లగుచు, నైసఁగ నింపొందునాపొద♦రింటిలోన.

కళాపూర్ణోదయము, ఆ 8 పద్య 196.

## —♦ కంచరసామగ్రి. ♦—

సీ. ఘర్ఘరకలును బిం♦గాండ్లు తాంబాణాలు, గిన్నెలు తబుకులు♦గిండ్లు తపర
పాత్రలు చట్లును ♦ బానపాత్రలు మేలు, చట్టుపంబులు మంచి♦మట్టుగిండ్లు

సంపుటంబులు గొప్పస్థాలీలు తబుకులు, కంచము లట్లు గంగాళములును
చెంబులు పడిగములు చిప్పలు హస్తావములు కంకణములు ఘంటలును గజ్జె
గీ. ఆదిగాఁగల్గు దీవులయందు వలయు, కంచరపుజాతివగవగ ల్కించఁ జేసి
నట్టిసామగ్రిబహుమెల ల్వెట్టికొనియెఁ, గాంతభూకాంతమణులకుఁ గానుకఁ జేయ.

హంసవింశతి, ఆ 5 పద్య 353.

## —♦ గొఱియలు మేఁకలు. ♦—

చ. కులుబలిదోరచారనలగుం డ్లొలగొండెలి మూలబొల్లివిన్
నఱిగివి సెట్టుజోడు పులి నల్లని వెఱ్ఱివి పుల్ల చిల్లవిన్
బఱిగివి మొట్టివిన్ గరక పల్లవి నాఁదగుపేళ్ల నొప్పెడున్
గొఱియలు వేనవేలు గలగుంపు లసంఖ్యము లుండు వానికిన్. 2596
గీ. కోడ పొడమట్టినామంబు బొల్లిపూరి, జాలనల పుల్లవెరబట్ట చార బఱిగి
కఱకు గడ్డము తెలిమొట్టి గారదోర, వసెడు పేరులమేఁకగుంపతని కుండు.
గీ. మట్టెచేమటి కరపస్సె మైలబట్ట, కోరతలపూజ వెఱ్ఱని చార పోడ
పొవకపిలె కన్నె బొలిచుక్క పుల్లవియను, పేళ్లనొప్పారిమందలోఁ బెక్కుగలవు.

హంసవింశతి, ఆ 2 పద్య 76, 77, 78.

## —♦ గోవులు. ♦—

సీ. నానాసహస్రసంఖ్యానంబులై సంత, తానంద విగతభయత్వలీల
నక్కానవమున నేదిక్కు సూచిన నతి, సంకులంబుగఁ గుందశంఖచంద్ర
హారనీహారడిండీరపటీరము,క్తాహారహీరసంకాశములును
గాదంబకాలేయకాదంబినీనీల, జాలతమాలికా సన్నిభములు
గీ. ప్రౌఢబంధూకపల్లవభాసితములు, వికచకాంచనచంపక విస్ఫుటములు
నైనవర్ణంబు లొప్ప నేత్రాభిరామ,భంగి నలరారు గోకదంబములఁ గనియె.

భారతము, అర. ఆ 5 పద్య 375.

ఉ. పాయనివేడ్కతో నునికి పట్టులకుం జని గోవు లెల్ల నం
బాయని చీరి హుమ్మనుచుఁ బేరిచి మూరొక్కని పంచితిల్లి పె
ల్లైయతి రేకలై పొదుగులం బెడలేక స్రవించు చున్న పా
లాయెడ నాకుచున్ సుముఖలై యొసగెన్ నిజవత్సకోటికిన్. 2598
చ. ముదమున హుంకరించుచును మూఁపులపై మెడ లెత్తి చాఁచుచుం
బదములు నాల్గు రెండయిన బాగునఁ గూడఁగఁ బెట్టి దాఁటుచున్

వదనములన్ విశాలతర♦వాలములన్ వడి నెత్తి పాఱి యా
మొదవులు సన్నులం గుడిచె ♦ మూఁతులఁద్రుంగెడిభంగి నాకుచున్. 2599

భాగవతము, స్కం. 10 పూర్వ 518, 522.

## ♦ వృషభములు. ♦

క. పొగరెక్కిన మూఁపురములుఁ, దెగగలవాలములు శైల♦దేహంబులు భూ
గగనములం నిండు అంకెలు, మిగుల మెఱయు వృషభగణము ♦ మెల్లన నడచెన్.

భాగవతము, స్కం. 10 పూర్వ. పద్య 896.

ద్విపద. అని వీడుకొలిపిన ♦ నంతంతవారు, పేరువేరున వానిఁ ♦ బిలిచిరిరీతి
నంబెలబసువన్న ♦ యాదినాథుండ, నందులపిడి ఘంట ♦ నాగవాసయ్య
గోవుల విటకాఁడ ♦ గోఁగుబయ్యన్న, వంటరిపలిజంకు ♦ వరపెరుమాళ్ళు
కట్టనికలుకోట ♦ కరినందిఱంకె, అకలంకగాత్రుండ ♦ అంబుధిశయన
బిరుదుగరుత్మంత ♦ భీమునిగజము, గోవర్ధనాచల ♦ గోపాలదేవ
కరినందిబసువన్న ♦ కంచివరదుఁడ, నెలబాలచంద్రుండ ♦ నీలవర్ణుండ
జల్లుల దర్దజ ♦ జయకంఠనాద, వైకుంఠవాసుఁడ ♦ వాసుదేవయ్య
పుట్టంభూపతి ♦ పుంజెల్లుపెద్ద, ఇందునివజ్రిమ ♦ యిప్పగిరీశ
గోఁగుభైరవమూర్తి ♦ గోవిందరాజ, చెంచులయోబయ్య ♦ చెన్నమల్లయ్య
కంచి యేకాంబర ♦ కాళికానాథ, మధురాపురిప్రియా ♦ మానందినాథ
రాముఁడా సోముఁడా ♦ అంకెలుసలుపు, మిటువలెఁ బిలిచిన ♦ నేపుమీఱంగ
వచ్చినయెద్దుల ♦ వరుసతోఁ జూచి, వన్నెలు చిన్నెలు ♦ వడిఁజెప్పికొనుచు
నెత్తురుకొమ్ముల ♦ నేదైనవాని, గఱుపుతోఁకలుగల ♦ కరిజొల్లివాని
సచ్చగాఁగరివన్నె ♦ లమరినవాని, మూఁపురంబులతోడ ♦ మొనసినవాని
నుదుటఁ జుక్కలుగల ♦ నునుపైనవానిఁ, దెల్లనివన్నెలఁ ♦ దెలిపైనవానిఁ
బచ్చని వన్నెలఁ ♦ బ్రబలినవాని, నిటువంటి యెద్దుల ♦ నెంతయునేర్చి
గంటలు గజ్జలు ♦ గణగణమ్రోయ, గ్రక్కునయెద్దులఁ ♦ గాండ్లఁగట్టించి
మోఁకులబంధించి ♦ ముందుగానపుడు, ... ... ... 2601

పలునాటివీరచరిత్రము.

## ♦ మహోక్షము. ♦

ఉ. మోరకసీదుపట్టుమొగ♦ముట్లతలాటము జల్లు వేరుచిం
పోరయూఁ గంచుకుప్పెలును ♦ బూదెలగొల్సును బెద్దగంట సిం

గారవపుదృష్టివండి మెడ♦గజ్జెలపేరులు నండె లొప్ప లా
వేరిన దొక్కపస్సె యొకీ♦రింతమహోత్సము ఖొల్చు వానికిన్. 2602

హంసవింశతి, ఆ 5 పద్య 96.

## ——♦ మనుబోతులు. ♦——

గీ. నల్లసేనపుగుండులు♦ నడచినట్లు, మంపుగొని మేయుటుంగక ♦ మలసిమలసి
నెనరువారికినుఱుకంగ♦నొక్కమన్నుఁ,బోతులెడచొచ్చెదాఁటెడు♦పొదలువోలె.

ఉత్తరహరివంశము, ఆ 4 పద్య 26.

గీ. వలను కుక్కల ఓడువంగ ♦ వలవదేయ, నడచిమొలపిడియమ్మనఁ♦బొడువవచ్చుఁ
బంకము గొరిజ దిగఁబడఁ♦బఱవలేవు, మన్నులివ్వేళ రేగటి♦మన్నులందు. 2604

మనుచరిత్రము, ఆ 4 పద్య 20.

## ——♦ లేళ్లు. ♦——

సీ. రుచిరవైదూర్యంబు ♦ రూపార నచ్చున, పచ్చినవిధమున ♦ వదన మమర
భర్మనిర్మితపద్మ♦పత్త్రింబు లలవడ, నుత్తనక్రియఁ గర్ణ♦యుగ్మము మెఱయ
లలితమాణిక్యశ♦లాకలలాగు నై, కొనవమర్చినభంగిఁ ♦ గొమ్ము లొప్ప
నింద్రనీలములబా♦గేర్పడ ద్రచ్చివై, చినగతి గొరిజలు ♦ చెలువుమిగుల
గీ. నుదుర నిందుబింబద్యుతి ♦ నుల్లసిల్లఁ, గనక కేసరాంకురరోమ ♦ కాంతి నిగుడ
నొక్కమాయాకురంగమై♦యొయ్యనొయ్యఁ, జనియెనిలుచుచునాపర్ణ♦శాలకడకు.
సీ. నెలలోని యిఱ్ఱికి ♦ నీలకంఠునిచేతఁ, బొలుపారు లేడికిఁ ♦ బుట్టెనొక్క
యాఁజుఁ డన్నిరత్నంబు♦లందునుం గలుగుక్రొ,మ్మించులదీనిఁ గ♦ల్పించెనొక్క
రోహిణాచలము మే♦రువుఁ గూడియుఁ దతర, ప్రభలనీహారిణంబుఁ♦బడసెనొక్క
కొత్రిక్కారుమెఱుఁగులుఁ♦జుక్కలయొఱపును,గలసియీమృగమయి♦వెలసెనొక్క
గీ. దీనిఁబోలంగజంతువుల్ ♦త్రిభువనముల, యందుమఱికలవొకొ యని♦యాత్మమెచ్చి
ప్రీతి వనదేవతలు నూడ♦పీతదృష్టి, మార్గమున కల్లఁజేరె న♦మ్మాయయిఱ్ఱి. 2607

భాస్కరరామాయణము, ఆర. ఆ 2 పద్య 24, 25.

గీ. నీర ముంచిన సొరకాయ ♦ నెగసినట్లు, పేరుకొనివైచు తెల్లంటి♦చీరవోలె
నుంకుచెంపువిధంబున ♦ నుత్తరించు, తములపాకు నిక్కెడుక్రియ ♦ దాఁటె నిఱ్ఱి.

ఉత్తరహరివంశము, ఆ 4 పద్య 27.

ఆ. చలము లొదవ ముండ్లు♦గలమ్రాఁకుదీములఁ, గెరలి తాఁకి కొమ్ము♦లురులఁదగిలి
వాని లేవ నీడ్చి ♦ కానకే కొనిపోవుఁ, బోతరించి యిఱ్ఱి♦పోతు లచట. 2608

మనుచరిత్రము, ఆ 4 పద్య 22.

సీ. నవఫేనరుచినవ్వు ♦ ధవళాననంబును, నల్లఁగల్వలఁ గెల్చు ♦ నయనములును
బద్మరాగపరిభం♦బగటు కర్ణంబులు, కాంచనదీధితి♦మించు తనువు
మౌక్తికకాంతుల ♦ మఱపించు చాలలు, తుహినంబుతోడుత♦దొరయు కడుపు;
మరకతదీప్తులఁ ♦ బురడించుఖురములు, పచనంబుఁ దలకించు ♦ పటుజవంబు
గీ. గలిగి లీలావిహారంబు♦కారణముగ, నవనిఁ జరియించు పంకరు♦హారి యింకొ
మృగముగతినుండుటయుసంశ♦యిూశ్వరుండు, దానిఁగన్గొనికడుసమ్మ♦దంబుఁబొంది.

హరిశ్చంద్రోపాఖ్యానము, శంక. ఆ 2 పద్య 41.

## —♦ దుప్పులు. ♦—

క. పొదచెదరి బోదచఱచిన, యొడళ్ళతో నాల్గు రెండు ♦ నొకటియుఁ బ్రంగల్
బెడలిన కొమ్ములబరువున, నడు గిడఁగా లేవు బలిసి ♦ యందలి దుప్పుల్. 2610

మనుచరిత్రము, ఆ 4 పద్య 169.

## —♦ వానరులు. ♦—

చ. మదమునఁ దూఱి పాఱి పెను♦మ్రాఁకుల బ్రాఁకుదు రిట్టునట్టు దాఁ
టుదురు లతాంతగుచ్ఛములు ♦ దుల్తురు ముందటి గండశైలముల్
పదములఁ బాఱఁజిమ్ముదురు ♦ ప్రాంతమహీరుహశాఖలం బెనం
గుదురొగి నుప్పరం బెగసి ♦ కూలఁగఁబాఁతురు శైలశృంగముల్. 2611
క. ఒకరొకరిమూఁపు లెక్కుదు, రొకనిపయిం దోత్రు రొకని ♦ నొక్కఁడుదినుపం
డొకఁ డొడిసికొనఁగనడుమన,యొకఁడదిపడనడువనదియు♦నొక్కఁడుమ్రింగున్.
ఉ. పండినభూజము ల్వెతికి♦పట్టి ఫలంబులు దించు నన్యుఁ డ
ప్పండులు వేఁడినం దనదు ♦ పండ్లిగిలించు నొకం డొకండు చే
పం డటు చూపవాఁడు కర♦పల్లవ మల్లనఁ జాపఁ మ్రింగి బ్ర
హ్మాండముఁబోలె నున్న తన♦యంగిలిసూపుచుఁబోయెఁ బొమ్మనున్. 2613
సీ. పృథులహాసంబులు ♦ పెన్నురువులభంగిఁ, బఱపువాలములు ప్రి♦వాళలతల
కైవడిఁ జెలువార ♦ ఘనబాహుశాఖలు, బహుళవీచీపరం♦పరలకరణి
విలసిల్ల నుద్భట♦వీరసంచారము, లుత్కటిలతరగ్రాహ ♦ ఘోరగతుల
చాడ్పున నొప్పార ♦ సందడిపలుకుల, యులివఖండధ్వని♦యోజ నిగుడ
గీ వివిధవాహినీసంగతి ♦ వెలయ నినజు, నాజ్ఞ చెలియలికట్టయై ♦ యడరరామ
చంద్రునుదయముదంచితో♦త్సవముఁజేయ,నొప్పెఁగపిబలోద్ధతివార్ధి♦వృద్ధియగుచు.

భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 25, 26, 27, 31.

## —♦ బావురుఁబిల్లి. ♦—

ఉ. మీఁజేనమిట్టిగ్రుడ్లు దెలి♦మీసలమెత్తము నిక్కువీనులున్
గోరలు దీర్ఘవాలమును ♦ గొల్పులిచాఱలు గల్గి ధాత్రిఁ బ
ల్మాఱును బ్రమ్మ్వాచుం బదత♦లంబున బావురుఁబిల్లిరూపుతోఁ
దాఁటుచు గోచరించె నల♦దైత్యుఁడు కన్నియరూపుఁ బాయుచున్. 2615

విజయనందనవిలాసము, ఆ 3.

## —♦ సర్పము. ♦—

ద్విపద. కాలకంఠకఠోర♦కరకంపితోగ్ర, శూలాగ్రనిర్గత♦స్థూలకీలాభ
లోలజిహ్వారుణ♦లోచనం బగుచుఁ, గ్రాలెడుఫణము భీ♦కరముగా ముడిచి
యాలోన నడఁగిన ♦ యమ్మహాభుజగ, మాలోహితాస్యుని ♦ నదరంటఁ గఱచె.

హరిశ్చంద్రోపాఖ్యానము, గౌర. భాగ 2.

మ. ప్రళయారంభకృతాంతభీకరకరా♦బ్జస్థూలపాశంబుతోఁ
దులఁదూఁగం గలయాకృతిం బొదివి వా♦తూలాశనస్వామి నా
ల్కలు వెల్లార్చుచుఁ బుట్టలో వెడలి యు♦గ్రస్ఫూర్తిమైఁ గోప మ
గ్గలమై పర్వఁగ రానుతుం గఱచె ఫూ♦త్కారంబు తోరంబుగన్. 2617

హరిశ్చంద్రోపాఖ్యానము, శంక. ఆ 5 పద్య 34.

## —♦ అడవిపందులు. ♦—

సీ. ప్రబలదంష్ట్రాగ్రప♦ర్యస్తముస్తాస్తంబ, జంబాలశబలవే♦శంతపంక్తి
ఘనఘనాఘననీల♦ఘనపవనప్రతిఘాత, ఘనఘూర్ణమానభ♦గ్నద్రుమంబు
ఘురఘురారవఘోర♦ఘోణాపరిఘాణవి,దారిణచ్ఛదాచ్ఛన్న♦లాంతలతము
ఖననఘుళోత్కార♦ఖరఖురోత్పాతతి,హల్యాధాత్రీధ్వస్త♦యవసరాజి
గీ. ఘోటభటభాషణోద్భటా♦ఖేటచటుల, కుటిలకటుకటాక్షేక్షణ♦క్షోభబధిర
మతిరథసభాసమానయా♦నాభిమాన, కౌమవిక్రియాకులము వ♦రాహకులము. 2618

ఉత్తరహరివంశము, ఆ 4 పద్య 24.

సీ. కండూతితైరాయుఁ♦ గర్కశంబగుతుంటిఁ, బీఁటవెట్టినద్రూను♦పెల్లగిల్లఁ
జెవిఁదార్చివిని చీమ♦చిటుకన్న సోకపారి, సెలవి వెంపరలాడు♦జిట్టలెల్లఁ
జప్పరించువెదుళ్లు♦నటలుబ్బదంష్ట్రాగ్ని, చోంగపైఁబడి చుంయి♦చుంయిమనఁగఁ
జంద్రునిప్పలువోలెఁ♦దిండిప్రించుకనుమించు, లెసఁగనొండొంటిపై♦నెక్కఁబాఱు

గీ. వెట్టదినముల మడుఁగుల♦మట్టిగలఁప. బుడబుడధ్వనివెడలు బు♦ద్బుదములందు
జిలుపచిలుపని నేతులు♦జిడ్డుదేఱు, నేమి చెప్పఁగుఁ గ్రొవ్విన♦యేకలములు.
మనుచరిత్రము, ఆ 4 పద్య 17.

క. పొడిచినకైదువునకుఁ జము,రిడఁగా వల పగ్గికాఁక♦యింపుక యిసిరం
జెడుగఱ్ఱిలఁగ్రుచ్చిననం,జూడు మంటల్మఁ దగిలి నెయ్యి♦జొటజొటవడియున్. 2620
మనుచరిత్రము, ఆ 4 పద్య 19.

సీ. జంభారిభిదురసం♦రంభంబు వీక్షించి, జరుగునంజనమహా♦శైల మనఁగ
ఝంఝూప్రభంజనా♦స్ఫాలనంబునకుల్కి, యరుగుసంవర్తకా♦లాభ్ర మనఁగఁ
గరినకంఠేకాల♦కంఠమూలమువాసి, వెస వచ్చు నుజ్జ్వల♦క్ష్వేళ మనఁగఁ
గలుషధూర్వహాఖిలో♦త్కరముపైఁ బఱతెంచు, దండధర క్రూర♦దంష్ట్ర మనఁగఁ
గీ. ఘుర్ఘురారావసంఘాత♦ఘూర్ణమాన, సప్తపాథోధిపాథఃప్ర♦చండనక్ర
తిమితిమింగలమగుచున♦భ్రమునుమహీయుఁ, గ్రమ్ముకొనివచ్చునొకయేక♦లమ్ముఁగనియె.
మనుచరిత్రము, ఆ 6 పద్య 87.

సీ. ధరణిపై స్నేహంబు♦చెరయించె నన నేయి, యడుగువెంబడిబడి♦వడియుచుండఁ
దోడు రమ్మని హరి♦క్రోడంబుఁబిలిచె నా, ఘుర్ఘురారావంబు♦గుబ్బతిలఁగ
వడిఁ గ్రొవ్వు సెలవుల♦వెడలెనో యన నర్ధ, చర్వితవరనము♦స్తములు చెదర
బంటుతనంబునఁ♦బాటిల్లుకీర్తుల, చెలువునఁ గొమ్ముల♦జిగి దలిర్పఁ
గీ. గాంతపాషాణయుతసూచి♦కలవిధమునఁ, గప్పుగందంపుఁగొనవెండ్రు♦కలుదనర్పఁ
బదరుచూపులమిణుగుర్లు♦పాఱఁజిమ్మ, వీఁక గల యేకలమ్ముల♦మూఁక యొకటి.
సుదక్షిణాపరిణయము, ఆ 3 పద్య 188.

—♦ వ్యాఘ్రము. ♦—

ఉ. గబ్బుసమక్షికంబయి మొ♦గంబడువన్దరుపర్ణముల్పడం
ద్రొబ్బుచుఁ గార్మొగిళ్ల రొద♦తోఁ బురడించెడుబొబ్బరింతగా
డ్పుబ్బివిసంజ్ఞగాఁగఁ జెవు♦లూదినవల్లవుఁడుర్విఁగూలఁగా
బెబ్బులిగొంతుకోల్గఱచి♦పెల్లున మార్మెడ ద్రెళ్లదాఁటుచున్. 2625
ఆముక్తమాల్యద, ఆ 2 పద్య 19.

సీ. జాసరశిఖిశిఖా♦జాతధూమంబుల, చాడ్పున నల్లని♦చాఱ లెసఁగఁ
గ్రోధదుర్మాగ్రసం♦రూఢపల్లవముల, చెలువున నిక్కిన♦చెవులు దనర
సకలమృగానీక♦శాసనోద్ధతవేత్ర, వల్లికచందాన♦వాల మమర
నాస్వగహ్వరరస♦నాహీంద్రవిషలతా, చ్ఛటలనాఁగఱకుమీ♦సలు వడంక

గీ. నావులించుచు గబ్బున ♦ కడరు నీఁగ, మూఁకఁగమియుచు సెలవులు ♦ నాకికొనుచు
భూరిభీకరభాంకృతు ♦ లొప్పదలఁ గొన్ని, పొదలనడుచక్కి బెబ్బులి ♦ గదిసె నొకటి.
చంద్రభానుచరిత్రము, ఆ 2 పద్య 39.

సీ. కులిశధారలఁ బోలు ♦ కోఱలుగలనోరు, దెఱచినఁ జూపఱు ♦ దిగులు బొంద
మువ్వన్నెచాఱల ♦ కొదుకనకెనయైన, మేనిచాయ పత్యుగ్ర ♦ మైనటింప
దండధరోద్దండ ♦ డిండిమధ్వనిఁబోలు, రవలిరొప్పులసృష్టి ♦ చెవుడుపడఁగఁ
గొలిమిగూళులవంటి ♦ ఘోరంపుఁగన్నుల, జోరున నిప్పులు ♦ కారుచుండఁ
గీ. బేర్చి కుప్పించి వాల ము ♦ ల్లార్చి నేల, గగ్గతిల్లంగ నిజపాద ♦ ఘట్టనమున
వాలునాఁకటికినుక శా ♦ ర్దూల మొకటి, ధాటి వెన్నాడు నొకచిన్న ♦ లేటిబోటి.
సుదక్షిణాపరిణయము, ఆ 5 పద్య 58.

—♦ సింహము. ♦—

చ. నృపవర చూడు మల్లదె ద ♦ రీకుహరాంతరదంతదంతుర
ద్విపనిపతన్మృగేంద్రమతి ♦ దీర్ఘభయంకరవాలమున్నట
ద్విపులసటాభిరామతను ♦ దీధితిభవ్యము దీనిరూపు ని
శ్చపలత వ్రాసిచూడఁగ న ♦ శక్యము చిత్రపటాంతరంబునన్ 2626
మ. అదిగో వేఁటక సింహశాబకము దం ♦ ష్ట్రాభీలలీలన్ సట
ల్గదలించె న్జతురశ్రదృష్టభయదా ♦ కారంబుతోఁ దిన్ననై
పదము ల్క్రిందికి నెత్తి నాద మెసఁగన్ ♦ భద్రేభరాజంబుపైఁ
బొదవెం గ్రౌర్యముతోడ దీనివిధము ♦ ల్భూమీశ కన్గొంటివే. 2627
వాసవదత్తాపరిణయము. ఆ 2 పద్య 13, 14.

సీ. క్ష్వేళాధ్వనుల చేత ♦ క్షితిధరమత్తేభ, ములు గుహాముఖముల ♦ మొఱ లిడంగ
రూక్షేక్షణంబుల ♦ నత్యుగ్రతరతిమి, రద్విరదంబు లూ ♦ రక యడంగ
దంష్ట్రానఖచ్ఛవిఁ ♦ దాపించవవగుప్త, వారణంబులు గడు ♦ భయ పడంగ
సంచలద్ఘనసటా ♦ చ్ఛటల గాలినిదూలి, కయిగల మొగములు ♦ గుఱుఱు లిడంగ
గీ. వాలహస్తాహతులఁ బృథ్వి ♦ వడి చెడంగ, నల్లనల్లనఁ జెరలాడ ♦ నటఁ గడంగ
నన్ని మెకములు నోలము ♦ నం దడంగ, నల్లసింగంబు వెలుఁగొందె ♦ నగపడంగ.
బిల్వేశ్వరీయము, బింబ. 2 పద్య 98.

—♦ భల్లూకము. ♦—

మ. భల్లూకంబులఁ జూచితే తిమిరసం ♦ పల్లాలితాంగప్రభో
ద్యల్లీలన్ ఘన నీలనీలఘన స ♦ ఖ్యం బెప్పుడుం జేయఁగా

వల్లీవేల్లిత వామలూరుపులకే♦వం గొంటుజొంటేఁగలం
దెల్లంగుఖ్యుఁడఁ దేనియల్గొనెడు భూ♦మీశావిచిత్రంబుగన్. 2629

వాసవదత్తాపరిణయము, వ.వీ. ఆ 2పద్య 15.

—♦ చిలుకలు. ♦—

క. శుక మొకటి చంచుజితకిం, శుకమై హరిహయ శరాస ♦ సురుచిర వపురం
శుకమై కుసుమాకరకిం, శుక మానందమున నంద ♦ సుతుగుడిఁ బెరుఁగున్. 2630

పాండురంగమాహాత్మ్యము, ఆ 4 పద్య 220.

చ. అడుగులు గెంపుజాఁ గిలుకు ♦ టందియలందము బచ్చదామెఱుం
గెడలఁగఁ ద్రొక్కు టెక్కులప ♦ యింగలరంగు బలాశకోరకం
బడుగునఁ ద్రోయఁ జాలిన ము ♦ ఖారుణకాంతియుఁ జూచి సెమ్మది
న్గడుఁ బ్రియ మావహిల్లఁ జిలు ♦ క న్వెసఁ బట్టి కొనందలంపుచున్. 2631

విజయానందనవిలాసము, ఆ 2.

సీ. గగనలక్ష్మిచారు ♦ కరతలవిన్యస్త,కాంచనమయకందు ♦ కం బనంగ
మధ్యాహ్నకాలార్య ♦ మవిభిన్నమం దేహ,మస్తకచ్యుతహేమ ♦ మకుట మనఁగ
హరిసభానాట్యవి ♦ హారరంభాపద,గళితజాంబూనద ♦ కటక మనగఁ
నందనోద్యానవ ♦ నస్థచంపకభూజ,సంత్యక్త కుసుమగు ♦ చ్ఛం బనంగ
గీ. పూషతురగనిశాపింఛ ♦ పుష్యరాగ, సురపగురుతనుకాంతివి ♦ స్ఫురణఁ దనరి
మిన్ను దిగజాతి పద్మిని ♦ మేడకడకుఁ,దేజ మలరంగ వచ్చె నా♦రాజశుకము.

పద్మినీపరిణయము, ఆ 3 పద్య 147.

గీ. నీ లసద్వేగము సువర్ణ ♦ లీల నలరు, నీ లసన్మూర్తియు సువర్ణ ♦లీలనలరు
నీ లలితసూక్తియు సువర్ణ ♦ లీలనలరు, నీసువర్ణతద్విజలీల ♦ నెఱపు టరుదె.2633

ఇందుమతీపరిణయము, నృసిం. ఆ 3 పద్య 15

సీ. అపరంజి మెఱుఁగుటం ♦ ద[illegible]ము ఖద్యోతిసంచు, జలజరాగచ్ఛాయ♦ సౌళపుసేయఁ
గలికిచిన్నారిచొ ♦ క్కపు టెక్కులబెడంగు,మరకతాలిచ్ఛాయ ♦ నెఱుకసేయ
నాకంఠహృదయప ♦ ర్యంతకాంతిచ్ఛటల్, పుష్యరాగచ్ఛాయ ♦ పొందుసేయ
నలుదిక్కులీక్షించు ♦ నయనమరీచికల్, చక్రనీలచ్ఛాయ ♦ చనువుసేయ
గీ. దివ్యమణిమయమో యనాఁ ♦ దేజరిల్లు, సుందరస్ఫూర్తిఁగనుఁగొన్నఁ♦జూచువార
లౌ ననంగ జగన్మోహ ♦ నాంగమైన, యొక్క రాచిల్కఁగనియెదా♦మోదరుండు.

ముకుందవిలాసము, ఆ 2 పద్య 5.

సీ. కందుండు చైత్రుండు ♦ పందెంబువెట్టి జో, కగఁగాడుపచ్చబం♦గరము లనఁగఁ
మరుఁడును రతియు స♦మ్మదమున నాడెడు, పచ్చలుగూర్చిన ♦ బంతు లనఁగఁ
గదలఁబాఱుటచేతఁ ♦ గానకన్నియమిన్న, సిగజాఱుమరువంపుఁ ♦ జెండ్ల నంగఁ
గల్పకమునఁబండ్లు ♦ గైకొనరాలిపి, త్రోయంగఁబడుపచ్చి ♦ కాయ లనఁగ
గీ. చెరువరులమూఁకపైకి నే♦త్తిఅనుజేసి, దర్పకుఁడుదోలుగుఱ్ఱాల ♦ దండ నంగ
మిగులఁగ్రొవ్వునమింటికి ♦ నెగసిడిగుచు, నున్నచిలుకలమొత్తంబు♦నువిదచూడు.

కవిజనచకోరచంద్రోదయము, ఆ 3.

## —♦ హంసలు. ♦—

సీ. విలసితజంబాల♦పులినభాగమున నుద్దండపద్మాతప♦త్రంబునీడఁ
గమలకాండకఠోర♦కంటకాంకురపంక్తి, నొయ్యనఁగంధరం♦బొరసికొనుచు
నొంటికాలనెనిల్చి♦యూర్మిమారుతములఁ, జిగురుటెక్కలరెక్క♦లెగయుచుండ
విశదమైపత్తుతి♦ద్వితయంబులెడజాఱఁ, జంచులోకించుకా♦కుంచితముగ
గీ. వరుణరాజునకిడినచా♦మరమువోలెఁ, బొడుపుమిగిలిన వెలిదమ్మి♦పువ్వుఁబోలె
నిబిడనిద్రాభిముద్రిత♦నేత్రమైన, రాజహంసంబుఁ గాంచె నా♦రాజసుతుఁడు.

శృంగారనైషధము, ఆ 1 పద్య 98.

సీ. మఱునశ్వగతి మెచ్చి♦సురలునైచినపైఁడి, వాఁతకొమ్మడుఁగుదు♦వ్వాలువలనఁగ
దర్పకుకెఱరౌతు♦తనము పేర్మికిఁగ్రమ్మ, కొను సతేజఃకీర్తి♦ఘనము లనఁగ
హయఫేనధావళ్య♦యాచార్థమైవార్లు, తటిదనుగతసితా♦భ్రంబు లనఁగ
వాజివిభ్రమజితా♦వర్తతఁ దొలఁకుదివ్యాలమేటిసాబ్జరే♦ఖూర్మ్య లనఁగఁ
గీ. గనకరేఖలతోడి టెక్క♦క్కులబెడంగు, చూపఱకుఁ గనుపండునై♦సొంపుమీఱ
జలదపథముననుండిభూ♦స్థలికి డిగ్గు, హంసములు వర్ణనాసీమ♦నతకరించె. 2637
సీ. ఇట్లు గన్పట్టుచు ♦ నేతెంచి యంచలు, వసుధచేరువ నేట♦వాలు గాఁగ
నతినిశ్చలప్రసా♦రితపతత్రంబులై, డిగుచుఁ గాముని ముంద♦టికిని గొంత
సరిఁగడవఁగఁ బాఱి♦మఱలిబోరలుదెట్ట, గిలనొక్కకడవంచి ♦ మలపుదిరిగి
యొఱకలంతటరెండు♦నెఱయఁజక్కఁగఁజాఁచి, యపనిగాల్మోపి టెక్క♦క్కార్చిముడిచి
గీ. మెఁగములోకవింత యొయ్యార♦ముగమలంచి, యీఁకనువిదర్చికొనుచునొ♦క్కింత
దడవు
హైమరేఖావిచిత్రని♦జాంగరుహవి, నిర్మలతఁజూడ్కులకునింపు ♦ నింపుచుండె.

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 2 పద్య 41, 42.

సీ. మొనరెండుగాఁ జీరె♦బ్బి నవవిద్రుమద్రుకం,దము సేలు ముక్కుఁజ♦దడవితడవి
మొగవిచ్చు పసిఁడిగే♦దఁగి రేకుగమి మించు, విశదచ్ఛదములను♦విదిచి విద్రిచి
నగుమొగంబులదాస♦నపుఁగ్రొవ్విరులనవ్వ, చిగురాకునడుగులఁ♦జిమ్మిచిమ్మి
నిద్దంపుఁ బండువె♦న్నెలగుత్తి కడకొత్తి, మలయామైముంపులఁ♦గలఁచికలఁచి
గీ. శార్ఙ్గసౌధప్రఘాణకా♦సారసార, సారసామోదమేదుర♦వారిఁ దేలి
వచ్చియాయంచగుడిలోనఁ♦జొచ్చెనొక్క, నాఁడుపవలింటిబీఱెండ♦వేఁడిఁదలఁకి.

పాండురంగమాహాత్మ్యము, ఆ 4 పద్య 220.

చ. పగడపుఁజాయముక్కులును ♦ బాదయుగంబులుఁ బైఁడిఱెక్కలున్
జిగినునుసోగవెన్నెలలఁ ♦ జిమ్మెడుమేనులుం మించ నంచ లీ
గగనతరంగిణీవికచ♦కాంచనకంజవనీ గృహంబులన్
సొగసి రమింపుచున్నయవి ♦ చూచితె చారుచకోరలోచనా. 2640

వాల్మీకిచరిత్రము, ఆ 3.

—♦ గరుత్మంతుఁడు. ♦—

మ. హరిదంతద్విపదంతకుంతశిఖరా♦హంకారనిశ్చింతని
ర్జరరాజార్జితవజ్రజర్జరితవి♦చ్ఛాయైకరోమచ్ఛవి
స్థిరవిద్యుత్ప్రతిపక్షపక్షుఁడయి వ♦చ్చెన్ వైనతేయుండు భా
స్కరబింబప్రతిబింబమంబరము మ్రిం♦గం బొఱుచందంబునన్. 2641

ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 105.

సీ. వజ్రంబునకు నీఁక♦వయిచినబలశాలి, గజకచ్ఛపాశన ♦ ఘాతుకుండు
జననిదాస్యంబు నీఁ♦గినకులశ్రేష్ఠుండు, దుర్లభామృతపశ్య♦తోహరుండు
కమలాప్తసారథి ♦ గారాబు దమ్ముండు, కశ్యపకృతపుణ్య♦కర్మఫలము
సకలశకుంతౌఘ ♦ సామ్రాజ్యధౌరేయుఁ, డహిమృగయావ్యస♦నాకులుండు
గీ. మింటిపాళెంబులేర్చు ము♦క్కంటితూపు, గతినిపాతితరోహిణ♦స్కంధుఁ డనిల
మానసాతీతవేగసం♦పన్నుఁడు, తార్క్ష్యుఁ డేతెంచె దానవ♦ధ్వంసికడకు. 2642

పారిజాతాపహరణము, ఆ 2 పద్య 72.

సీ. కుప్పించు మరవడిఁ♦గుంభిని వడిఁ గ్రుంగి, సర్పాధిపతితలల్ ♦ సదియ నదుమ
నెగయు నూఁకున మీఁది♦కెత్తిపాఱిన తరు, శ్రేణులు చుక్కలఁ♦జెదర నడువ
నెఱకలు జాడించు♦నేపునఁ గడలెత్తి, యేడువారాసులు ♦ నెడము లొత్తఁ
బఱచు బల్వడి నభ్ర♦పంక్తులు నుడిగొంచు, వలయంపుఁ గొండయ♦వ్వలికిఁ దూఱఁ

ఆ. పర్వతములు వడఁక◆బ్రహ్మాండకోటర, మదురిప గగనవీథి◆నరుగుదెంచె
రఘుకులేంద్రబంధ◆విఘటనత్వరితాంత, రంగుఁ డగుచు నవ్వి◆హంగవిభుఁడు.
భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 625.

సీ. శ్రీమహారోహణ◆శిఖరోపమానమై, డాలించుమణికిరీ◆టంబుతోడ
నతులఫణామణి◆ద్యుతులచే నసియాడు, పన్నగకుండల◆ప్రభలతోడ
నాజానుదీర్ఘమ◆హాగ్రిపమరకత, కమనీయమణికంక◆ణములతోడఁ
గాంచనాచలముపై◆మించుబాలాతప, శ్రీలీను చెంగావి◆చేలతోడఁ
గీ. జకచకలు జల్లుముత్తైపు◆సరులతోడ, నాత్మమణిమేఖలావల◆యంబుతోడఁ
గనకమంజీరచరణయు◆గ్మంబుతోడ, నక్షరుఁడు తార్క్ష్యుఁడపుడు ప్ర◆త్యక్షమయ్యె.
శ్రీరంగమాహాత్మ్యము, క. వ. ఆ 1.

సీ. అది సుధాకరబింబ◆మౌనొకో కాదొకో, కాదు చక్కని నెమ్మొ◆గంబు గాని
అది పక్షయుతమేరు◆వౌనొకో కాదొకో, కాదు సందీప్తవి◆గ్రహము గాని
యవి కల్పతరుశాఖ◆లౌనొకో కావొకో, కావు మహాభుజా◆గ్రములు గాని
యవి మణిస్తంభంబు◆లౌనొకో కావొకో, కావు పృథూరుయు◆గ్మంబు గాని
గీ యనుచు జగములు గొనియాడ◆నాక్షణమున, శౌరి దనుబంపఁబవనాతి◆జవవరేఖ
వైనతేయుండు పరమపా◆వనవిధేయుఁ, డరుగుదెంచె వసుంధరా◆ధ్యక్షుకడకు.
సుదక్షిణాపరిణయము, ఆ 4 పద్య 113.

## —◆ పావురము. ◆—

సీ. సౌధకేతనపటాం◆చలవాతధూతని,ర్గతగాంగడిండీర◆ఖండ మనఁగ
సితమానిపూర్వావ◆సితభూపునర్దిదృ,క్షాగతేంద్రాగల◆తాంత మనఁగ
నవహారసంఘట్ట◆వగ్రస్తపతయాళు, గగనలక్ష్మీమౌక్తి◆కం బనంగ
మధ్యందినానంత◆మణిలూనమందేహ, సంత్యక్తబిరుదైక◆శంఖ మనఁగఁ
గీ. పంకరుహసంభవకళత్ర◆పత్త్రిపుత్త్రి, సురకులధురీణకంఖాణ◆కరకృపాణ
రమ్యధావళ్యజైత్రపా◆రావతంబు, రాఁదొడఁగెఁ జక్కఁదెగిపడ్డ◆క్రమముదోఁప.
సారంగధరచరిత్రము, చే. వేం. ఆ 1 పద్య 127.

## —◆ డేగలపేళ్లు. ◆—

గీ. కణుజు సాళువమును జల◆కట్టె లగుడు, జాలి డేగయు మొదలైన◆మేలిడేగ
తెగలఁదగనేర్పరించియ◆త్తెములనుంచి, కదలెన్నృపువెంబడినయూడి◆గములగములు.
ఉత్తరరామాయణము, ఆ 7 పద్య 402.

## ♦ పక్షిజాతులు. ♦

సీ. గరుడుండు సంపాతి♦గండభేరుండంబు, చీకురా యాఁడేలు ♦ చెవులపంత
వాణెము ఖైరిజా♦వశెము సాళ్వము డేగ, గూఢ బా తుల్లంగి ♦ కుందటీల
పాల సారంయణ♦పక్షి పాములమ్రింగు, డంచవేష్టము గ్రిద్ద ♦ క్రౌంచ మాబ
లకు లోఁడె గోరకు తె♦ల్లనిపంతజలపక్టై, గూబ శంబరకాకి ♦ గుబిలిగాడు
సామాలకేతఁడు ♦ నల్లాస కప్పెర, కాకి యంబటితారి♦గాఁడు మూఁగ
చిందర లకుముకి ♦ చిలుత తీతువకోడి, కారుకో డేకుల ♦ నారిగాఁడు
ముసుగుకోడియు డాల♦ముట్టెకోడియు బోద, బొన్నంగి కకశేటి♦బొల్లికోడి
గొంగడి కక్కెర ♦ గోక్కెర గోరవంక, పూరేడు కనుపెంటి ♦ నీరుకాకి
వెలిచెలావుకపిట్ట ♦ చిలుక జీనువ కొంజ, పెడిసకేర్జము డబ్బు♦బెలవనెమిలి
జిట్టువ మునుగపూ♦జిట్టువ గిజిగాఁడు, వల్లడ పాడిపిట్ట ♦ వంగపండు
బరతము కోకిల ♦ చసరికె తంగేడు, గొఱవంక జక్కువ ♦ చెఱువుకోడి
పట్టుజీనువు కొంగ ♦ పాపేరు పిచ్చుక, పోలిక పిక్కిలి ♦ మీలమ్రుచ్చు
చిలుక చకోరంబు ♦ జిబ్బిటాయ జటాయు, కొండపిచ్చుక వాన♦కోకిలయును
మ్రాసుపొక్కిటిగాఁడు ♦ మాలకాకి బెనాసి, పాపెర గోరవంక♦పంది కైర
గబ్బిలంబును జాత♦కము కంకచిటిచెల్వ, పాను పెంటియేటిర్రింత ♦ భూతపోతు
గున్నంగి కనకాక్షి ♦ గుడిసె బయ్యకపుల్ల, సీతువ బెగ్గురు ♦ జిక్కితురుక
ఆ. పికిలిశేల నెమిలి ♦ పెనగువ్వ బకదారి, పావురాయి సివడు ♦ పలువరింత
చదలుకోడి గువ్వ ♦ వదరుతోఁకలవేడి, యాదిరైన పక్షు♦లతఁడు దీర్చు. 2648
హంసవింశతి, ఆ 3 పద్య 12.

సీ. కొఁజులు కొక్కెర ♦ ల్కారుకోళ్ళు నెమళ్ళు, పూరేళ్ళుబెగ్గురు♦ల్పొన్నగులును
పసిఁడికంటె పలాక ♦ పట్టెడ గ్గిజిగాళ్లు, పాలపిట్టలు మేటి♦నేలనెమలి
కాటుకపిట్టలు ♦ గడిపిట్ట లిరువొందు, పోలుగుల్గోరవంక ♦ పులుఁగుగములు
బాతులు పిచ్చుకల్ ♦ షరజాలు పావురల్, పలుఁగుపిట్టలు మంచి♦పక్షిగములు
గీ. లకుముకు ల్పికిలిపిట్టలు ♦ లావుకలును, కక్కెరలు దోరువాల్ మొద♦ల్గలుగునట్టి
పిట్టబారుల వెసఁబట్టి ♦ బుట్టలందు, బెట్టితాఁగినందు కొందఱు♦ జెట్టిమగలు. 2649
కవిచకోరచంద్రోదయము, ఆ 2.

## ♦ తుమ్మెదలు. ♦

సీ. పరువంబుగాక చో♦ప్పడని మామిడితేనె, లాన నాసాసన ♦ త్రాడునవియుఁ
దమకించి చిగురాకుఁ ♦ గమిచి నో రొగరైనఁ, గడఁగిగొజ్జఁగినీట♦గడుగునవియు

సంపంగిపొదరింటి◆చక్కిఁ గొరఁటఁగాంచి, యనురంచుమగిడినో◆యూరునవియుఁ
గలిగొట్టుపసరుమొ◆గ్గలఁ గోర్కి పాలివోయి, మునుపటి మొల్లల◆మూఁగునవియు
ఆ. నగుచుఁ దేఁటికదుపు◆లామనిఁ దలనూపెఁ, జూపుదనుక నెల్ల◆చోట్లఁదోఁట
యందుఁ దామ యగుచు◆నమ్మరు నెలగోలు, పొఁజులనఁగఁ జూడ్కి◆పండువగుచు.

పారిజాతాపహరణము, ఆ 3 పద్య 51.

చ. కరకరి గూఁటఁ గట్టియిడఁ◆గా మొఱవెట్టెడులీల బాలభా
స్కరకరకాండకందళిక◆ఘట్టన నించుకవాయివడ్డతా
మర మొఱవెట్టిపెట్టి వలు◆మాఱును వాఁకిలిదాఁటి యూఁగుచున్
మొరయ విపంచిమీటుగతి ◆ మ్రోసి యళుల్వెడలెం గొలంకులన్. 2651

మనుచరిత్రము, ఆ 3 పద్య 60.

చ. అడరు నవీనభానుకిర◆ణానల మంటినఁ గూడుకొన్నపు
ప్పొడికొలు చెల్ల మోచికొని◆పోయెడిసంభ్రమ మొప్పఁ గంటివే
పడఁతి భవద్విహారవన ◆ పద్మసరః కుముదాలయంబులన్
వెడలుమిళిందబృందములు ◆ వీఁపుపిశంగిమకైతవంబునన్. 2652

మనుచరిత్రము, ఆ 3 పద్య 61.

క. కమలిని పూజ రొనర్పఁగ, సమకట్టి దివాకరునకు ◆ సద్భక్తిని ధూ
పము లొసఁగె ననఁగఁ దనరెం, గమలములను దిరుగు తేఁటి◆గము లయ్యెడలన్.

వాసవదత్తాపరిణయము, వ. వీ. ఆ 4 పద్య 24.

ఉ. గూఁటను గట్టఁబెట్టినను ◆ గోయని మొఱ్ఱలుసేయుభంగినిన్
నూటిగ భానుదీధితులు ◆ సోఁకిన పంకజగర్భసుప్తలౌ
తేఁటులు పెక్కులార్చుచును ◆ దీయని పుష్పరసంబుఁ గ్రోలుచున్
చాటులు పాడఁగాఁ దొడఁగె ◆ భానుర దివ్యసరోవరంబులన్. 2654

పద్మినీపరిణయము, ఆ 4 పద్య 70,

## —◆ చక్రవాకములు. ◆—

చ. కొలకొలఁ గూయుఁ బైనొఱగుఁ ◆ గుత్తుకఁ గుత్తుకఁ జుట్టుఁ బాయుచి
ల్వలక్రియఁ గానరాని గతు◆లన్ మయిమైఁ బెనుచున్ జనించున
ప్రేలఱుత నెత్తుసోలు నిలు◆చున్ విధిచాతురిఁ గూడియున్ రతిం
దలఁపఁ గంటె పాసినవి◆తేల్ దలఁపించుచుఁ గోకదంపతుల్. 2655

మనుచరిత్రము, ఆ 3 పద్య 62.

## — ♦ చక్రవాకి — వియోగిని. ♦ —

సీ. ఏవిహంగముఁగన్న ♦ నెలిఁగించుచునుసారె,కును సైకతంబులఁ♦గూడఁదారుఁ
దారికన్గొని యది ♦ తన జోడుగాకున్న, మెడయెత్తి కలయంగ ♦ మింటనరయుఁ
నరసికన్నీటితో ♦ మరలితామరయెక్కు, వదనమెండఁగసరో♦వారిసద్దు
నద్దిత్రావఁగసైఁప ♦ కట్టిట్టుగన్గొని, ప్రతిబింబ మీక్షించి ♦ భ్రమసియుఱుకు
గీ. నుఱికి యొఱకలుదడియ వే♦ఱొక్కతమ్మి, కరుగునళిగిరవంబుతోఁ♦దిరుగుఁదేంట్లఁ
జోడుచుముక్కునమఱియును♦బోవువెదక, సంజఁబ్రియుఁబాసివగనొక్క♦చక్రవాకి.

మనుచరిత్రము, ఆ 3 పద్య 15.

## — ♦ జలచరములు. ♦ —

సీ. నీరుకుమ్మరపుర్వు ♦ నీరుఁగె తలకప్ప, తెలిదిమ్మకరివేల్ల ♦ పొలికె నత్త
గుల్ల చుట్టుడుగుల్ల♦కుఱిమిండ నాచుడు, గవ్వ మురుండము ♦ కాకిచిప్ప
నులిగుల్ల యెరబిల్ల ♦ పురుగు గోదురుగప్ప, కప్ప కత్తెరి యెండ్రి♦కాయ జలగ
గులకరింతయు నీరు♦గుట్టు శంఖనఖంబు, పలుకాసినసిమిరి♦ బంగపురువు
గీ. పెలుక నిర్ఘాత కోచు తాఁ♦బేలు పిడక, మొసలిశింశుమారము పెద్ద♦మొసలినీరు
పాప నీరెన నీర్పిల్లి♦ప్రాచిపురువు, లాది కొఱగానిజంతువు♦లన్నివిడిచి. 2657
సీ. కొరదు దాసరికొయ్య ♦ కొఱ్ఱమీను లసము,చ్చంగి బేడిస జెల్ల♦చారమీను
వాలుగు ముకుదొమ్మ♦వల్లికతట్ట పుత్తడికాను పూమేను♦కడిసెలంబు
పక్కె చిత్తర నీరు♦పాపెర మలుఁగుమీను,నరిజె యిల్లెపుచేఁప ♦ యాకుజెల్ల
మిసికల్లు రజు తేలు ♦ మేను తోల్లికజాతి, గొరక మాపుగమును ♦ గుంటముక్కు
గీ. మోర పక్కెర దొండును♦గూరముక్కు, పుల్లరజు గెజ్జె గండయు♦బొమ్మడాయ
యల్లెద మ్మప్పుచేఁపయు♦గొల్లదొందు,పరిగెరొయ్యాదియగుమీలఁ♦బట్టునతఁడు.

హంసవింశతి, ఆ 4 పద్య 186, 187.

# దేశములు.

సీ. పాంచాల పాండ్య బ♦ర్బర కిరాతాభీర, కురు విదేహ విదర్భ♦కుకుర గౌళ
గాంధార మగధ కొం♦కణ కళింద పుళింద, సింధు సౌవీరాంధ్ర ♦ చేది చోళ
సాముద్ర సాల్వ కో♦సల కళింగ కుళింగ, వత్స సౌరాష్ట్ర ♦ వంగ మత్స్య
శూరసేన సుదేష్ణ ♦ సుహ్మ కాశ్మీర కరూశ, లాట కర్ణాట మా♦ళవ వరాట

గీ. కుంతలావంతి ఘూర్జర • కురుమ్లేచ్ఛ తిగ్రిగర్త బహుధాన్య యవన కొం•కణ దశార్ణ
పుండ్ర బాహ్లీక ద్రవిడ కాం•భోజ హూణ, కేకయ వసాతి కాశ్మీర • కేరళములు.

ఉత్తరహరివంశము, ఆ 5 పద్య 144.

సీ. ద్రవిళ విదేహ మా•ళవ మత్స్య మళయాళ, కొంకణాంగవిదర్భ•కురుపుళింద
చేది టంకణ వత్స•సింహళ కర్ణాట, మగధ ఘోట కళింగ•మద్ర యవన
కుకురు బాహ్లీక పౌండ్ర • ఘూర్జర నేపాళ, శక వంగ కాంభోజ•సాల్వ లాట
సౌరాష్ట్ర చోళాంధ్ర • శబర పాండ్య వరాట, కుంతల కేకయా•వంతి కాశి
గీ. నాట కరహాట సింధు గాం•ధార నిషధ, కేరళ తురుష్క పాంచాల•శూరసేన
కోస లోత్కల కాశ్మీర • కుత్స బర్బ, రమరుహూణాఖ్య సర్వదే•శములు జూచి.

హంసవింశతి, ఆ 4 పద్య 14.

## —• ఆంధ్రదేశము. •—

సీ. కోత్రిబియ్యము కాయ•గూర లొబ్బట్లు పైదంపుబూరెలు పంచ•దారయావ
పడలు నల్లరెలు విూ•గడలు దియ్యని పెర్గు, కమ్మని సిరివాలు • గసగసాలు
చిలుపెస్లపప్పును • తేలుచువిద్యంబులు, కంబళ్లు నంబళ్లు • కంచుకములు
ఇంగువ జీలకఱ్ఱ • నెనసినమిరియంబు, మదము వాసననెయ్యి • మాటగురును
గీ. అమచు రణశీల మొప్పగం•ధాక్షతముల, నందమింపొందు శిఖలువా•య్యారి నడలు
గలిగి కాంతలు పురుషులు•గలిగి సిరుల, జెలగువయ్యాంధ్ర దేశంబు• చెలువుగాంచి.

ఒడయనంబివిలాసము, ఆ 5.

ఆ. మహిమశోభనక్రి•మకరంబులను జీవ, నార్ధజనత సేవ్య•మగుచు మధ్య
మస్థభోడబాతి • మహితమా నబ్ధినా, నాంధ్రదేశలీల • లతిశయించె. 2662

శా. ఊరూరం దొక శూద్రుఁడే యధిపుఁడై • యొప్పం జిరం బాతనిన్
మీఱం జాలక లెక్కఁజెప్పుదురు సా•మీప్యంబున న్విప్రుఁడుం
డీరీతిం దగు నందుఁదామరుతలం•బందుండు కాసార మ
ట్లారూఢాద్యయనాధికారియగు వి•ప్రాగ్రేసరుం డున్నఁద
త్ప్రీరేవంబున హీనవర్తనమునన్ • విస్తృళ్ళుగూర్చెనమున్. 2663

విశ్వగుణాదర్శము, తి. బు. చి. తా. పుట 33.

## —• ఘూర్జరదేశము. •—

ఉ. చెక్కులపచ్చబొట్లు మృదు•చేలములంగల గూడకట్లు సొం
పెక్కినదివ్యగాత్రములు • నింపుజెలంగువిశాలనేత్రముల్

చక్కఁ గదలీసుమాంపులు కుం♦భంబులు గానఁగరాని శీవ్రులన్
జక్కఁగఁగల్గి వర్తిలెడు ♦ చానల ఘూర్జరభూమిఁ జూచుచున్. 2664

క. చిఱుసెనగపప్పు నూనెయుఁ, గరముగ తీపైన పెరుఁగు,♦ కద్దుసైదముతోఁ
దొరసినఖజ్జము లల్లము, గురుతరముగఁ గుడిచి రపుడు ♦ ఘూర్జరభూమిన్. 2665

ఒడయనంబివిలాసము, ఆ 5.

## ——♦ కళింగదేశము. ♦——

ఉ. పొక్కిలిక్రిందికట్టు పరి♦పూర్ణములైన కుచద్వయంబునుం
జిక్కని కప్పుకొప్పులును ♦ జేరలమీఱు విశాలనేత్రముల్
జక్కనిహస్తపద్మములు ♦ సౌఖ్యము లిచ్చెడు దేహవల్లులున్
మక్కువఁగల్గు కాంతలను ♦ మానిని చూడు కళింగధారుణిన్. 2666

సీ. జున్నుండలును దేనె ♦ సన్నవంటకములు, లాజిలుకుండ బె♦ల్లంబు కొండ
కందిపప్పును చందు♦గలిగిన పచ్చళ్లు, నీళ్ళుపోకని పాలు ♦ నిమ్మపళ్ళు
వేపవిత్తులునూనె ♦ విరిదండ లల్లంబు, బసపుపూతలుగల్గు ♦ బల్లటాలు
నూనెరాచినయొడల్ ♦ నుదుటిపై శిఖలును, నడుముక్కుకమ్మలు ♦ గడునువగలు

గీ. బొగమచును దట్టికూరలు ♦ భుక్తముష్ణ, మఖిలఫలములుమధురభ♦క్ష్యములుపచ్చ
నైన ఘృతమును నెజ్జని ♦ యావనూనె,లును గళింగావనీస్థలి ♦ ననుభవించి. 2667

ఒడయనంబివిలాసము, ఆ 6.

## ——♦ కర్ణాటదేశము. ♦——

చ. ప్రతినగరంబున న్వనులు♦భాసిలు నిందుఁ దలంచిచూడఁగాఁ
బ్రతివనులందుఁ బూగములు ♦ పక్వములై విలసిల్లువానితోఁ
బ్రతికుసుమంబున న్మధుప♦హారితమై స్రవియించుచుండు నీ
ప్రతిభ నిరంతరంబుగను ♦ భాసిలుఁ గన్నడదేశ మంతయున్. 2668

విశ్వగుణాదర్శము, తి. బు. చి. తా. పుట 35.

## ——♦ మహారాష్ట్రదేశము. ♦——

మాలినీవృత్తము. అతిమధురజలాఢ్యం ♦ బద్భుతాద్రిప్రకాశం
బతిసురపురసామ్యం♦బౌ మహారాష్ట్రదేశం
బతులవిభవసంప♦న్నాఢ్యు లిచ్చో గృహస్థుల్
సతతవిబుధపూజా♦సంయుతుల్ సద్గుణాఢ్యుల్. 2669

విశ్వగుణాదర్శము, తి. బు. చి. తా. పుట 29.

—♦ జిల్లాలు. ♦—

సీ. కుంభకోణము కన్నీ♦కోట కర్నూలు బళ్ళారి చిత్తూరు నే♦లంబు కడప
కబాడాల బందరు ♦ కనరామధుర తిర్నెవల్లియు తిరిచినా♦పల్లిమఱియుఁ
గోయముత్తూరు మంజ ♦ కుప్పంబు నాఁగఁజెం,గల్పట్టు నెల్లూర♦నల్పపటిమ
వతలు గుంటూరు బం♦దరును రాజమహేంద్ర,వరము నాఁగవిశాఖ♦పట్టనంబు
గీ. వనఁగ శ్రీకాకుళము గంజామనఁగఁబరఁగు, నిరువదియురెండుజిల్లాల♦కిరవుమీఱు
రాజకార్యంబులకు నెల్ల♦రాజధాని, యాపురపార్థివము భువి♦ననదృశంబు. 2870

చెన్నపురీవిలాసము, మహిమప్రకర. పద్య 2.

—♦ గ్రామములు. ♦—

సీసమాలిక. రాయదుర్గము గుత్తి♦రాయవేలూ రానె,గొందిమా హురికాసి♦గోలకొండ
ముంగిపైఠిణి డిల్లి ♦ ముఖువాయజాబురా, బారుమబ్బా మహో♦మూరు మచిలి
బందరు సూరతు ♦ చెందరు గోవేయ, శ్రీరంగపట్టంబు ♦ చెంజి కాంచి
బాదయు నౌరంగ♦బాదు దౌల్తాబాదు, కప్పర గాగర ♦ గదుగు బిదిలి
కోట కళ్యాణము ♦ గొందానమహముదా, నగరంబు బంగాళ ♦ నరసగోవ
పన్నాళ చదరంగ♦పట్నంబు గలగల, గజరాజధాని బం♦గాపురంబు
కాంబాగర ప్రియా♦గ ద్వార కాయోధ్య, లక్ష్మేశ్వరంబు సో♦లాపురంబు
మధుర కొల్లాపురి ♦ మగధ మా యావంతి, కాపురాణపురముల్ ♦కాబలగయు
నాదవేని కళింగ ♦ మానూరు వినుకొండ, కొండవీడును నేల♦కొండపల్లి
పొదిలె తంజాపురం ♦ బుదయగిర్ కైనూరు, మైసూరు పెనుగొండ♦మంగళగిరి
బనువపట్నము సీర్పి ♦ భద్రాచలము పాల, వంచ నిజాంపురి ♦ వందవాసి
కుందిర్పి బెల్లము♦కొండ దేవరకొండ, రాచర్లమునిమడ్గు ♦ రాయపురము
సైదాపురము ఢోవ ♦ సాళ్వాక దూపాడు, రాపర్తి మాచెర్ల ♦ రాచవీడు
బనగానిపల్లెకం♦భము పోరు మామిళ్ల, ధారాపురము చీని ♦ తాడిపర్తి
నంద్యాల చిరువళ్ళి ♦ నందవరము కందు,కూరు రామయపట్న♦మారుబండ
హంపి విరూపాక్ష ♦ మారణి వెంపలి, కాంపిల్యనగరంబు ♦ కందనూరు
కడప సిద్ధవటంబు ♦ గండికోట కనూరు, సింహాద్రి పుట్లూరు ♦ చింతగుంట
గయ చెన్నపట్నంబు ♦ గండవరం బోరు,గల్లు దామెనచెర్వు ♦ వెల్లటూరు
కల్లూరు కలువాయి ♦ నెల్లూరు వేలూరు, రాచూరు చదుమూరు ♦ రాచకొండ
కదిరిఖ్యాటాగుళ్ల ♦ గంగేరు శృంగేరు, రామల్లకోట వ♦జ్రగిరి నునుము

సూగూరు చోళ్బాడ • బాగూరు కోళ్ళాల, గుడిబండ బళ్ళారి • కొత్తకోట
గుమిలేనిపాళెంబు • గొబ్బూరు బళ్లాపురము పుంగనూరాకు • రామ బెంకి
మానవ కాతాళ • మానుకొండైనూరు, జలపూరు పెదవలి • జల్లికోట
కుంభకోణము కోట • కొండ తంజావూరు, పెరవలి దువ్వూరు • బెంగుళూరు
నోత్తూరు చిత్తూరు • హులిశి చిర్తనాపల్లి, రాజవోల్గవ్వాలు • రాచనగరు
చిరుతని కాళహ • స్తి సినూరు మధ్యార్జునము తిరునామల • నాముకొండ
పాకం కావేరి • పాక మోహనగిరి, చదుకూరు మల్లూరు • చాముకొండ
పాగొండ వావిలి • నాగోలు తాళ్లూరు, మైలాపురము బెద్ద • మంగళంబు
రామసముద్రంబు • రామాపురము జట, పోలూరు వెల్లాల • భువనగిరియు
హరిపనల్లి బేద • నరవారి గొండాపురము గౌరి మాయూర • మమర వీడు
నడిగల్లు కొక్కల్లు • కడవకోలయు రత్నగిరి వెలిగోడు తం • గిళ్ళదర్శి
కంగొంది తనుగొండ • గడవ సెత్తిము దూస్తి, సివనగాళ్లవళంది • సింగళంబు
మన్నారుకోవెల • సొన్నగలు చినంబరము వాగెనగరి పు • రాణపురము
వడియారుపాళెంబు • నుడిపి సుబ్రహ్మణ్య, ముజ్జంగి మండువా • మోసవగలు
రామనాథపురంబు • మాముగోళ్ళబెడంద, ధర్మవరంబును • దాడిగోళ్ళ
మవణికె మండము • మారకపురి కుంభి, హొరంగ ముజ్జారి • హాళికె హల్లి
రెట్టిహాళి కురంజి • రేవణి సన్నకి, బాగూరు గుజ్జరి • పాలువాయి
రామచంద్రపుర • మామూరు బెజవాడ, కొండేరు కాండూరు • కోటకొండ
గీ. మొదలుగాగల్గు జనపద • మ్ములను దుర్గములను బేటలం బాళెలం • బురులబెలయు
వర్తకులు వచ్చి రచ్చటి • వస్తుతతులు, బేరసారంబు లాడెడు • పేర్మి మెఱసి.

హంసవింశతి, ఆ 5 పద్య 359.

## — • వేగినాడు. • —

ఉ. వేగిననాడు ప్రస్తుతుల • విశ్రుత మయ్యాది వేగినాడవున్
వేగులు రాచకార్యముల • వేగులు మాటల వేగనాడవున్
వేగు లనంగవ్యాఘ్రములు • భీకరు లట్టిరు శూరనూరులే
వాగుట వేగినాడనుచు • సన్నుతిం జెందెడు వేగినాడొగిన్. 2671

కుమారనృసింహము, ఆ 2.

## — • పాదసంవాహనము. • —

క. రాయైనం గొంత మేల్ నారాయణ మీ మనసుకంటె • రహి నీకె నెప్పుడునో
మీయంత దపవెదరె యని, యాయంగన యతనిపాద • మల్లన పట్టెన్. 2672

ఉ. పట్టి యొకింత యొత్తుచును ♦ పాన్పుకడన్ వెసఁ గూరుచుండి హాళిం
బట్టిన నొప్పు నూరువుల♦పై నిడి యొత్తి తదంఘ్రి యంతఁ జ
న్కట్టుపయిం ఘటించుచును ♦ గన్నుల చేరుచుకొంచుఁ జెక్కిటన్
గట్టిగ నద్దుకొంచుఁ దన ♦ గాటపుఁగూరిమిఁ జెల్వ మిక్కిలిన్. 2674

కళాపూర్ణోదయము, ఆ 4 పద్య 115, 116.

## ♦ ప్రియతాడనము. ♦

మ. జలజాతాసన వాసవాది సురపూ♦జాభాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిరమ♦చ్చో వామపాదంబునం
దొలఁగన్ద్రోచె లతాంగి యట్లయగు నా♦థుల్ నేరము ల్సేయఁ జే
రలుకం జెందినయట్టి కాంత లుచిత♦వ్యాపారముల్ నేర్తురే. 2675

పారిజాతాపహరణము, ఆ 1 పద్య 121.

క. ఘనమంజీరము ఘల్లన, వనజజరుద్రాదివిబుధ♦వరసేవ్యంబై
తనరు హరిశిరమునచొప్పె, వనజేక్షణ ద్రోచె వామ♦పాదముచేతన్. 2676

రాధికాసాంత్వనము, ఆ 4.

## ♦ పాదతాడనము. ♦

శా. కైలాసాచలసన్నిభం బగుమహా ♦ గంభీరగోరాజముం
గాలక్రోధుఁడు దండహస్తుఁడు నృపా♦కారుండు క్రూరుండు జం
ఘాలుండొక్కఁడు శూద్రుఁ డాసురగతిం♦ గారుణ్యనిర్ముక్తుఁడై
నేలం గూలఁగఁ దన్నెఁ బంచితిలఁగా ♦ నిర్ఘాతపాదాహతిన్. 2677

శా. ఆలోలాంగక నశ్రుతోయకణజా♦లాక్షిన్ మహాంభారవన్
బాలారూఢతృణావలీకబళలో ♦ భవ్యాప్తజిహ్వాగ్రనాం
దోళస్వాంతనజీవవత్సనుదయా♦ద్దుఃఖాన్వితన్ ఘర్మకీ
లాలాపూర్ణశరీర నామొదవు ను♦ల్లంఘించి తన్నె న్వడిన్. 2678

భాగవతము, స్కం. 1 పద్య 411, 413.

## ♦ పాన్పు. ♦

సీ. జీవదంతపుజగా♦జీనిసఖాను మే,ల్తళుకుటద్దపుబిళ్ళ♦ బెళుకురవలు
వింతసంతనఁ జేసి♦విప్పుగా దాపిన, హురుమంజిపూసల♦ మెఱుఁగుకుచ్చు
లూనిచి తీర్చినసొంపు♦మిసుకైనకెంపురా, మొనముక్కు లూడెడు ♦ ముద్దుగులుకు
కళుకుఁగ్రొంబనిపచ్చ♦చిలుకలు రహిమించు, తొగరాచలువరాల ♦ నెగడుతోవ

గీ. గలవగలనిండుపచ్చని ♦ జిలుఁగుప్రతిమ, కతల నిరవొందు చిత్తర్వు♦కప్పురంపు
మెప్పు మేల్కట్లుచవికెలో♦ మెఱయుహంస,తూలికాతల్పమునఁజేర్చి♦తోయజాక్షి.
హంసవింశతి, ఆ 4 పద్య 109.

చ. నిగనిగ లీనుచున్నహరి ♦ నీలపుఁబట్టెలు గూర్చినట్టి పెన్
బగడపుఁగోళ్ళమీఁద జిగి♦వాఱఁగఁ దాచిన గొప్పముత్తెపుం
బొగడలపట్టెమంచమునఁ ♦ బొల్చు కళాపురిపట్టుపాన్పునన్
భుగభుగ తావిగుల్కుకొను ♦ పూవులపైఁ బవళించి వేడుకన్. 2680
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 5 పద్య 99.

చ. పగడపుఁగోళ్ళఁజందనపుఁ ♦ బట్టెలఁ జెన్నయి పద్మరాగపుం
బొగడల నంటి కెంపుజిగిఁ ♦ బొల్పగు వ్రాఁతల మేలుకట్టుతో
సొగసగు పందిరింగలిగి ♦ శోభిలి మానసభూనిధానమై
భుగభుగ తావులీనుకొను ♦ పూవుల పానుపుమీఁద నున్నెడన్. 2681
వాసవదత్తాపరిణయము, ఆ 5 పద్య 93.

సీ. సొగసైన జిగిమించు ♦ పగడంపునుఁగోళ్ళ, బలితంపుతమ్మికెం♦పులబరిణలు
మేలినీలంపునన్ ♦ రాలగంబంబులు, నందమౌచందిరా ♦ పందిరియును
క్రొత్తకాముత్తెంపు ♦ పెత్తులబలుజాలు, జాలవాడాల్గల ♦ చాదినియును
నిద్దంపుటద్దమ్ము ♦ లద్దినపట్టెలు, పరవైనహొంబట్టు♦పట్టెడయును
గీ. కుందనపుబొమ్మలునుగల్గి ♦ యందమమరు,నొక్కపువ్వులపాన్పుపై♦యొడలుఁజేర్చి
విరహశరనిధిఁ దరిజేర♦వెరవులేక, తరుణి నిట్టనితలఁచు డెం♦దమున నతఁడు.
కవిచకోరచంద్రోదయము, ఆ 2.

## ♦ విండ్లు. ♦

గీ. విల్లుపట్టిన సెలపది♦నాళ్ళలోన, వీఁకకలిగిన తడవిల్లు ♦ వెదురువిల్లు
సెలనువిల్లును మొదలైన ♦ చేఁగవిండ్లు,చులకఁగాఁదీసిశబరేంద్ర♦సూనుఁడేయు.
కాళహస్తిమాహాత్మ్యము, ఆ 3 పద్య 35.

## ♦ బాణములు. ♦

సీ. పిడుఁగులలోఁ గాపు ♦ పొడతేవుఘనము లు,ల్కాసహస్రంబులో ♦ కాపు ధరణి
యడలదు కాలస♦ర్పావళులలోఁ గాపు, పాతాళవివరంబు ♦ బయలుపడదు
శిరమైన ముక్కంటి ♦ కంటిమంటలఁ గాపు, జగదవసానంబు ♦ జాడలేదు
కాలకూటార్చులలో ♦ గాపు మందరసూత్ర, మానితాహీనుఁడు ♦ గానఁ బడఁడు

ఆ. మ్రొక్కఁ దెలియఁగరాదు ♦ మునుకొనిపుట్టిన, చొప్పు తెలియరాదు ♦ చూడ నెచట
నని శరీందు శ్రీలిప్తిపై ♦ లాజిఁదల్లడమందె, రిందరిజిత్తుతూపు ♦ లేపుచూప. 2684

భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 939.

—♦ బావి. ♦—

శా. అభితౌసర్ఘ్యనిబద్ధశుద్ధశశికాం ♦ తాయామసోపానసం
గమ మంబుగ్రహణాగతోరుపథికా ♦ క్రాంతస్ఫురత్కుట్టిమం
బమలాంభోరుహషండపాండుకుముదా ♦ చ్ఛామోదసంవాసితం
బమృతప్రాయజలాభిపూర్ణ మగుచు ♦ న్నా బావి యొప్పుం గడున్. 2685

హంసవింశతి, ఆ 1 పద్య 185.

—♦ ఆయుధనామవిశేషములు. ♦—

సీ. భిండివాలాసికో ♦ దండభల్లూతకి, నారాచరోహణ ♦ నఖరవజ్రి
ముష్టిముద్గరశూల ♦ ముసలభుసుండిక, ప్రాసపరిఘకార్ముక ♦ కృపటకటారి
కాగరాథోద్దండ ♦ కణయకుంతాంతళ, పరశుతోమరచక్ర ♦ పరిఘపట్టి
సములువంకిణికాది ♦ సబళంబు చివ్వఁటె, సెలకట్టె యాదిగా ♦ నిల నుతింపఁ
గీ. దనరుముప్పదిరెండాయు ♦ ధములు మఱియుఁ, జిలుతచెయ్యమ్ము గండక ♦ త్తెరతుపాకి
గొరకను సుగాలమును గ్రద్ద ♦ గోళ్లు బుక్కె, చూరిబాణాధరించున ♦ వ్వీరుఁ డెపుడు.

హంసవింశతి, ఆ 1 పద్య 205.

—♦ ఘటనామవిశేషములు. ♦—

గీ. కాఁగు మజ్జిగముంతయుఁ ♦ గడవ గూన, బాన వెసలయు బుడిగెలు ♦ పరపు చట్టి
కడవముంత కరిగె దుత్త ♦ పిడ్డతిగురిగి, కుందె నటికయు మూఁకుడు ♦ బిందెప్రమిదె.
చ. చెవులపెనంబు గోలమును ♦ జిల్లుల సిబ్బియు దోనితొట్టియుం
గువిచిలుమూఁతమూలయును ♦ గుమ్మెత యందపుధూపపాత్రిపై
సవరని బూజిపెందొనయు ♦ సానికె యొప్పు కమండలంబు వే
డ్తావ తెవకంబిదుత్త సెర ♦ డుల్చియుఁ గప్పెరపంటు లాదిగన్. 2688

హంసవింశతి, ఆ 5 పద్య 11, 12.

—♦ భూషణవిశేషములు. ♦—

సీ. కుప్పెరాగడిబిల్ల ♦ కుంకుమరేఖ పాపటబొట్టు కమ్మలు ♦ బావిలీలు
[illegible] చంద్రవంకలు ముక్కుసకము కెంపు, రవలపల్లెరుఁబూవు ♦ రావిరేక

జోగడలు నానుఁగోరి♦వులు తీఁగ షెడనూలు, కుతికంటుసరపణి♦గుండ్లపేరు
సరిగె ముక్కర బన్న ♦ సరము నుత్తుండాలు, కంకణంబులు తట్లు♦కడియములును.
గీ. సందిదండలు శొడ్డాణ♦ మందమైన, ముద్రికలు హంసకంబులు ♦ (మోయఁగజ్జె
లలరుబొబ్బిలికాయలు♦గిలుకుమట్టె,లాదియగుసొమ్ము దాల్చియ♦య్యబల మెఱయు.
హంసవింశతి, ఆ 2 పద్య 190.

సీ. రతనంబుకీల్జడ♦రహికొప్పుగొలుసులు, శశిపువ్వు రాగిడీ♦చంద్రవంక
పాపిటబిందీలు ♦ పచ్చబొట్టు పహారంగు, కమ్మలు బవిరెలు ♦ గుమ్ముటీలు
బొగడలు ముత్తియం♦పు మెఱుంగుముక్కర, పగడాలపేరులు ♦ జిగిచెలుంగు
బాజుబొందులు జిల్కు♦పనికీల్కడెంబు పోఁచీలు బటువు లుంగ♦రాలు చిన్న
గీ. గంట యొడ్డాణ మందియల్ ♦ గజ్జెలంద, మైనమట్టెలు పిల్లెండ్లు♦నాదిగాఁగఁ
దోఁడవు లెల్లను మైనిండఁ ♦ దొడిగిదర్పణమునఁ దననీడఁజూచి యూ♦వండ మెుంది.
శకుంతలాపరిణయము, ఘ. వేం. ఆ 3.

ద్విపద. పసమించుముత్యాల♦పాపటబొట్టు, పౌజాలకమ్మలు ♦ పల్లేరుపూలు
రాజిల్లురత్నాల♦రాగిడిబెట్టి, కెంపులముక్కర ♦ గిలకసరంబు
సొంపుతో వజ్రాల ♦ జోడుహారములు, బంగారుపట్టెడ ♦ బన్నసరములు
రంగుపచ్చలయుంగ♦రంబులు మెఱయ, నబ్బురంబైయుంద♦మాచిల్కతాళి
గుబ్బచన్నులమీఁద ♦ గునిసియాడంగ, సందిటితాయతుల్ ♦ జరలుదూగాడ
గందుబొల్లనిపైఁడి ♦ కంకణంబులును, ఘంటల మొలనూలు ♦ కాళ్లగజ్జెలును
దంటమెట్టెలువింత ♦ దళుకొత్తుచుండ,... ... ... ... 2691
సారంగధరచరిత్రము, శంభు. ఆ 1.

## —♦ ధాన్యాదులు.

సీసమాలిక. బంగారుతీగెలు ♦ గంగాజలమ్ములు, కస్తూరినిగరాలు ♦ కటకసరులు
నిప్పపూరాజనా ♦ లేనుంగుకొమ్ములు, మల్లెశ్రీగంధులు ♦ మదనగంధు
లేలికరాజనా ♦ లీశ్వరప్రియములు, రావిపూరాజనాల్ ♦ రత్నసరులు
కుసుమపూరాజనా ♦ లుత్తిబల్లుత్తులు, కస్తూరిపట్టెలు ♦ గంధసరులు
మందిగంద్రలు నాగ♦మల్లెలు తీఁగెమల్లెలు కృష్ణనీలాలు ♦ వెలువడాలు
మన్మథబాణాలు ♦ మరువంపుమొలకలు, సన్నమణింగెలు ♦ జొన్నఁబ్రాలు
పొన్నశ్రీరాజనా ♦ లుప్పునుఁగురాజనములు, ముద్దుపాలిలారట్లు ♦ ముత్తుసరులు
పన్నమూదులు పచ్చ♦గన్నేర్లు గోదండ, రామము లేకసన్ల ♦ రాఘుసన్లు

చందదివంకలు జీని♦సరులు కాంభోజులు, వంగాకు బొడ్డములు ♦ పొంగుఁబాళ్లు
జిలకఱ రాజనా ♦ ల్చింతపువ్వులు గోరు,రాజనా లూర్బదపోళ్ళ ♦ రాజనాలు
రామబాణాలు కె♦క్కాములు వెన్నముద్దలు జిల్కర బుడమలు ♦ దాళువాలు
గొబ్బికాయలు ఇలు♦గుత్తులు పాలమీఁగడలు శ్రీరంగాలు ♦ కామదార్లు
అక్కపాలలు కాకి♦ఱెక్కలు పుష్పమంజరులు సీతాభోగ♦సరులు గౌరి
కుంకుమల్ రణపెండ్లి♦కొడుకులు పిచ్చుక, గోళ్ళుప్రయాగలు ♦ గొజ్జుఁగ్రాలు
గరుడసరు లొప్పతు♦గంటరాజనములు, సోఁదుగతొడిమలు ♦ ముదుకసరులు
పచ్చసరుల్ రెడ్డి♦పాలవంకెలు మఖి, భోగులు పచ్చక♦ర్పూరసరులు
నివ్వరు ద్రెబ్బస ♦ లీన్నరుకావులు గాజు, కప్పెర లుక్కురువడా ♦ లక్కంతసరులు
సాలంక లలుగురా♦జనములు సంభావ్రు, లవసరదార్లు మో♦హనపుసరులు
మణిసరు ల్కసరులు ♦ మంకెన ల్పగడంపు, తీఁగెలు మడిప్రాలు ♦ దేవసరులు
ఉత్తుకబొత్తులు ♦ లక్ష్మీమనోహరా, ల్భారతీసేసలు ♦ బాహుపురులు
వజ్రపుఁదళుకులు ♦ వాసనరాజనా, ల్జవ్వాజివంకెలు ♦ గవ్వసరులు
సంపంగిపూవడ్లు ♦ జాజిరాజనములు, గంబూరరాజనా ♦ లక్కాస్నసరులు
తమ్మిపూరాజనా ♦ లమ్మడుకొణిగెలు, జీనువముక్కలు ♦ చిలుకముక్కు
లేదుళజ్జలు వంకె ♦ లినుకరాజనములు, పులిగోళ్లవంకెలు ♦ బొగడసరులు
గీ. జిలితొగలరాజనమ్ములు ♦ నలవరులును, దెల్లనల్లచెన్నంగులు ♦ దివసరులు
వాది యగు పేర్లుగలుగువ♦డ్లతనియింట,నుండుశతకోటిపుట్లులొ♦క్కొక్కదినును.
హంసవింశతి, ఆ 5 పద్య 128.

సీ. శిరిరామవంకియుఁ ♦ జిటిబలుగుత్తియు, శిరికేసరియు శక్తి ♦ శిరిదరంబు
నీశ్వరపిరితియు ♦ నేనుఁగుకొమ్మును, బోడసంపంగియు ♦ నోడషఠియుఁ
గన్నూర్తినికరంబు ♦ గర్పూరభోగియు, కావలికాంభోది ♦ కనకగిరియు
దేవాన్న సొలిమియు ♦ దేవడన్నియకొట్టి, నీరుచంచలియు శృం♦గారభోగి
గీ. వంకిప్రాసంగిసంపంగి ♦ వారణాశి, కామధేనువునాకేళి ♦ గంద్రిగోళి
వెదురుమలయంబుబుడమయు♦వెలుపడంబు,రాచ మెచ్చునుములువంకి♦రాజనములు.
క. సెనిగెయు గోధూమంబును, మినుములు ముద్గంబు కంతి♦మెంతియు మిరియం
బనుములు మొదలగు సస్యముఁ, గొనగొని శిశ్రకవుణకొండ♦కోటులుపండున్.
వైశ్యపురాణమ్ము, ఆ 4.

## వృక్షదోహదము.

సీ. నీరెత్తువేళల ♦ నీరెత్తుఁ బాదుపాదునకుఁ గాలువలు పొం♦దుగ నమర్చి
త్రివ్వటంబులతతిఁ ♦ ద్రివ్వటంబులవేట్టుఁ, దగునట్టుకట్టుగు♦ట్టలి గడించి
యెరువుఁ జల్లెడువేళ ♦ నెరవుఁ జల్లుగ తాభి, మానుఁడై గంపలఁ♦దాన తెచ్చి
యంట్లొత్తుపదనున ♦ నంట్లొత్తు నెలమిఁగాన్పించులేఁగొమ్మలు ♦ వంచివంచి
గీ. నారువోయంగవలయుచో ♦ నారువోయుఁ, గొమ్మనాటంగఁదగునెడఁ ♦ గొమ్మనాఁటు
నొకటివినువక యంతకం♦తకును హెచ్చు, హాళితోడను శాలీనుఁ♦డవిరతంబు. 2695

లయగ్రాహి.

అంగపరిఖేదము నె♦ఱుంగ కతఁ డీగతిఁ గ♦డంగి తులసీవనముఁ♦జెంగలువలుం గే
దఁగులును జరపకము♦లుం గురువకంబులు ల♦వంగములుజాదులును♦లుంగతతులుం గో
జ్జంగులునుమల్లెలును♦రంగములుఁబాటలము♦లుంగదళికాచయముఁ♦దుంగతతులున్ నా
రంగములునాదిగధ♦రంగలుగునట్టిహృద♦యంగమబహుద్రుమకు♦డుంగములఁబెంచెన్

సీ. తోరంపుఁజనుదోయి ♦ తుళ్ళింతల నిడంగఁ, దగుచొల్లుగుద్దంటఁ♦ద్రివ్వితివ్వి
వేఁగైనపిఱుఁదుబ♦ల్విడిఁజలింపంగను, వడినిట్టునట్టును ♦ నడచి నడచి
యడుసుతుంపురుచెక్కు♦టద్దంబులనుబర్వ, మళ్ళకుమడవలు ♦ మార్చిమార్చి
నడుములేదీవియ ♦ నకనకల్ గుడువ నిం,పునఁ దగు మోఁపులు ♦ మోసిమోసి
గీ. చిఱుచెమటఁజేర్చువింతక్రొ♦మ్మెఱుఁగుతోడఁ, గోమరు మేనొప్పసారెకుఁ♦గొప్పు వదల
నేమిటికినైనఁ దోమున్న ♦ యేఁగియేఁగి, యెల్లపనులునొనర్చెనిం♦పెసక మెసఁగ.

కళాపూర్ణోదయము, ఆ 4 పద్య 78, 78, 96.

## వృక్షజాతులు.

సీసమాలిక. రావి మామిడి కొండ♦రావి మేడియు బ్రహ్మ,మేడియు జీడిమా♦మిడియుఁ జింత
పులిచింత మోదుగు♦ములుమోదుగును వెల్గ, పుల్లవెలగ వట్టి♦బిల్ల చిల్ల
బూరుగ కలుగొట్టు ♦ భూతపాపిరి కుక్క, బూరుగ చిటిగొట్టి ♦ భూతనెరిడ
నేరేడు మఱి యల్ల♦నేరెడు పాదిరి, తెడగూబ తెడ టేఁకు ♦ కడపబట్ట
కడపకొడిసె పాల♦కొడిసె నెత్తిలొద్దుగు, చిఱుటేఁకు లొద్దుగు ♦ జీడిపాల
కలుజువ్వి వావిలి ♦ గండువావిలి యేరు, మద్ది మద్దియును నే♦లొద్దిరొద్ది
తెల్లకాంచనము తుం♦డిల మెట్టకాంచన, ముప్పి తెల్లుప్పి నీ♦రుప్పి యుప్పు

తోండ్రిచందన మేపి ♦ దాసాన మెట్టదా, సానము బందుగ ♦ జారజేన
మజ్జివిరికి తొండ్లి ♦ మజ్జితూ కిచ్చేద, పెద్దవిరిగి వక్కి ♦ గద్దనెల్లి
కాకితూ కందుగు ♦ కానుగు వరగోఁగు, గోఁగుబొట్టుకచిక్కి ♦ గోఁగుకొండ
గోఁగుపొగడములు ♦ గోరంటలును బెద్ద, వెలగ సుంకేసరి ♦ వెల్లిచిక్కి
నారుప సురపొన్న ♦ పారిజమును భొన్న; నెల్లి ఊలుగబిల్లు ♦ నెమలియడుగు
కొండగుమ్మడు రేఁగు ♦ గొరమి సంపఁగికొండ, సంపెంగ మారేడు ♦ సరళ దేవ
దారు గుమ్మడు బోవి ♦ తపసియుఁ గుమ్మర; పొల్కిగుగ్గిల మెట్ట ♦ పొల్కి వేగి
దేవదారుసిరికె ♦ తిలకము తెల్లన, గిరి వేఁప కరివేఁప ♦ తురకవేఁప
వేరుపనస గుత్తి ♦ వెత్తినారుప రేల, పనస కరకకొమ్మి ♦ పలుకరేణి
బండచింతయు నల్ల ♦ బలుసు సురభి చీకి; రేని కూకుడు నెమ్మి ♦ పేరింఖణమ్ము
భూతాంకుశ మశోక ♦ భూర్జపత్రిమ్ములు, బోళము మంకెన ♦ పులసుగంగ
రేఁగు తక్కిలి ములు ♦ వేగి భూశర్కర, పెకుకన కొక్కస ♦ ముల్లుభూను
హనుమంతబీర మం ♦ కెన గిరికర్ణిక; పెడమల్లె కొండము ♦ క్కిడియుఁ గోల
ముక్కుదాడిమ బీర ♦ మొగలింగ గోదాడు; నేదాడు, ఖర్జూర ♦ మీఁత నేల
తాడి బగిస పోఁక ♦ తాడు కొబ్బరచెట్టు, పెద్దమాను పతంగి ♦ బెండగలుగు
గీ. కణుదు రిరుకుడు కాలుగ ♦ కాస్త సన్న, విరిగి సోమింద గున్నంగి ♦ దిరిసెనంటు
బెఁచలు గాఁ గల్గు బహువిధ ♦ భూరుహములు, నిండియుండెడు కానల ♦ పిండులరసి.
హంసవింశతి, ఆ 4 పద్య 11.
ద్విపద. చరిదసఖర్జూర ♦ జంబుజంబీర, మందారబూరుగ ♦ మహిసాలతరులు
మద్దిపాలయుకొండ్లి ♦ మారేడు వెలగ, బొద్దిపామరజమ్మి ♦ పులి మేడి మేడి
పాడిగి పెన్ తంగేడు ♦ భూతాంకుశంబు, కడిగి చింతయుకల ♦ గట్టురంగారు
అరటికొమ్మయు పన్న ♦ యాల్లనేరేడు, కరకయు వెలగయుఁ ♦ గానుగు తాడి
మజ్జి జువ్వియు నెమ్మి ♦ మామిడి జీడి, బల్ రక్కసియు రేగు ♦ పాలగోరంట
మోదుగకలబువ్వ ♦ మొగిలిసంపెంగ; గేడంగియును నారి ♦ కేళవారిజము
దేవదారువు కలి ♦ దేవకాంచనము, పావిరి రేలము ♦ ప్వంచుపంచాది
పొటుకురు ప్రుసిరిక ♦ పోకనారింజ, కడుకురుగుమ్మడి ♦ కస్తూరితుమ్మ
చిరుమారుబూరుగు ♦ చిల్లచెన్నంగి, కొడిసెముష్టియుగొండ ♦ గోఁగువాక్కిలి
బలుసుముల్ మోదుగ ♦ పచ్చారెయారె, వలిచంద్రములు పండ ♦ వాడగన్నెరు
కలయుమ్మ పొగడపు ♦ న్నాగవృక్షములు, ... 2699
శారంగధరచరిత్రము, శంభు, ఆ 2.

—◆ చిఱుచెట్లు. ◆—

సీసమాలిక. జిల్లేడు వెంపలి ◆ జిడ్డువెంపలి పైఁడి, తంగేడు తంగేడి ◆ తగిడి ముస్తె
ములువెంపలి ములుస్తె ◆ గలిజేరు గుంటగ, లేరును దంతిబం◆దారి నేల
తంగేడు మెట్ట బం◆దారి దుండుగ బ్రహ్మ, దండి భూతులసెజ్జ◆దొండి చల్ల
పిల్లిమాడుపు చార ◆ పిల్లడు చిత్రమూలము నల్లతీఁగె కో◆లాకుపొన్న
ముయ్యాకు పొన్నయు ◆ మొగబీర తుత్తెర, బంకదుత్తెర హంస◆పాది గరిటె
కామ జిలుగు మెట్ట◆దామర వెఱ్ఱిసెనగ జంబిరము కాచి ◆ నల్లకాచి
శిరితులసియు సంబ◆రేణు నేలుసిరి కీశ్వరి నేలవే మాటి ◆ చల్లగడ్డ
సహదేవి జుట్టుప ◆ చలిపిండి చిటిమూటి, పెన్నేరు విషబొద్ది◆పిండి దొండ
నెనుటాయి గొలిమిడి ◆ నీరుబచ్చలి ప్రబ్బి, వేరు గన్నేరు రాఁడు ◆ బీర నేతి
బీర పేరా ముట్టి ◆ పీచరములు గొలిమిడి చేదుపొట్ల యు◆మ్మెత్త తిప్ప
తీఁగె విష్ణుక్రాంత◆తిం డెబ్రిచిత్రమూలము దొండతీఁగెము◆ల్లంగి గొల్ల
జీడెద్దు మల్లెకు ◆ చేగొత్త చంద్రకాం, తెట్టనియబ్బెంద ◆ రెఱ్ఱతుమ్మి
కుప్పి సూర్యక్రాంత ◆ ముష్టిడు నరవండు, గాడిదకడపర ◆ కన్నెకొమర
నల్లగెంటెనపూలి ◆ తెల్లగెంటెన యుత్త, రేణు సుబ్బిరి సంబ◆రేణు బండి
గురిగింజ గురివింద ◆ తురతపత్రియుఁ బత్తి, తలదిడ చబ్బంద ◆ నులియచీక
వెలగ విషముదారి ◆ వెఱ్ఱికుందెన మంచి, కుందెన కలబంద ◆ గువ్వగుత్తి
మామెనయును నేల◆మామెన యటకమామిడి దూల గోవెల ◆ మేఁక మేయు
గీ. సాకు నల్లేరు నుశిజెము ◆ డాకుఁజెముడు, నేలపటకకసిందెయుఁ ◆ గోలచెముడు
జొంతచెముడుల్లియును సదా◆ముష్టి మొదలు, గాఁగలుగునట్టిచిఱుచెట్లఁ◆గాఁచియుంత.

హంసవింశతి, ఆ 4 పద్య 10.

—◆ కాయగూరలు. ◆—

గీ దోఁడకాయ ములుకకాయ ◆ తొట్లకాయ, జంబికాయయు నెల్లిల◆సందకాయ
వెలయును సైకాయయు రామ◆ములకకాయ, మేడికాయకాచరకాయ◆గూడనిల్క.
సీ. రామగుమ్మడి యోబ◆రాజుగుమ్మడి చార, గుమ్మడి బూడిదె◆గుమ్మడులును
గిండిసొఱయు దీఁగె ◆ కిన్నరసొఱయును, బీర సముద్రపు◆బీర నేతి
బీర పిచ్చుకపొట్ల ◆ పెద్దపొట్లనుఁగు, దంతపుఁబొట్లలు ◆ తంబలు వలి
కాకర పొట్టికా◆కరలు మేఁకచెవి చిక్కుడుపాలగుఁపుల◆గోరుచిక్కు

గీ. దులు సుగంధాలు బొంతసం♦టులు సురఘులు, గంజిపండిటీకపురపొం♦కాయతరులు
బూజుపచ్చకపురాసాని♦పుచ్చ బెద్ద,దోస నక్కదోసలు వాని♦తోఁటఁగలవు. 2702
ఆ. చేమ కంద గెనుసు ♦ చిటిగోరు పెండ్లము, పొనఁగు తెల్లగెనుసు ♦ భూతగెనుసు
ఉల్ల ముల్లి పసప ♦ ముల్లంగి వెల్లుల్లి, గాజరయును మొదలు♦గాఁగఁ గలవు. 2703
చ. గురుగుఁ బొద్దిచెంచలియును ♦ గుచ్చలి చిత్తి తగిర్సి తుమ్మి దు
స్సరి బలుగూటిబొద్ది నెలి ♦ చక్మిలి పల్లెరు రూకపాత్కె వె
ల్వరిగిసె మున్గ వెల్గ చెవి ♦ పావిలి దొగ్గలి పొన్నగంటి దే
దరి నరవంజిచేత రస♦దావయు గోఁగులికొండ పిండియున్. 2704
గీ. పాలవా మింటతక్కలి ♦ బచ్చలి కొయి,గూర చక్రవర్తము చిల్క♦కూర గోళి
కూర దుంప బచ్చలితోఁట♦కూరకొలిమి, రాకుసోపు మెంతాకుచు♦క్కాకుగలదు.
హంసవింశతి, ఆ 4 పద్య 129—133.

## ఫలజాతులు.

సీ. పనస సీతాఫలా♦ల్చివనిమ్మ గజనిమ్మ, దూదినిమ్మయు నార♦మాదిఫలము
నారదఖర్జూర ♦ నారికేళాదులు, రామఫలంబులు ♦ జేమఫలము
లలరారు బొంతకి♦త్తిలియుఁ బోఁకయుఁ బోఁక, పిప్పలి నేరేడు ♦ పెద్దవెలగ
రామావళియు గమ♦రకజీడిమామిడి, బాదంగి పెనురేఁగు♦పాల ఫలము
గీ. చెట్లు పండెడితోఁటలు ♦ చిట్టుగొట్లు, చెఱకు రసదాళిచెఱకు కొత్త♦చెఱకు నల్ల
చెఱకుతోఁటలు కలుజొన్న ♦ సీర్పి దినును, కారపా కాకుతోఁటలు♦గల వతనికి.
హంసవింశతి, ఆ 4 పద్య 134.

## ఊరుగాయలు.

సీ. మామిడికాయయు ♦ మారేడుగాయయుఁ, గొండముక్కిడికాయ ♦ కొమ్మికాయ
గరగుకాయయు వెల్గ♦కాయ యంగుగుకాయ, లుసిరికెకాయలు ♦ నుస్తికాయ
లేకరక్కాయయు ♦ వాఁకుడుకాయయుఁ, జిటిసెల్లికాయయుఁ ♦ జిల్లకాయ
కలబంద గజనిమ్మ♦కాయ నార్దబకాయ, చిననిమ్మకాయయు ♦ జీడికాయ
గీ. కొండనపుఁగొమ్ము మామెన♦కొమ్ము బుడమ,కాయయల్లము మిరియంపుఁ♦గాయ బీఱ
కాయ కంబాలు కరివేప♦కాయ లాది,యైన యూరుఁగాయలు గల♦వతనియింట.
హంసవింశతి, ఆ 4 పద్య 135.

## తీగజాతులు.

సీ. బిల్లపీచర నక్క♦పీ చెల్క చెవి గొట్టె, పాలలంబును మేఁక♦పాలలంబు
బుడ్డకాసరియట్లు ♦ బొండిదొంతరలంబు, మాడుపుగురుగును ♦ మదనకట్టె

నూనెముంతలమును ♦ నానఁబ్రాలలమును, గుండగురుగుపాల ♦ పెండ్లలంబు
పాల్గుగాడియు నల్ల♦పూలల మినుకచెం,చలి కందికారయ ♦ గిలకలంబు
గీ. కన్నెకొమరెద్దుమట్టెకప్పు ♦ వెన్నవెదురు, లంజెసవరము వెత్తిపూ♦లలము చిట్టి
బొట్టలము గోళ్ళగొండియు ♦ కట్టలంబు, నల్లతిఁగాదియలములు ♦ నశ్ళవిడిచి.

హంసవింశతి, ఆ 5 పద్య 43.

—♦ కంపలు. ♦—

సీ. కోరింద వలతుమ్మ ♦ గొటికె కోడారయ, వెఱుకు రూముగ దంతి♦వెఱ్ఱినిమ్మ
చిటిగార సుందరి ♦ చీకెఱ్ఱదుమ్మయుఁ, దెల్లదుమ్మ కిలింద ♦ కల్లితొట్టి
జమ్మి బలును గార ♦ చంద్రపజికి తెల్ల, వుప్పి లొద్దుగ జిడ్డు ♦ బుడ్డతుమ్మ
కలివిరి గుంద్రయు ♦ గచ్చపెన్నంగయు, దుష్టమంగయుభూత ♦ తొట్రుకోవె
గీ. మాష్ప చిటికొక్కి సీకాయ ♦ మంద్ర తొట్ల,వెలగవాపుడుపల్లేరు♦ములకవేఁప
నగిరె నీర్గొబ్బి మొదలుగా ♦ జగతిఁ గల్గు, కంపలన్నియు వేవేగఁ♦గడచి కడచి.

హంసవింశతి, ఆ 4 పద్య 9.

—♦ దీపవిశేషములు. ♦—

మ. జగతీద్యోతులు కాగడాలు బలుబం♦జాయీలు మోంబత్తులుం
బగలొత్తు ల్దివటీలు దీప్వళిఖులుం ♦ బంజా ల్మహాజ్యోతులుం
దగ సూర్యప్రభ లాయిలాయులును జం♦దర్జ్యోతులున్ మైనపున్
జిగటా ల్చెచ్చినపంజా లారతులు న♦గ్నిజ్యోతులు న్వెల్గఁగన్. 2710

హంసవింశతి, ఆ 3 పద్య 28.

—♦ విద్యుద్దీపములు. ♦—

సీ. ఒకదీపమార్చిన ♦ నున్నదీపంబులు, నప్పుడ తమకుఁదా♦మాఱుటయును
దాలవృంతానిల♦చేలాంచలాదిక, వ్యాపారములదీప♦మాఱమియును
నాఱినదీపంబు♦లపరియత్నంబున. మఱిచూడఁజూడంగ ♦ మండుటయును
మండియాఱియు నాఱి ♦ మండినదీపంబు, వెలుఁగుజీకటియుఁ గా♦వించుటయును
గీ. గలుగునట్లుగ వరశక్తి ♦ కలనరాజు, శిల్పములనవ్వుటాలకుఁ ♦ జేయుచుండెఁ
దరుణికుతుకర్త్ర పాద్భుతా♦తంకభార, సంకటస్థాయియై సాది♦శాంకముర్వి. 2711

శృంగారనైషధము, ఆ 7 పద్య 169.

చ. అమరపురప్రియోలికల ♦ నంతటనిల్చువిమాన దివ్యకం
బములవయి న్వెలింగెడిని♦భాసితదర్పణపేటికావళిదీ

పము లలరారు రేల రవి♦పర్వఁగ దోఁ జనలేక చిక్కి న
ర్యమకిరణాళిఁ బట్టి యిరు♦లప్పురిఁ గారలఁ బెట్టెనో యనన్. 2712

మ. పరిజవర్ణింపఁ బరితోళికాళిపణికా♦పణ్యాపణాట్టాలక
ప్రజమం బంబరవీథిఁ బాసి నగరిం♦ బ్రాపించు తారాగణం
బుజగల్మిఁ నిశాముఖంబులఁ బురిం♦బొల్చున్ దివారాత్రిఘృ
ష్టిజసంధ్యానలవిస్ఫులింగశకల♦శ్రేణుల్ ప్రదీపావళుల్. 2713

చెన్నపురీవిలాసము, సన్నివేశపరి. పద్య 5, 6.

## ధూపవిశేషములు.

ద్విపద. అతిసుగంధంపుద♦శాంగమానంగ,నతియు సురభియు నా♦వర్తధూపంబు
మలయానిలంబును ♦ మహిసాక్షి, మష్టి, కలహంసధూపంబు♦గామికామోద
మును మనోహరధూప♦మును దివ్యధూప,మును జనవల్లభా♦మోదధూపంబు.

పండితారాధ్యచరిత్రము, పర్వత. ప్రక. పుట. 368.

## సుగంధద్రవ్యాదులు.

గీ. చాదు శ్రీగంధ మగరు కే♦సరి కదంబ, మత్తరు పునుంగు జవ్వాది♦హరిణమదము
బుక్క యత్తరు కోవగం♦బూర బోలు, చట్టకలపంబు ఘన్నీటఁ♦జాది పూసి.

సీ. తక్కుటన్దంపుని♦ద్దపుబిల్వటన్దముల్, దంతంపుసువ్వానల్♦తావు లొలుక
నత్తరుఁ బునుఁగును ♦ నంబరు గౌళిక,మ్మార్చరముల్ నఖము గం♦బూరచోవ
జల్లిసవరములు ♦ జిల్లరసము కద్దంబము గోవజవ్వాజి ♦ పచ్చిపునుఁగు
కురువేరు పచ్చక♦ప్పూరము పన్నీరు జే,డెను మలాకేఱు కుంకు♦మమును మంచి

గీ. బుక్క కస్తూరి పీఠెలు ♦ చొక్కటంపు, టగరు సంపెంగనూనెలు ♦ నాదియైన
మెచ్చఁగల దివ్యులందుండి♦ తెచ్చినట్టి, వివిధపరిమళవస్తువుల్ ♦ వెలసెఁ దీసి. 2716

హంసవింశతి, ఆ 5 పద్య 140, 352.

## బాణసంచు.

శా. తారాజువ్వ లవాయిగొట్టెపు లగా♦దల్ జిచ్చుబుడ్డుల్ గడున్
వ్యోమామార్గమువెంటనంటవు శత♦ఘ్నుల్ (?) జల్లు పాకు ల్మహా
దారోర్గామములర జెలంగఁగను వి♦స్తారంబులై చక్రముల్
ఖాఅం బాఅ సపారబాణములతో♦భల్మీఁ నింపారఁగన్. 2717

నరసభూపాలరాజీయము, ఆ 1.

## —♦ వాద్యవిశేషములు. ♦—

సీ. భేరులు తమ్మటల్ ♦ వెల్లనిస్సాణముల్, బూరగొమ్ములు కంచు♦వీరణములు
మకిలక్రోవులు వీర♦మద్దెలల్ గిడుగిల్లు, పేరైనతప్పెటల్ ♦ పిల్లఁగ్రోళ్లు
తారలు చిమ్మటా♦తారలు శంఖముల్, కాహళాల్ పసిఁడిడ♦క్కలును బిడులు
గాలికొమ్ములు డోళ్లు♦కైవస్య రుంజలు, ఛత్రసంఘంబులు ♦ చామరములు
గీ. బోరుకలఁగంగ దిక్కులు ♦ బూరటిల్ల, దనుజవర్గంబు లిరువంకఁ♦వదలి కొలువ
వెడలె సన్నాహ మడరంగ ♦ వీరరవము, కరువుగట్టినచందంబు♦గానఁబడఁగ.

మొల్లరామాయణము, యుద్ధ. ఆ 3 పద్య 28.

సీ. ఢక్కలు మురజులు ♦ డంకాలు కాహళు,లబ్బరలచాల్ పండు♦బూర లోలయు
దుడుములు డప్పులు ♦ దోరంబురుంజలు, బాజా లొసానాయిలు♦బారు లోలయు
తాషాలు మరపలు♦దగురామడోళ్లును, డోళ్లును తమ్మటల్ ♦ గోష్లదాఁటు
భేరులగము లర♦బ్బీబాజలును మద్దు, డిండిమంబులచాలు♦గండుమిగులఁ
గీ. గంచుమద్దెళ్లు మతివీర♦కాహళులును, మెఱయమందరమశతభా♦నురపయోధి
రావమునుమించి మిక్కిలి♦రేఁగ మెఱయఁ, దరలివచ్చెను పెండ్లికి♦ధరణిపభుఁడు.

నరసభూపాలరాజీయము, ఆ 1.

## —♦ వస్త్రనామవిశేషములు. ♦—

ద్విపద. కెంజావళియు జయ♦రంజియు సంచు,పుంజంబు మణిపట్టు♦భూతిలకంబు
శ్రీవన్నియయును మహా♦జీనియు జీని, భావజతిలకంబు ♦ పచ్చవిపట్టు
రాయశేఖరమును ♦ రాజవల్లభము, వాసుమేఘము గజ♦వాళంబు గండ
పడము గాఫునసరి♦పట్టునుహంస, పడియక్షీణావళి ♦ పల్లదట్టి
వారణాసియుజిక♦వాయి గెందొగరు, గౌరీగనయమును♦క్షీరోదకంబు
పట్టును రత్నంపు ♦ పుట్టును శంకు,పట్టును మారకత♦పట్టు సొంపట్టు
నెఱపట్టు పేపట్టు ♦ సేతిరింబుపట్టు, మకరోపరాజంబు♦మాంచసోనపియు
చంద్రాతపంబును ♦ సాంధ్యరాగంబు, నింద్రగోపంబు మా♦హేంద్రభూషణము
సన్ననడంచును ♦ శరధియు మేఘు,సన్నియు రుద్రాక్ష♦సన్నె కాంభోజి
పులిగోరుపట్టును ♦ భూపతిరుద్ర,తిలకంబు సరికట్టు♦మలయజసిరియు
కొలనిమేఘము గజా♦వళి హయావళియు, వలిపంబు సగదమిశ్ర♦తెలుపుదివ్యాంబ
రంబును నుదయరా♦గంబు దేవాంబ,రంబు పొత్తియు గుజ♦రాష్ట్రంబుపట్టు
మానితవస్త్రని♦తానముల్ గలవు, ... ... ... ... 2720

బసవపురాణము, పి. సో. ఆ 3.

సీ. సంపంగికావులఁ ♦ జందురుకావులు, వెలిపట్టు పుట్టముల్ ♦ వేటచాళ్లు
జిలుగుబొమ్మంచుల♦చీరలు నాచులు, నుదయరాగంబులు ♦ నుడుతవన్నె
గొప్పముయ్యంచుల ♦ పుష్పాప్పహాన్నంపు, వలువలఁ గరకంచు♦వస్త్రతతులు
ముత్యాలపందిళ్లు ♦ నుత్తరగోగ్రహణములు నిగమగోచ♦రములుఁ బద్మ
గీ. పుఁడిలకలునిండువన్నెలు ♦ బొడలు బచ్చలును హరిణవళ్లు హంసవ♦ల్లులునురంగ
వళ్లు బొదలునుసామంత♦వదులునఁగఁదనరెడుపసందుపటములు♦గొనిరయొకెలకు.

హంసవింశతి, ఆ 5 పద్య ౩౦5.

## ——♦ చామరపరిచర్య. ♦——

సీ. కుచకుంభములమీఁది ♦ కుంకుమతోరాయు,హారంబులరుణంబు♦లగుచు మెఱయఁ
గరపల్లవము సాఁచి ♦ కదలింప నంగుళీ,యకకంకణప్రభ♦లావరింపఁ
గదలిన బహురత్న♦కలితనూపురముల, గంభీరనినదంబు ♦ గడలుకొనఁగఁ
గాంచనమణికర్ణికామయూఖంబులు, గండపాలికలపై ♦ గంతు లిడఁగఁ
గీ. కురులు నర్తింపఁ బయ్యెద♦కొంగుజాఱఁగ, బోఁటిచేనున్న చామర♦పుచ్చుకొనుచు
జీవితేశ్వరు రుక్మిణి ♦ చేర నరిగి, వేడ్క లిగురొత్త మెల్లన ♦ వీవఁ దొడఁగె.

భాగవతము, స్కం 10 పూర్వ పద్య 1685.

## ——♦ దధిమథనము. ♦——

సీ. కరకమలారుణ♦కాంతిఁ గవ్వపుఁద్రాడు, పవడంపునునుదీవ ♦ పగిది మెఱయఁ
గ్రిమముతో రజ్జు వా♦కర్షింపఁ బాలిండ్లు, వీడ్వడి యొండొంటి♦వీఁకనొత్తఁ
గుచకుంభములమీఁది♦కొంగుజాఱఁగఁ జిక్క,వడుచుహారావళు♦ల్బయలుపడఁగఁ
బొడమినచెమటతోఁ ♦ బొల్పారుసెమ్మోము, మంచుపైపడినప♦ద్మంబుఁ దెగడఁ
గీ. గాను సులియంగఁ గంకణ♦క్వణనమెసఁగ, దుఱుము బిగివీడఁ గర్ణికా♦ద్యుతులు మెఱయ
బాలునంకించిపాడెడి ♦ పాటవలనఁ, దరువులిగురొత్తఁ బెరుఁగింతి♦దరువఁ జొచ్చె.

భాగవతము, స్కం. పూర్వ. 10 పద్య 355.

## ——♦ సవతులకయ్యము. ♦——

సీ. ఒట్టు సుమీ యన్న ♦ నొట్టు సుమీ యంచు, నేమేమియనినసే♦మేమియనుచుఁ
గానీగదే యన్నఁ ♦ గానీగదే యంచు, నింకేల యనిన నిం♦కేల యనుచు
నోసి పోవే యన్న♦నోసి పోవే యంచు, నౌ నంటి వనిన నౌ♦నంటి వనుచు
మఱపకు మిది యన్న♦మఱపకు మిది యంచు, నీవెంత యనిన నీ♦వెంత యనుచు

గీ. వారిజాక్షుని సాపగ ♦ వారివెంట, ననుప గోరంత యైనను ♦ మనసు లేదు
సందుఁ డనుపఁగఁగని మన♦మందు కట్టు, లొంటితడ వేయరాదని ♦ యుంటిఁ గాని.
ఆ. పట్టెఁ దేలుకుట్టు♦కున్న కుమ్మరబూచి, తోసిరా జటంచుఁ♦ద్రోచెఁ జెలియ
దాని వ్రేలుఁదీసి ♦ దానికన్నుపొడిచి,నటుల తనియకున్న ♦ నగునె చిలుక. 2733
ఆ. తగరుకొండమీఁదఁ ♦ దాఁకఁగోరినదారి, నెడిచిదన్నుఁ దెలియ ♦ కింతి పలికె
నెంతమీనువచ్చి ♦ యెంతమీనును మ్రింగెఁ, గాని త్రుళ్లినెద్దు♦గంతవేఁచు, 2734
సీ. ఆశుకవిత్వంబు♦లల్లితే నే సరా, చిత్రప్రబంధముల్ ♦ సేయవలదె
గోటిచేతను వీణె♦మీటితే నే సరా,గొంతుక రాల్ గరఁ♦గించ వలదె
పదిచాళిరాగముల్ ♦ పాడితే నే సరా, హితవొప్ప వర్ణంబు♦లెత్తవలదె
ఆలనాట్యభేదమ్ము♦లాడితే నే సరా, నవరసంబుల నంటి ♦ నడువవలదె
గీ. వింతవింతఁగఁగలసిన ♦ యంతవరియె, యెవ్వకానిమనోభావ ♦ మెఱుఁగవలదె
యేమి నెరనినిన్నంటె ♦ యెంత మేటి, నన్నువిడనాడ నాకోరె ♦ చిన్నిచిలుక.
గీ. కానిపదరకు మిఁకమీఁద ♦ దానిమోము, గనఁగవల్దనిశౌరిని ♦ కట్టిపెట్టి
బింకములుకూలనఱకాలఁ♦బెట్టినేల, రాచకున్నను నాపేరు ♦ రాధగాదు. 2736

## స్నానపద్ధతి.

ఉ. అంగసుఖంబు దుర్గుణము ♦ లారయఁ బొందనిమందు మేనికిన్
రంగు సుపోషణంబు సుక♦రంబుగఁ బ్రాయము మళ్లివచ్చు న
భ్యంగన మాచరించుటకు ♦ నర్హమనిర్ణంబగు సుష్ణవారిఁ జే
యంగడు నొప్పు నాల్గుగడి♦యల్ జలకంబు యథావిధిజ్ఞుఁడై.
సీ. పుణ్యనిర్మలతోయ♦ముల నొండె నుష్ణోదకముల నొండెను బ్రయ♦త్నమునఁ జేయు
తానంబు వలయుఁ బ్రా♦తస్స్నానమునఁ జేసి, తొమ్మిది చిల్లుల♦దొరగు చున్న
యేహ్యంబు పట్టగు♦నిమ్మను శుచి యగు,నంతియ కాదు నా♦ప్యాయనంబు
శౌచంబు బలము దు♦స్స్వప్ననాశంబును దేజంబు రూపు కాం♦తియును కృతము
గీ. నాయు రభివృద్ధియును గల్గు♦నంత మీఁద, సంధ్య నారాధనము చేసి♦సవిత్రుఁ గొల్చి
యగ్ని దేవు నుపాసించు♦టర్హవిధము, నిజకులాచారమార్గైక ♦ నిరతులకును.

చారుచర్య, పద్య 9, 10.

క. తల నిమ్మపండ్లు మొదలుగఁ, బులుసులు పట్టించి పుష్ప♦ములు నంజనమున్
జెలువొప్పఁ బూని కడు నిర్మలహృదయముతోడ నుడక♦శుద్ధ్యఁబ నమున్.

క. దానములు చేసి యట ను,స్నానంబున దేవపితృస♦మభ్యర్చనముల్
పూని యొనరించి పిమ్మటఁ,గాని చనఁగ వలదు భుక్తి♦కార్యంబునకున్.

క. కులకాంతచేతఁ దగుక్రియ,నలంకృతం బైన భోజ♦నాగారములో
నెలమిఁ దమబంతిఁ జుట్టలుఁ, జెలులుం దగ భోజనంబు♦సేయుఁగ వలయున్.

క. పెక్కండ్రు లేకయున్నను, నొక్కఁ డిరువు రైనఁ బంక్తి♦నొగిఁ గుడువక తా
నొక్కండ భుక్తిఁ గొను టది,యొక్కుఁడు నింద్య మని చెప్పి♦రిద్ధచరిత్రుల్.

క. ఇష్టఫలసిద్ధి చేకుఱుఁ, దుష్టి గలుగుఁ గలిమి పేర్మి♦దొరయును సుజనో
త్కృష్టుఁడగు భోజనము వి,స్పష్టముగాఁ జేయు నేని♦బహుజనములతోన్.

చ. గొనకొని కొండముచ్చులఁ జ♦కోరములన్ శుకశారికావళిన్
జెనుతురు భూపతుల్ విషము♦పెట్టినయన్నము చూచి యోలిఁ జ
య్యన నవి వెండ్రికల్ విడువ♦నక్షులు మూయఁగఁ గూయుచుండఁగా
గని కుటిలప్రయోగములు ♦ గాంచుటకై నృపమంత్రిశేఖరా.

గీ. మునుపుతియ్యఁగూరలురుచి♦గొనుటలెస్స,నడుమనొగరులుచేఁదులు♦నంజమేలు
పులుసులాస్వాదనముసేయ♦వలయుఁబిదప,భోజనముసేయునప్పుడు♦భూమిపతులు

క. అతి మధుర మదీపనకర,మతి లవణము నయనకాంతి ♦ హార మాహారం
బతి తిక్తామ్లము ముదిమికి, నతిశయహేతు వని చెప్పి ♦ రాయుర్వేదుల్.

గీ. దప్పికుదకంబుమాలుకూ♦డొప్పదుగొన, క్షుధకుఁగూటిమాలుగనీరు♦గ్రోలఁజనదు
గుల్మ మగు భగంధరముగాఁ♦గురుపు పుట్టుఁ, జెలఁగి యీ రెండు నేరక♦చేసిరేని.

గీ. కుడువఁ దొణఁగుచు నీళ్లను ♦ గ్రోలె నేని, దీపనము చెడుఁ దద్దయుఁ♦దేహమఱుగు
భుక్తి మధ్యోదకముఁ గొంత♦పుష్టి సేయుఁ, బిదప పానీయ మానుట♦పెద్దమేలు.

గీ. కడుపు నాలుగు పాళ్లను♦గా నెఱింగి, రెండు పాళ్లన్నమునను బూ♦రింప వలయుఁ
బానమున నింపఁగా నొక♦పాలు వలయు,వాయుచలనకు నొకపాలు♦వలయు నెడము.

గీ. కుడిచినప్పుడు శయనింపఁ ♦ గడుపు పెరుఁగుఁ, గదల కెచోఁటఁగూర్చున్నఁ గ
లుగుసుఖము, అల్ల నడయాడ నాయువు♦నగ్గలించు, దూరమరిగినమృత్యువుఁ♦దోన
యరుగు.

క. కడుపు కడుఁ బిక్కటిల్లినఁ, బొడమును మఱి దప్పిహీన♦భోజనుఁ డైనన్
బడుగగుఁ గావున సమ మగు, కుడుపున నే తెవులు లేక ♦ కొలఁది యొడలగున్.

క. కుడుచునతం డైనను జ,ప్పుడునాతం డైన నపుడు♦ దండము రెం డై
కడుఁ గోపముతో నుండినఁ, గుడిచిన యన్నంబు కాల♦కూటముఁ బోలున్.

క. కుడిచిన పిమ్మటఁ జేతులు, తుడిచి నియతి వార్చి మధన♦తోయము నియతిన్
విడిచికొన వలయుఁ గన్నులఁ, బొడమఁగ రా దక్షిరోగ♦ముల కట్లైనన్.

క. దళముగఁ గ్రోలుచు మండిన, జలమేమియు నానకున్న ♦ జఠరము శిఖిదు
ర్బలమగు నన్నం బఱుగదు, పలుమఱు నగు నల్పవారి♦పానము సేయన్.

చారుచర్య, పద్య 30, 33-46.

గీ. అవనినాయక యన్నార్థు♦లైనవృద్ధ, బాలకుల గర్భిణుల దుఃఖ♦భాజనులయుఁ
గోర్కి దీర్పక తా నొంటిఁ♦గుడిచె నేని, వాఁడు కడుఘోరమగు రౌర♦వమున వడఁగూలు.

ఆ. అన్నకాంక్షులైన ♦ యఖిలజనంబులఁ, దనిపి గాని కుడువఁ♦దనకుఁ జనదు
మును పెదా భుజించి♦వెనుక నతిథి కిడు, వాఁడు గూలు రౌర♦వంబు నందు.

గీ. స్నానమును దర్పణంబును ♦ సంధ్యయును జపంబు దైవతపూజహో♦మంబు వైశ్వ
దేవమును మఱి యతిథిపూ♦జావిధంబు, లూని భుజియించు టెల్లను♦మలముఁ దినుట.

గీ. మును ప్రమధురాన్నములు చవి♦గొనియె నేని, నడుమ లవణామ్లతిక్తముల్ ♦ నంజె నేని.
పిదపఁ గటుకార్ద్రిభోజనం♦బొదవె నేని, బలము నారోగ్యమును జాలఁ♦గలిగియుండు.

విష్ణుపురాణము, అ 4.

# భక్ష్యభోజ్యభోజనాదికము.

సీ. పట్టాంశుకములపైఁ ♦ బన్నీరు ప్రోక్షించి, చెయ్యార్చి చేపట్లు♦ సేయువారు
మక్కళించినకావు ♦ మంజిళ్ళ పెందెర, లుంగరంబులఁ బట్టి♦ యొత్తువారు
నగరుధూపము వెట్టి ♦ యభ్యంతరంబైన, గగనావకాశంబుఁ ♦ బొగపువారు
వెండియొడ్డెనలపై ♦ వెలచి తెచ్చినపైఁడి, పళ్ళెంబు లాయత్త ♦ పఱచువారు
గీ. రంకు మృగరోమ కృత నూత్న♦రత్నకంబ, ళాది నానావిధాభ్యర్హి♦తాసనములు
పెట్టువారును నై రిందు ♦ బింబవదన, లుభయబాంధవభోజనో♦ద్యోగవేళ.

సీ. గోధూమసేవికా♦గుచ్ఛంబు లల్లార్చి, ఖండశర్కరలతోఁ ♦ గలపి కలపి
గుజ్జుగాఁ గాఁచిన ♦ గోక్షీరపూరంబు, జమిలిమండెఁగలపైఁ♦జల్లి చల్లి
మిరియంబుతోఁ గూడ ♦ మేళవించిన తేనె, తోరంపులడ్వాలు♦ద్రోఁచి త్రోఁచి
పలుచఁగా వండిన ♦ వలిపెంపుఁజాఁపట్లు, పెసరపప్పులతోడఁ♦బెనఁచి పెనఁచి
గీ. గోవజవ్యాదిఁ గస్తూరి♦గొఱఁతపఱుచు, వెన్నపడిదెంబు జొబ్బిల♦విఱిచి విఱిచి
వారయాత్రికులను మోద♦వంతులగుచు, వలచి భుజియించి రొగిఁ బిండి♦వంటకములు.

చ. తరుణులు చంచలాలతలు ♦ తత్కరభాండనికాయ మంబుదో
త్కరములు, పాలుఁ దేనెలు ఘృ♦తంబులు వాన, లఖండఖండశ

ర్కరలును ద్రాక్షపండ్లు వడ♦గండ్లను, శోభన భుక్తి వేళఁ దో
ల్కరిసముదాయంబు పేరెలమిఁ ♦ గైకొనకుండునె భోక్తృసస్యముల్. 2749

గీ. పచ్చడామానికంబుల ♦ పల్లెరములఁ, బచ్చగందనికూర లే♦ర్పడమిఁ జూచి
పెట్టిరని పెండ్లిపెద్దలు ♦ పెడముపెట్టఁ, బెట్టుటకు నంగనలకును ♦ బట్టెఁ దడవు.

క. అరుదుగ నపు డొక్కొక్కరయెడ, మరకతమణిపాత్రిగగన ♦ మండల మయ్యెన్.
జిగిపడపుల పాసెము శశి, ధరఁ దయ్యెం జుక్కలయ్యె ♦ ద్రాక్షఫలంబుల్,

సీ. అమృత రసోపమం ♦ బైన కమ్మని యావు,పాల పాయసము జం♦బాల మయ్యె
మంచు లప్పల మించు ♦ మండెంగ మడుపులు, పారలి తెట్టువగట్టి ♦ నురువులయ్యెఁ
గప్పురంబుల ద్రావు ప్పుఁ♦దప్పు పట్టెఁగఁ జాలు, ఖండ శర్కరలు సై♦కతములయ్యె
గరుడ పచ్చల చాయఁ ♦ గల పచ్చ గండని, కూరలు శైవ లాం♦కురము లయ్యె

గీ. నేలువుఁ బప్పుల తీరంబు ♦ లురలఁ బడఁగ, బూరియలులడ్డువంబులు ♦ పొరలిపాటి
విమలశాల్యోదనంబుపై ♦ వెల్లినూపు, నాజ్య ధారా ప్రవాహ సా♦హస్రములకు,

ఉ. ఆదరణంబుతో నభిన ♦ వాజ్య విపాండుర ఖండ శర్కరా
క్షోద సమన్వితంబుగ వి♦శుద్ధ హిరణ్మయ భాజనంబులం
బైదలు లర్థిమై నిడఁగ ♦ బంధుజను ల్భుజియించి రన్నపూ
ర్ణోదగ వాసి చంద్రికిర♦ణంబులఁ బోలెడు పాయసాన్నముల్. 2752

క. సేవించి రొకటి దొలఁగం, ద్రావక జంబీర రసము♦తో నూనియతో
నావం బెట్టిన కిటిము,ద్రావలయము లమృత మధుర ♦ రస ఖండంబుల్. 2754

క. ఆమిష మనామిషముగ న,నామిష మామిషము గాఁ గు♦పాక మార్గ కళా
సామర్థ్యంబునఁ జేసిన, తేమనములు మనములం బ్ర♦తిష్ఠించె రుచుల్. 2755

చ. అపమ సుధా గస హ్రదము♦నందలి రొంపు లనంగ మంచునం
దిసికిన పంచదార లనఁ ♦ జేంప మీఁగడతో మనంబులం
బసి గొనఁ జేయు వాహరిపు ♦ బప్పలయిటే దధి పిండ ఖండముల్
మెసవిరి కంఠదఘ్నముగ ♦ మిక్కిలి వేడుక వారయాత్రికుల్. 2756

గీ. మిసిమి గలపుల్లపెరుఁగుతో ♦ మిళిత మైన, యావపచ్చళ్లు చవిచూచి ♦ రాదరమునఁ
జొత్తుమని యూర్థములు దాఁకి ♦ యెత్తఁదనముఁ, బొగలు వెడలింపపానికా ♦ పుటములందు.

శృంగారనైషధము, ఆ 6 పద్య 108-139.

చ. సరములరీతిఁ గ్రొన్నెలల ♦ జాతి బిసంబులభాతిఁ బద్మకే
సరములభంగిఁ దాగకల ♦ సంగతిఁ దార్పులమాడ్కిఁ బుష్పమం
జరులవిధంబునన్ మణుల ♦ చాడ్పునఁ బెక్కులుగంధతైలపా
కరచితముల్ విచిత్రములు ♦ కమ్మని సైఁదవుఁ బిండివంటలున్.

జైమినిభారతము, ఆ 8 పద్య 193.

సీ. చింపివల్కము లేమి ♦ చేసెడిదనఁగావు, నెఱవైనకండమం ♦ డెగలు గాని
తెగినజంజెము లేలఁ ♦ దెచ్చెద రనఁ గావు, వినఁడివిసన్న సే ♦ వియలు గాని
యౌదుంబరము లన ♦ ర్ఘ్యములోల్లమనఁగావు, నమలిచూడుఁడు మోద ♦ కములు గాని
ఫేనపుంజము లేలఁ ♦ బెట్టెద రనఁ గావు, నీపాదమాన ఫే ♦ ణికలు గాని
గీ. యంచువాచంయములు వల్క ♦ నజ్జముఖులు, నగుచు నోడఁబడఁ జెప్పనం ♦ దఱు యథేష్ట
రుచుల భుజియించి వార్చి క ♦ ర్పూరవీటి, కానుగంధప్రసూనసౌ ♦ ఖ్యములఁ దనిసి.

జైమినిభారతము, ఆ 8 పద్య 199—204.

సీ. శాకపాకంబుల ♦ చవులు వక్కాణించు గతిఁ గంకణంబులు ♦ ఘల్లు మనఁగ
నతివేగ మిడుఁడు మీ ♦ రనుమాడ్కి మేఖలా, కీలితరత్నకిం ♦ కిణులు మొరయఁ
గలమాన్నరుచి తోడఁ ♦ గలహించు జాడ దు,వ్వలువపింజలు పెళ ♦ పెళ యనంగ
నారగింపుఁడు మీర ♦ లని ప్రియం బాడెడు, పొలుపున మెట్టియ ♦ ల్లులకరింప
గీ. నలరు బోఁడులు వడ్డింప ♦ నచటఁ గలహ, భోజియును దానుబహుభక్ష్య ♦ భోజ్యలేహ్య
చోష్యపానీయముల మధు ♦ సూదనుండు, సారె గొనియాడుచును వేడ్క ♦ నారగించె.

పారిజాతాపహరణము, ఆ 2 పద్య 19.

సీ. కలవంటకములు బూ ♦ రెలు దేనెతోలలు చాపట్లు మండెంగ లో ♦ బ్బట్లు వడలు
కుడుములు నుకియలు ♦ గడియంపుటట్లు వెన్నప్పాలు వడియంబు ♦ లప్పడాలు
బొంగరంబులు సొజ్జె ♦ బూరెతాగులు సేవ, లుక్కెర లరిసెలు ♦ చక్కిలములు
ఖర్జూర గోస్తనీ ♦ కదళికాసహకార, ఫలములు కొబ్బెరి ♦ పనసతొలలు
గీ. తేనియలు జున్ను మీఁగడ ♦ లానవాలు, పానకములు రసావళ్ళు ♦ పచ్చడులు న
వాజ్య మొలుపుఁబప్పులుకూర ♦ లునుపమాన్న, మపుడు ప్రజ నెల్లఁ దనియించె ♦ న
హరహంబు.

కళాపూర్ణోదయము, ఆ 7 పద్య 81.

సీ. ఒకకొన్ని వడియంబు ♦ లొకకొన్ని వరుగులు, నొకకొన్ని తెలఁగుల ♦ యొలుపుఁబప్పు
లొకకొన్ని ద్రబ్బెడ ♦ లొకకొన్ని తాలింపు, లొకకొన్ని విధముల ♦ యొజ్జచేరు
లొకకొన్ని కలకల్పు ♦ లొకకొన్ని బజ్జులు, నొకకొన్ని రీతుల ♦ యూర్పువగలు
నొకకొన్ని సిగరులు ♦ నొకకొన్నియ ంబళ్లు, నొకకొన్ని వహులపూ ♦ పోత్కరము టు
గీ. వివిధ ఫల కంద మూలంబు ♦ లవియుఁ గొన్ని, యూరుఁబిండులు నొకకొన్ని
యొక్కకొన్ని
యూరుఁగాయలు పచ్చళ్లు ♦ నొక్కకొన్ని, పెరుగు పాల్ నేతులు ♦ పెచ్చుపెరుగ.

పాండురంగమాహాత్మ్యము, ఆ 4 పద్య 184.

సీ. మహనీయసంస్కృత♦మహిమలఁ జెన్నొంది, ప్రాకృతక్రమలీలఁ ♦ బరిఢవించి
భావసమగ్రమై ♦ భవములఁ దనరారి, నవరసభవ్యబం♦ధముల వెలసి
సురుచిరపాకసం♦శుద్ధిచే విలసిల్లి, సమతాదిగుణముల ♦ సరణిఁ జెలఁగి
విలసితవ్యంజన♦వృత్తులఁ గనుపట్టి, లలితవాదస్ఫూర్తు♦లను గడంగి
గీ. పటురసజ్ఞానుకూలసౌ♦భాగ్యమహిమ, నలరి సుమనఃకదంబయో♦గ్యంబు లగుచు
నపుడు బహునాటకంబుల♦ననుకరించె, భోజభూజానిగావించు♦భోజనములు.
చ. నభవతి భక్తముస్త మిహ♦ నాస్తి సముజ్జ్వలశాకపాకతా
నభవతి సౌష్ఠవం ఘృతక♦నద్బహుభక్ష్యకదంబకం సమీ
క్ష్యభుజత భోజనాని కృప♦యా సహ యంచును గేలు మోడ్చుచుం
బ్రభుమణి సంచరించె నటఁ ♦ బంక్తుల వెంటఁ బ్రియోక్తు లాడుచున్. 2778
క. ముంగల నొక్క నితంబిని, బంగరు పళ్లెరము వెట్టెఁ ♦ బజ్జనయొకసా
రంగాక్షి పూరితోదక, భృంగారక మునిచె సొంపు ♦ నింపుజనింపన్. 2779
మ. కలమాన్నంబును బప్పు గోఘృతము శా♦కవ్రాతముల్ పిండివం
టలుఁ బచ్చళ్లు ఫలంబు లాదిగను బోరి♦డల్గాంచు నందియ్యగా
జలజాతాక్షులు కంకణంబుల మణి♦చ్ఛాయల్ ఝణత్కారముల్
వలనొప్పన్ వసుధాతలేశ్వరునకున్ ♦ వడ్డించి రింపొందఁగన్. 2780
సీ. షడ్రసస్ఫూర్తి నెం♦చఁగ నొప్పు శాకముల్, పాకముల్ గావని♦పాయఁద్రోచి
సూపంబు హేమస్వ♦రూపమై రుచు లీనఁ, గాటుబోయిన దంచుఁ♦గడకుఁదిగిచి
యబ్బురం బొనరించు ♦ హైయంగవీనంబు, మూచూచి మురుగంచు ♦ ముట్టనోడి
యమృతంబు లొలుకుభ♦క్ష్యములు ఫలంబులు, కొఱగావటని పండ్లఁ♦గొఱుకవెఱచి
గీ. యపుడు నృపతల్లజుఁడు పాది♦కొన్న మొక్క, మగువ వడ్డింపఁ గసికాటు♦లుగ భుజించె
నంగభవకేళివాంఛ యు♦ప్పొంగ నృపతి, తమక మెంతయుగమక మై♦తనువెలర్ప.
షట్చక్రవర్తి చరిత్రము, ఆ 5 పద్య 73, 74, 89, 90 91

ఉ. మ్రొట్టెలు మ్రోయఁ గక్షరుచి ♦ మార్కొలయుం గడకంటిబేడిసల్
మిట్టిపడం బయంట చను♦ మిట్టల కట్టిటుఁ గాఁగఁ జెక్కులన్
బెట్టినకమ్మతల్కు మిఱు♦మిట్లు గొనన్ నునుగీలుగంటువె
వ్వట్టుగనం గనత్కనక♦పాత్రికలెత్తిరి బోనకత్తియల్. 2782
బహుళాశ్వచరిత్రము, ఆ 4 పద్య 9.

సీ. ఒకసైకతశ్రోణి ♦ యకలంక కాంచన, దివ్య పీఠమ్ముల్ ♦ దెచ్చి యుంచె
నొకదర్పణకపోల ♦ సకల రత్నమ్ముల, కనకంపుఁ బళ్ళెముల్ ♦ గడఁగి యుంచె
నొకకోక కుచకుంభ ♦ ప్రకటమాణిక్యాల, బంగరు గిన్నెలు ♦ పరగ నుంచె
నొకపక్వ బింబోష్ఠి ♦ చికిలిబంగరుగిండ్ల, గంగామృతమునించి ♦ కడను నుంచె
ఆ. నొక్క మెఱుఁగు బోఁడి ♦ చక్కనిపాత్రాభి, ఘారమొనరఁజేసె ♦ కౌశలముగ
నొక్క సరసవచన ♦ యూరుఁగాయలుపత్రి, భాజనముల నుంచె ♦ రాజితముగ.
ఆ. రాజహంసగతుల ♦ రాజబింబాస్యలు, చారుపాత్రికలును ♦ కూరగములు
వేఱువేఱనుంచి ♦ వేర్వేఱ వడ్డించి, రుభయపక్షములందు ♦ పరిధులు సెలఁగ. 2784
చ. మఱియుఁ జెలంగి యంగనలు ♦ మంజుల సింజిత మల్లసిల్లఁగాఁ
బిరబిర మేటియన్నములు ♦ పెట్టిరి బంగరు పళ్ళెరమ్ములన్
వరుసనిలింప పఙ్క్తికి న ♦ వారణగా సుధ పెట్టు మోహినీ
తరుణి యనేక రూపములు ♦ దాల్చినిజోన్నతిఁ దెల్పుకైవడిన్. 2785
ఉ. వడలున్ దేనెతోలల్ మనోహరము ల ♦ప్పా లతిరిసాల్ దోసెల
ప్పడముల్ గారెలు ఖర్జుకాయలును ల ♦డ్వంబుల్ సురెల్ పూర్ణమున్
గుడుముల్ బూర్లెలు సారెపత్తులు మణుం ♦ గుంబుఘ్నలు న్నూరెలున్
వడియా లిడ్డెన పాలకాయలును నొ ♦బ్బట్లుక్కెరల్ ఫున్కలున్. 2786
మ. పరమాన్నంబులు పప్పలు న్నిఖిరులున్ ♦ బచ్చుస్ను నూర్బిండులున్
బెరుఁగు న్నాలును నెయ్యి మీఁగడలు జు ♦ న్వెన్నల్ రసాలంబులున్
జెఱుకు న్నాల్ కలవంటకా ల్పనసలున్ ♦ జీన్చక్కెరల్ సాఁగులున్
వరుగుల్ రేఁగులు ఖండచక్కెరలు నం ♦ బళ్బజ్జులు న్మజ్జిగల్. 2787
శా. వేర్వేఱ న్నవ మోహనాంగులు సము ♦ ద్వేలాంగ నేత్రద్యుతు
ల్పర్వ న్బంగరు పళ్లెరమ్ములను భా ♦ స్వల్లీలమైఁ దెచ్చిదృ
క్పర్వంబై తగి వేఱువేఱ నమర ♦ న్వడ్డించి రప్పఙ్క్తికిన్
సర్వాంగీణ సుగంధి గంధలహరుల్ ♦ సర్వాశల న్జెందఁగాన్. 2788
సీ. తన కర్ణములసౌరు ♦ పెనుపొందుననుతీరు, చక్కిలాల్ వడ్డించె ♦ సకియయోర్తు
తన యధరామృతం ♦ బునకు నీ డనులీల, నానవాల్ వడ్డించె ♦ నబల యోర్తు
తన మధురాలాప ♦ మునకు జో డనుమాడ్కిఁ, దేనియ ల్వడ్డించెఁ ♦ దెఱవ యోర్తు
తన చిన్నిచన్నుల ♦ కెన వచ్చు నను రీతి, దాక్షలు వడ్డించెఁ ♦ దరుణి యోర్తు
గీ. తన మధురగుణములఁ బోలు ♦ ననెడుభంగి, కదళిఫలముల వడ్డించెఁ ♦ గాంత యోర్తు
తన సరసనుందరతఁ బూను ♦ ననెడిభాతిఁ, జూతఫలములు వడ్డించె ♦ సుదతి యోర్తు.

క. చందన కుసుమాక్షతచయ, మందతికిని విభుఁ డొసంగి ♦ యగ్రజపూర్వం
బందా పోశనము లిడియ, మందగతిన్ వారవోసె ♦ మంత్రోక్తులచేన్. 2790

సీ. పణతులు కొందఱు ♦ బంగారు తపిలెలఁ, దియ్యాచే రెత్తిరి ♦ నెయ్యమెసఁగ
బాలలు కొందఱు ♦ నీలంపు వెసలలఁ, బుల్లచే రెత్తిరి ♦ పొలుపుమిగుల
వెలఁదులు కొందఱు ♦ వెండికుండలమజ్జిగ రసమ్ము లెత్తిరి ♦ సరసలీల
భామలు కొందఱు ♦ పచ్చల కలశాలఁ, బుల్లగూనల నెత్తి ♦ రుల్లసిల్ల
గీ. వజ్రమాణిక్య నిర్మిత ♦ పాత్రములను, చారు ఘనసార పాటిలో ♦ నీరసార
చంపకేలాది పరిమళ ♦ శైత్యగాంగ, సలిల మెత్తిరి కొందఱు ♦ చంద్రముఖులు.
యాదవరాఘవపాండవీయము, ఆ 2 పద్య 43—51.

సీ. జనమోదనంబులు ♦ శాల్యోదనంబులు, సురుచిరరూపముల్ ♦ సూపములును
పటుసౌరభాన్విత ♦ పాకముల్ శాకము, లతులిత రసములు ♦ నతిరసములు
హితవాసనాసమ♦న్వితములు ఘృతములు, జిత మధుసారముల్ ♦ క్షీరములును
సమధికరుచివిలా♦సములు పాయసములు, నధరీకృతామృతో♦దధులు దధులు
గీ. చవులు పొగడుచుఁ బంక్తులు♦సాగి వేడ్క, వెలయ భుజియించి కపురంపు♦విడి
యములను
చేకొని యహర్నిశంబు నా♦శీర్వదింతు, రవనిసురు లబ్జరాజసూ♦యాధ్వరమున.
తారాశశాంకవిజయము, ఆ 5 పద్య 154.

సీ. గారెలు బూరెలు ♦ కండమండెంగ ల,ప్పంబులు మొదలైన ♦ భక్ష్యములును
సరసాన్నమునఁ బాయ♦సమ్ము సూపము శాక,ములు మొదలైనట్టి♦ భోజ్యములును
పడిదెంబు లానవాల్ ♦ పరిపక్వఫలములు, సురసముల్ మొదలైన♦చోష్యములును
బహువిధంబుల నొప్పు ♦ పచ్చళ్లు తేనియల్, సిగరులు మొదలైన♦లేహ్యములును
గీ. నారికేళోదకంబు పా♦నకము చల్ల, నీరు మొదలైన యట్టి పా♦నీయములును
ననఁగఁ జేరైనపంచప♦దార్థములను, భూరమణుఁడిష్టసహితుఁడై♦ యారగించె.
కవిరాజమనోరంజనము, ఆ 5.

సీ. శాకసూపాపూప ♦ సర్పిస్సమావృత, ధవళవర్ణ ప్రసా♦దంబు కొంత
ఘృతపయోగుడనారి♦కేళఖండాదిక, ఘటితమై దనరు పొం♦గలియుఁ గొంత
మెఘుహాలు కళ హెణ్ణ ♦ మెంతి పెరుఁగాయ, మొనఁగిన బలుపులి♦హోరగొంతె
పరికరంబులఁ దిరు♦పడిమాత్రె మిడువ్వాస,నలుపోని దధ్యోద♦నంబు గొంత

గీ. నవమృదూష్ణిమగల్గు క♦ణ్ణమధుకాంత, శౌరి శేషప్రముఖనిత్య ♦ సూరిజనులు
నమ్మవారల పన్నిద్ద♦రాళువార్లఁ, గలసి నాయకతళియభో♦గమ్ము భుజించె. 2794

నృసింహవిలాసము, ఆ 1.

చ. ఒసపరియైన రాజనపు♦టోగిరమున్ మిరియంపుఁగూరలుం
గసగస లానవాలుఁ గడు♦గమ్మనినెయ్యిని బిండివంటలున్
రసములు బాయసంబు మధు♦రంపు ఫలంబులు నూరుఁగాయలుం
బసగలభక్తితోఁ బసిఁడి♦పళ్లెరమందునఁ బెట్టె నెంతయున్. 2795

మైరావణచరిత్రము, ఆ 3 పద్య 189.

మ. కలమాన్నంబులు పాయసంబులును శా♦కానీకముల్ గోఘృతం
బులు పచ్చళ్లుపదంశకాళిమధురా♦పూపంబులుం జేరులున్
జలముల్ దేనియ లానవాలు పెరుఁగుల్ ♦ సంతుష్టిగా బంధుమం
డలితో బువ్వముగా భుజించిరి విశి♦ష్టప్రీతి నా దంపతుల్. 2796

బ్రహ్మోత్తరఖండము, ఆ 3.

సీ. అనిశంబు పంచమ♦హాయజ్ఞపరులగు, బ్రాహ్మణోత్తము లగ్ర♦పంక్తి వేడ్కఁ
గూర్చుండి కమ్మని ♦ కూరలు పచ్చళ్ళు, పప్పుదప్పళము ల♦ప్పడము వడియ
మరచే చుఱుక్కని ♦ పరిమళించు ఘృతంబు, బూరెలుమిరియపుం♦జారు పక్వ
పనస కదళ్యాది ♦ ఫలములు బరమాన్న, మూరుఁగాయలు రుచు♦లూరు పెరుఁగు
గీ. తనివిదీరఁగ భుజియించి♦తమ్మలములు. సేయుచుయథేచ్ఛవిహరింపఁ♦జేయుచుండ్రు
పేర్మివెలయంగ షడ్రసో♦పేతగతుల, నాధరిత్రీశ్వరోత్తంనుఁ♦డద్భుతముగ.

కవిజనకౌరచంద్రోదయము, ఆ 4.

సీ. పిల్లెళ్లు మట్టెలు ♦ ప్రేళ్లగజ్జెలు కాళ్ల, ఘణఘణం ఘణఘణం ♦ ఘణల మొరయ
గాజులు కడియముల్ ♦ కంకణంబులు కేల, ఝణఝణం ఝణఝణం ♦ ఝణల మొరయఁ
గటిసూత్రములఘంటి♦కలు మధ్యసీమల, ధణధణం ధణధణం ♦ ధణల మొరయఁ
జౌజులు కమ్మలు ♦ పయిబావిలీజతల్, కణకణం కణకణం ♦ కణల మొరయఁ
గీ. బూజ్యచారుసరసభక్ష్య♦భోజ్యలేహ్య, చోష్యపానీయమధురవ♦స్తుప్రపూర్ణ
పాత్రహస్తాంబుజాతలై ♦ పరగు భామి, నీజనంబులు పంక్తుల♦నోజ మెఱపి.

శకుంతలాపరిణయము, ఫ. క్షేం. ఆ 1.

—♦ తాంబూలము. ♦—

సీ. కఠిన మైె దొడ్డచి♦క్కణము నై వత్సరా,ర్ధప్రమాణము పొ్రఁతఁ♦దనము గలిగి
యుజ్జ్వలచ్ఛాయ మై ♦ యొత్తినతెరువాయి, శశమాంసఖండంబు ♦ చందమునను

నొగరించుకయు లేక ♦ మిగులంగఁ దీప్తైన, క్రముకంబు ; నొప్పునై ♦ కమ్మవలచి
దళ మెక్కి పండిన ♦ తాంబూలదళములు, కాలోపలంబులు ♦ గాల్చి పడియఁ
గీ. గట్టినటువంటి చూర్ణంబు♦గా నొనర్చి, భుక్తిముందర నాలుగు ♦ భోజనోత్త
రమున రెండునునటమీఁద♦రాత్రి యాఱు,మార్లు తాంబూలమొప్పారు♦మంత్రియప్ప.
సీ. పోఁకకు మూఁటిచొ♦ప్పునఁ బర్ణములు గూర్చి, తగుఁ జేయ రేపటి♦తమ్మలములు
నాలుగు నైదును ♦ నోలినకొలఁది మ,ధ్యాహ్ననిశీథినీ♦సమయములను (?)
కాఁచు పథ్యము రేప♦కడతమ్మలములతోఁ, దొలిఁదొలినొకరెంటఁ♦గలయవలయు
నంతంత నెక్కించి ♦ యటమీఁదఁ జేయుత,మ్మలములయందుఁ గ♦ప్పురము మేలు
గీ. తొడిమెయును చుదయును బుచ్చి ♦ నడిమియీనె, లేక తడియొత్తి మడఁచిన ♦ యాఁకు లెస్స
ప్రథమరసమును రెండవ♦రసము నుమిసి, యంతమీఁదటిరస మాను ♦ టమృతసేవ.
క. తాంబూలదళములకు నై,జం బయ్యెను గుణము భేద♦శక్తియు గఫపై
త్త్యంబులఁ జెఱుచుటయును గం,దంబు మొగంబునకు నొసఁగఁ♦దాఁ జాలుటయున్.
క. పూగమునకు గుణములు పై,త్త్యాగమముం జెఱుచుటయును ♦ నాఁకలి మృదులీ
లాగతిఁ బుట్టించుటయును, వేగమె దాహంబు నణఁచు♦విన్నాణంబున్. 2802
సీ. లఘుకారి క్రిమిదోష ♦ విఘటనసంధాయి, దీపననిర్దోష ♦ దీప్తికరము
పాషాణచూర్ణంబు ♦ పైత్త్యవాతఘ్నంబు, శంఖచూర్ణము పైత్త్య♦శైత్యహరము
చిప్పలసున్నంబు ♦ శ్లేష్మంబు హరియించు, గుల్లసున్నము వాత♦గుణముఁ జెఱచుఁ
దెలివిచ్చుఁ జాల ము♦త్తియపుసున్నము చూర్ణ,వర్ణమాయువునకు ♦ బాధకంబు
గీ. పత్త్రిమూలంబునను రోగ♦పటల ముండు, నగ్రమది పాపములకెల్ల♦నాలయంబు
నడిమియీనియ బుద్ధివి♦నాశకరము, వీనివర్జించి తగఁజేయు ♦ వీడియంబు. 2803
ఉ. వదన వికాస సౌరభ వి♦వర్ధనకారి లసన్మదాపహం
బుదరవిశేషసౌఖ్యకర ♦ ముద్ధతదోషబలప్రహారి స
మ్మదజనకంబు తమ్ములము ♦ మానవతీ పరిభోగవేళలన్
మదనపునర్భవీకరణ ♦ మంత్రము తుల్యమె దాని కెద్దియున్. 2804
గీ. క్షీరభోజియైయపుడు వే♦గిరముతోడఁ,దమ్మలముఁగొన్నఁ గుష్ఠమా♦తనినశించు(?)
గడియలోఁగొన్న మేహంబు♦గదురునాల, గడియలోఁగొన్న మూత్రరో♦గంబునొందు.
సీ. ఒప్పునిగంధంబు ♦ నొందకున్కియకాదు, మొగమునఁగల రోగ♦ములను జెఱచుఁ
జెదరని కెంజాయఁ ♦ జెందిదంతములు ము,ప్పొర్చునట్లుగఁ జేయు♦నుదరశుద్ధిఁ

గలిగించుఁ గర్పూర◆కలితతాంబూలంబు, కఫవాతపైత్త్యంబు ◆ గాఁచు ఛేది
రక్తపైత్త్యహరంబు ◆ రతిసౌఖ్యదము నాసి, కాగదసంక్షయ ◆ కారణంబు
గీ. కన్నులకు శైత్య మొనరించుఁ గంఠమునకు, మధురరుచిఁ జేయుఁ బొందించు మంగళములు
దగ్గు లుగు జిహ్వ చెడ జెట్టి◆దప్పి యైన, తిమ్మఁ బడుఁ గప్పురముతోడి◆తమ్ములమున.
ఆ. క్షయము రక్తపైత్త్య◆గతి వెక్కి భ్రమ పాండు, రోగ మక్షిగదము◆రొమ్ము నొప్పి
కడుపునొప్పి గ్రహణి ◆ క్షయ కాస గలిగిన, వారు తమ్ములమ్ము ◆ వలదు చేయ.

చారుచర్య, పద్య 47—55.

ఉ. కలికి వరాటరాజపుడు ◆ గప్పురవీడెము వెట్టె నవ్వుచు
న్నలు నడపంబు వానికి ఫ◆ణాధరవల్లి పలాంతరంబునన్
బలితపుఁ దేలు పైనమునఁ ◆ బన్ని యలం డది సూచి భీతిఁ ద
మ్ములమిల వైచిన న్నగిరి ◆ మూఁగిన రాజకుమారు లందఱున్. 2808

శృంగారనైషధము, ఆ 6 పద్య 141.

ఉ. చికిలీకిరీటిపచ్చరవి◆చెక్కడపుం బని కీలుఁ జిల్కుతో
రకమగు పైఁడియాకుపడ◆రంబున నుంచిన పండుటాకు లి
చ్చకపు టొయారము ల్వొలయ ◆ సత్యకరంబునఁ బూని వేడ్క నొ
క్కొకమడు పొయ్య నిచ్చుచు మృ◆దూక్తుల నిట్లని యె న్మురారికిన్. 2809

చంద్రభానుచరిత్రము, ఆ 1 పద్య 92.

చ. తిన్నఁగఁ దెల్లనాకుఁ గడ◆తేఱఁగఁ జీలిచి క్రొత్తగోరునన్
నున్నము రాచి చుట్టి నును ◆ చుట్టకదల్ తగుపాటిఁ ద్రుంచి తా
వెన్నెలరాచరాబరణి ◆ విద్రుమరక్తిమ నిక్కువక్కలా
కన్నె యొసంగె నవ్వలిమొ◆గంబయి రాట్పవిపాణిపాణికిన్. 2810

బహులాశ్వచరిత్రము, ఆ 4.

ఉ. నున్నపుఁ గాయకత్తెరయుఁ ◆ జొక్కడకొత్తును వక్క లాకులు
న్వన్నెగజాలవల్లిక ల◆వంగము లాదిగఁ గూర్చి నేర్పుతోఁ
జెన్నగు బొట్టె సేవకుఁడు ◆ చేరికగా నడపంబుఁ దాల్చి తా
నన్నరపాలుఁ డేగెఁ దన◆యందుఁ దగ న్మురిపెంబు దేఱఁగన్. 2811

షట్చక్రవర్తిచరిత్రము, ఆ 5 పద్య 95.

గీ. కుందనపుమిహి వెల్గ నం◆దందరత్న, సంకలితలీలఁ గ్రాలి వి◆స్తారమైన
యడపమున నున్నకపురంబు◆టాకుమడుపు, లందుకొని యిచ్చె మునిచంద్రుఁ◆డవనిపులకు

కౌసల్యాపరిణయము, ఆ 2.

గీ. పండుటాకులకర్పూర ♦ భాగములను, చొక్కమానట్టి మౌక్తిక♦చూర్ణమమర
గూర్చి మడుపులపూఁబోణి ♦ గోపభామి, నీరమణి యతనికినిచ్చె ♦ నేర్పుతోడ.

గయోపాఖ్యానము, ఆ 1.

సీ. వినిమోద మెసఁగంగ♦వనజాక్షి తములంబుఁ, గొని చెంతనిలుచుండి♦కోమరుమిగులఁ
దనగళంబునకిది ♦ దగునె సాటి యటంచు, ఖండము గ్గావించి ♦ క్రముకములను
తనకక్షముల కీది ♦ యనయంబు తుల్యమై, పంచుకొను తమల♦పాకుల నొగిఁ(?)
దలలఁద్రుంచుచునీని♦యలు దీసి తుడుపుచ్చి, ముక్తామణీచూర్ణ♦ము వెలయ నిడి
గీ. చంద్రశకలలవంగముల్ ♦ చాలఁ బెట్టి, దిట్టతనమునఁ గట్టిగాఁ ♦ జుట్టిమట్టు
లేనిప్రేమ నొసంగెను ♦ మేనఁ బులక, లొదవ నత్తఱి నతనికి ♦ నొప్పుమీఱ.

రంభానలకూబరవిలాసము, ఆ 5.

—♦ అభ్యంగనాదికము. ♦—

ఉ. కంపనలీలమై నసదుఁ ♦ గొ నసియాడఁ గుచద్వయంబు న
ర్తింప లలాటరేఖచెమ♦రింపఁగ హారలతాగుళుచ్ఛముల్
తుంపెన లాడఁ గంకణమృ♦దుధ్వని తాళగతిం జెలంగఁగా
సంపెఁగనూనె యంటె నొక ♦ చంద్రనిభానన కంసవైరికిన్. 2815

ఉ. తామరదోయిలోఁ దగిలి ♦ వాఁడెడు తేఁటులఁ బోలఁ బెన్నెఱు
ల్వేమఱుఁ జేతుల న్విడిచి ♦ విప్పి విదిర్చి నఖాంకురంబులం
గోమలలీల దువ్వి తెలి ♦ గొజ్జఁగినీ రెడఁజల్లి చల్లి గం
ధామలకంబు వెట్టె నొక ♦ యంగన కాళియనాగభేదికిన్. 2816

మ. చెలువ ల్గొందఱు హేమకుంభములతోఁ ♦ జేసేనొసంగ న్విని
ర్మలదోర్మూలరుచుల్ వెలింబొలయఁ దో♦రంబైనచన్దోయిసం
దోలయ న్వేనలి జాఱ నిక్కి యరమై ♦ నొయ్యారమై వ్రాలఁగా
జలకం బార్చె లతాంగి యోర్తు యదువం♦శస్వామికిఁ న్వేడుకన్. 2817

పారిజాతాపహరణము, ఆ 2 పద్య 9, 10, 11.

చ. తఱు లరనిక్కఁ బూఁతనెత ♦ తావియచిక్క నపాంగ మాలికల్
మెఱుఁగులు గ్రిక్క సారపుల ♦ మేలిమిఁ దేఁటులు చొక్క హారముల్
కుఱుచలు ద్రొక్క ముంగురులు ♦ గ్రొంజెమటం బద నెక్క వేలుపుం
దెఱవ యొకర్తు చేదిజగ♦తీపతికిన్ శిరసంటె వేడుకన్. 2818

సీ. భ్రమరకంబులచిక్కు ♦ వాపవేయననింక, భ్రమరకంబులచిక్కు ♦ వాయుననుచుఁ
బృథులకుచంబు లు♦బ్బింపఁ జేయనఁ బృథు, లకుచప్రకాశకా♦లం బటంచుఁ
గరఁగెఁబో వరతిల♦కం బన నుస్నేహ, కలనఁ గరఁగు వర♦తిలక మనుచుఁ
గడు మెఱయింపఁ జే♦కటకంబులన మెఱ్సియుఁ, గటకముల్ శుభరత్న♦గరిమ ననుచు
గీ. జెలి పలుకుఁ గేరడించుచుఁ♦జికిలి గోళ్ళ, సొగను సోఁకులఁ గళలునిం♦చుచు మెఱుంగు
ముంగురులు గూడ దువ్వుచు♦ముడికి దార్చి, మజ్జనపు వేళ తడవేల♦మహిపయనుడు.
గీ. సింహగతిమీఱు వసురాజు♦చెంత నొక్క, తోయధర వేణి పాదముల్♦దుడిచి మెట్లు
వెట్టె నొకకన్య హస్తమ♦ర్పింపవచ్చె, సలిలభవనంబునకుఁ బ్రజో♦త్సవము మెఱయ.
చ. పతియభిషేకవేళఁ గర♦భావితకుంభకురంగభృన్మణి
ప్రతిమలు నిర్ఝరీసుముఖ♦భావముఁ గన్గొని నీరు వంచి య
య్యతివలు సిగ్గునం గనలి♦యాస్యము వంచిన నూరకుండె న
ప్రతివరసంజ్ఞ రత్నపరి♦పాకము లిట్టివి గావె ధారుణిన్. 2822
మ. ఘనచాంపేయకవాసనావివశభృం♦గశ్రేణిఁ జేపట్టి చ
ల్లనిపూఁదేనియ చల్లి తేర్చు మధువే♦శాలక్ష్మియో నాఁగ సో
గ నెఱుల్సొంపఁగినూనె నిగ్గుసడలం♦గాఁ బైపయిన్ దువ్వి సే
ర్పున గంధామలకంబువెట్టె నొకయం♦భోజాక్షి భూజానికిన్. 2823
చ. కరముల నుజ్జ్వలాభినవ ♦ గైరికకుంభము లంటగూర్చి పు
ష్కరములు కంకణప్రకర♦సంభ్రమ మొప్పఁగ వంచి రాజకుం
జరునకుఁ గుంభినీభరణ ♦ సమ్మదశాలికిఁ బద్మినీపరం
పర పరమానురాగమున ♦ మజ్జన మార్చెఁ బయోగృహంబునన్. 2824
వసుచరిత్రము, ఆ 5 పద్య 75—80.
సీ. కంకణగోమేధి♦కచ్ఛాయ దొలుదొల్తఁ, దేటనూనియనిగ్గు ♦ నీటు నెఱపఁ
దరళవక్షోజము♦క్తాధారబడిబడి, జాఱువాబిందెల ♦ జాలు పఱుపఁ
గమనీయనిశ్వాస ♦ కందళం జెడనెడ, సురటివటుప్రవగాలి ♦ సొగసు దెలుపఁ
దరుణారుణాంగుళీ ♦ కిరణముల్ పయిపయిఁ, జెంగల్వ రేకుల ♦ చేరు చెలువ
గీ. మున్నుగా నాత్మశృంగార♦ముఖ లతాంగి, మంగళస్నానవిభవసా♦మగ్రిఁ గూర్ప
గమ్మనబిసాళివలపులు♦గుబ్బురించు, కమ్మజవ్వాదిఁ దలయంటెఁ♦గలికి యొకతె.
వసుచరిత్రము, ఆ 5 పద్య 108.
కం. చెలువకు సంపెఁగనూనెం, దల యంటె సుగంధవాసి♦తములగు చూర్ణం
బుల నలుఁగు బెట్టె గంధా, మలకం బిడి చమురు దిగిచె ♦ మజ్జన మార్చెన్.

చ. చెలికి మెఱుంగుఁబావడల ♦ చేఁ దడి యార్చెను ధూపవాసనల్
దలకొలిపెన్ బ్రసూనసద♦లంకృతి మీఱఁగ వేఱువేఱ మె
చ్చు లరసికీలుఁగంటుజడ ♦ సొల్లెము వేసిలుడుఁగొప్పు మూఁడుమూ
లలబిగికొప్పు పెట్టఁగతు♦ల న్నిలిపెం బలుమాఱు విప్పుచున్. 2827

ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 4 పద్య 129, 130.

సీ, తలయంటె నొకచాన ♦ కలికి గోరులదువ్వె, యసలఁ దేనియల నొ♦లార్చెనఁగ
లేమయొక్కతె గంధ♦లేపంబు మైనూన్చె, నెలరేకఁ బొదువుపుడిం♦జీర మనఁగ
నలకలనొర్తు గం♦ధామలకము నించె, నిరులవెన్నెలఁ గది♦యించె ననఁగ
జలకంబుఁ గావించె ♦ నల కంబుగళయొర్తు, కంతుకటారిపు♦ల్కడిగె ననఁగ
గీ. మేనితడియొత్తె నపు డొర్తు ♦ మీననయన, కనకపుత్త్రికకొకపన్నె♦యునిచె ననఁగ
నవదుకూలంబునందిచ్చె♦ నాతియొకతె, క్రొమ్మెఱుంగున వెలిమొగు♦ల్గూర్చె ననఁగ.

సుదక్షిణాపరిణయము, ఆ 5 పద్య 139.

ఉ. వలయప్రాతము పైకిఁద్రోఁచి పదము ♦ ల్వాటంబుగా నూఁది లే
జిలుఁగుం బయ్యెద కొంగుఁ జెక్కి యలఁతం ♦ జేమార్చుచు న్నమ్రియై
బెళుకుంగొను గురు ల్సలింపఁగ సరు♦ల్వంపిల్లఁ గూయం బమిం
దలయంటెం జెలి యొర్తు వేడ్కనఁ ఱగఁ♦టం బొక్కరాచూలికిన్. 2829

చ. కెలన నొకర్తు బంగరపు ♦ గిన్నియఁ జందన మూని నిల్వఁగాఁ
గలయఁగఁ బెన్నెఱు ల్పలిమి ♦ గందము పైఁజిలికించి గోరము
క్కుల దిగదువ్వి చేఁ బిడిచి ♦ కోమలి యొత్తె కరాంబుజద్వయీ
లలితసువర్ణకంకణకల♦ధ్వని వీనులవిందు సేయఁగన్. 2830

మ. తనుకున్బయ్యెద జాఱఁ జన్నుఁగవ చెం♦త న్మించు డాలీను కు
చ్చెల కొంగు ల్గుదియించి తంబుగలఁ జే♦సేఁ గొంద అందీ నొడల్
కలయన్వేపథువూన నూర్పు లవరం♦గా వేడ్కలో నొక్కచా
చ్చెలి కంసాంతకసూతికిన్ జలకమా♦ర్చెన్ గాంగతోయంబులన్. 2831

క. కడకొంగు ముడిచి తలపా,వడ యొకచెలి చుట్టె నొక్క ♦ వనిత తనువునం
దడియొత్తెఁ జలువదుప్పటి, వడఁతియొకతె యొసఁగె నాన్న♦పాలాగ్రణికిన్.

ఉ. ఒక్కలతాంగి కైయొసఁగె ♦ నొక్కవధూటి కిరీటిపచ్చటా
ముక్కలిపీఁటవైచె నొక♦ముద్దియ కుంచియువైచె వెండ్రికల్

చిక్కఁ డలించె నొక్కకల♦కీకుచ తొయ్యలి యోర్తు జాళువా
చక్కని బెజ్జపున్ బరణి♦సందుల ధూపము గొల్పె మెల్పునన్. 2833

సీ. కులుచకచంబులు ♦ గూడఁగూడఁ గదుర్చి, యొఱపుగా సిగవైచె ♦ నొకవధూటి
పలుచెఱంగుల కదం♦బపుఁబూవుటెత్తులు, చుట్టెఁ జుట్టుగ నొక్క♦సూనగంధి
జీవరత్నంబులు ♦ చెక్కిన సంపెంగ, మొగ్గతాయెతు లొక్క♦ముదిత చేర్చెఁ
బన్నీటఁ బదనైన♦పైగోవకస్తూరి,తిలక మొయ్యన నొక్క♦తెఱవ దీర్చె

గీ. వెలఁది యొక్కతె కుంకుమ♦కలపమలఁదెఁ, దరుణి యొక్కతె గొజ్జఁగి♦సురటి విసరెఁ
మగువ యొక్కతె జిలుఁగుధూ♦ప్రమంబుఁ జిలికె, సుదతి యొక్కతె నునుసోగ ♦
యొంఛె లిడియె.

క. చెలి యొకతె పచ్చపట్టెల్, బలసిన బిదుహోళి సెసరిగె♦పని పైఠానీ
చలువ యుఱచట్టఁ దొడిఁగెన్, సలలితగతి నొకతె కడక♦శలుముడి వైచెన్. 2835

గీ. రమణి యొక్కతె పీతాంబ♦రపుఁగుళాయిఁ, బెట్టెదంతంబుడబ్బచేఁ♦బెట్టె నొక్క
చెలి నెఱుల్ చక్కఁగాఁ ద్రోఁచె♦లలన యోర్తు, కేలనవరంజి గోలునులఁ♦గీలుకొలిపె.

క. నీలంపుమేను సూత్రపు, రాలకుసుంగవయుఁ బుష్య♦రాగపుఁ దేసుల్
గ్రోలెడి చొక్కపుఁదుమ్మెద, తాళియ నొకలేమ పేర♦దన్నలకొలిపెన్.

గీ. కట్టికమ్మ గేత్రుణ ల్సము♦ఖా యనంగ, నొకతె గొబ్బునఁ గైదండ♦యొసఁగ లేచి
నిలుచుటయుఁ బైఁటచెఱఁగుల♦జిలుఁగుచంద్ర,కావి పచ్చడమతనికిఁ♦గట్టె నొకతె.

క. క్షితినాథుని మూఁగల నొక, సతివయుఁ దా మంచినిలువు♦టద్దము నిలిపెన్
లతకూన యొకతె యాదవ, పతిసుతునకుఁ గప్పురంపు♦బాగా లొసఁగెన్.

చంద్రభానుచరిత్రము, ఆ 5 పద్య 148—158.

సీ. చెలువ మున్నేఁచిన♦సులరుసంపెఁగతేనె, నానుచు గతి నోర్తు♦సూనెయంటెఁ
గలికి యొక్కతె మరు♦కైదువుఁజల్లికూఁ,కటిగింజ లిడుగతి ♦ నటక లిడియెఁ
గనపబంగరు కలా♦కను జాజు వట్టించు, పగిది నొక్కతె మేనఁ♦బసుపుఁ బూసె
నెలఁదీవె పాదుస ♦ నిలిపి నీ రార్చులాగున నొక్కలేమ మ♦జ్జన మొనర్చె

గీ. నెలమిఁగుముదినిమా రార్ప♦వలసి జిలుఁగు,జంద్రికలఁ జేర్చుగతి నోర్తు♦చలువలొసఁగె
గలికి పురి నెమ్మి నిడుసోగ♦♦గుఱులు నివురు,చెలువున నొకర్తు పెన్నెఱు♦ల్చిక్కుఁవుచ్చె.

క. తెలిగను నెలవులుఁగుంభిలు, కలుపొదలన్ మేఁతమరవఁ♦గా పడుమం గొ్రి
నెఱమొలక నిలిపెనో యనఁ, దిలకము కపురమున నొకతె ♦ దీర్చెం జెలికిన్.

చంద్రభానుచరిత్రము, ఆ 5 పద్య 163, 164.

సీ. ఫాలభాగమున వ♦జ్రాలపాపటబొట్టు, తళుకుతళుక్కని ♦ తాండవింపఁ
గరసరోజముల బం♦గారు గాజులు రత్న, కంకణమ్ములు గల్లు♦గల్లు మనఁగఁ
జెమటచే జాతిన ♦ చికిలి కస్తురిబొట్టు, ఘుమఘుమత్తావులఁ ♦ గుమ్మరింప
మెఱుఁగారు కమ్మలు ♦ మృదుకపోలములపై, ధళధళత్కాంతులు♦దళుకులొత్తఁ
గీ. గొప్పముడి వీడ నుదుట ముం♦గురులు గూడ, గుబ్బచనుదోయి హారము♦ల్గునిసియాడ
నీటుపగమీఱ పన్నెకా♦నికి మిటారి, దమక మెదనంటసంపెఁగ♦తైల మంటె.
గీ. చెండ్ల గెలిచిన మెఱుఁగు పా♦లిండ్లతోడ, బీరములు చూపవచ్చుజం♦బీరములను
జించి సారస్య మంతయు ♦ వంచినట్లు, నిమ్మపండ్లరసంబుల ♦ నెలఁత యంటె,
మ. తరుణీరత్నము ఫాల కైతకదళో♦దంచన్న ఖాగ్రంబులన్
కురులన్ మెల్లనఁజీఱి పాయ లిడి చి♦క్కుల్ పాయఁగాఁ బ్రాముచున్
గరపంకేరుహరత్నకంకణ ఝణ♦త్కారంబు తోరంబుగా
వర గంధామలకంబుఁ బెట్టెనుసుధా♦వారాశి తొల్పట్టికిన్. 2844
ఉ. జాఱుపయింటఁ జెక్కి బిగి ♦ చన్గవ నిక్కఁగ బాహుమూలశృం
గారరుచుల్ వెలిం బొలియఁ♦గా నగుమోము చెమర్ప రత్నకాం
చీరవముల్ సెలంగ నభి♦షేక మొనర్చె లతాంగి వానికిన్
మారునిమాఱుసాగర కు♦మారునిఁ బట్టము గట్టెనో యనన్. 2845
సీ. పసమించు మాదర♦పాక పోరువలచేఁ, దడియారనొత్తి కుం♦తలము లార్చి
సాంబ్రాణిధూపవా♦సన నించి జవ్వాది,చే నంటుచును కురు♦ల్చిక్కు దీర్చి
అరవిరి విరిజాజి♦విరులు జుట్టిన జాఱు, పిగను జంటరుమాల ♦ సొగసుపఱిచి
తళుకునిచ్చలపు సె♦త్తమ్మిపూల బవంతి, పుట్టంబు హొయలుగాఁ ♦ గట్టనిచ్చి
గీ. కమ్మకస్తురిచేఁ దిల♦కమ్ముదీర్చి, యొంటివజ్రంపుబావిలీ ♦ లుంగరాలు
చేసరాలును సరిపెణల్ ♦ చిలుకతాళి, పంకజేక్షణ వాని క♦లంకరించె. 2846

తారాశశాంకవిజయము, ఆ 3 పద్య 9—13.

చ. నడుము మసియాడఁ జన్నుగవ ♦ నాట్యము సల్పఁగ రత్నహారముల్
దడఁబడి డోలికాకలనఁ ♦ దార్కొన వేణిచలింప నెమ్మొగం
బొడలును జెక్కుటద్దములు ♦ నొయ్యఁ జెమర్పఁగఁ గంకణంబు లే
ర్పడి రవ మొప్పతిల్ల నొక ♦ భామ తలంటెఁ గవీంద్రమాళికిన్. 2847

బిల్హణీయము, ఆ 3 పద్య 20.

ఉ. కంకణనిక్వణంబు ఘలు♦ఘల్లున మ్రోయఁ గపోలపాళిఁదా
టంకరుచుల్ వెలుంగ నుదు♦టం జిఱు చెమ్మట గ్రమ్మ హారముల్

కుంకుమ గంధపు వ్వలపు ♦ గుబ్బలపై నటియింప నొక్కఁ రేయే
జాంకనిఖాస్య భూపతికి ♦ నంపె సుగంధపు నూనె నత్తఱిన్. 2848

కవిరాజమనోరంజనము, ఆ 5.

క. సంపంగినూనె యంటెన్, శంపాంగి కిరీటి కొకతె ♦ చనుదోయి పిసా
ళింపం గిల్జిష కటి నటి, యింపన్ గిటకిటని కా నొ♦కింత చలింపన్. 2849

క. కలశ స్తని మణికంకణ, కలశస్తనినాద మొలయఁ♦గా నొకతె వడిన్
జలఁ బ్రామి పసిఁడి కొప్పెర, జలములు చెలు లంది యొసఁగ♦జలకం బార్చెన్.

విజయవిలాసము, ఆ 3 పద్య 79, 80.

చ. కురు లరవీడ దివ్యమణి♦కుండల రోచులు గండ భాగ భా
ర్ఘురముల నోల లాడఁ గుచ♦శైల యుగంబున ఘర్మవారికణో
త్కరములు గూడ మధ్యమప♦థం బసియాడ ముదంబుతోడఁ జా
తురిఁ దగు నొక్క పొల్తిడ యల♦తొయ్యలికిన్ శిరసంటె నూనియన్. 2851

చంద్రికాపరిణయము, ఆ 6 పద్య 15.

సీ. గురుకుచంబులఁ బెనఁ♦గొన్న హారావళు,ల్పయ్యెదవెలువడి ♦ బయలఁ రాఁగ
నరచందమామతో ♦ సరివచ్చు నిటలంబు,పైఁ గుంతలంబులు ♦ పరుగులెత్త
దిటముచాలక గిట♦గిటమను కాఁదీఁగె, యంబరావృతి నసి♦యాడుచుండ
శ్రమసముద్భూత♦నిశ్వాసానిలము తావి,గొన భృంగములు గుంపు♦గూడి చేరఁ

గీ. జెలఁగి నెమ్మొకమునఁజిఱు♦చెమటలూరఁ,గలితకంకణఝుణఝుణ♦త్కారమెసఁగ
మానవతియోర్తుసంపెంగ♦నూనెయంటె,నతిముదంబునఁబొంగియ♦య్యతివకపుడు.

సీ. కపురంబుజవ్వాది ♦ కమ్మకస్తురి హరి,ద్రయుఁగూర్చి నలుఁగిడె ♦ రమణియొకతె
గమ్మనవలచు చొ♦క్కపు మంచిగంధంపు, టటకలివెట్టె వా♦మాక్షియొకతె
సలిలశాలకుఁదెచ్చి ♦ చలువరాపలకపై, నిలిపె మక్కువతోడ ♦ లలనయొకతె
బంగారుబిందెలఁ ♦ బన్నీరు దొరలించి, జలకమార్చెఁ గడంక ♦ నెలఁతయొకతె

గీ. జిలుఁగు దువ్వల్వ ♦ కెంగేల నలవరించి, కదిసి తడియొత్తె నొక్కపం♦కజదళాక్షి
వ్రాఁతచెఱఁగుల చెంగావి♦వలువఁగట్టె, నిచ్చెనొకబాలికామణి ♦ యిందుముఖికి.

చ. నలినదళాంతవృంత పవ♦నంబులచేఁ దడియార్చి పెన్నెఱు
ల్గలయఁగ దువ్వచుం గుసుమ♦గర్భముగాఁ జెలియోర్తుకై శికం
బలవఱుపం బయోజముఖి ♦ యాస్యము చూడఁగ నొప్పె నయ్యెడన్
లలితమిళిందబృంద పరి♦లక్షిత ఫుల్లసరోజమో యనన్. 2854

ఉ. పంకరుహాక్షికి న్నిటల♦భాగమునం గొనగోరఁ దిన్నఁగాఁ
కుంకుమ రేఖదిద్దె నొక ♦ కుంజరయాన సరోషచిత్త మీ
నాంకధనుర్విముక్త దళి♦తాఖిలపాంథశరీర శోణితా
లంకృతవిభ్రమాంకుగను♦లక్షణలక్షితలీలఁ బొల్పుగన్. 2855

క. ఉడురాజబింబవదనకుఁ, గడఁకం గడకన్నులందుఁ ♦ గజ్జలమిడె న
య్యెడ నొకపడంతి చెలువల,రెడు చాతుర్యమున సొగసు ♦ రెట్టించంగన్. 2856

చ. పొలఁతు లమూల్యదివ్యమణి ♦ భూషణ పేటికఁ దెచ్చి యందులోఁ
గల మణిభూషణావళులు ♦ గన్గొని కాంచనపద్మపుత్త్రి మం
జులమగు లేమ మై సొబగుఁ ♦ జూచి సఖీమణి మేని కాంతితోఁ
దులగన వీవిభూషణత♦తు ల్నిజ మంచు వచించి తయ్యెడన్. 2857

క. అద్దముఁ జూపెను జెలియొక, ముద్దియ సఖి నీదు ముద్దు ♦ మోము సమమునం
గద్దె శశిఁ దెచ్చితి నీ, వద్దికి నిదె చూడుమనుచు ♦ వచియించుగలిన్. 2858

ఉ. అంగనయోర్తు పీఁటయిడె ♦ నంబుజలోచనయోర్తు రాజమౌ
ళిం గడు వేడ్క నం దునిచె ♦ లేమ యొకర్తు నృపాలదత్త ర
త్నాంగద ముఖ్యభూషణము ♦ లందుకొనెం గలకంఠియోర్తు తె
చ్చెం గనకస్థ సౌరభవ♦శీకృత తైలముఁ బైఁడిగిన్నియన్. 2859

చ. కలుకుమిటారి గబ్బిచనుఁ♦గొండల హారలత ల్నటింపఁగాఁ
గలనినదంబుతోడఁ గర♦కంకణము ల్మొరయంగఁ జూర్ణ కుం
తలములు ఫాలభాగమునఁ ♦ దాండవమాడఁగ సంతసంబుతో
నలికులవేణియోర్తు శిర♦సంటె నృపాలక చక్రవర్తికిన్. 2860

చ. గిటగిటఁ బేదకాను వడఁ♦కింపుచుఁ గస్తురి వల్గువెట్టె ను
త్కటకటకధ్వనుల్చెలఁగఁ ♦ గామినియోర్తు శిరోరుహాంబులం
దటకలివెట్టె గందమున ♦ నంగనయోర్తు కటీతటీనట
త్పటయగుచున్ రయంబున నృ♦పాలకమౌళికి సంతసంబుగన్. 2861

క. కైదండయొసఁగె నపుడొక, పైదలి నడపించె సలిల♦భవనంబునకున్
వేదండయాన యొక్కతె, యాదరమున నవ్వసుంధ♦రాధీశ్వరునిన్. 2862

చ. అనుపమరత్నపీఠమున ♦ వద్ధరణీవిభునుంచి యొక్కమా
నిని మణిపూర్ణకుంభముల♦నించిన గొజ్జఁగినీరముంచి మ
జ్జన మొనరించె నొక్కనవ♦సారసలోచన జిల్గుదుప్పటం
బునఁ దడియొత్తెఁ జెన్నలరు ♦ భూపవరాగ్రణికిన్ రయంబునన్. 2863

క. జలజాస్యయొకతె జిలుఁగుం, జలువలు దెచ్చి యొసఁగె నొక♦సతి గట్టియిడెన్
గలకంఠియొకతె కస్తురి, తిలకముఁ గొనగోర దిద్దె ♦ ధీరాగ్రణికిన్. 2864

వాసవదత్తాపరిణయము, వ. వీ. ఆ 5 పద్య 36—50.

సీ. చెక్కుటద్దములపైఁ ♦ జెమటబిందువులారఁ, గస్తూరి తిలకంబు ♦ గరఁగి జాఱఁ
గరకంకణంబులు ♦ ఘల్లుఘల్లని మ్రోయ, నలువంక బసిఁడి వెన్నెలలు గాయ
స్తనభారమోర్వక ♦ దనుమధ్య మసియాడ, నిండుమోహంబుతో ♦ నీవివీడ
గబ్బిపెబ్బెపుటుబ్బు ♦ గుబ్బచన్గవపొంగ, బాహుమూలోజ్జ్వల ♦ ప్రభ లెసంగఁ
సి. గటితటంబున గీల్జడ ♦ నటనమాడ, ఘనతరంబైన నిట్టూర్పు ♦ గాడ్పుతోడఁ
దాళగతులొప్ప సంపెంగ ♦ తైలమంటెఁ, దమక మెడనాటహరికి రా♦ధావధూటి.
గీ. చెలుల చేలాగుగొని లేచి ♦ కలికియిడిన, పాదుకలు మెట్టి రాజస♦ప్రౌఢి మెఱసి
మేటిమగరాలముక్కాలి ♦ పీఁటమీఁద, శౌరి కూర్చుండె మజ్జన ♦ సదనమునను.

క. లికుచకుచ శౌరికత్తఱి, లికుచరసంబిడియు నఖర♦రేఖలచేనో
క్రొక్కటిగఁ జిక్కుడలింపుచుఁ, బ్రకటితఘననీలకేశ♦పాశంబందున్. 2867

క. కుంకుమునలుఁగిడె నాచెలి, పంకజదళనేత్రి మేన♦భావములోనన్
బెంకగు ననురాగరసం, బింకఁగ వెలదీసి విభున♦కర్పించె ననన్. 2868

క. గంధామలకము వెట్టెను, గంధేభసమానయాన ♦ గని పరికరముల్
గంధతనులందియియ్యఁగ, గంధవతీధవున కపుడు ♦ గరిమె దలిర్పన్. 2869

గీ. పసిఁడిగిండులచేముంచి ♦ పడఁతులియ్య, జలకమార్చెను జెలువగొ♦జ్జంగినీట
రమణునకు రాధ విభవసా♦మ్రాజ్యమునకుఁ, జెలఁగి పట్టాభిషేకంబుఁ♦జేసెననఁగ.

సీ. కురులార్చె నొకలేమ ♦ నురటి నొక్కతెవీవ, పరిమళ నూనధూ♦పములనుంచి
సిగవైచె నొకభామ ♦ నిగనిగతాయెతుల్, గీలించె జంటరు♦మాలుగట్టె
విరులచే నొకరామ ♦ విదళించి పన్నీట, పదనిచ్చి గోవజ♦వ్వాదిఁ జమిరెఁ
బటమిచ్చె నొకచాన ♦ యటవిప్పె నలఁగంగ, నీకతాఘులుఁగట్ట ♦ నెరికగట్టె
గీ. తిలకవతియొత్తు కస్తూరి ♦ తిలకము నిచె, గంధగజయానయొక్కతె♦గంధమలఁదె
తొడవుతొడవోర్తు రత్నాల♦తొడవు లిడియె, శౌరికిని జాల నయ్యలం♦కారవేళ.

రాధికాసాంత్వనము, ఆ 1.

చ. కురు లలికంబుపై నెనయఁ ♦ గ్రొంజెమటల్ జనియింప ముత్తెపున్
సరులు పెనంగులాడఁగఁ గు♦చంబులు నర్తనసేయు నిద్దపున్
మురువున నాసికాగ్రమణి ♦ మోవిని జిందులు ద్రొక్క సేర్చునన్
శిరసునఁ బైఁట మంటె నొక ♦ శీతకరానన చంద్రమౌళికిన్ 2872

క. అనసూయారుంధతులను, వనితామణు లిర్వురును సు♦వర్ణఘటయుగం
బును గొని తోయము నించుచు, ననుపమగతిఁ జేసి రతని ♦ కభిషేకంబున్. 2873

క. తడి యొత్తె నొక్క కోమలి, పడఁతి యొకతె యిచ్చె మృదుల♦పరిధానంబుల్
మృదుమేన నొక్క భామిని, కడఁకం గర్పూరయుత సు♦గంధం బలఁదెన్.

ఉ. కన్నులు రెండెకావు వెద♦కన్మఱి యొక్కటి యున్నదో చెలీ
యెన్నఁడుఁ జూడ మమ్మ యిఁక ♦ నించుకకాటుకఁ బెమ్మటంచు నా
సన్నుత దేవతాళికిని ♦ జంద్రకిరీట సమేత మాళికిన్
గన్నియ యోర్తు కన్నులను ♦ గాటుకఁ దీర్చెను సూటిమీఱఁగన్. 2875

మూర్తిత్రయోపాఖ్యానము, ఆ 6.

సీ. కస్తూరియును పచ్చ♦కర్పూరమును గోవ, జవ్వాదియును మంచి ♦ చందనంబు
పన్నీటఁ బదనిచ్చి ♦ పంకంబుగాఁ జేసి, యంచుల నటుకలి ♦ యమరఁ బెట్టి
గంగాజలంబులఁ♦గలయ మజ్జన మార్చి, పంచవర్ణాన్నంబు ♦ పడసివైది
దివ్యాంబరంబుల ♦ దేహంబు తడి యొత్తి, కురులు సన్నగ దువ్వి♦ కొప్పు వెట్టి
గీ. ధాళధళ మగు బహు పుష్ప♦దామకములు, సెరయ కబరీభరంబున♦నిండ దుఱిమి
నొసల మృగమదతిలకంబు ♦ పొసఁగ వెట్టి, చెందుమణిదర్పణంబును♦జేతి కిచ్చి.

వైశ్యపురాణము, ఆ 8.

చ. సరులు పెనంగ లేఁజెమట ♦ జాలుగొనంగఁ గురు ల్వీడంగఁ గ్రొ
వ్విరు లురలంగఁ బైఁటచెఱఁ♦గింపుగ నోరపిలంగ గుబ్బచ
న్మొరుగు లెఱుంగఁ గౌను జవ♦మించు లెసంగ నగల్ మెలంగఁగా
గురుకుచ యోర్తు బిల్గాణున♦కుం దల యంటె ననేకభంగులన్. 2877

యామినీపూర్ణతిలకావిలాసము, ఆ 6.

సీ. సూటికాటుకనీటు ♦ మీటుఁజాల్గన్నుల, పొగసైనకేగ్రింటి♦చూపు లొలయ
బలుకెంపు బాజుబం♦దులు డాల్ మెఱయుముద్దు, గులుకుచంకలు మేలి♦తళుకులీన
నునుబోటి చనుదోయి ♦ సెన లేని బరువున, నలరి గొ నల్లల♦నాడుచుండ
సన్నంపుమేల్ బురు♦సారంగుచీరపై, ముత్తరుల్ సరులతో ♦ నెత్తమాడఁ
గీ. జుక్కతోఁగూడుచందురు♦సొబగుదెల్పు, ముత్తియపుఁజేరుచుక్క బల్ ♦ ముంగురులను
జెంచులాడంగ సేసఁ బ్రాల్ ♦ శిరమునసిడి, యులమిఁదల్లయాం బెద్దొరకొక్క ♦ యిందువదన.

క. నలుఁగిడె నొయ్యి నొక రమణి, తిలకము జలకంబు లార్చె ♦ తీరుగ నొకరా
[illegible] మిటారము, గులుకం దడియొత్తె ముద్దు♦గుమ్మ నృపునకున్. 2879

క. చెందిరపుం దిలకం బొక, మందగమన యిడె లలాట♦మధ్యంబున సా
నందమున నొక్క సుందరి, యంద మమర నెదుట నిల్వు♦టద్దము నిలిపెన్. 2880
కవిచకోరచంద్రోదయము. ఆ 1.

క. తలయంటె నొక్క యలికుం,తల సంపెఁగనూనె రఘుప♦తంసున కింద్రో
పలఖచిత కనకమయ శయ, వలయ ఝణంఝణరవంబు ♦ వలనుగఁ జెలఁగన్.

క. నిటలతటవిస్ఫుటనట,త్కుటిలాలక యగుచు నొక చ♦కోరదృశ సము
త్కటహర్ష మెసఁగ గందపు, టటకలి వెట్టెం బ్రభాక♦రాన్వయమణికిన్. 2882

చ. జలక మమర్చె నొక్క జల♦జాతవిలోచన యొక్కనీలకుం
తల తడియొత్తె ధౌతవస♦నం బిడె నొక్కసుధాకరాస్య వి
చ్చలవిడి పైఁడిగద్దియ యొ♦సంగె వెలందుక యోర్తు పెన్నెఱుల్
మెలఁత యొకర్తు దువ్వె నెల♦మిం గొనగోరుల రామమూర్తికిన్. 2883

సీ. కమనీయనవరత్న♦ఖచితకోటీరంబు, శిరమున ఘటియించెఁ ♦ జెలువ యొకతె
వికసితమణిబద్ధ ♦ మకరకుండలములు, వీనులఁ గీలించె ♦ వెలఁది యొకతె
గొనబువన్నియమీఱు♦కనకకేయూరముల్, భుజముల నెలకొల్పెఁ♦బొలఁతి యొకతె
రాణించు తెలితళ్కు♦టాణిముత్తెపుఁ బేరు; లురమున నొనఁగూర్చె♦నువిద యొకతె

గీ. వీరవిజయాంకమన్నెకు♦మారబిరుద, మైన ఘనగండపెండేర♦మంద మలరఁ
బాదములఁ బాదుకొల్పెను ♦ బడఁతి యొకతె,నిందువేడుకరఘువంశ♦మండనునకు.
రామచంద్రోపాఖ్యానము, వా. వేం. ఆ 2 పద్య 119—122.

చ. ఒక యినుకై వివాదము మ♦హోద్ధతి గల్గినఁ జక్రివాకు లూ
రక యనిఁ జేయఁ బైటి కొగి♦రాఁ దమ గూడులఁ ద్రొక్కులాడు మా
డికి అవికం గుచంబులు గ♦డిందితనంబునఁ జిందు లాడఁ బా
యక యొక యింతి శౌని తల♦యం టెను సంపఁగినూనెతో రహిన్. 2885

సీ. ముంగురుల్ చెదరి మో♦మున నాడఁ దమ్మిపూఁ, పైనాడు బంభర♦పాళిఁ దెలుప
బిగువైన కంచెలఁ ♦ బింపిళ్ళుగూయు చ,న్గవ వలఁబడ్డ జ♦క్కవలఁ దెలుపఁ
[illegible] నున్నకడియముల్ ♦ గలుగల్లుమని మ్రోయ, సుమచాపమౌర్వీప్ర♦సములు దెలుపఁ
జెక్కిలి దోయినిఁ ♦ జెమటజాఱఁగ శశి, శిలఫలకస్రావ♦ములను దెలుపఁ

గీ. జిన్నిముక్కెరముక్కునఁ ♦ జిందులాడ, మేలిపయ్యెదజాఱ ధ♦మ్మిల్లమూడ
లలితచంపకకుసుమతై♦లంబుతోడఁ, జక్కఁగా రాణి తలయంటె♦నొక్కప్రోడ.

గీ. గమగమయటంచుఁ దావులు♦గ్రమ్ముకొనఁగఁ, జెలఁగు కస్తూరి యందునఁ♦జిక్కసంబు
మెదిపి యారామొడయని నును♦మేన నొక్క,కలువకంటుల మేల్బంతి♦నలుఁగు లిడిరి.

క. వనితా పళ్ళెము నలుఁగుల, వనికోర్వనటంచు నెంతొ ◆ బడలితివిగదే
తనలకయిపుడెటులనిలుతు, వని రాణికి నొక్క మగువ ◆ యటకలి నిడెరొయన్.

గీ. ఇరువురను వేఱువేఱుగ ◆ గరుడుసాల, లోకిఁదోడ్కొనిపోయి త◆ప్కులపసిండి
గద్దియలనుంచి నరుగున ◆ రుద్దికురుల, గీరుచును పైనగొజ్జఁగి ◆ నీరుబోసి. 2889

సీ. నిడుదపెన్నెఱులను ◆ దడియొత్తె నొకయింతి, తొడరిమైఁగలతడిఁ◆దుడిచెనొకతె
విదిలించి కీల్గంటు◆వేసెనొక్కచెలంది, ముడియందుఁ బువ్వుల ◆ ముడిచెనొకతె
నిలువుటద్దముఁ బ్రోల ◆ నిలిపెనొక్కపడంతి, తిలకంబు మోమునఁ ◆ దిద్దెనొకతె
యత్తరుజవ్వాజి ◆ నలఁదె నొక్కపడంతి, కొల్లగాఁ బన్నీరుఁ ◆ జల్లె నొకతె

గీ. రవణముల మేనఁ గీలించె ◆ రమణి యొకతె, పూలసురటీలవీచెను◆బోలఁతి యొకతె
సింగపుంబీటలను వేసె ◆ చెలియయొకతె, కుడువఁగా బెట్టెనత్తఱి◆కొమ్మ యొకతె.

కవిజనచకోరచంద్రోదయము, ఆ 4 పద్య 168—173.

ఉ. సంపెఁగనూనె నంటి పెలు◆చన్ బసపూనఁగ నల్గు పెట్టె మే
ల్కెంపుల నత్తు సొంపు దుల◆కింపఁ బునుంగు చనుంగవం గుబా
ళింప మెఱుంగు ముంగురులు ◆ లేఁజెమటం బద నై నటింప నై
లింపవధూసమాన యొక ◆ లేమ సురానురమర్మభేదికిన్. 2891

భద్రాద్రిపరిణయము, ఆ 4 పద్య 52.

ఉ. అంతట నొక్క రాజముఖి ◆ యంతిపురంబున రాజనందను
న్వింతచొకాటపుంబనుల ◆ పీఠికపై నివసింపఁ జేసి తా
సంతస మాత్మ నుప్పతిల ◆ సంపఁగె నూనియ నంటెఁ బెన్నెఱుల్
కంతు గుణంబు లిట్టటు మె◆లంగకయుండఁగ మందుఁ బ్రామెనాన్. 2892

ఉ. కోమలియోర్తు రానుతున◆కున్ మృదు సుందర మైన మేన గం
ధామలకంబు వెట్టె నొక ◆ యంగనయుం జతురోక్తి రూఢిగం
ధామలకంబు చేతనె నృ◆పాత్మజు వేనభిషిక్తుఁ జేయుదున్
లేమరొ యంచుఁ బల్కి యటు◆లే పచరించె సమంచితంబుగన్. 2893

ఉ. కుంతలముల్ నృపాత్మజున◆కుం దడియార్పఁ గడంగి యొత్తె నీ
మంతిని యోర్తు నేర్పుమెయి ◆ నద్దిన కొంగున నద్దకుండ న
త్యంతము సన్నపువ్వలిపె ◆ మల్లనఁ జొన్పినకేల యామినీ
కాంత ఘనాంతరంబునకుఁ ◆ గౌముదిఁ బర్వఁగఁ జేసినట్లుగన్. 2894

సీ. ఒయ్యారపు మొలయున్నంగ◆నోరఁగాసిగవైచి, పువ్వుబంతెత్తులుచుట్టెఁ◆బోలఁతియొకతె
నుదుటఁ జెమ్మదలిర్పఁగా◆ గుదురుగాఁ గస్తూరి, తిలకంబలవరించెఁ◆గలికియొకతె

మెలపుతో వలపుతోఁ ♦ గలపరబునె మ్మేనఁ, బొలపంబుగనలందె ♦ వెలఁదియొకతె
రతనంబుల హారంగు ♦ జతనంపుటపరంజి, రవణముల్ గయిసేసె ♦ నువిదయొకతె
గీ. తలను బాగయు మహతాబు ♦ నిలువుటంగిఁ, బచ్చపూవన్నెల షరాయి ♦ పావదోయి
చేరుమాలును మెఱుఁగుకై ♦ జారుఁబతికి, సకియలాధరింపఁగనొసంగి ♦ రొకతెయొకతె.
రామరాయవిలాసము, ఆ 3 పద్య 143—146.
సీ. కురులు చిక్కులు తీసి ♦ క్రొత్త సంపెఁగనూనెఁ, దలయంటె జిలుకల ♦ కలికియొర్తు
పచ్చకప్రపుచాయ ♦ పసుపున మేదించి, నలుఁగిడె నెమ్మేను ♦ నాతి యొర్తు
మంచిగందపుఁదావి ♦ మించి గుబుల్కొన, నటకలి తల నిడె ♦ నతివ యొర్తు
బంగారు బిందెలఁ ♦ బన్నీరు గొని వచ్చి, జలకంబు లాడించెఁ ♦ జెలువ యొర్తు
గీ. నీరు ముమ్మారుతలచుట్టు ♦ నెఱయఁద్రిప్పి, తడవుమనుమనిదీవించెఁ ♦ బడఁతియొర్తు
రతనములపీఁట దొర దిగి ♦ రాఁగనెదుట, నిలిపె బంగరు పావలు ♦ నెలఁతయొర్తు.
రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 72.

## పురాలంకారము.

సీ. ఘనసారచందన ♦ కలితజలంబుల, లలి మణివేదిక ♦ లలుకువారు
బారాగణోదర ♦ తారమౌక్తికములఁ, బెంపార ముగ్గులు ♦ పెట్టువారు
మణిమరీచులు నభో ♦ మణిదీధితులఁ గప్ప, నెలమిఁ గేతన తతు ♦ లెత్తువారు
సుకుమారపిప్పల ♦ చూతపల్లవములఁ, గడఁగి తోరణములు ♦ గట్టువారు
గీ. సౌధవాతాయనంబుల ♦ సరసమొదవ, మంచి ధూపంబు లెలమి న ♦ మర్చువారు
జారు మంగళ ధీర ఘో ♦ షములు వెలయ, మించితూర్యములాగినివా ♦ యించువారు.
భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 2562.
సీ. స్వర్ణపరిచ్ఛద ♦ స్వచ్ఛకుడ్యద్వార, లాలితగోపురా ♦ ట్టాలకంబు
ఫలపుష్పమంజరీ ♦ కలితరంభాస్తంభ, పూగపోతాదివి ♦ భూషితంబు
ఘనసారకస్తూరి ♦ కాగంధజలబంధు, రాసిక్తవిపణిమా ♦ ర్గాంచితంబు
మానితనవరత్న ♦ మయరంగవల్లివి, రాజిత ప్రతిగృహ ♦ ప్రాంగణంబు
గీ. శుభనదీజలకుంభసం ♦ శోభితంబు, తండులస్వర్ణలాజాక్ష ♦ తప్రసూన
ఫలబలివ్రాతకలితవి ♦ భ్రాజితంబు, నగుచు సర్వతోలంకృత ♦ మైనపురము. 2898
భాగవతము, స్కం. 4 పద్య 815.
సీ. పన్నిరి మేరువుల్ ♦ బహుసంఖ్యలకొలంది, చంద్రసూర్యాకల్ప ♦ శతముతోడ
నాటిరి హరిచంద ♦ నన్గంబు లెన్నేని, నధికాయమానరఁ ♦ భాళితోడ

సవరించి రింద్రర♦త్నవితానములు పెక్కు, వజ్రకూటప్రభా♦వలులతోడ
నిలిపిరి చిత్రరే♦ఖలచాలు తమిమీఱ, నతుల హేమాకృతి♦ప్రతతితోడఁ
గీ. గట్టి రగణితపుండరీ♦కవ్రజంబు, తగు నెడ ననంతకుముదసం♦తతులతోడ
వాసవపురస్థితానేక ♦ వస్తుమహిమఁ, జూచి వాసవపురివారు ♦ చోద్యమంద.

చ. పరిణతదివ్యగంధఫల♦భారనమత్కదళీపరంపరా
పరివృతకాయమానములఁ ♦ పర్వఫలావళిఁ జూచి పైపయిఁ
బరిగొనివచ్చు రాజశుక ♦ పంక్తులచొప్పున నొప్పె నప్పుడ
ప్పురవిపణిప్రఘాణముల ♦ భూరిహరిన్మణితోరణావళుల్. 2900

చ. పసిఁడికురుంజులన్ మెలఁగు ♦ బంగరుబొమ్మలఁ జూచు దేవతా
ప్రసవసుగంధులన్ ధ్వజప♦రంపరఁ బిల్చివివాహవీటికా
విసరమొసంగ నెత్తు వసు♦వీరపురేందిరబాహులో యనన్
లసదహివల్లికావృతఫ♦లక్రముకంబులు నాటి రెల్లెడన్. 2901

చ. హిమసలిలాభిషిక్తయును ♦ హేమపటావృతయుం బటీరకుం
కుమరసలిప్తయుం గుసుమ ♦ గుంభితయు న్నవధూపధూమసం
భ్రమపరిజృంభమాణశిఖి ♦ బర్హశిరోజయు నై యొసంగె భూ
రమణపురాధిదేవత హి♦రణ్మయదర్పణదీప్యమానయై. 2902

వసుచరిత్రము, ఆ 5 పద్య 65—67.

సీ. ఎక్కడఁ జూచిన ♦ నిండ్లపైఁ బసిఁడికుండలు క్రొత్త మెఱుఁగిడి ♦ నిలుపువార
లేవంకఁ జూచిన ♦ హిమవారితోఁ గంధసారంబు కలయంపిఁ ♦ జల్లువార
లెచ్చోటఁ జూచిన ♦ నెలమి గోడలఁ దట్టు, పునుఁగుజవ్వాదియుఁ ♦ బూయువార
లేదిక్కుఁ జూచిన ♦ నింపుగా మణివేది, కలు గమ్మగస్తూరి ♦ నలుకువారు
గీ. ప్రేమఁ గప్రంపు ముగ్గులు ♦ పెట్టువారు, కలువడంబులు మేల్కట్లు ♦ గట్టువారు
పచ్చతోరణములు పొందు ♦ పఱచువారు, నైరహోరాత్రసంభ్రమం ♦ బలరజనులు.

కళాపూర్ణోదయము, ఆ 7 పద్య 58.

సీ. కమనీయతపనీయ ♦ కలశాన్వితము భవ్య, గారుత్మతద్వార♦తోరణంబు
ఘనగంధతైలభా♦జనదీపికావృత, మురుతరాగరుధూప ♦ సురుచిరంబు
యంత్రపాంచాలికా♦వ్యజనానిలమనోజ్ఞ, మతిచిత్ర పటవితా ♦ నైకసభము
ఘనసారకదళికా♦కలితహీరస్తంభ, మలఘుగంధరజస్స♦మాహితంబు

గీ. శుక్తిభవరంగవల్లికా♦సురుచిరంబు, మహితపరిఫుల్లమల్లికా♦మాలికాని
కాయలామజ్జకోన్నత ♦ కాయమాన్యమును నగుచునొప్పె నప్పురి♦జనము పొగడ.
విజయనందనవిలాసము, ఆ 3.

సీ. చంద్రశాలాంతర♦స్తంభజృంభిత మర,కతమణితోరణా♦వృతనభంబు
నాగుల్ఫకీర్ణ నా♦నానూనసూనప్రి,తానమానితనిషా♦ద్యానతంబు
కాయమానాసమా♦నాయత ముక్తావి,తానాంకి తాఘ్యవ♦స్త్యవ్రిజంబు
నగరుధూపోద్ధ ధూ♦మాళీకజలధరో,దయ నటద్భవనచం♦ద్రికి గణంబు
గీ. రాజబింబాననాకర ♦ రాజమాన, రత్నకల్పితమంగళా♦గాత్రికంబు
నగుచుఁ దనరారెఁ దత్పురా♦భ్యంతరంబు, రాజురాకకు ముదమునఁ ♦ దేజరిల్లి.
వాసవపత్త్రాపరిణయము, వ. పీ. ఆ 5 పద్య 85.

సీ. చంద్రశాలాస్థగి♦తేంద్రనీలద్యుతి, సొంపైనపెన్నెఱి ♦ గుంపుఁ గాఁగ
దగ్గవాక్షస్థిత♦దర్పణం బరయంగ, నిగనిగ ల్దేఱు నె♦మ్మొగము గాఁగ
గోపురార్పణశాత♦కుంభకుంభమ్ములు, లాలితస్తనయుగ♦ళంబు గాఁగఁ
గమనీయకమలారి ♦ కాంతవితర్దులు, ఘనతరజఘనయు♦గంబు గాఁగ
గీ. ధ్వజపటముచిత్రవర్ణంపు♦వలువ గాఁగఁ, దోరణస్తంభములు పెను♦దొడలు గాఁగ
మెట్టుదమ్ములు పదములు ♦ పట్టు గాఁగ, నలరిపురలక్ష్మి మిక్కిలి♦చెలువుఁ గాంచె.
పద్మినీపరిణయము, ఆ 5 పద్య 10.

సీ. కస్తురి పన్నీటఁ♦గలయంపి చల్లించి, గోడలు జవ్వాజి♦తోడ నలికి
ముగ్గులు కట్టాణి♦ముత్తియంబులఁ బెట్టి, నెలఱాలతోడఁ ది♦న్నియలు వైచి
డంబైన పగడంపు♦గంబము ల్నాటించి, తెల్లక్రొవ్విరులఁ బం♦దిళ్ళు వేసి
తోరంపుఁ బన్నులఁ ♦ దోరణంబులు గట్టి, రతనంపు డివ్వెలు ♦ జతను పఱచి
గీ. కలయ బంగరు పని మేలు♦కట్లు కట్టి, వాడవాడలహొంబట్టు ♦ పడగ లెత్తి
తావులమెఱుంగుఁ గుఱువేళ్ళ♦పడులు కట్టి, వీడు కైసేసి రెలమి న♦వ్వీటి వారు.
రసికజనమనోరంజనము, ఆ 4 పద్య 61.

—♦ స్వయంవరము. ♦—

సీ. అఖిల దిగ్దేశ రా♦జాకర్షణక్రియా, మహనీయతర సిద్ధ♦మంత్ర విద్య
యాకార రేఖా స♦ముద్భూతి తానన్య, సాధార ణాశ్చర్య ♦ జలధి వేల
నేపథ్య హీర ప్ర♦భా పూర నిర్మల, వారి బింబిత నిజ♦స్వచ్ఛ కాంతి
సంకల్పభవ దూత♦సదృశ కర్ణాకల్ప, కల్హార సౌర భా♦గత మదాళి

గీ. బహువిరోధి మణిప్రభా♦పల్లవాగ్ర, మల్లసంగ్రామ ఖురళికా♦మండలాయ
మాన నానా పరిష్కార♦మహితగాత్రి, మనుజపతిపుత్త్రి యాస్థాన♦మునకు వచ్చె.

మహాస్రగ్ధర. చతురత్వం బొప్పఁగా న♦ప్సరసలు భయపా♦ర్శ్వంబులం బాడుచున్ రాఁ
జతురంత స్వైరయాన♦స్థ యయి తరుణి యా♦స్థానముం జొచ్చి వచ్చెన్
శతపత్త్రాక్షీక రాజ్ఞో♦చ్చలితధవళరు♦క్చామరాళీమరాళీ
కృత లీలా లాస్య కేళీ♦కిసలయిత కలా♦ఖేలనం బొప్ప మీఱన్. 2999

సీ. దవ్వదవ్వులఁ గన్ను ♦ తనివి వోవఁగఁ జూచి, పరమాద్భుతం బాత్మఁ♦బాదుకొల్పి
సకలాంగకంబులు ♦ జాదుకొఁ బులకించి, చే యొకించుక రొమ్ము ♦ చిత్త మిడిచి
కదియ నాసా శిఖా♦గ్రమునఁ దర్జని మోపి, మూర్ధంబు గంపితం♦బుగ నొనర్చి
కడ కెప్పలార్చ యంగఁ♦గనుఁదమ్ము లర మోడ్చి, బొమదోయి యొక్కింత♦ పొడవు సేసి
గీ. లలన సౌందర్య రేఖా వి♦లాసమునకు, నిచ్చ మెచ్చని రాజొక్కఁ♦ డేని నరిది
యమ్మహాస్థానమున నున్న♦ యఖిల వార్ధి, వలయితాశేష మేదినీ♦శ్వరులయందు.

శృంగారనైషధము, ఆ 5 పద్య 5. 8, 9.

ఉ. మానితలీల నల్లన వి♦మానము డిగ్గి వినూత్న రత్న సో
పాన పరంపరా సరణి ♦ భారతి హస్తము గేల నూఁది వం
చానన మధ్య కాంచనమ♦యంబగు మంచక మెక్కి చేర్చె న
మ్మానవ నాథు కంఠమున ♦ మంగళ నవ్య మధూక దామమున్. 3001

శృంగారనైషధము, ఆ 6 పద్య 3.

సీ. గురు ధూప సంస్క్రియా♦గురుధూమ తతి దిక్కు, ఖంబుల కలకరే♦ఖలను దీర్చె
ఘుసృణ చందన గంధ♦మసృణాంబుసిక్తి యు, ర్వర కంగరాగ వి♦భ్రమ మొసంగె
వృత వైజయంత సం♦భృతి వైజయంతిక, ల్దివికి జిత్రి పరిధా♦న విధి నెఱపె
మణివల్లకీక్వణ♦ద్గుణవల్లికారుతుల్, గృహదేవతల కర్ణ ♦ గీతి గఱపె.
గీ. భోజకన్యాస్వయంవరా♦ద్భుతమహోత్స, వాభిరూపప్రసాధనా♦ర్థాభితఃప్ర
వృత్త సత్వర నగర నా♦రీజనప్ర, చార లీలా విడంబన ♦ సరణిఁ దోఁప. 3002

ఇందుమతీపరిణయము, మ. నృ. ఆ 5 పద్య 9.

సీ. కన్య నన్వలపునఁ ♦ గలయు నిజం బని, యొక రాజనందనుం ♦ డుబ్బ దొణఁగె
మీనాక్షి గొంకున♦ మెచ్చునన్నని యొక్క, వసుధేంద్రగురుఁ డొగి♦ వఱలఁ గాంచెఁ
గుంభకుచద్వయం♦ గూడు నన్నని యొక్క, యినకుమారుఁడు మది♦ నెనఁగఁ బూనె
సింహమధ్యమ నన్నుఁ ♦ జేపట్టు నని యొక్క, కువలయాధీశుఁ డు♦త్సవముఁ జెందె

గీ. నారయోఘవతీకాంత♦నరయ నోయ,గములకెల్లను తాశిరయై ♦ కొమరు మిగులు
కతనఁ గుతలాధిపతు లతి♦కుతుక మతుల, నతులవైభవయుతులునై♦యలరునంత.
ఓఘవతీపరిణయము, ఆ 4 పద్య 116.

## —♦ పట్టాభిషేకము. ♦—

సీ. వీర్యవంతములగు ♦ వివిధమంత్రింబుల,తోఁగూడ సద్విజ♦స్తోమ పరివృ
తునిఁ జేసికొని రాజుఁ ♦ గోడ్కొని యేఁగి యా,వినుతపీఠంబున♦నునిచి శోభ
నాలంకరణమున ♦ నభిరామ యైన పాం,చాలిఁ దద్వామపా♦ర్శ్వమున సహాస
మాసీనఁ గావించి ♦ యగ్నిముఖము సేసి, కొని హోమతంత్రిస♦ర్తన మొనర్చి
గీ. నంతనూర్జిత శుభవేళ ♦ యగుడు శంఖ, చక్రిధరుఁ డాసమర్చిత♦శంఖ మెత్తి
పృధివి కధిపతి వగు మని ♦ ప్రీతి నాపృ, థానుతుని నభిషిక్తునిఁ ♦ జేసె నధిప.
భారతము, శాంతి. ఆ 1 పద్య 374.

ఆ. మంత్రి సంయుతంబు ♦ మంత్రి నిబద్ధమై, ఫాలమందు హేమ ♦ పట్ట మమర
జల జటాంశు కపిల ♦ శశిఖండుఁ డగుభస్త, పగిది నపుడు రామ♦భద్రుఁడొప్పె.
ఆ. మహిత పద్మరాగ ♦ మణికిరీటముఁ దాల్చి, యుదయదర్కమండ♦లోదయాద్రి
యనఁగఁ బొలిచెఁ ద్రిజగ♦దభ్యుదయస్ఫూర్తి, మూర్తివైభవప్రి♦మోద మెసఁగ.
భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 2653, 2658.

క. పట్టముఁ గట్టిరి యానృపు,నట్టికి నెన్నుదుట భువన♦భరణశ్రీకిన్
నెట్టిన బ్రహ్మయొసంగిన, పట్టముపో యనుచు జగము ♦ ప్రణుతింపంగన్.
క. స్థండిలపూజితమును రుచి, దండితశశిమండలంబు ♦ ధారాళసుధా
కాండము నగుశంఖము ముని, మండలవిభుఁ డెత్తి యిచ్చె ♦ మనుజేంద్రునకున్.
గీ. అంశుమంతుండు సమ్మని♦యనుమతిం బ్రి,యాస మేతంబు గాఁ దగు♦నేస నెట్టి
జలజజలధార కోటీర♦వలభి జాఱ, హర్ష సంపద నభిషేక ♦ మాచరించి. 3009
గీ. శిఖరవిగ్గతగంగాంబు♦సిక్తతుహిన, ధరమో యనఁ బొల్చిన♦కొడుకుఁజూచి
తాము నారీతిఁ బొల్చుచం♦దమున హర్ష, తోయధారలఁదొప్పఁగ♦దోఁగిరపుడు.
క. కులగురు నైన వసిష్ఠుఁడు, జల మాన్నపు కేల నంది ♦ జలనిధివేః
వలయితమహీ నేలుము నీ,వలఘుమతీ యనుచుఁ జేసె ♦ నభిషేకంబున్. 3011
క. రాజోకరుఁడు రాజునకున్, రాజితముగఁ దాల్చెఁ బాండు♦రచ్ఛత్రింబున్
రాజితఁడె కాక యేనిఁక, రాజనె యని కొల్వవచ్చు ♦ రాజో యనఁగన్,

క. అనితరబందీకృతరిపు, జనపాలవిశాలకీర్తి ♦ చంద్రిక లనఁగా
మనుజేశ్వరు లిద్దఱు నృప,తనయునకుం జామరములు ♦ దాల్చిరి ప్రీతిన్. 3013
క. మేదురవిప్రజనాశీ,ర్వాదంబులఁ బుణ్యగాన ♦ నాదముల మహా
వాదిత్రనాదముల జయ,నాదంబులఁ దగియె జగము ♦ నాదమయంబై. 3014

సుదక్షిణాపరిణయము, ఆ 2 పద్య 173—180.

సీ. కనఁగల్గె నేటికై ♦ నను రాము ననుచుఁ గౌ,సల్యాదిజనము లు♦త్సాహ మొంద
రామ నీకీర్తి యా♦రవిచంద్ర మగుఁ గాత, మని వసిష్ఠుండు దీ♦వన లొసంగఁ
దమరు చేసిన సుధ♦ర్మములు నేఁడు ఫలించె, నని పౌరు లుత్సవ♦మ్ముల మెలంగ
సకలదేశాధినా♦యకులు గానుక లిచ్చి, యంజలికీలితహస్తు♦లై భజింప
గీ. భరతలక్ష్మణశత్రుఘ్న♦పవనతనయ, భానుజాంగదజాంబవ♦త్ప్రముఖధన్యు
లుచితమగునూడిగములు సే♦యుచును గొలువ, రాముఁ డప్పుడు పట్టాభి♦రాముఁ డయ్యె.
సీ. కమనీయరత్నోర్మి♦కలఁ బూని సితఫేన, చందనాంగకుఁ డయ్యె♦సాగరుండు
పైరుపచ్చల తాళి♦మీఱ పెంఠక్కల గగు,ర్పాటుఁ గంచుక మూనె ♦ రత్నగర్భ
వినుగెంపుఁ బతకంబు ♦ గనిపింప మరదీర్ఘ, కాచేల యై మించె ♦ గగనలక్ష్మి
విమలకోరకమౌక్తి♦కములఁ దోజిగురుఁగెం, బట్టుఁబుట్టముఁ గట్టె ♦ బహువనాళి
గీ. కుంభికుంభాగ్రశోణమృ♦త్కుంకుమంబు, దంతరుచివజ్రహారముల్ ♦ దాల్చెదిశలు
సీతతోఁగూడి సరిలేని ♦ చెలువు పూని, శ్రీరఘుస్వామి పట్టాభి♦షిక్తుఁడైన.

ఉత్తరరామాయణము, ఆ 1 పద్య 135, 136.

సీ, చౌదంతి తనుకాంతి♦సంపత్తి నెన జెంది, యలరారుచున్న సౌ♦ధాదికములు
పవడంపు నునుఁగెంపు ♦ ప్రవిమలచ్ఛాయల, మహిమ శోభిల్లెడు♦మందిరములు
మిన్నంది చెన్నొంది ♦ మిలమిలల్ దళుకొత్తఁ, బారంబులేని ప్రా♦కారతతులు
సరిలేని నెఱిఁ బూని ♦ నిరుప మాకారులై, భాసిల్లు చున్నట్టి ♦ పౌరజనులు
గీ. మంజుల ప్రభ నొప్పెడు ♦ మౌక్తికముల, రంగవల్లిక లలరు గృ♦హాంగణములు
తోరమౌ చూతపల్లవ ♦ తోరణముల,చేత నలరారె నప్పుర♦శ్రేష్ఠ మపుడు. 3017
గీ. అట్టితఱి నుత్తమోత్తము♦లైన మౌను, లమిత గుణశీలు లైన దు♦ర్గాధిపతులు
పేడ్కఁజనుదెంచియందందు♦విశ్రమించి,యున్నగురుఁ డంతనెమ్మది♦నుత్సహించి.
క. పట్టాభిషిక్తుఁ జేసెను, బట్టా యిది యనుచు రామ♦భద్రుఁడు నవ్వం
గట్టె నొక కంకణము చే, కట్టా యని కైకనోరు ♦ కట్టువడంగన్. 3019

నిర్వచనవిచిత్రరామాయణము, ఆ 1.

## సంతర్పణము.

సీ. పలుమాఱు లోశిక ♦ బిలువంబడినవారు, వెండిచెంబులతోడ ♦ నుండ లోన
ముమ్మాఱు పిల్పించి ♦ నెమ్మి వచ్చినవారు, కంచు చెంబులతోడఁ ♦ గాలిఁజాల
నినుమాఱు పిలువంగ ♦ నెలమివచ్చినవారు, రాగిచెంబులతోడ ♦ రాజిలంగఁ
బిలిచిన మాత్రన ♦ బిర బిర వచ్చు వా, రత్తడి చెంబుల ♦ హత్తియుండఁ
గీ. బట్టు బట్టలు నార్మడుఁ ♦ గట్టి ధావ, ళులును పొడిగుడ్డ లొగిఁ గట్టి ♦ సులలితముగ
మృత్తికా భస్మ గంధాక్ష ♦ తాత్తరుచులు, వెలయనొక్క సంతర్పణ ♦ మలరుచుండె.
క. పిలువంబడక తమంతటఁ, బిలపిల మని వచ్చువారు ♦ వెలుపలఁ బలుది
క్కులపై మఱియును వెన్నన, నిలఁబడఁ గోలాహలంబు ♦ నింగి ముట్టెన్. 3021
గీ. మొంటి తెగవారి కరటాఁకు ♦ లొదవెఁగొనలు, గలవి లేనివి రెండవ ♦ తలమువారి
కంత మట్టాకు లవలఁ బు ♦ ల్లాకు లలరెఁ, బిలువఁ బడకుండువారికి ♦ విస్తరులెటో.
కుమారనృసింహము, ఆ 2.

## రాజుముస్తాబు.

సీ. అపరంజినిగ్గుచా ♦ యల తళత్తళ లీను, డంబైన మణికిరీ ♦ టంబుఁ దాల్చి
మగమానికంబుల ♦ తెగల నిగ న్నిగల్, తగు లొందు నరచట్టు ♦ బిగియఁ దొడిగి
పట్టు దట్టీమీఁదఁ ♦ బస మించు పైగొప్ప, వన్నెకెంపుల రుమీ ♦ వంకి చెక్కి
కుదురుగా హురుమంజి ♦ కొత్తముత్తెంబులు, గట్టిన గొప్ప చౌ ♦ కట్లు పెట్టి
గీ. వేల్పు రేరాల ముక్కల ♦ వెక్కసముగఁ, బొందుపఱచిన యుంగర ♦ మ్ములుధరించి
పంతుపై తానిసాలువుల్ ♦ పైని వైచి, వింత కైచేసె నాధరా ♦ కాంతుఁ డెలమి.
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 6 పద్య 77.
సీ. సొగసైన సిరిపావుఁ ♦ జుట్టి కస్తురిబొట్టు, దాల్చి నెమ్మేనఁ జం ♦ దన మలంది
మెఱపువైఖరి పస ♦ మించు బంగరుఝుకీ, రంగునిద్దానిల్వు ♦ టంగి దొడిగి
మొలధట్టిగట్టి చే ♦ తులను దానత్రాత్ర, కళ దెల్పు నపరంజి ♦ కంకణముఁ
రాజిలముత్తియ ♦ రతనంపుబటువు లం, గుళులపైఁ బలుచంద ♦ ముల వెలుంగ
గీ. నంద మగు మొగమాల్ మస ♦ లందుమీఁద, మేలుహొంబట్టుశాలూరు ♦ మాలుపైని
రంగు వాఱంగమిగులహొ ♦ రంగుమెఱయ, నిండుగోలువుండెఁగన్నుల ♦ పండువుగను.
కవిచకోరచంద్రోదయము, ఆ 1.

## రాజు పురప్రవేశము.

ఉ. లాజలు నక్షతంబులు దళత్కుసుమంబులు మీఁదఁ జల్లి నా
నా జయ వాదులై జనులు నల్లడ మ్రొక్కుచు వేడ్కఁ జూడఁగా
రాజనిభానన ల్మహిత రత్న సమాజ విరాజమాన నీ
రాజన రాజితో నెదురురాఁ గడు సొంపున వచ్చి మోసలన్. 3025

క. భీకరతరభేరీ ఘుంటా కాహళ తూర్య ఘోషణములు సెలఁగ న
స్తోక శ్రీకానేకా, నీకంబులు బలసి కొలువ నిజ పురి సొచ్చెన్. 3026

భాస్కరరామాయణము, బాల. పద్య 94, 95.

సీ. అమలంబు లగు చతురంగ బలంబులు, గరిమ దీపించి నల్గడలఁ గొలువ
హృద్యంబులై బహువాద్య రవంబులు, ప్రోయ మాగధ గానములు చెలఁగ
వంది బృందములు కైవారము ల్గావింపఁ, జేరి పుణ్యస్త్రీలు సేస లిడఁగఁ
గంకణ ఝుణఝుణత్కారము ల్చెలరేఁగ, రమణులు వింజామరములు వీవఁ
గీ. గలికి కన్నులు వారకాంతలు పసిండి, పళ్లెరంబుల రత్నదీపములు నించి
నిండు వేడ్క నివాళింప నిజపురంబు, మంచి శుభలగ్నమునఁ బ్రవేశించె నృపతి.

హరిశ్చంద్రోపాఖ్యానము, శంక. ఆ 5 పద్య 237.

సీ. ఉప వనీ రమ మారుతోత్పతత్కుసుమ రా, జీకైతవంబున సేస లిడఁగఁ
బ్రాకారలక్ష్మి వజ్రపు జాల తళుకుచేఁ, దన మేన మంచిగంధంబుఁ బూయ
ధర్మ్యగోపురచరత్ప్రాపతద్ధ్వజ, శ్రేణి పల్కులనె యాశీర్వదింప
రాజమార్గచరత్న రత్న సౌధ శ్రీలు, గడు రక్తి కుంకుమ గానుక సేయఁ
గీ. గోళి భూభృత్పరంపరల్ కేతనాంశు, కాప్తిఁ బాపఁడ లూన మౌక్తిక శ్రీధామ
లలితరుచి ధూత చంద్రకలంకలంక, రాజసమునఁ బ్రవేశించె రాజరాజు.

ఉత్తరరామాయణము, ఆ 1 పద్య 235.

ద్విపద. దొరలగ్రమునఁ జెల్మి దొరల మెలంగఁ, గరము పెల్లునభటోత్కరము జెలంగ
గడలసామరులు నల్గడలవర్తింప, పడగలవార్మను పడగమియింప
గములుగూడుకతురంగముల పైనెక్కి, కొమరుఁబ్రాయపు రాచకొమరులు నడువ
వంతుల నెక్కి మావంతులు మత్త, దండులపై మహోద్దండత నలరఁ
బసిఁడిబెత్తులవారు బలసి యిర్వంకఁ, బస నెసంగుచు బరాబరు లొనరింపఁ
దురగరింఖాసముద్ధూతపరిభూత, ధరణిపరాగంబు తపనుని గప్ప
భేరులు ఢమఢమలు పెద్దబూరలును, వీరకాహళికలు విప్పుగా మొఱయ

సాలపట్టములు ము♦త్యాలవెల్లులును, జాలువాయరిగెలఁ ♦ జామరంబులును
గొనియాడి గీలుఁడా♦కొన వెంటరాఁగ, సెనలేని బలుఁకీవి ♦ యెసఁగ నేతెంచి
మణికేతనముల హే♦మనికేతనముల, గణికారమణుల ము♦క్తాహారమణుల
జవఘోటకముల సు♦జ్జ్వలహాటకముల, నవతోరణముల ను♦న్నతవారణముల
వనజాలకముల కే♦వలజాలకముల, ఘనవితానముల స♦త్కవివితానముల
రాజమార్గముల నీ♦రంధ్రిదుర్గముల, వాజిశాలికల సు♦వర్ణడోలికల
నసమసౌధముల ది♦వ్యావరోధముల, ప్రసవవాటముల శుం♦భత్కవాటముల
భద్రవాద్యముల సే♦పద్యచోద్యముల, శూద్రనాయకుల స♦త్ముద్రిగాయకుల
నృపతనూభవుల ని♦ర్నిద్రవైభవుల, విపణిపద్ధతుల సం♦వృతబలోద్ధతుల
శ్రుతినినాదముల వి♦శ్రుతవినోదముల, క్షితిసురావళుల సం♦చితమహోకులుల
వివిధవర్తకులఁ బ్రి♦వీణవర్తకుల, సవనధామముల యో♦షాలలామముల
పరిదనీకముల శ♦శ్వత్తటాకముల, వరతపోధనుల భా♦స్వరవణిగ్జనుల
ననయంబుఁ గడుమనో♦హరలీల సెలసి, తనరారు తనరాజ♦ధాని సొత్తెంచి
వందిమాగధులు కై♦వారముల్ సేయఁ, గ్రందుగా నర్తకీ♦గణము నర్తింపఁ
గలధౌతపాత్రలఁ ♦ గపురంపుటార,తులునించి పుణ్యవ♦తుల్ నివాళింప
సెలరాలమేడల ♦ నిలిచి సాడెంపు, చెలువలు ముత్యాల ♦ సేసలు చల్ల
తొడరి సోరణగండ్ల ♦ త్రోవల రాచ, పడఁతు లీక్షింపుచు ♦ భళిభళి యనఁగ
నాగమోక్తముగ ధ♦రామరోత్తములు, మూఁగి యాశీర్వాద♦ములు వొనరింప
నుడుగక నాగరు ♦ లుడుగర లిడుచుఁ, బొడఁగనశుభతూర్య♦ములుబిట్టు మొరయఁ
గొలువుకూటము సొచ్చి ♦ కొంతసేపచటఁ, గొలువుండి యెల్లఱ ♦ గొబ్బునఁబనిచి.

సారంగధరచరిత్రము, ఆ 1.

## —♦ రాజప్రతివందనము. ♦—

గీ. ఒక్క చే మ్రొక్కు కేల్దోయి ♦ మ్రొక్కు నొక్క, కరము సా మ్రొక్కు తలమ్రొక్కు ♦ కన్ను మ్రొక్కు
నుచితగతిమ్రొక్కె దృక్పాణి♦రచనమూర్ధ,నియతిఁదగువారిఁగూర్చుండ♦దయఁదలంచి.

బహులాశ్వచరిత్రము, ఆ 1.

## —♦ రాజదర్శనోత్సుకలు. ♦—

సీ. కలికి చూపులు రత్న ♦ కలికా కలాపంబు, గుబ్బచన్నులు హేమ♦కుంభ వితతి
మొలుఁగుఁ జెక్కులు క్రొత్త♦మించుటద్దంబులు, పాణి యుగ్మంబులు♦పల్లవములు

వెలఁది మందస్మితం♦బులు కమ్మ పువ్వులు, పలుకులు వల్లకీ ♦ కలకలములు
పరిపాట లోష్ఠ బిం♦బములు తేనియతోఁటల్, తనుకాంతియోలగం♦ధంపుఁబసుపు
గీ. గాఁగ సౌభాగ్య వివిధ మం♦గళ పదార్థ, వర్గములుఁగ్రంతనపుచుభా♦వంబుదోఁచెఁ
జౌర కాంతలు రాజకు♦మార దర్శ,నోత్సవంబున కేతెంచు♦చున్నయపుడు. 3031

శృంగారనైషధము, ఆ 6 పద్య 68.

సీ. కొఱనెలపైఁ దోఁచు♦నిరులునాఁజెలువొంది,నొసలిపైఁగురులుతుం♦పెసలుగునియ
హాటకమణిమయ♦తాటంకరోచులు, గండభాగంబుల♦గంతు లిడఁగ
స్ఫురితవిద్రుమనిభా♦ధరబింబరుచితోడ, దరహాసచంద్రిక ♦ సరస మాడ
నొండొంటితో రాయు♦నుత్తుంగకుచకుంభ,ములు మొగంబులకును♦బుటము లెగయ
గీ. బడుగునడుములు వడఁకంగ ♦ నడుగు లిడఁగ, రవళిమట్టెలు మణినూపు♦రములు మొరయఁ
బొలుచుకచబంధములుభుజం♦బులనటింపఁ,బయ్యెదలువీడియాడసం♦భ్రమముతోడ.

భాగవతము, స్కం. 10 ఉత్త. పద్య 687.

చ. చిలుకలకొల్కి కల్కి యొక ♦ చేడియ నాటక సాల మేడపై
నిలువున నాడు చుండి ధర♦ణీపతిఁ జూడఁ దలంచి యంచునన్
నిలిచి రహిం గనుంగొనుచు ♦ నెయ్యమునం దనువల్లి యుబ్బి కం
చెల తెగి పడ్డఁ గేతనము ♦ చీఱ చెఱంగున మూసెఁ జన్నులన్. 3033

ఉ. కీరమనోజ్ఞవాణి యొక ♦ కిన్నరి కిన్నెర మీటి మీటి యొ
య్యారపు లీల నేఁగి వసు♦ధాధిపుఁ గన్గొనె జిల్గుపయ్యెదన్
హారముఁ జక్కఁ బెట్టెడు కు♦చాహిత హస్తము పైఁడి గోళ్ళ హిం
సారతి నేయు దర్పకుని ♦ సంపెఁగ ముల్కులఁ బోలె మించఁగన్. 3034

చ. పరవశదైన్య మాడుకొను ♦ ప్రోషలఁ గానదు ఘర్మవారిచేఁ
గరఁగి సరివించు చిత్రికము♦గాన దసాదృతవీటిపాటలా
ధరమున నున్న మంటిన వి♦ధంబును గానదు నవ్వుటాల కా
భరణము గొన్నఁ గాన దొక♦బాల నృపాలునిఁ జూచి నివ్వెఱన్. 3035

చ. అలికులవేణి యొక్కతె ర♦తాంతమునం దన యంగవల్లికం
బులకలు చొక్కు లేఁజెమరుఁ♦బుట్టఁగ నేఁగి నరేంద్రుఁ జూడ నా
పులకలు చొక్కు లేఁజెమరుఁ బోవక యట్టుల యుండె నట్టి దాఁ
జెలువగు వానిఁ గన్గొనిన ♦ చెల్వకుఁ బ్రాపుల కావె కూటముల్. 3036

చ. అలరులబంతి జృంభికకు ♦ నడ్డము సేయుచుఁ గర్ణపాళిపై
కలకలఁ ద్రోయుచుం దరఁగ♦లో ప్రతిమ ద్రాక్షలు గోటమీటుచుం
జెలి భుజపీఠి నొత్తిగిలి ♦ చిల్కను దువ్వుచు వాలుఁగన్నుఁ గ్రే
వల కుదధార చేర నొక ♦ వారవిలాసిని చూచె రాసుతున్. 3037

చ. జిలుగులఁ బెట్టుచుం దొడల ♦ చెందిరిక పావడ యంట మై తడిం
జెళపెళలేని చీరఁ గటి ♦ బింకపుఁ జన్నులఁ జేర్చుకొంచు వే
జలకము లాడియాడి యొక♦చాన కరస్థితకేశయై నృపున్
వెలువడి చూచె లోపడితి♦నీ కని బాసకు నిల్చెనో యనన్. 3038

మ. ఒక నేత్రాంబుజ మొక్కగల్ల మొక చ♦న్నొయ్యారపున్ లీలవీ
థికిఁ దోఁపన్ దలుపోరగా నొక పురం♦ధ్రీరత్నమీక్షించె రా
జకిశోరంబుఁ దదీయ లై వెలయుభా♦పాలత్స్మరలం జూచి త్ర్యం
బకభాగంబు మొఱంగి మైత్రికి శివా♦భాగంబ యేతెంచెబాన్. 3039

మ. కలయం గూర్మిఁ జెమర్చు నంగముల ల♦గ్నంబైన సన్నంపుమం
జులకౌశేయమునందు మించు కమల♦స్తోమంబుచేఁ జూచె నొ
క్క లతాతన్వి చెలంగి పొంగుమది కాం♦తుల్ దీర మేనెల్లఁ గ
న్నులు గావించి కుమారు జవ్వనము చె♦న్నుం జూచు చందంబునన్. 3040

మనుచరిత్రము, ఆ 5 పద్య 63—70.

సీ. రాగంబుమూర్తమై ♦ రహిఁ దోఁచెఁ జూపు పెం,పునఁ బదచ్ఛాయము♦న్మృణ్ణనిగుడ్డ
వీక్షాపరిహితదూతి♦వెస నేఁగు మని ప్రోత్సుక్క,గతి నంఘ్రిఁ గర్ణాబ్జ♦కళికఁ ద్రాల
నీవిఁ జుట్టిన భోగి ♦ నిట్టూర్పు గమి నుబ్బి, సడలెనా నొడ్డాణ♦మెడలి తూలఁ
గందు వెన్నడుము పైఁ♦గరుణించి చనుదోయి, చిందుపన్నీరునాఁ♦జెమరు దొరుఁగఁ
గీ. గటికరణి కంఠపీఠిపైఁ ♦ గంతుఁ ద్రసెడి, బిరుదు మావంతుఁ జేసిన ♦ పీలిజల్లి
పెంపుగను పెన్నెఱుల గుంపు♦ ప్రిదిలి జాఱ వచ్చె నొకసతి వసుమతీ♦వరునిఁ జూడ.

ఉ. డించఁగఁ బ్రొద్దు లే కద ఘ♦టించిన రత్న విభంచితో సువ
ర్ణాంచితమూర్తి యోర్తు ముఖ♦రాంఘ్రిసమార్చిత సత్కలాపయై
యుంచలవచ్చు సోయగపు ♦ టంచలఁ దోలుచు మిన్నుచేడెయా
నంచు నుతింపవచ్చె వెస ♦ నాచతురాస్యుని మోము గన్గొనన్. 3042

చ. పొలఁతి యొకర్తు చెంగలువ ♦ పొట్లము చేత నెపూని వచ్చుచు
న్వలపుల దండజాఱగుణ♦వద్దళమాత్రిని తాల్చె నిమ్మహీ

తలపతి కేన కూర్తునని ♦ తప్తపరశ్వధ మెత్తి వైచి మం
జులదళతంతులేశపరి♦శుద్ధిజనాళికిఁ దెల్పు కైవడిన్. 3043

ఉ. చిత్తతి యోర్తు ముత్తియపుఁ♦జేరు వలగ్నమునన్ ఘటించి కే
ల్పుత్తిపుఁ జన్నుదోయి నొనఁ♦గూర్చి రయంబునఁ జూడ వచ్చె రా
జోత్తము నాత్మహారవిభ♦వోజ్జ్వలమధ్యవిదారణక్రియా
యత్తములైన చన్నులఁ బ్రి♦యంబున వేఁడుచు వచ్చె నో యనన్. 3044

మ. రమణీయోజ్జ్వల రత్నకుట్టిమముపై ♦ రత్నాంకభూషానుబం
ధము తోడం బరువెత్తి మే లని పద♦ద్వంద్వంబుపై నాహిత
ప్రమదంబై హృదయంబు వేగ విగళ♦త్ప్రాలంబముక్తాభిషే
కము గావింపఁగ వచ్చె నొర్తు వసులో♦కస్స్వామి వీక్షింపఁగన్. 3045

సీ. తను ఘనంబుగ నమ్మ్రు♦దరియు నెమ్మికిఁ గొప్పు, మాల్యభోగినొసంగి♦మరలఁ బంచెఁ
దను గొండయనివచ్చు ♦ నునుజింకఁ గుచముగా, రుడశిలాసరదూర్వ♦లిడి మరల్చెఁ
దను గల్పలతికగా ♦ దలఁచివ్రాలెడుశారిఁ, గరము రత్నఫలాళి♦నెఱపి నిలిపెఁ
దను బద్మమనియంటఁ♦జెనఁగు నంచకు నంఘ్రి, హీరాంగదప్రృణాళ♦మిచ్చియనిచె
గీ. నాత్మపోషితవర్గంబు ♦ లవనిపావ, లోకగమనాంతరాయంబు ♦ గాక యుండ
నవయవంబులె తోడయ్యె♦నతివకనుచు, నెచ్చెలులు మెచ్చవచ్చె మా♦నినియొకర్తు.

వసుచరిత్రము, ఆ 6 పద్య 11—16.

ఉ. ఆవిభుఁ జూచు కాంతల ము♦ఖావళి సోరణగండ్ల శోభిలం
గా విలసిల్లె సౌధము ల♦ఖండిత దిగ్జయధామ చిత్రిత
త్పావన చారుకీర్తి కృత♦ తర్జన భీతి సహస్ర భావి భి
న్నావతరత్వహేమకమ♦లామర సింధు జలౌఘమో యనన్. 3047

ఉ. క్షోణితలేంద్రుఁ జూడ నొక♦కొమ్మ వడిం బఱతెంచి యుల్లస
ద్వేణీ భరంబుతో మొగపు ♦ తీగె వలగ్నము నం దమర్చి యొ
డ్డాణము తీగగా నిడి మె♦డన్ వలగొన్నది చాలమిం గొనల్
పాణుల నుండఁ గొను మఱి ♦ బాగుగఁ గానుకఁ బెట్టు కైవడిన్. 3048

కళాపూర్ణోదయము, ఆ 8 పద్య 137, 139.

క. జలకం బాడుచు నొక చెలి, వలువ ధరింపంగ మఱచి ♦ వాకిటి కరిగెన్
దెలికత్తెలు నగఁగఁ గుతూహలమున నలుఁ జూచు వేడ్క♦యాకర్షింపన్. 3049

గీ. తనదు నెఱివేణి జాఱినఁ ♦ దరుణియొార్తు, సందిటను బట్టికొనివచ్చి ♦ చక్కనిలిచె
నమలి పింఛంబు నలమహీ ♦ నాథమణికి, మెచ్చు గావింపఁగానుకఁ ♦ దెచ్చెననఁగ.
షట్చక్రవర్తిచరిత్రము, ఆ 5 పద్య 48—52.

ఉ. జాఱిన పువ్వు దండ జడఁ ♦ జక్కఁగఁ జుట్టుక కొంత పాణి పం
కేరుహసీమఁ బూనుకొని ♦ శ్రీరఘురాముని జూచె ముత్తెపున్
తోరణగండ్ల నోర్తు నిసుఁ ♦ జూచిన నన్ను మరుండు నొంచెఁ ద
త్క్రూర ను మాంబకంబు లివి ♦ గో నని చూపఁగఁ దెచ్చెనో యనన్. 3051
ఉత్తరరామాయణము, ఆ 6 పద్య 148.

చ. ప్రమదముతోడ నేనె తగు ♦ భామిని నీతనికన్నరీతి సం
భ్రమమునడాసి యొండొరుల ♦ పైఁ బడుచుం దమిహెచ్చ నయ్యెడన్
రమణులు పద్మరాగమణి ♦ రాసులమీఁదికి నెక్కి నిక్కి భూ
రమణునిఁ జూచుచుండిరి పు ♦ రస్థమణీ విపణిస్థలంబులన్. 3052

చ. దళముగ నీలరత్నములు ♦ దాఁచిన విప్పగు మేడమీఁదటం
గలికి యొకర్తు భూవిభునిఁ ♦ గన్గొన తోరణగంటి చెంగట
న్నిలిచినఁ దద్గృహం బలరె ♦ నిశ్చల విద్యుదురుప్రకాశతం
బొలిచిన నీలమేఘమనఁ ♦ బొల్పుగఁ బట్టణ రాజవీథిలోన్. 3053

ఉ. ఆసవగంధబంధురము ♦ లౌ వదనాబ్జము లెత్తి నింగిపై
డాసిన మేడలందొగి మి ♦ టారులునిల్చి నృపాలుఁజూడఁగా
భాసిలె జాలమార్గములు ♦ పంకరుహాకర విభ్రమంబుతో
వాసమయంబునందుఁ బ్రము ♦ దాననపజ్క్తులె గాననాటచేన్. 3054

చ. తరుణియొకర్తు ఱేనిఁ దమిఁ ♦ దప్పకచూచి తదీయరూపమో
పరినిలిఖించి తన్నుచట ♦ వ్రాయఁగఁ దద్విభుఁ డండఁజేర న
గ్గురుకుచ నేర్పుతో నృపున ♦ కు న్నమచాపము చేత వ్రాసె న
ద్దిర యదియెంత ప్రౌఢ నుద ♦ తీమణియో పరికించి చూడఁగన్. 3055
వాసవదత్తాపరిణయము, ఆ 5 పద్య 29—32.

సీ. ఈ లోక నాయకు ♦ నెలమి నాలోకించి, యరుగుదెంతము హంస ♦ యాన రావె
యీ పుండరీకాక్షు ♦ నేపారఁ జూచి వ,త్తము తడ వేల శ్రీ ♦ తరుణి రావె
యీ రాజశేఖరు ♦ నింపు సొం పలరార, మహిమఁ జూతము సతీ ♦ మణిరొ రావె
యీ రాజ కందర్పుఁ ♦ జేరి వేడ్కలరఁ గ,నుం గొంద మిటు పెాహ ♦ నాంగిరావె

గీ. యీ తరుణ భాను తేజుని ◆ ప్రీతి నరసి, యీ క్షణమవత్తమంబుజా◆తాక్షి రావె
యీ సుధాంశు కులాగ్రణి ◆ నిచ్చ నెలఁగ, గానఁ బోచముకువలయ◆గంధి రావె.
శకుంతలాపరిణయము, ఫ. వేం. ఆ 1.

చ. కడు వడి రత్నకంచుకముఁ ◆ గాంత యొకర్తు ధరింప నొక్కతె
ల్దొడుగుట నూర్ధ్వ దోర్లతల◆తోఁ గుచ కుంభ యుగంబు నిక్కనె
క్కుడు తమి నేఁగి తద్వలభి ◆ గుంభిత కృత్రిమ పుత్త్రి కాళిలో
నడుమను నిల్చి కాంచె నిజ◆నగ్నత యేర్పడ కుండ నేరికిన్. 3057
ఇందుమతీపరిణయము, నృసిం. ఆ 6 పద్య 35.

—◆ యువరాజు. ◆—

సీ. అర్జునచ్ఛవి యశం ◆ బలరఁ గర్ణాకృష్టి, దర్పించి తెచ్చు వే◆దండసమితి
తగఁ జైత్రమహిమ యు◆ద్ధతకేసరావలం,బనలీలఁ గొనివచ్చుఁ ◆ గినిసి హరుల
భువనాధికఖ్యాతి ◆ వివిధపరివాళాగ్ర,ధృతి నీడ్చి యలయించు ◆ ద్విజకులంబు
రాజతేజమున వి◆భ్రాజిపక్షాసక్తి, దెరలించి కదలించు ◆ శరభచయము
గీ. బోడికలఁ గూడి శైశవ◆క్రీడఁ దగిలి, ధరణిధరనందనుండు కాం◆తారఘోర
శైలభీకరగహ్వర◆స్థలులు చొచ్చి, వాలుమగఁటిమి నాఖేట◆కేలి కేఁగి. 3058

క. తిండాడు వైరివీరులఁ, జెండాడుట యేమి దొడ్డ ◆ చెండాడు గతిన్
గొండవయిఁ గొండ గూలఁగఁ, గొండికపాయమున నీటు◆కోల న్మీటున్. 3059

సీ. కాకపక్షచ్ఛాయఁ ◆ గబళించునున్నచ్చ,సవరణ బర్హిపిం◆ఛంబు గాఁగ
నరవిందహితుఁ బోలు ◆ కురువిందములతాళి, యభినవంబైన కౌ◆స్తుభము గాఁగఁ
గటి నున్నలేఁత చెం◆గావిదుప్పటము దు,ప్పటి మించుహొన్నాణి◆పట్టు గాఁగ
నురమునఁ గీలించు◆మరకతమాణిక్య,హారవల్లరి వైజ◆యంతి గాఁగ
గీ. భూమి భామినిపై నిండుఁ◆బ్రేమమనను, నెనయఁబాయకవిహరించు◆ననువుదలఁచి
యవతరించిన కృష్ణుఁడో ◆ యనఁగ బాల, కేలి వర్తించుసమ్మహీ◆పాలసుతుఁడు.
సుదక్షిణాపరిణయము, ఆ 2 పద్య 126, 127, 128.

సీ. ఒక వేళ యవనచో◆ళ కళింగ శక వంగ, ఘూర్జర ల్గొలువంగఁ◆గొలు వొసంగు,
నొక వేళ నిగళన్మ◆నోద్దండ వేదండ, హయ పరంపర నెక్కి ◆ యాడఁ దివురు
నొక వేళ దండనా◆యక చమూనాయకుల్, హాళిమై నడువ వా◆హ్యాళి వెడలు
నొక వేళ రిపు నృపా◆ళక జాల సాల ధ్వస్తమదుర్గ కూరశైక ◆ శౌర్య మరయు

గీ. మఱియు నొక వేళ ధీరసా♦మంతమంత్రి, పుంగవులతోడవిభుఁడు♦ముఖ్యసభముఁజేరి
తెలుపఁదగువార్తలెన్నియుఁ♦దెలియఁజేయు, ననఘగుణశీలుఁడాబాలు♦డహరహంబు.

శుకసప్తతి, ఆ 1.

సీ. కరము లెత్తిన యంతఁ♦గను లాననంబులు, వికసించి పద్మినుల్♦వేడ్కఁ దనరఁ
దేజోరుణంబు వి♦భ్రాజమానంబైన, క్రూర తామసు లెల్లఁ♦గ్రుంగి యొదుగ
సంతతం బొగి వసు♦సముదాయముల నీఁగ, రాజు సంతోషించి♦రాజిలంగ
దృఢదీప్తిఁ జెన్నొంద♦దీనత్వ మెడఁబాసి, చక్ర సంతతి సౌఖ్య♦సరణిఁ దేలఁ
గీ. గుటిలకౌశిక సంఘంబు♦గుహలఁజొరఁగ, ననుదినము లోకబాంధవ♦ఖ్యాతిమిగుల
దండిగాఁ జాపరులకుఁ గ♦న్పండువగుచుఁ, బరగుచుండెను దర్శన♦భాస్కరుండు.

ఓఘవతీపరిణయము, ఆ 5 పద్య 43.

మ. కొనలీల న్వేల మీఱ నీక జిగిమి♦న్మిక్కుల్లిమ్ము రత్నంపుబం
తిని దోడ్తో నతు లాగ్రహాన్స్ఫురణచేఁ♦దెల్పున్ శలాకాప్రభో
దనయం బన్యుల కెల్ల దుర్లభగతిం♦దాఁ జూపునత్రాసతో
పనతామూల్యత రాచపట్టి వణిగా♦భన్ గందుక క్రీడలన్. 3063
గీ. శ్రిమర నుష్ఠ మహిమా తాత్రిభి♦రామబాల్య, భూమ హేమంతఋతుమహి♦శా మనోజ్ఞ
చారు యౌవన కుసుమర్తు♦సంధివేళ,బాలభానుఁడుసముతేఁజొ♦ప్పడఁగనొప్పె.

ఇందుమతీపరిణయము, మ. నృ. ఆ 1 పద్య 60, 61.

—♦ మంత్రి. ♦—

సీ. జ్ఞానపరుఁడు పౌర♦జానపదాప్తుండుఁ, గార్యజ్ఞుఁడును ధైర్య♦శౌర్యఘనుఁడు
నకూరుఁడును విశు♦ద్ధాత్ముండుఁ బతియెడ, భక్త్యనురాగసం♦భ్రమము లెసఁగ
సమసుఖదుఃఖుఁడై♦చెమరు నెత్తురుగాఁగఁ, దలఁచుచు నరయక♦తప్పమీఁదఁ
బెట్టిన నలుకమైఁ♦దిట్టినఁ గలఁక దా,నొందక తేర్చుచోఁ♦బొందు నెడక
గీ. మెలఁగువాఁడును నిజరంధ్ర♦ములకు మాటు, సేయఁ బరరంధ్రములు గని♦చిక్కువఱుపఁ
జాలునిపుణుండు నైనవి♦శాలబుద్ధి, గావలయు మంత్రిముఖ్యుండు♦గౌరవేంద్ర.

భారతము, శాంతి. ఆ 3 పద్య 369.

సీ. ఆరోగ్యవర్ద్దేహుఁ♦డాకార శాలి వం,శ క్రమాగత న్యువి♦స్తారబుద్ధి.
ధీరుఁ డాఢ్యుండు గం♦భీరుఁ డవ్యసని ప్ర,జానంద కరుఁడు ద♦యాన్వితుండు

నిజ మర్మగోపన♦నిపుణుండు పరమర్మ, భేదన నిపుణుఁడు ♦ సాదరోక్తి
శీలుఁ డాచార వి♦శిష్టుండు సర్వవి,ద్యానిధి ఘనుఁ డుత్త♦మాన్వయుండు
ఆ. లీలవాఁడు శూరుఁ♦డాలస్య రహితుఁ డౌ,చిత్యపరుఁడు నిఖిల ♦ చిత్తవిదుఁడు
భర్తవలను గలఁడు ♦ భక్తుండు చెలికాఁడ,నంగ మంత్రి ముఖ్యుఁ డిదతఁడు వెలసె.

కేయూరబాహుచరిత్రము, ఆ 1 పద్య 65.

ఉ. దానులు రాజ్యవర్ధనులు ♦ దత్త్వవిచారు లుదారు లింగిత
జ్ఞానులు మంత్రకోవిదులు ♦ సత్య వచస్కులు విద్విషత్తమో
భానులు ధీయుతు ల్బతు రు♦పాయ సమర్థులు రాజ కార్య సం
ధానపరాయణు ల్వినయ ♦ తత్పరు లాపురి మంత్రు లెంతయున్. 3067

భాస్కరరామాయణము, బాల. పద్య 26.

మ. ఉపధాసిద్ధుఁ ద్రివర్గశోభితు శుభో♦ద్యోగిన్ నియోగిం గృపా
విపుల స్వాంతు నితాంత శాంతు స్వమనో♦విశ్రాంతు నశ్రాంతు జ్ఞా
నపరున్ దానగురున్ బ్రసిద్ధగుణసం♦తానున్ సమానున్ గళా
నిపుణున్ మంత్రిగఁ జేసి భూపతి గనున్ ♦ నిర్నిద్ర సౌఖ్యోన్నతిన్. 3068

సుదక్షిణాపరిణయము, ఆ 2 పద్య 160.

మ. చతురోపాయ సమర్థుఁ డప్రతికళా♦చాతుర్య ధుర్యుండు వి
శ్రుత కార్యజ్ఞుఁడు రాజ నీతి పద ద♦క్షుం డింగితజ్ఞానుఁ డు
ద్ధృతశక్తిత్రయపారగుండు గుణసం♦పూర్ణప్రభావుండు సం
తత భూపాదరణీయుఁ డొక్కరుఁ డ♦మాత్యశ్రేష్ఠుఁ డుండున్ బురిన్. 3069

సీ. నిర్ణయం బా బ్రహ్మ ♦ నిర్ణయంబు స్వమాయ, విష్ణుమాయయుఁ జర్య ♦ కృష్ణచర్య
వాక్యంబు శ్రీరామ ♦ వాక్యంబు దృష్టి యీ,శ్వర దృష్టి దీప్తి భా♦స్వంతుదీప్తి
బల్మి భీముని బల్మి ♦ పద వింద్రపదవి స,త్యము హరిశ్చంద్రుస♦త్యము ప్రతిజ్ఞ
రామ ప్రతిజ్ఞ స్థై♦ర్యము మేరు నగ స్థైర్య, మాజ్ఞ సుగ్రీవాజ్ఞ ♦ ప్రజ్ఞ గురుని
గీ. ప్రజ్ఞ బలము సుయోధను♦బలము కట్ట,డన భరతు కట్టడి కలిమి ♦ ధనదు కలిమి
గాఁగఁ బతి మెచ్చ నఘటన♦ఘటనపటిమ, నమ్మహామంత్రి రాజ్యభా♦రమ్ము దీర్చు.

హంసవింశతి, ఆ 5 పద్య 260, 262.

## —♦ మంత్రాలోచనము. ♦—

గీ. మానవాధీశ యేలోక ♦ మైన నేమి, యార్తు లతి భీతిఁ బొందిన ♦ మార్తులెండ్లఁ
ద్రుంచి వారలఁ బ్రభుఁ డుద్ధ♦రించె నేని, నప్పు డగు శ్రుతి శబ్దంబు ♦ సార్థకంబు.

క. తేనుఁ గొలిచి పోయి పగరను, గని కొలిచిన భటుఁడు మళ్ళఁ◆గావచ్చిన వా
నిని నేలఁదగదు నరపతి, యనువెఱుఁగక యేలెనేని ◆ హానిం బొందున్. 3072

గీ. వైరిచుట్టంబు గొలువంగ ◆ వచ్చెనేని, వాని నేలంగఁ దగదు భూ◆వల్లభుండు
శరణుఁజొచ్చిన యెటువంటి◆శత్రునైనఁ, గాచుటుచితంబు మేదినీ◆కాంతునకును.

క. తనప్రతితోడుత సామము, తనకించుక యెక్కుడైనఁ ◆ దగు భేదంబున్
దనకధికునకును దానము, తనకన్నను దుర్బలునికి ◆ దండన మొప్పున్. 3074

క. గడెనున్న నృపునితోఁ బగ, వడయుచు మఱి యువలనున్న ◆ పార్థివుతోడం
గడు మైత్రిచేసి నేవియుఁ, బుడమంతయుఁ బొలియునొగులు ◆ భూపతియంతన్.

క. పరు లంపిన కట్నంబులు, పరిశోధింపక యె నృపతి◆పట్టఁగఁదగ దా
పరునికిని సద్గుణంబులు, పరికింపఁగఁగలిగె నేని ◆ బతి మెచ్చఁదగున్. 3076

క. బలవంతుని సాధింపఁగఁ, దలఁచిన గడెనున్న దొరల ◆ ధనమిడి కట్టన్
వలయుం బూనినకార్యం, బలవడునందాక నృపతి ◆ యతినయవిదుఁడై. 3077

క. ఇలలోని ప్రజలనొంపక, కలకొలఁదిని సొమ్ము గొనుట ◆ కర్జము తేఁటుల్
జలజంబుల మకరందము, పలుదెఱఁగుల వ్రాలి క్రోలు◆భంగి నరేంద్రా. 3078

క. ఓజంబ్రసాదగుణముల, రాజేంద్రుఁడు వెలయ వలయు ◆ రసభావకళా
రాజితమతి యై సత్కవి, రాజు విధంబునను నిఖిల◆రాజన్యమణీ. 3079

గీ. బహుసహాయత సాధనో◆పాయపటిమ, దేశకాలవిభాగంబు ◆ దీప్తసిద్ధి
ఘనవిపత్తిప్రతీకార◆గతియు ననెడి, యంగపంచక మవనీశుఁ ◆ డరయవలదె.

గీ. మూఁట విహరించి నాల్గింటి ◆ మూలమరసి, యయిదుపచరించి యాఱింటి◆యం
దమెఱిఁగి
యేడువర్జించి ధారుణి ◆ యేలెనేని, యెనిమిదియుఁ గల్గి యవ్విభుఁ◆డెన్నికగను.

గీ. మహితసప్తాంగ విభ్రాజ◆మానదాన, కలనచే సార్వభౌమాంకుఁ◆డలరుచున్న
యపుడు లోకోత్తరఖ్యాతి ◆ నతిశయిల్లి, ధారుణీభార మంతయుఁ◆దాల్చవనిప.

షట్చక్రవర్తిచరిత్ర, ఆ 6 పద్య 59—70.

## సేనాధిపతి. ◆—

క. మొనన దీర్పు వెరవు యంత్రము, లనేకము లొనర్చ నేర్పు ◆ నాయుధముల వి
న్ననువును బోటులకర్జంబును సేనాపతికి నైజ◆ములు గావలయున్. 3083

భారతము, శాంతి. ఆ 2 పద్య 380.

## —♦ ఎఱుకసాని. ♦—

సీ. నవరనిపనివన్నె ♦ ఆవిక పిక్కటిలంగఁ, గులుకుపాలుబ్బుగు♦బ్బలు చెలంగ
ముంజేతులను ముఖాం♦బుజమున నొకవింత, పొలుపుచెల్వెడుపచ్చ♦బొట్టులెసఁగ
గురుమాఁపుపయ్యెంట♦చెఱఁగులోనిడుకొన్న, ముద్దుఁబల్కులచిన్ని♦బుడుతఁడమరఁ
దరతరంబులనుండి ♦ తనయింట వెలయు పు, త్తడిపైఁడిబుట్టము♦స్తమున వెలుఁగ
గీ. బొమలసందుననామంబు♦భూతిపూఁత, నెన్నొసటఁబుక్కిటువిడెంబు♦గన్నుఁగొనలఁ
గాటుకరహింపవచ్చియా♦ష్మాతలేంద్రు, చరణములకోరగాఁ(మొక్కి♦చక్కనిల్చె.
శుకసప్తతి, ఆ. 1.

## —♦ మంత్రిసాని. ♦—

చ. ఉరిసిన పల్లవెండ్రుకలు ♦ నూడినదంతము లంబకంబులన్
గురిసెడుబాష్పజాలములు ♦ గూనువణంకెడుమస్తకంబుఁ గం
ధరఁ దగు ప్రోలు పాదములు ♦ దర్శనముల్వడిచీరపోఁగునూ
ల్మెఱసెడు మంత్రిసానిఁ గని ♦ మించెడువేడ్క నుతించి మొ్రొక్కనన్. 3085
హంసవింశతి, ఆ 2 పద్య 34.

## —♦ మాతంగస్త్రీ. ♦—

సీ. నునుపుగాదువ్వి తీ♦ర్చినకెంపుబాలేందు, పసమీఱునొసటికెం♦బసుపుబొట్టు
మెడత్రోలుపావాలు ♦ నిడుదగవ్వలదండ, సన్నంపుఁజికిలిద♦ర్పనపుఁబేరు
వెడమచేఁ బల్లిక ♦ నిడినబండా రవ్వ, పాణిఁ బట్టిన నాగ ♦ పడిగకోల
కటిఁ గాసెకట్టుగాఁ ♦ గట్టినచెంగావి, నిద్దంబుగుబ్బల ♦ నీలిఱవికె
గీ. పదయుగంబున గజ్జెలు♦బాగు నెఱపఁ, బరశురామునిపైఁ బాట♦బాడికొనుచు
సొంపు మీఱంగ నెక్కలో♦జోగటంచు, ముంగిటికివచ్చినిలిచెమా♦తంగియొకతె.
శుకసప్తతి, ఆ 2.

## —♦ వికృతస్వరూపిణి. ♦—

సీ. వల్లచింపిరితల♦ఫాలంబునుడియును, ముడిబొమ్మలును జప్పి♦ముక్కుదొప్ప
చెవులుఁ బిల్లికనులుఁ ♦ జెక్కుటిపులిపిరి, గొగ్గిపండ్లును మూది♦కోఁతిమూఖము
[illegible]ంగ మెడయు నిడు♦గూనివీఁపునొఱుగు, పోయినరొండిరొయు ♦ బొక్కటొ్మత్త
[illegible]జన్నులు ♦ పుల్క చేతులుఁ గడు, వలమైన గానుగు ♦ వంటినడుము

గీ. దొడ్డికాళ్ళును నల్లని♦చెడ్డరూఁడలుఁ, గలిగి యత్యంతనీరసా♦కారమైన
కలహాకంటకి నవ్విపుత్రి♦కాంతఁ జూచి, భయము జనియింపధారుణీ♦పాలు డేవి.
హరిశ్చంద్రోపాఖ్యానము, ఆ 4 పద్య 168.

ద్విపద. మెఱుకపట్టినతల ♦ మెడగండమాల, నుదుటిమీఁదటిసుడి♦నులిగొన్న బొమలు
బుఱ్ఱముక్కును లొట్ట ♦ పోయినగన్ను, వెఱ్ఱిచూపును డెగి ♦ వ్రేలాడుచెవులు
మిడిపండ్లు చెక్కిలి♦మీఁదిపుల్పిరియుఁ, బడివ్రేలుచన్నులు ♦ బడబాకినోరు
రోటుపోయినచెయ్యి♦బొమ్మకంపరము, వాటుఁగాలును బోలు♦వలెనున్న నడుము
బద్దుపిక్కలు నంట♦బలిసినతొడలు, మొద్దుపాదంబులు ♦ ముడిఁగినవ్రేళ్ళుఁ
గఱుకునల్లనిమేను ♦ గలిగిదయ్యంబు, మఱపింపఁ దగు నుచ్చ♦మల్లిచందమునఁ
గనుఁగొన రోఁతైన ♦ కాలకౌశికుని, వనిత హుమ్మనుబంది ♦ వాటులమాతఁ
గని దానిఁ గదియ బె♦గ్గల మంది నెఱచి, వెనుకకుఁజరుగు సు♦గ్రీవివిభుఁడేవి. 3088
హరిశ్చంద్రోపాఖ్యానము, గౌర. భాగ. 2.

సీ. పుట్టకాల్ సొట్టకేల్ ♦ వట్టివ్రేలుం జెవుల్, పట్టులేకట్టిట్టు ♦ బిట్టుగదులు
మిట్టపండ్లును జెను ♦ లొట్టకన్నవయును, జొట్టలై చుట్టలై ♦ నిట్టనిగుడి
దట్టంపు బలుకొంగ ♦ పిట్టచట్టుపలను, గొట్టంగనమకట్టి ♦ నట్టితెల్ప
రెట్టింప నాదలఁ ♦ బుట్టి చెంపలమీఁద, నట్టాడునీఁకెల ♦ కట్ట చుట్ట
గీ. తొట్టిపెదవులుదుంపర ♦ లుట్టిపడెడు, చట్టికెనయగునోరును ♦ గట్టిలేక
యిట్టిటులఁ దూలు బలు నడి♦కట్టు వింత, సౌరు గలయాదికొంకెరి♦సానిమఱియు.
సీ. పెంటలోపలపుచ్చ ♦ విత్తులగతిగప్పు, గలగొగ్గిపండ్లు సిం♦గారమడర
విప్పుగల్గిన పేఁడ♦కుప్పలోఁబురువుల, చొప్పునఁ గొప్పున ♦ నుమము లమర
కప్పచిప్పలఁబోల్సు ♦ కండలూరెడురీతిఁ, జీపికన్నుల పును ♦ లేపుమీఱ
నగలపేరింటి సు♦న్నపుబొట్లతో దృష్టి, పిడుతలచందాన ♦ వీను లొప్ప
గీ. గడ్డి బొద్దు వలెను మేను ♦ గానుపింప, బారకట్టల తెఱఁగున ♦ బాహులలర
జనకయాగంబుఁ జూడవ♦చ్చెనులలాట, సాంద్రతరరోమరేఖ యా♦చంద్రరేఖ.
క. జడకుచ్చును మెడహెచ్చును, నడనచ్చును గచ్చులేని ♦ నలుపగుమేనున్
నిడుద లగు తొడలబెడఁగున్, గడు వలమగు నడుముఁ గలుగు ♦ కలికిది భళిరా.
క. నిక్కపొగపిడతగదరా, ముక్కు మొగంబెన్నఁ గోఁతి ♦ ముఖమున కెనయా
పొక్కిలి తామరభళిరా, యక్కజపుంబిడకదిమ్మ♦లౌర కరంబుల్. 3092
గీ. నోవిపీఁయూపమూరును ♦ గేవలముగ, గవ్వదస్సెలుపండ్లహా♦కలికిమేను
ప్రమదిమ కోరింత కంపలఁ♦గదుమఁజాలు, చెక్కులలరారులోహంపు ♦ నక్కలౌర.

ఆ. చూపు కాకి చూపు ♦ సేపారుకన్నులు, పిల్లికనులఁ గదుమ ♦ నల్లనిల్లు
స్వరము గార్దభమును ♦ బరిహాసింపఁగఁజాలు, మగువ పెఱుఁగముడెంబు ♦ మంగలంబు.
చంద్రరేఖావిలాపము, ఆ 1.

చ. చెడుగులనేటి యుక్కుగుమి ♦ చేసి విధాత్రుఁడు గార్దభంబులన్
బుడమిసృజింప వానిమెయి ♦ భూరికురూపము చాలమిం బదం
పడి యొనరించె లొట్టియల ♦ వానికి మిక్కిలి కుస్వరంబు చే
పుడమి నొసర్చె నేర్పుమెయి ♦ భాముసు రెండును గల్గియుండఁగన్. 3095

చ. పవలునుసుండు పెన్దమము ♦ పాడుగుణంబులు రూపుదాల్చి యీ
భువనములోనఁ గుర్విమ్మరఁగఁ ♦ బుట్టిన భీకరవిగ్రహంబు బాం
ధవనిచయంబు చేతవసు ♦ ధాస్థలిగల్గు పిశాచభాష తా
భువిఁ జరియించు సంపదల ♦ ముద్దియయక్క నెలంత యెంతయున్. 3096

ఉ. చారునగంబులన్, ధనువు ♦ సంపెఁగపూవును, గెంపుఁగూర్చి సిం
గారపుఁ జన్నులన్, బొమల ♦ ఘ్రాణము, వాతెఱఁజేసి బ్రహ్మ తా
వారక వానికక్కశత ♦ వంకరఁ బచ్చన, రక్తకాంతిఁ బెం
పారఁగఁదీసివేసె మెయి ♦ యారసు గన్నులఁ గుంతలంబులున్. 3097

చ. ఘనతరమధ్యభారమునఁ ♦ గంపము నొంచెదు నూచకాళ్ళ పెం
పొనరఁ బిఱుందులుం ఘనత ♦ నొందినఁ దాళఁగలేపటంచుఁదా
వనరుహగర్భుఁ డెంతయును ♦ వంత మదిం దలపోసి నూత్న్యలో
పనకుఁ బిఱుందులు న్నిగుల ♦ సైకముగా నొసరించె నేర్పునన్. 3098

గీ. కొమ్మగాదది మేటిపెద్దమ్మగాని, నారిగాదది జనులకు ♦ మారిగాని
అట్టికన్నియయును నీవు ♦ ననఁగి పెనఁగి, కనరులేనట్టి మమతలఁ ♦ గలసిరేని.
అభాగ్యోపాఖ్యానము, పద్య 50—54.

## —♦ ఉద్దారుఁడు. ♦—

( రాజభటుఁడు. )

సీ. మెలిపెట్టిచుట్టిన ♦ తెలిపరంగిముడాను, పైలపేటాడబ్బా ♦ పసులఁజెలఁగు
బంగరుబ్రాతల ♦ పట్టుహిజారు కం, బరు చీనినిమతాని ♦ పాదునొసలు
తనుకాంతిఁగనుపింపఁ ♦ దనరునంగీజోడు, వలిపెంపుశాలువ ♦ వల్లెవాటు
పదుదలలోనడా ♦ బాకత్తి వదలుపా, పోసులు గోరంటఁ ♦ బొలుచుగోళ్ళు

గీ. నడుమ సీలున్న కోలు డా♦ల్చెదఁగు నూవ, నభయముగ వెంటనరుదెంచు♦నభరువాఁడు
సమరము స్త్రైదు తేజితో ♦ నరుగుదెంచె, దారుణాకారుఁ డైనయు♦గ్రాతుఁ డొకఁడు.
శుకసప్తతి, ఆ 2.

—♦ చెలికత్తె. ♦—

చ. అరయఁగఁ దల్లి కక్క చెలి♦యందుఁ బ్రియుఁ దక్కునుగల్గినట్టి చు
ట్టఱికము వారికి న్నెరయ ♦ డాఁచు రహస్యము లీ నిజాంతర
స్మరకృతిపరివర్తనల ♦ మాటలు వీని వినంగ నాప్తలై
పరఁగెడు నెచ్చెలుల్ చెలికిఁ ♦ బ్రాణము లిచ్చిన నప్పు దీఱునే. 3101
ప్రభావతీప్రద్యుమ్నము, ఆ 3 పద్య 88.

—♦ చెలికాఁడు. ♦—

ఉ. భీకరశాత్రవస్ఫురద ♦ భేద్యభయంబును దీవ్రదుఃఖమున్
వే కడతేర్పఁ జాలుటకు ♦ నేర్చి ముదంబున కాలవాలమై
చేకొని గాచు నాత్మసఖు ♦ సిద్ధము మిత్రసమాఖ్యరత్నమున్
శ్రీకరవర్ణయుగ్మము సృ♦జించిన యున్నతపుణ్యుఁ డెవ్వఁడో. 3102
పంచతంత్రము.

గీ. అఘమువలననుమల్పుఁబ్రహి♦తార్థకలితుఁ, జేయుగోప్యంబుదాఁచుఁబో♦షించుగుణము
విడువఁ డాపన్ను లేవడి♦వేళ నిచ్చు, మిత్రుఁ డీలక్షణంబుల♦మెలఁగుచుండ.
భర్తృహరిసుభాషితము, ఏ. ల. పరో. పద్య 66.

—♦ చెలిమి. ♦—

క. తలలోపలనాలుక పూ, సలలో దారంబు పాలఁ♦జల్లిననీరం
బలె నెలి యెఱుఁగక మనములు, గలసి యభేదమునఁ గాఁపు♦కడనతఁడుండెన్.
సీ. కలలోన నేనియుఁ ♦ గపటకృత్యము లేక, కడసాగుగుణముల ♦ కలిమి చెలిమి
ధనమనోవంచక♦త్వము లేశమును లేక, యేపు దీపించిన ♦ యొలమి చెలిమి
యొండొరుమదులలో♦నోరపారలు లేక, ప్రాపుదాఁపునసైన ♦ బలిమి చెలిమి
ప్రాణంబుప్రాణంబు♦లైవింత లెదలేక, హత్తినఁదగుజయం ♦ బలిమి చెలిమి
గీ. కెలనికెడమీకతగువగల్ ♦ గలిమిచెలిమి, చూచివారించుఁబెఱవారిఁ♦జులిమి చెలిమి
నూళ్ళసంగనిరిపులచే ♦ నులిమి చెలిమి, చెప్ప నిఁక నేల వారల♦చెలిమి భళిమి
సుదక్షిణాపరిణయము, ఆ 4 పద్య 67.

## మోహలేఖ.

గీ. అనుచుఁ దనచేతివ్రాలఁ బద్యములు రెండు, నడిగ లిఖియించి ఱెక్కల నడుమ నునిచి
చిల్క నే నేమి దెల్ప నీచిత్త మిఁకను, తనదు భాగ్యము పోయిర మ్మనుచు ననుప.

చ. ఘనకుచపాళిపాణినిదు గస్తురి చేకొని గోర వ్రాసి య
య్యానువున నెన్న డుంచు నకటా యనుచుం దలపోసి పోసి వె
చ్చని కనునీరు పైపయిని జాఱఁ గరంబుల వానిచేఁ జాఱు
క్కున విదళించి యంత ఘనమా యను జీవ మటంచుఁ జింతిలున్. 3107

క. ఇక్క మ్మలోన నేమో, గ్రక్కునఁ దా వ్రాసి యొసఁగెఁ గైకొనుఁ డనుచున్
ఱెక్కల నిమిడిన పత్త్రిక, ముక్కున నెడలించి శౌరి ముంగల నిడియెన్.

క. పురుషోత్తముఁ డాపత్త్రిక, నిరుగేలన హించి మొదల నియ్యవటంచున్
మఱియుంచుఁ గన్నుల నొత్తుక, తఱుచుగఁ దల యూఁచి చదివెఁ దానిట్లనుచున్.

చ. సకలగుణాభిరాముఁ డగు శౌరికి రాధ నమస్కరించి వి
న్నక నొక విన్నపంబు నిను నమ్మిన వన్నియమునున్ ఫలించె య
త్తకు మగఁ డల్లుడంచును వితాపితతేరకు తేరవట్టి యా
డికలివి రోలు నావ నెగడెన్ పడి మాన్పుము మేలు నీ కగున్. 110

రాధామాధవసంవాదము, ఆ 2.

ఆ. అనుచుఁ దా లిఖించి యాపత్త్రికకు చుట్టు, పరిమళంబు గల్గు విరులుకొన్ని
చెలువు మీఱఁ గూర్చి చిత్రితరంబుగా, బంతి గట్టె నపుడు పత్త్రిక మెఱయ.

కుబ్జాకృష్ణవిలాసము, ఆ 3.

## శుభలేఖ.

సీ. శ్రీమత్సదాశివ శ్రీపాదరాజీవ, మధుపాయమాన సన్మానసుండు
తతుకనాగేంద్ర దత్తఖడ్గతురంగ, భూషణాంబరజాత తోషణుండు
చంద్రాంగదుండు రాజన్యచూడామణి, శ్రీయుతుం డైనభద్రాయువునకు
నాశీర్వదించి వృత్తాంతంబు వ్రాయించి, పంపిన లిఖిత మేర్పడఁగ వినుము

ఆ. నీకు గూర్మి వెలయ నాపేర్మిసుత నిత్తు, వైభవమున నీవు వైశ్యపతియు
బ్రాహ్మణోత్తములును భవదీయజననియు, నరుగుదెంచి పెండ్లి యాడవలయు.

బ్రహ్మోత్తరఖండము, ఆ 4.

## —♦ అనపత్యత. ♦—

సీ. తడి యొత్తు చీరతో ♦ దాదికౌఁగిటఁ జేర్చి, చూపంగఁ గన్నారఁ ♦ జూడ నైతిఁ
దడఁబడి యాడక మున్న ♦ తట్టాడుమని పట్టి, పడఁకంగ సెజ్జపై ♦ వ్రాల నైతి
వ[illegible] పల్కుల ♦ నప్ప లప్ప లనంగ, నెదురుగాఁ బరతేర ♦ నెత్త నైతి
[illegible] నిచ్చి ♦ వేడుక నను వారు, తిట్టింప విని దప్పి ♦ దేర నైతి
[illegible] మనోరథం ♦ బైతిఁ గాని, కొడుకులంగని పమువారు ♦ గొండ సేయ
నుండ లేదయ్యె సంపద ♦ లుబ్బ నేని, లేబరమ కాకె బిడ్డలు ♦ లేని బ్రదుకు. 3113

ఉత్తరహరివంశము, ఆ 2 పద్య 16.

ద్విపద. పుత్త్రులు లేనట్టి ♦ పురుషభాగ్యంబు, విపినంబులోఁ గాయు ♦ వెన్నెలరీతి
కొడుకులు లేనట్టి ♦ కోమలి బ్రదుకు, పూచికాయని యట్టి ♦ భూజంబు విధము
పున్నామనరకంబుఁ ♦ బొందకుండంగఁ, దల్లిదండ్రులఁ గావఁ ♦ దనయుఁడే కర్త.

పలునాటివీరచరిత్రము, పుట 52.

సీ. ముద్దు లేపాపని ♦ మూర్ధ మాఘ్రాణంబు, జేసి చొక్కనిముక్కు ♦ చిలుకముక్కు
తను వెల్లఁ జల్లగాఁ ♦ దనయుని నక్కునఁ బొదు, వని చేతులు ♦ మదన చేతు
లనయంబుఁ బుత్త్రితి ♦ న్నని తొక్కుపల్కులా, లింపని చెవులు రా ♦ ట్నంపుఁ జెవులు
మొనగాళ్ళ నెక్కించు ♦ కొని తనూసంభవుఁ, బ్రేమ నూపని కాళ్లు ♦ పిట్టకాళ్ళు
గీ. కొమరుఁ బిల్వని యాలపల్కు ♦ కొండపల్కు, పట్టిఁ జూడని మిడిగ్రుడ్లు ♦ పెట్టుగ్రుడ్లు
గాన నిక్కము సంతాన ♦ హీనుఁడైన, వాని బ్రదుకు ప్రయోజన ♦ మో నుతాంగి.

చంద్రాంగదచరిత్రము, ఆ 1.

క. చెలఁగ నమరు ధర్మమునఁ బుత్త్ర లలామముఁ బడయ లేమిఁ ♦ దాపసనాథా
కులహృద్వర్తన మను నా, కలుషపు జీవనముకంటెఁ ♦ గష్టము గలదే. 3116

సీ. కుల వర్ధనుండగు ♦ కొడుకుఁ గాననియట్టి, లాఘవాస్పదుని యా ♦ లయము లయము
సిరులకుఁ దొడవైన ♦ వరసుతుఁ బడయని, ఘనకలుషాత్ము జీ ♦ వనము వనము
పితరుల ఋణముఁ దీ ♦ ర్చెడు సూనుఁ జెందని, దౌర్భాగ్యశీల గో ♦ త్రమ్ము త్రమ్ము
రహిఁ బిహపరసుఖ ♦ ప్రదుఁ బుత్త్రు నెత్తని, వర పుణ్య హీను భ ♦ వమ్ము వమ్ము
గీ. పలు పలుకు లేల నిఖిలము ♦ ఖిలము సూవె, యాత్మజులు లేని వారికో ♦ యతివర మణి
తరమె యనపత్యవైవర్ణ్య ♦ మరయ నతని, యఖిలమును నిట్లు ముఖవర్ణ ♦ హానిఁ జెంద.

రాఘవపాండవీయము, ఆ 1 పద్య 41, 46.

క. వారణవాజివధూవసు, వారాత్మకమైన రాజ్య♦వైభవ మిది దా
నారసుఁడు లేని కతమునఁ, జారుముఖీ యెన్నలేని ♦ సస్యము కాదే. 3117

ఉద్భటారాధ్యచరిత్రము, ఆ 2 పద్య 21.

సీ. సుతులఁ గాంచక యున్న ♦ సుతులఁ గాంచఁగ లేరు, దగ పితౄణముఁ దీర్చ♦ సుగుణులందుఁ
గొమరులఁ జెందక ♦ కొమరులఁ జెందరు, వన్నె కెక్కిన భాగ్య ♦ వంతులందుఁ
దనయోన్నతిఁ గనక ♦ తనయోన్నతిఁ గనరు, పుత్త్రులఁ గనినట్టి♦పుణ్యులందుఁ
బృథుకులం బొనరక ♦ పృథుకులం బొనర దా,చంద్రతారకముగా♦జగతియందు
గీ. నకట కట పుత్త్రహీనుల ♦ కవనియేల, భూష లేల, సంపద లేల♦యోష లేలఁ
జక్కఁదన మేల చదు వేల♦సదన మేల, సకలసౌభాగ్య మేలఁబు♦ష్కరదళాక్ష.

ఉ. తనయుమొగంబుపై మొగము♦దార్చి తళత్తళ లీను చెక్కు మూ
ర్కొని సక లాంగముల్ వడిగ♦గుర్కొడువ న్ననుఁ గన్న యన్న ర
మ్మని పలుమాఱుఁ బిల్చుచును ♦ హర్షపయోనిధి నోల లాడఁ జా
లని యతి మందభాగ్యుల కి♦లాస్థలియందున జన్మమేటికిన్. 3119

క. తనయులఁ గుణవంతులఁ గాం,చని మానవపతుల సకల ♦ సంపద లెన్నన్
వనమునఁ గాచిన వెన్నెల, కెనగా వృథ యగును సుమ్మి ♦ యిందునిభాస్యా.

రాఘవపాండవయాదవీయము, ఆ 1.

క. ధాత్రిం బున్నామనరక, త్రాతయత యనవె శ్రుతులు ♦ గణ్యచరిత్రుం
బుత్త్రుం గనక నరుండు జ,గత్త్రితయము నేలె నేని ♦ గతి గనఁ గలఁడే. 3121

సుదక్షిణాపరిణయము, ఆ 2 పద్య 40.

చ. తడబడ తొక్కుఁ బల్కు లమృ♦తంబులు చిందఁగ దప్పుతప్పు చి
ట్టడుగులు సందియ ల్మొరయ ♦ నాదల నిద్దపురావిరేక ము
ట్టిడుకొన నాడు బాలకుల ♦ నెత్తు కృతార్థుల పుణ్య మెట్టిదో
కొడుకులు లేని వానిబ్రదు♦కున్ బ్రదుకే పరికించి చూచినన్. 3122

చ. జననిమృదూరుపీఠి దిగ♦జాఱి తనుంగని బారచాపుచున్
దనయుఁడు రాఁగ గ్రక్కున ని♦ధానము వచ్చెను దండ్రివచ్చె జ
క్కని యపరంజి వచ్చె నను♦గాచినయయ్యలు వచ్చినాఁడు మో
హనపుమురారి వచ్చెనని ♦ యక్కునఁ జేర్పని జన్మ మేటికిన్. 3123

సీ. తరియింప నేర్చునే ♦ నిరయకోపానలా,వరణ వృథా తాప♦భర పయోధి
కడతేర నేర్చునే ♦ నడలిపోని పితౄణ, గాఢాయసోమశృం♦ఖలచయంబు

శ్రేయఃజాలునె నిర♦పాయ జన్మావధి, క్రమసమార్జిత ఘోర♦కలుషరాశి
యనుభవించునె విలో♦కన తపఃఫల, మానంద సౌఖ్యర♦సానుభవము(?)
గీ. కటకటా పుత్త్రహీనుఁ జే♦కరణిఁ గాంచు,నుభయలోకసుఖంబులెం♦దున్న నేమి
వ్యర్థజీవనుఁ జేలెక్క♦వాఁడుఁ గాఁడు, తగునె యనపత్యవదన సం♦దర్శనంబు.
శా. కేలం దమ్ములు జాలువాసరిపిణుల్ ♦ గీలించి బాలామణుల్
డోలాశయ్యఁ గుమారకున్నిలిపి లా♦లో లాలి లాలమ్మ లా
లీ లాలీ యని జోలబాడఁ జెవు లా♦లింపంగ నే పుణ్యముల్
చాలా చేసిరొకో నృపాలకులు స♦త్సంతాన లాభార్థులై. 3125
సీ. ముద్దులతనయుండు ♦ ముందట నాడంగ, వలువదే గృహములు♦గల ఫలంబుఁ
జెవులలో జోలలు ♦ జిలుకుకుమారుని, గనుటగా కన్నులు♦గల ఫలంబు
పట్టి నాగారాపు♦పట్టీ యనుచునెత్తఁ, గాంచునె నెమ్మను♦గల ఫలంబు
మాటికి నవ్యక్త♦మధురోక్తముల నుతుల్, పలఁకుట వీనులు♦గల ఫలంబు
గీ. సుతవిహీనుని సామ్రాజ్య♦సుఖము లేల. కామినీమణు లేల భో♦గంబు లేల
చింతసేయుట గతజల♦సేతుబంధ,నంబు చందంబు చరమకా♦లంబు నందు. 3126
శ్రీరంగమాహాత్మ్యము, క. వ. ఆ 7.
క. తనయవిహీనుఁడు పుణ్యం,బున నధికుండైన లోక ♦ పూజితుఁ డైనన్
జను నంతకుని పురంబున,కును బంధుసమేతుఁ డగుచుఁ ♦ గోరిక లెడలన్. 3127
మత్స్యపురాణము, ఆ 5 పద్య 125.
సీ. జ్ఞానోదయంబుఁ గాం♦చనిసదాచారంబు, వైరాగ్యమొదవని ♦ భక్తిరసము
సుకవిత్వమబ్బని ♦ సకలకలాప్రౌఢి, రక్తి మఁగనని తో ♦ రంపుఁబాట
పరమార్థమెఱుఁగని ♦ పాండితీకలనంబు, భోగమూననిమహో♦ద్యోగలీల
పాఁడిపోఁడిమి లేని ♦ వ్యవసాయగరిమంబు, రంజనం బలరని ♦ రాజనీతి
గీ. వినయమొనరనిసద్గుణ ♦ విలసనంబు, విద్యనేరని భారుణి ♦ విభుని పెంపు
జగతిసంతతిలేనట్టి ♦ జనులకలిమి, యెలమి వెలయింపఁ జాలునే ♦ నృపవరేణ్య.
నయనోల్లాసము, ఆ 1 పద్య 60.

## —♦ పుత్త్రసంతానము. ♦—

క. అనుదినసంతోషణములు, జనితశ్రమతాపదుఃఖ ♦ సంశోషణముల్
తనయులసంభాషణములు, జనకులకుం గర్ణయుగళ ♦ సద్భూషణముల్. 3129
భాగవతము, స్కం. 7 పద్య 140.

సీ. కాంతా కుచద్వయీ ♦ కాఠిన్య సంపద, వెలితి యయ్యెను వేడ్క ♦ విస్తరిల్లు
వినుతాంగి యవలగ్న ♦ తనుతా విలాసంబు, కొదవయయ్యె మదంబు ♦ కొనలుసాగఁ
గలకంఠకంఠి చెక్కుల నిండు తేటలు, పలుచ నయ్యెను గుతూ ♦ హల మెసంగు
మృగనేత్రి తనులత ♦ జిగిబిగి సొగసు త,క్కువయయ్యెఁ బ్రబదమంబు ♦ కొమరుమిగులు
గీ. యౌవనోన్మాద జనిత చే♦ష్టా వికార, కలిత లలితవతీరతి ♦ కౌశలంబు (తము.
మెంపుడటేఁగి యఘటియించు♦నింపుమిగులఁ, బురుషునకుఁ బుత్త్రిలాభంబె ♦ వరమహి
కవిరాజమనోరంజనము, ఆ 2.

సీ. సిద్ధాంజనము వేఱె ♦ సిద్ధింప వలయునే, పుత్త్రిందు గల్గిన ♦ భూవరేణ్య
సుర మహీజము వేఱె ♦ దొరకంగ వలయునే, తనయుండు గల్గిన ♦ మనుజనాథ
యమర రత్నము వేఱె ♦ సమకూఱ వలయునే, తనయుండు గల్గిన ♦ ధారుణీశ
దైవ ధేనువు వేఱె ♦ దక్కంగ వలయునే, సూనుండు గల్గిన ♦ మానవేంద్ర
గీ. సుతుఁడు గల్గినఁ బరలోక♦సుఖముఁ గాంచు, నాత్మజుఁడు గల్గ గుల మెల్ల♦ నతిశయిల్లుఁ
గొడుకు గల్గిన బుణశుద్ధిఁ♦బడయవచ్చుఁ, బరమసుఖకారణము తనూ♦భవుఁడు నువ్వె.
నిరంకుశోపాఖ్యానము, ఆ 1 పద్య 70.

గీ. మతులు పటు రాచకార్యసం♦గతులు భోగ, తతులు జేకొన్న సతులు వి♦ద్యాప్రసంగ
యుతులు దినదిన రంజితో♦న్నతు లలర్చు, సుతులు లేనట్టివారికి♦ గతులు గలవె.
సత్యభామాపరిణయము, అ 2.

గీ. పుడమి సంసారభూరుహం♦బునకుఁ బండుఁ, బ్రకటగార్హస్థ్యధర్మము♦నకు ఫలంబుఁ
గులకలశతోయరాశికిఁ♦గుముదబాంధ, వోదయంబు గదా యప♦త్యోదయంబు.
నయనోల్లాసము, ఆ 1 పద్య 62.

—♦ పతివ్రత. ♦—

క. ఒక్కటి గల దైన మనో, వాక్కాయములందు చేష్ట♦వాదల త్రోవల్
ద్రొక్కక తక్కక నొక్కఁడె, దిక్కని దక్కిన నడే ప♦తివ్రత తలఁపన్. 3134
రాధామాధవసంవాదము, ఆ 1.

చ. పురుషున కన్న మున్నె మృతిఁ♦బొంది ప్రియాగమనంబె కోరుచుం
బరువడిఁ జూచుచుండు మును♦భర్తయె పోయిన వెంట నేఁగి తాఁ
జిరముగ నాథుఁ జెందును ప♦తివ్రత యట్టి వధూశిరోమణిం
గర! మపమాన రీతిఁ గనఁ♦గాఁ జను చే దురితంబు భూవరా. 3135
శకుంతలాపరిణయము, ఫ. వేం. ఆ 3.

# భార్య.

ద్విపద. సతి లేని గృహ మేల ♦ సౌఖ్యంబు లేల, సతి లేని సుతు లేల ♦ సంపద లేల
సతియుఁ గల్గినఁ గల్గు ♦ సకలధర్మములు, సతియుఁ గల్గిన గల్గు ♦ సకలపుణ్యములు
సతి గల్గినను గల్గు ♦ సత్పుత్త్రచయము, సతి గల్గినను గల్గు ♦ సద్గతి త్రోవ.

హరిశ్చంద్రోపాఖ్యానము, గౌర. భాగ. 2.

గీ. భార్య యుండిన వనమైనఁ ♦ బట్టణంబు, పత్ని లేకున్న గృహమైన ♦ బహుళగహన
మగుచుఁ గాన్పించు నరులకు ♦ నంతె యేల, నాలు లేకున్న విధుఁడైన ♦ నధముఁ డండ్రు.

క. యాగముల నయోగ్యుండగు, భోగములకు బాహ్యుఁడౌ సు♦పుత్త్రోదయలీ
లాగణ్యయైన భార్యా, యోగము లేకుండ నరుల ♦ కుచితమె చెప్పఁగా.

ఆ. ఎంత దుఃఖమైన ♦ నింటికి వచ్చి యి, ల్లాలి మొగముఁ జూచినప్పుడే తలఁగు
నిది యెఱింగి కాదె ♦ ఋషులు వసిష్ఠాదు,లును సభార్యు లగుచు ♦ ఘనతఁ గనిరి.

క. ఒకలంటఁ గాళ్లు పిసుకం, గడనేఁడు వేన్నీళ్ల నీయఁ ♦ గంచము వెట్టన్
బడక యమర్పఁగఁ జేతికి, విడె మీయఁగ భార్య కాక ♦ వేఱొక తగునే.

గీ. తిథుల యందైన[illegible]యప♦త్నీకుఁడనుచు, బ్రాహ్మణార్థంబుఁ జెప్పరే ♦ పాటివారు
నొకతె రూపసి గాకున్న ♦ నోసియున్న, నోటు నెడుమాత్రమునకైన ♦ నుండవలయు.

శుకసప్తతి, ఆ 2.

సీ. భుజియించు వేళ నో♦ప్పుగఁ దల్లి పోలిక, శయనించు వేళ రం♦భా విధంబు
నాలోచనము సేయు♦వేళ మంత్రి విధంబు, పని చేయుచో దాసి♦పగిది శాంత
గుణమున నెన్నంగఁ ♦ గుంభిని పోలిక, ధర్మ మెంచుట నరుం♦ధతి విధంబు
గలకొమ్మ భార్యగా ♦ గలుగుట ముక్తికి, మార్గంబు పదికి స♦మ్మతము వంశ
గీ. వృద్ధి కాధార భూతంబు ♦ వృజిన విపిన, మునకు దావాగ్నివైభవం♦బునకుఁ దావు
కోరికలపంట యాపద♦ల్గొట్టు జెట్టి, శోభనములసమూలంబు ♦ నుర్వీనాథ.

శకుంతలాపరిణయము, ఫ. వేం. ఆ 3.

గీ. ఎన్ని కడగండ్లు తోడరియు ♦ నెల్లరకును, నన్నిటిని దోలి కాచెడి♦దాలు గాదె
యాలుతోఁ గూడియుండెడు ♦ నాతఁ డెన్ని, యిక్కటులఁ గుడిచియును బా♦నె

ఉఁగమండు.

క. అలయు నెడల దగయు శనాఁ, కలియును నగు తటిని నాలు♦ గాదే నేగుల్
తొలఁచును దన నెయ్యానికిం, గలఁగుచు నక్కూరణి జాలిఁ♦ గైకొన నేలా.

శుద్ధాంధ్రనిర్వచననైషధము, ఆ 2 ప. 12, 13.

## భర్త.

ద్విపద. మొదమునఁ గులశీల♦ములు వాడిఁ గోరి, బదులుపతివ్రతా♦రత్నంబులకును
బతి లేని రాజ్యసం♦పద లవియేల, పతిలేని సుతులేల ♦ బంధువు లేల
పతిలేని హితులేలఁ ♦ బ్రాణంబు లేల, మతిఁ దలపోయ నీ♦మానవేశ్వరుఁడు
నా కూర్మినిలుకడ ♦ నాతోడునీడ, నాకన్న పెన్నిధి ♦ నా నోము ఫలము
నా మేలిచెలికాఁడు ♦ నా పట్టుఁగొమ్మఁ, నా మెచ్చువలరాజు ♦ నన్నేలు రాజు.

హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన. ఆ 1.

శా. హాళింగంటికి నింటియాతఁడు మనో♦వాంఛాప్రదానక్రియా
శీలాలోలుఁడు నీలవేణికిఁ బ్రియుం♦డేపార్ద్దు నొప్పారుర
త్నాలంకారము కాంతకున్ మగఁడు ని♦త్యానందసంపాది యిం
కేలా వేయును జెప్ప సేవకుఁ బ్రా♦ణేశుండ తన్వంగికిన్.

హరిశ్చంద్రోపాఖ్యానము, శంక. ఆ 3 పద్య 164.

సీ. వనితకు నిష్టదై♦వము జీవితేశుండు, భామకు ముంగొంగు ♦ పసిఁడి భర్త
సుదతికి నల్లేని ♦ చుట్టంబు పెనిమిటి, తరుణికిఁ బ్రాణమి♦త్రంబు ధవుఁడు
వనజలోచనకుఁ బె♦ట్టనికోట దయితుండు. నాతికి సకలార్థ♦దాత ప్రియుఁడు
కాంతకు మానర♦క్షకుఁ డింటియాతండు, సతికి నాతఁడె లేని ♦ హితుఁడు మగఁడు
గీ. కంబుకంఠికి నిత్యైశ్వ♦ర్యంబు విభుఁడు, వల్లికకు నాలవాలంబు ♦ వల్లభుండు
పల్లవోష్ఠికి సౌభాగ్య♦భాగ్యలక్ష్మి, గణన మొనరింప వేల యే♦మ్మడయ మగఁడు.

శకుంతలాపరిణయము, పి. వీ. ఆ 4.

సీ. కులహీనుఁడైన స♦త్కులసంభవుండైనఁ, బతి యిష్టదైవంబు ♦ భామినులకు
జడుఁడైన సకలశా♦స్త్రజ్ఞాననిధియైన, నాత్మనాథుఁడు సేవ్యుఁ♦ డంగనలకు
సమరభీరుండైన ♦ సాహసాధికుఁడైన, ధవుఁడు పూజ్యుఁడు ప్రమ♦దామణులకు
నత్యకిరిచనుఁడైన ♦ నమితకాంచనుఁడైనఁ, గాంతుఁడీశ్వరుఁడు సీ♦మంతినులకుఁ
గీ. గామినీనింద్యవృత్తి నా♦కారుఁడైనఁ, గీర్తనీయమనోజాత♦మూర్తి యైన
ననలసాక్షిగఁ దనహస్త♦మందినట్టి, యతఁడె రెండవ శివుఁడు బిం♦బాధరలకు.

సీమంతినీకళ్యాణము, ఆ 2.

మ. అతిమూర్ఖుం డతిమత్తచిత్తుఁ డతిదు♦ర్వ్యాపారపారంగతుం
డతినిష్ఠుం డతిలోభశీలుఁ డతిరో♦గావేశసంపీడితుం

పతివృద్ధుం బతికోపశాలి నతిహీ◆నాకారుఁ డైనన్ భువిన్
బతిఁ గంటెన్ మఱి యొండు వేల్పు గలఁడే◆ పంకేజపత్త్రాక్షికిన్.

నయనోల్లాసము, ఆ 3 పద్య 48.

## దంపతులు.

క. మెలఁతకు బతిపై నైనను, మెలఁతుకపైఁ బతికినైన◆ మేలగు పొందుం
గలయది మెలఁతకుఁ బతికిన్, వలపు సమం బగుట జన్మ◆వాసన చెలియా.

మనుచరిత్రము, ఆ 6 పద్య 36.

గీ. తలఁపు లొక్కటి గాఁగ న◆న్గలపు వలపు, చెలిమి కలిమిని దొలఁకక◆కలసి మెలసి
భువిని శ్రీకోడక న్యాయ◆మునను వెలయు దంపతులు చేసినట్టిదే◆తపము తపము.

తారాశశాంకవిజయము, ఆ 2 పద్య 135.

## అనురూపదాంపత్యము.

సీ. సగరుఁ గేశినివోలె ◆ సౌదాసు మదయంతి, గతి వసిష్ఠుని నరుం◆ధతినభాతి
నిను సువర్చలభంగి ◆ నింద్రుని శచి మాడ్కి◆, జంద్రు రోహిణియోజ◆ సత్యవంతు
సావిత్రి విధమునఁ ◆ జ్యవను సుకన్యక, యట్టులు నలుఁ దమ◆యంతి పోల్కి
గువలు శ్రీమతి లీలఁ◆గుంభసంభవుని లో, పాముద్రి కైవడి ◆ భక్తి తోడ
గీ. రఘుకులాబ్ధిరాకాచంద్రు◆ రామచంద్రుఁ, గొలిచియేను సన్మతి నుండి◆ వెలయుదాన
నా నిజేశుఁడు రాజ్యవి◆హీనుఁ డైన, నెట్టివాఁ డైనఁ గాని నా◆కెట్టు తెన్ను.

భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 223.

## పతిభక్తి.

గీ. కనకశైలంబు తలయంపి ◆ గాలయించి, చిదిపి రా లేదఁ బోయిన◆ చెలువు గాదె
యిహపరము లిచ్చు పతిభక్తి◆ సడలియాతిన, యొండు విధమున మోక్షంబు నొందజనుట.

రుక్మాంగదచరిత్రము, ఆ 4 పద్య 83.

ద్విపద. పతిభక్తి సతులకుఁ ◆ బరమశీలంబు, పతిభక్తి సతులకు◆ భాగ్యమూలంబు
పతిభక్తి సతులకుఁ ◆ బరమభూషణము, పతిభక్తి సతులకు ◆ భాగ్యపోషణము

పతిభక్తి సతులకు భయనివారణము, పతిభక్తి నిఖిలశో♦భనకారణంబు
పతిభక్తి నాతికిఁ ♦ బడయంగరాని, యతులితపుణ్యంబు♦లరయొందుఁ గలవు.
హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన. భాగ 1.

క. పతిభక్తిగలుగునతికిన్, వ్రతములతో గొడవ యేల ♦ పతులు సుకృతముల్
పతిభక్తిలేనిచెనఁటికి, వ్రతములు చను వేయి యొక్క ♦ వ్యభిచారమునన్.
శుకసప్తతి, ఆ 1.

## భర్తృసేవ.

సీ. ఆభోగభోగపు♦ష్పారామమధుమాస, మాధికవ్యథాసార♦రోగవహ్ని
హృదయానురాగబ♦క్షీణఘనసాధునలక్ష్మి, దారిద్ర్యవిటపికు♦ఠారధార
సకలసంపల్లతా ♦ నికరాలవాలంబు, శంకాకళంకభు♦జంగనకులి
బహుశుభచరితకార్య♦పద్మవనీహేలి, సంతాపకరటికే♦సరికిశోర
గీ. మభిమతార్థాంకురసుధార♦సాభిషేచ,నము విపద్భారతిమిరసం♦తానభాను
మండలము భర్తృసంసేవ ♦ మానవతికి, మదినయాదియ కోరఁదగునమ్మ♦యుదితభక్తి.

క. లలితగుణవృత్తిసిర్మల, తలరంజితలితరుణీమాత్ర♦ధవపదసేవా
కలనఁ దొలంగక యొన్నిక, దలకొనఁ దగు హారలతిక ♦ తరళమునఁ బోలెన్.

ఉ. తేటినబుద్ధికిమ్మి సుమవ♦తీమణి భర్తృహితంబు గాఁ దగన్
వేళ్లోక కార్యచింత మదిఁ♦బెట్టక బంధుసహృజ్జనావళి
న్మ్రొక్కిన పేరిమిఁ బోంచుచు సం♦నిందితసద్గుణరత్నరాశియై
చూలఁలు పట్టు నాకపురి♦ముస్థిరభోగము లుత్సుకంబునన్. 3159

గీ. చాన యౌవాల్యసౌశీల్య♦శమదమాది, సుగుణలతల కుపఘ్నమై ♦ జగము వొగడ
భర్తఁ బాయక తద్భక్తిఁ ♦ బరగెనేని, సాధ్వియని యింద్రుఁ డానిస♦జ్జనులు మిగుల.
శకుంతలాపరిణయ, పి. వీ. ఆ 3 పద్య 135–138.

సీ. కుసుమకోమలులకు ♦ గుజ్జుమామిడిపండు, ప్రాణనాయకుపాద♦పద్మసేవ
శాతోదరుల కల♦చేతిమాణిక్యంబు, ప్రాణనాయకుపాద♦పద్మసేవ
కీరవాణులకు ముం♦గిటి పెన్నిధానంబు, ప్రాణనాయకుపాద♦పద్మసేవ
కుటిలకుంతలులకుఁ ♦ గొంగుబంగారంబు, ప్రాణనాయకుపాద♦పద్మసేవ
గీ. దలప దేనోములును నోమ♦వనరుహాక్షు,లకు మనోరథఫలకమ♦లంబు లెపుడు
మూఢమతితోడ భజించిన ♦ నదియె చాలుఁ, దలఁచి చూచిన నభిమతా♦ర్థంబులొసఁగు
హరిశ్చంద్రోపాఖ్యానము, శంక. ఆ 4 పద్య 174.

# భర్తృవియోగిని.

ద్విపద. బలవంతమగు విధి ♦ ప్రాణేశుఁ బాప, వలవంతఁ జెందిన ♦ వరవధూమణికి
భారంబు హారంబు ♦ భాసురగంధ, సారం బసారంబు ♦ సారకాసార
తీరంబు దూరంబు ♦ తీవ్రసల్లాప, కీరంబు క్రూరంబు ♦ కిన్నరమంజు,
నాదంబు ఖేదంబు ♦ నవచంద్రికాంత, వేదులు సూదులు ♦ విరచితోద్యాన
చూతంబు భూతంబు ♦ సురభికస్తూరి, పూఁతలు రోఁతలు ♦ పూర్ణచంద్రికల
మెఱపులు వెఱపులు ♦ మెత్తనిదూది, పఱుపులు మఱుపులు ♦ పరభృతసమితి
కూఁతలు ఘాతలు ♦ గొదమతుమ్మెదల, మ్రోఁతలు వ్రేఁతలు ♦ ముద్దురాయంచ
మురువులు పరువులు ♦ మోహంపుఁ జెలుల, సరసముల్ విరసముల్ ♦ చందనానిలపు
మెలఁకువ యలఁకువ ♦ మేల్మిచెంగావి, జిలుగులు సిలుగులు ♦ చిప్పరుఁ జప్పరపు
బొంతలు వింతలు ♦ పూఁబొదరిండ్లు, క్రొంతలు వంతలు ♦ కమనీయసరసి
బిసములు నుసములు ♦ పృథుమకరంద, రసములు విసములు ♦ రమ్యహిమాంబు
పూరంబు గాదు క♦ర్పూరంబు సేదు, వీరుండు మారుఁడీ♦విధము నుగాక. 3162

హరిశ్చంద్రోపాఖ్యానము, గౌరన. భా :

క. సతి కిహపరసౌఖ్యములకుఁ, బతియే నిదానంబు చూవె ♦ పరికింపంగా
బతి నెడఁ బాసి చరించెడు, సతికిన్ వృథగావె సకల♦సౌభాగ్యములున్ 3163

ఉ. కోరిక లెల్లఁ జాలనొడఁ♦గూర్చు ప్రియుం జెడఁబాసినట్టిపం
కేరుహపత్రలోచనకుఁ ♦ గీరము వైరము హార మెంతయున్
భారము మంచికప్పురపుఁ ♦ బల్కులు ముల్కులు పచ్చవెచ్చశృం
గారవనాంతరాళశశి♦కాంతపువేదులు నూదు లారయన్. 3164

క. ఓ మునిరాజతనూభవ, స్వామిని నెడఁ బాసియున్నఁ ♦ జూడం దగునే
యామిని యట్ల తలంపఁగ, భామినియును బ్రాణనాథుఁ♦బాసినవేళన్. 3165

హరిశ్చంద్రోపాఖ్యానము, శంక. ఆ 3 పద్య 161, 162.

# వితంతువు.

సీ. ఓర్పుమై నుప్పిండి ♦ నుపవాస ముండనీ, మగనాలి సరిపోల్పఁ♦దగదు విధవ
సద్భక్తి దేవతా♦ర్చనము సేయంగనీ, మగనాలి సరిపోల్పఁ♦దగదు విధవ
ఆశ నానాదివ్య♦దేశముల్ ద్రొక్కనీ, మగనాలి సరిపోల్పఁ♦దగదు విధవ
తిరిగి నానాపుణ్య♦తీర్థంబు లాడనీ, మగనాలి సరిపోల్పఁ♦దగదు విధవ

గీ. నిపరి వేఁ ళ్లాడించి రేపాడి♦నియమపరత, సహిమభానుని వీక్షింప♦కటక మున్న
తగదు వీక్షింప నరుసకుఁ♦ దల్లి వదిసె, నత్తగారిని దర్పించి ♦ యన్యవిధవ. 3166

ఉ. జీవముతోడఁ బాసి యశు♦చిత్వముఁ బొందిన మేను గంధతో
యావభృథాభిషేకము స♦హస్రఘటంబుల నాచరించినన్
బావన మౌనె యట్ల పతిఁ♦బాసి వితంతువ నొందినట్టి రా
జీవదళాయతాక్షి యశు♦చిత్వము వాయదు వే లెఱుంగులన్ 3167

కాశీఖండము, ఆ 2 పద్య 83, 85.

సీ. ఉపవాసములఁ దద్ద♦యును గృశింపక మేను, దిండిచేఁ బోషించు♦చుండె నేని
మస్తకాంబరముల ♦ మాలిన్యభావంబు, నందక వస్త్రశౌ♦చ్యమ్ము నేని
దానధర్మముల న♦ర్థంబు వెచ్చింపక, కట్టిఁడిగ్గొని తూడఁ♦గట్టెనేని
తనపుట్టినింట వం♦చనతోడ నిల్వక, పొరుగిండ్ల పాలయి ♦ తిరిగె నేని
గీ. సంతతంబును శ్రీహరి♦స్మరణ లేక, కఱకుఁదనమున దుర్భాష♦లఱచె నేని
విధవ పెనిమిటితోఁగూడ♦వివిధనరక, కూపబాధలఁ బడుఁ గడు♦గుఱుతు లేక.

క. నాలుకయును దాలువులును, నీలరుచింగలిగె నేని ♦ నెఱిచరణంబుల్
నేల సరిమోపవేనియు, వాలాయము నది వహించు♦వైధవ్యంబున్. 3169

క. కంతుసుఖకేలిఁ దేలఁ వి, తంతువుతో నెవ్వఁడే న♦తఁడు దన పుణ్యం
బంతయుఁ గోల్పడి కూలు ని, రంతరమును రౌరవాదు♦లగునరకములన్. 3170

జైమినిభారతము, ఆ 3 పద్య 34-36.

సీ. అనిశంబు దివ సాంత♦మందు హవిష్యంబు, నేకవారము భుజి♦యింప వలయుఁ
దైలంబు దివ్యవ♦స్త్రంబు గంధద్రవ్య, మంజనంబును జంద♦నాదికములు
శంఖసింధూరభూ♦షణములు వర్జించి, సంతత మర్థి ని♦ష్కామ యగుచు
మలినాంబరము విచ్చి♦వలనుగా ధౌతాంబ, రముఁ దాల్చి హరిని ది♦రంబు గాఁగ
గీ. మదిఁ దలంపుచు భక్తిఁ ద♦త్పదసరోజ, పూజ సేయుచుఁ బురుషుని♦బుత్త్రిసముని
గాఁ దలంపుచు విధవాది♦కంబు విడిచి, పృథివి వర్తింపఁగాఁ దగు♦విధవకాంత.

కృష్ణజన్మఖండము, ఆ 6.

## పతివ్రతలకనర్హధర్మములు.

సీ. పరమేశ యాసురి♦ పైశాచి రాక్షసి, యనుపేళ్లు గల వధ♦ర్మాంగనలకు
వ్యభిచారతత్పర♦త్వంబు వారికి నెల్లఁ, గల దనురాంశజ♦కార్యనిరత
దనయిచ్చఁ బొలియించు♦ధనధాన్యములుచల, హృదయభోగపరాత్మ♦యార్ష్యగలదు

పైశాచి కోపిధన•భర్తృపుత్త్రిలయందు,నిస్స్నేహ గృహకార్య • నిపుణ గాదు
గీ. కలహాశీల రాక్షసి సయి•కంబు లేదు, బొంకు వల్కు చెప్పుడు నిద్ర•వోవుపీత
లజ్జ యుందదు నాథుకు•లంబువారి, దురిత మొందించి పోదురా • నరకమున నవు.
ఆ. ఎఱుక గలిగి పిదప • నేనియుఁ బతిభక్తి, గలిగి ధర్మమొప్పి • చరిత శాంతి
గలిగియున్న మున్ను•గలపాపములు వాసి,పురుషుతోడదివికిఁ • జ ందు
ఆ. అట్లుఁగాక పతుల • యంతిమసమయంబు,నందుఁ జింత దక్కి నుమరణము
నేసి లేని సుగతి•సిద్ధించుఁ బతిసమే,తంబు గాఁగ నన్ని•తంబినులకు. 3174
క. ద్విజభామినికి నధర్మము, పరిజఁ గాంచినపిదప నయ్య•పత్యము
ద్విజితయుఁ బతిభక్తియు నై,త్యజించి యనుమరణనియతి•యగుట మహేశా.
అను, ఆ 5 పద్య 299-300

## స్త్రీధర్మములు.

క. ఎట్టి సాధ్వులకును • బుట్టినయింట్లను, దీర్ఘకాల మునికి • తగ్గ దగదు
పతులకడన యునికి • సతులకు ధర్మువు, సతుల కేసుగడలయుఁ • బతుల చూడు,
క. పతిహీన లయినభామిను, లతిధనవతు లయ్యుఁ గులజ•లయ్యును నవలం
కృత లయ్యెదు మాంగల్యర,హిత లయ్యెదుఁ గృపణవృత్తి•నిదియు మొదలుగాన్.
భారతము, ఆది. ఆ 4 పద్య 65, 228.
సీ. ఇది మొదిగా సతు•లెన్నండుఁ బరపురు,షార్థినులై గాఁ జన•దన్యపురుష
సంగమంబునఁ జేసి • సకలపాతకములు, నగుఁ బరిగ్రహభూతు•లయినసతుల
కిట్టిమర్యాద • యిమ్మనుష్యుల కెల్లఁ, జేసితి లోకప్ర•సిద్ధి గాఁగ
నని ధర్మ్య మైనమ•ర్యాదమానవులకుఁ, దక్షయు హితముగా • ధర్మమూర్తి
ఆ. యజ్ఞభవసమానుఁ•డగు శ్వేతకేతుండు, సిలిపి నదియు భారు•ణీజనంబు
నందు లోకపూజ్య•మై ప్రవర్తిల్లుచు,నుండె శిష్టసంప్ర•యుక్తిఁ జేసి. 3178
క. పురుషులచే ధర్మస్థితిఁ, బరిగ్రహింపఁగఁ బడిన•భార్యలకు నిరం
తరము నిజపురుషభక్తియుఁ, బరపురుషపరిత్యాగంబుఁ • బరిచిత మయ్యెన్. 3179
గీ. భర్తచేత నియోగింపఁ•బడక సతికి, నెద్దియును జేయఁగాఁదగ • దెద్దియైన
భర్తచేత నియోగింపఁ•బడినదానిఁ, జేయ కునికి దోషంబగుని • చెప్పె మనువు.
ఆదిపర్వము, ఆ 5 పద్య 85-88.
ఆ. పురుషుకంటె మున్ను•పరలోక మేఁగిన, సతియ నోఁచినదియు • సతులలోనఁ
బురుషహీనయైనఁ • బరమపతివ్రతయయ్యు, జగముచేతఁ • బ్రయ్యఁ బడదె,

ఆ. పడినయామిషంబు ◆ పక్షు లపేక్షించు, నట్లు పురుషహీన ◆ యాయినట్టియువతిఁ
జూచి యెల్లవారుఁ ◆ జాలఁగ నపేక్షింతు, రదియుఁ బాప మనక ◆ హీనమతులు.
ఆ. సతివిముక్తుఁ డయినఁ ◆ బతికిఁ బునర్దార, సంగ్రహంబు సేఁత ◆ శాస్త్రమతము
పతివిముక్తఁ డయిన ◆ సతి కన్యపురుషసంగ్రహము సేఁత లోక ◆ గర్హితంబు 3182
ఆదిపర్వ, అ 6 పద్య 253–255.
క. పతిమానము గాఁచికొనియెడు, చతురోపాయంబు నీకుఁ ◆ జలజాక్షి సువి
శ్రుతమతిఁ జెప్పెద విను మూర్జితమును ధర్మాన్వితము సు ◆ శీలంబును గాన్. 3283
చ. పతిఁ గడవంగ దైవతము ◆ భామల కెందును లేదు ప్రీతుఁడై
పతి గరుణించెనేని కుల ◆ భామిని భాసురభూషణాంబరా
న్వితధనధాన్యగౌరవము ◆ పుత్రసుతిసంతతియున్ యశంబు స
ద్గతియును గల్గ నొందు మెయిఁ ◆ గల్గనె యిన్ని తెఱంగు లారయన్. 3184
ఆ. కరము దుఃఖపడినఁ ◆ గాని యొక్కింత సౌఖ్యంబు ధర్మగతియుఁ ◆ గలుగ దెందుఁ
జూడు మబల భర్తృ ◆ శుశ్రూషఫలము సంతతసుఖంబు నంద ◆ ధర్మ్య వోడవు.
క. కావున నిత్యము సమ్యగ్భావము ప్రేమంబు గౌరవ ◆ భక్తియుఁ బ్రియముం
గావింపుము నీప్రియుసెడ, భావము వెత్తఁగి యతఁడు దాస ◆ పైఁబడి మరఁగున్. 3186
మ. వనజాక్షుండు గడంగి నిదుగృహ ◆ ద్వారంబు సేరంగ వ
చ్చె ననంగా విని లెమ్ము సంభ్రమముతోఁ ◆ జెన్నొందు నభ్యంతరం
బునకున్ వచ్చిన నాసనాదికరణం ◆ బుల్ దీర్చఁ దక్షజ్ఞనం
బు నియోగించితి నంచు నుండక ప్రియం ◆ బుల్ సేయు మీవుం దగన్. 3187
చ. తిరిరి మురారి నాకుఁ గడుఁ ◆ దీపుగఁ జెప్పినపల్కు గల్గినం
గువలయనేత్ర నీమనను ◆ గూడినవారికి నైన నెప్డుఁ జె
ప్పవలదు దాన నొండొకనె ◆ పంబు ఘటింతు రెఱింగి రేని నీ
సవతులు కృష్ణుబుద్ధి విర ◆ సం బగు నీదెసఁ దత్ప్రియుక్తిచేన్. 3188
చ. పతికి ననుంగులైనతగు ◆ బంధుల మిత్త్రుల భోజనాదిస
త్కృతముల నాదరించుచు న ◆ కృత్రిమభక్తివిశేషసంతతో
ద్ధితమతివై చరింపుము త ◆ దీయహితేతరవృత్తులైనవా
రితివ భవత్సహ్యజ్జనము ◆ లైనను గైకొన కుండు మేర్పడన్. 318
క. విను ప్రద్యుమ్నాదిభవ, త్తనయులగెడ నైన నేక ◆ తంబున నేకా
సనమున నుండుట దూష్యం, బని యెఱుఁగుము సతులచరిత ◆ లతి దుష్కరముల్.

క. పతిహితము గొనక ధర్మము, నతివ నడపు టొప్పు దింక ♦ నైనను ౘతికిన్
హితములగువానిఁ జేసిన, నతనిఁ గలయు దనివఁ జనియె ♦ నదియునుమరలన్.

క. లలన యిలువాడి సాధుఁడు, వలచినచవివంటకములు ♦ వండి యిడి తనుం
గలయఁ దలంచిన మెయికొని. యెలమిం గయిసేసి హృదయ ♦ మీ వలయు శివా.

గీ. పనులయెడ మాఱు పలుకక ♦ యనవధానుఁ, డైనపతిఁ దలపించి ధ ♦ ర్మార్థకలిత
కృతులు నడపుచు సవతి గ ♦ ల్గినను బోరి,తంబు లే కొక్క_ యైయున్కి ♦ దగవుసతికి.

క. సవతాలికిఁ బతి వలచిన, నవుఁ గాకని యతనియిచ్చ ♦ కనుగూపము గాఁ
దివిరి నడచుసతి దైవము, శివ యది దగు నెల్లజనము ♦ చే మ్రొక్క గొనన్. 3202

క. తనచేతికి నిచ్చినవ,స్తునికాయము నిల్లురువున ♦ చొప్పున మగుడం
గొన వచ్చి భార్య పతి దె,మ్మనినప్పుడ యిచ్చు టొప్పు ♦ నకపటవృత్తిన్. 3203

క. పతి దనకు నేమి యిచ్చిన, నతిముదమునఁ బొంద వలయు ♦ నాత్మజుఁ డైనన్
మతిఁ గొంకక యేకాంత,స్థితి నేకాసనత నున్కి ♦ నెట్ట ప్రమదకున్. 3204

క. ధని యధనుఁడు రూపసి యొ,ప్పనివాఁ డవివేకి మూఢ ♦ భావుఁ డరోగుం
డనుగతరోగుఁ డనక యం,గన పతిఁ బాటింప వలయుఁ ♦ గామధ్వంసీ. 3205

క. బలి భిక్షము గడపకిడ,న్వలయును దేవపితృపూజ ♦ నంబుల కాలం
బులఁ బతి శుభ మందుటఁ ద,త్ఫలంబు గాఁ గోరు టొప్పి ♦ దము సతికి శివా.

క. గతి పతియు చుచ్చె భార్యకు, నతనిఁ గడచినట్టిసత్వ ♦ రాయణము గృపా
యుత కలదే కావునఁ దా,నతనికి భర్త యగు టిచ్చు ♦ నఖిలశుభంబుల్. 3207

ఆను, ఆ 5 పద్య 285–297.

తే. ఒక్క_మన్ననతోనున్న ♦ నొల్లకున్నఁ,గరము నెయ్యుఁడై యున్నను ♦ గాకయున్న
మగఁడు ప్రియతముఁ డనియుండు ♦ మానవతికి, నెల్లలోకసుఖంబులు ♦ నెదురువచ్చు.

క. నడవడి తొప్పక యుండినఁ,గడు నిర్ధనుఁ డయిన పతియె ♦ గతియును విను మె
క్కుడు బంధుండు ప్రియుఁడుం,బడఁతులకుం బరమగురుఁడుఁ ♦ బరదేవతయున్.

తే. ఇంతిశీలదోషంబుల ♦ నిట్టి పతికి, నతివ లెవ్వరు ప్రతికూల ♦ లయి చరింతు
రమ్మహాపాపచతులు దు ♦ ర్యశము నొంది, కూలి కాంతు రధోలోక ♦ ఘోరగతుల.

క. పతిపరిచర్యాపరిణత, గతి లోకము మేలుకీడు ♦ గనియుండుపతి
వ్రతలు నినుఁ బోని గుణవతు,లతులితసుఖకీర్తు లెందు ♦ నందుదు రబలా. 3211

ఉ. నావుడు బత్నికిం బతియ ♦ నమ్మినబంధుఁడు నిష్టదైవముం
గా వివరించి మజ్జనని ♦ గారవ మారఁగ మున్ను సెప్పె నా

కీవిధ మత్తగారుఁ గృపయేర్పడ నానతి యిచ్చి రిష్టమీ
చే విని ధన్యనైతి విలసిల్లె మనంబు మహాతపస్వినీ. 3212

ఉ. సత్యము లైన జన్మములు నూఱును వేమఱు సేసినం దప
స్సత్యశమక్షమాదిగుణసంపదతోడ వసైకనాములై
నిత్యసమాధియోగమున నిల్చిన నేరికిఁ బొందవచ్చునే
పత్యనుకూలలైనకులపాలిక లందెడు పుణ్యలోకముల్. 3213

చ. పతియెడ రెండు లేక కులభామలు తా రతఁ డెట్టిఁ డైన స
న్మతిఁ జరియించు టొప్పు నని నం గమనీయచరిత్రుఁడుం గృపా
న్వితుఁడు జితేంద్రియుండు నతినిర్మలధర్మయుతుండు సూనృతో
ర్జితుఁడును రాముఁ డీరఘువరేణ్యుని నెగతిఁ గొల్చు టొప్పదే. 3214

క. విను కౌసల్యకుఁ దక్కన, జనసుల కతిభక్తి నొక్క సరియై నడచుం
జనపతి యొకపరి మెట్టిన, వనజాక్షులఁ దల్లి నొక్క వడువునఁ జూచున్.

క. గుణవతి సావిత్రియు నత్రిసుతయరుంధతియు ధర్మపరిణత యారో
హిణియుఁ గనుట పతిశుశ్రూషణమునన కదా సదా యశస్సౌఖ్యంబుల్.
భాస్కరరామాయణము. అయోధ్య, 291-300.

మ. గురు వన్నన్ ధన మన్నఁ బుణ్య మనినన్ గోత్రోదయం బన్న దే
వర యన్నన్ మన మన్నఁ దుష్టి యనినన్ వాత్సల్య మన్న న్నిజే
శ్వరుఁ డన్నం బరమోపకార మనినన్ సర్వంబు నన్నం దలో
దరి నీకున్ నిషధాధినాథుఁడె సుమీ తథ్యంబుగాఁ జెప్పితిన్. 3217

సీ. పాటించి కొలువుము భవనదైవంబుల, సవతులఁ గొనియాడు సఖులఁ బోలె
నారాధనము సేయు మత్తమామల కెప్డు, పరిజనంబులమీఁదఁ గరుణ గలిగి
యలుగకు కోపించినపుడు నాథునితోడ, మదిలోన నుబ్బకు మన్ననలకుఁ
దోఁడికోడండ్రతోఁ గూడి యాడి చరింపు, దాసీజనముఁ బ్రోవు తల్లికరణి
గీ. బ్రాహ్మణులయందు గురులందు బంధులందు, భక్తివిశ్వాససౌహార్దపరత నెఱపు
భవ్యపతిదేవతాచార పరమపుణ్య, ధర్మ మేమఱ కుండుమీ తల్లికావ. 3218
శృంగారనైషధము. ఆ 7 పద్య 8, 9.

సీ. ప్రాణేశుఁ డారగింపక భుజింపవు భర్త, నిద్రింపకయమున్న నిద్ర వోవు
నాథుండు మేలుకొనకమున్న మేల్కాంతు, సేయ కెన్నఁడు గనఁగ [illegible]

దవఁడు ప్రోషితుఁడైన◆తఱి వాడియుండుదు, పతికి నెక్కుడు మాఱు◆పలుక వీవు
పురుషుతోగికి నల్ప◆మునక సంతోషింతు, మొగ మెత్తనేగవు◆మగనియెదురఁ
గీ. జెలఁగు మాసిన మూన్నాళ్ల◆సిగ్గుతోడఁ, బతివిలోకనమార్గంబుఁ◆బరిహరించి
నాల్గవదినంబు మంగళ◆నమునాడి, చూచె నెవ్వారిఁ బురుషుని◆జూచి కాని.
మ. పసుపుం గుంకుమ కజ్జలంబు నునుగూ◆ర్పాసంబు తాంబూలముల్
గుసుమంబుల్ కబరీభరంబు చెవియా◆కుల్ మంగళాలంకృతుల్
వినువోకొన్నింతయు లేక తాల్పవలయున్◆వీనిన్ సదాకాలము
న్వసిఁ జక్కంగఁ బ్రియుండు వర్ధిలుటకై◆నాళీకపత్రాక్షికిన్. 3220.
గీ. రజకితోడను దూతతో◆శ్రమణతోడ, విధవతో నాథుతో రాయు◆వెలఁదితోడఁ
జెడిపెతోఁ జాలఁ బోరామి◆సేయఁ జనదు, ప్రాణసంకటములనుబు◆ణ్యాంగనలకు.
సీ. పతి పిల్వఁబంచినఁ◆బనియేమియనివచ్చి, చెప్పినయుడిగంబు◆సేయ వలయు
భర్తయానతి లేక◆పరికృతిబంధున కైన, నేపదార్థంబును◆నీగిపెట్ట
జీవితేశ్వరుఁడు డిం◆చినయోగిరంబులు, గుత్స సేయక భుక్తిఁ◆గొనుట తగవు
సుఖనుపుఁడగు నిజే◆శుఁ బ్రబోధ మొనరింపఁ, గా దనుస్థానభం◆గమునఁ దప్ప
గీ. నోంటి నెలఁతోడ కనుగుట◆యుక్తిగాదు, తడుపు గట్టక నీళ్లాడఁ◆దగవు గాదు
కడపమీఁదను మటిసన్న◆కంటి మీఁద, జక్కిమీఁదను గూర్చుండ◆జూడగాదు.
క. నాగరికత్వము నాంచా, ప్రాగల్భ్యముఁ జూపఁ జనదు◆పతినుండట సం
భోగక్రీడావిభవో, ద్యోగంబులఁ దక్క సతికి◆నుత్పలనయనా! 3223
క. ఇది ధర్మం బిది యాలువ, ఇది వ్రత మిది సద్వివేక◆మిది యాచారం
బిది దేవపూజ యధిపతి, యానతిం బాలంబు సేయు◆చుండుట సతికిన్. 3224
క. కాంతుఁడు సంతోషించిన, సంతోషింపంగవలయు◆సతి కలఁ డార్తిన్
సంతాపించినపట్టున, సంతాపింపంగవలయు◆జలజేక్షణకున్. 3225
సీ. చీకటితప్పుచే◆సినసరోరుహనేత్ర, గూబయై వసియించుఁ◆గోటగమున
వింతవానిఁ గటాక్ష◆వీక్షణంబునఁ జూచు, కినలయోష్ఠి నహించు◆గిల్లకన్న
మగఁడు దన్మాత్మ◆మార్గముగనలివేణి, వ్యాఘ్రియై జనియించు◆వనములోనఁ
జెలుతిండి తనవారి◆మొఱఁగి యాహారించు, నతివ సూకరజాతి◆యందు బుట్టు
గీ. నధిపుఁ గోపించి హుంకార◆మాచరించు, పడతి మూఁగవు సవతి సౌ◆భాగ్యలక్ష్మిఁ
జూడఁ జాలక మదిలో న◆సూయ సేయు, భామ దుర్భగయగు నన్య◆భవములందు,
ఉ. దూరము వోయి యొండఁ బడి◆దూపిలి వచ్చిన ప్రాణనాథునిన్
ద్వారకవాటగేహళుల◆దాఁక నెదుర్కొని తీర్థ మార్చి యా

హారము వెట్టి పాద్యము స♦మర్పణచేసి విహారశయ్యపై
నూరువు లొత్తి చిత్తమున♦కు బ్బొనరించుట ధర్మ మింతికిన్. 3227

గీ. తగవు పాటించి యల్పంబు♦దండ్రియిచ్చు, నల్పమల్పంబ భ్రాతయు♦నాత్మజుండు
ప్రార్థితంబైన ధన మన♦ల్పముగ నిచ్చు, ప్రాణనాథుని సరియె యే♦బంధువులును.

కాశీఖండము, ఆ 2 పద్య 72-82

సీ. నిలయము పాటించి♦ నిర్మలదేహలై, శృంగార మేపార్చఁ♦ జేయ వలయు
సత్యప్రియాలాప♦చతురలై ప్రాణేశు, చిత్తంబు ప్రేమ రం♦జింప వలయు
దాక్షిణ్యసంతోష♦ ధర్మమేధాదుల, దైవత మని ప్రియు♦దలఁప వలయు
నాథుఁ డేపద్ధతి♦ నడచు నాపద్ధతి, నడచి సద్బంధుల♦నడప వలయు

ఆ. మార్దవమునఁ బతికి♦ మజ్జనభోజన, శయనపావరతులు♦ జరప వలయు
విభుఁడు పతితుఁ డైన♦నెలఁది పాతివ్రత్య, మహిమఁ బుణ్యుఁ జేసి♦మనుప వలయు.

క. తరుణి దనప్రాణవల్లభు, హరిభావముగా భజించి♦ యతఁడును దానున్
సిరి కైవడి వర్తించును, హరిలోకమునందు సంత♦తానందమునన్. 3230

క. ఉపవాసంబులు వ్రతములుఁ, దపములు వేయేల భర్త♦దైవత మని ని
ష్కపటతఁ గొల్చినసాధ్వికి, నృపవర దుర్లభము లేదు♦ నిఖిలజగములన్. 3231

భాగవతము, స్కం. 7 పద్య 416, 417, 418.

క. నడవడి గొఱగాకున్నను, బడుఁగైనఁ గురూపియైనఁ♦ బామరుఁ డైనన్
జడుఁ డైన రోగి యైనను, విడుచుట మరియాద గాదు♦ విభు నంగనకున్. 3232

భాగవతము, పూర్వ. పద్య 976.

గీ. బాల్యమునఁ దల్లిదండ్రులు♦ ప్రాయమున ధ, వుండు వార్ధకమున నంద♦నుండుఁ జెప్పి
నట్లు చేయంగఁ దగుఁ గాని♦యరసి చూడఁ, దెఱవలకు నెందుఁ దమయిచ్చఁ♦దిరుగఁ జనదు.

జైమినిభారతము. ఆ 2 పద్య 37.

సీ. జీవితేశ్వరుఁ బాసి♦ చిరకాలవసతిగాఁ, బుట్టినింటనె యునికి♦బుద్ధి గాదు
పొరుగిండ్ల నిరుగిండ్లఁ♦ బ్రొద్దుపోకల నైనఁ, బలుమాఱు నరుగుట♦ పాటి కాదు
దాసీజనులతోడఁ♦ దఱచుగాఁ గూడి త్రిస్తరమాట లాడుట♦ తగవు గాదు
తనకెంతయాప్తులై♦నను నన్యపురుషసం, సర్గంబుఁ జేయుట♦ జాడ గాదు

గీ. జనకగృహమున నైనను♦ మనను వఱపి, కూరనారకుఁ బంపుట♦ గుణము గాదు
హాస్యకథలందు గీతవా♦ద్యములయందుఁ, బ్రీతి నెఱపుట మగనాలి♦రీతి గాదు.

సీ. జలక మాహారము♦ శయనసౌఖ్యము భర్త, కంటెను ముఖ్యగాఁ♦ గాదు సేయ
విభుఁ డారగించిన♦ వెనుక తద్భాజనంబునఁ జేయ నర్హ[illegible]♦ భోజనంబు

ప్రియుఁ డక్కి తనచేరఁ ♦ బిల్వ కుండినభూమి, నింపుతోడుతఁ బవ్వ♦ళింపు టొప్పు.
వ్రతములు దేవతా♦ర్చనలు కాంతుఁడు సమ్మ, తింపక చేఁత యెం♦తేనికలుష
గీ. మప్రియంబులు చేసిన ♦ నధిపుమీఁదఁ, జిన్నఁ బోవక మది సంత♦సింపవలయు
మంచి దైనను ప్రాణేశు♦మనను రాని, పనులు మానుట భద్రంబు ♦ వనితలకును.

శా. ఏభంగిన్ శుచినాదునో పతిమనం♦బేభంగి రంజింతునో
యేభంగిం గులకీర్తి దాఁ గలుగునో ♦ యేభంగి వర్తింతునో
యేభంగి న్నడి రాక యుండఁ గలదో ♦ యేణాక్షులందంచు నా
యాభంగి న్మతియించుచుండఁ దగుఁ బు♦ణ్యస్త్రీకి నెక్కాలమున్. 3236

ఉ. కంచెలయుం బటీరతిల♦కంబును బాపట చెందిరంబు ఫా
లాంచలసీమ లేఁ బసుపు♦టచ్చతబొట్టుఁ జెవాకు గాజులుం
గొంచెపు వీడ్యము న్విరులు ♦ కొప్పున నొప్ప నొనర్ప నెప్పుడుం
జంచలనేత్రి యుండఁ దగు ♦ సంతతభర్తృఫలాభివృద్ధికిన్. 3237

సీ. జలమాడి మడుఁగువ♦స్త్రముఁ గట్టి కైచేసి, కొనికానికవయఁ బోఁ♦ జనదు ప్రియుని
మునుపు మేల్కొని భర్త♦ మోముఁ గన్గొనికాని, కాఁ గాదు వీక్షింపఁ♦ గా నితరుల
గడపమీఁదను సన్నె♦కల్లున ఱోటిమీఁ, దను నున్కి చేతను ♦ దలుఁగు యశము
తడికాళ్లతో వీడు♦దలతోడఁ గన్ప, త్రిములతో నిద్రపు♦ణ్యంబు దలఁగు
గీ. సంచెఁ దలయంటుకొనుట వ♦స్త్రంబు లేక, మజ్జనము చేఁత విరియాకు♦ మట్టగించి
తాల్చుటయు నిరుగేలను ♦ దల పుణుకుట, భర్తగలభామినుల కశు♦భప్రదములు.

క. వ్రతములు నుపవాసంబులు, మతియింప నిరర్థకములు ♦ మానవతులకున్
బ్రతివాసరమును సేవల, పతిభక్తియ చాలు నిహముఁ ♦ బరము ఘటింపన్.

చ. తెలివకు వల్లభుండు పర♦దేశము వోయిన వన్నె మాని తో
నటితికి నల్లబూసలును ♦ నచ్చతబొట్టును మట్టెవన్నెగాఁ
గుఱిమణుగైనపుట్టమును ♦ గూడఁగ దువ్వని మైలకొప్పునై
మలుగిడి యింటిలోఁ బతిస♦మాగమునన్మతియింపు టొప్పగున్. 3240

శకుంతలాపరిణయము, పి. వీ. ఆ 4.

సీ. మాఱుమాటాడదు ♦ మఱచియైనను గురు, వ్యాహారమున కీయ♦హార్యతనయ
యానక్రమగతిఁ బూను♦ మానంపుసవతు లై, ల్లైన నీదివ్యర♦త్నానుజాత
ఱాఁగయై మేరమీ♦ఱ దొకప్పుడును ఘన, శ్రీలఁ బొంగియును నీ♦సింధుకన్య
రేకాకృతి వహించు♦ నినురాగవృత్తికి, నవరాగవృత్తికీ♦ యబ్జవదన

తే. యచ్చెరువువింతయబ్బురం◆బరిదియనుచు,విశ్వధాత్రీశ్వరులు మెచ్చ◆వెలయవమ్మ
యమ్మ భవదీయచిత్రగు◆ణాతిశయము,వలన మాకెల్ల వన్నెరా◆మెలఁగవమ్మ.

చ. పతికృతధర్మకౌశలము◆ పట్టునఁ గోడగు నారి నారి దాఁ
బితృశరణపరిచింత మదిఁ◆బెట్టక యీశనివేశితాత్మ యా
సతి పతి రాశి కెక్కి యిం◆ సత్కృతిఁ గైకొను కన్య కన్య తా
శ్వతమతి నిట్లుగా మనని◆ వాఁడయె వామ నుమమ్మ కోమలీ. 3242

ఉ. కెమ్మలఁ బంపుదున్ మణిశ◆తమ్ములఁ బంపుదు రాజహంసపో
తమ్ములఁ బంపుదున్ బరిచి◆తమ్ములఁ గానన దేవతాళిజా
తమ్ములు బంపుదున్ గ్రుతిగ◆ తమ్ముల నే నునుసారణీపరీపా
తమ్ములవత్తు విశ్వవిది◆తా ముదితా మది తాప మేటికిన్. 3243

వసుచరిత్రము, ఆ 6 పద్య 56, 57, 60.

సీ. మఱచి తప్పియు నన్య◆మహిమ విమర్శింప, జూడ నీ వన్యని◆సొబగు వేడ్కఁ
బతిభక్తియెందుఁ గీ◆డ్పడనీవు వేఁడుదు, తత్పుష్టియే దైవ◆తంబు గనిన
నధిపుఁడుపార్షింప◆ పార్షింతు చింతింపఁ, జింతింతు చిక్కినఁ◆ జిక్కు దెపుడు
గడుఁ జన విచ్చినన్◆ గర్వింపనీకయుం,డిన భేద మొందవు◆ డెందమునను

ఆ. నిండుఁగడవరీతి◆నుండు దెపుడునూగం,భీరతకుఁ గలంగి◆ చేరనీక
పతిపరీవాపవేళఁ◆ బాటించుకొనవు నె,మ్మేన గరగరికలు◆ మెఱుఁగుఁబోఁడి.

చ. వరునకు నెద్ది యిం పడ ను◆వర్తనగాఁగఁ దద్ప్రియం బస
చ్చరితము గాఁగ నెన్నుదు ని◆సర్గమునాకిది మానరాద యీ
శ్వరుఁడును వేదమున్ గురుఁడు◆ సర్వము భర్తయ యేఁ దదాజ్ఞ ను
స్థిరమతిఁ జేయుచున్ విధిని◆షేధము లెవ్వియుఁ గైకొనం దుదిన్. 3245

క. విను మెయ్యదియు నిషిద్ధం,బవి విడుచుటలేదు విహిత◆మని సేయుట లే
దనుమానింపక యెద్దియుఁ, బెనిమిటిరొుల్లనిది విడుతుఁ◆ బ్రియ మొనరింతున్.

కళాపూర్ణోదయము, ఆ 4 పద్య 120, 135, 136.

చ. అలుకలు దువ్వరాదు సర◆సాన్నములన్ భుజియింపరాదు పై
కలప మలందరాదు తిల◆కంబురకంబుగదిద్దరాదు సొ
మ్ములు గయిసేయరాదు సుమ◆ముల్ ధరియింపఁగరాదుసాధ్వియౌ
పతివిడిపోయితాక్షికిని◆ నాథుఁడు చెంగట లేకయుండినన్. 3247

తారశశాంకవిజయము, ఆ 2 పద్య 158.

సీ. సర్వాస్థలంబుల ♦ సరస మాడంగ రాదు, వలసినప్పుడు రతి♦గలయ రాదు
బంధభేదంబుల ♦ బ్రజ్ఞ మాపంగ రాదు, గళరవంబులఁ బూని ♦ కనియ రాదు
కెమ్మోవిమీఁదను ♦ కెంపు లుంచఁగ రాదు, చెలఁగి నఖాంకముల్ ♦ చేయ రాదు
కూర్మి నిష్టాగోష్ఠి ♦ కూడియుండఁగ రాదు, సారెద వాక్ప్రౌఢిమ ♦ చూప రాదు
గీ. మఱియు సంగీతసాహిత్య♦మహితముఖ్య, విద్యలన్యోన్యమును చూపి♦విభవ మెసఁగ
కళలు రంజిల్ల వేడ్కగా ♦ మెలఁగ రాదు, ధాత్రి వైదంపతులకెల్లఁ♦ దలఁపఁబోఁడి.

ఒడయనంబివిలాసము, ఆ 2.

సీ. వంశధర్మనిరూఢి ♦ వదలించె నీనారి, మహితశాస్త్రార్థగ♦మంబు కలిమి
గురుతరులకు వన్నె♦గూరిచె నీశ్యామ, ఘనసుమనోనీక♦సనము చేత
నినుదయంబున ♦ నెసఁగు నీపద్మిని, మంజులామోదసా♦మగ్రి మెఱయ
ద్విజరాజుఁ బోషించి ♦ దీపించు నీకొమ్మ భానురఫలదాన ♦ పటిమఁ బూని
గీ. యనుచు జగ మెల్ల నుల్లాస♦మతిశయిల్ల, సంతతము మెచ్చ మనుమమ్మ♦తుమనుజన్మ
పద మనఁ దనర్చునంభోజ♦పాణి జీవ, నమ్మ జీవన మని యెంచు ♦ మమ్మ కొమ్మ.

చంద్రికాపరిణయము, ఆ 6 పద్య 99.

క. మానమె ధనమును దేహము, మానమె సర్వంబు చూడ ♦ మానవతులకున్
మానము బోయినవెనుకం, బ్రాణముతో నుండ వలెనె ♦ పద్మదళాక్షా. 3250

రాధికాసాంత్వనము. ఆ 4.

సీ. అనఘ ప్రాతఃకాల♦మున లేచి రాత్రి వస్త్రము విచ్చి ధౌతవ♦స్త్రంబుఁ గట్టి
మునుకొని పతిపాద♦ములకు నర్మిలి మ్రొక్కి, సంతస మొప్ప సం♦స్తవ మొనర్చి
యవ్వల గృహకార్య ♦ మరుదారఁ గావించి, సలలితాంబువుల మ♦జ్జనముఁ జేసి
సురుచిరపరిశుద్ధ ♦ శుక్లాంబరముఁ గట్టి, రమణీయశుక్లపు♦ష్పములచేత
గీ. బతినిఁ బూజింప వలయు స♦ద్భక్తితోడఁ, బూతజలముల నర్ఘ్యము♦స్నానముఁ జేసి
ధౌతవస్త్ర మొసంగి త♦త్పాదయుగళ, మంచితమ్ముగఁ దడియొత్తి♦యాదరమున

కృష్ణజన్మఖండము, ఆ 6.

సీ. అల బ్రహ్మచారిని♦నిలఁ బట్టి మలపట్టి, హరుమీఁది తమిఁ బాసి♦యలరెనయ్యా
విబుధసంయమిమగు♦ల్వాని యును సావిత్రి, తండ్రిమాటకు జని♦దాఁటెనయ్య
అవనిరాణ్మణిపుత్రి♦యయ్యు లోపాముద్ర, యొక తాపసి వరింపఁ♦దుం డెనయ్యా
ముందు గాననుకొన్న ♦ పురుషుఁ గాదని సతీ,తిలక మెవ్వతె యన్య♦వలచె నయ్యా
గీ. ఆన జనకుండు పిమ్మట ♦ నధిపుఁ డనలఁ, దన యుంచుకొనుశాసన తుల్య బా! ♦ వనిత నన్వా
వెన్నఁ జేరియు సావిత్రి♦ మున్నదయ్యా, కానఁ నీయాన నెటు దాఁటు♦దానయ్యా.

సీ. నిరుపమదివ్యసుం◆దరవిగ్రహుఁడె కాని, వికలాతివికలరూ◆పకుఁడె కాని
సంతతాధికగురై◆శ్వర్యధుర్యుఁడె కాని, పరమదరిద్రతా◆స్పదుఁడె కాని
సకలకలాకలా◆పకశాలియే కాని, నిర్భరమూర్ఖతా◆న్వితుఁడె కాని
గురుతరప్రఖ్యాత◆కులజన్ముఁడే కాని, బహునీచవంశసం◆భవుఁడె కాని
గీ. మానినీరత్నములకు నె◆వ్వానిఁ దొలుత, జనకుఁ డూహించు జీవితే◆శ్వరుఁడు గాఁగ
నతఁడె సాగరధనసమ◆న్వితుఁడు నతఁడె, యతఁడె ప్రాజ్ఞుండును గులీనుఁ◆డతఁడె సుమ్మి

వయనోల్లాసము, ఆ 2 పద్య 95, 96.

సీ. అభ్యంగనము సేసి ◆ గాత్రము సుష్ణోదకములఁ దీర్థంబు వార్ప◆గానువలయుఁ
బతిచిత్తమెఱిఁగి యే◆ర్పడఁ గూడుఁ గూరలు, వేళతోడుత నె కా◆వింపవలయు
వివిధపక్వాన్నముల్ ◆ వేర్వేర వండించి, ప్రియునకు భుజియింపఁ◆బెట్టవలయుఁ
దద్భుక్తశేషమై ◆ తనరు నుచ్ఛిష్టాన్న, మింపుతోడుత నార◆గింపవలయు
గీ శయ్య విదలించి పైచీరె◆ చక్కఁ బఱచి, పురుషుఁ బవళింపఁ జేసి తాం◆బూలమొసఁగి
యూరువులనుంచి పాదంబు◆లొత్తియొత్తి, పిదప నిద్రింపఁదగు జంద్ర◆బింబముఖికి.
సీ. మందె మేలములైన ◆ మాటలాడఁగరాద, యెదురుమంచము పూన్కి◆నెక్కరాదు
మదలవెట్టక వీస◆మును వ్రయింపఁగరాదు, కోపించెనని మది◆గుందరాదు
సొమ్ము వెట్టఁడటంచు ◆ సొలసి పల్కఁగరాదు, చెలువుఁ గైకొనికాని◆ కలయరాదు
సంభోగమునఁ గాని ◆ చనవు చూపఁగరాదు, కులటతో ననురక్తిఁ ◆ గూడరాదు
గీ. తెల్లవాఱినపిదప ని◆ద్రింపరాదు, కుడువరా దధిపతికి మున్ ◆ గూడుగూర
యన్యపురుషులతో హాస్య◆మాడరాదు, మఱపుతోనైన నొకనాఁడు ◆ మానినులకు.
చ. వ్రతములు సల్ప వల్వ దుప◆వాసములం గృశియింపవల్దు సం
తతమును దీర్థసేవలకుఁ ◆ దాఁ జనవల్వదు దేవతార్చనల్
ప్రతిభ నొనర్పఁగావలదు ◆ పంకరుహాయతచారునేత్రికిన్
పతినిజభక్తిఁ దావిడిచి ◆ పామరయై నరకంబునన్ బడున్.
మ. పరదేశంబు విభుండు చన్నపిదపన్ ◆ బ్రాణేశు రాకన్ నిరం
తరమున్ గోరుచు మేనుమాసి చెవ్రల◆ న్లక్కాకులున్ చేతులం
సొరిదిం గాజులు నల్లపూసలఱుతన్ ◆ జూపట్టుచుండంగ సుం
దరి యక్షింతలబొట్టునుం బసపుమో◆దం బొప్పఁ దాల్పందగున్.
సీ. కామినీమణికి మం◆గళసూత్రమే చాలు, శృంగారములకెల్లఁ ◆ జెలువొసర్ప
ధవళలోచనకు నై◆మవతనంబే చాలు, నైభవంబులకెల్ల ◆ వన్నెవెట్ట
నంబుజాననకుఁ బా◆ణ్యాస్త్రీకనమె చాలు, రాజసంబులకెల్లఁ ◆ దేజమొసఁగ
సతికి నాథుఁడు వృద్ధ◆స్థితినుండుటయె చాలు, భాగ్యలక్ష్ములకెల్లఁ ◆ బ్రాభవొసఁగ

గీ. యెన్నిజన్మంబులందుఁ బ◆ద్మేక్షణలకుఁ, బతిహితంబునకంటె శో◆భనముగలదె
ఇహపరములిచ్చుహృదయేశు◆మహిమఁదెలియ,కధిపుతోవాదులాడునఁగా◆నర్హమగునె.
రుక్మాంగదచరిత్రము, ఆ 4 ప 82–91.

## శిశుపోషణము.

ద్విపద. దొంగిళ్లపై నుండి◆ లింగమూర్తికెని, అంగన గావించు◆ నభ్యంగనంబు
మఱొక్కత్తుఁ జెఱొక్కత్తె◆మఱుక్క నున్నవ్రేలుము, నొక్కత్తె కడుపొత్తు◆నటవీపునివురు
పెరుఁగంగ వలెనని◆ తరుణి వీడ్వాడఁగ, చరణములక్కరములు◆ జాగంగఁ దిగుచు
నలుగులు నలుచు న◆ర్మిలి గట్టిపెట్టి, జలములఁ వీపునఁ◆ జఱచు నందంద
వెగచి బెగడకుండ◆ వెన్న వ్రేయుచును, నొగి మస్తకమున నీ◆రొత్తు దోయిటను
వదనంబుఁ జొచ్చునో◆ యుదకంబు లనుచు, నడుమ బొట్టన నోటి◆కడ్డంబు వెట్టి
చెన్నగాఁ బసపార్చి◆సేయు మజ్జనము, కన్నులు చెవులును◆ గాడఁగ నూఁదు
నంగుడు ముల్లొత్తు◆ నందంద వ్రేల, దొంగిళ్లఁ గార్నిరు◆ దోసెత్తి పిడుచు
పడతి చేనీరదూ◆పడచి పెట్టుచును, మడతి యంగుష్ఠంబు◆ మన్నింత మెదిపి
కడవనంటినయట్టి◆ పిడుకవిభూతి, యడరఁ బుత్రునినొస◆ల్కారంగఁ బూయు
నెత్తి కుర్రింగెడునని◆ గొత్తంగ వెలిచి, యాత్మవ్యథ నమ్మన◆నస్కగ నిడుము
కాటుక యిడు సంత◆కన్నగు ననుచు, గాటుక యిడుమూడు◆కన్నులగలయఁ
జన్నిచ్చుఁ బత్తులఁ◆ జననీదు మీఁద, న న్నాతి గొండిన◆వెన్నయుఁ బెట్టి
చెక్కిలిగిటిడు◆ చెలఁగి యేడ్వంగ, నొక్కవ్రేలిడిపోయు◆ నొకకొన్ని పాలు
యుగ్గులు వేఁడఁగ◆ నువిద సంప్రీతి, నగ్గించు నగ్గించు◆ నట బుజ్జగించు
ముద్దాడు నగియించు◆ ముద్దులు వేఁడు, నిద్దరో వీ రెవ్వ◆రయ్యరో యనుచు
పన్నగా నుదరంబు◆ పాన్పుగాఁజేసి, సన్నజోచఱచుచు◆ సన్నుతిఁబాడు.
బసవపురాణము, పి. సో. ఆ 3.

సీ. అలఁదు నలుంగు దే◆హమున శ్రీగంధోర్చుఁ, దడియొత్తు మెత్తని◆ ధవళవస్త్ర
మునఁ గాలివ్రేలిమ◆న్నన బొట్టు వెట్టుఁ గ,న్గవఁ బెట్టుఁ గాటుక◆ కడుపునకును
బెట్టుఁ బొత్తులమీఁద◆ బొట్టుఁ జన్నిచ్చుజో,కొట్టుఁజోలలుపాడు◆మఱ్ఱెపఱచుఁ
దలయూఁటుఁ జిట్టాము◆దమున రక్షార్థంబు, మునిఁడికోలలు నుంచ◆మున నమర్చుఁ

గీ. డ్రాట నులిగాయఁ గూర్చి పా◆దములఁ గట్టు, నుప్పువేఁపాకు పైఁజల్లు◆నిప్పులతివ
దిగ్రిప్పియిడు దృష్టిదోషంబు ◆ దీర వీథిఁ, బ్రేమ మీఱంగ బిడ్డలఁ◆ బెంచునపుడు.

కాళహస్తి మాహాత్మ్యము, ౪

సీ. తల నంటి మేనఁ బో◆బ్బిలఁగఁ జమురు పూసి,సకలాంగములు దిద్ది ◆ చక్క నొత్తి
జలకముల్ గోర్వెచ్చ◆జలములచే నార్చి,తడి పోవ కర్ణరం◆ధ్రముల నూది
చలువసన్నపుఁబొట్ట◆ముల మేనఁ దడియొత్తి, పట్టుపొత్తుల మెత్త◆పడక నునిచి
నొసపైన కాటుక◆కనుఁదమ్ముల ఘటించి, బొమలు దీర్చి చుక్క◆బొట్టుఁ బెట్టి
గీ. పొదిగిటను జేర్చి పాలిచ్చి ◆ బుజ్జగించి, కెంపు రవచెక్కడంపుని◆ద్దంపుసొంపు
నింపు నుయ్యాలలోన ని◆ద్రింపు మనుచుఁ,బాటఁబాడుచునూచురా◆ పట్టినపుడు.

తాలాంకనందనీపరిణయము.

# స్త్రీశుద్ధాంతవాసము.

(ఘోషా)

క. చీరలు గృహములఁ దగుప్రా,కారములును దగిన తెఱలఁ ◆ గాపులు మేఱువే
నారీజనులకు సవ్యాగు,దారం బగు చరిత మొకటి ◆ దప్పింపంగన్. 325
క. వ్యసనంబులఁ బరిణయముల, వసమములగు సంగరముల ◆ యాగంబులఁ బో
ల్లసదుత్సవముల మఱువులు, బిసరుహనయనలకు వలదు ◆ పృథులవిచారా. 3263

భాస్కరరామాయణము, యుద్ధ. పద్య 2324, 2325.

# స్త్రీ విద్య

చ. ఉవిదు.. తాము బాల్యమున ◆ యుక్తముగాఁ జదు వభ్యసింపకే
యవని మెలంగు చుండిన న◆నర్హము లౌ పను లాచరించుచుం
బ్రవిమలభావమున్ గనక ◆ క్రిన్నన మూర్ఖతపాలుగా రొకో
యవుఁగద విద్య నేరని జ◆నావళి కేఁటివివేకసంపదల్. 3264
క. రాతిరికి నిండువెన్నెల, చేతం దమ మెదలి వెలుఁగు◆చేకుఱు రీతిన్
నాఁతికిని విద్యచేత మ,నోతమమున్ దొలఁగి తెలివి ◆ యలవడును గదా. 3265
శా. పాతివ్రత్యముచేత నెట్టిఫలముల్ ◆ ప్రాపించునో యెట్టివి
ఖ్యాతం బైతగుపుణ్యముల్ శ్వశురసే◆వాసక్తిచేఁ గల్గునో

నీతిం దప్పకయున్న నెట్టి సుకృతా◆నీకంబుఁ జేకూరునో
యేతద్ధర్మము లెల్లఁ దెల్ల మగుఁ గా◆దే విద్యచే? స్త్రీలకున్. 3266

చ. ఇహపరసౌఖ్యహేతువగు◆నింతులకున్ బతిభక్తి దానికిన్
మహితవివేకసంపద ఘ◆నంబగుకారణ మౌను దానికిన్
సహజవిమూఢతం గెడపఁ ◆ జాలినవిద్యయె ముఖ్యమూలమై
మహి నల రొంగుఁ గాన నది◆మానినికిం దగు నభ్యసింపఁగన్. 3267

ఉ. ఎయ్యది యౌర్వమిం గెడపు ◆ నెయ్యది పాపుచు బాపవర్తనం
బెయ్యది తామసం బణఁచు◆ నెయ్యది రూపణుఁ జేయు సాహసం
బెయ్యది సత్స్వభావ మిడు◆ నెయ్యది గూర్చును సూనృతవ్రతం
బయ్యనవద్యవిద్య నల◆దా యిలఁ దారలివల్ పఠింపఁగన్? 3268

నయనోల్లాసము, ఆ 1 పద్య 95–102.

—◆ గద్య. ◆—

శ్రీ పరమేశ్వర కరుణాకటాక్షలబ్ధ సుకవితావిలసిత చరణజకులసంజనిత, దాసరి కొండయాఖ్యసుజనసుత, పీఠికాపురప్రభుపోషిత, సకల జనవిధేయ, లక్ష్మణనామధేయ సంకలితంబైన వర్ణనరత్నాకరమునందు ద్వితీయభాగము

సంపూర్ణము.

అ ను బం ధ ము.



# ప ర బ్ర హ్మ ము.

సీ. అమలమై స్వచ్ఛమై ♦ యాద్యంతశూన్యమై, శుభ్రమై ఘనసంశ♦దభ్ర మగుచు
నిత్యమై సత్యమై ♦ నిర్మలాకారమై, యందమై యానంద♦కంద మగుచు
పూర్ణమై దివ్యమై ♦ బోధస్వరూపమై, బుద్ధంబునై స్వత♦స్సిద్ధ మగుచు
నమితమై నిర్వేద్య♦మై నిరంజనమై ప,రంజ్యోతియై మహా♦రమ్య మగుచు
గీ. నద్వయబ్రహ్మచైతన్య♦మై వెలుంగు, నట్టిబైటను నేమి గ♦న్పట్టు బెట్టు
లైన నిబ్బంది తెల్వికై♦లేనివే క,లిగె ననవలసె రజ్జుస♦ర్పగతి ననఘ.

మ. కనకం బొక్కటనేకభూషణములై ♦ గాన్పించుచందంబునన్
ధ్వని దా నొక్కటి వాద్యభేదముల భే♦దం బైనచందంబునన్
మననాకారవిచిత్రదృశ్యత బ్ర♦హ్మభాస తేజంబు తాఁ
గనుపట్టు న్సకలంబు నాచు నిజమో♦క్షశ్రీ వివాహోత్సవా.

శ్రీరామ స్తవరాజము, ఆ 2.

గీ. డెందమును వాక్కునెవ్వాని ♦ నందలేవు, కాంతురెవ్వానివహరపు♦ష్కరమునందు
పరమయోగీంద్రులధిక తా♦త్పర్యలీల, నట్టి నీకు నమస్కార♦మఖిలవంద్య !
సీ. బుద్ధ్యహంకారరూ♦పుని భజింతుము నిన్నుఁ, బంచతన్మాత్రరూ♦పా భరింపు
పంచకర్మేంద్రియ ♦ పంచబుద్ధీంద్రియా,త్మక ! మనోరూప! యే♦మఱకు మమ్ము
క్షిత్యాదిపంచకా♦కృతి ! మమ్ము రక్షింపు, విషయాత్మకా! మమ్ము♦ విడువవలదు !
బ్రహ్మాండరూప ! మా♦పాలి పెన్నిధి వీవు, [illegible]♦భ్యంతరస్థ !
గీ. కొలుతు మర్వాక్పరాగూర్రుఁ♦గోరి నిన్ను, విశ్వరూపుని నిన్ను సే♦వింతు మెపుడు
నవధరింపుము నిత్యస♦త్యస్వరూప !, సదసదీశ్వర ! యభయహ♦స్తంబు చూపు !
సీ. నిగమత్రయంబు నీ♦నిశ్వాసపవనంబు, నీమూర్తిభేదంబు ♦ నిఖిలజగము
నీయంఘ్రి మేదిని ♦ నీమూర్ధమాకాశ, మంతరిక్షము నాభి♦యందు నీకుఁ
జంద్రుండు హృదయంబు ♦ చక్షు వబ్జహితుండు, తనురుహవ్రాతంబు♦ దరులు నీకు
నీవు సర్వంబును ♦ నీయందు సర్వంబు, స్తోత్రస్తుతి స్తవ్య♦జాత మీవు

గీ. మ్రొక్కెదము నీకు ననిమహా♦మునులు సురలు, నలికతలమున సేవాంజ♦లులు ఘటింప.

\+ + + + + +

కాశీఖండము, ఆ 2 పద్య 3–7.

సీ. ఏకమై పరమై వి♦శోకమై సత్యమై, లోకమై వ్యాపకా♦లోక మగుచు
జ్ఞానమై జగదధి♦ష్ఠానమై ముక్తిని, ధానమై మాయావి♦హీన మగుచు
నందమై కేవలా♦నందమై సంతతా, స్పందమై శ్రుతిపద్మ♦కంద మగుచు
సారమై చిదచిదా♦కారమై యతినిర్వి, కారమై......సం♦సార మగుచు
తే. జెలఁగు మొలనులకలఁకలు♦గలిగికొనుచు, మెలఁగు ప్రకృతినిఁ దగులక♦మిగిలివెలఁగు
వెలుఁగు వెలుఁగంగఁ జేయుచుఁ♦గలయ వెలుఁగుఁ, బరమ పరిపూర్ణ నిర్గుణ♦బ్రహ్మమనఘ.

సీతారామాంజనేయసంవాదము, ఆ 2 పద్య 6.

సీ. బ్రహ్మంబు నిజము ప్ర♦పంచంబు సత్యంబు, బ్రహ్మమే జీవులై♦ పరగుచుండు
బ్రహ్మవిజ్ఞానంబు♦ ప్రభవించ జీవుండు, బ్రహ్మమై భాసిల్లు♦ పట్టుమీఱ
నామరూపగుణాదు♦లేమియు లేవు బ్ర, హ్మంబున కవి యెల్ల♦మధ్యకాల
కల్పితంబులు ధర్మ♦కర్మాదు లను జెల్ల, భ్రాంతిచేఁ బుట్టును♦ ప్రాణులకును
గీ. ఘటకుటీరాదినభములు♦ ఘటముఖములు, చెడిన పూర్ణనభంబునఁ♦ జేరుభంగి
జీవములుపాధివదలంగఁ♦జెందు బ్రహ్మ, మందు ననటంచు ననియె సా♦యజ్ఞమూర్తి.
సీ. బ్రహ్మంబునకు గుణా♦భావంబుఁ జెప్పుచో, హేయగుణాభావ♦మే యనఁదగు
జీవేశ్వరైక్యమే♦ చెప్పిన బ్రహ్మంబు, నకుఁ బరాత్పరతచే♦గకవసించు
నది గాక నీకున♦కుదయాంతములు చెప్ప, నిగమతత్త్వంబున♦ కగు వికలత
నంతియు గాక ని♦త్యానందమజ్ఞాన, ములు బ్రహ్మమందు సం♦చలత నొందు
గీ. నామరూపాదికములకు♦ లేమిఁ జెప్పు, పట్ల ప్రాకృతనామరూ♦పములు లేవు
దివ్యనామాదినాకృతు♦లైలియబ్రహ్మ, మునకుఁ గలవంచుఁ జెప్పుట♦ముఖ్యమరయ.

భార్గవపురాణము, ఆ 8.

## విగ్రహారాధననిరసనము.

గీ. తామ్రమృద్దారుశిలలను♦ దలఁపుతోన, యీశ్వరుం డని పూజింప♦నేమి ఫలము
తనమదివయుండు నీశుండు♦తన్న దాను, తెలియ నేరనివానికి♦దొరవు లవియు.

శ్రీరామస్తవరాజము, ఆ 1.

# ఏకేశ్వరోపాసనము.

సీ. పరిమళద్రవ్యంబు ◆ బహుళమై వర్తింపఁ, జని కర్దమముఁ బూసి◆కొనినయట్లు
సరిలేని రత్నభూ◆షణములు వర్జించి, గురువెందసరములు ◆ గోరినట్లు
సరసాన్నభక్ష్యభో◆జ్యములు విసర్జించి, మించి శాకమున కా◆శించినట్లు
వన్నెమీఱినపట్టు◆వస్త్రముల్ విడనాడి, కంబళచేలముల్ ◆ గట్టినట్లు
గీ. అఖిలజగదేకనాథుఁడ◆వైన నిన్ను, దలఁప నొల్లక దేవతాం◆తరములందు
భక్తిసంపన్నులగునట్టి ◆ పాపరతులు, పొందుదురు రౌరవంబుల ◆ భువనవంద్య.

మత్స్యపురాణము, ఆ 4 పద్య 144.

# స్త్రీపునర్వివాహప్రశంస.

క. నాపత్నిని గొంపోయిన, పాపాత్ముని తలలు దుంచి ◆ పరునకుఁ దద్భా
ర్యాపరిణయముం జేయుట, కై పూనితి మాఱికాల◆ మజ్ఞాతముఖీ.
ఉ. కావున నీవు సాధ్విపలోక◆కష్టుని కిచ్చుట గూడ దింక స
ద్భావుఁడు కోపిమందు మితి◆భాషి విభీషణుఁ డెన్నిభంగులన్
శ్రీవిభవుండు వాని నినుఁ◆జేర్చుట మాకు శుభం బటంచు నా
భూవిభుఁ డానతిచ్చినను ◆ బుష్పసుగంధి వచించె నత్తఱిన్.
ఆ. అనఘ మున్ను రావ◆ణాసురభార్యనై. సుతులఁ బడసి యిప్పు◆డితరపురుష
పరిణయంబు గొనిన ◆ ధరలోన నగుదురు. గాదె నీ వెఱుంగ◆వే దయాబ్ధీ.
సీ. అనిన భూపతి పల్కె◆నతివ నాకమునకు, పతు లెందఱైనను ◆ భార్యయొక్క
శచి పాల్పడదె పద్మ◆జాతుల కొక సర,స్వతి ప్రవర్తించదే◆చంద్రనరుల
కేకమై శక్తిదా◆నెలమి వర్తింపదే, పదిపుట్టువుల కొక్క◆పద్మ సేవ
కులసతి యగుచు సం◆కోచంబు మానదే, ప్రియముతో నివు వి◆భీషణునకు
గీ. భార్య వైనను వ్రతనిష్ఠఁ◆బాయకుండు, సతులలో నగ్రగణ్యవై◆సౌఖ్యసిద్ధి
నొందెదవటన్న నాదర◆మొనగ మయుని, పుత్రికరములు మోడ్చిభూ◆భుజునికనియె.
క. నలినాసనసురముఖ్యులు, దలఁపఁగ నీచిత్తవృత్తి ◆ దప్పగలేరో
జలజాక్ష యేను బాయఁగ,గలననుటకు నెంతదానఁ◆గరుణావార్ధీ.

నిర్వచనవిచిత్రరామాయణము, ఆ 6.

# వనవాసనిరసనము.

సీ. నిలయంబు విడిచి కా♦నల కేఁగినంతనే, చెడదు కామంబు ని♦శ్శేష మగుచు
గురుజరాభారంబు ♦ ధరియించినంతనే, యుడిగిపోవదు క్రోధ♦మూన మగుచు
గందమూలాదిభ♦క్షకుఁడైనయంతనే, చనదు లోభంబు ని♦స్సార మగుచు
సంతతవ్రతజపా♦సక్తి నున్నంతనే, విడువదు మోహంబు ♦ విరళ మగుచు
గీ. నజినవల్కములు గట్టి♦నంతమాత్రి, మదము చెదరదు మత్సరం♦బెదుగ కుండ
దనఘ ! యటుగాన వనవాసి♦యైనయంత, భూరినిర్వాణసౌఖ్యంబుఁ♦బొందవశమె
గీ. చిత్తశుద్ధిఁ గన్న ♦ యుత్తముచరితుండు, నిలయమున వసింపఁ♦గలుగు ముక్తి
హీర మెన్ని చోట్ల ♦ నేరీతి నున్న నో, కింతయైన వికృతి ♦ నేలఁగాంచు.

మూర్తిత్రయోపాఖ్యానము, ఆ 2.

# జాతిభేదము.

సీ. మహితమేదశ్చర్మ♦మజ్జాదికములైన, సప్తధాతువు లేక ♦ సరణిగాను
సకలజంతువులందు ♦ సమకూడియుండఁగా, హెచ్చు తక్కువజాతు♦లేర్పరించు
విధమేమి భైరవు ♦ విపులశాసనమున, మాతృగర్భమున నె♦వ్వాఁడు జనించి
మలయు దేహమునకే ♦ మందుఁ డేనియు నుచ్చ, నీచంబు లెంచునే ♦ నెమ్మనమున
గీ. నట్లగుట జాతిసంగతు♦లపరిమాణ, మని తలంపరు జాతిద్వ♦యంబు గలదు
యుంపిదలోకజాతి మగవాఁ♦డొక్కజాతి, దానస్త్రీజాతి యొక్కవ♦దలఁచి చూడ.

శంకరవిజయము, ఆ 4.

భవ్యపదాకరము ! భావసుధాకరము !! పరిమళకుసుమాకరము !!!

# వర్ణనరత్నాకరము

3, 4, భాగములలో ముద్రింపఁబడుచున్న విషయములు.

బ్రహ్మవిష్ణుమహేశ్వర స్తుతి
వాణీలక్ష్మీపార్వతీస్తుతి
శ్రీవేంకటేశ్వరస్తుతి
నృసింహస్తుతి
దత్తాత్రేయస్తుతి
భీమేశ్వరస్తుతి
మహేంద్రస్తుతి
గంగాస్తుతి
బ్రహ్మ
విష్ణువు
ఈశ్వరుఁడు
శేషశాయి
వటపత్రశాయి
శ్రీరంగశాయి
శార్ఙ్గపాణి
అర్ధనారీశ్వరుఁడు
రాముఁడు
కృష్ణుఁడు
కూర్మావతారము
పరశురాముఁడు
నృసింహమూర్తి
వరాహమూర్తి
దశావతారములు
వామనుఁడు
మాధవుఁడు
వీరభద్రుఁడు
విశ్వరూపము
వేంకటేశ్వరుఁడు
భీమేశ్వరుఁడు
రామేశ్వరుఁడు
విశ్వనాథుఁడు
వరదరాజులు
వృషభేంద్రుఁడు
భైరవుఁడు
అష్టదిక్పతులు
ఇంద్రుఁడు
కుబేరుఁడు
యముఁడు
యమకింకరులు
బలిచక్రవర్తి
క్షేత్రపాలకుఁడు
నారదుఁడు
విశ్వామిత్రుఁడు
వసిష్ఠుఁడు
వాల్మీకి
వేదవ్యాసుఁడు
మార్కండేయుఁడు
అగస్త్యుఁడు
మనవాళమహాముని
సప్తర్షులు
ప్రహ్లాదుఁడు
విప్రనారాయణుఁడు
ఆంజనేయుఁడు
సూర్యుఁడు
చంద్రుఁడు
తక్షకుఁడు
కలిరాజు
కాముఁడు
క్రోధుఁడు
మోహము
లోభము
రావణుఁడు
కుంభకర్ణుఁడు
వాలి
సుగ్రీవుఁడు

కబంధుఁడు
హిరణ్యకశ్యపుఁడు
నరకాసురుఁడు
సారంగధరుఁడు
పాండవులు
ధర్మరాజు
అర్జునుఁడు
దశరథుఁడు
రాజశ్రేష్ఠులు
దేవతలు
బ్రాహ్మణకవి
పద్మనాయకులు
లక్ష్మి
పార్వతి
విశాలాక్షి
జగన్మోహిని
రతీదేవి
అప్సరసలు
రంభ
ఊర్వశి
మేనక
మోహిని
అహల్య
చిత్రాంగి
దేవదేవి
మధురవాణి
పూతన
తాటక

కుబ్జ
మునికన్యలు
స్వర్గలోకము
వైకుంఠము
కైలాసము
సత్యలోకము
ఇహపరలోకతారతమ్యము
స్వర్గమునఁగలదోషములు
పుణ్యలోకము
నిర్ఋతిలోకము
వరుణలోకము
ఈశానలోకము
సూర్యలోకము
చంద్రలోకము
బుధలోకము
అంగారకలోకము
బృహస్పతిలోకము
శనైశ్చరలోకము
నరకలోకము
అలకాపురము
పాతాళలోకము
కాశీపురము
జగన్నాథము
శ్రీరంగము
కాంచిపురము
గయ
ద్వారకాపురము

కాళేశ్వరము
శ్రీవిల్లుబుత్తూరు
పీఠికాపురము
సర్పపురము
దక్షారామము
పల్నాఁడు
బొబ్బిలి
బ్రహ్మసభ
ఈశ్వరసభ
ఇంద్రసభ
రామసభ
కృష్ణసభ
వరుణసభ
కుబేరసభ
మయసభ
యమసభ
శ్రీశైలము
అహోబలశైలము
వేంకటాచలము
వీరభద్రాచలము
హిమవత్పర్వతము
మేరుపర్వతము
మందరపర్వతము
వింధ్యపర్వతము
సింహాచలము
బదరీవనము
అగస్త్యాశ్రమము, నైమిశము
తీర్థసేవ

పుణ్యతీర్థములు
కాశీతీర్థమహిమ
మణికర్ణికాప్రభావము
కలహంసతీర్థమాహాత్మ్యము
త్రివిష్టపేశ్వరమాహాత్మ్యము
ఓంకారేశ్వరమాహాత్మ్యము
కేదారలింగేశ్వరతీర్థము
తిరుమలయాత్ర
గంగానది
గోదావరి
కావేరి
నర్మద
ఆకాశగంగ
క్షీరసాగరము
ఐరావతము
ఉచ్చైశ్శ్రవము
కామధేనువు
కల్పవృక్షము
పారిజాతము
సుధర్మాసనము
సౌభకము
శేషపాన్పు
పుష్పకము
విమానము
రాక్షసవిమానము

పాశుపతాస్త్రము
నాగాస్త్రము
వేదములు
సత్యస్వరూపాదులు
సత్యము
అసత్యము
సజ్జనపద్ధతి
సజ్జనసహవాసము
సజ్జనదుర్జనతారతమ్య[ము
సాధుదర్శనము
దుర్జనపద్ధతి
మూర్ఖపద్ధతి
దాత
దానధర్మములు
అన్నదానము
పానీయదానము
భూదానము
గోదానము
సువర్ణదానము
కన్యాదానము
విద్యాదానము
ఘృతదానము
గరగదానము
తిలదానము
నక్షత్రదానము
ఛత్రాదిదానములు
భార్యాదానము
వృక్షరోపణము

సుమనోధూపదీపనైవేద్యాదులు
బ్రహ్మప్రతిష్ఠ
విష్ణుప్రతిష్ఠ
శివప్రతిష్ఠ
తిరుతటాకాదిప్రతిష్ఠలు
భక్తిమార్గములు
భక్తులు-భాగవతులు
జ్ఞానులు
విష్ణుకథలు
విష్ణుకథాశ్రవణము
విష్ణుభక్తి
విష్ణుపాదతీర్థము
విష్ణునామసంకీర్తనము
విష్ణునామప్రభావము
విష్ణుమంత్రప్రభావము
విష్ణుపూజ
విష్ణుభక్తిరహితులు
శ్రీమన్నారాయణకవచము
శివభక్తుడు
శివనామసంకీర్తనము
శివకవచము
శివభక్తి
శివపూజ
రామనామము
విఘ్నేశ్వరపూజ
దేవపూజ

అతిథిపూజ
బ్రాహ్మణపూజానమస్కారములు
దేవపితృపూజాకాలములు
సూర్యనమస్కారము
అర్ఘ్యప్రదానము
సంధ్యావందనము
గాయత్రి
అతిథిసత్కారము
శైవవ్రతములు
ఉమామహేశ్వరవ్రతము
కేదారగౌరీవ్రతము
శనివారోత్సవము
సోమవారవ్రతము
ద్వాదశీస్నానము
మాఘస్నానము
కార్తికమాసము
ఏకాదశీవ్రతము
ద్వాదశీవ్రతము
త్రయోదశీవ్రతము
శనిత్రయోదశి
బిల్వపంచమీవ్రతము
సప్తమీవ్రతము
అష్టమీవ్రతము
నవమీవ్రతము
దశమీవ్రతము
శివరాత్రి

సంతానవ్రతములు
మంత్రములు
చింతామణిమంత్రము
పంచాక్షరి
షడాక్షరి
అష్టాక్షరి
తారకమంత్రము
ఖేచరీముద్ర
భూచరీముద్ర
మధ్యమముద్ర
షణ్ముఖిముద్ర
శాంభవీముద్ర
ఓంకారము
జపము
తపము
బొట్టు(ముఖచిహ్నము)
తులసీమాహాత్మ్యము
విభూతిధారణము
రుద్రాక్షధారణము
సాలగ్రామము
ధ్యానము
సమాధి
స్వయంవరము
ఘోషయాత్ర
వైష్ణవయజ్ఞము
యజ్ఞపద్ధతి
యజ్ఞము
యజ్ఞశాల
ఆత్మయజ్ఞము

అధ్వరాశ్వము
అశ్వమేధము
రాజసూయము
పురాణప్రశంస
కాలప్రమాణము
మహాకాలము
బ్రహ్మకల్పము
సంఖ్యానీకము
నక్షత్రరాశి
అక్షౌహిణీసంఖ్య
చతుర్యుగాచారవర్తనలు
కలియుగము
కృతయుగము
కృతత్రేతద్వాపరములు
శుభశకునాదులు
దుశ్శకునాదులు
దుర్ముహూర్తము
మరణసూచనలు
లగ్నములు
పుణ్యకాలములు
పుత్త్రస్వీకారము
పుత్త్రజన్మోత్సవము
బారసాల
ప్రతాపవాక్యములు
రోదనము
ఉత్సాహము
రౌద్రము
కామము

# వర్ణనరత్నాకరము.

| | | |
|---|---|---|
| పుష్పమాలికాబంధము | | సింహావలోకనముక్తపదగ్రస్తము |
| గోమూత్రికాబంధము | సర్వతఃప్రాససీసము | వృత్త్యనుప్రాసము |
| పద్మబంధము | సర్వలఘుసీసము | లాటానుప్రాసము |
| కంకణబంధము | ద్వంద్వప్రాసకందము | ఉభయభాషాకందము |
| అష్టదళపద్మబంధము | యతిభేదకందము | అనులోమము |
| తలకట్లకందము | శబ్దచిత్రసీసము | సగర్భకందగీతము |
| గుళ్లకందము | పాదభ్రమకందము | గర్భితకందము |
| ఏత్వములకందము | పాదయమకము | గర్భగీతము |
| ఏకాక్షరకందము | వృత్తకందగర్భసీసము | చతుర్విధకందము |
| ఓష్ఠ్యము | ఆంధ్రగీర్వాణభాషాశ్లేషము | గూఢపంచమసీసము |
| ఓష్ఠ్యనిరోష్ఠ్యసంకరము | నవగ్రహరత్ననిధానసీసము | సంవత్సరయుక్తసీసము |
| అచలజిహ్వము | పాదాంతపాదాదిముక్తపదగ్రస్తము | ఫలశ్రుతి |
| ద్వ్యక్షరికందము | | మంగళము |
| ద్విరుక్తికందము | | |
| త్రిప్రాసకందము | | |
| ముక్తపదగ్రస్తము | | |

ఇట్లింకను వందలకొలఁది ననేకవిషయములు ముద్రింపఁబడుచున్నవి. మఱియు ననేకచాటుపద్యరత్నంబులును, సమస్యలునుగూడ నిందుఁ జేర్పఁబడుచున్నవి.

వెయ్యేల ! భారతభాగవతరామాయణాదిసద్గ్రంథములయందును, దక్కిన ప్రబంధంబు లన్నిఁటియందునుఁగల వర్ణనలు, నీతులు, ధర్మములు, భక్తివైరాగ్యాది సమస్తవిషయంబు లీగ్రంథమువలన నామూలాగ్రముగ గ్రహింపవచ్చును.

వెల రు 3-8-0 లు మాత్రమే. [redacted]

పోస్టుఖర్చులు ప్రత్యేకము.

ఊసరి లక్ష్మణస్వామి.

పిఠాపురం, తూర్పుగోదావరిజిల్లా.

ఈగ్రంథకర్తవలన రచింపఁబడిన యితరగ్రంథములు.



# విజయవిలాసనాటకము.

ఇది చేమకూర వేంకటకవికృతమగు విజయవిలాసములోని రసవంతములగు పద్యములఁ జేర్చి రచియింపఁబడిన నాటకము.

## బలరాముని సందేశము.

సీ. మునివేసమూధరించి ♦ ముగుదనుగొంపోవు,ట గన వీరులకును ♦ మగతనంబె
ఒరున కీఁదలఁచిన ♦ యువిదకై కాంక్షింపఁ, బార్థివోత్తములకుఁ ♦ బౌరుషంబె
వీట నెవ్వరులేని ♦ వేళఁగన్గొని ముచ్చు,రీతి నిల్గొనుట ♦ నీతి యగునె
అడ్డువచ్చినసేవ ♦ కావలిఁ గడిమిమై, మట్టువెట్టుటలు స♦న్మార్గమౌనె
గీ. అర్జునా క్షత్రియుండవై♦పగుదువె? త్రప,లేదె? యనురులపైనాశ♦లేదె? సుంత
యేలవచ్చెద వర్పింపు ♦ మింతిఁదెచ్చి, వేఁడికొమ్మిప్డె క్షమియింతు♦వేగనిన్ను.

## పార్థుని ప్రత్యుత్తరము.

సీ. పడఁతులగాంక్షించి ♦ బల్మిఁగొంపోవ నీ,తమ్ముఁడే నేర్పిన ♦ ధర్మమనుము
తన్నుఁ బ్రేమించిన ♦ తన్వి కేల్ గైకొంట, నృపసత్తములకీడె ♦ నీతియనుము
అనురాగవతియు మే♦నత్తకూఁతురెగాన, ముచ్చుఁదనంబనఁ ♦ బోలదనుము
క్షత్రియుండనో నేను♦గాక పాలికుఁడనో, చేచాయఁజూచినఁ ♦ జెప్పుమనుము
గీ. బావమఱఁదిపైదయసుంత♦వలపుమనుము, వ్యర్థమాదురాచారంబు♦వదలుమనుము
బుద్ధిగనకున్న యుద్ధమే♦సిద్ధమనుము,జాగుసేయక భద్రివే ♦ వేగచనుము.

వెల 10 అణాలు.

# భర్తృహరిప్రబోధము.

ఈనాటకమునందు (1) కన్యాశుల్క వరశుల్క నిరసనము (2) స్వయంవరణము (3) గృహస్థవిధులు (3) సంసార వివేచనము (5) గురూపదేశము (6) జ్యోతిష్కుని దుర్మతము (7) వార్ధక్య విచారము (8) భగవత్సేవావిధానము (9) పతివ్రతాధర్మములు (10) నిర్వేదము మున్నగు విషయములు గలవు.

## భర్తృహరిపరిబోధము.

సీ. కుసుమకోమలులకుం ◆ గొంగుమేలిమియగుఁ, బ్రాణనాథునిపాద ◆ పద్మసేవ
కుటిలకుంతలులపా ◆ లిటినిధానంబగుఁ, బ్రాణనాథునిపాద ◆ పద్మసేవ
కలభాషిణులపాలి ◆ కల్పవృక్షంబగుఁ, బ్రాణనాథునిపాద ◆ పద్మసేవ
కిసలయాధరలపా ◆ లిటి కామధేనువు, ప్రాణనాథునిపాద ◆ పద్మసేవ
ఆ. వె. కరిగమనలదుఃఖ ◆ కలుషాపహరణంబు, ప్రాణనాథుపాద ◆ పద్మసేవ.
సతుల కతులవితత ◆ సౌఖ్యావహంబగుఁ, బ్రాణనాథుపాద ◆ పద్మసేవ.
సీ. పన్నగాధిపుఁడును ◆ పక్షీంద్రుఁ డొకవేళ, పరమైత్రిఁ గనఁ జూడ ◆ వచ్చుఁ గాని
యిభరాజు మత్తసిం ◆ హేంద్రుండు నొకటన, త్ర్యాంబుఁ ద్రెంగుటఁ జూడ ◆ నగును గాని
నెఱిజీకటియు సూర్య ◆ కిరణంబు లొకవేళఁ, గలసియుండఁగఁ జూడ ◆ గలుగు గాని
కలువయుఁ బద్మినీ ◆ కాంతుఁ డొక్కటమైత్రిఁ, జేఁ జెలంగుటఁ జూడఁ ◆ జెల్లు గాని
గీ. యాచకుండును యాచకుం ◆ డరియు నరియు, వంతువాసికిఁ గలహించు ◆ వైశ్యజనులుఁ
బరమమైత్రినుండఁగఁ జూడ ◆ వచ్చు గాని, సవతులందు సఖ్యతఁ జూడ ◆ జగతి నగునె

వెల 10 అణాలు.

## వేశ్యాసహవాసఫలితము.

సీ. అగ్నిసాక్షిగఁ బెండ్లి ◆ యాడినసతి వీడి, వేశ్యల దరిఁ జేర ◆ వెఱ్ఱులార
సానియింటనె యున్కి ◆ సౌఖ్యంబుగాఁ దలఁ, పోయుచుండెడుపశు ◆ ప్రాయులార
పూర్వార్జితంబులఁ ◆ బూన్కి మీఱఁగ వెల, యాండ్రపాలొనరించు ◆ నధములార
కమనీయదేహంబు ◆ గణికాంగనారతి, సంకటపడఁ జేయు ◆ జారులార
గీ. బంధుజనబోధనల రోసి ◆ పగలు రేయి, రోవెలందులఁ గూడెడు ◆ క్రూరులార
కులము మర్యాదలను గూల్చు ◆ కూళలార, యాలకింపుఁ డీహితము మో ◆ హాంధులార.
మ. ధనమే ప్రాణము ద్రవ్యసంగ్రహణమే ◆ ధర్మంబు, వశ్యప్రవీ
ణమె నిష్ఠ, యసత్యమే వ్రతము, ఖల్ ◆ డంబంబె విజ్ఞానసా
చనమా రోచెలికట్టి దాన్యాయి యా ◆ ళం బెండఁగా నేలనో
మనసా ! స్వస్థతఁ జెంది యింక మనుమా ◆ మార్గ్యంబుఁ బోనాడుమా.
ఉ. అనపత్యంబొనఁ గూడు టొక్కటియు, న ◆ న్యాయంబుగా నింటభా
ర్యను వేధించుట రెండు, రోగచయమా ◆ రాశిందగు లొక్కంట మూఁ
డును, వారాంగనఁ గోరువారలకు మూఁ ◆ డుంగాన యోజించి యో
మనసా స్వస్థతఁ జెంది యింక మనుమా ◆ మార్గ్యంబుఁ బోనాడుమా.

వెల 4 అణాలు.